

# NINTY YEARS OF TELEGANA SHORT STORY

(Essays) By

**Dr. KALUVA MALLAIAH**

కవిత తళతళ మెరిసే అప్సరసలాంటిది. కథ చేరువనున్న ఇల్లాలిలాంటిది. మానవ జీవితానికి అతి చేరువైనది కథ. కథ మనలను లాలిస్తుంది. అతి దగ్గరగా ఉంటుంది. తెలంగాణలో ప్రతి ఇంటి లోగిలీ కథలకు నిలయం. తెలంగాణ కథ గత పాతికేళ్ళ నుండి తెలుగు కథకు మార్గనిర్దేశనం చేస్తుంది. విప్లవ కథ, దళిత కథ, బహుజన కథ, మైనారిటీ కథలకు మార్గాన్ని పుష్టిని ఇచ్చింది తెలంగాణ కథే. అట్టడుగు జీవిత నేపథ్యంలో ప్రారంభమయిన తెలంగాణ కథ అనేక పోకడలు పోయింది. తెలంగాణ సామాజిక చరిత్ర రాయడానికి కావల్సినంత ముడి సరుకు తెలంగాణ కథల్లో నిక్షిప్తమైంది - 1912 లో మాడపాటి హనుమంతరావుతో ప్రారంభమైన తెలంగాణ ఆధునిక కథ (1912-2002) తొంబై ఏళ్ళ పోకడలను విశ్లేషించిన గ్రంథం "తొంబై పదుల తెలగాణ కథ"

కథంటే వేమన పద్యంలా ఉండాలి కాని ప్రబంధ గద్యంలా కాదంటాడు ఈ రచయిత. కేంద్ర సాహిత్య అకాడమీ న్యూఢిల్లీ వారి సీనియర్ ఫెలో షిప్ (2003 - 20005) అవార్డుతో రాయబడిన ఈ వ్యాస సంపుటి 90 ఏళ్ళ తెలంగాణ కథల ఆవిర్భావ వికాసాలను, పోకడలను జవసత్వాలను మనముందుంచుతుంది.

తెలంగాణ జనం వెతలు, జన జీవన సంఘర్షణపై ఆరేడు వందల కథలు రాసిన రచయిత కలం నుండి వెలువడిన తెలంగాణ కథా విమర్శనా వ్యాసాలివి.

పబ్లిషర్

# తొమ్మిది పదుల 'తెలంగాణ కథ'



**డా॥ కాలువ మల్లయ్య**

# తొమ్మిది పదుల 'తెలంగాణ కథ'

# NINTY YEARS OF TELANGANA SHORT STORY

Dedicated to
etelangana.org

డా|| కాలువ మల్లయ్య

**DR. KALUVA MALLAIAH**

**(M.sc., B.Ed., PGDPR, M.A.Ph.D.)**

This book, 'Ninty years of Telengana Short Story' is written with the financial Support of Sahithya Akademy, NEW DELHI, Department of Culture HRD Ministry, Govt. of India's Senior Fellowship award sanctioned for the period of March 2003-February 2005.

**Dr. Kaluva Mallaiah**

## తొమ్మిది పదుల తెలంగాణ కథ
## NINTY YEARS OF TELANGANA SHORT STORY

ప్రతులు : 1000
వెల : రూ॥ 125/-
ప్రచురణ : డిసెంబర్ - 2008


ప్రతులకు : 1) దేవులపల్లి పబ్లికేషన్స్
12-1-162, విజయ గార్డెన్స్,
బండ్లగూడా, నాగోల్,
రంగారెడ్డి జిల్లా ఫోన్ : 20050456

2) కె. విజయ లక్ష్మి
44/214, క్రాంతి హారిక
అపార్ట్‌మెంట్స్ కొత్తాపేట,
సరూర్‌నగర్, హైదరాబాద్ - 35.
ఫోన్ : 9849377578

3) విశాలాంధ్ర, నవోదయ, సహచర,
దిశ, ప్రజాశక్తి బుక్‌స్టాల్స్ లలో లభించును

**ఈ పుస్తకం శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రించబడింది.**

**ముద్రణ :**
జాయ్'ఎన్' జాయ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ప్లాట్ నం. 1A ,
ఇండస్ట్రియల్ పార్క్, ఉప్పల్, హైదరాబాద్.
**ఫోన్ : *20050456.***

## తొమ్మిది పదుల 'తెలంగాణకథ'
(Ninty years of Telengana Short Story)



కాలువ మల్లయ్య *

# తెలంగాణ కథాసాహిత్య చరిత్ర

డాక్టర్ కాలువ మల్లయ్య ఎంతో పరిశోధన చేసి ఎన్నో గ్రంథాలను పరామర్శించి "తొమ్మిది పదుల తెలంగాణ కథ" అనే వ్యాస పరంపరలను రచించారు. ఈ వ్యాసాలు ఆంధ్రభూమి దినపత్రికలో "సాహితి" పేజీలో 2003-04 సంవత్సరాల్లో అచ్చయ్యాయి. తెలంగాణ కథ ఇప్పుడూ అప్పుడూ ఎప్పుడూ జనహితాన్ని కోరే లక్షణం లక్ష్యం కలదే! తెలంగాణ కథ పుట్టుకతోనే అభ్యుదయ భావాలతో పుట్టిందని కాలువ మల్లయ్య తన తెలంగాణ కథ అధ్యయనారంభంలోనే గుర్తించాడు. తెలంగాణ తొలితరం కథలు రచించింది అగ్రకులాల వాళ్లే అయినా అట్టడుగు జనజీవితాన్ని నిజాం పాలనలోని ఫ్యూడల్ సంస్కృతిని వ్యతిరేకిస్తూ కథలు వ్రాసారంటాడు. తర్వాత తరాల రచయితలు ఈ సంప్రదాయాన్నే ముందుకు తీసుకువెళ్లారు. కాని విశాలాంధ్ర ఏర్పడింతర్వాత తెలంగాణ కథకులు తమ అస్తిత్వాన్ని కోల్పోయి తామేం వ్రాయాలో తెలంగాణ భాషలో వ్రాయలేని పరిస్థితుల్లో కోస్తాంధ్రులు "అగ్రెసివ్‌నెస్" లో మౌనం వహించారు. ఆ సమయం లోనే కాలువ మల్లయ్య చెప్పునట్లుగా పత్రికల సంఖ్య పెరిగింది. వ్యాపార సాహిత్యం ప్రబలమైంది. ఆ సమయంలో కొందరే రచయితలు తెలంగాణలో తమ వారసత్వాన్ని విస్మరించి ప్రామాణిక భాషలో "అర్బన్" జీవితాన్ని చిత్రించారు. ఈ కాలంలో ప్రాంతీయతా ముద్రతో జీవద్భాషా పరిమళంతో విరివిగా కథలొచ్చుంటే తెలంగాణ సాహిత్యం మరింత పరిపుష్టమయ్యుండేది (పేజి 60) అంటాడు కాలువ మల్లయ్య.

కాని తెలంగాణ కథారచయితలు తమ పోరాటస్ఫూర్తిని ప్రజల చైతన్యాన్ని చిత్రించే తత్త్వాన్ని కోల్పోలేదు. అందుకే కాలువ మల్లయ్య అన్నట్లుగా 1970-90ల్లో తెలంగాణ పోరాట కథ విప్లవ కథగా పరిణామం చెందింది. తెలంగాణలో ఉద్యమ కథకున్న పునాదులు ఈ పరిణామాన్ని సులభతరం చేసాయి. విప్లవ రచయితలకు తమ వారసత్వాన్ని గురించి జ్ఞానం పరిచయాలు లేకున్నా తెలంగాణలో వ్యాపించి వున్న ఉద్యమ పరిమళాలు వాళ్ళకు ప్రేరణనిచ్చి వుంటాయి. "శ్రీకాకుళ రైతాంగ పోరాటాల ప్రభావంతో భూషణం రాసిన కథలతో విప్లవ కథ గుర్తింపు పొందినా తెలంగాణ నుంచి పోరాట కథలు వచ్చిన తర్వాతే తెలుగు కథ విప్లవ కథగా పరిణామం చెందింది" (పేజి 50) అని కాలువ మల్లయ్య అనటంలో ఎంతో యధార్థత వుంది. 1970లు మొదలుకొని తెలంగాణాలో ఇంకా ఇప్పటికీ విప్లవ స్ఫూర్తిగల కథలు రచింపబడ్తూనే వున్నాయి.



తెలంగాణ విమోచన పోరాటాన్ని రజాకార్ల ఆగడాలను చిత్రించే కథలను తెలంగాణ రచయితలు ఎక్కువ రాయలేదని "రజాకారు పోరాటాల కాలంలో వచ్చి కథల్లో చాలా కథలు తెలంగాణ పోరాటం గూర్చి తెలంగాణ ప్రాంతేతరులు రాసినవే" (పేజి 54) అని కాలువ మల్లయ్య అభిప్రాయం. కాని తెలంగాణ ప్రాంతేతరులు రాసిన కథలు పత్రికల వార్తల మీద ఆధారపడినయి, విన్నయి, వాళ్లు రాసినయి కొన్ని కథలు మాత్రమే. తెలంగాణ నుంచి పోరాట కథలు ఆంతరిక సంఘర్షణలు వర్గస్వభావాన్ని చిత్రించే కథలు. నైజాం పరిపాలనా యంత్రాంగంలోని క్రౌర్యాన్ని రజాకార్ల ఆగడాలను చిత్రించే ఎన్నో కథలను తెలంగాణ రచయితలు రాసారు. వాళ్లవి వాస్తవికత మీద ఆధారపడినాయి! స్వానుభవం ప్రత్యక్షదర్శనం నుంచి పుట్టినయి! ఆ తొలితరాన్ని తర్వాత తెలంగాణ కథకులు విస్మరించారన్న సత్యాన్ని కాలువ మల్లయ్య తన వ్యాసాల్లో చెప్పాడు.

ఆధునికంగా ప్రాంతీయ అస్తిత్వ వేదనను స్థానికతను చిత్రించే కథల రచనకు తెలంగాణ అగ్రసరంగా వుంది. ప్రాంతీయత సామాన్య జనుల జీవితాన్ని చిత్రించే గుణాలు లేకపోతే కథ కథకాదనే అభిప్రాయం ఇప్పుడు కథావిమర్శకుల్లో కన్పిస్తుందంటే తెలంగాణ కథే దానికి కారణం. "ఏదేమైనా చాలా సందర్భాల్లో తెలుగు కథకు దిశానిర్దేశం చేస్తూ ముందుకు పోతుంది తెలంగాణ కథ" (పేజి 51) అని కాలువ మల్లయ్య అనటంలో అతిశయోక్తి ఏమీ లేదు. ప్రపంచీకరణ స్వరూపాన్ని మానవ విలువల విధ్వంసాన్ని మొదట తెలంగాణ రచయితలే చిత్రించారు.

తెలంగాణ కథలో రచయితలు జనసామాన్యుల జీవితాన్ని చిత్రించటమే కాక ఆ జనుల భాషలో మాండలికంలో కథనంతా చెప్పటమనే శిల్పానికి ప్రాధాన్యమిచ్చారు. 1939లో తెలంగాణలో ఎస్.బి.శ్రీనివాస రావు వ్రాసిన "గరీబోన్ని" కథ తెలుగులో మాండలికంలో వచ్చిన మొదటి కథ. ఆ తర్వాత 1940 దశకారంభం నుంచి తెలంగాణలో మాండలికాన్ని కథల్లో ఆద్యంతం కథనంలో ప్రయోగించే శిల్పం కన్పిస్తున్నది. ఆ మాండలిక ప్రయోగంలో వున్న అభ్యుయతా గుణాన్ని తమతమ మాండలికంలో వ్రాసారు. వ్రాస్తున్నారు. కథ కథనలక్షణంలో మాండలికయాస ప్రాంతీయతాముద్ర స్థానికత మీద అభిమానం ఒక అనివార్య లక్షణాలుగా మారాయి.

1970ల నుంచి తెలంగాణలో అక్షరాస్యత పెరిగింతర్వాత శ్రామిక వర్గాల్లోంచి రచయితలు అధిక సంఖ్యలో ఎదగటం జరిగింది. దాంతో వర్గచైతన్య దృక్పథంతోనే కాక వృత్తి పనులవాళ్ల సంస్కృతిని వ్యథలను చిత్రించే కథలు తెలంగాణ నుంచి చాలా వచ్చాయి. దీని గురించి వివరిస్తూ కాలువ మల్లయ్య "సహస్రవృత్తుల సమస్త

చిహ్నాల వాళ్ళు సాహిత్యంలో చోటు చేసుకున్నారు - తర్వాత సిద్ధాంతాల వెలుగులో మరింత స్పష్టంగా దళిత బహుజన కథలను రాసారు" (పేజి 125) అంటాడు. తెలంగాణ నుంచి దళిత కథలు ఆ తర్వాత స్త్రీ మైనారటీ వేదనలను చిత్రించే కథలు చెప్పుకోదగి నంతగా వచ్చాయి. మైనారటీ వాదం తెలంగాణలో రూపుదిద్దుకుందంటే అతిశయోక్తి కానేకాదు. అంతేగాక దళిత మైనారటీవాదాల్లో స్త్రీ వేదనను చిత్రించే కథలు తెలంగాణ నుంచే వస్తున్నాయి.

తెలంగాణ నుంచి ఎన్నో విధాలుగా కథ అగ్రేసరంగా వున్నా ఇంకా "తెలంగాణ భాషను కించపరచటం సంకలనాల్లో తెలంగాణ కథలకు నామమాత్రంగానే చోటివ్వటం" (పేజి 154) జరుగుతుందని కాలువ మల్లయ్య అంటాడు. తెలంగాణ "మాండలిక రచనల ప్రచురణ అంత సులభమేమీ కాదు. అన్ని పత్రికల్లో రావటం ఇంకా సమస్యే" అని కాలువ మల్లయ్య గుర్తించాడు వేదనతో. పత్రికలు తెలంగాణ మాండలిక కథలను ప్రచురించటం ఇంత జరిగినా ఇంకా వెనుకముందాడటానికి కారణం పత్రికల అమ్మకాలను దృష్టిలో పెట్టుకొని జరుగుతుందా? - అని ఆలోచించవలసి వుంది. ఇప్పటికీ పత్రికలను కొనటం విరివిగా చదవటం అభిప్రాయాలు వ్రాయటం చర్చించటం కోస్తా ప్రాంతంలోనే వుంది కాబట్టి మార్కెట్ లాభాల కోసం పత్రికలు తెలంగాణ మాండలిక రచనలను మెచ్చినా ప్రచురించటానికి జంకటం కారణమేమో ఆలోచించాలి... ఆ మార్కెట్‌ను పట్టుకునే తత్త్వం అన్ని ప్రాంతాలవారికి రావాలి!

తెలంగాణ తొంబైయేండ్ల కథల్లో సామాన్యుని జీవితం ఎంతగానో ప్రతిబింబించింది. సమగ్ర సామాజిక చిత్రణ ఆ కథల్లో కన్పిస్తుంది. అవి కల్పనల మీద ఆధారపడినవి కాదు. వాస్తవికత ప్రాణంగా రచించినయి. ఆ కథల ఆధారంగా తెలంగాణ రాజకీయ సాంఘిక చరిత్రను నిర్మించ వచ్చును అంటె తెలంగాణ కథ అంతగా జనజీవితానిక దగ్గరగా వుంది! అటువంటి విశిష్టమైన తెలంగాణ కథాసాహిత్యాన్ని కాలువ మల్లయ్య ఈ వ్యాసాల్లో అధ్యయనం చేసాడు. తొలి, మలి, మూడవతరం తెలంగాణ కథ స్వరూప స్వభావాలను తరచి చూసాడు. తెలంగాన కథాసాహిత్య చరిత్రను మనముందుంచాడు.

రోహణమ్

16.12.2008 ముదిగంటి సుజాతా రెడ్డి



# జనం హితాన్ని కోరేదే సాహిత్యం

సాహిత్య ప్రయోజనం ఆనందం, ఉపదేశం అని చెప్పబడినా చాలామంది లాక్షణికులకు ఉపదేశమే ఆమోదయోగ్యమైంది. పూర్వలాక్షిణుకులు చెప్పిన ఆనందంలోనూ ఉపదేశం ఇమిడి ఉంది. వాళ్లు చెప్పిన ఆనందం ఇప్పటి టైమ్‌పాస్ ఆనందం కానేకాదు. ఏదేమైనా ఏ కాలంలోనైనా ఉపదేశ ప్రధానమైన సాహిత్యమే కాలగర్భంలో కలిసిపోకుండా నిలుస్తుంది. ప్రజాస్వామిక సంస్కృతి బలపడుతున్న కొద్దీ సాహిత్య ప్రయోజనం మరింత విస్పష్టమై ఉపదేశ ప్రధానమైనదే సాహిత్యంగా లెక్కింపబడటం ప్రారంభమైంది. అందుకే హితాన్ని కోరేది సాహిత్యమైంది. కష్టజీవికి అంటే మెజారిటీగా ఉన్న జనాలకు ఇరువైపులా నిలబడి రాసేవాడే కవిగా, రచయితగా లెక్కింపబడుతున్నాడు. కొందరు సాహిత్యకారులు మరింత ముందుకు పోయి కేవలం ఆనందం కోసమే అయితే నేనొక్క ముక్క కూడా రాయను అన్నవారున్నారు. ప్రాచీన సాహిత్య విషయాన్ని తీసుకున్నా జనం హితాన్ని కోరేదే అసలైన సాహిత్యమన్న విషయం స్పష్టమవుతుంది. అయితే ఆ జనం ఎవరన్న విషయంలో కొన్ని అభిప్రాయభేదాలున్నాయి.

రచయిత తాను రాస్తున్న విషయానికి బాధ్యత వహించాలన్న విషయాన్ని మరచిపోకూడదు. రచన దారి రచనది, తన దారి తనది అయితే అది బాధ్యతారాహిత్యమే అవుతుంది. ఏ కాలంలోని రచన అయినా మంచికి దోహదం చేసేదిగా ఉండాలి. కనీసంగా చెడును ప్రోత్సహించకూడదు. మనిషిని కేంద్ర బిందువుగా తీసుకొని మానవాంశను పెంపొందించే దిశగా సాగే రచనే మంచి రచన. ఇలాంటి సాహిత్యాన్ని సృష్టించడం నేటి సామాజికావసరం.

రోజురోజుకూ సమాజం సంక్లిష్టమవుతుంది. వృత్తులు నశించి ప్రత్యామ్నాయం లేని బతుకులతో జనం విలవిలలాడుతున్నారు. కొన్ని సంస్కృతులు, భాషలు మటుమాయమయ్యే పరిస్థితులొస్తున్నాయి. విలువలు మృగ్యమవుతున్నాయి. బలవంతుడిదే రాజ్యమన్న భావం పెరిగిపోతుంది. బలహీనుడికి అండగా ఉండాలన్న భావం తొలగి దుడ్డున్నవాడిదే బర్రె అన్న భావం పెరిగిపోతుంది. సేవాభావం మృగ్యమై డబ్బు విలువలే అన్ని విలువలయి కూర్చున్నాయి. మానవతా విలువల గూర్చి మాట్లాడటం పిచ్చివాడి ప్రేలాపనలా మిగిలిపోతుంది. మనుషుల మధ్య, జాతుల మధ్య, ప్రాంతాల మధ్య వైరుధ్యాలు పెచ్చుమీరిపోతున్నాయి. ఇలాంటి సమయంలో మానవాంశను పెంపొందించే రచనలు చేయాల్సిన అవసరం మరింత పెరిగింది. మనుషుల మధ్య, జాతుల మధ్య, ప్రాంతాల మధ్య, భాషల మధ్యగల వైరుధ్యాలను తొలగించే రచనలు చేయాల్సిన చారిత్రకావసరం ఇప్పుడుంది. ద్వేషించు, నాశనం

చేయి అనే భావంతో సమాజానికొరిగిందేంటో, మానవజాతి పొందిందేంటో మన చూస్తూనే ఉన్నాం. ద్వేషానికి బదులు మనుషుల మధ్య ప్రేమను పెంపొందించే రచనలు చేయడం సార్వకాలీన అవసరం. కేవలం సాహిత్యంతోనే సమాజం మారుకున్నా సామాజిక మార్పును వేగవంతం చేయడానికి సాహిత్యం, కళలు ఉపయోగపడతాయి. ఎక్కడయితే సాహిత్యం, కళలు వర్ధిల్లుతాయో అక్కడే సుభిక్షంగా ఉంటుంది. మంచి సాహిత్యాన్ని రాసేవాడు, నిరంతరం సాహిత్యాధ్యయనం చేసేవాడు తక్కువ తప్పులు చేస్తారన్న విషయాన్ని మరచిపోకూడదు. తాము చదివిన మంచి కథ, నవల, కవిత్వం లేదా వాక్యం నిరంతరం పఠనంవల్ల కల్గిన సంస్కారం ఆయా వ్యక్తులను తప్పులు చేయకుండా నిరోధిస్తుంది. కొన్ని కళలకు రెండు వైపులా పదునున్నట్టే సాహిత్యం వ్యాపారమయమయితే రెండు వైపులా పదునున్న కత్తిలా తయారవుతుంది. అందుకే మంచి సాహిత్యమెప్పుడూ వ్యాపారమయం కాదు. కారాదు. సాహిత్య ప్రయోజనం ఇంత స్పష్టంగా ఉన్నప్పుడు, సమాజంలో సాహిత్యం చేసే పని గణనీయంగా ఉన్నప్పుడు రచయిత మరింత బాధ్యతతో పాఠకులను చేరే సాహిత్యం సృష్టించాల్సిన అవసరముంది. రచనను ఏ పాఠకుల కోసమయితే ఉద్దేశించామో ఆ పాఠకులకది చేరకుంటే దాని ప్రయోజనం నెరవేరనట్టే. రచయితలు పేరో, విమర్శకుల మెప్పో కలిసొస్తే అవార్డులలాంటిదో రావాలన్న ఉద్దేశ్యంతో రాస్తే దానివల్ల సమాజానికొరిగేదేముంది? మెజారిటీ పాఠకులను చేరే రచనే ఉత్తమ రచన. పాఠకుల దృష్టికోణంలోంచి పాఠకులను చేరే విధంగా సృష్టింపబడాలి. ప్రబంధాలు గొప్ప రచనలే అయినప్పటికీ వేమన పద్యాలకున్న పాఠకజన రంజకత్వం ప్రబంధాలకుందా? ఇవన్నీ గుర్తించకుండా, రోజురోజుకూ సంక్లిష్టమవుతున్న బతుకు వెతలను గమనించకుండా బాధ్యతగల రచయితలు అనవసర వాదోపవాదాల్లో కూరుకుపోవడం తెలుగు సాహిత్యంలో గమనిస్తున్నాం. పీఠాధిపత్యాల కొరకు కొందరు తమ కులం, ప్రాంతం, తమ వారిని హైలెట్ చేయడానికి కొందరు సాహిత్య చర్చల పేరుతో పేజీలు ఖరాబు చేస్తున్నారు.

ఇలాంటి చర్చల్లో పాల్గొనేవారు వీటిని చదివేవారు వందమందికి మహా అయితే రెండు వందల యాభయికి మించి లేరన్న వాస్తవాన్నో మిత్రుడు చెప్పినప్పుడు ఆశ్చర్యమే కలిగింది. వీళ్ల కోసం విలువైన సాహిత్య పేజీలను కేటాయించాలా? సాహిత్య చర్చలవసరమే కాని అవి కూడా పాఠకుల దృష్టి కోణంలోంచి సాగాలి. ఆ చర్చల్లో సామాన్య పాఠకులూ పాల్గొనాలి. ఏదేమైనా అల్లకల్లోలమవుతున్న జనం బతుకులను గమనిస్తూ జనహితాన్ని కోరే సాహిత్యాన్ని సృష్టిస్తూ మానవాంశను పెంపొందించే రచనలు చేయడమే నేటి సామాజిక, సాహిత్యావసరం.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 30 జూన్ 2003**



# తొలి తరం తెలంగాణా కథకుల సాహితీమార్గం

తెలుగు కథ కళింగాంధ్రలో పుట్టింది. కోస్తా ప్రాంతంలో విస్తరించింది. రాష్ట్రమంతా వ్యాపించింది. ఆధునిక తెలుగుకథ విశాఖపట్నం ప్రాంతం నుండి వచ్చిన సమయంలో కోస్తాంధ్రలో సంస్కరణోద్యమాల ప్రభావం విరివిగా ఉంది. బెంగాల్‌లో ప్రారంభమైన సంఘ సంస్కరణోద్యమం తూర్పు కోస్తా తీరం గుండా కోస్తాంధ్రలో ప్రవేశించింది. కోస్తాంధ్ర ఆంగ్లేయుల పరిపాలన కింద ఉండటం వల్ల ఆంగ్ల విద్యతో వచ్చిన ఆధునికత ముందుగానే ప్రవేశించింది. ఆ ప్రభావం సాహిత్యంపై పడింది. ఆధునిక సాహిత్య ప్రక్రియలు తెలుగులో చోటు చేసుకున్నాయి. విశాఖపట్నం నుంచి వలసలు ముఖ్యంగా ఒరిస్సా, బెంగాల్ ప్రాంతానికి అటునుంచి ఇటు జరుగుతుండేవి. తద్వారా బెంగాల్ సాహిత్యమూ, సంస్కృతీ ప్రభావమూ కళింగాంధ్ర ప్రాంతంపై ఉంది.

బెంగాల్‌లో రాజా రామమోహనరాయ్‌లా తెలుగు సమాజంలో కందుకూరి వీరేశలింగం సంస్కరణోద్యమాన్ని ముందు తీసుకెళ్లాడు. స్వాతంత్ర్యోద్యమం జోలికి పోకుండా సంఘం సంస్కరించబడాల్సిన ఆవశ్యకతను గుర్తెరిగి స్త్రీని కేంద్ర బిందువుగా తీసుకొని జీవితకాలమంతా సంస్కరణోద్యమానికే అంకితం చేశాడు వీరేశలింగం. అతడు కార్యశూరుడైతే అతని సంస్కరణోద్యమానికి బాసటగా నిలిచి రచనలు చేసినవాడు గురజాడ. అందుకే అతడు రాసిన కన్యాశుల్కం, కథలు సంస్కరణ నేపథ్యంలో వెలువడ్డవే. రాజారామ్‌మోహన్ రాయ్, వీరేశలింగం సంస్కరణల ప్రభావం గురజాడపై విశేషంగా ఉంది. తెలుగుకథకు గురజాడ వేసిన బలమైన సంస్కరణోద్యమ పునాది మొదటి తరంలోనూ ఆ తర్వాతి తరంలోనూ తెలుగుకథ నేల విడిచి సాము చేయకుండా కాపాడింది.

కోస్తాపై, కోస్తా ప్రాంత సాహిత్యంపై మొదటి తరంలో బెంగాలీ, ఇంగ్లీషు సాహిత్య ప్రభావమే ఎక్కువన్నది నగ్నసత్యం. కోస్తాలో హిందీ చదవడం కూడా కష్టంగా ఉండేది. అందువల్ల వాళ్లపై హిందీ సాహిత్యం, ప్రేమ్‌చంద్, కిషన్ చందర్‌ల ప్రభావం ఆలస్యంగానే పడింది. అభ్యుదయ సాహిత్యోద్యమం బలం పుంజుకున్న తర్వాతగాని, శ్రీశ్రీ ప్రభంజనంలా విజృంభించిన తర్వాతగాని అభ్యుదయ సాహిత్యం అక్కడి నుంచి వెలువడలేదు.

తెలంగాణ పరిస్థితి కోస్తా ప్రాంతంలా లేదు. తెలంగాణా మొదట్నుంచీ

దేవులాడుకుంటూనే ఉంది. తనను తాను వెతుక్కుంటూనే ఉంది. తనకు తెలియని తన చరిత్రను తాను శోధించుకుంటూనే ఉంది. నైజాం కాలంలో ఉర్దూ ప్రభావం నుండి తనను తాను రక్షించుకోవడానికి తెలంగాణా పాకులాడింది. తెలుగులో చదివే, రాసే అవకాశాలు మృగ్యమే అయినా మాతృభాషలో గొప్ప సాహిత్యాన్ని వెలువరించింది. తన ప్రత్యేక సంస్కృతిని, మాండలిక భాషను కాపాడుకోవడానికి నిరంతరం పోరాటాల్లో మునిగి తేలుతూనే ఉంది. అప్పటి కంటే ఎక్కువ ప్రమాదం తెలంగాణా భాష, సంస్కృతులకు రావడాన్ని గమనించింది. తన మార్గాన్ని స్పష్టం చేసుకుంది. తన మార్గం సాహిత్య సాంస్కృతిక రంగాల్లో అభ్యుదయ మార్గమని, ప్రజోపయోగ మార్గమని మొదటి తరం నుంచే నిరూపించుకుంటూ వస్తుంది.

కోస్తా ప్రాంతం నుంచి తెలుగులో మొదటి కథ వచ్చిన రెండు సంవత్సరాల లోపే తెలంగాణా నుంచి ఆధునిక తెలుగుకథ వచ్చింది. ఆ తర్వాత కోస్తా ప్రాంతంలోలా విరివిగా కథలు రాకున్నా వచ్చిన కథలన్నీ మంచి కథలే. స్పష్టమైన ప్రాపంచిక దృక్పథంతో వచ్చినవే.

తొలితరంలో తెలంగాణా సాహిత్య సంస్కృతులపై ఇంగ్లీషు, బెంగాలీల కంటే హిందీ, ఉర్దూల ప్రభావమే ఎక్కువ. తెలంగాణా ప్రాంతం నుండి హిందీ ప్రాంతాలకు, హిందీ ప్రాంతాల నుండి తెలంగాణా ప్రాంతానికి ఎక్కువగా వలసలు, పెళ్లి సంబంధాలు ఉండేవి. ముఖ్యంగా మహారాష్ట్రకు చాలా వలసలుండేవి. పై చదువులు చదువుకోవడానికి మహారాష్ట్ర, కాశీలాంటి ప్రదేశాలకు పోయేవారు. పి.వి. నరసింహారావుగారు నాగపూర్‌లోనే తన చదువును పూర్తి చేశారు. నాగపూర్, చంద్రాపూర్ మొదలుకొని ఔరంగాబాద్, షిర్డీ, షోలాపూర్, భీవండి, బొంబాయి ప్రాంతాలకు వలసపోయిన తెలంగాణా ప్రాంతం వాళ్లెంతో మందున్నారు.

హైదరాబాద్ నగరంపై ఉత్తర హిందూస్థానీ సంస్కృతి, నాగరికత, భాషా సాహిత్యాల ప్రభావం విరివిగా ఉండేది. గుజరాతీలు, మరాఠీలు, రాజస్థానీయులు చాలా మంది స్వాతంత్ర్యానికి పూర్వం నుంచే హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. ఇందులో వ్యాపారవర్గాలవారే ఎక్కువ. వీళ్లంతా తమ బతుకుదెరువుకే పరిమితమయ్యారు. తెలంగాణా సంస్కృతిని స్వంతం చేసుకున్నారు. అందులో కలగలిసిపోయారు. హైదరాబాద్ సంస్కృతిని తనది చేసుకొని హైదరాబాదీలయ్యారు.

తెలంగాణా ప్రజలకు మొదట్నుంచీ హిందీ, ఉర్దూ సాహిత్యాలతో



పరిచయమూ కొత్తకాదు. అందుకే వాళ్లు ఇంగ్లీషు సాహిత్యం కంటే ప్రేమ్‌చంద్‌నే ఎక్కువ చదివారు. పోతే సాహిత్యానికి పూర్వం, ఆ తర్వాత చాలాకాలం వరకు కూడా తెలంగాణాలో మధ్యతరగతి లేదు. ఉన్నది భూస్వాములు, అట్టడుగువర్గాలవారే. అందుకే తెలంగాణా నుంచి వచ్చిన తొలితరం రచయితలకుగాని, భూపోరాట ఉద్యమాల కాలంలో వచ్చిన తరం రచయితలకు గాని ప్రేమ్‌చంద్ మార్గమే ఆదర్శమైంది. తొలితరంలో తెలంగాణా నుంచి మధ్యతరగతి దృక్కోణంలోంచి కథలు వచ్చే అవకాశాలు చాలా తక్కువ. అనేక కారణాల వల్ల, తమకున్న ప్రజాస్వామిక దృక్పథం వల్ల, సాహిత్య ప్రయోజనాన్ని గుర్తెరగడం వల్ల తొలితరం నుంచే తెలంగాణాలో అభ్యుదయ పంథాలో కథలు రావడం మొదలయింది. ప్రేమ్‌చంద్ మార్గంలో సాహితీ సృజన చేస్తున్నారు. తొలితరం తెలంగాణా కథకులెన్నుకున్న సాహితీమార్గం ప్రేమ్‌చంద్ అభ్యుదయ పంథాయే. అందుకే తెలంగాణా కథ నేరుగా ఫ్యూడల్ స్థితి నుంచి అభ్యుదయ పంథాలోకి అడుగు పెట్టింది.

ప్రేమ్‌చంద్ హిందీ సాహిత్యం ఆ పద్ధతిలో అభివృద్ధి చెందలేదంటారు గాని తెలుగు సాహిత్యం మాత్రం మరింత ముందుకు పోయింది. అన్ని ధోరణులనూ తనలో సంలీనం చేసుకుంది.

తొలితరం తెలంగాణా కథకులు తెలంగాణా కథకు వేసిన సుదృఢమైన పునాదివల్ల కథ వ్యాపార సరుకు కాలేదు. డిటెక్టివ్‌ల జోలికి పోలేదు. నవల వ్యాపార సరుకై అమ్ముడుపోయిన కాలంలోనూ, భూతప్రేత పిశాచాల వెంటబడి తిరిగిన కాలంలోనూ తెలంగాణా నుంచి అలాంటి సాహిత్యం రాలేదు. కాలపరీక్షకు తట్టుకొని నిలువగలిగే ప్రాంతీయతా ముద్ర గల సాహిత్యమే వచ్చింది. అన్ని సమకాలీన ఉద్యమాలను తమలో సంలీనం చేసుకుని బాధ్యతాయుతంగానే రాశారు.

తొలితరంలో ప్రేమ్‌చంద్ మార్గంలో నడిచిన తెలంగాణా కథ మార్క్సునూ స్వంతం చేసుకొంది. భూపోరాటాలకు భాష్యం పలికింది. మరాఠీ దళిత సాహిత్య ప్రభావంతో అంబేడ్కర్‌ను తనవాణ్ని చేసుకుంది. దళితులకు అండదండగా నిలుస్తుంది. ఇరవయ్యవ శతాబ్ది చివరి దశాబ్దిలో తెలుగునేలపై ఉధృతంగా లేచిన బహుజనోద్ధరణకూ భాష్యం పలుకుతూ కథలు రాస్తున్నారు తెలంగాణా రచయితలు. తెలుగుకథకు గురజాడ వేసిన పునాదిలాగే, తెలంగాణా కథకు తొలితరం తెలంగాణా కథకులు వేసిన పునాది సుదృఢమైనదే. ఆ పునాదులపైనే కథా వికాసం జరుగుతుంది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 11 ఆగస్టు 2003**

# మాడపాటి శ్రీకారం

మన ప్రాచీన సాహిత్యంలో తెనాలి రామలింగని కథలు, కాశీమజిలీ కథలు లాంటి అనేక కథలున్నా అవన్నీ ఆశుసంప్రదాయానికి సంబంధించినవే. కథానిక అని చెప్పుకోబడే ఆధునిక కథ ఆంగ్ల భాషా సాహిత్య పరిచయంతోనే భారతీయ భాషల్లోకి, తెలుగులోకి వచ్చింది. వస్తు ప్రధానమైన ఆశుకథ మౌఖిక సంప్రదాయానికి చెందినదైతే శిల్ప ప్రధానమైనదైన ఆధునిక కథ లిఖిత సంప్రదాయానికి చెందింది. ఆంగ్లభాషా పరిచయంతో, బెంగాల్‌లో కోస్తా ప్రాంతంలో వెల్లివిరిసిన సంస్కరణోద్యమ ప్రభావంతో కోస్తా ప్రాంతం నుండి తెలుగులో మొదటి కథ వెలువడింది. కోస్తా ప్రాంతంలో ఆధునిక సాహిత్య వికాసం జరుగుతున్న కాలంలో తెలంగాణాలో మాతృభాషలో చదువుకునే అవకాశమే తక్కువ. అయినా తెలుగుకథ వచ్చిన రెండు సంవత్సరాల లోపే 1912లోనే తెలంగాణా నుంచి మొదటి కథ అచ్చయింది. గురజాడ దిద్దుబాటు అచ్చయిన ఆంధ్రభారతిలోనే మాడపాటి హనుమంతరావు రాసిన 'హృదయశల్యం' అనే కథ అచ్చయింది. అయితే ఈ కథను తెలుగులో వచ్చిన రెండవ కథగానైనా, తెలంగాణా నుంచి వచ్చిన మొదటి కథగానైనా పేర్కొనకపోవడం విడ్డూరం. సురవరం ప్రతాపరెడ్డి కథనే తెలంగాణా నుంచి వచ్చిన మొదటి కథలుగా పేర్కొనడంవల్ల తెలంగాణా కథా చరిత్రను దాదాపు ఇరవై యేళ్లు వెనకకు జరిపినట్లయింది.

సురవరం ప్రతాపరెడ్డి కథలు రాయడం మొదలు పెట్టేంత వరకు (1940) తెలంగాణా నుంచి ఎక్కువగా కథలు రాని మాట వాస్తవమే అయినా కథలసలే రాకుండా లేవు. మాడపాటి హనుమంతరావు, ఒద్దిరాజు సోదరులు (రాఘవరంగారావు, సీతారామచంద్రరావు), సిరుగూరు జయరావు, ఆదిరాజు వీరభద్రరావు, నందగిరి వెంకటరావు, ఎల్లాప్రగడ సీతాకుమారి లాంటివాళ్లెంతో మంది కథలు రాశారు. తెలంగాణా సాహిత్య సామాజిక వికాసానికి సురవరం ప్రతాపరెడ్డిగారు చేసిన కృషికి గుర్తింపు ఏ మాత్రం తగ్గించకుండానే మాడపాటి హనుమంతరావు రాసిన హృదయశల్యం కథను తెలంగాణా నుంచి వచ్చిన మొదటి కథగా గుర్తించవచ్చు. తెలంగాణా నుంచి మొదటి కథకుడైన మాడపాటి హనుమంతరావు మొదట్లో ఏడు కథలు రాశారు. ఈ ఏడు కథలు 1915లో 'మల్లికాగుచ్ఛము' పేరుతో పుస్తకంగా వచ్చాయి. తెలంగాణా నుంచి వచ్చిన మొట్టమొదటి కథల పుస్తకం ఇదే. ఆ తర్వాత మాడపాటివి, ఇతర రచయితలవి సంపుటులుగా రావడానికి చాలా కాలం పట్టింది. 1940 వరకు తెలంగాణా



నుంచి మరో కథల సంపుటి రాకపోవడం వల్ల తెలంగాణా నుంచి కథలే రాలేదన్న ప్రచారం జరుగుంటుంది. నిజానికి తెలంగాణా నుంచి చాలామంది కథకులు రాసి భారతి, గృహలక్ష్మి, ఆంధ్రజ్యోతి లాంటి పత్రికల్లో ప్రచురించారు. ఆ కాలంలో తెలంగాణా నుంచి చాలా పత్రికలే వచ్చినా (గోలకొండ, శోభ, ఆంధ్రకేసరి, సుజాత, కాకతీయ, తెలంగాణ, తెలుగుతల్లి, నీలగిరి , ఉదయిని, తెనుగు, ప్రత్యూష, ప్రజాతంత్ర, స్వతంత్ర, రెడ్డిరాణి, ఉషస్సు, నవోదయ, స్రవంతి, ప్రగతి, సారథి) ఇందులో చాలా పత్రికలు మూన్నాళ్ల ముచ్చటగానే ముగిసిపోయాయి. కథకులుతమ సంపుటాలను ప్రచురించుకోకపోవడం వల్ల అవి దొరకడమూ కష్టమైంది. పోతే తెలంగాణా కథంటే కేవలం విప్లవ పోరాటాల కథేనన్న ప్రచారం జరగడం వల్ల తెలంగాణా కథకు నష్టమే జరిగింది. రజాకారు పోరాటాల గూర్చి కథలు రాసినవాళ్లలో తెలంగాణా వాళ్లు చాలా తక్కువ. దాదాపు లేరనే చెప్పవచ్చు.

తొలితరం తెలంగాణా నుంచి రచయితలుగా పేరు తెచ్చుకున్న వాళ్లలో చాలా మంది రాసి ఊర్కున్నవాళ్లు కాదు. మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామి, పి.వి. నరసింహారావు, కాళోజీలాంటివాళ్లు తెలంగాణా సర్వతోముఖ వికాసం కోసం విరివిగా కృషి చేసినవాళ్లే. తెలంగాణా నుంచి మొదటి కథకుడైన మాడపాటి హనుమంతరావు రాసిన 'హృదయశల్యం' కథలో చారిత్రకాంశం తీసుకోబడినా సంస్కరణ నేపథ్యంతో కూడుకున్నదే. మొదటి కథ దిద్దుబాటు ప్రచురింపబడిన ఆంధ్రభారతిలోనే ఈ కథ ప్రచురించబడటం విశేషం. ఈ రెండు కథలకు పోలికలు కనబడతాయి. హృదయశల్యంలో రుద్రమదేవి పాత్రను మారువేషంలో తీసుకున్నా అంశం సాంఘికమైందే. దిద్దుబాటు కథలో వేశ్యాలోలుడైన భర్తను మార్చడానికి భార్య పన్నిన ఉపాయం కథాంశం. అందులో స్త్రీ ప్రశస్తి, ప్రాముఖ్యత, ఇల్లాలుగా ఆమె పాత్ర, పురుషులు సంస్కరింపబడాల్సిన అవసరం గూర్చి చెప్పాడు రచయిత. తెలంగాణా నుంచి వచ్చిన మొదటి కథలో సంస్కరణే నేపథ్యం. స్త్రీయే కేంద్ర బిందువు. హృదయశల్యం కథలో ఆపదలోనున్న దంపతులను పురుష వేషంలో ఉన్న రుద్రమదేవి దొంగలబారి నుండి రక్షిస్తుంది. తాను పురుషవేషంలో ఉన్నానన్న విషయాన్ని మరిచిపోయి స్త్రీ సహజమైన ప్రేమతో యమునను కౌగలించుకుంటుంది. వాళ్లు విడిపోతారు. ఆ ఆగంతకుడి చర్యతో యమున భర్తకు అనుమానం కలుగుతుంది. అది పెనుభూతమై వెంటాడుతుంది. వాళ్ల కాపురంలో అపశ్రుతులు మొదలవుతాయి. కొంత కాలం తర్వాత వాళ్లింటికి పురుషవేషంలో వచ్చిన

రుద్రమదేవి అసలు రూపాన్ని చూపి యమున భర్త అనుమానాన్ని నివృత్తి చేస్తుంది. రుద్రమదేవి తన సహజ రూపాన్ని చూపిన తర్వాత ఆ దంపతులామె కాళ్లపై పడతారు.

"ఆనాడు స్త్రీజాతికి సహజమగు హృదయ మార్దవము చేతను నా వేషస్వభావమును మరిచి జాలిచే నిన్న కౌగిలించుకొంటిని. కాని పురుష వేషముననున్న నేనట్లు చేయుట నీ భర్తకనుమానము సంపాదించుననుమాట స్మరణకు వచ్చి మిమ్ము మరలనొకమారు దర్శింప ననుజ్ఞ వేడి నేడు నీ యథితినై యిటకు వచ్చితిని. నీ నిష్కాపట్య స్వభావమును మీ పరస్పరానురాగమునకానందించితిని. కాని కొంతకాలము మీ మనస్తాపమునకు కారణభూతమైనందుకు నన్ను మీరు మన్నింపవలెను" అంటుంది రుద్రమదేవి. వాళ్ల అనుమానం పటాపంచలవుతుంది.

"మీ హృదయశల్యమిక వీడినదని నేను దృఢముగ నమ్మవచ్చునా?" అంటుంది పల్లకీ ఎక్కుతూ మహారాణి.

"దేవీగారి యనుగ్రహము చేత నిస్సందేహముగా వీడినది" అనే దంపతుల మాటతో కథ ముగుస్తుంది.

ఇలా తెలుగులో వచ్చిన మొట్టమొదటి కథ స్త్రీ కేంద్రబిందువుగా, సంస్కరణ నేపథ్యంతో వెలువడినట్టే తెలంగాణా నుంచి వచ్చిన మొదటి కత వెలువడింది. మొదటితరం కథారచయితలు వాడినట్టు వాక్యనిర్మాణంలో కొంత గ్రాంథిక పోకడలు కనబడినా సరళ గ్రాంథికం వాడి పాఠకులకిబ్బందిని తొలగించాడు రచయిత. తెలుగు భాష చదువుకునే అవకాశాలే మృగ్యమైన కాలంలో ఆంగ్లభాషా పరిచయంతో తెలుగులోకొచ్చిన ఆధునిక కథను మొదట తెలుగుకథ వెలువడిన కాలంలోనే వెలువరించడం చెప్పుకోదగ్గ విషయం. ఏకాంశవ్యగ్రత, స్వయం సమగ్రత, క్లుప్తత లాంటి కథానికా లక్షణాలన్నింటినీ పాటించి రాయబడిన 'హృదయశల్యం' తెలంగాణా నుంచి వచ్చిన మొదటి తెలుగు కథ. తెలుగులో మొదటి కథకుడిగా గురజాడ (ఆచంట సాంఖ్యాయనశర్మ?) ప్రసిద్ధుడయితే తెలంగాణాలో మొదటి కథకుడిగా మాడపాటి హనుమంతరావు ప్రసిద్ధులు.

**సాహితి, ఆంధ్రభూమి ధినపత్రిక, 15 సెప్టెంబర్ 2003**



# తెలుగుకథకు పుట్టుకతోనే యవ్వనం

శిశువు పుట్టగానే పరుగులు తీయదు. కొద్ది రోజుల్లో పక్కకు దొర్లుతుంది. మరి కొంతకాలానికి అంబాడుతుంది. ఇంకొంత కాలానికి దేన్నయినా పట్టుకొని అడుగులేస్తుంది. ఆ తర్వాత పరుగులు తీస్తుంది. క్రమక్రమంగా ఎదిగి యవ్వనవంతుడవుతాడు. మన పురాణాల్లో సద్యో యౌవనంతో పుట్టినట్లు కథలున్నాయి. అవి కథలే అయినా మన తెలుగు కథ మాత్రం సద్యో యౌవనంతోనే పుట్టింది. వస్తుశిల్పాల మధ్య సమన్వయంతో పుట్టుకతోనే యవ్వనవతియై ఒప్పింది. తెలుగులో మొదటి కథకుడైన గురజాడ రాసిన ఐదు కథలూ ఆణిముత్యాలనదగిన కథలే. సంస్కరణ నేపథ్యంతో స్త్రీ కేంద్ర బిందువుగా తీసుకుని కథానికకున్న లక్షణాలన్నింటినీ పాటించి రాయబడిన కథలు. విదేశీ భాష నుంచి వచ్చిన ఈ ప్రక్రియ క్రమవికాసం చెందకుండా మొదలే పరిణత స్థితిలో రావడం విశేషం. తెలుగు నవల, వచన కవిత వికాసం చెంది పరిణతి చెందాయి కాని కథ పుట్టడమే పరిణతితో పుట్టింది.

ఆనాటి సమాజంలో ఉన్న వేశ్యాలోలత్వం, మూఢ విశ్వాసాలు, మతమౌఢ్యం పేరు మీద తన్నుకుచావడం లాంటి అనేక విషయాలను తన కథల ద్వారా ఖండించారు గురజాడ. గురాజడ రాసిన మీ పేరేమిటి? కథను, యాభై ఏళ్ల తర్వాత 60లలో కా.రా. రాసిన ప్రసిద్ధ కథ యజ్ఞంతో పోల్చవచ్చు. అద్భుతమైన కథారచనకు గురజాడ వేసిన మార్గంలోనే పయనించి మిగతా రచయితలు తెలుగుకథ సద్యో యౌవనయని నిరూపించారు. ఆ తర్వాత కొన్ని కుక్కమూతి పిందెలలాంటి కథలొచ్చినా తెలుగు కథ అభ్యుదయ పథంలోనే నడుస్తుంది. నవలలా వ్యాపారసరుకు కాలేదు. దీనికి కారణం తొలినాటి తెలుగు కథకులు వేసిన సుదృఢ పునాది తెలంగాణా కథ కూడా సద్యో యౌవనమే. ఈ విషయం మనకు తొలితరం తెలంగాణా నుంచి వచ్చిన కథలను పరిశీలిస్తే అర్థమవుతుంది. వస్తు సేకరణలో తెలుగు కథకంటే కూడా ముందుంది తెలంగాణా కథ. మొదటి తరం కథలే సంస్కరణ నేపథ్యంతో ముందుకు సాగాయి. తొలి తరంలో వచ్చిన తెలుగుకథల్లో మధ్యతరగతి ముడిసరుకు మధ్యతరగతి దృక్కోణంలోంచే కథ నడుపబడింది. ఎందుకంటే ఆ మధ్యతరగతికి చెందిన చదువుకున్నవాళ్లే ఈ లిఖిత కథకు పాఠకులు. తెలుగు కథావికాసం అప్పటికే

మధ్యతరగతి ఆవిర్భావం జరిగున్న కోస్తా ప్రాంతంలో జరిగిందన్నది వాస్తవం. కాని రావిశాస్త్రి కలం పట్టేంతవరకు కోస్తా ప్రాంతం నుంచి వచ్చిన కథ మధ్యతరగతిని దాటిపోలేదు. కాని తెలంగాణా నుంచి వచ్చిన కథలు తొలితరం నుంచే మరికొంత ముందుకు పోయి అట్టడుగు జీవితాలను అక్కున చేర్చుకున్నాయి. అందుక్కారణం స్వాతంత్ర్యానికి ముందు తెలంగాణాలో మధ్యతరగతి ఆవిర్భావం జరగకపోవడం ఒక కారణమైతే ప్రేమ్‌చంద్ సాహిత్య మార్గాన్ని ఎన్నుకొని కథను మరింత అభ్యుదయ మార్గంలో నడిపించడం మరో కారణం. తొలితరంలో తెలంగాణా సాహిత్యకారులకు ఇంగ్లీషు, బెంగాలీ సాహిత్యంతో కంటే మరాఠీ, హిందీ సాహిత్యంతో ఎక్కువ పరిచయముంది. తెలంగాణా నుంచి మహారాష్ట్రకు, హిందీ ప్రాంతాలకు వలసపోవడమూ ఉండేది. దీంతో హిందీ భాషా సాహిత్యం చదవడం వాళ్లకెప్పుడూ సమస్య కాలేదు. అందుకే ప్రేమ్‌చంద్ మార్గంలో అట్టడుగు జీవితాలకు సాహిత్యంలో స్థానం కల్పించడం తెలంగాణాలో మొదటితరం నుండే మొదలైంది. కథా నిర్మాణం, శిల్పవిన్యాసంలోనూ క్లుప్తత, ఏకాంశవ్యగ్రత, స్వయంసమగ్రత లాంటి కథానికా లక్షణాలను పాటించి తెలంగాణా కథ సద్యో యౌవనియని నిరూపించారు.

భాషా విషయంలోనూ ప్రజాస్వామిక పద్ధతినే పాటించారు. కథ చేరాల్సిన పాఠకులను దృష్టిలో ఉంచుకుని సరళమైన భాషను వాడారు. మనం తొలి తరం కథలను పరిశీలిస్తే అప్పటికే చాలా మంది రచయితలు పాత్రోచిత మాండలికం వాడారు. తెలంగాణా మాండలిక భాషను మొదటి తరంలోనే నిర్భయంగా ఉపయోగించి తర్వాతితరం రచయితలకు మార్గదర్శకులయ్యారు. గొల్ల రామవ్వ (పి.వి. నరసింహారావు), సంఘాల పంతులు, ఇతర మొగలాయి కథలు (సురవరం ప్రతాపరెడ్డి), నారయ్య బతుకు ఇతర కథలు (గూడూరి సీతారాం), అంగుడుపొద్దు (సురమౌళి), పరిగెలాంటి కథల్లో తెలంగాణా మాండలిక భాషా సొగసులు స్పష్టంగా కనపడతాయి. మొదటితరం తెలంగాణా రచయితలు సంఖ్యలో విపరీతంగా కథలు రాయకపోయినా ప్రజల మాండలికంలో, పాత్రోచిత మాండలికంలో కథలు రాసి తెలంగాణా కథ సద్యోయవ్వనియని నిరూపించారు. ఈ సాంప్రదాయాన్నే ఇప్పటికీ తెలంగాణా కథా రచయితలు కొనసాగిస్తున్నారు. ప్రాంతీయతా ముద్రతో కథను విశ్వజనీనం చేయడం కూడా మనకు తెలంగాణా తొలితరం కథల్లో కనబడుతుంది. మాండలికం కోసం మాండలికం రాయడం కాకుండా ఆ ప్రాంత వాస్తవిక భాష, జీవితం ఈ కథల్లో దర్శనమిస్తాయి. సురవరం ప్రతాపరెడ్డిగారి కథల్లో అప్పటి తెలుగు, ముస్లిమ్ జీవితాలు,



భాషల మిశ్రమం, ఆ సంస్కృతులు పరస్పరం ప్రభావితం చేసుకోవడం కనబడుతుంది. హైదరాబాద్ ప్రాంత జీవితానికి, భాషకు ఈతని కథలు నిదర్శనాలు. గూడూరి సీతారాం, జి. రాములు, సురమౌళి కథల్లో కరీంనగర్ జిల్లా ప్రాంత అట్టడుగు జీవితాలు, వృత్తులు, భాష కనబడతాయి. కాంచనపల్లి, వట్టికోట కథల్లో మహబూబ్‌నగర్ జీవితాలను దర్శించవచ్చు. ఇలా మొదటితరం నుంచే తెలంగాణా కథా రచయితలు సాహిత్యాన్ని సృజించడమో సామాజిక బాధ్యతగా గుర్తించారు. వస్తువు, శిల్పం, భాష, ప్రాంతీయతా ముద్రలతో మంచి కథలు రాసి తెలుగుకథతో పాటు తెలంగాణా కథ కూడా సద్యోయౌవనియని నిరూపించారు. అటు తర్వాతితరం వారు వ్యాపార మసాలాల జోలికి పోకుండా ఉండటానికి మొదటితరంలోనే సుదృఢమైన పునాదులు వేశారు.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 8 సెప్టెంబర్ 2003**

# కొల్లాయి గట్టితేనేమి....!

కొల్లాయి గట్టితేనేమీ మా గాంధి
కోమటయి పుట్టితేనేమి...?

సాంప్రదాయక వైశ్య కుటుంబంలో పుట్టిన మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ మహాత్మాగాంధీ అయ్యాడు. మహాత్ముడయ్యిండీ గజం గుడ్డనే కట్టుకున్నాడు. గజం గుడ్డనే కప్పుకున్నాడు. కోట్లాది భారతీయులను కదిలించి దేశానికి స్వాతంత్ర్యం సంపాదించాడు. అతను వ్యాపారుల కుటుంబంలో పుట్టడంలాంటివేవీ అతని పనులనాపలేదు.

తెలంగాణాలో భూపోరాటాలకు ముందు, స్వాతంత్ర్యానికి ముందు, ఆ తర్వాత కూడా కొంతమంది అగ్రకులాల వాళ్లు 'దొరలు'గా పిలువబడే వాళ్లు. వీళ్ల చేతుల్లోనే ఆస్తులు, అధికారాలన్ని ఉండేవి. అయితే వీళ్లలో చాలామంది పీడకులుగానే ఉండేవారు. తెలంగాణా నుంచి వచ్చిన కథల్లో, నవలల్లో, కవిత్వంలో వీళ్లను విలన్లుగా చిత్రించడం ఉంది.

అయితే రజాకార్ల పాలనాకాలంలో వీళ్లలో చాలామంది నైజాంకు మద్దతిచ్చిన వాళ్లే ఉన్నారు. రజాకారు వ్యతిరేక పోరాటాల్లోనూ, ఆ తర్వాతి పోరాటాల్లోనూ ఈ కులాల్నుంచి వచ్చిన వాళ్లు గణనీయమైన సంఖ్యలో పాల్గొన్నారు. ఉద్యమాలకు నాయకత్వం వహించారు. ఈ సంప్రదాయాన్నే కొంతమంది మేధావులు, రచయితలు ముందుకు తీసికెళ్లారు.

తెలంగాణా నుంచి మొదటితరంలో కథలు రాసినవాళ్లను పరిశీలిస్తే అగ్రకులాలకు చెందినవాళ్లే ఎక్కువమంది కనబడుతారు. ఇది సహజం కూడా. స్వాతంత్ర్యానికి ముందు అగ్రకులాలవారికి తప్ప వెనుకబడిన, దళిత కులాలవారికున్న చదువుకునే అవకాశాలు మృగ్యం. చదువుకునే అవకాశాలే లేకుంటే ఇక రచయితలయ్యే అవకాశాలెక్కడివి?

తెలంగాణాలో ఫ్యూడల్ సంస్కృతి విశృంఖల విహారం చేయడం మరో కారణం. అయితే ఈ సంస్కృతి పరిరక్షకులుగా అగ్రకులాలవారే ఉండటం విశేషం. అయితే మొదటితరంలో తెలంగాణా నుంచి కథలు రాసినవాళ్లు చాలామంది అగ్రకులాలవారే అయినా వాళ్లు ప్రజాపక్షపాతం వహించే కథలు రాశారు. అట్టడుగు



జన జీవితాలను అక్కున చేర్చుకునే రాశారు. ఫ్యూడల్ సంస్కృతిని వ్యతిరేకిస్తూనే రాశారు. రజాకారు వ్యతిరేక పోరాటాలను సమీక్షిస్తూనే రాశారు. పోరాటాల్లోనూ పాల్గొన్నారు. మొదటితరం కథారచయితల్లో చాలామంది కేవలం కథలు రాసి ఊర్కున్న వాళ్లు కారు. వట్టికోట ఆళ్వారుస్వామి, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, ఒద్దిరాజు సోదరులు, కాళోజీ సోదరులు, పొట్లపల్లి రామారావు, కాంచినపల్లి, పి.వి. నరసింహారావులాంటి వాళ్లు తెలంగాణా వికాసం కోసమే కాక స్వాతంత్ర్య పోరాటాల్లోనూ పాల్గొన్నవారు. జీవితం, రచనలు భిన్నం కావని నిరూపించారు. కాకతీయ, గోలకొండలాంటి పత్రికలు, అణాగ్రంథమాల, దేశోద్ధారక గ్రంథమాల లాంటి ప్రచురణసంస్థలు, గ్రంథాలయాలు స్థాపించి తెలంగాణాలో చైతన్యం తీసుకురావడానికి కృషి చేశారు. ఆ సాంప్రదాయాన్నే ఆ తర్వాతి తరాల రచయితలు కొంతమంది ముందుకు తీసుకువెళ్లారు. ఎవరి సాహిత్యాన్ని వాళ్లు సృష్టించుకోగలిగితే మంచి సాహిత్యం వచ్చే అవకాశముంది. కాని ఎవరి సాహిత్యాన్ని వాళ్లు మాత్రమే రాసుకోవాలనడం సరైంది కాదు. విషయం పట్ల అవగాహన, ఏ బలహీనవర్గాల గూర్చయితే రాయదలుచుకున్నామో వాళ్ల పట్ల ఆర్తి, మనం సృష్టించిన సాహిత్యం వాళ్లకు నిజంగానే మేలు చేస్తుంది, చేయాలన్న తపన ఉంటే ఇతరులు కూడా మంచి సాహిత్యాన్ని సృష్టించవచ్చు. ఇందుకు కొంతమంది దళితేతరులు దళితుల గూర్చి రాసిన సాహిత్యమే చక్కటి ఉదాహరణ. అలాగే మొదటితరంలో తెలంగాణా నుంచి వచ్చిన కథారచయితలు తమ ఫ్యూడల్ సాంప్రదాయం నుంచి వచ్చినవాళ్లే అయినా ఆ బంధాలను తెంపుకుని బయటపడ్డారు. తాము పుట్టిన నేల వికాసం కోసం కృషి చేస్తూనే దీనమానవుల పక్షపాతం వహించి కథలు రాశారు.

వట్టికోట ఆళ్వారుస్వామి జైలు లోపల కథలను పరిశీలించినా, సురవరం ప్రతాపరెడ్డి కథలు, మొగలాయి కథలను చూసినా, పి.వి. నరసింహారావు ప్రసిద్ధ కథ గొల్లరామవ్వ కత చదివినా, కాళోజీ నారాయణరావు కథలు చదివినా, పి. సురమౌళి అంగుడుపొద్దు, ఇతర కథలు చదివినా, మందా రామారెడ్డి సర్కారుకిస్తు, నెల్లూరి కేశవస్వామి కథలు లాంటివి చదివినా, పి. వెంకటరామారావు కొత్త నాగలి కథ చదివినా తొలితరం తెలంగాణా కథా రచయితల ప్రజాస్వామిక దృక్పథం, ప్రజాపక్షపాతం స్పష్టంగా కనబడుతుంది. తెలంగాణా ప్రాంతానికే ప్రత్యేకమైన ఉద్యమాలను, జీవితాలను, సంఘటనలను, సమస్యలను తీసుకొని కథలు రాసిన కథకులెంతో మందున్నారు.

తొలితరం తెలంగాణా రచయితల్లో జి. రాములు, గూడూరి సీతారాం లాంటి ఒకరిద్దరు మాత్రమే అగ్రకులేతర రచయితలు కనబడతారు. కాని స్వాతంత్ర్యానంతరం పుట్టి కలం పట్టి రచయితలుగా ఎదిగిన వాళ్లలో చాలామంది శ్రామిక కులాల నుంచి వచ్చినవాళ్లే ఉండటం గమనించదగ్గ విషయం. తొలితరం తెలంగాణా రచయితలు వేసిన ప్రజాస్వామిక పునాది, వస్తుసేకరణ విషయంలో వాళ్లు అవలంభించిన పద్ధతి, తెలంగాణా ప్రాంతంలో పెల్లుబుకిన వివిధ ఉద్యమాలు, తాననుభవించిన జీవిత నేపథ్యాలు, శ్రామిక జీవితానుభవాల ఎరుక చాలామందిని రచయితలను చేశాయి.

మొదటితరంలో కలం పట్టి ప్రజాస్వామిక దృక్పథంతో ప్రజా పక్షపాతం వహించి కథలు రాసి తెలంగాణా సర్వతోముఖ వికాసం కోసం కృషి చేసిన కథా రచయితలు అభినందనీయులు. కొల్లాయి గట్టిన గాంధీ స్వాతంత్ర్యోద్యమ సారథి అయినట్లు ఫ్యూడల్ సంస్కృతి విపరీతంగా ఉన్న కాలంలో, అగ్రకులాల్లో పుట్టినా ఆ సంస్కృతిని వ్యతిరేకిస్తూ ప్రజా పక్షపాతం వహించి కథలు రాసిన తొలితరం తెలంగాణా రచయితలు చిరస్మరణీయులే.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 18 ఆగస్టు 2003**



# మా గొల్లరామవ్వ కథ

విస్మృత కథల సంకలనంలో 'విజయ' కలం పేరుతో ప్రచురించబడిన గొల్ల రామవ్వ కథ కాకతీయ పత్రికలో 15-8-1949 సంచికలో ప్రచురింపబడింది. ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, భారతదేశ మాజీ ప్రధాని పి.వి. నరసింహారావు గారిచే రాయబడిన ఈ కథ అద్భుతమైన కథ. రాజకీయ దురంధరుడే కాక గొప్ప సాహితీవేత్త అయిన పి.వి.గారి కీర్తిని సాహిత్యంలో నిలబెట్టడానికి ఈ ఒక్క కథ చాలు. స్వాతంత్ర్య సమరంతో పరిచయం తెలంగాణా గ్రామీణ జీవితంతో మమేకమై ఉంటే తప్ప ఈ కథ రాయడం సాధ్యం కాదు. నాటకీయత ఈ కథకు ప్రాణం. సందర్భోచితంగా ఉపయోగించిన తెలంగాణా నుడికారాలు, సామెతలు, మాండలిక ప్రయోగాలు ఈ కథకెంతో బలాన్నిచ్చాయి. సన్నివేశ కల్పన, పాత్రచిత్రణ రచయితగా పి.వి. గారి పరిణతిని తెలియజేస్తున్నాయి. ఈ కథా సాంప్రదాయాన్ని అలాగే కొనసాగించి వుంటే తెలుగు సాహిత్యం నోబుల్ బహుమతినందుకోగలిగేంత గొప్ప రచయితను పొంది ఉండేది. పి.వి.గారు రాజకీయాల్లోకి వెళ్లి ఉన్నతోన్నత స్థితికెదిగినా తెలుగు సాహిత్యం మాత్రం ఓ గొప్ప కథకుడ్ని కోల్పోయింది. అతడలాగే రాసి ఉంటే తెలంగాణా జనజీవన సంస్కృతిని చిత్రించే అద్భుతమైన కథలెన్నో రాసి ఉండేవాడు.

మొదటితరంలో సాహిత్యకారులకు జీవితం, సాహిత్యం వేరుగా ఉండేవి కావు. అటు సామాజిక కార్యక్రమాలు, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడం, తెలంగాణా వికాసం కోసం కృషి చేయడంతో పాటు సాహిత్య సేవ కొనసాగిస్తూ ఉండేవారు. వాళ్లు చేస్తున్న పనులకు సాధనంగానే సాహిత్యం ఉపయోగపడేది. స్వాతంత్ర్య సమరయోధుడైన పి.వి.గారు ఈ కథలో ఓ కాంగ్రెస్ కార్యకర్తను గొల్ల రామవ్వ రజాకారు పోలీసుల బారి నుండి రక్షించిన విధానాన్ని చిత్రించారు. తెలంగాణలో అంతులేకుండా కొనసాగుతున్న రజాకారు దురంతాలను ఎదుర్కోవడానికి యువకులు మారువేషాల్లో ఎన్నో సాహసకార్యాలు చేసేవారు... అలాంటి యువకుని కథే ఇందులోని ఇతివృత్తం. నరహంతకులైన నైజాం పోలీసులను చంపి గొల్ల రామవ్వ ఇంట్లోకొచ్చిన యువకుడ్ని గొల్ల రామవ్వ రక్షించిన తీరు అత్యద్భుతంగా చిత్రించబడిందీ కథలో. ఆ యువకునికి అన్ని ఉపచారాలు చేసి గొల్ల వేషం వేయించి రజాకారు పోలీసుల కన్ను గప్పటానికి తన మనుమరాలి పక్కన పడుకోబెడుతుంది. యువకునితో, మనుమరాలితో,

పోలీసులతో ఆమె అన్న మాటలు పాఠకుల్ని చకితుల్ని చేస్తాయి. అత్యంత సహజంగా తన ధోరణిలో తాను మాట్లాడుకుంటున్నట్లు మాట్లాడి పోలీసులను బోల్తాపడగొట్టించిన రామవ్వ ఆ యువకుడి దృష్టిలో భారతమాతే.

"అవ్వా! నువ్వు సామాన్యురాలివి కాదు... సాక్షాత్ భారతమాతవే..." అంటాడు చివర్లో ఆ యువకుడు.

"దోర్ట్.. కొంటె పోరడా...! నాకే పేర్లు బెడుతున్నావు? నా పేరు గొల్ల రామి.. గంతే... ఇగ నువ్వెల్లు.... మల్లిని అత్తోరింటికి తోలుకపోత... పొద్దెక్కుతాంది... ఊ యెల్లు..." అంటుంది రామవ్వ.

గ్రామీణ జీవితంతో, తెలంగాణా మాండలిక బతుకులతో మమేకమైతే, అందులో జీవిస్తే తప్ప ఇందులోని కొన్ని పదాలు వాడటం సాధ్యం కాదు. మారుమూల పల్లె పదాలను, తెలంగాణా జాతీయాలను అలవోకగా వాడి తనకా భాషపై, జీవితంపై ఉన్న పట్టును, అధికారాన్ని తేటతెల్లం చేశాడు రచయిత. పండిత కులంలో పుట్టి ఉన్నతోన్నత చదువులు చదివి అందరాని ఎత్తులకెదిగిన మనీషి తెలంగాణా మాండలిక భాషతో పెట్టుకున్న సజీవ సంబంధాలు ఈ కథను చదివితే అర్థమవుతాయి.

బీరిపోయి చూడటం, తొశ్శతొశ్శగా, పోరీ, ఉల్లుల్లుగ, సురుకుపెట్టుడు, ఉచ్చిలి పోరదు, గడంచె, వయసు వక్కలుగాను, కుర్మదారం, గురుగులు, బేఇజ్జతిలాంటి సజీవ మాండలిక పదాల వాడకం వల్ల ఈ కథకు మాండలిక భాషావాద సౌందర్యం వచ్చింది.

గొల్లల జీవితాలతో గాఢమైన పరిచయం ఉంటే తప్ప వాడలేని గురుగులు, తలెముంత, కుర్మదారం లాంటి పదాలను వాడటం సాధ్యం కాదు. అగ్రకులంలో పుట్టిన ఈ రచయితకు శ్రామిక కులాలవాళ్లంతా స్నేహితులే.... వంగర గొల్లలకు, ఇతర రైతులకు పి.వి.గారు మాదొరే... అందుకే గొల్ల రామవ్వ కథను అంత అద్భుతంగా సహజంగా, ఆ జీవితంతో మమేకమై రాయగలిగాడు.

"రాజోలిగ ఉన్నావు కొడకా!... నీకెందుకొచ్చెరా ఈ కట్టం? పందు... పందు.. ఆ గొంగట్ల పందు... బీరిపోతవేందిరా... ఆ... గట్ల... మల్లిపోరీ! కుంపటి మీద కదుముంతెడు నీళ్లెక్కియ్యే.... అబ్బ! మంజరుగున్నొలిగె కదుల్తది మబ్బు ముండ... గిప్పుడు కొద్దిగ వుశారయింది పొల్లె! మొగడు నాలుగు మల్కల పెయ్యి మెదుగబెడితే ఇంకా కుదుర్తది చురుకు! ముంద్లు తీసెయ్యి ఉల్లుల్లుగ.. అయొ! సిగ్గయితాందా వాన్ని ముట్టుకుంటె? ఏం మానవతివిగదనే! నీ సిగ్గు అగ్గిలబడ.." అంటుంది రామవ్వ.



"ఇగలే కొడుకా!... కొద్దిగ గింత గటుక చిక్కటి సల్లల పిసుక్కచ్చిన.. గింత కడుపుల పడేసుకో.... ఎన్నదన్న తాగినావు తాతా గట్క? మరి బువ్వ తినెటోనివి.. నీకేమెరుక? గొల్ల రామవ్వ గట్కంటే ఏమనుకున్నౌ? పొయ్యే పానం మర్లుతది... చూడు మరి... కులం జెడిపోతవని భయపడ్తున్నావా? నువ్వు బామనోడవైనా, జంగమోడవైనా, ఏ కులమోడవైనా సరే... మొదలు పానం దక్కిచ్చుకో... అంతకైతే నాలికె మీద బంగారి పుల్లతోటి సురుకువెడితే పోయిన కులం మల్లత్తదట కాదు...! ఆ... ఇగ తాగి పారెయ్యి గటగట...!" అంటుంది యువకుడితో...

గొల్ల రామవ్వ సహజశైలి సంభాషణలను, పాత్రోచిత భాషను, సందర్భోచిత మాటలను, అత్యంత వాస్తవికంగా చిత్రించినట్టు ఈ వాక్యాలు చదివితే అర్థమవుతుంది. గొల్లలకే తెలియని కుర్మదారం కట్టుకోవడం లాంటి ఆచార వ్యవహారాలు ఈ కథలో చిత్రించడం జరిగింది.

మొదటితరంలో వచ్చిన తెలంగాణా కథల్లో ఇంత వాస్తవికంగా మాండలిక భాషా సౌందర్య లయతో రాయబడిన కథలు అరుదు.

నైజాం పాలనాకాలంలో రజాకార్ల ఉద్యమం ఓ మాయని మచ్చలాంటిది.. అంతకు ముందు పాలించిన వందలాది సంవత్సరాల పాలనకు ఈ చివరి సంవత్సరాలు మచ్చలే.. రజాకార్ల దురంతాలను ఈ కథలో అత్యంత వాస్తవికంగా చిత్రించడం జరిగింది. నైజాం పాలనను విమర్శించడానికి ఈ కాలం ఎంతో అవకాశం కలిగించింది.

తలుపు తీస్తూ గొల్ల రామవ్వ... మాటలు రజాకారు పోలీసుల దుశ్చర్యలను పట్టిచ్చేవిగా ఉన్నాయి.

"చంపితిర్రా.. నీ దౌడలుబడ... ముసల్దాని పానం తీత్తార్రా...! ఇగ చూసుకోండి ఈ పడుచు పోరగాండ్లా ఆ మంచంల పడుకున్నరు... ఈడ నేనున్న... కుండలున్నయి... గురుగులున్నయి... తలెముంతలున్నయి... పోరి మెడల గంటె పుత్తెలున్నయి... పోరగానికి రొండు దండె కడియాలున్నయి... ఇగేం కావాల్నో తీసుకోండి... చంపాల్నంటే చంపుండ్రి... నన్ను చంపుండ్రి... పోరని చంపుండి... పొల్ల ముండను ముండ మోపుండ్రి. ముందు దాన్నిగూడ తుపాకినెయ్యండి... ఇద్దర్నొక్క సారె చంపుండ్రి... అప్పట్నుంచి నన్ను చంపుకు తింటాన్రు.. ఇగ జుర్రుకోండి... ఏం జుర్రుకుంటారో!"

పి.వి. మాటలు వింటుంటే తెలంగాణా గ్రామాల్లోని స్వాతంత్ర్యపు పూర్వపు

పెద్ద మనుషులు మాట్లాడినట్టుంటుంది. ఎంత ఎదిగినా తన భాషను తన సంస్కృతిని మరచిపోని భూమిపుత్రుడు పి.వి. తెలుగు సాహిత్యానికి ఆణిముత్యం లాంటి కథనందించిన ధన్యజీవి.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 1 సెప్టెంబర్ 2003**



# కతకు శిల్పమద్దితే కథ

కథ మానవ జీవితానికి చేరవైనది. కథకు మనిషికీ అవినాభావ సంబంధముంది. కథ చెప్పని, కనీసం వినని మనిషి లేడు. తెలుగు సమాజంలో ప్రతి లోగిలీ ఓ కథాకేంద్రమే. వాకిళ్లలో పందిరి గుంజలకొరిగి నడముకూ మోకాళ్లకూ గుడ్డ కట్టుకొని కథలు చెప్పడం మనకు తెలుసు. అరుగుల మీద కొలువుదీరి మొగురాలానుకొని చుట్టలు తాగుతూ కథలు, కబుర్లు చెప్పుకోవడం మనకెరికే. రచ్చబండల మీద కూచొని కాలక్షేపం కోసం కథలు చెప్పుకుంటూనే ఉంటారు. పిల్లలను నిద్ర పుచ్చడానికి రాక్షసుల, రాజుల, దేవతల, దయ్యాల కథలు చెబుతుండగా విన్నాం. పంచాయతీలు చెప్పేటప్పుడు మధ్యమధ్య పిట్టకథలు చెప్పడం చూస్తూనే వున్నాం. కథలు చెప్తుతుంటే ఊకొడుతూ నిద్రపోవడం మన అనుభవంలోనిదే. ఇలా కథ మనకు కొత్తదేం కాదు.

అఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా అని మనకు కథాప్రసక్తి అగ్నిపురాణంలో ఉంది. ఇలా భారతీయులకు తెలుగువారికి కథంటే కొత్తదేం కాదు. కాని ఈ కథలన్నీ ఊకొట్టే కథలు, ఆశువుగా చెప్పే కథలు. నోటి కథలు. మౌఖికంగా జీవించే కథలు. ఈ కథలు చెప్పే, వినే కథలు. ఇవి చెప్పడానికి అక్షరజ్ఞానం అవసరం లేదు. చదువక్కర్లేదు. మాటకారితనం, చెప్పగల నేర్పుంటే చాలు. ఇవన్నీ ఒక తరం ద్వారా మరో తరానికి మౌఖికంగానే చేరుతాయి. వీటిని కథలనడం కంటే కతలనడం మంచిది. మనమిప్పుడు కథలని చెప్పుకునేవి, రాసుకునేవి, చదువుకునేవి లిఖిత సంప్రదాయానికి చెందిన కథలు. ఇవి పాశ్చాత్య చదువుల ప్రభావంతో, పాశ్చాత్య విద్యాప్రభావంతో మన భాషలోకి ప్రవేశించాయి. ఇదే లిఖిత కథ. చదివే కథ. చదువుకున్న వాళ్ల కోసం ఏర్పరుచుకున్న కథ. ఆశుకథ విషయ ప్రధానమైతే, లిఖిత కథ శిల్ప ప్రధానమైంది. కథకు ఏం చెప్పావనేది కాకుండా ఎలా చెప్పావనేది ముఖ్యం. కతకు శిల్పమద్దితే కథవుతుంది. కతను అలంకరిస్తే కథవుతుంది. కథ కంచికి చేరేది కాదు. పాఠకులను చేర్చేది. మానవ జీవితాలను అక్కున చేర్చుకునేది. వాస్తవికత దీనికి కారణం.

కథకు కొన్ని లక్షణాలను చెప్పారు లాక్షిణికులు. ఏకాంశ వ్యగ్రత, స్వయం సమగ్రత, క్లుప్తత ఆ లక్షణాలుగా పేర్కొన్నారు. ఈ లక్షణాలకొదగని మంచి కథలు,

గొప్ప కథలు చాలానే వున్నాయి. అనేక అంశాలను ఒకే కథలో చెప్పిన సందర్భాలున్నాయి. అందుకే కథా లక్షణాలను పునర్నిర్వచించుకోవాల్సిందే. కవిత ఆవేశ ప్రవృత్తి గల వారి స్వంతమైతే వచనం (కథ) ఆలోచనా ప్రవృత్తిగల వాళ్లు రాసేదన్నారు విమర్శకులు. కవిత స్వప్నసుందరి. దూరాన తళుక్కున మెరిసే అప్సరసాంగనలాంటిది. కథ సహధర్మచారిణి. తళుక్కున మెరియదు. అక్కున చేర్చుకుంటుంది. సహధర్మచారిణిలా మనలను లాలించేది ఆలించేది అలరించేది కథ. అందుకే మనిషికి సన్నిహితమైంది. కథంటే వాస్తవికతా పరిమళంతో పరిఢవిల్లేది. కనువిప్పు కలిగించేది. ఆలోచింపజేసేది. కర్తవ్యాన్ని బోధించి అందరికీ అందుబాటులో ఉండేది.

వివిధ సాహిత్య ప్రక్రియల్లో కథ ఒకటి. కథ చెప్పడం ఒక కళ. ఇది ఆదిమ కాలం నుంచీ ఉంది. మనిషి మాట్లాడటం నేర్చుకొన్నప్పటి నుంచీ అంటే భాష పుట్టినప్పట్నుంచీ కథ చెప్పడం, వినడం ఉంది. మానవ సంస్కృతి చరిత్రలో పిరమిడ్లు అత్యంత ప్రాచీన కాలానికి చెందినవి. కథలు పిరమిడ్ల కంటే ఎన్నో ఏళ్లు ప్రాచీనమైనవి. ఆదిమానవుడు తన ఊహకందని విషయాల గూర్చి కథలు కథలుగా చెప్పుకోవడం, వాటిని అద్భుత శక్తులుగా చిత్రించడం ఉంది. మానవుని ఊహారెక్క విప్పుకున్నప్పుడే కథ పుట్టింది. చెట్టుకొక కథ, పుట్టకో కథ. గుట్టకొక కథగా ప్రతిదానిపై కథ చెప్పడం ఉంది. మాట నేర్పరితనమున్న మనిషి తన చుట్టూ నలుగురిని కూచోబెట్టుకొని ఏదో కథ చెప్పడం కథా వాఙ్మయానికి ప్రథమ దశగా పేర్కొనవచ్చు. చెప్పడంలో నేర్పరితనముంటే చుట్టూ జనం మూగుతారు. మనసుకు హత్తుకుపోయేట్టు కథ చెప్పేవాని చుట్టూ పళ్లగంప చుట్టు చేరినట్టు జనం చేరుతారు. ఇలా మొదలైన కథ జాతి జీవనంలో అంతర్భాగమై మానవ నాగరికతలో లీనమై నాగరికత పెరిగినకొద్దీ అభివృద్ధి చెందుతూ వచ్చింది.

సున్తాహూ గౌర్‌సే అఫ్సానయే హస్తీ
కుచ్ ఖాబ్‌హై కుచ్ అసల్ హై కుచ్ అందాజ్ బయా హై....

సృష్టి కథను సావధానంగా వింటున్నాం. కొంత స్వప్నంగా ఉంది. కొంత యధార్థంగా ఉంది. కొంత కథనకౌశలముంది అంటారు ప్రసిద్ధ ఉర్దూ కవి అస్గర్ గౌండ్వి. అతని మాటల్లో సృష్టే ఒక కథ. మనిషి జీవితమే ఒక కథ. ఇవన్నీ లిఖిత కథకూ వర్తిస్తాయి.

కథ ప్రజాస్వామిక ప్రక్రియ. ప్రజాస్వామిక సంస్కృతి. ప్రపంచమంతటా



అభివృద్ధి చెందుతున్న దశలో వెళ్లిన వచన ప్రక్రియయైన ఈ కథ సామాన్య పాఠకులకు చేరాలి. పాఠకుల దృష్టి కోణంలోంచి కథ రాయబడ్డప్పుడే అది సాధ్యమవుతుంది. అభివృద్ధి చెందిన దేశాల్లో కథ, సాహిత్యం ఆనందం కోసమైతే కావచ్చు కాని మనకు మాత్రం ఏ సాహిత్య ప్రక్రియయైనా ప్రయోజనం కోసమే. ఆనందం కోసమే అయితే కథలు రాయాల్సిన అవసరం లేదు. ఆ కథ పాఠకుల్ని చేరందే ప్రయోజనమెలా నెరవేరుతుంది? అందుకే కథలు కావాలి. పాఠకులను చేరే కథలు కావాలి. పాఠకుల్ని కదిలించే కథలు కావాలి. సంస్కారాన్ని పెంచే కథలు కావాలి. జీవిత వృక్షానికి పూసే కథలు కావాలి. మంచి స్నేహితుడిలా లాలించే కథలు కావాలి. లిఖిత కథకు ఆశు సాంప్రదాయం అద్దితే అది అందర్ని చేరే కథ అవుతుంది. జానపద కథన రీతుల్ని ఎన్నుకొని కథలు రాస్తే అవి అందర్ని చేరే కథలవుతాయి. కొందరి కొరకే అయితే కథలెందుకు? కొందరినే చేరే కథ ప్రబంధ కవిత్వం లాంటిది. అందరినీ చేరే కథ వేమన పద్యం లాంటిది. ఇప్పుడు కథ వేమన పద్యంలా ఉండాలి. ప్రబంధ గద్యంలా కాదు. అప్పుడే కథకు సార్థకత చేకూరుతుంది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 10 నవంబర్ 2003**

# పీడితుల పక్షాన తొలితరం తెలంగాణ కథ

ఇప్పుడు తెలంగాణ తన చరిత్రను తానే పఠించుకుంటుంది. తనను తాను స్మరించుకుంటుంది. తన గురించి తాను తెలుసుకుంటుంది. ఎవరో తోడు వస్తారని ఏదో మేలు చేస్తారని ఎదురు చూడదలుచుకోలేదు తెలంగాణ. ఒకప్పుడు తెలంగాణలో సాహిత్యకారులే లేరన్న అన్యాయపుటారోపణకు సమాధానం చెప్పింది. తెలంగాణలో మాట్లాడేది తెలుగే కాదన్నవారికి తెలంగాణ భాష సొగసులేంటో విస్తృతంగా రాసి చూపించింది. అసలు సిసలైన తెలుగేదో నిరూపించి చూపింది.

తెలంగాణ నుంచి తొలితరంలో కథలే రాలేదన్న తెలంగాణ కథ ఎంత సద్యోయౌవనంతో వచ్చిందో నిరూపించే కథా సంకలనమే 'తెలంగాణ తొలితరం కథలు'. తెలంగాణ తనను తాను తెలుసుకుంటున్న సమయంలో, తన మూలాలను వెతుకుంటున్న సందర్భంలో వచ్చిన అద్భుతమైన కథల సంకలనం ఇది.

డా॥ ముదిగంటి సుజాతారెడ్డి ఎన్నో వ్యవప్రయాసలకోర్చి సంకలనం చేసిన ముప్పై ఐదు మంది కథకుల కథాసంకలనం ఇది. తెలంగాణ నుంచి 1912లోనే తొలి కథ వచ్చినా కథా సాహిత్యం చరిత్రలో అదెక్కడా పేర్కొనబడకపోవడం విచిత్రం. తొలి తెలుగు కథ అచ్చయిన ఆంధ్రభారతిలోనే మాడపాటి హనుమంతరావు రాసిన 'హృదయశల్యం' అనే ఈ కథ అచ్చయింది. ఈ సంకలనం ద్వారా తెలంగాణ కథా సాహిత్యానికి సంబంధించిన ఎన్నో విషయాలు, కోణాలు తెలుసుకునే అవకాశం ఉంది. సురవరం ప్రతాపరెడ్డిగారు రాసిందే మొదటి తెలంగాణ కథ అనడం వల్ల తెలంగాణ కథను దాదాపు ముప్పయ్యేళ్లు వెనుకకు తోసినట్టే, కథకుడిగా, పరిశోధకుడిగా, గొప్ప సాహితీవేత్తగా, తెలంగాణ తొలితరం వైతాళికుడిగా సురవరం ప్రతాపరెడ్డికి గొప్ప పేరున్నా అతడు కథలు రాయడానికి ముందే తెలంగాణ నుంచి చాలా కథలే వచ్చాయన్నది నిజం. ఈ కథల సంకలనాన్ని పరిశీలిస్తే మనకీ విషయం స్పష్టంగా తెలుస్తుంది.

మొదటి తరం నుంచి కూడా తెలంగాణ నుంచి వచ్చిన కథలు ఉబుసుపోకకు రాసిన అల్లాటప్పా కథలు కావని ఈ సంకలనం చూస్తేనే అర్థమవుతుంది. వస్తుశిల్పాల సమన్వయంతో తెలుగుకథ సద్యోయౌవనంతోనే పుట్టిందన్నది వాస్తవం. అలాగే తెలంగాణ కథ కూడా సద్యోయౌవనమే. తెలంగాణ కథ పుట్టుకతోనే వేగంగా పరుగులు



తీసింది. వస్తు సేకరణలో తెలుగుకథ కంటే కూడా ముందుంది. ప్రారంభంలోనే సంస్కరణ, స్త్రీ పక్షపాతియై నిలిచింది. సాధారణంగా ఏ సాహిత్య ప్రక్రియలోనైనా మధ్యతరగతి ముడిసరుకుగా మధ్యతరగతి పాఠకులను దృష్టిలో పెట్టుకుని ముందుకు సాగుతుంది. క్రమక్రమంగా అట్టడుగు జీవితాలను అక్కున చేర్చుకుంటుంది.

కోస్తా ప్రాంతంనుంచి వచ్చిన తెలుగు కథ రా.వి. శాస్త్రి కలం పట్టేంతవరకు మధ్యతరగతిని దాటి పోలేదు. కాని తెలంగాణలో మొదటితరం నుంచే అట్టడుగు విషయాలు కథావస్తువులయ్యాయి. భాష విషయంలోనూ మొదటితరం రచయితలు పాత్రోచిత మాండలికాన్ని వాడారు. కథా నిర్మాణం, ఇతర విషయాలను పరిశీలించినా మొదటి తరం నుంచే మంచి శిల్పంతో కథలు వచ్చాయి. హృదయశల్యం, గొల్ల రామవ్వ, తెలియక ప్రేమ తెలిసి ద్వేషం, సంఘాల పంతులు, నారయ్య బతుకు, అంగుడుపొద్దు, పరిగెలాంటి కథలను చూస్తే ఈ విషయాలు స్పష్టమవుతాయి. అందుకే సద్యోయౌవనయై పుట్టింది తెలంగాణ కథ.

ఈ కథాసంకలనానికి ఆలోచనాత్మకమైన చక్కని ముందు మాటలు రాశారు కె. శ్రీనివాస్, గుడిపాటి. మొదటితరం తెలంగాణకథకు సంబంధించిన అనేక విషయాలు, తెలంగాణ తనను తాను తెలుసుకున్న క్రమం, తెలంగాణ దేవులాట, తెలంగాణ తనమంటేమిటో ఈ కథల్లో కనబడుతుందని శ్రీనివాస్ రాసిన వాక్యాలు అక్షరసత్యాలు.

తెలంగాణ నుంచి మొదటితరంలో మధ్యతరగతి దృక్కోణంలోంచి కథలు రాలేదన్న మాట వాస్తవం. వచ్చినా అతి తక్కువే. అయితే అంతకంటే ముందుకుపోయి తెలంగాణ కథ అట్టడుగు జీవితాల పక్షాన నిలవడం ఈ కథల ప్రత్యేకత. డెబ్బైల వరకు తెలంగాణలో మధ్యతరగతి ఆవిర్భావం జరగలేదు. ఉన్నది ఫ్యూడల్ భూస్వాములు... వాళ్ల భూముల్లో పనిచేసే పాలేర్లు... కూలీలు... పేదరైతులు.... అలాంటప్పుడు మధ్యతరగతి దృక్కోణంలోంచి, మధ్యతరగతి జీవితాల గురించి కథలు వచ్చే అవకాశమెక్కడిది? అందుకే తెలంగాణ కథ నేరుగా ఫ్యూడల్ సంస్కృతి చిత్రణ నుంచి అభ్యుదయం దిక్కు పయనించింది. డెబ్బైల తర్వాత తెలంగాణ నుంచి ఉధృతంగా కథలు రావడం ప్రారంభమైన తర్వాత ఉద్యమ, పోరాట కథలతో పాటు మధ్యతరగతి జీవితాల గురించి, మధ్యతరగతి దృక్కోణంలోంచీ కథలు వచ్చాయి. కథంటే సమకాలీన సామాజిక జీవితాన్ని చిత్రించేదే అయితే తెలంగాణ కథారచయితలు తొలితరం నుండి ఈ తరం వరకూ ఆ దృష్టిని కోల్పోలేదు. అందుకు సాక్ష్యం మొదటితరం కథలకు

ప్రాతినిధ్యం వహించే ఈ సంకలనం.

"ఈ కథలు చదువుతుంటే అరవై ఏళ్ల కిందటి తెలంగాణ జీవితం కళ్ల ముందు దర్శనమిస్తుంది. తెలంగాణ కథ క్రమవికాసం వెనుక ఉన్న చరిత్ర సాక్షాత్కరిస్తుంది. మనం నేర్చుకోవాల్సిన విషయాలెన్నో ఉన్నాయన్న విషయం తెలుస్తుంది" అన్న గుడిపాటి వాక్యాలూ అక్షరసత్యాలే. హైదరాబాద్ ప్రాంతం కథలు రాసిన సురవరం ప్రతాపరెడ్డిలాంటి వాళ్ల కథల్లో అప్పటి తెలుగు ముస్లిం జీవితాల, భాషల మిశ్రమం కనబడుతుంది. గూడూరి సీతారాం, జి. రాములు, సురమౌళిలాంటి కరీంనగర్ జిల్లా ప్రాంత రచయితల రచనల్లో కరీంనగర్ జిల్లా అట్టడుగు జనజీవితాలు, వృత్తులు, భాష దర్శనమిస్తాయి. కాంచనపల్లి, వట్టికోట కథల్లో నల్గొండ, మహబూబ్‌నగర్ జీవితాలను దర్శించవచ్చు.

ఈ సంకలనంలోని రచయితల్లో చాలా మంది అగ్రకులాలకు చెందినవాళ్లే. దళిత, వెనుకబడిన కులాలకు చెందిన రచయితలు అతి తక్కువ. అప్పుడు దళిత, వెనుకబడిన కులాలవారికి చదువుకునే అవకాశాలే మృగ్యమైతే రచయితలయ్యే అవకాశాలెక్కడివి? అయితే ఈ సంపుటిలోని రచయితలు అగ్రకులాలవారే అయినా రాసింది మాత్రం ప్రజాపక్షపాతంతో... వాళ్ల కథల్లో ఉన్నతీకరించింది అధోజగత్సహోదరుల సంస్కృతిని, జీవద్భాష అయిన మాండలికాన్ని లోలోతులకు పోయి అక్షరబద్ధం చేశారు. గొల్ల రామవ్వ కథలో గొల్ల కుర్మ కులం వాళ్లకు కూడా తెలియని ఆచార వ్యవహారాలను పొందుపరిచారు రచయిత. కుర్మదారం కట్టడం, గొల్లబట్ట, చేతికి పోంచులాంటివి ధరించడం లాంటి వాటిని దేన్నీ వదిలిపెట్టలేదు. ఈ కథలో వాడిన భాష ఆ జీవితంతో మమేకమైతే తప్ప రాయడం సాధ్యం కాదు.

ఈ సంకలనంలో రజాకారు పోరాటాల గూర్చి వచ్చిన కథలు లేవు. అందుక్కారణం రజాకారు పోరాటాల గూర్చి తెలంగాణ రచయితలు రాసిన కథలు చాలా తక్కువ. దాదాపు లేవనే చెప్పవచ్చు. వట్టికోట, దాశరథి లాంటి వాళ్లు నవలలు, సుద్దాల హనుమంతు పాటలు రాసినా పెద్దగా కథలు వచ్చిన దాఖలాలు లేవు. తెలంగాణ పోరాట కథల పేరుతో వచ్చిన కథలు ఆ పోరాటాల గూర్చి వచ్చినవి, వార్తాపత్రికల్లో చదివి స్థానికేతరులు రాసినవే. అందుకే ఆ కథలకు స్థలకాలాల చైతన్యం కనబడదు.

ఈ సంకలనానికి సంకలనకర్త డా॥ ముదిగంటి సుజాతారెడ్డి రాసిన నేపథ్యం ప్రతి కథ గురించీ ఎన్నో వివరాలను, విలువైన సమాచారన్ని పొందుపరిచింది. తొలి తరంలో తెలంగాణ రచయితలకు ఆంగ్ల సాహిత్యంతో ఉన్న పరిచయం తక్కువే. తొలితరంలో తమకున్న ఉర్దూ సాహిత్య పరిచయంతోనూ, ప్రేమ్‌చంద్ సాహిత్య



ప్రభావంతోనూ కథలు రాశారు. ప్రేమ్‌చంద్ సాహిత్య పథంలో అభ్యుదయ సాహిత్య సృజన మొదటితరం నుండే చేయడం తెలంగాణ సాహిత్యం ప్రత్యేకత. తెలంగాణ కథ సద్యోయౌవన అవడానికి, అనడానికి మొదటితరంలోనే అభ్యుదయ పథంలో కథలు రావడం కారణం.

ఈ సంకలనంలోని కథలను పరిశీలిస్తే రచయితలు కేవలం కుటుంబ సంబంధాలకో, కాల్పనిక విలువలకో, సెంటిమెంట్లకో కట్టుబడకుండా ప్రజల పక్షాన నిలిచి కథలు రాశారని అర్థమవుతుంది. ఈ ఒరవడే తర్వాతి తరం, ఆ తర్వాతి తరం తెలంగాణ కథా రచయితలకు మార్గదర్శకమైంది. తెలంగాణ రచయితలు వస్తువుకిచ్చిన ప్రాధాన్యం శిల్పానికి ఇవ్వలేదన్న అన్యాయపు వాదన, వివక్షపూరిత ధోరణి తెలంగాణ కథలను లేదా తెలుగుకథలను ఎలా చూడాలన్న దృక్పథంపై ఆధారపడి ఉంటుంది. మధ్యతరగతి దృష్టికోణానికి, మధ్య తరగతి పాఠక దృష్టికీ పరిమితమై చూసేవాళ్లకు ఈ కథల ప్రాముఖ్యతేంటో అర్థం కాదు. అర్థమైనా ఆ దృష్టి కోణాన్ని బయటపెట్టరు. ప్రయోజనం, అట్టడుగు దృష్టికోణం, పాఠకులపై ముద్ర, పాఠక రచయితల మైత్రి దృష్టితో చూడాల్సిన కథల్ని మధ్యతరగతి శిల్ప ప్రమాణాలకే పరిమితం చేయడం సరైంది కాదు. తొలితరం తెలంగాణ కథల్ని చూడాల్సింది ఈ దృష్టికోణంలోంచే.

తెలంగాణ నుంచి సాహిత్యకారులుగా పేరు తెచ్చుకున్నవాళ్లలో చాలామంది కేవలం రాసి ఊరుకున్నవాళ్లు కారు. తెలంగాణ సర్వతోముఖ వికాసానికి ఎనలేని కృషి చేసినవాళ్లే ఎక్కువ. తెలంగాణ వైతాళికులనదగిన మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామి, పి.వి. నరసింహారావు, ఒద్దిరాజు సోదరులు, కాళోజీ నారాయణరావు లాంటివాళ్లంతా రచనలకే పరిమితం కాలేదు. గ్రంథాలయ ఉద్యమాల్లో, ప్రజా పోరాటాల్లో, రజాకారు వ్యతిరేకపోరాటాల్లో, తెలంగాణ సామాజిక వికాసానికి జరిగిన ఉద్యమాల్లో పాలు పంచుకున్నవారే. అందుకే ఈ కథల్లో రచయిత పాఠకమైత్రి కనబడుతుంది. ప్రతి కథలోనూ తెలంగాణ మట్టి పరిమళం గుబాళిస్తుంది. ఈ కథల్లో ఆశుసంప్రదాయ పోకడలు, ప్రాంతీయ ముద్ర దర్శనమిస్తాయి. మొదటితరం తెలంగాణ కథా రచయితల సాహిత్య నిబద్ధత, ప్రయోజనం తర్వాతి తరాల వారికీ మార్గదర్శకమైంది. తెలంగాణ సామాజిక, సాంఘిక చరిత్రను సాహిత్యంలో నిక్షిప్తం చేసే క్రమం ఈ కథా సంకలనంలో కనబడుతుంది. స్వాతంత్ర్యానికి పూర్వం హైదరాబాద్ రాష్ట్రంలోని స్థితిగతులు తెలుసుకోవడానికి, భాషా వికాసాన్ని పునర్మూల్యాంకనం చేసుకోవడానికి ఈ సంకలనమెంతో ఉపయోగపడుతుంది. ఇలా ఇందులోని కథలన్నీ ప్రయోజన దృష్టితో రాయబడినవే.

శిశువు పుట్టగానే అటూ ఇటూ కదుల్తుంది. తర్వాత బోర్లుతుంది. ఆ తర్వాత అంబాడుతుంది. బుడిబుడి నడకలు నడుస్తుంది. ఆ తర్వాత పరుగులు తీస్తుంది. బాల్య, కౌమార దశలను దాటి యవ్వనంలోకి అడుగు పెట్టి సంపూర్ణ రూపాన్ని తీసుకుంటంది. అలాగే సాహిత్యం కూడా క్రమపరిణామం చెంది వికాసం చెందుతుంది. కాని, తెలంగాణ కథ పుట్టుకతోనే యౌవనంతో పుట్టింది. రాచరిక వ్యవస్థ, అందులో నిజాం నిరంకుశ పాలన ఉన్న కాలంలో పుట్టినా పుట్టుకతోనే యౌవన (సద్యోయౌవన) అయింది. సెంటిమెంట్లు, మధ్యతరగతి విలువలను దాటి మొదటితరం కథలే అధోజగత్సహోదరులను అక్కున చేర్చుకొని ప్రజాపక్షపాతియై నిలిచాయి. తొలితరంలోనే స్థానీయత, ఆశు కథా సంప్రదాయం, ప్రజల జీవద్భాషను స్వంతం చేసుకొని ఇతర ప్రాంత కథల కంటే ఎంతో ముందుంది. కాళోజీ, సురవరం, సురమౌళి, పి.వి. నరసింహారావు, వట్టికోటలాంటి వారి కథలను పరిశీలిస్తే ఇవన్నీ స్పష్టమవుతాయి.

తెలంగాణ పోరాట కథల్లో కనబడని ప్రాంతీయ ముద్ర, స్థలకాలాల చైతన్యం తొలితరం తెలంగాణ కథల్లో కనబడుతుంది. కొత్తనాగలి, గొల్ల రామవ్వ, చల్లపులుసు, పరిగెలాంటి అనేక కథల్లో వీటిని గమనించవచ్చు.

శిల్పం విషయంలోనూ ఏకాంశవ్యగ్రత, క్లుప్తత, స్వయం సమగ్రతలతో కూడుకున్న చిన్న కథలు మనకీ సంపుటిలో ఎన్నో ఉన్నాయి. పేరుకు చిన్న కథయినా ఈ కథ ద్వారా ఎంతో లోతయిన విషయాలనూ చెప్పవచ్చునని ఈ కథలు చదివితే తెలుస్తుంది. భాష విషయంలోనూ ముందు వరసలోనే ఉన్నారు తెలంగాణ తొలితరం తెలంగాణ కథకులు. ప్రజల భాషయైన మాండలికం వాడి ముందు తరాల వారికి మార్గదర్శకులయ్యారు. గొల్ల రామవ్వ కథలోని మాండలికం మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. ఇలా భాష, వస్తువు, శిల్పం, ప్రాంతీయ ముద్ర లాంటి ఏ విషయంలో చూసినా తెలంగాణ కథ సద్యోయౌవనమే.

బలహీనవర్గాలు, జాతులు, ప్రాంతాలు తమ మూలాలను వెతుక్కుంటున్న సమయంలో, ఆ క్రమంలో వెలువడిన ఈ కథా సంకలనం ఎంతో చారిత్రక ప్రాధాన్యం సంతరించుకుంది. అష్టకష్టాలు పడి, ఎంతో పరిశోధన చేసి ఈ కథాసంకలనాన్ని వెలువరించిన సుజాతారెడ్డికి తెలంగాణ ఎంతో రుణపడి ఉంది. అరవై యేళ్ల క్రితం తెలంగాణ పరిస్థితులను సాహిత్యాధారాల ద్వారా తెలుసుకుంటానికి 'తెలంగాణ తొలితరం కథలు' సంకలనం ఎంతో ఉపయోగపడుతుంది. ఈ కథాసంకలనాన్ని అడుక్కొని కాకుండా కొనుక్కొని చదివితే మంచిది.

**ఆదివారం వార్త, 22 డిసెంబర్ 2002**



# మా మంచి కథల సంపుటి మాడపాటి 'మల్లికాగుచ్ఛం'

ఆంధ్ర పితామహుడని బిరుదును సార్థకం చేసుకున్న మాడపాటి హనుమంతరావు తెలంగాణ సాంస్కృతిక పునర్జీవనానికి కృషి చేసిన మొదటితరం రచయిత. నైజాం పాలనలో వెనుకబడి వున్న తెలంగాణ పునర్వికాసానికి నిరంతరం కృషి చేసిన వైతాళికుల్లో మాడపాటివారూ ఉన్నారు. తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి ఆధునిక కథ గురజాడ 1910లో రాస్తే తెలంగాణ నుంచి మొదటికథను మాడపాటి 1912లో రాశాడు. 'హృదయశల్యం' అనే ఈ కథ భార్యపై అనుమానంతో హృదయవేదనను అనుభవిస్తున్న భర్త అనుమానాన్ని తీర్చే విషయం అంశంగా గలది. గురజాడ కథ దిద్దుబాటు సంస్కరణ నేపథ్యంతో రాయబడితే మాడపాటి హృదయశల్యం అభ్యుదయ నేపథ్యంతో రాయబడింది. ఈ మొదటి కథను కలుపుకొని పది కథలతో మాడపాటి వారి కథల సంపుటిని ఆంధ్ర సారస్వత పరిషత్ హైదరాబాద్‌వారు 1984లో ప్రచురించారు. ఆ కథల సంపుటే మల్లికాగుచ్ఛం.

తెలంగాణ వైతాళిక రచయిత మాడపాటి వారి కథలను 1915లోనే మల్లికాగుచ్ఛం అనే పేరుతో మచిలీపట్టణంలోని సరస్వతీ నికేతనం వారు ప్రకటించారు. ఇందులో ఏడు కథలున్నాయి. తెలుగునేలపై ఆధునిక కథ అడుగుపెట్టిన ఐదు సంవత్సరాల లోపే తెలంగాణ నుంచి మొదటి కథల సంపుటి రావడం విశేషం. వివిధ కారణాల వల్ల తెలంగాణలో తొలితరంలో ఆధునిక కథా వికాసం కోస్తా ప్రాంతంలో జరిగినంత విస్తృతంగా జరగకున్నా వచ్చిన కథలన్నీ అభ్యుదయ దృక్పథంతో, సామాజిక ప్రయోజన నేపథ్యంతో వచ్చినవే. తెలంగాణ నుంచి వచ్చిన మొట్టమొదటి కథా సంపుటికి మొదటి ముద్రణ పీఠికలో మాడపాటి వారు రాసిన వాక్యాలు గమనించదగ్గవి. అందులో ఉన్న ఏడు కథలు హృదయశల్యం, రాణీ సారంధా, ముసలిదాని యుసురు, నేనే, అగ్ని గుండము, నాడు నీ పంతము నేడు నా పంతము, ఆత్మార్పణము అనేవి.

ఈ కథల గురించి పీఠికలో ఇలా వివరించాడు మాడపాటి –

"ఈ చిన్న పుస్తకమును గురించి రెండు మాటలు చెప్పదలిచి యున్నాను. దీనిలో గల ఏడు కథలలో మొదటిది (హృదయశల్యము), నాల్గవది (నేనే) తప్ప

తక్కినవి ఉర్దూ భాష యందు వ్రాయబడిన కథల యనుసరణములు. వీనిలో నాలుగు కథలు ఆంధ్రభారతి యందును, ఒకటి కృష్ణా పత్రిక యందును, గొంత కాలము క్రింద ప్రకటింపబడి యుండెను. మిగిలిన రెండు కథలనిటీవల వ్రాసితిని.

ఉర్దూ భాషలో బైన చెప్పిన యయిదు కథలను వ్రాసిన కవి ప్రేమచందు అనునతడు. రచనా కౌశలమునందును, ఇతివృత్త నిర్మాణమునందును నితడు ఉత్తర హిందూస్థానమున ఖ్యాతిగాంచినవాడు. అట్టివాని వ్రాతలను దెనిగించు పని నావంటి యల్పజ్ఞుని చేత బడుట వలన మూలములో సారస్వము చెడిపోయి యుండుననుట నిర్వివాదాంశము. కనుక పాఠకులిందలి గుణములు ప్రేమచందునివిగను, దోషములు నావిగను భావింతురు గాక..

నా యీ ప్రథమ గ్రంథం, ఆంధ్ర సోదరుల యాదరము బొందినచో ధన్యుడనయ్యెదను."

ప్రేంచంద్ సాహిత్యంతో తెలంగాణకు తొలితరం నుంచే పరిచయం ఉందనడానికి ఇది చక్కని ఉదాహరణ. అందుకే తొలితరంలో కాని, ఆ తర్వాతి తరంలో కాని తెలంగాణ రచయితలపై ప్రేంచందు అభ్యుదయ సాహత్య ప్రభావం ఉందనడంలో సందేహం లేదు. మాడపాటితో పాటు చాలా మంది తెలంగాణ తొలితరం రచయితలు ప్రేంచంద్ బాటలోనే నడిచారని చెప్పవచ్చు. మల్లికాగుచ్ఛం అనే ఈ కథల సంపుటిలో ఉన్న హృదయ శల్యం, నేను అనే రెండు కథలు కాక మిగతావన్నీ అనుసరణలని అన్నా ఇవి ప్రేమ్‌చంద్ కథలకు అనుసరణలే అయినా తెలంగాణా కథలు అన్నట్టే అనిపిస్తాయి. తెలంగాణ నేల నుంచి వచ్చిన కథలు కావడం ఇందుకు కారణం. తెలంగాణ మట్టికి, ప్రేమ్‌చంద్ కాశీ ప్రాంత గ్రామాలకు మధ్య దగ్గరి పోలికలుండటమే. అందుకే తెలంగాణ రచయితలు తమవాన్ని చేసుకొని హృదయానికి హత్తుకున్నారు. రాణీ సారంధా లాంటి చారిత్రక కథ ఉత్తర భారత చైతన్యంతో రాయబడినదనైనా మిగతా కథల్లో స్థలకాలాల చైతన్యం ఉండటం విశేషం.

మాడపాటివారి మొదటి కథ హృదయశల్యం చారిత్రకాంశం తీసుకొని సాంఘిక విషయాన్ని స్పృశించిన కథ. ఇందులో రాణి రుద్రమదేవి కూడా పాత్ర కావడం, వరంగల్ ప్రాంతాల గ్రామాన్ని తీసుకోవడం గమనించవచ్చు. ఈ కథపై దిద్దుబాటు కథ ప్రభావం ఉన్నట్టనిపించినా స్థలకాలాల చైతన్యంతో వెలువడిన మంచికథే. మొదటితరంలో తెలుగు రచయితలు సంస్కరణోద్యమ ప్రభావంతో రాసినట్టే మాడపాటి వారూ రాశారు. మరికొంత ముందుకు పోయి అభ్యుదయ పంథాను



తెలుగు సాహిత్యానికి అందించారు. ముసలిదాని యుసురు, అగ్ని గుండము, ఆత్మార్పణము లాంటి కథల్లో మానవతా విలువల స్పర్శ కనబడుతుంది.

నేనే అనే కథ ఔనంటే కాదంటూ, కాదంటే ఔనంటూ వాదిస్తూ ప్రగల్భాలు పలికే న్యాయవర్తనలోని పైపై మెరుగులను తెలిపే కథ. నీతివర్తనము, వ్యక్తి శీలము గురించి ఉపన్యాసాలు దంచే న్యాయవాది ఓ అందాలభరిణ తనను కృష్ణాతీరమునకు రమ్మని ఉత్తరం రాస్తే ఎగిరి గంతేస్తాడు. కొత్తకొత్త బట్టలు ధరించి పూలరంగడిలా వెళ్లి ఆమె కోసం ఎదురు తెన్నులు చూస్తాడు. ముసుగు తొలగించుకొని బయటపడ్డ స్త్రీని చూసి నివ్వెరపోతాడు. ఆమె ఆతని భార్యే. ఈ కొంటెతనం చేసినది నువ్వేనా? అంటే నేనే అంటుందామె. భర్తలో మార్పునకు దోహదం చేస్తుందా సంఘటన.

ఎవరికి అనే కథలో తెలంగాణ దొరతనాలు, భూస్వామ్యం, దేవిడీలు, ఫ్యూడల్ సంస్కృతి, జమీందార్లు, ఫ్యూడల్ వ్యవస్థలో దాగి వున్న కాస్త మంచితనం అన్నీ దర్శనమిస్తాయి. జమీందార్లు పన్నుల రూపంలో రైతులపై సాగించే దోపిడీ, నైజాం కాలంలో చిన్న రైతు దుస్థితి, భూస్వాముల దౌర్జన్యాలు, కోర్టుల వ్యవహారాలు వాస్తవికంగా చిత్రించడం జరిగింది. ఆధునిక భావాలు కలిగిన మోహనరావనే యువకుడు జమీందారుదగ్గర శిస్తు వసూళ్లు చేసేవాడుగా ఉంటూ అన్యాయపు వసూళ్లు వద్దని ఉద్యోగం వదలి వెళ్లిపోతాడు. జమీందారు అవసానదశలో నా అనే వాళ్లెవరూ లేక తన పాతజీవితాన్ని నెమరేసుకొని పశ్చాత్తాప పడతాడు. తాను చేసింది ఎంత అన్యాయమో తెలుసుకుంటాడు. ఇన్ని చేసినా తన ఆస్తిని అనుభవించే దిక్కే లేక తాను సంపాదించిందంతా మోహనరావనే ఆ మానవత్వం కలిగిన యువకుడికే చెందాలని చెబుతూ కన్ను మూస్తాడు. తన పాపానికి అదే ప్రయశ్చిత్తమనుకుంటాడు.

విధి ప్రేరణము ఒక చారిత్రక కథ. రాజ్యం కోసం, అధికారం కోసం దాయాదుల మధ్య, అన్నదమ్ముల మధ్య, కుటుంబాల మధ్య రగుల్కొనే పగలను ద్వేషాలను రక్తపాతాలను చిత్రించిన కథ. అనుమానంతో తమ్మునికే విషమిచ్చి చంపిన దుర్మార్గపు రాజనీతి బండారాన్ని తెలియజేసే కథ.

హైదరాబాద్ రాష్ట్రంలో తెలుగు భాషోద్యమాన్ని ఉధృతంగా నడిపించిన మాడపాటి హనుమంతరావుగారు తొలితరం తెలంగాణ తెలుగు కథా రచయితల్లో ఒకరు కావడం విశేషం. సమకాలీన జీవిత చిత్రణతో, స్థలకాలాల చైతన్యంతో కథను నడిపి తెలుగు కథా రచయితల్లో తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు. మల్లికాగుచ్ఛము అనే పేరులో సంప్రదాయవాసనలు కనబడ్డా ఇందులోని కథలన్నీ అభ్యుదయ పంథాలో

సడిచినవే. కథాశిల్పం విషయంలో మాత్రం ఈ కథలు తొలితరం తెలంగాణ కథలు. కోస్తాంధ్ర కథతో పోటీ పడక పోవచ్చు. బ్రిటిషాంధ్ర ప్రాంతం వారికున్న ఆధునిక కథా పరిచయం, ఆంగ్ల సాహిత్యంతో అనుబంధం తెలంగాణ కథకులకు లేదు. తెలంగాణ కథకులకున్న ఉర్దూ, హిందీ సాహిత్యాలతో పరిచయం కోస్తాంధ్ర రచయితలకు లేదు. తొలితరం తెలంగాణ కథల్లోనూ, ఆ తర్వాతి కథల్లోనూ ఆశు సంప్రదాయ లక్షణాలు కనబడతాయి. ఇందుకు చక్కటి ఉదాహరణగా తెలంగాణ నుంచి వచ్చిన మొట్టమొదటి కథల సంపుటి మల్లికా గుచ్ఛాన్ని పేర్కొనవచ్చు. ఈ కథల్లోని భాష సరళంగానే ఉన్నా వాక్య నిర్మాణంలో, పద ప్రయోగంలో ప్రాచీనత, గ్రాంథిక పోకడలు కనబడుతాయి.

దట్స్ తెలుగు డాట్ కామ్
ఏప్రిల్ **30, 2004**



# తెలుగుకథకు దిశానిర్దేశం తెలంగాణా కథ

తెలంగాణా కథలకు కాణాచి. ప్రతి లోగిలీ ఓ కథా కేంద్రమే. అరుగు మీద మొగురాలకొరిగి, వాకిళ్లలో నులక మంచాల్లో కూర్చొని, రచ్చబండ మీద కొలువుదీరి నడుములకు, మోకాళ్లకు పంచెలు గట్టి ఊగుతూ ముచ్చట్లు ముచ్చట్లుగా ఆశుకథలు చెప్పడం తెలంగాణా గ్రామాల్లో గమనించవచ్చు. ఆశుకథే కాక మానవజీవితానికి చేరువైనదైన ఆధునిక కథానిక సామాన్య పాఠకులకందాలన్న విషయాన్ని ముందే గుర్తించారు తెలంగాణా కథకులు. మొదట్నుంచీ తెలంగాణా కథా ఉద్యమాలు ఊపిరిగా వాస్తవికత ప్రాణంగా, స్థానియతా పరిమళంతో తెలుగుకథకు దిశా నిర్దేశం చేస్తూనే ఉంది.

తెలంగాణా నుంచి వచ్చిన మొదటి కథ హృదయశల్యం వరంగల్ ప్రాంత స్థానీయతా పరిమళంతో పరిఢవిల్లి కథల్లో ప్రాంతీయతా ముద్ర కావ్యమై నిలిచింది. ఆ తర్వాత ప్రతి తరంలోనూ కొంతమంది రచయితలు ప్రాంతీయ ముద్రతో కథలు రాసి తమ ప్రాంతజీవితాన్ని కథలకెక్కించారు. మొదటి తరం నుంచే మధ్య తరగతిని ముడిసరుకుగా తీసుకోకుండా మరికొంత ముందుకు పోయి అట్టడుగు జీవితాలను ముడిసరుకుగా ఎన్నుకున్నారు తెలంగాణా రచయితలు. ఒద్దిరాజు సోదరులు, సురవరం ప్రతాపరెడ్డి, కాళోజీ, జి. రాములు, వట్టికోట ఆళ్వారస్వామి, సురమౌళి, గూడూరి సీతారాం, వెల్దుర్తి మాణిక్యరావులాంటి మొదటితరం కథా రచయితలు వేసిన మార్గాన్ని మరింత విశాలం చేశారు తెలంగాణా రచయితలు. ఏ విషయాన్నీ వదిలపెట్టకుండా తెలుగు కథంటే అట్టడుగు వర్గాల కథేనని రాసి చూపించారు. కథను మధ్యతరగతి దృష్టి కోణంలోంచి మాత్రమే చూడాల్సిన అవసరం లేదని, సమాజంలో కిందిస్థాయిలో ఉన్న ప్రజా జీవితాలను వస్తువుగా తీసుకోవాలని ఆ జీవితాలపై విరివిగా కథలు రాసి చూపారు. "మనమూ చరిత్రకెక్క దగినవారమే. ఇప్పుడు కావాల్సింది రాజులు, రాణుల చరిత్రలు కావు. సాంఘిక చరిత్రలు" అన్నారు సురవరం ప్రతాపరెడ్డి. సాహిత్యాధారాల ద్వారా వెయ్యేళ్ల ఆంధ్రుల సాంఘిక చరిత్రను రాసి చూపించిన గొప్ప పరిశోధకుడు. దీన హీన మానవ ప్రజాదృక్పథంతో సురవరం సాంఘిక చరిత్ర కథలు రాసినట్టే తెలంగాణా కథలు రాసి చూపించారు. మొదటితరం కథా రచయితల్లో చాలా మంది అగ్రవర్ణ ఫ్యూడల్ కటుంబాల్లోంచి వచ్చినా ఫ్యూడల్ సంస్కృతిని వ్యతిరేకిస్తూ

ప్రజాపక్షపాతం వహించి రాయడం చెప్పుకోదగ్గ విషయం. మొదటితరం తెలంగాణా రచయితలు వేసిన ప్రజాపక్ష పునాది ఆ తర్వాతి తరాల రచయితలు వ్యాపార రచనల జోలికి పోకుండా ఆపగలిగింది. భూతప్రేత నవలలు ఉధృతంగా వస్తున్న కాలంలోనూ తెలంగాణా నుంచి వ్యాపార నవల రాకపోవడం విశేషం.

ఆశువుగా కథను చెప్పడంలో అద్భుతమైన కథనరీతులున్నాయి. లిఖిత కథకు సంప్రదాయ కథన పద్ధతిని జోడించి కథలనందించిన ఘనత తెలంగాణా రచయితలకే దక్కుతుంది. అట్టడుగు జనాలకు, పోరాట ప్రజలకు కథలు చేరాలంటే ఈ ఆశు సాంప్రదాయ పద్ధతిననుసరించడమే సరైంది. కథను ముచ్చటగా చెప్పే ఈ ఆశుకథన పద్ధతిని తెలుగుకథకందించారు తెలంగాణా కథకులు. ఆశు సాంప్రదాయ కథనంలోని సరళత కథ అతి సామాన్యుడికందేట్టు చేస్తుంది. పి.వి. నరసింహారావు గొల్ల రామవ్వ కథ, సురవరం ప్రతాపరెడ్డి కథలు, 1970 - 90 మధ్య విప్లవ పత్రికల్లో పుంఖానుపుంఖంగా వచ్చిన అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, రఘోత్తమరెడ్డి, బి.ఎస్. రాములు కథల్ని తీసుకున్నా ఈ విషయం స్పష్టమవుతుంది. ఈ సాంప్రదాయాన్ని ఆ తర్వాత ఇతర ప్రాంతాల రచయితలు కొందరు స్వంతం చేసుకొని కథలు రాస్తున్నారు. పాత్రల సంభాషణలతో పాటు, రచయిత కథనాన్ని కూడా పూర్తి మాండలికంలో రాయడం తెలంగాణాలో మొదటితరం నుంచే మొదలయింది. మొదటితరంలో గూడూరి సీతారాం, సురమౌళి లాంటివాళ్లు ఆ పనిచేస్తే ఆ తర్వాత చాలా మంది రచయితలు ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు. తెలంగాణా కథకు ఉద్యమాలు మరో ముఖ్యమైన పాయ. రజాకారు పోరాటాల కాలంలో తెలంగాణా నుంచి వచ్చిన కథలు తక్కువ. సుద్దాల హనుమంతు, దాశరథి కృష్ణమాచార్య కవులుగా, వట్టికోట ఆళ్వారస్వామి, దాశరథి రంగాచార్య నవలాకారులుగా ప్రసిద్ధి పొందారు. పొట్లపల్లి రామారావు, వట్టికోట ఆళ్వారుస్వామి, కాంచినపల్లి చిన వెంకటరామారావు కొన్ని కథలు రాసి ఉద్యమ కథకు స్వాతంత్ర్యానికి ముందే తెలంగాణాలో పునాదులున్నాయని చూపారు. పోరాటకథ విప్లవకథగా పరిణామం చెందడానికి తెలుగుకథకు విప్లవపంథా చూపడానికి డెబ్బై దశకంలో వచ్చిన పోరాట కథలే కారణం. 1970 - 90 తెలుగు సాహిత్యంలో విప్లవకథలు విరివిగా వచ్చిన కాలం. శ్రీకాకుళ రైతాంగ పోరాటాల ప్రభావంతో భూషణం రాసిన కథలతో విప్లవకథ గుర్తింపు పొందినా తెలంగాణా నుంచి పోరాట కథలు వచ్చిన తర్వాతే తెలుగు కథ విప్లవకథగా పరిణామం చెందింది. అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమ రెడ్డి, ఉప్పల నరసింహం, బి. ఎస్. రాములు, యాదగిరి, ఈ



రచయిత, కార్మికలాంటి రచయితలెంతో మంది తెలుగుకథను విప్లవ కథగా తీర్చిదిద్దారు. అంతవరకు అంతగా సాహిత్యంలోకెక్కని సింగరేణి కార్మిక జీవితాలనూ కథలుగా మలిచారు. భూమి, సృష్టికర్తలు, బొగ్గుపొరల్లో, అడవిలో వెన్నెల, భూమిక, కోల్‌బెల్ట్ కథలు, నేలతల్లి విముక్తి కోసం, మా కథలు, రుతుపవనాలు, శ్వేతరాత్రులు, తిరగబడ్డ భూమి కథా సంకలనాలు, సంపుటులు గత ముప్పయ్యేళ్లలో తెలంగాణ జనజీవనంలో వచ్చిన మార్పులను, పోరాట ఫలితాలను అక్షరబద్ధం చేసిన పుస్తకాలు. గిరిజనుల గూర్చి సాహు, బి.ఎస్. రాములు, గోపి భాగ్యలక్ష్మి, దేశపాండే లాంటి రచయితలు కొన్ని కథలు రాశారు. ఏది ఏమైనా తెలుగు కథకు విప్లవ కథా నిర్దేశం చేసింది తెలంగాణా రచయితలే. తెలంగాణా కథకు ప్రధానమైన ముడిసరుకు పల్లె జీవితమే. విప్లవ కథతో పాటు విప్లవేతర కథ కూడా తెలంగాణా నుంచి విరివిగానే వచ్చింది. తెలంగాణా కథకు విప్లవకథ ముఖ్యమైన పాయే అయినా అదే మొత్తం అనుకోవడం వల్ల జరిగిన నష్టం పూడ్చలేనిదే. గ్రామీణ జీవితం, వృత్తుల పతనం, వలసలు, మానవ సంబంధాల విచ్ఛేదం, గ్రామీణ స్త్రీలు, రైతులు, దళిత బహుజనుల గూర్చి తెలంగాణా నుంచి గణనీయమైన సంఖ్యలో మంచి కథలే వచ్చాయి. పరిమిత జీవితాలను మాత్రమే కాకుండా విస్తృతమైన పరిధిలో కథలు రాసిన వాళ్లున్నారు. ప్రేమ్‌చంద్, టాల్‌స్టాయిల్లా తమ ప్రాంత జీవితాన్ని అన్ని కోణాల్లోంచి చిత్రించారు. దేశవ్యాప్తంగా తొంబై దశకంలో వచ్చిన కులచైతన్యాన్ని ప్రేరణగా తీసుకొని బహుజన కథను ముందు తీసికెళ్లింది తెలంగాణా రచయితలే. సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు కథలకెక్కింది ఆ కాలంలోనే. తెలుగు సాహిత్యంలో బహుజనిజం వేళ్లూనుకొని పనిమంతులైన బహుజనులపై విరివిగా కథలు రావడానికి తెలంగాణా రచయితల కథలెంతో మందికి స్ఫూర్తినిచ్చాయి. ఊరుమ్మడి బతుకులు, నిర్ణయం, కక్రోడు, బందీ, స్మృతి లాంటి అనేక కథలు బహుజన కథను ముందుకు తీసికెళ్లాయి. తెలంగాణా మాండలిక రచనలు పోరాట కథలు విరివిగా వచ్చినప్పుడు దృష్టి మరల్చడానికి ప్రయత్నించినట్టే దళిత బహుజన కథలు విరివిగా వచ్చినప్పుడూ అనేక పేర్ల మీద దృష్టి మరల్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఏదేమైనా చాలా సందర్భాల్లో తెలుగు కథకు దిశానిర్దేశం చేస్తూ ముందుకు పోతుంది తెలంగాణా కథ.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 7 జులై 2003**

# పోరాటాల్లో పెరిగిన కథ

రజాకారు కాలంనాటి తెలంగాణా పోరాటాల కాలంలోనూ, డెబ్భైలలో ప్రారంభమైన భూపోరాటాల కాలంలోనూ తెలంగాణా నుంచి పోరాట సాహిత్యం విరివిగానే వచ్చింది. తెలంగాణా కథంటే పోరాట కథ మాత్రమే కాకున్నా తెలంగాణా కథకు పోరాట పార్శ్వం ముఖ్యమైన భాగమే. మొదటితరంలో తెలంగాణా నుంచి విరివిగ కథలు రాకున్నా వచ్చిన కథలన్నీ ఓ స్పష్టమైన ప్రాపంచిక దృక్పథాన్ని దృష్టిలో పెట్టుకొని రాసినవే. తెలంగాణా పోరాట కథలు పోరాటాలు జరుగుతున్న కాలంలోనూ, ఆ సమీప కాలంలోనూ వచ్చాయి.

ఈ కథలు వస్తున్న కాలంలో తెలంగాణా ఫ్యూడల్ ప్రభువు నిజాం పాలనుండేది. కోస్తా ప్రాంతంలో ఆంగ్లేయ విద్యవల్ల ప్రవేశించిన ఆధునికత కూడా తెలంగాణాలో చోటు చేసుకోలేదు. మిగతా కాలంలో నైజాం పాలన సంగతెలా ఉన్నా చివరి దశలోని రజాకార్ల విజృంభన కాలం మాత్రం తెలంగాణాకు అంధకారం లాంటిదే. ఈ పరిస్థితులన్నింటినీ తెలంగాణా పోరాటకథల్లో పొందుపరిచారు రచయితలు.

ఫ్యూడల్ ప్రభువు నిజాం పాలనను వ్యతిరేకిస్తూ ఆ కాలంలో తెలంగాణా ప్రజల స్థితిగతులను చిత్రిస్తూ సురవరం ప్రతాపరెడ్డి, దాశరథి రంగాచార్య, కాళోజీ, సురమౌళి లాంటివాళ్లు కథలు, నవలలు రాశారు.

తెలంగాణా పోరాటంలోని వివిధ దశలను, తెలంగాణా పోరాటాల సమయంలో తెలంగాణా పరిస్థితులను, రజాకారు దురంతాలను, ఊళ్లో రజాకార్ల, నిజాం తాబేదార్లుగా పని చేస్తున్న దొరల దౌర్జన్యాలను చిత్రిస్తూ తెలంగాణా పోరాట కథలు వచ్చాయి. నైజాం పాలనలో తెలంగాణా ప్రజల బానిస బతుకులు, దేశ్‌ముఖ్ జాగీర్దార్ల దౌర్జన్యాలు, ప్రభుత్వోద్యోగుల నిరంకుశత్వం, ప్రజల వెట్టి బతుకు, గ్రామాల్లోని ఫ్యూడల్ సంస్కృతిపై ప్రజల తిరుగుబాటు గూర్చి, డెబ్భైకిపైగా కథలొచ్చినట్టు అంచనా. అందులోంచి ఇరవై మూడు కథలనేరి తెలంగాణా పోరాట కథలు పేరుతో జనసాహితీ సాంస్కృతి సమాఖ్య వారు 1982లో సంకలనం వేశారు.

ఇందులో రహీంబాయ్ (పి. వెంకటేశ్వరరావు), న్యాయం (పొట్లపల్లి రామారావు), మన వూళ్లో కూడానా (కాంచినపల్లి చినవెంకటరామారావు), సంఘం చిట్టీ (పి. వెంకటేశ్వరరావు), చిన్నప్పుడే (వట్టికోట ఆళ్వారుస్వామి), ఊరేగింపులు



(ఆవుల పిచ్చయ్య), పన్నులు ఇవ్వం (పర్సా దుర్గారావు), నోటీసు (సి.వి. కృష్ణారావు), కొత్త వార్త (శారద), నవజ్యోతి (ప్రయాగ), గెరిల్లా గోవిందు (శారద), సంధిలేదు (తెన్నేటి సూరి), మీరు గెలుస్తారు (తుమ్మల వెంకట్రామయ్య), వడిశల (పర్సా దుర్గా ప్రసాదరావు), విముక్తి (అట్లూరి పిచ్చేశ్వరరావు), మహాశక్తి (లక్ష్మీకాంత మోహన్), మత్తానయ్య మరణం (రాంషా), పాగల్ ఎల్లమంద (కిరణ్), ఆయువుపట్టు (బి.ఎన్.రెడ్డి), జీవకారుణ్య చర్య (యు. వెంకట్రావ్), పెళ్లి చేసారు (తుమ్మల వెంకట్రామయ్య), గెరిల్లా (ఉప్పల లక్ష్మణరావు) కథలున్నాయి. ఈ కథలన్నీ రజాకారు వ్యతిరేక పోరాటాలు జరుపుతున్న పోరాట యోధుల చర్యలను సమర్థించేవే. పోరాటాలు విజయవంతం కావాలని కోరుకొనేవే. సంఘాలుగా ఏర్పడి వాళ్లనెదిరించడం, గెరిల్లా పోరాటాలు చేయడం, రహస్య జీవితం గడుపుతూ ప్రజల కండదండగా ఉండటం, గోడలకు నోటీసులంటించి రజాకార్ల మనోనిబ్బరాన్ని దెబ్బ తీయడం, వాళ్ల పాలన నుండి బయటపడడమే విముక్తిగా భావించడం, శత్రువు ఆయువుపట్టు మీద కొట్టడం, నైజాం చంచాల దుర్మార్గాన్ని బట్టబయలు చేయడం, ఊరేగింపుల యొక్క ప్రాముఖ్యత, ఊరూరుకు పోరాట వీరులు ప్రవేశించడం లాంటి పోరాటంలోని అనేక అంశాలను అక్షరీకరించిన చక్కని కథలు.

గుండెనెత్తురులొలికించిన పోరాటానికి ప్రతిస్పందనలు అనే శీర్షికతో తెలంగాణా పోరాటకథలకు ముందుమాట రాసిన నవీన్ వాక్యాలు పేర్కొనదగినవి.

భూమికోసం, భుక్తి కోసం సాగే రైతుల పోరాటం అనంత జీవిత సంగ్రామం (శ్రీశ్రీ). ఆ సంగ్రామానికి తొలిమెట్టు తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం – దాస్య శృంఖలాలో మ్రగ్గిపోతున్న పుడమితల్లి చెర విడిపించేందుకు అనేకమంది జీవితార్పణలతో జరిగిన పోరాటం అది. భారత విప్లవానికే వేగుచుక్క ఆ పోరాటం. అలాగే నాటి సాహితీ సాంస్కృతికోద్యమం కూడా.... ఆ పోరాటాలకు త్యాగాలకు ప్రతిబింబం నాటి సాహిత్యం. నైజాం క్రూర నిర్బంధం మొదలు, జాగీర్దారుల దేశ్‌ముఖ్‌ల దౌర్జన్యాలు, యూనియన్ సైన్యాల ఘాతుకాల వరకు సాహిత్యం తడమని అంశం లేదు. ప్రతి సంఘటనా కావ్యవస్తువే. ఏ విధంగా పోరాటానికి భూమి ఇరుసుగా ఉందో అలాగే సాహిత్యానికి కూడా ఇరుసు భూమి. ఆ భూమి చుట్టూ, ఆ భూమి కోసం జరిగే పోరాటాల చుట్టూ తిరుగుతూ ఉంటుంది సాహిత్యం మొత్తం. సాహిత్యంలోని అన్ని ప్రక్రియలు పోరాట వస్తువుతో అరుణకాంతులు విరజిమ్మాయి. కథ, నవల, పాట... అన్నీ ప్రజల దగ్గరకు చేరాయి. వారి జీవితపు లోతులను తడిమాయి.

దొరల దౌర్జన్యాలను, అధికారుల దౌర్జన్యాలను, రజాకార్ల దుష్కృత్యాలను, పోరాటంలో స్త్రీపురుషులన్న తేడా లేకుండా చూపిని తెగువను, పోరాట దశలను, ప్రజల త్యాగనిరతిని, పోరాటాల్లో ప్రజల భాగస్వామ్యాన్ని ఎంతో అవగాహనతో చిత్రించిన ఈ కథలు పోరాట కథా సాహిత్యంలో ఆణిముత్యాలే.

అయితే రజాకారు పోరాటాల కాలంలో వచ్చిన కథల్లో చాలా కథలు తెలంగాణా పోరాటం గూర్చి తెలంగాణా ప్రాంతేతరులు రాసినవే. శ్రీకాకుళం పోరాటాల గూర్చి రాయలసీమ వాళ్లో, తెలంగాణావాళ్లో రాస్తే ఎలా వుంటుందో ఈ కథలూ అలాగే వున్నాయి. అనుభవాల్లోంచి, చుట్టూ జరుగుతున్న సంఘటనల్లోంచి వస్తువును తీసుకొని కథలు రాస్తే ఉండే ఆర్ద్రత ఈ కథల్లో లేదు. ఈ కథలన్నీ నిజాయితీతో రాయబడిన కథలే అయినా వార్తాపత్రికల్లో వార్తలను చూసి, విన్న విషయాలను గూర్చి తెలుసుకున్న సంగతుల గూర్చి రాసినవే. అందువల్ల ఈ కథలకు స్థలకాలాల చైతన్యం లేదు. ఇవి కథలుగా గొప్ప కథలు కాకపోవచ్చు. కాని తెలంగాణా పోరాటాలకు ప్రతిస్పందనలు. అప్పటి పోరాటాలను చిత్రించిన కథలుగా వీటికి సాహిత్యలోకంలో స్థానం ఎప్పటికీ సుస్థిరంగానే ఉంటుంది. పోరాట ప్రాంతంలో ఉంటున్నవాళ్లకు ఆ సమయంలో వార్తాపత్రికలు చదివే అవకాశం కూడా లేనందువల్ల కఠిన నిబంధనలు, నిర్బంధాలు ఉండటం వల్ల కథలు రాసే అవకాశం లేదు - రాయలేకపోయారు. అప్పుడే తెలంగాణా నుంచి పోరాట ప్రతిస్పందనగా అనుభవాల్లోంచి విస్తృతంగా కథలొస్తే తెలంగాణా కథ మరింత పరిపుష్టమయ్యేది. డెబ్బైల తర్వాత వచ్చిన పోరాటకథలు ఆ లోటును పూరించాయి. ప్రాంతీయతా ముద్రతో, స్థలకాలాల చైతన్యంతో వచ్చిన ఈ కథలు తెలంగాణా భూపోరాటాల గూర్చి తెలంగాణా రచయితలు రాసిన అద్భుతమైన కథలు. ఇవి తెలుగుకథకు విప్లవ కథా మార్గ నిర్దేశం చేశాయి.

సాహిత. ఆంధ్రభూమి దినపత్రిక, 21 జులై 2003



# కథ ఎలాంటి భాషలో ఉండాలి

రచన ఏ భాషలో రాయాలి? సృజనాత్మక ప్రక్రియలైన కథ, నవలల్లో ఉపయోగించే భాష ఎలా ఉండాలి? ప్రజల భాషయైన మాండలికం వాడాలా? పొడిపొడి భాషయైన వ్యావహారికంలో రాయాలా? ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పడమంటే సాహిత్యం ఎందు కోసం? సాహిత్య ప్రయోజనం ఆనందమా? ఉపదేశమా? అన్న ప్రశ్నలకూ సమాధానాలు చెప్పడమవుతుంది. అవును కథ ఖచ్చితంగా ఎవరి గురించయితే రాస్తున్నామో వాళ్ల భాషలో ఉంటేనే మంచిది. ఆ భాషే మాండలికం. అది ప్రజల భాష. మన తల్లి భాష.. మన తండ్రి భాష. మనవాళ్లందరి భాష. మరి వాళ్ల భాషలో రాస్తే తప్పేంటి? కత వ్యావహారికంలో మాత్రమే ఉండాలనడమంటే సాహిత్య ప్రయోజనం కేవలం ఆనందం అని చెప్పినట్టే. సాహిత్యం చదవడం టీవీ చూడడం, సినిమా చూడటంలా ఆనందం కోసమో, సమయం గడపడం కోసమో అని ఒప్పుకోవడమన్నట్టే. అభివృద్ధి చెందినయని చెప్పబడుతున్న దేశాల్లో సాహిత్య ప్రయోజనం ఆనందమైతే కావచ్చు కాని మనదేశంలో మాత్రం కాదు. ఎన్నో సమస్యలతో కులాలుగా, వర్గాలుగా, ప్రాంతాలుగా, భాషలుగా, ఆర్థిక ఇబ్బందుల్లో విభజింపబడి వున్న సమాజంలో సాహిత్యం నిర్వహించాల్సిన పాత్ర చాలా ఉంది. ప్రజలను చైతన్యవంతులను చేసి, ప్రజాస్వామిక, శ్రామిక సంస్కృతిని ఏర్పరచవలసి ఉంది. అలాంటప్పుడు ఆయా ప్రజల భాషలో విరివిగా సాహిత్యం రావాలి.

మాండలికం అర్థం కాదనడం అప్రజాస్వామికమే అవుతుంది. అర్థం కాకపోవడానికందులో ఏముంది? మనమా ప్రజలను ప్రేమిస్తే ఆ భాషను అర్థం చేసుకోవడంలో ఏ ఇబ్బందీ ఉండదు. సాహిత్యం ద్వారా జీవితాన్ని, ఆయా ప్రాంత ప్రజల సంస్కృతిని తెలుసుకోవాలనుకుంటే ఆ ప్రజలను హృదయానికి హత్తుకోవాలనుకుంటే మాండలికం సులభంగానే అర్థమవుతుంది. మొదట్లో చదవడానికి కొంత ఇబ్బంది అనిపించవచ్చు. కాని ఏ మాత్రం కష్టపడకుండా టైమ్‌పాస్ కోసం చదవడమనుకుంటే అది ఇబ్బందే మరి. ఏ మాత్రం కష్టపడకుండానే అన్నీ సమకూరాలనుకోవడం లాంటిదే ఇది. విశ్రాంతి వర్గ సంస్కృతిని ప్రోత్సహించడమే ఇది. మాండలికం అర్థం కాదంటే ప్రపంచవ్యాప్తంగా వచ్చిన అద్భుతమైన సాహిత్యం, తద్వారా జీవితం అర్థం కానట్టే. మొదట్లో కొంత కష్టపడితే మాండలికం తప్ప ఇతరులను చదవాలనిపించదు.

మాండలికంలో రాసి, మాండలిక భాషనుపయోగించి అద్భుతమైన ప్రయోజనాలు పొందినవారున్నారు. ఇది ఈనాటిది కాదు. ప్రాకృతం సంస్కృతానికి మాండలికం లాంటిదే. గుణాఢ్యుడు రాసిందీ భాషలోనే. బౌద్ధ మత ప్రచారానికి ప్రజల భాషనుపయోగించి అద్భుతమైన ప్రయోజనం పొందారు. మాండలికంలో ఓ అద్భుతమైన లయ ఉంటుంది. నాద సౌందర్యముంటుంది. అలాంటి లయబద్ధమైన భాషలో రాస్తే ఆ కథకు అపూర్వ సౌందర్యమొస్తుంది. రావిశాస్త్రి కథలకు అంత బలం, ప్రజాదరణ రావడానికి కారణం ఆ భాషలో ఉన్న లయ, బలమే కారణం. హిందీ సాహిత్యంలో భోజ్‌పురి భాషలో రాసిన సాహిత్యానికున్న ప్రజాదరణ ఇతర సాహిత్యానికి లేదు. కరుణకుమార కథలు ప్రజాకథలు కావడానికి అతడు రాయలసీమ మాండలికాన్ని హృదయానికి హత్తుకోవడమే కారణం. మాగోఖలే గుంటూరు ప్రజా భాషను స్వంతం చేసుకున్నాడు కనుకనే పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. గురజాడ తన కన్యాశుల్కాన్ని పొడిపొడి వ్యావహారికంలో రాసుంటే శాశ్వతత్వాన్ని సంపాదించుకునేది కాదు. జనాన్ని చేరి ఉండేది కాదు. ఇప్పుడు వివిధ ప్రాంతాల నుంచి రాస్తున్న రచయితలు జీవద్భాషయైన మాండలికాన్ని ఎన్నుకొని రాస్తున్నారు. కాబట్టే మంచి కథలొస్తున్నాయి. అట్టడుగు కులాలు, వర్గాల్లోంచి రచయితలు రావడం వాళ్ల భాషను స్వంతం చేసుకొని రాయడం వల్ల కథకు అట్టడుగు జీవిత భాషా పరిమళమబ్బి వైవిధ్యపూరితమైన కథలొస్తున్నాయి. తెలంగాణా నుంచి మొదట్నుంచీ మాండలికంలో కథలొస్తున్నా ఇటీవలి కాలంలో ఎక్కువ మంది ఈ భాషను స్వంతం చేసుకొని రాయడం చెప్పుకోదగ్గ విషయం. అయితే కొందరు మాండలికం కోసం మాండలికమన్నట్టు రాయడం వల్ల, పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్టు రాస్తుండటం వల్ల కొన్ని ఇబ్బందులెదురవుతున్నాయి. మాండలిక జీవితాన్ని ప్రజలను ప్రేమించకుండా ఆ ప్రజలతో జీవితంతో మమేకం కాకుండా అందులో రాసి మెప్పించడం కష్టం. ఈ విషయాన్ని గుర్తుంచుకొని రాస్తే మంచి మాండలిక రచనలొచ్చే అవకాశం ఉంది. అలా రాస్తున్నవాళ్లూ ఉన్నారు.

ఎవరి గురించయితే రాస్తున్నామో ఎవరి కొరకయితే రాస్తున్నామో వాళ్ల భాషలో, వాళ్ల యాసలో రాయడం అవసరం. కథ సృజనాత్మక ప్రక్రియ. అందులోని భాష కూడా అలాగే ఉండాలి. ఏ పాత్ర నిజజీవితంలో ఎలా మాట్లాడుతుందో అలా మాట్లాడించడమే మంచిది. అయితే మాండలికంలోనూ కాల్పనికతకు చోటిచ్చే వాళ్లున్నారు. దాని వల్ల కూడా కొన్ని ఇబ్బందులున్నాయి. పాత్రల చైతన్య స్థాయిని



మించిన సంభాషణలు, భాష కథకు ప్రాణభూతమైన వాస్తవికతను దెబ్బ తీస్తాయి. కథ ఫలానా విధంగానే ఉండాలి. ఫలానా భాషలోనే రాయాలని శాసించడం నిరంకుశత్వమే అవుతుంది. రచయిత సర్వస్వతంత్రుడు. రచన ఎలా రాస్తే, ఏ భాషను ఏ మేరకు ఉపయోగిస్తే పాఠకులకు చేరుతుందో, తానాశించిన ప్రభావాన్ని కలిగిస్తుందో అతడే నిర్ణయించుకుంటాడు. కథకు తీసుకున్న వస్తువును బట్టి, ఉద్దేశించిన పాఠకులను బట్టి, జీవితాన్ని బట్టి మూడు రకాలుగా రాయొచ్చు. కథలోని పాత్రలు, జీవితం మాండలికమైనవి కాకుండా సాధారణమైనవి అయినప్పుడు మొత్తం కథను వ్యావహారికంలో రాయొచ్చు. తీసుకున్న జీవితం, పాత్రలు మొత్తంగా మాండలిక ప్రధానమైనవైతే, మాండలికంలోనే రాయాలి. ఈ రెండింటికి మధ్యరకంగా ఉండి కథనం వ్యావహారికంలో రాయడం బాగుంటుందనుకుంటే రచయిత కథనం, వర్ణనలు మొదలైనవి వ్యావహారికంలో, పాత్రల సంభాషణలు మాండలికంలో రాయొచ్చు. దీనినే పాత్రోచిత మాండలికంలో రాయడమంటారు. ఎలా రాస్తే కథ రక్తి కడుతుంది? పాఠకులను చేరుతుందనేది రచయిత మథనపడి బాగా ఆలోచించి నిర్ణయించుకుంటాడు. కాని ఫలానా విధంగానే రాయాలనడం సరైంది కాదు. చాలా కథలు మూడవ పద్ధతిలో వచ్చినా తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల నుండి పూర్తిగా మాండలికంలో వచ్చిన కథలు మంచి కథలయ్యాయి. పచ్చనాకు సాక్షిగా, తెలంగాణా మట్టి కతలు, చల్నేదో బాలకిషన్ లాంటి మాండలిక శీర్షికలు మంచి ప్రభావాన్ని చూపాయి. పాఠకుల ఆదరణా పొందాయి. పాత్రల సంభాషణతో పాటు రచయిత కథనం కూడా మాండలికంలో ఉంటే దాన్ని మాండలిక రచనని తక్కువ చేయడం గ్రామ్యంబు కవిత్వ భాష కాదని చిన్నయసూరి చెప్పడం లాంటిదే.

నిజానికి ప్రజల భాషను గ్రామ్యమనో, మాండలికమనో అనడం సరైంది కాదు. అది జీవద్భాష. ప్రజల నాలుకల మీద నడయాడే సజీవ భాష. గ్రాంథికం, వ్యావహారికం లాంటి భాషలు నిరంతరం నిలువ వుండే చెరువునీళ్ల లాంటివైతే, మాండలికం గలగలపారే సెలయేరు నీరులాంటి స్వచ్ఛమైన భాష. ప్రజల అసలైన భాష ఇదే. జీవద్భాషలో బాగా రచనలొచ్చినప్పుడు, వాళ్ల నుండి విరివిగా రచనలొచ్చినప్పుడు వివాదాలు లేవదీయడం, చులకన చేయడం శోచనీయం. ఏదేమైనా ప్రజల జీవద్భాషను స్వంతం చేసుకొని పీడిత జన సంస్కృతిని జీవితాన్ని ఉన్నతీకరిస్తూ వచ్చే కథలే నేటి సామాజికావసరం. ఆ దిశగా తెలంగాణా కథ తెలుగు కథ పయనిస్తుందనడంలో సందేహం లేదు.

**దట్స్ తెలుగు డాట్ కామ్, 4 ఫిబ్రవరి 2005**

# ప్రాంతీయతను విస్మరించిన మలితరం

మొదటి తరంలో తెలంగాణా నుంచి మంచి రచనలే వచ్చాయి. తెలంగాణాకు స్వాభావిక గుణమైన వ్యాపార మసాలాల జోలికి పోకపోవడం మొదటి తరం నుంచే మొదలయింది. ప్రాంతీయం కాని విశ్వజనీన సాహిత్యం ఉండదన్న విషయం ఈ రచయితలు, చాలా మంది తెలంగాణా రచయితలు గుర్తించారు. ఏ గొప్ప రచయితనైనా ఏదో ఓ ప్రాంతానికి చెందిన ముద్రతో విశ్వజనీనతను సంతరించుకున్నదే కాని ఆకాశం నుంచి ఊడిపడింది కాదు. ఈ విషయాలను గుర్తించే మొదటితరం తెలంగాణా కథా రచయితలు ప్రాంతీయ ముద్రతో రచనలు సాగించారు. దానికి తోడు ప్రజల భాషయైన మాండలికాన్ని స్వంతం చేసుకున్నారు. కొందరు ప్రారంభదశలో శిష్ట వ్యావహారికం, కొంత గ్రాంథికం వాడినా వస్తువు విషయంలో, స్థలకాలాల చైతన్యం విషయంలో మాత్రం తప్పటడుగులు వేయలేదు. సురవరం ప్రతాపరెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచార్య, గూడూరి సీతారాం, కాంచనపల్లిలాంటివాళ్ల రచనలకు హైదరాబాద్, తెలంగాణాలోని ఆయా ప్రాంతాల ముద్ర స్పష్టంగా కనబడుతుంది. అంటే మొదటితరంలో చాలామంది నేటివిటీ ముద్రతో, ప్రజల భాషనెన్నుకొని రాశారు. తెలంగాణా నుంచి కవులే లేరు కథకులే లేరన్న సమయంలోనే ఇక్కడి నుంచి మంచి సాహిత్యం రావడం గమనించవచ్చు. మొదటితరం రచయితలకు రచయితలుగానూ, తెలంగాణా వికాసానికి కృషి చేసినవారుగానూ పేరు ప్రఖ్యాతులూ వచ్చాయి. ఈ తరంలోని కథా రచయితలెవరూ సినిమాల జోలికి పోలేదు. వ్యాపార వాసనలంటనీయలేదు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత పత్రికల సంఖ్య పెరిగింది. ప్రామాణిక భాషలో రాయాలన్న వాదమూ మొదలైంది. ఇంతకు పూర్వం కంటే రాస్తే ప్రచురించే అవకాశాలూ పెరిగాయి. అంతకు ముందున్న పత్రిక విలువలకూ ఆ తర్వాతి విలువలకూ కొంత అంతరమేర్పడింది. తెలంగాణాలోనైనా కోస్తాలోనైనా ఓ దృక్పథంతో స్వాతంత్ర్య కాంక్షతో, ప్రజలపక్షం నిలవాలన్న ఆకాంక్షతో నడుపబడిన పత్రికలు కొంత వ్యాపారంలో పడ్డాయి. అందువల్ల రచనలకూ కొంత వ్యాపారం వాసలంటుకున్నాయి. అందుకే డిటెక్టివ్ నవలలు, ఆరడుగుల హీరోల, పడవల్లాంటి కార్లలో వచ్చే హీరోయిన్ల ప్రేమ నవలలు రావడం మొదలైంది. సీరియస్ సాహిత్యం



రాసేవాళ్లు రాస్తూనే ఉన్నా డిటెక్టివ్, అంబడిపూడి, యద్దనపూడి మార్క్ సాహిత్యం జోరు పెరిగింది. ఈ కాలం తెలంగాణా కథా చరిత్రకు కొంతవరకు అంధకార యుగమనే చెప్పవచ్చు. ఈ కాలంలో ఆ ఉధృతికి తట్టుకొని నిలబడినవాళ్లు తక్కువ. ఆ నిలబడిన ఒక్కరిద్దరూ ప్రధానంగా నవలలనాశ్రయించారు.

ఈ తరంలోనూ తెలంగాణా నుంచి వ్యాపారం సాహిత్యం రాని మాట నిజమే. కాని ప్రాంతీయ ముద్ర గల సాహిత్యమంతగా లేదు. యద్దనపూడి అవాస్తవిక ప్రేమ గాథల నవలల జోరులో వీళ్లు ఏం చేయాలో నిర్ణయించుకోలేకపోయారు. ఏం రాయాలో అర్థం చేసుకోలేకపోయారు. తమదైన ముద్రగల తమ పూర్వీకుల పరంపరను ముందుకు తీసుకుపోదామన్న ఆలోచన వీళ్లకు రాలేదు. అందుకే వీరు కొంత నేల విడిచి సాము చేశారు. అలా చేస్తేనే ప్రచురిస్తారన్న ధీమాలో పడ్డారు. కొంత వ్యాపార సాహిత్యం జోలికి పోబోయి బోల్తా పడ్డారు. తమ సమయాన్ని శక్తిని వృధా చేసుకున్నారు. ఈ తరంలోనూ కొందరు ఇలాంటి ప్రయత్నమే చేసి అలసిపోయారు. నిజాలను తెలుసుకుంటున్నారు.

మలితరం రచయితలు అటు యద్దనపూడిలాగానో, డిటెక్టివ్ సాహిత్య సృష్టికర్తలలాగానో, ఆ తర్వాత వచ్చిన యండమూరిలాగానో సాహిత్య ట్రెండ్‌ను సృష్టించేంత సామర్థ్యమున్నవాళ్లు కారు. అందుకోసం ఏం చేయాలో తెలియని పరిస్థితుల్లో కొట్టుకున్నారు. కోస్తా ప్రాంతం నుంచి విరివిగా వస్తున్న రచనల్లాగా రాసి పేరు సంపాదించాలన్న తపన. వాళ్లలాగా ప్రామాణిక భాషనబడే భాషలో రాయాలన్న కోర్కె కాని తెలంగాణా నుంచి వచ్చిన సహజ స్వభావం వాళ్లను పూర్తిగా వ్యాపారమయం కానీయలేదు. అందుకే అటూ ఇటూ కాని మధ్యేమార్గాన్నెన్నుకున్నారు. నవలలు జోరుగా వస్తున్న కాలం కాబట్టి నవలా ప్రక్రియనెన్నుకున్నారు. మాండలికంలో రాస్తే చదువుతారో లేదో అనే భయంతోనూ, తాము చదువుతున్న నవలలు ప్రామాణిక భాషలోనే వస్తున్నాయన్న భ్రమతోనూ, వాళ్లలాగే పెద్దవాళ్ల సాహితీ కులంలో కలిసిపోవాలన్న కాంక్షతోనూ మాండలికాన్ని వదిలిపెట్టారు. తమ సాహిత్యానికి వస్తువుగా అర్బన్ జీవితాన్ని తీసుకున్నారు. ఏం పంచాయతీ లేకుండా విద్యార్థులను తీసుకున్నారు. కాలేజీ జీవితాలను తీసుకున్నారు. ఆరడుగులకు కొంచెం తక్కువైన హీరోల ప్రేమకథలు తీసుకున్నారు. నవలలు వడ్డించారు. ప్రయోగాలు చేయబోయారు. అందుకే ఆ కాలంలో ప్రాంతీయతా ముద్రతో, ప్రజల జీవద్భాషా ప్రయోగంతో వచ్చిన రచనలు తక్కువ.. నవీన్ నవలలు, కథలు రాసినా, తాడిగిరి పోతరాజు జైలు

కథలనెన్నుకున్నా, మలయశ్రీ రాసిన నవలలైనా ఈ కారణంతోనే. దిగంబర సాహిత్యోద్యమ ఊపు, విప్లవ సాహిత్యోద్యమ జోరు తెలుగు సమాజంపై పడేదాకా తెలంగాణాలో ఈ స్థితే కొనసాగింది. ఈ కాలంలో ప్రాంతీయతా ముద్రతో జీవద్భాషా పరిమళంతో విరివిగా కథలొచ్చుంటే తెలంగాణా కథాసాహిత్యం మరింత పరిపుష్టమయ్యుండేది. అప్పుడు తెలంగాణా నుంచి మంచి రచనలు రావడం లేదని, ఆ తర్వాత కొంత మంది సంపాదకులు అన్నట్టు తెలంగాణా మాండలికం ప్రచురిస్తే చదవరన్న ఆరోపణలు వచ్చుండేవి కావేమో! ఏదేమైనా మలితరంలో కొంతకాలం వరకైనా తెలంగాణా నుంచి ప్రాంతీయ ముద్రగల రచనలు రాలేదన్నది స్పష్టమే. వచ్చినా తక్కువ సంఖ్యలో వచ్చాయి. ఆ కాలంలో పుస్తకాలుగా వచ్చిన తొలితరం రచయితల రచనలు కొన్నుంటే ఉండుంటాయి.

మాండలికంలో రాస్తేనే ప్రజాసాహిత్యమవుతుందా అని ఓ రచయిత వాపోయాడు. తెలంగాణా నుంచి కలం పట్టి ఎంతో కొంత పేరు సంపాదించుకున్న రచయిత గ్రామాలను హృదయానికి హత్తుకోకుండా ఉండలేదు. గ్రామీణుల భాషయైన మాండలికాన్ని ఆశ్రయించకా తప్పలేదు. తీసుకున్న జీవితం మాండలికమైంది. భాష మాత్రం వ్యావహారికమంటే ఆ రచన కృతకంగా ఉంటుంది. గ్రామాలను మరిచి, మాండలికాన్ని మరిచి, నేటివిటీ లేని రచనలు చేయడం వల్ల ప్రయోజనమేంటి? మలితరంలో ఒకరిద్దరు (నవలలు) విరివిగానే రచనలు చేసినా ఇతర ప్రాంతాలవారికొచ్చినంత పేరు రాలేదు. అందుక్కారణం కొంత వివక్షయితే మరికొంత ప్రాంతీయతా ముద్ర వదిలి రచనలు చేయడం.

ప్రాంతీయతా ముద్రంటూ లేని విశ్వజనీన రచనుండదని గుర్తుంచుకుంటే అన్ని ప్రాంతాల నుంచీ మంచి రచనలొచ్చే అవకాశముంది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 1 డిసెంబర్ 2003**



# ఆశు సాంప్రదాయాన్ని స్వంతం చేసుకున్న తెలంగాణా కథకులు

తెలంగాణా వందలాది సంవత్సరాలు నిరంశకు ప్రభువుల పాలన కింద నలిగిన ప్రాంతం. స్వాతంత్ర్యం వచ్చిన సమయంలోనూ ఫ్యూడల్ రాజుల పరిపాలనలోనే ఉంది. ఆ ప్రభావంతోనే మొన్నమొన్నటి వరకూ అయ్యబాంచెనవ్వ బాంచెన్ సంస్కృతే ఉంది. అయితే తెలంగాణా భాషా సంస్కృతీ సాంప్రదాయాలపై ముస్లిమ్ సంస్కృతికి ఓ ప్రత్యేకత ఉంది. ఫ్యూడల్ నైజాం ప్రభువుల పాలననే కాకుండా కాకతీయులు, శాతవాహనాలు, గోలకొండ ప్రభువుల్లాంటి గొప్ప రాజులు పాలించిన చరిత్రా ఉంది. అద్భుతమైన చరిత్ర, భూగోళం, నైసర్గిక స్వరూపం ఉన్న ప్రదేశం తెలంగాణా.

కాని దొరలు, పటేండ్లు నిజాం తాబేదార్లుగా చలామణీ అవుతూ గ్రామాల్లో చిల్లరదేవుళ్లుగా విశేష అధికారాలను గుప్పిట్లో పెట్టుకొని గ్రామాలను అంధకారంలోనే ఉంచారు. దేశమంతటా స్వాతంత్ర్య పోరాట పవనాలు వీస్తున్న సమయంలో గ్రామాల్లోకి వార్తా పత్రిక తేవడం కూడా నేరంగా పరిగణింపబడేది. అణచివేత వేదన, పీడన ఎక్కడుంటే అక్కడి నుంచే తిరుగుబాటు ఉద్యమాలు పుట్టుకొస్తాయనడానికి చక్కని ఉదాహరణ తెలంగాణా. అయితే నీ బాంచెన్ కాల్మొక్తా అంటూ బతికిన జనాలే భారతదేశానికే భూపోరాటాల వారసత్వాన్నందించారు. భూమి పంపకాలు జరుపుకున్నారు. దోపిడీ శక్తులకు సింహస్వప్నమయ్యారు. దొరలు ఊళ్లు వదిలి పోయేట్టు చేశారు. కొన్ని జిల్లాలకే పరిమితమైన పోరాటం భారతసైన్యాల నెదుర్కోవడం సాధ్యం కాదనో, మరెన్నో కారాణాల వల్లనో పోరాటాలు విరమించినా ఆ వారసత్వం తెలంగాణా ప్రజల రక్తంలో ఇమిడే ఉంది.

పోరాట సమయంలో దొరలకు సింహస్వప్నాలైన ప్రజలు పోరాట విరమణ తర్వాత మళ్లీ అవ్వ బాంచెన్ సంస్కృతిలోనే జీవించారు. దొరల పాలనకు దాసోహమన్నారు. వాళ్ల అధికారాలకు బానిసలయ్యారు. ఇదివరకటి కంటే ఎక్కువ నిరంకుశంగా దొరలు పాలించారు. అలా రెండు దశాబ్దాలు గడిచింతర్వాత కాని తెలంగాణా ప్రజల రక్తంలో ఉన్న తిరుగుబాటు తత్వం బయటకు రాలేదు. గత పాతికేళ్లకు పైగా తెలంగాణా నేలపై ప్రజా పోరాటాల ఉధృతి విపరీతంగానే ఉంది. తెలంగాణా నేల రక్తసిక్తమవుతూనే ఉంది. పోరాటాల ప్రభావమూ ప్రజా జీవనంపై బాగానే ఉంది. గ్రామాల్లోని భూస్వాములు, దొరలంతా ఊళ్లొదిలి వెళ్లిపోయారు. నిత్యం పోరాటాల్లో

మునిగితేలుతున్న ప్రజలతో పాటు సామాన్య ప్రజానీకంపై వీటి ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉండనే ఉంది.

స్వాతంత్ర్యానికి పూర్వం, ఆ తర్వాతి కాలంలో చాలా ఏళ్ల వరకు తెలంగాణాలో మధ్యతరగతి ఉండేది కాదు. ఉన్నా అతి స్వల్పమే. ఉన్నది భూస్వాములు. ఆ భూస్వాముల భూముల్లో కూలీలు.. ఆ తర్వాతి కాలంలో తెలంగాణానూ మధ్యతరగతి ఎదిగింది. ఈ ఎదగడం వెనక ఎంతో వేదనుంది. పోరాటముంది. తపనుంది.

ఇంత నేపథ్యం, పోరాట స్వభావమున్న తెలంగాణా నేలకు ప్రత్యేక సంస్కృతీ సాంప్రదాయాలున్నాయి. బాషా సంపదుంది. గద్వాల, వనపర్తి లాంటి ఎన్నో సంస్థానాలు, కాకతీయ రాజులనే ఎదిరించిన సమ్మక్క సారక్కల పోరాట పటిమ ఉంది. ఇంతటి సామాజిక, ఆర్థిక, చారిత్రక నేపథ్యమున్న తెలంగాణా నేల మీద ఆకలి అలమటింపులు, వెట్టి బతుకులు బతికిన బతుకు వెతలూ ఉన్నాయి.

ఇక్కడి సంస్కృతిని, చరిత్రను, పోరాటాలను, సామాజిక జీవితాన్ని, ప్రజల భాషను అక్షరబద్ధం చేయడమే ఇక్కడి సాహిత్యకారులు చేయాల్సిన పని. తెలంగాణా నుంచి ఇప్పుడు వస్తున్న వర్తమాన సాహిత్యం ఆ పనే చేస్తుంది. సంఖ్యాపరంగా ఇక్కడి నుంచి రాస్తున్న కవుల రచయితుల సంఖ్య ఇతర ప్రాంతాలవారితో పోలీస్తే తక్కువే అయినా ప్రాంతీయ ముద్రతో తెలంగాణా జీవితాలకు భాష్యాలు చెప్పే రచనలు చేస్తున్నారు వీళ్లు. కథ, నవల, కవిత ఏదీ ఈ ప్రాంతం నుంచి వ్యాపార మసాలాల జోలికి పోలేదు. వ్యాపార సరుకు కాలేదు.

అయితే స్వాతంత్ర్య పోరాట కాలంలోనూ, ఆ తర్వాత చాలా కాలం వరకు తెలంగాణా నుంచి అంతగా సాహిత్యం రాలేదు. ఉర్దూ తప్ప తెలుగు చదువుకునే అవకాశమే లేని సమయంలో, ఊళ్లోకి వార్తా పత్రిక రావడం కూడా నేరమని భావించబడుతున్న సమయంలో విరివిగా సాహిత్యం వచ్చే అవకాశమెక్కడుంది? హైదరాబాద్ నుంచి గోలకొండ పత్రిక వెలువడుతున్నా, అణాగ్రంథమాల పేరుతో కొన్ని పుస్తకాలు ప్రచురింపబడినా అప్పటి తెలంగాణా ప్రజలకు ఆధునిక సాహిత్యం గూర్చి తెలిసింది తక్కువ. తెలంగాణాలో కవులే లేరు అన్న మాటను సవాలుగా తీసుకొని రెండు వందల యాభై మంది కవితలతో ఓ సంకలనం వేసి చూపించారు సురవరం ప్రతాపరెడ్డి. అయినప్పటికీ మొదటితరంలో తెలంగాణా నుంచి వచ్చిన సాహిత్యం తక్కువే.

సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రధానంగా గొప్ప పరిశోధకులు. సాహిత్య గ్రంథాలను అధారంగా చేసుకొని 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' అనే గొప్ప గ్రంథాన్ని రాశారు. వారు కొన్ని కథలు కూడా రాశారు. వారు తెలంగాణా ప్రాంతాన్ని నిజామాంధ్రం



అని, తెలంగాణా భాషను తౌరక్యాంధ్రమనేవారు. వారి కథల్లో ఉర్దూ తెలుగు మిళితమైన భాషా ప్రయోగం కనబడుతుంది. తెలంగాణా గ్రామాల్లోని పెద్ద మనుషులు మాట్లాడే భాషలా ఉంటుంది. ప్రతాపరెడ్డిగారి భాష.. నైజాం పాలనా కాలంలోని తెలంగాణా స్థితిగతులను తెలుపుతాయతని కథలు. నిరీక్షణ, వకీలు వెంకయ్య, మొగలాయ్ కథలు లాంటి కథలు రాసి కథకుడుగా ప్రసిద్ధుడయ్యాడు ప్రతాపరెడ్డిగారు.

తెలంగాణా నుంచి కీర్తనలు వచ్చినా, జాజిరి పాటల లాంటివి వచ్చినా అందులో తిరుగుబాటు అంశం ఉండటం ఇక్కడి మట్టిప్రభావమే. తెలంగాణా వికాసం కోసం రాజకీయంగా, సాహిత్యపరంగా, సామాజికంగా కృషి చేసిన దేవులపల్లి రామానుజ రావు, మాడపాటి హనుమంతరావు, దాశరథి, వట్టికోట ఆళ్వారుస్వామి, కాళోజీలాంటి వాళ్లు చిరస్మరణీయులే. చారిత్రక తెలంగాణా సాయుధపోరాటం జరుగుతున్న కాలంలోనూ తెలంగాణా నుంచి గొప్పగా కథలు రాలేదు. కాని తెలంగాణా వారు కొందరు పోరాటాల గూర్చి వార్తా పత్రికల్లో చదివి తెలుసుకొన్న బయటివారు కొందరు తెలంగాణా సాయుధ పోరాటం గూర్చి కొన్ని కథలు రాశారు. శిల్పరీత్యా ఇవి గొప్ప కథలు కాకున్నా ఆ పోరాటం గూర్చి తెలుసుకుంటానికి సాహిత్యాధారాలుగా ఇవెంతో ఉపయోగపడతాయి. ఈ కథల్లో కొన్నింటిని జనసాహితివారు తెలంగాణా పోరాట కథలుగా సంకలనం చేశారు. ఇందులోని చాలా కథలు అనుభవాల్లోంచి వచ్చినవి కాకపోవడం వల్ల స్థలకాలాల చైతన్యం తక్కువ. అయితే ఈ కథల ప్రయోజనం వీటికుండనే ఉంది. సి.వి. కృష్ణారావు, సురమౌళి, వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచార్యాలాంటివాళ్లు మొదటితరంలో ఇక్కణ్నుంచి కథలు, నవలలు రాసి తెలంగాణా జనజీవితాన్ని పరిచయం చేసి ప్రసిద్ధులయ్యారు. చిల్లరదేవుళ్లు, మోదుగుపూలు, గంగు లాంటి నవలలు తెలంగాణా గ్రామాల స్వరూప స్వభావాలను లోతుగా చిత్రించాయి. తెలంగాణా పోరాట కాలంలో వచ్చిన సుద్దాల హనుమంతు పాటలు పోరాట వీరులకెంతో ఉత్తేజాన్నిచ్చాయి.

విస్మృత కథ సంకలనంలో గొల్లరామవ్వ అనే కథ అచ్చయింది. దీని రచయితలెవరో తెలియదు కాని విజయ అనే పేరుతో 1949లో కాకతీయ పత్రికలో అచ్చయింది. పోరాటం చేసేవారి పట్ల ప్రజలకున్న అనురాగాన్ని తెలిపే కథ గొల్ల రామవ్వ. సహజమైన తెలంగాణా మాండలిక సంభాషణలతో రాయబడిన ఈ కథ రజాకారు వ్యతిరేక పోరాట వీరులను ప్రజలు త[illegible] ...కరించారో తెలిపే గొప్ప కథ.

గాడ్ ఫాదర్ లాంటి వారెవరూ లేకున్నా తెలంగాణా నుంచి పత్రికలు

దాదాపుగా లేకున్నా ఆ కాలంలో తెలుగు చదివే అవకాశాలు అతి తక్కువైనా తెలుగులో రాశారు దాశరథి, కాళోజీ, సి. నారాయణరెడ్డిలాంటివారు. వీరు సాధించిన విజయాల వెనక, కవులుగా ఆర్జించిన కీర్తిప్రతిష్టల వెనక ఎంతో కృషి, ఆర్తి, కష్టం ఉన్నాయన్న విషయాన్ని మరిచిపోకూడదు. పాటయినా, గేయమైనా, కవిత్వమైనా సినారె సాహిత్యంలో తెలంగాణా పలుకుబడులు, బాణీలు కనబడతాయి. మానవతా పరిమళం, సమన్వయ దృక్పథంతో మూడు తరాలుగా సాహితీ వ్యవసాయం చేస్తున్న కృషీవలుడు సినారె.

ప్రజల గొడవను, ప్రపంచ గొడవను తన గొడవగా స్వీకరించిన 'నా గొడవ' రచయిత కాళోజీ నారాయణరావు కొన్ని కథలు రాసినా ప్రముఖంగా కవే. ఎక్కడా రాజీ పడకుండా ఏ ప్రలోభాలకు లొంగకుండా ప్రజలపక్షం వహించి రచనలు చేస్తున్న కవి కాళోజీ. నా తెలంగాణ కోటి రతనాల వీణ అని నినదించిన ప్రజాకవి దాశరథి కృష్ణమాచార్యులు. తాను నమ్మిన సిద్ధాంతం కోసం నిర్బంధాలకు కూడా వెరవకుండా అగ్నిపూలు పూయించి, నిజాం నవాబును ముసలిపీనుగని నిందించిన ధైర్యశాలి దాశరథి. ఆ తర్వాత ఆస్థానకవి పదవి స్వీకరించి తన కీర్తిప్రతిష్టలకు కొంత మచ్చ తెచ్చుకున్నా అతడు రాసిన అద్భుతమైన కవిత్వం ఎంతో మందికి స్ఫూర్తినిచ్చింది.

తెలంగాణా రెండవసారి భూపోరాట ఉద్యమాలు ఉధృతమయ్యే నాటికే అంటే ఎనిమిదవ దశాబ్ది ప్రారంభమయ్యే నాటికే సినారె, కాళోజీ, దాశరథి రంగాచార్య, వట్టికోట ఆళ్వారుస్వామి లాంటివారు కవులుగా, రచయితలుగా ప్రఖ్యాతులయ్యారు. విశేషమైన కీర్తిప్రతిష్టలనూ ఆర్జించారు. కాని తెలంగాణా సాహిత్యానికంటూ ప్రత్యేకమైన గుర్తింపు రాలేదు. భూపోరాటాలు ఉధృతమైన తర్వాత పోరాటాల ప్రభావంతో కావచ్చు, ఇతరత్రా కావచ్చు స్వాతంత్ర్యానంతరం పుట్టిపెరిగిన తరంలోంచి చాలా మందే కలం పట్టారు. తెలంగాణా జీవితాన్ని, సంస్కృతిని, పోరాటాలను, ప్రజల భాషను ప్రాంతీయతా ముద్రతో అక్షరబద్ధం చేశారు. అలాంటివారిలో అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, రఘోత్తమరెడ్డి, వుప్పల నరసింహం, దేవరాజు మహారాజు, సదానంద శారద, డా. ఎన్. గోపి, జూకంటి జగన్నాథం, నాళేశ్వరం శంకరం, జింబో, నందిని సిద్ధారెడ్డి, వఝల శివకుమార్, బోయ జంగయ్య, సరిపల్లి కృష్ణా రెడ్డి, కె. రామ్మోహన్ రాజు, గద్దర్ లాంటివాళ్లు ముఖ్యులు. అంతకు ముందే వరవర రావు, దిగంబర కవులు వేసిన పునాదితో కరీంనగర్ నుండి వెలువడిన బడ్‌లా కథా సంకలనం ప్రేరణతో, చుట్టూ జరుగుతున్న ఉద్యమాల స్ఫూర్తితో తెలంగాణా నుంచి సాహిత్యం విస్తృతంగానే వచ్చింది.

అంతకు ముందు తాడిగిరి పోతరాజు, నవీన్, మలయశ్రీ లాంటివాళ్లు కొంత



సాహిత్యం సృష్టించినా ఉద్యమ స్ఫూర్తితో వచ్చిన కవిత్వం, కథ, నవల తెలంగాణా సాహిత్యానికి మంచి గుర్తింపు తెచ్చింది. ఎనభయవ దశకంలో తర్వాత వచ్చిన సాహిత్యం తెలంగాణా సాహిత్యమంటే పోరాట సాహిత్యమేనన్నంత విరివిగా వచ్చింది. ముఖ్యంగా కథకు మంచి పునాది ఏర్పడింది. ఒకప్పుడు తెలుగు కథకు కేంద్రంగా విశాఖపట్టణమంటే 70-90 ప్రాంతంలో తెలంగాణా ముఖ్యంగా కరీంనగర్ జిల్లా అయింది. పోరాటంలోని అన్ని దశలనూ చిత్రిస్తూ అనేక కథలొచ్చాయి. తెలంగాణా మాండలికానికి సాహిత్య గౌరవం తీసుకొచ్చిన ఘనత ఈ కాలంలో వచ్చిన కథలకు, మాండలికంలో విస్తృతంగా రాసి అన్ని అన్ని పత్రికల్లో ప్రచురించేట్టు చేసిన కాలువ మల్లయ్య, వెలి, పాలేరు, భూమి నవ్వింది, ఈ భూమి నాది, భస్మాసుర హస్తం, ప్రస్థానం లాంటి కథలు రాసిన కాలువ మల్లయ్య పగలూ రేయీ శ్రమపడుతున్నా ఈ భూమి ఎవరిచ్చింద్రు, నీళ్ల తగవు లాంటి కథలు రాసిన బి.యస్. రాములు.... ఇత్తనపు కోడె, తిరుగబడ్డ భూమి కథలు రాసిన వుప్పల నరసింహం.... జాడి కథ రాసిన సదానంద శారద, రక్తపింజెర, తుడుం మోగిస్తాం కథలు రాసిన సాహు, పి. చంద్.. లాంటివాళ్లెంతో మంది భూపోరాటాలకు అద్దం పడుతూ తెలుగు కథను పోరాట కథగా తీర్చి దిద్దారు. సరిపల్లి కృష్ణారెడ్డి ఉప్పెన నవల, కె. రామ్మోహన్ రాజు తీర్మానం, గొల్లకథ లాంటివి భూపోరాటాల ప్రేరణతో రాసినవే.

వీళ్లు పోరాటాలకు, తెలంగాణా జీవితానికి కథా రూపమిస్తే వరవరరావు, నమ్ము, హెచ్చార్కె సిధారెడ్డి, తోట మహదేవ్, జూకంటి జగన్నాథం, నిజాం వెంకటేశం, ఎన్‌కె తమ కవిత్వంతో తెలుగు సాహితీ క్షేత్రాన్ని సుసంపన్నం చేశారు. ఈ రెండు దశాబ్దాల్లో పోరాట కథ, కవిత చాలావరకు పోరాట ప్రాంతం విస్తరించి వున్న తెలంగాణా నుంచి రావడం విశేషం. తెలంగాణా పోరాట సమయంలో వచ్చిన కథకు లేని స్థలకాలాల చైతన్యం ఈ కాలంలో వచ్చిన కథకుంది. అందుక్కారణం పోరాట ప్రాంతం నుంచి సాహిత్యం రావడం తమ చుట్టూ జరుగుతున్న పోరాట ఫలితాలను అనుభవిస్తూ పోరాట ప్రజల వర్గంలోంచి రచయితలు రావడం....

ఉత్పత్తి శక్తులతో సంబంధమున్న దళిత, వెనకబడిన కులాల్లోంచి వచ్చినవారి జీవితానుభవాలు, జీవన వైవిధ్యం విశ్రాంతి కులాలవారి జీవితాల్లా ఉండదు. ఆయా కులాల్లోంచి రచయితలుగా ఎదిగితే వాళ్ల రచనల్లో ఎంత విస్తృతి ఉంటుందో మనకీ కథలు చదివితే అర్థమవుతుంది. పోరాటకథలనెక్కువగా ప్రచురించిన పత్రికలు సృజన, అరుణతార, ప్రజాసాహితి, నూతన, వడిసెల, అభ్యుదయ, ఆంధ్రజ్యోతిలతో పాటు మరెన్నో పత్రికలు....

60,70లలో వచ్చిన వ్యాపార ప్రేమ నవలల ప్రభావం కాని, 80లలో వచ్చిన భూతప్రేత కుహనా సైన్సు నవలల ప్రభావం కాని తెలంగాణా రచయితల మీద ఏ మాత్రం పడలేదు. తమ మార్గాన్ని వదిలి పోవడానికి దోహదం చేయలేదు. ప్రముఖ పత్రికలన్నీ భూతప్రేత నవలలను, శృంగార చెత్త కథలను ప్రచురిస్తూ సొమ్ము చేసుకుంటుంటే ఆ మార్గంలో రచయితలుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోవడానికి తెలంగాణా రచయితలు ప్రయత్నించలేదు. అలా ప్రయత్నించిన ఒకరిద్దరు రచయితలు మధ్యలోనే ఆగిపోయారు. ఈ కాలంలో తెలంగాణా నుంచి [illegible]చి నవలలే వచ్చాయి.

కథ మానవ జీవితానికి అత్యంత చేరువైనదే అయినా కథ ద్వారా జీవిత శకలాన్ని చూపవచ్చు. మొత్తం జీవితాన్ని గూర్చి తెలుసుకోవడానికి, జీవితాన్ని వ్యాఖ్యానించడానికి నవల ఉత్తమమైన సాధనం. నవలకున్న విస్తృత పసరిధి ఏ సాహిత్య ప్రక్రియకూ లేదు. బీడీలు చేస్తూ బతికే వాళ్ల బతుకు వెతలను, వాళ్లపై జరుగుతున్న దోపిడీపీడనలను, వాళ్ల బతుకు పోరాటాలను అత్యంత వాస్తవికంగా చిత్రించిన నవల బతుకుపోరు. ఈ నవలలో బతుకుపోరు రాములుగా ప్రసిద్ధులైన రచయిత బి.యస్. రాములు. తెలంగాణా గ్రామాల్లో విప్లవాల కొలిమంటుకున్న పరిస్థితులను అల్లం రాజయ్య తన కొలిమంటుకుంది నవల ద్వారా చెప్పారు. ఊరు, అగ్నికణం విప్లవ పోరాటాలు ఉధృతమైన తర్వాత గ్రామాల పరిస్థితులను తెలిపే నవలలు.

గిరిజనులతో జీవించి, వాళ్లతో మమేకం చెంది గిరిజన జీవితాల గూర్చి కథలు రాయడమే కాక జోడెన్ ఘాట్ కేంద్రంగా నైజాం నవాబునెదిరించిన కొమురం భీం చారిత్రక నవలను అల్లం రాజయ్యతో కలిసి నవలగా రాశాడు సాహు. గిరిజన తిరుగుబాట్లపై వచ్చిన గొప్ప నవల కొమురం భీం. ఇంద్రవెల్లి గిరిజన పోరాటాలకు అక్షర రూపమే వసంతరావు దేశ్‌పాండే రాసిన అడవి నవల. బొగ్గు గని కార్మికుల జీవితాలను గూర్చి కథలొచ్చినా నవలలు రాలేదు. జాతశ్రీ రాసిన సంగరేణి మండుతోంది నవలలో కాల్పనికత పాలెక్కువ. పవన్‌కుమార్ రాసిన నల్లవజ్రం గని కార్మికుల జీవితాల్లోని కొన్ని ఘట్టాలను వాస్తవికంగా చిత్రించిన నవల.

60లలో వచ్చిన అంపశయ్య చైతన్యస్రవంతి కథనంలో రాయబడిన గొప్ప నవలే అయినా తెలంగాణా నేటివిటీ ఉన్న రచన కాదు. పడవల్లాంటి పొడ[illegible] ఆరడుగుల హీరోలతో ఊహాలోక జీవితాల గూర్చి విరివిగా నవలలు వస్తున్న కాలం[illegible] మట్టి బతుకుల గూర్చి తాడిగిరి పోతరాజు రాసిన మంచి నవల మట్టి మనుషులు. 80లలో విశాలాంధ్ర వారు ప్రచురించిన మలయశ్రీ నవల తిరుగుబాటులో కాల్పనికతే ఎక్కువ.



ప్రస్తుత దశాబ్దిలో తెలంగాణ నుంచి నవలలెక్కువగా రాలేదు. వచ్చిన కొన్ని నవలలు తెలంగాణా గ్రామాల్లో వచ్చిన పరిణామాలను, సంఘర్షణను, మారుతున్న విలువలను, నశిస్తున్న వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులను, మధ్యతరగతి ఎదిగిన క్రమాన్ని, విప్లవ పోరాటాలను వాస్తవిక దృష్టితో చిత్రించిన నవలలు.... కాలువ మల్లయ్య రాసిన భూమిపుత్రుడు నవల తెలంగాణా గ్రామాలను, రైతు జీవితంలోని కష్టసుఖాలను, రాత్రింబవళ్లు పని చేస్తున్నా కడుపులు నిండని బతుకులను, ఏడాది పొడుగూతా విశ్రాంతి లేని దినచర్యను, పోరాటాలు కలిగించిన ప్రభావాన్ని, కర్షుడి చావుకు రైతు పతనానికి గల కారణాలు నిజాయితీగా చిత్రించిన నవలలు సాంబయ్య చదువు, మాట్లాడే బొమ్మలు నవలలు స్వాతంత్ర్యానంతరం యాభై ఏళ్లలో తెలంగాణా గ్రామాల్లో వచ్చిన పరిణామాలను, చదువు పరిస్థితులను, మధ్యతరగతి ఎదిగిన క్రమాన్ని జీవితానుభవాల ఆధారంగా చిత్రించిన ఆత్మకథాత్మక నవలలు. ఈ నవలలు మైదాన ప్రాంత జీవితాలకు భాష్యాలయితే ఎల్లి, వసంతగీతం, రాగో, ఊరు నవలలు పోరాట బతుకులను, విప్లవోద్యమాలను చిత్రించిన నవలలు.

తెలంగాణాలో జరుగుతున్న ఉద్యమాలను భూపోరాటాలు ఒక దిశయితే కార్మిక పోరాటాలు మరో ముఖం. భూపోరాటాల, కార్మిక పోరాటాల ఉధృతి పెరిగేంత వరకు కార్మికుల గూర్చి వచ్చిన కథలు తక్కువే. ఉత్తర తెలంగాణాలోని నాలుగు జిల్లాల్లో విస్తరించి ఉన్న సింగరేణి బొగ్గుగనుల్లో వేలాది మంది కార్మికులున్నారు. కార్మిక పోరాటాల్లోని నిమ్నోన్నతాలను, జయాపజయాలను, కార్మికుల బతుకులను గూర్చి కార్మికులుగా పని చేస్తున్న రచయితలు రాసిన కథలు సమ్మె, నీళ్లు, నీళ్ల తగవు, లీడర్, వక్రమార్గం, ప్రస్థానం, నీడ కోసం, మళ్లీ తల్లి ఒడిలోకి, ఉరి, మనిషి లోపలి విధ్వంసం మొదలైనవి.

వాడివేడి అయిన మినీ కవితలతో సమాజానికి షాక్ ట్రీట్‌మెంటిచ్చి సాహిత్యానికి ఉన్న బలమెంతో నిరూపించిన ప్రతిభావంతుడైన కవి అలిశెట్టి ప్రభాకర్.

పండితులలో గ్రామ్యమని నిరసింపబడిన భాషపై వకాల్తా పుచ్చుకొని ప్రజల భాషలో కన్యాశుల్కం నాటకం రాసి ప్రసిద్ధులైన మహాకవి గురజాడ. గ్రామ్యమని, మాండలికమని నిరసింపబడిన తెలంగాణా ప్రజల బాషకు పట్టం కట్టి దానికి సాహిత్య గౌరవం తీసుకువచ్చిన ఘనత ఇటీవలి కాలంలోని రచయితలకు దక్కుతుంది. మొదట్నుంచీ రచనల్లో ప్రజల భాషకు పునాదులున్నా ఇటీవలి కాలంలో తెలంగాణా మాండలికలో విరివిగా వచ్చిన రచనల వల్ల ఆ భాషజీవితం అందరికీ పరిచయమైంది. ఆ రచనలు అందరి రచనలయ్యాయి.

ప్రజల భాష గలగలా పారే సెలయేరులాంటిది. ఎంతో వైవిధ్యపూరితమైంది. నిలకడ ఉన్న చలనం లేని నీరు లాంటి భాషలో రాయడం కంటే ఎంతో వైవిధ్యపూరితమైన ప్రజల భాషలో రాయడమే మంచిదన్న విషయాన్ని గుర్తించారు తెలంగాణా రచయితలు. తమ రచనలకు ప్రజల భాషనే ఎన్నుకున్నారు. విషయాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి కొన్ని రచనలకు మాండలికాన్ని పాత్రలకే పరిమితం చేసి, మరికొన్ని రచనలకు కథనానికి కూడా వాడి రచనలు చేశారు. నేల విడిచిన సాము చేయకుండా ఏ ప్రజల గూర్చియితే రాస్తున్నారో ఆ ప్రజల భాషలో రాసి మాండలిక భాషలోని సొగసులను తెలిసేటట్టు చేసి ఆ భాషకు సాహిత్య గౌరవం తీసుకొచ్చారు. మొదటి తరంలో దాశరథి రంగాచార్య, సురమౌళిలాంటి రచయితలు ఆ తర్వాతి తరంలో బి.యస్. రాములు, కాలువ మల్లయ్య, అల్లం రాజయ్య, రఘోత్తమరెడ్డి లాంటి రచయితలు ప్రజల భాషకు పట్టం గట్టి రచనలు చేశారు... చేస్తున్నారు... అల్లం రాజయ్య అనేక కథలు, కొలిమంటుకుంది నవల, కాలువ మల్లయ్య కథలు, నవలలు, అవ్వతోడు గిది తెలంగాణా, తెలంగాణా మట్టి కథలు, రచనలు, బి.యస్. రాములు కథలు, బతుకుపోరు నవల, రఘోత్తమరెడ్డి బండ కింది బతుకులు రచనలు, ఇతర కథలు, వుప్పల నరసింహం కథలు, ముద్ర రచనలు తీసుకుంటే తెలంగాణా మాండలిక భాషకున్న సౌందర్యం, బలమేమిటో తెలుసుకునే అవకాశముంది. తెలంగాణా మాండలికానికి వర్గస్పృహ ఉందన్న విషయం ఈ రచనలు శ్రద్ధగా చదివితే అర్థమవుతుంది.

అయితే విప్లవ దశాబ్దమని చెప్పబడుతున్న కాలంలో తెలంగాణా నుంచి విరివిగా కథలు వస్తున్నప్పుడు ఓ విమర్శ ఉండేది. పోరాట కథల్లో శిల్పం పాలు తక్కువని. తెలంగాణా రచయితలు విషయానికి, సిద్ధాంతానికి ఇచ్చిన విలువ శిల్పానికి ఇవ్వరని.... ఈ విమర్శలో ఎంత సత్యముందో అప్పుడొచ్చిన అద్భుతమైన కథలను పరిశీలిస్తే తెలుస్తుంది. తెలంగాణా రచయితలు ఆశు సంప్రదాయాన్ని స్వంతం చేసుకున్నారు. లిఖిత కథకు ఆశుకథా సంప్రదాయాన్ని జోడించడం వల్ల శిల్పం తక్కువ ఉన్నవున్నట్టనిపించవచ్చు. ఆ కథలను చూడాల్సిన ప్రమాణాలను వేరుగా రూపొందించుకోవాలి. ఎవరి కోసమైతే రాస్తున్నామో ఆ కథలు ఆ పాఠకుల్ని చేరుతున్నాయా, చేరినా వాటినా పాఠకులందుకోగలుగుతున్నారా అన్న విషయాన్ని పరిశీలిస్తే ఆ ప్రశ్నలకు సమాధానాలు లభిస్తాయి. ఏదేమైనా ఆ విమర్శలనన్నింటినీ అధిగమిస్తూ తెలుగుకథకు స్వర్ణయుగ దశాబ్ది అని చెప్పుకోదగిన ఈ దశాబ్దిలో తెలంగాణా రచయితలు అద్భుతమైన కథలు రాస్తున్నారు. వస్తుశిల్పాలకు సమ ప్రాధాన్యమిస్తూ సమాజంలోని అన్ని పోకడలకు స్పందిస్తూ చక్కని కథలు రాస్తున్నారు.



ఈ దశాబ్దిలో తెలుగు సాహితీ ప్రపంచంలో విశేషంగా ప్రభావం చూపిన వాదాలు స్త్రీవాద, దళితవాద సాహిత్యోద్యమాలు.. విప్లవ సాహిత్యోద్యమం స్త్రీ, దళిత సమస్యల గూర్చి పట్టించుకొని రాసిందని చెప్పబడుతున్నా ఆయా రంగాల్లో రావాల్సినంత సాహిత్యం రాలేదనే చెప్పవచ్చు. ఈ సాహిత్యోద్యమాలు ఆ లోటును పూరిస్తున్నాయి. ఆ సాహిత్యోద్యమాలతో ప్రభావితులై కొంత, తమ సహజ ధోరణిలో కొంత తెలంగాణా రచయితలు స్త్రీ, దళిత, విప్లవ కథను సుసంపన్నం చేస్తున్నారు. ఈ రంగంలో బి.యస్. రాములు, కాలువ మల్లయ్య, అల్లం రాజయ్య, బోయ జంగయ్య, తుమ్మేటి రఘోత్తమ రెడ్డి, సదానంద శారద రచయితలు విశేషంగా కృషి చేస్తున్నారు.

అల్లం రాజయ్య కమల, నీల.. కాలువ మల్లయ్య గలుమ, చిందొర్సాని, బి.యస్. రాములు స్త్రీ, తల్లి చాటు పిల్లడు... ఆడెపు లక్ష్మీపతి వ్యభిచారం, తిర్యగ్రేఖ... తుమ్మేటి రఘోత్తమరెడ్డి జాడ, పనిపిల్ల స్త్రీల సమస్యలపై వచ్చిన మంచికథలు. బి.యస్. రాములు సంకలనం చేసి ప్రచురించిన పదునెక్కిన పాట, దళిత కవితా సంకలనాల్లో చెప్పకోదగిన పుస్తకం... బోయ జంగయ్య చీమలు, ఇతర కథలు... బి.యస్. రాములు బందీ, దుస్తులు, పాతచీర... కాలువ మల్లయ్య నా తెలంగాణా, కర్రోడు, ఎంగిలి చేత్తో, అగ్ని గుండం చెప్పుకోదగిన దళిత కథలు... అల్లం రాజయ్య మనిషి లోపలి విధ్వంసం, మధ్యవర్తులు, రఘోత్తమరెడ్డి చావువిందు కథలు భూస్వామ్య వ్యవస్థ పతనాన్ని సూచించే కథలు... కాలువ మల్లయ్య ఆంబోతు, యుద్ధభూమి, భద్రత కథలు వివిధ ఉద్యమాల వల్ల దొరతనాలు, పోయి తెలంగాణా గ్రామాల్లో వచ్చిన మార్పులను, భూస్వామ్య వ్యవస్థ పతనం చెందుతున్న పరిస్థితులను తెలిపే కథలు... నూతన ఆర్థిక విధానాలు, గ్లోబలైజేషన్, కన్స్యూమరిజం ప్రజల బతుకుల్లో తెచ్చిన సంక్షోభాలను తెలిపే కథలు ఆడెపు లక్ష్మీపతి రాసిన జీవన్మృతుడు, కాలువ మల్లయ్య రాసిన మానవస్వప్నం....

కల్లోల తెలంగాణా పరిస్థితులను, తెలంగాణా నైసర్గిక స్వరూపాన్ని, తెలంగాణాలోని సంక్షోభాన్ని చిత్రించే కథలు, కథా సంపుటులు చెప్పుకోదగ సంఖ్యలోనే వచ్చాయి. ఇందులో గత దశాబ్దిలో వచ్చిన ఘర్మజలానికి ఖరీదు కట్టే షరాబు, చీమలు, పావురాలు, శ్వేతరాత్రులు, మాకథలు, స్మృతి, నాలుగు దృశ్యాలు, అవ్వతోడు గిది తెలంగాణా, మమతలు - మానవసంబంధాలు, ఆధునిక కథా సరిత్సాగరం, రుతుపవనాలు, బురదలో జాబిల్లి, ఐతా చంద్రయ్య కథలు, నేలతల్లి విముక్తి కోసం, కాలువ మల్లయ్య కథలు తెలంగాణా జనజీవన దృశ్యాలను కళ్ల ముందుంచే గ్రంథాలు.

ఎవరికివారు వేసుకున్న కథాసంపుటులు, ఒకటి రెండు కథా సంకలనాలు

వచ్చినా తెలంగానా జనజీవితాన్ని, సంఘర్షణను, సంక్షోభాన్ని ప్రతిబింబించే కథా సంకలనం రావాల్సిన అవసరం ఉండనే ఉంది. రాయలసీమ నుంచి సీమకథలు, కోస్తా ప్రాంతం నుంచి కళింగ కథానికలు, నాగావళి కథలు వచ్చినట్టుగా తెలంగాణా ప్రాంతీయ ముద్ర కలిగిన కథల సంకలనం రావాల్సిన అగత్యం ఉంది. బి.యస్. రాములు (అడవిలో వెన్నెల, కొత్తబట్ట), కాలువ మల్లయ్య (మానవస్వప్నం, యుద్ధభూమి), అల్లం రాజయ్య (ప్రత్యర్థులు, సృష్టికర్తలు), తుమ్మేటి రఘోత్తమరెడ్డి (జాడ, పనిపిల్ల), సదానంద శారద (జాడి, దారోడు), బోయ జంగయ్య (చీమలు, దొంగలు), వుప్పల నరసింహం (ఇత్తనపు కోడె, తిరుగబడ్డ భూమి), ఆడెపు లక్ష్మీపతి (ముసల్దాని ముల్లె, జీవన్మృతుడు), దేవరాజు మహారాజు, కెవి నరేందర్, జూకంటి జగన్నాథం (కళేబరం), చైతన్యప్రకాశ్ (రేణ), జింబో, ఐతా చంద్రయ్య, నవీన్ .. ఇంకా ఇతర రచయితల ఒక్కో కథతోనైనా ఓ కథా సంకలనం రావాల్సి ఉంది.

మారుతున్న సమాజ పోకడలకు స్పందిస్తూ ప్రాంతీయ ముద్రతో కథలు, కథాసంపుటులు, నవలలే కాకుండా కవితా సంపుటులెన్నో వచ్చాయి. డా.ఎన్.గోపిగారి తంగెడుపూలు, మైలురాయి, వంతెన, కాలాన్ని నిద్రపోనివ్వను, నానీలు, ఇతర కవితా సంపుటులు తెలంగాణా జీవితాన్ని కవితామయం చేసిన గొప్ప సంపుటులే. గోపిగారు తెలంగాణా జనజీవితంలోని పలుకుబళ్లను, సామెతలను, భాషా సౌందర్యాన్ని స్వంతం చేసుకొని తన కవితల్లో సందర్భోచితంగా ఉపయోగించారు. జూకంటి జగన్నాథం పాతాళగరిగె, ఇండియా ప్రైవేట్ లిమిటెడ్, గంగడోలు, జింబో హాజర్హై, పర్శుల శివకుమార్ గోగుపువ్వు, పాలకంకుల కల, నంధిని సిధారెడ్డి ప్రాణహిత, నాళేశ్వరం శంకరం దూదిపువ్వు, పొట్లపల్లి శ్రీనివాసరావు కవితలు, యాకూబ్, శిలాలోలిత, దేవరాజు మహరాజు, పి.సి. రాములు అగ్నిశ్వాస, అలిశెట్టి కవితా సంపుటులు తెలంగాణా జీవితాన్ని ఏదో మేరకు ప్రతిబింబించే సంపుటులే.

గద్దర్ ప్రజల పాటకు వేసిన బాణీలను ఉపయోగించుకొని బలమైన సినిమా మీడియా ద్వారా ద్వారా తమ గొంతును వినిపిస్తున్న కవులు గూడ అంజయ్య, సుద్దాల అశోక్.

వర్తమాన కాలంలో సాహిత్యంలో బలంగా వస్తున్న మరో వాదం బహుజన వాదం. ఇంత వరకు సాహిత్యంలో స్థానం లేని అన్ని బహుజన కులాలవారినీ సాహిత్య వస్తువులుగా తీసుకొని సాహిత్యం సృషిస్తున్నారు. ఎస్.సి, ఎస్.టి., బి.సి. మైనార్టీ కులాల సమస్యలు కథావస్తువుగా స్వీకరించడం వల్ల కథల పరిధి మరింత పెరిగింది. వీరిపై జరిగిన కులపడీన, దోపిడీ, వీళ్ల చదువు పరిస్థితులు, కొద్ది మందైనా జీవితాలను



గెలుచుకొని మధ్యతరగతికి ఎదగడం లాంటి అనేక విషయాలపై కథకు పూర్తిగా రాకుండా పోలేదు. కాని చెప్పుకోదగ్గ సంఖ్యలో రాలేదు. ఒక ఉద్యమ రూపంలోనూ రాలేదు. మనదేశంలో కులాలకున్న ప్రాధాన్యతను దృష్టిలో వుంచుకుంటే ఇలా రావడం తప్పదేమో...

కాలువ మల్లయ్య రాస్తున్న కథలూ, ఇటీవలి కాలంలో బి.యస్. రాములు రాస్తున్న కథలూ తెలంగాణా కథాసాహిత్యంలో కొత్త ఇతివృత్తాలను తీసుకు వస్తున్నాయి. తెలంగాణాలోని సాధారణ జీవితాన్ని అంటే విప్లవవాద ఉద్యమాలతో పూర్తిగా భాగం కాని జీవితాల్ని లేదా జీవిత పార్శ్వాల్ని చిత్రించడానికి ఈ కథకులు ప్రయత్నిస్తున్నారు. తెలంగాణాకు ఉద్యమ కథ ఎంత అవసరమో సాధారణ కథ కూడా అంతే అవసరం. తెలంగాణాలోని ఆకలిని, దారిద్ర్యాన్ని, దోపిడీని చిత్రించే కథలతో పాటు తెలంగాణా మానవసంబంధాలను, సాంస్కృతి విశేషాలను, చమత్కారాలను పొందుపరిచే కథా సాహిత్యం కావాలి. ఈ పుస్తకంలో కాలువ మల్లయ్య అనేక ఇతివృత్తాలను ముడి రూపంలో అందించారు. ఆయన ఇతివృత్తాలలోని వైవిధ్యం ఒక ప్రామిస్‌గా పని చేస్తుంది అంటాడరు ప్రముఖ జర్నలిస్టు కె. శ్రీనివాస్ అవ్వతోడు గిది తెలంగాణ సమీక్షా వ్యాసంలో.

తెలంగాణా గ్రామాల్లోని సంఘర్షణను, సంక్లిష్టతను, సంస్కృతీ సంప్రదాయాలను, పరాయీకరణ చెందుతున్న జీవితాలను, మానవ సంబంధాలను, నశిస్తున్న వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులనెన్నింటినో తీసుకొని కథలు రాస్తున్నారు రచయితలు. బోయ జంగయ్యగారి తెలంగాణా వెతలు, బి.యస్. రాములు మమతలు మానవ సంబంధాలు, స్మృతి, కాలువ మల్లయ్య మాకథలు, కాలువ మల్లయ్య కథలు... లాంటి కథాసంపుటులను చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

సమాజంలో, తెలుగు జీవితంలో జరుగుతున్న ప్రతి మార్పుకూ స్పందిస్తూ తెలంగాణా భాష సంస్కృతీ సంప్రదాయాలను ఇతర అనేక విషయాలను కథలుగా మలుస్తూ తెలుగు కథంటే తెలంగాణా కథే అన్నంత బలంగా కథా సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. భవిష్యత్తులో తెలంగాణా సాంఘిక చరిత్ర రాయడానికి ఈ సాహిత్యమెంతో ఉపయోగపడుతుంది. ఏ ప్రాంత సాహిత్యానికీ, ఏ భాషా సాహిత్యానికీ తీసిపోని విధంగా సాహిత్యాన్ని సృష్టిస్తూ తమ సాహితీ ప్రస్థానాన్ని కొనసాగిస్తున్నారు తెలంగాణ రచయితలు.

దర్పణం (ప్రజాశక్తి సాహిత్య సంచిక), 2000

# తెలంగాణా కథను ఎలా చూడాలి?

తన చరిత్ర తనే పఠించి
ఫక్కున నవ్వింది ధరణి.........
తన గాథను తనె స్మరించి
భోరున ఏడ్చింది ధరణి.........

ఈ పరిస్థితే అన్ని కాలాల్లోనూ తెలంగాణకుంది. తెలంగాణ సాహిత్యకారులకు సాహిత్యానికీ ఉంది. ఇక్కడి సాహిత్యకారుల జీవితాలు వడ్డించిన విస్తర్లు కావు. గాడ్ ఫాదర్లు లేరు. తమ పాటలు తామే పాడుకోవాలి. తమ పోరాటాలు తామే చేసుకోవాలి. తమ గురించి తామే రాసుకోవాలి. తమ ఏడ్పు తామే ఏడ్వాలి.

అన్ని రంగాల్లోనూ గాయాల చరిత్రే తెలంగాణది. సాహిత్య రంగమూ అందుకు మినహాయింపు కాదు. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినా తెలంగాణాకు రాలేదు. ఆ తర్వాత నైజాం ప్రభువు దిగిపోయినా గ్రామాలన్నీ ఫ్యూడల్ దొరల చేతుల్లోనే ఉండేవి. నైజాం కాలంలో మాతృభాషలో చదువుకోవడం కూడా ఓ అపురూపమైన విషయమే. దొరలు ఊళ్లోకి బదులు ఆలస్యంగా రావడానికి తమ వంతు ప్రయత్నం చేశారు. అయినా ఇక్కడి పోరాట వారసత్వం, సమస్యలు ఇక్కడి రచయితలతో అనివార్యంగా కలం పట్టించాయి. మొదట్నుంచీ తెలంగాణ నుంచి రాశిలో విరివిగా కాకున్నా వాసిలో చెప్పుకోదగ్గ రచనలే వచ్చాయి.

తెలంగాణలో మాట్లాడేది తెలుగే కాదు పొమ్మన్నారప్పుడు. తెలంగాణలో కవులు, రచయితలే లేరు పొమ్మని కొట్టి పారేశారు. దానికి రోషపడి మూడు వందల యాభై మంది కవుల కవితలతో సంకలనం తీసి చూపించాడు సురవరం ప్రతాపరెడ్డి. తమకంటూ పత్రికలు లేకున్నా స్వాతంత్ర్యానికి ముందు, తర్వాత అష్టకష్టాలు పడి తెలంగాణా రచయితలు తమ రచనలు ప్రచురించుకున్నారు. తాము తమ ప్రాంతం గురించి తమ ప్రాంతం యాసలో రాస్తూ తెలంగాణా వాళ్లు తమ గూర్చి తమ భాషలో రాస్తే ఇదేంటని పెదవి విరిచారు. అయినా ఇక్కడి రచయితలు నేల విడిచి సాము చేయలేదు. ఒకరిద్దరు సినిమాల వెంటబడటానికి ప్రయత్నించినా త్వరలోనే వెనుదిరిగి చూసుకున్నారు. సినిమాలకు రాసినవాళ్లూ తమ సాహిత్య వారసత్వాన్ని కొనసాగించడం వల్ల కవులుగా మిగిలారు కాని సినిమాల వల్ల కాదు.



మధ్యతరగతి సరిహద్దులు దాటి బయటకు రాని కథను, కొన్ని వృత్తుల కులాలకే పరిమితమైన కథను పోరాట కథగా అట్టడుగు జీవితాల కథగా, దళిత కథగా పరిణామం చెందించిన ఘనత తెలంగాణా రచయితలదే. తెలంగాణా నుంచి విస్తృతంగా సాహిత్యం వస్తున్న సమయంలో ఎవరు పడితే వాళ్లు రాయడమేనా అన్నారు. భాష బాగా లేదన్నారు. శిల్పం తక్కువన్నారు. అసలు శిల్పమంటేందో, తెలంగాణ కథ స్వరూప స్వభావాలేంటో, ఏ కథకెలాంటి శిల్పం వాడాలో చెప్పకుండానే వివాదం లేవదీశారు. ఇది వరకు సాహిత్యంలో చోటు చేసుకోని దళిత బహుజన జీవిత కథలు తెలంగాణ నుంచి విరివిగా వచ్చేసరికి వస్తువు నుండి దృష్టి మరల్చే ప్రయత్నం చేశారు. తెలిసో, తెలియకో తమ స్వార్థ ప్రయోజనాల కోసమో ఈ వాదాలతో తెలంగాణా రచయితలూ కొందరు చేతులు కలిపారు.

మొదటితరంలో తెలంగాణా నుంచి మాండలిక భాషలో కథలు, నవలలు వచ్చాయి. వచ్చిన రచనల సంఖ్య తక్కువ కాబట్టి అప్పుడేమనలేదు. తర్వాత విరివిగా రచనలొచ్చేసరికి మాండలికం వద్దన్నారు. వ్యావహారికం చాలన్నారు. మాండలికాన్ని కొంచెం పాలిష్ చేసి రాస్తే మంచిదన్నారు. అన్నీ విన్నారు తెలంగాణ రచయితలు. ఎంతో అంతర్మథనానికి గురయ్యారు. తమకు మంచిగనపించినట్టు రాశారు. కొన్ని పత్రికలు ప్రచురించాయి. కొన్ని ప్రచురించలేదు. అందుకే తెలంగాణా రచయితలు రచయిత కథనాన్ని వ్యావహారికంలో, సంభాషణలను మాండలికంలో రాయాల్సి వచ్చింది. పాత్రోచిత, సంఘటనోచిత భాషనెన్నుకోవాల్సి వచ్చింది. కథ కోసం తీసుకున్న వస్తువును బట్టి ఉద్దేశించిన పాఠకులను బట్టి పూర్తి వ్యావహారికంలోనో, పూర్తి మాండలికంలోనో, వ్యావహారిక మాండలికంలోనో రాయాల్సి వచ్చింది. ఎందులో రాసినా జీవితాన్ని మాత్రం వదిలిపెట్టలేదు. తెలంగాణ ముద్రకు మాత్రం దూరం కాలేదు. ఈ విషయాలన్నీ ఇప్పుడిప్పుడే రాస్తున్నవాళ్లకు తెలియవు. తెలిసినవాళ్లేమో ఎందుకో కాని నోరు మెదపరు. ఏదేమైనా తమదైన మార్గంలో తెలంగాణా జనజీవితాన్ని అక్షరబద్ధం చేస్తూ ప్రాంతీయ ముద్రతో విశ్వజనీన రచనలు చేస్తున్నారు రచయితలు. తెలంగాణా సాంఘిక చరిత్ర రాయగలిగేంత విషయాన్ని తమ కథల్లో నిక్షిప్తం చేస్తున్నారు.

అయినా అచ్చమైన తెలంగాణా మాండలిక రచనలను కాదంటూ తమ అజ్ఞానాన్ని చాటుకునే వాళ్లున్నారు. ఓ దిక్కు ఇతర్ల నుండి వివక్ష కొనసాగుతుంటే మరో దిక్కు మన భాషా సాహిత్యం ఔన్నత్యాలను గుర్తించడం చేత కాక రాస్తున్న వాళ్ల మీద బురద చల్లే ప్రబుద్ధులూ ఉన్నారు. అది వాళ్ల అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని

లేదా అసూయను తెలుపుతాయే తప్ప మరేం కాదు. మరోదిక్కు అష్టకష్టాలు పడి జర్నలిస్టుగా ఎదిగిన తెలంగాణా వాళ్ల జీవితాల గూర్చి, సంఘర్షణ గూర్చి రాస్తున్న వాళ్ల గూర్చి అసలే రాయరు. పాత కీర్తితో బతుకుతున్న ఒకరిద్దరి గూర్చి మాత్రం అప్పుడప్పుడు రాస్తారు. రాయాల్సినవారి గురించి రాయాల్సినవారు రాయరు కనుక ఎవరో రాసిందే, ఈ జీవితాలతో సాహిత్యంతో సంబంధం లేనివాళ్లు చెప్పిందే వేదవాక్కవుతుంది. వాళ్లు తమ మోచేతి కింద చేరేవాళ్ల గురించి మాత్రమే రాస్తారు. అందువల్ల తెలంగాణకథ వివిధ దృక్కోణాల్లోంచి అద్భుతంగా వికాసం చెందినా మరుగున ఉండే ప్రమాదం ఏర్పడింది. ఎవరో సంబంధం లేనివాళ్లు చెప్పిందే తెలంగాణా కథనే దౌర్భాగ్యం కలిగింది.

అందుకే మా కథా విశిష్టత ఇది. ఏ భాషా కథా సాహిత్యానికి తీసిపోని కథలు ఈ ప్రాంతం నుంచి వస్తున్నాయని రచయితలే రాసుకోవాల్సి వచ్చింది. తమ తమ ప్రాంతాల్లోని కథల గూర్చి వ్యాసాలు, సంకలనాలు తీసినవారికి తెలంగాణ నుంచి అదే పని చేస్తే ప్రాంతీయత కనబడింది. అద్భుతమైన కథలు వస్తున్నా సంకలనాల్లో చోటెందుకు లభించడం లేదంటే సంకుచితంగా కనబడుతుంది. పాఠ్య గ్రంథాల్లో తెలంగాణ రచయితల రచనలెందుకు చోటు చేసుకోవంటే జవాబులుండవు. ప్రాంతీయ స్పృహను ప్రాంతీయ ధోరణిగా కొట్టి పారేయడం కొందరికే చెల్లింది. పరిస్థితులిలా ఉటే తెలంగాణా కథల విశిష్టతను తెలిపే వ్యాసాలు తెలంగాణాలోని తెలిసీ తెలియని కొందరికి గుర్తింపు తాపత్రయంగా కనబడింది. వ్యాసం ఉద్దేశాన్నర్థం చేసుకోకుండా పరిశోధనాత్మకంగా రాయాలని సలహాలిచ్చే పీఠాధిపతులు కొందరు.

మరికొందరు ఇప్పుడిప్పుడే కలం పట్టి రాస్తున్నవాళ్లు. కొద్ది కొద్దిగా కథలో, వ్యాసాలో రాసినవాళ్లు తామే మాండలికం రాయడం మొదలుపెట్టామంటున్నారు. వాళ్ల మాండలికంలో రాయడానికి మొదటి తరం, రెండవ తరం రచయితలు రచయితలు ఎలా మార్గం సుగమం చేశారో వీళ్లకు తెలియదు. ముందు తరంలో వచ్చిన రచనలనూ వీళ్లు చదువరు. అయితే పాఠకులు మాత్రం చాలా స్పష్టంగా ఉన్నారు. ఏ రచనను ఎలా చూడాలో ఏది తెలంగాణ రచనో ఎవరు తెలంగాణ జీవితం గురించి రాస్తున్నారో ఎవరు పాతకీర్తితో బతుకుతున్నారో స్పష్టంగా తెలుసు. వీళ్లకు మేధావులకున్నట్లు ఈర్ష్యాద్వేషాలు, వివక్ష, పరిమితులు లేవు. అహంకారాలూ లేవు. వీళ్లు సాహిత్యం ద్వారా ఏదో తెలుసుకోవాలని చదివేవాళ్లు. సాహిత్యంలో తమను తాము చూసుకుంటున్నవాళ్లు. వీళ్లే అసలు సిసలైన విమర్శకులు.

గత పదేళ్లుగా తెలుగు కథ, తద్వారా తెలంగాణా కథ బహుముఖాలుగా



విస్తరించింది. అయితే తెలంగాణా కథను చూడాల్సిన విధంగా చూడకపోవడం వల్ల అన్యాయమే జరుగుతుంది.

మాండలిక భాషలో నాద సౌందర్యముంది. తెలంగాణా నుంచి వచ్చిన కథ, నవలల్లో వస్తువు అట్టడుగు జీవితాలది. బాషా వాళ్లదే. ఇది వర్గ మాండలిక భాష. చాలామంది రచయితలు మాండలిక భాష యొక్క ప్రాధాన్యతను, బలాన్ని గుర్తెరిగే రాశారు. అయితే కథనానికి వ్యావహారికం, సంభాషణలకు పాత్రోచిత మాండలికం ఉపయోగించి కథను మరింత ఎక్కువ మందికి చేరేలా చెయ్యాలని కొన్ని పత్రికలు అనడం వల్ల అలా రాయకా తప్పలేదు. అయితే తెలంగాణా రచయితలు మాండలికంలో ఆలోచించి వ్యావహారికంలో రాశారు. వ్యావహారికంలో రాసినా మాండలిక వాసనలు పోలేదు. ఇలాంటి విషయాలన్నింటినీ గుర్తించాల్సి ఉంది. అందుకే తెలంగాణా రచయితలు మూడు పద్ధతులను ఎన్నుకున్నారు. తీసుకున్న వస్తువును బట్టి పూర్తి మాండలికంలోనో, వ్యావహారికంలోనో, వ్యావహారిక మాండలికంలోనో రాయడం. ఎందులో రాసినా తెలంగాణా తనానికి దూరం కాని రచనలు ముఖ్యం. ప్రచురణ సౌకర్యం మృగ్యమైన సమయంలో సంపాదకుల సూచనల మేరకు భాషలో కొన్ని మార్పులు చేసి రాసిందీ నిజమే. ఇవన్నీ అర్థం చేసుకోకుండా మాండలికంలో రాస్తే అర్థం కాదనో, పూర్తి మాండలికంలో రాయకుంటే తెలంగాణా కథే కాదనో, ప్రాంతీయ స్పృహతో వచ్చిన అద్భుతమైన కథల్ని ప్రాంతీయత ఎందుకనో తేలికగా తీసుకుంటూ తెలంగాణా కథకు అన్యాయం చేస్తున్నారు. కొందరు పీఠాధిపతులు చెప్పిందే వేదమని వాళ్లు చక్రాంకితాలు కొడితేనే సాహిత్యమని భావించడం వల్ల చాలా నష్టం జరిగింది. ఇంకా జరుగుతుంది. వాస్తవికతా శిల్పసౌందర్యంతో, కాల్పనిక మాండలికంలో కాక వాస్తవిక మాండలిక భాషలో రాయబడిన తెలంగాణా కథల్ని చూడాల్సిన విధంగా చూడకపోవడం సాహిత్య కుట్రే... పాత్రల చైతన్య స్థాయిని మించి సంభాషణలు రాస్తే, మాండలికం కోసం మాండలికమన్నట్లు కృత్రిమ మాండలికాన్ని వాడితే అది మాండలిక రచనవుతుందా?

తెలంగాణ కథకులు జానపద కథరీతుల్లోని ఆశుసాంప్రదాయాన్ని స్వంతం చేసుకున్నారు. తెలంగాణా నుంచి వచ్చిన రచయితలు చాలా మంది శ్రామిక కులాల నుంచి వచ్చినవాళ్లే. తీసుకున్న వస్తువు తమకు తెలిసిన శ్రామికవర్గానిది. నశించిన వృత్తుల కార్మికుల... కర్షకులు... దళితులు.. గిరిజనులు... పీడితులు..... వీళ్ల గురించి రాసేటప్పుడు ఏ శిల్పం కావాలి? ఏవేవో ప్రయోగాలు చేసో, మ్యాజిక్ రియలిజం

పేరు మీదనో మరుగున పెట్టి రాస్తే కథెవరికి చేరుతుంది? అందుకే ఆశు సాంప్రదాయ కథనరీతుల్ని ఎన్నుకొని ప్రజలను చేరే కథలు రాశారు. వీటిని విమర్శకుల పీఠాధిపతుల దృష్టికోణంలోంచి చూస్తే ఎలా ఉంటుంది? అందుకే 1970-90 ప్రాంతంలో తెలంగాణా నుంచి ఉధృతంగా వచ్చిన విప్లవ కథల్లో, ప్రజాకథల్లో శిల్పం లేదన్నారు కొందరు. సిద్ధాంతాల బరువుందన్నారు. మధ్యతరగతి దృష్టి కోణంలోంచి రాస్తే గొప్పకథలన్నారు. ఇదెంత అన్యాయం?

ఇదే విమర్శ జీవితంలోంచి వస్తువును తీసుకొని వాస్తవికతా పరిమళంతో వస్తున్న కథల విషయంలోనూ చేశారు, చేస్తున్నారు. ఏ వస్తువైనా సరే శిల్పముంటే చాలని దృష్టి మరలుస్తున్నారు. శిల్పముండకూడదని ఎవరన్నారు? కాని ఏ శిల్పం లేందే కథ వేలాది, లక్షలాది పాఠకుల్ని చేరాయా; చేరుతున్నాయా? ముఖ్యంగా తెలంగాణా నుంచి వచ్చే కథను పాఠకుల దృష్టి కోణంలోంచి చూడాలి. ప్రయోజనం దృష్టి కోణంలోంచి చూడాలి. అనేక సమస్యల వలయంలో గాయాల సలుపులతో కొట్టుమిట్టాడుతున్న తెలంగాణకు కావాల్సింది ఆనందాన్ని మాత్రమే ఇచ్చే కథ కాదు. ఓహో అనిపించే కథలు కాదు. ప్రయోజనాన్ని చేకూర్చే కథలు. కర్తవ్యాన్ని బోధించే కథలు. తమను తాము తెలుసుకునేట్టు చేసే కథలు. పీఠాధిపతులను సంతృప్తిపరిచే కథలు కాదు. గ్లోబలైజేషన్, కంప్యూటరైజేషన్, దూరదర్శనైజేషన్ లాంటివన్నీ మన మెదళ్లను తినేస్తున్నాయి. మనం మనం కాకుండా చేస్తున్నాయి. హైటెక్ బంగ్లాల కథల్ని, గుడిసె కథల్ని ఒకే శిల్ప ప్రమాణాలతో కొలవడం సరైందేనా?

తెలంగాణలోని పరిస్థితులు, వివిధ పోరాటాలు పని కులాల నుంచి వచ్చేవాళ్లను రచయితలుగా ఎదిగించారు. ఈ రచయితలు చెప్పే శ్రామిక సంస్కృతిని ఉన్నతీకరించడం, దళిత బహుజనుల పక్షం వహించి రాయడంలాంటివన్నీ పీఠాధిపతులకు మింగుడు పడటం లేదు. అందువల్ల ఈ కథలను, రచయితలను ఇగ్నోర్ చేస్తున్నట్టు నటిస్తున్నారు. దాంతో తెలంగాణా కథకు అన్యాయమే జరుగుతుందన్న విషయం గమనించాలి. సాహిత్యం ద్వారా సామాజిక మార్పులను కోరుకుంటున్న తెలంగాణా కథను వస్తువును అప్రధానం చేసి చూడటం ద్రోహమే అవుతుంది. ఈ కథలు పాఠకుల కోసం తప్ప విమర్శకుల, పీఠాధిపతుల మెప్పు కోసం రాయబడినవి కావు. సాహిత్యం జీవిత వృక్షానికి పూసే పువ్వు అని కాకుండా పువ్వుల్నుండి పూసే కాగితం. పువ్వుల్ని నెత్తిన పెట్టుకుంటామంటే చేసేదేం లేదు.

ప్రతి ఉద్యమానికి స్పందిస్తూ కథలు రాయడమే కాకుండా దళిత బహుజనుల గూర్చి విరివిగా కథలు రాస్తూ పనిమంతుల సంస్కృతిని ఉన్నతీకరించే కెతలు



తెలంగాణ నుంచి వచ్చాయి. వీటిని కులం కథలని లోలోపల గొణిగేవాళ్లు ఇంతవరకు వచ్చిన ఉత్తమ కథలన్నీ కులానికో, వృత్తికో, వర్గానికో సంబంధించినవి కావని చెప్పగలరా? దళిత, శ్రామిక కులాల సంవేదన, తాత్వికతలతో కూడుకున్న కథలను మూసబోసిన సిద్ధాంతం, కులం కళ్లద్దాల్లోంచి చూస్తేమన్నట్టు?

తెలంగాణా కథల్లో ఉంది ప్రాంతీయ దృక్పథం కాదు. ప్రాంతీయ స్పృహ తెలంగాణా కథల్ని తెలంగాణా జనజీవిత నేపథ్యంలోంచి, పాఠకుల దృష్టికోణంలోంచి, ప్రయోజనం కళ్లలోంచి, జనం దళిత బహుజనం దృక్పథంలోంచి చూడాలి. తెలంగాణా జీవన వాస్తవికతను నిఖార్సయిన రీతిలో చిత్రించే రచనలను అందులో పరకాయ ప్రవేశం చేసి చూడాలి. గ్లోబలైజేషన్ గూర్చి రాసినా, పరిశ్రమల మూసివేత గూర్చి రాసినా, వృత్తుల పతనం గూర్చి రాసినా, అనివార్య వలసల గూర్చి రాసినా అందులో తెలంగాణా ముద్ర ఉండితీరాలి. అది పాఠకుల్ని పెంచుకుంటూ పోవాలన్న విషయం మరిచిపోకూడదు. అస్పష్టత, పదాడంబర, భావక్లిష్టతల వల్ల వచన కవిత పాఠకులకు దూరమైనట్టు తెలంగాణ కథ పాఠకులకు దూరం కాకూడదు. ప్రాంతీయ స్పృహతో విశ్వజనీనం చేస్తూ వస్తున్న రచనలను చూసే విధానంలో మార్పు రావాలి. ఈ కథలపై విశేషంగా పరిశోధన జరగాలి. అప్పుడే అసలు కథలేవో బయటకొస్తాయి.

**ఆదివారం వార్త, 15 సెప్టెంబర్ 2002**

# తెలంగాణ కథాశిల్పం - ప్రయోజనాలు

తెలంగాణ కథలకు కాణాచి.. ప్రతి ఇంటి లోగిలీ కథా కేంద్రమే. ముఖ్యంగా గ్రామాల్లో ఈ కేంద్రాలెక్కువగా కనబడతాయి. వాకిళ్లలో నులకమంచాల్లో కూచొని చుట్టలు తాగుతూ అనగనగా ఒక రోజంటూ కథలు చెప్పడం చూడని వారుండరు. అద్భుత కథలు, దెయ్యాల కథలు, సాహసనీతుల కథలు, పేదరాశి పెద్దమ్మ కథలు, తెనాలి రామలింగని పేరు మీద కథలు చెప్పడం మనం గమనిస్తూనే ఉంటాం. కమ్మరి ధాటి దగ్గర కూచొని  నాగండ్లు, జంబులు, కొడవీళ్లు, గొడ్డళ్లు పదును పెడుతూ కబుర్ల రూపంలో కథలు చెప్పుకోవడం ఎప్పట్నుంచో ఉంది. మూడు బజార్ల దగ్గర జరిగే పంచాయతీల్లో మధ్యమధ్యన శాత్రాలేస్తూ పిట్టకథలు చెప్పడమూ ఉంది. నడుముకూ మోకాళ్లకు పంచెలు కట్టుకొని బండల మీద కూచొని అటూ ఇటూ ఊగుతూ ముచ్చట్లు ముచ్చట్లుగా కథలు చెప్పేవాళ్లూ ఉన్నారు. తాతయ్యా నాకో కథ చెప్పవా! నానమ్మా శాత్రం చెప్పవా? నాన్నా - అమ్మా కథలు చెబితేనే అన్నం తింటామనే పిల్లవాళ్లు.... కథలు చెబుతూ అన్నం తినిపించడం నిద్రపుచ్చడం చేసే పెద్దలూ ఉన్నారు. కథలంటే చెవి కోసుకునే వారు చాలా మందే ఉన్నారు. మాట మాటకో సామెత చెబుతూ మధ్యమధ్యన పిట్టకథలు చెబుతూ సంభాషణలను రక్తి కట్టించే పెద్ద మనుషులున్నారు. ఊరిస్తూ ఊరిస్తూ కథ చెబుతూ కథ చెప్పడంలో అద్భుతమైన నైపుణ్యాన్ని ప్రదర్శించే వాళ్లు అనేక మందున్నారు. ఇలా కథ కొత్తదేం కాదు. కథలు చెప్పడం వినడం ఎప్పట్నుంచో ఉంది. జాడీ మీద కథ, కల్లు మీద కథ, బీడీ తాగుతూ కల్లు తాగుతూ కథలు చెప్పడం ఒక్కో అంశం మీద నోటి కథలల్లడం గ్రామాల్లో చూస్తూనే ఉన్నాం. శారదకాళ్లు, ఒగ్గు కథలు ప్రేక్షకులకు ఆసక్తి కలిగించే విధంగా కథలు చెబుతూ ఉత్కంఠ కలిగించడం అందరి అనుభవంలోకి వచ్చిందే. నువ్వు ఊకొడితేనే కథ చెబుతాను అని ఎవరో ఒకరు ఊకొడుతుంటే గంటల తరబడి కథలు చెప్పే నేర్పరులూ ఉన్నారు.

ఈ కథా సాంప్రదాయం మనకు ఆదిమకాలం నుంచీ ఉంది. చదువు వచ్చిన వాళ్లయినా చదువు రానివాళ్లయినా మాట నేర్పరితనముంటే కథ చెప్పగలిగే సామర్థ్యం ఉంటే కథలు చెప్పడం కొత్త విషయమేమీ కాదు. కథలు చెప్పడం అందరి వల్లా కాకున్నా కథలు వినడం అంటూ చేయని వాళ్లు తెలంగాణాలో ఉండకపోవచ్చు. రామాయణ, మహాభారతాల్లాంటి కార్యాల్లోని ఘట్టాలను తమ భాషలోకి తమ మూసలోకి మార్చుకొని కథలు చెప్పుకునే వాళ్లు కోకొల్లలే. తెల్లవార్లూ గంటల తరబడి కతలు



చెప్పే జానపద కథకులూ ఉన్నారు. అయితే ఇవన్నీ నోటి కథలు. ఆశువుగా చెప్పుకునే కథలు. వీటిని కథలు అనడం కంటే 'కత' అనడమే సరైంది. ఇందులో కథుంటుంది. ఇవి అలవోకగా చెప్పుకునే కథలు. ఇలాంటి కథలకు శిల్పమద్దితే కథవుతుంది. వస్తువును సమకాలీనం చేస్తే ఆధునిక కథవుతుంది. ఈ ఆధునిక కథ తెలంగాణలో పుట్టి తొమ్మిది దశాబ్దాలు దాటింది. అది తనను తాను ఆధునికం చేసుకుంటూ అన్ని సమకాలీన సామాజిక విషయాలకు, ఉద్యమాలకు అద్దం పడుతూ వివిధ పోకడలు పోతుంది.

ప్రాచీన కథ వస్తు ప్రధామైందయితే ఆధునిక కథ శిల్ప ప్రధానమైంది. ఆశు కథ ఊకొట్టుకుంటూ వినడానికి, చెప్పడానికి అనువైనదయితే ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులోకొచ్చిన ఆధునిక కథ చదువుకోడానికి అనుకూలమైంది. అది ఊకొట్టే ప్రజల కోసం చెప్పబడినదైతే ఇది చదువొచ్చిన మధ్యతరగతి చదువరుల కోసం ఉద్దేశింపబడింది. తొంబై ఏళ్ల క్రితం ప్రారంభమైన తెలంగాణా ఆధునిక కథ అందరికోసం ఉద్దేశింపబడింది. తెలుగుకథ మధ్యతరగతి దృష్టి కోణంలోంచి, శిల్పంలోంచి ప్రారంభమైనా తెలంగాణా కథ ఆ దృష్టికోణాన్ని తనది చేసుకుంటూ అట్టడుగు ప్రజల, పాఠకుల శిల్పాన్ని తనది చేసుకొని ఆశు సాంప్రదాయాన్ని హృదయానికి హత్తుకొని ప్రారంభమైంది. అందుకే మొదటితరంలో వచ్చిన కొన్ని కథలు, ఆ తర్వాత వచ్చిన కొన్ని కథలు పోరాటాల ఉధృతి ఉన్నప్పుడు వచ్చిన కథలు, దళిత బహుజన వర్గాల గురించి వచ్చిన కథలు చాలావరకు ఆశు కథా శిల్పాన్ని తనవి చేసుకున్నవే. ఆ కథకు లిఖిత కథా శిల్పంతో మధ్యేమార్గంగా వచ్చిన కథలు. కథను ముచ్చట చెప్పినట్టు చెప్పడం, ఆసక్తి కలిగించే విధంగా చెప్పడం, అందరికీ అర్థమయ్యే పద్ధతిలో వాళ్లకు చేరుకునేట్టు చెప్పడం ఈ శిల్ప రహస్యం. దీని ప్రధాన ఉద్దేశం కథ పాఠకుల్ని చేరుకునేట్టు చేయడం. తెలంగాణ కథకులు అన్ని శిల్లాల్లో రాసినా ప్రధానంగా ఎన్నుకున్నది ఆశు కథా శిల్పమే. వచన కవితలోని అస్పష్టత, కొన్ని కవితల్లోని క్లిష్టత వచన కవితను సామాన్య పాఠకులకు దూరం జరిపినట్టు కథ సామాన్య పాఠకులకు దూరం కావడం ఈ కథకులకిష్టం లేదు. పాఠకులను చేరడం ప్రయోజనం ధ్యేయంగా లిఖిత కథకు ఆశు సాంప్రదాయ లక్షణాలను పొదివి తెలంగాణ కథను పాఠకుల కథగా తీర్చిదిద్దారు. శ్రీనాథుడి కవిత్వం పండితులకే పరిమితమైతే పోతన కవిత్వం అందరి నాలుకలపై ఆడుతుంది. ఆశు లక్షణాలున్న తెలంగాణ కథ కూడా వేమన పద్యంలా అందరి కథయ్యే అవకాశముంది. అందుకే తెలంగాణ కథా శిల్పం ప్రధానంగా ఆశు కథా శిల్పమే. మొదటి తరంలో వచ్చిన కథలు, సురవరం ప్రతాపరెడ్డి మొగలాయి కథలు, తెలంగాణ పోరాట కథలు,

భూపోరాటాల సమయంలో వచ్చిన కొన్ని కథలు, ప్రజా అట్టడుగు స్వభావమున్న అనేక కథలు ఈ కోవలోకి వస్తాయి. ఆశు కథకు ప్రజల భాషనున్నుకున్నట్టే తెలంగాణ కథకులు తమ కథలకు ప్రజల భాషనే ఎన్నుకున్నారు. ఎన్నుకున్న వస్తువును బట్టి భాషను నిర్ణయించుకోవడానికి తెలంగాణ కథను పరిశీలిస్తే అర్థమవుతుంది. ఇది లిఖిత కథ కాబట్టి ఈ కథలకు భాష విషయంలో మూడు మార్గాలనెన్నుకున్నారు. వస్తువు పూర్తిగా గ్రామీణమైనదో, మాండలిక జీవితానికి సంబంధించిందో అయినప్పుడు రచయిత కథనానికి సంభాషణలకు మాండలికాన్నే ఎన్నుకొని మొత్తం కథను మాండలికంలోనే రాశారు. కథా వస్తువు మరికొంత పైస్థాయిది అయనప్పుడు కథనానికి వ్యావహారికం, సంభాషణలకు మాండలికం వాడారు. కథా వస్తువు మాండలికానిది కాకుంటే మొత్తం కథను వ్యావహారికంలోనే రాశారు. పత్రికల నిబంధనలకు లోబడి అన్నింటికీ మాండలికం వాడటంలో కొంత వెనకంజ వేయడమూ కనబడుతుంది. తీసుకున్న వస్తువు పూర్తి మాండలికంలో రాస్తేనే రక్తి కడుతుందనుకున్నప్పుడు పూర్తి మాండలికం వాడటానికి వెనకాడలేదు. ఈ భాషా సాంప్రదాయాన్ని, ఆశు కథా సాంప్రదాయాన్ని తొలితరం తెలంగాణ కథల్నుండి ఇప్పటి వరకూ ఎంతో కొంత కొనసాగిస్తూనే ఉన్నారు. ఇదే తెలంగాణ కథకున్న బలం, ప్రత్యేకత. ఈ లక్షణంతోనే పోతన, వేమన పద్యాల్లా తెలంగాణ కథ ప్రజా కథవుతుంది.

ఆశు కథాశిల్పానికి ప్రాధాన్యమిచ్చినా లిఖిత కథకున్న అన్ని శిల్ప పద్ధతులనూ తెలంగాణ కథకులు అవలంబిస్తూ కథను ముందుకు తీసుకెళ్తున్నారు. ఏ ప్రాంతం, భాష, దేశ కథలైనా ఆశుకథ శిల్పకథన పద్ధతుల్ని సంపూర్ణంగా తనవి చేసుకొని లిఖిత కథలు రాస్తే ఆ కథలు కచ్చితంగా ప్రయోజనకరమైన గొప్ప కథలవుతాయి. తెలంగాణ కథకులు కొంత వరకు మాత్రమే ఈ పద్ధతుల్ని స్వంతం చేసుకున్నారు. ఈ పద్ధతి పాఠకుల్ని చేరుకుంటానికి ఎంతో ఉపయోగపడుతుంది. ఈ పద్ధతితో పాటు ఉత్తమపురుషలో 'నేను'గా కథ చెప్పే పద్ధతిలోనూ అనేక కథలొచ్చాయి. వుప్పల నరసింహం ముద్ర కథనాలు, అల్లం రాజయ్య 'కథ', కాలువ మల్లయ్య అవ్వతోడు గిది తెలంగాణ కథలు జానపద కథన రీతుల్ని లిఖిత కథకు పొదివి రాసిన పద్ధతులు.

సర్వసాక్షి దృక్కోణంలోంచి ప్రథమ పురుష కథనంలో రాసిన కథలు ఏ భాషలోనైనా ఎక్కువే. తెలంగాణ కథల్లోనూ ఈ శిల్పంలో రాసిన కథలు అత్యధికంగా ఉన్నాయి. ఇందులో రచయితే సర్వసాక్షి. అన్ని తనకు తెలిసినట్టే రాస్తాడు. పాత్రల అంతరంగంలోకి ప్రవేశిస్తాడు. అన్ని విషయాలనూ వెలికి తీస్తాడు. కథలో చెప్పిన విషయాలన్నీ రచయిత భావాలే కాకున్నా రచయిత కథ ద్వారా చెప్పదలుచుకున్న



నీతో, సందేశమో, భావమో పాఠకులకందడానికి ఒకటి రెండు పాత్రల్ని ఎన్నుకుంటాడు. ఏ కథాసంకలనం, కథాసంపుటి, ప్రసిద్ధ కథకుల కథలు తిరిగేసినా ఈ శిల్పంలో రాసిన కథలనేకం కనబడతాయి. ప్రాచీన అలంకార శాస్త్ర విషయాలను, పురాణ సంబంధమైన విషయాలను తీసుకొని ఆధునిక కథకు పొదివి సరికొత్త కథా శిల్పంతో రాయబడిన కథలూ ఉన్నాయి. నవరసాలను మధ్యతరగతి జీవులకు వర్తింపజేసి రాసిన జీవచ్ఛవం, పురాణ సంబంధ విషయాన్ని తీసుకొని రాసిన దక్షయజ్ఞం లాంటివెన్నో కథలున్నాయి.

సాదాసీదా కథ చెప్పే కథనపద్ధతుల్ని తీసుకొని వాస్తవికతా కథాశిల్పంతో అనేక కథలు రాశారు తెలంగాణ కథకులు. కథకు ఆసక్తికరమైన లేదా ఉత్కంఠను రేపే ముగింపు ఉండాలని ఓ హెన్రీ కథలనుదహరించేవాళ్లున్నారు. కాని ఉత్కంఠను రేపే మలుపులు, ఊహించని ముగింపులు, అనుకునేదొకటయితే అయ్యేది మరొకటిగా ఉండే ముగింపులు మంచికథకు, ప్రజా కథకు అవసరం లేదు. మంచి కథ దానికదే ముగుస్తుంది. సహజంగా ముగుస్తుంది. యజ్ఞం కథకు ఆ ముగింపు చర్చకు దారి తీసిందేమో కాని అది సహజనమైన ముగింపు కాదు. కథా నియమాల కోసం కొంత ఆసక్తిని రేకెత్తించే విధంగా కథలను మలిచినా తెలంగాణ కథకుల చాలా కథలు వాస్తవిక ముగింపుతో పూర్తవుతాయి. వాటికవే ముగుస్తాయి. జీవితంలోని అన్ని సమస్యలకూ పరిష్కారాలు లేనట్టే కొన్ని కథలకూ ముగింపులుండవు. తెలంగాణ నుంచి ప్రసిద్ధులైన కథకులిటువంటి కథలెన్నో రాశారు.

కథకులు మామూలుగా రాసి ప్రయోజనం ధ్యేయంగా రాసిన కథలతో పాటు ప్రయోగాలు చేసి రకరకాలుగా కథలు రాసినవాళ్లూ ఉన్నారు. అంపశయ్య నవలతో తెలంగాణ రచయితలకు చైతన్యస్రవంతి కథాశిల్పాన్ని పరిచయం చేశాడు నవీన్. ఈ కథనం ద్వారా పాత్ర అంతరంగాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించవచ్చు. బయటకు అనలేని విషయాలను అంతరంగ కథనం ద్వారా చెప్పవచ్చు. ప్రాచీన నాటకాల్లోని స్వగతాల్లాంటి విషయాలనూ బయట పెట్టవచ్చు. ఇంగ్లీషు సాహిత్యం ద్వారా తెలుగుకు పరిచయమైన ఈ శిల్పంలో బుచ్చిబాబు, రావిశాస్త్రి, వడ్డెర చండీదాసు, తెలంగాణ నుంచి నవీన్ మంచి నవలు రాసి ప్రసిద్ధులయ్యారు. తెలంగాణ నుంచి ఈ శిల్పానికాద్యులుగా నవీన్‌నే పేర్కొనవచ్చు. ఈ శిల్పంలో ఆతడు కథలు రాయకున్నా ఆ స్ఫూర్తితో కథలు రాసినవాళ్లు సదానంద శారద, ఆడెపు లక్ష్మీపతి, కాలువ మల్లయ్య లాంటివాళ్లు జీవన్మృతుడు, విధ్వంస దృశ్యం, తిర్యగ్రేఖ, పొగగొట్టం, మానవ స్వప్నం, ఓ మహాత్మా ఓ మహర్షీ, త్రిశంకువర్గంలాంటి కథలు ఈ శిల్పంలో వచ్చిన కథలు.

కేవలం లేఖల ద్వారా కథ నడపడం ఓ పద్ధతి. ఇది కూడా ఓ అద్భుతమైన శిల్ప విన్యాసమే. ఈ పద్ధతిని తీసుకొని మనుషుల అంతరంగాలను విప్పుతూ వచ్చిన కథలు లేఖాస్త్రం, ప్రియ మిత్రమా, డైరీ.

కథంటే ఏకాంశ వ్యగ్రత, స్వయం సమగ్రత, సంక్షిప్తత లక్షణంగా ఉండాలని చెప్పబడినా ఈ లక్షణాలకొదగని అద్భుత కథలెన్నో రాసినవాళ్లున్నారు. కథ ద్వారా పాతికేళ్ల జీవితాన్ని చెప్పి కథంటే సమగ్ర సామాజిక చిత్రణ అని నిరూపించారు. సమగ్ర సామాజిక చిత్రణతో, పని తాత్వికతా శిల్పంతో సహస్రవృత్తుల సమస్త చిహ్నాలను ఉన్నతీకరిస్తూ వచ్చిన పనిసంస్కృతి, వారసత్వం, జాడ, యుద్ధభూమిలాంటి ఎన్నో కథలున్నాయి. రచయిత ఏమీ వాఖ్యానించకుండా కథనం చేయకుండా కేవలం సంభాషణల ద్వారా కథను నడిపించే శిల్పపద్ధతిలో కథలు రాయడం నాటకీయ శిల్పం. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కలుపు మొక్కలు కథలో ఈ శిల్పాన్ని అద్భుతంగా వాడుకున్నాడు. ముసల్దాని ముల్లె, తూర్పు వెళ్లే రైలు, మద్రాసు టు ఢిల్లీ కథలు ఈ శిల్పంలో వచ్చిన మంచి కథలు. సంఘటనా ప్రధానంగానూ, గ్రామాలను, ప్రకృతిని వర్ణించే సమయంలో వర్ణనా ప్రధానంగానూ వచ్చిన కథలు చాలానే ఉన్నాయి. అన్ని రకాల శిల్పాలను తమవి చేసుకొని వాటిని ప్రజలకు చేరే పద్ధతుల్లో కథలు రాశారు.

కథను మధ్యలోనో, చివరలోనో ప్రారంభించి వెనక్కి పోవడం, దానికి సంబంధించిన కథను నడపడం మళ్లీ ముందుకు పోవడం అవసరమైతే మళ్లీ గతంలోకి పోవడం ఆధునిక శిల్పపద్ధతుల్లో ఒకటి. జ్ఞాపకాల్లోకి పోవడం, వర్తమానంలోకి రావడం, భవిష్యత్తునూహించడం లాంటి అనేక కథన పద్ధతుల్లో శిల్ప రీతుల్లో కథలు రాసి తెలంగాణ కథను ఎన్నో ఎత్తులకు తీసుకెళ్లిన కథకులున్నారు. భద్రత, అతడు, వేపచెట్టు లాంటి అనేక కథలిందుకుదాహరణలు. చలం ఓ పువ్వు పూసింది కథ ఓ అద్భుతమైన ఫాంటసీ. కల్పనే అయినా ఊహాత్మకమైందే అయినా ఇలా జరడానికి అవకాశం ఉందనిపించేదే ఫాంటసీ. ఫాంటసీ కథనంలోనూ ఒకటి రెండు కథలొచ్చినా ఇంకా రావాల్సిన అవసరం ఉంది. మాజిక్ రియలిజం కథన శిల్పంలో తెలంగాణ నుంచి ఒకటి రెండు కతల కంటే ఎక్కువ రాలేదు.

ఇలా తెలుగులో వచ్చిన అన్ని కథా శిల్పాల్లో కథలు రాసి వాస్తవికతకు ప్రాధాన్యం ఇచ్చి ప్రయోజన దృష్టి ధ్యేయంగా తెలంగాణ కథకులు కథా ప్రస్థానం కొనసాగిస్తున్నారు.



# తెలంగాణ కథల్లో గ్రామాలు, వలసలు మానవసంబంధాలు

సమకాలీన సామాజిక ఉద్యమాలను, గ్రామాలను తీసుకోకుండా, ఆ విషయాలపై రాయకుండా తెలంగాణ కథారచయితల్లో పేరు తెచ్చుకున్నవాళ్లు అరుదు. చాలా మంది రచయితలకు గ్రామమే కథావస్తువైంది. అయితే ఈ గ్రామం ప్రకృతి అందాలతో, నదీనదాలతో, చెట్లుగుట్టలతో ఉండేది మాత్రమే కాదు, ఈ గ్రామం కాల్పనిక గ్రామం కాదు. సంఘర్షణామయమైన గ్రామం. ఈ గ్రామాలే సృష్టికర్తలకు చిరునామాలు. ఈ గ్రామాలే సర్వసంపదల ఉత్పత్తికి నిలయాలు. ఈ గ్రామాలే పోరాట కేంద్రాలు. అనేక ఉద్యమాలను తనలో సంలీనం చేసుకున్న స్థలాలు. చిల్లర దొరలకు స్థావరాలై ఫ్యూడల్ భావాలతో కులపీడనతో ఉన్న తెలంగాణ గ్రామాలు పోరాట కేంద్రాలయ్యాయి. భూమి పంపకాలకు స్థావరాలయ్యాయి. పోలీసుల బూట్ల చప్పుళ్లతో అల్లకల్లోలమయ్యాయి. అటు అన్నలు, ఇటు పోలీసుల దాడులతో అగ్నిగుండాలుగా మారాయి. ఈ విషయాలను వేటినీ వదిలిపెట్టకుండా అక్షరబద్ధం చేశారు రచయితలు. ఊరంటే సంఘర్షణ అనే విషయాన్ని స్పష్టంగా చెప్పారు.

పోరాటాలతో వచ్చిన ఫలితాలను కథలుగా మలిచారు. తెలంగాణ గ్రామాల్లో నైజాం పాలనా కాలంలోనూ, ఆ తర్వాత జరిగిన భూపోరాటాల్లోనూ లక్షలాది ఎకరాల భూమి పంపకం జరిగిన క్రమాన్ని దేన్నీ వదిలిపెట్టకుండా కథలుగా మలిచారు. వివిధ రకాల పోరాటాలతో తెలంగాణ గ్రామాల్లో పతనమైన భూస్వామ్య వ్యవస్థ స్వరూప స్వభావాలను ఆవిష్కరించారు. దొరలు ఊళ్లొదిలిపోయిన క్రమాన్ని తెలిపారు. వీటన్నిటితో పాటు గ్రామాల్లో వృత్తులు నశించి ప్రత్యామ్నాయాలు లేక బతుకులు ఘోరాతిఘోరంగా మారిన విషయాలనూ అక్షరీకరించారు. కులపడీనను, దొరల దౌర్జన్యాలను. తెలంగాణ రక్తమాంసాల్లో జీర్ణించుకుపోయి ఉన్న తిరుగుబాటుతత్వాన్ని దేన్నీ వదిలిపెట్టకుండా కథలు రాశారు.

భారతీయ సమాజం గ్రామీణ సమాజం. ఇప్పటికీ డెబ్బై శాతానికి పైగా జనాభా గ్రామాల్లోనే ఉంటున్నారు. కులవ్యవస్థలో అంతరాలను తొలగిస్తే పనికి విలువనిచ్చే సంస్కృతిని ఉన్నతీకరిస్తే ఇంత కంటే మంచి వ్యవస్థ ఎక్కడా ఉండదు. భారతీయ సమాజానికి వర్ణవ్యవస్థ, అంటరానితనం మాయని గాయాల్లాంటివి. దేశం

అవమానంతో తలదించుకోవాల్సినంత దుర్మార్గమైంది. అంటరానితనంలోని దుర్మార్గాన్ని పీడితులపై అగ్రవర్ణాలవారి ఆధిపత్యాన్ని అనివార్యంగా పోరుబాట తొక్కిన వైనాన్ని కథలుగా మలిచారు. గ్రామాల గురించి, సృష్టికర్తల గురించి అంతగా లేని కథల లోటును తీర్చారు. హైటెక్కు మాయలోనూ, కంప్యూటర్ల గోలలోనూ, విదేశీ మోజు సమయంలోనూ గ్రామాల గూర్చే ఎక్కువ కథలు రావడం గమనించాల్సి విషయం. వివిధ కారణాల వల్ల ఛిద్రమైన రైతుల బతుకులు పతనమైన వ్యవసాయాలు, అన్ని వృత్తులూ కోల్పోయి వ్యవసాయ కూలీలుగా మారిన క్రమం, ఆ వ్యవసాయం కూడా సంక్షోభంలో పడితే దిక్కుతోచని గ్రామీణ ప్రజానీకం గూర్చి అనేక కథలు రాశారు. ఊరంటే కాల్పనిక భ్రమలు కావు. ఊరంటే సృష్టికర్తలుండే స్థలమని నొక్కి చెబుతూ రాశారు.

గ్రామీణ జీవితంలోని ప్రేమలు, ఆప్యాయతలు, బంధుత్వ మమకారాలు, ఆచార వ్యవహారాలు, బోల్లకోరితనం, ఒకరినొకరు వరుసలు పెట్టుకొని పిలుచుకునే సమీపత్వాలన్నింటినీ అక్షరీకరించారు. ఊరు సమగ్ర స్వరూపాన్ని ఆవిష్కరింపజేశారు. మొదటితరాల్లో గ్రామాల్లో చదువుకోవడం నిమ్న కులాలవారికి ఎంత కష్టంగా ఉండేదో, అయినా పరిస్థితులను అధిగమించి తమకున్న స్వల్ప అవకాశాలను ఉపయోగించుకొని చదువుకొని జీవితాలను గెలుచుకున్న క్రమాన్ని కథలుగా మలిచారు. జానపద కళలు ఆదరణ కోల్పోవడం, వాళ్ల బతుకుల్లోని విషాదం, వివిధ పరిణామాల వల్ల గ్రామాల్లో వచ్చిన ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిణామాలకు అద్దంపడుతూ కథలు రాశారు. గ్రామాలకు సంబంధించిన ఏ విషయాన్నైనా వదిలిపెట్టకుండా సంపూర్ణ గ్రామాన్ని ఆవిష్కరిస్తూ అద్భుతమైన కథలు రాశారు. తెలుగు కథాసాహిత్యంలోనూ, తెలంగాణ కథా సాహిత్యంలోనూ ఈ కథలు చెప్పుకోదగ్గవే.

నిజాం కాలంనాటి గ్రామాల గూర్చి, గ్రామీణ స్వభావం గూర్చి మాడపాటి, సురవరం ప్రతాపరెడ్డి, గూడూరి సీతారాం, సురమౌళి లాంటివాళ్ల కథల్లో చూడవచ్చు. ఆ తర్వాతి గ్రామాల స్వరూప స్వభావాలను అర్థం చేసుకోవడానికి బోయ జంగయ్య, చెరబండరాజు, నవీన్, యం.వి. తిరుపతయ్య లాంటి వాళ్ల కథలను చదివితే సరిపోతుంది. రెండవసారి భూపోరాట గ్రామాల స్వరూప స్వభావాలను, పోరాట చైతన్యాన్ని అల్లం రాజయ్య, రఘోత్తమరెడ్డి, బి.యస్. రాములు, కాలువ మల్లయ్య, పి. చంద్ లాంటివాళ్ల కథల్లో చూడొచ్చు. వృత్తులు నశించిపోయి ప్రత్యామ్నాయాలు లేని బతుకు వెతలను, సామాజిక పరిణామక్రమంలో వచ్చిన మార్పులు, పీడిత కులాల



వాళ్లు జీవితాలను గెలుచుకున్న క్రమాన్ని, పోరాటాతేర గ్రామీణ జీవితాన్ని కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, జూకంటి జగన్నాథం, సదానంద శారద, పెద్దింటి అశోక్‌కుమార్, ఆదెపు లక్ష్మీపతి ఇంకా అనేకమంది రచనల్లో చూడవచ్చు. ఇలా తెలంగాణ గ్రామీణ జీవనం గూర్చి, తెలంగాణ ప్రజల సాంఘిక చరిత్ర రాసేంత విషయాన్ని కథల్లో నిక్షిప్తం చేశారు. తెలంగాణ రచయితల కథా సంపుటాలను, కథా సంకలనాలను పరిశీలిస్తే మనకీ విషయం స్పష్టమవుతుంది.

తెలంగాణ జీవితంలో కాని, తెలుగు జీవితంలో కాని, ఏ ప్రాంత ప్రజల జీవితాల్లో కాని వలసలు ఓ ప్రధాన భాగమే. సమాజం స్తబ్దుగా ఉన్నప్పుడు, పారిశ్రామికీకరణ జరుగక ముందు వ్యవసాయమే ప్రధాన ఆదాయవనరుగా ఉన్నప్పుడు వలసలు తక్కువ. ఎక్కడి వాళ్లక్కడే వ్యవసాయ, వ్యవసాయాధార పనులు చేసుకుంటూ బతికేవారు. పట్టణాలు పెరగడం, పారిశ్రామిక ఉత్పత్తులు పెరగడం ప్రారంభమైన తర్వాత వివిధ కారాణాల వల్ల వలసలూ పెరిగాయి. చదువులతో పాటు ఉద్యోగాలు ప్రారంభమైన తర్వాత కూడా గ్రామాలను వదిలిపోవడం ఎక్కువైంది. పారిశ్రామికీకరణ జరిగిన తర్వాత కూడా గ్రామాలను వదిలిపోవడం ఎక్కువైంది. పారిశ్రామికీకరణ జరిగిన తర్వాత, రైలు పట్టాల వంటి ఆధునిక సౌకర్యాలు ఏర్పడిన తర్వాత గ్రామీణ వృత్తులు, ఆదాయ మార్గాలకు, సాంప్రదాయపనులకు గండిపడటం ప్రారంభమైంది. రైలు పట్టాలు పడి పద్మశాలీల గుండెల మీది నుండి రైళ్లు పయనించాయన్న వాదమూ ఉంది. అయితే క్రమక్రమంగా భారతీయ సమాజానికి జీవధాతువులైన వృత్తిపనులు నశించడంతో గ్రామాల్లో సంక్షోభం ఏర్పడింది. అదింకా తీవ్రమవుతూనే ఉంది. అనివార్యంగా వలసలు, పొట్టలు పట్టకొని బయటికెళ్లడాలు రోజురోజుకూ పెరుగుతూనే ఉన్నాయి.

తెలంగాణ ప్రాంతానికీ వలసలు కొత్త కాదు. స్వాతంత్ర్యానికి ముందు కాలం నుంచే ఉన్నాయి. చదువులతో ఊళ్లొదిలి ఉద్యోగాలకు వెళ్లడం ఒక పద్ధతయితే, చదువుకున్న వాళ్లు గ్రామీణ జీవితానికి దూరమై పట్టణీకరణం చెందడం మరో పద్ధతిగా కొనసాగుతుంది. పరిశ్రమల నిర్మాణం, నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణం ఇతర కారణాల వల్ల గ్రామాల్లో భూములను, బతుకుతెరువును కోల్పోయి నిర్వాసితులైన వారు ఎంతో మందున్నారు. సాగర్ నిర్మాణం సమయంలోనూ, నిజాంసాగర్, పోచంపాడు ప్రాజెక్టు, మానేరు డాం, బొగ్గుగనులు ఇతర నిర్మాణాల వల్ల భూములను కోల్పోయి ఊళ్లొదిలి పెట్టాల్సిన పరిస్థితులు చాలామందికి దాపురించాయి. ఇలాంటి

వాటిని గురించి భూనిర్వాసిత కథలు వచ్చాయి. భూములు కోల్పోయి నామమాత్రపు నష్టపరిహారంతో దిక్కు తోచని స్థితిలో ఉన్న మానేరు డాం, గని కార్మిక జీవితాల గూర్చి జూకంటి జగన్నాథం, పి. చంద్, కాలువ మల్లయ్యలాంటి వాళ్లు చక్కని కథలు రాశారు. భూనిర్వాసితులు, కాలువ మల్లయ్య కథలు, వైపని కథా సంపుటాల్లో ఈ కథలను చూడవచ్చు. మానేరు డాం కింద భూములు పోయి పది పన్నెండు గ్రామాల ప్రజలు నిర్వాసితులయ్యారు. వాళ్లకు భృతి కోసం దశాబ్దాలుగా కోర్టుల చుట్టూ తిరుగుతూనే ఉన్నారు. అయితే భూములు పోవడం వల్ల రైతులకు లభించింది స్వల్పమే అయినా ఆ రైతుల కేసులు వాదించి లక్షలు, కోట్లు సంపాదించుకున్న తెల్లబట్టల పైరవీకార్లు, న్యాయవాదులున్నారు. వీళ్ల బండారాన్ని బయటపెట్టే కథ పునరావాసం. ఒక్క కలం పోటుతో ఊళ్లను ఖాళీ చేయమని తాఖీదులు జారీ చేసే ప్రభుత్వ నిబంధనల్లోని అమానవీయతను ప్రశ్నించే కథ నిరుదు కురిసిన హిమ సమూహములు? బొగ్గు గనుల కింద గ్రామాలకు గ్రామాలు నీటి ముంపుకు గురైపోవడంలోని దుర్మార్గాన్ని ప్రశ్నించే కథలెన్నో ఉన్నాయి. ప్రాజెక్టు కట్టినా కర్మాగారం నిర్మించినా వాటివల్ల ఎంత మంది నిర్వాసితులవుతున్నారు. ఎంత మందికి ఉపాధి లభిస్తుంది? ఎవరు నష్టపోతే ఎవరు లాభపడుతున్నారు? ఎంత ప్రకృతి విధ్వంసం జరుగుతుందన్న విషయాలను దృష్టిలో పెట్టుకోకుంటే జరిగే నష్టాలు అపారమని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. మేధాపాట్కర్ నర్మదా బచావోలో ఉన్న మానవాంశను గూర్తించాల్సిన అవసరమూ ఉంది. వలస కథల్లో అంబల్ల జనార్దన్ బొంబాయి కథలు, బొంబాయి వలస బతుకుల చిత్రీకరణలు ఎన్నదగినవి.

తెలంగాణ గ్రామాల నుంచి ముఖ్యంగా కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల నుంచి ఎక్కువగా, ఇతర జిల్లాల నుంచి కొంత కొంతయినా భీవండి, షోలాపూర్, బొంబాయి, సూరత్‌లాంటి ప్రదేశాలకు వలసపోవడం మామూలు. ఇందులో ఎక్కువగా పద్మశాలీ కులాలవాళ్లే ఉన్నారు. మగ్గం మీద జరిపే చేనేత వృత్తితో పొట్టలు నిండటం కష్టమైన తరుణంలో మిల్లులపై పని చేసుకోవడానికి పారిశ్రామిక ప్రాంతాలకు వలస పోయారు. కుటుంబాన్ని, అయినవాళ్లను, ఉన్న ఊరిని వదిలి బతకడానికి దేశం పోయే వీళ్లు ఈ వలసలతో బాముకున్నదేం లేకున్నా వలసలయితే తప్పలేదు. వీళ్ల బతుకుల్లోని విషాదాన్ని తెలుపుతూ బి.యస్. రాములు, జూకంటి జగన్నాథం, కాలువ మల్లయ్య, పెద్దింటి అ ోక్‌కుమార్, ఆడెపు లక్ష్మీపతి లాంటివాళ్లు అనేక కథలు రాశారు. స్మృతి, వారసత్వం, వల ులు, వలసల కథసంపుటి, నిరీక్షణ, ఎదురుచూపు, ముంపు



లాంటి అనేక కథలు భీవండి వసల బతుకుల విషాదాన్ని తెలిపేవే. పద్మశాలీల వలసల గూర్చి బతుకు వెతలగూర్చి తెలుగులో వచ్చిన మొట్టమొదట నవల గువ్వలచెన్నా.. రాష్ట్రం వదిలిపెట్టి దేశం పోతున్నామనే వలసలతో పాటు కొంత మెరుగైన జీవితం కోసం దుబాయ్, మస్కట్ లాంటి గల్ఫ్ దేశాలకు వలసపోయిన వాళ్ల గురించీ కథలు వచ్చాయి. ఆ ఎడారిలో ఎండలో ఇతరుల ఆధిపత్యం కింద బతికే శ్రమజీవుల్లో తెలంగాణ శ్రామిక కులాలవాళ్లు బాగానే ఉన్నారు. ఇటీవలి కాలంలో కంప్యూటర్ విద్య పేరు మీద, సుఖాల మోజుతో, కొందయితే ఇక్కడి జీవితంతో, జీతంతో సరిపెట్టుకోలేక మరికొందరు ఇక్కడ అవకాశాలు లేక అమెరికాలాంటి దేశాలకు వలస పోవడంలోని మతలబును కూడా కథలుగా చిత్రించారు.

ఆదిలాబాద్, కరీంనగర్, ఖమ్మం, వరంగల్ జిల్లాల్లో గోదావరినదీ తీరం వెంట సింగరేణి బొగ్గుగనులు పడ్డ తర్వాత అందులో పనులు వెతుక్కుంటూ పోయేవాళ్ల సంఖ్య పెరిగింది. ఓ దిక్కు గ్రామాల్లో వృత్తులు నశిస్తూ ఆదాయ మార్గాలు మూసుకుపోతుంటే వ్యవసాయాలు కూడా సంక్షోభంలో పడితే చాలామంది చిన్న వ్యవసాయదారులు, వ్యవసాయ కూలీలు పొట్టలు చేతుల్లో పట్టుకొని సింగరేణి పనులకెళ్లారు. బతకడం కోసం ప్రమాదభూయిష్టమైనవైనా గని బతుకులను ఎన్నుకున్నారు. సింగరేణి గనులకు వలసపోయిన వాళ్ల బతుకు వెతల గూర్చి, గోదావరిఖని పారిశ్రామిక ప్రాంతాలు చిన్న చిన్న గ్రామాలు కూడలిగా ఉండటం గూర్చి అనేక కథలొచ్చాయి. సింగరేణి వలసల గూర్చి ఆ ప్రాంతంలో పనిచేస్తున్న రచయితలు తుమ్మేటి రఘోత్తమరెడ్డి, అల్లం రాజయ్య, పి. చంద్, లక్ష్మీపతి, కాలువ మల్లయ్య లాంటి వాళ్లు చక్కని కథలు రాశారు. ఉరి, ఉరితాడు, చావు విందు, అన్న, ప్రస్థానం, జీవన్మృతుడు, అతడు లాంటి అనేక కథలొచ్చాయి. ఇలా తెలంగాణా ప్రాంత వలసల గూర్చి చెప్పుకోదగ్గ కథలే వచ్చాయి.

తెలంగాణ గ్రామాల్లో కులవివక్షతున్నా అందరూ వరుసలు పెట్టుకొని పిలుచుకునేవారు. ఒకరి అవసరాల్లో ఒకరు ఆదుకునేవారు. ఎవరు ఇంటికి వచ్చినా భోంచేయందే పోనిచ్చేవాళ్లు కాదు. ఇంటికి వచ్చిన వాళ్లకు తమకు లేకున్నా ఉన్నంతలో దానం చేసేవాళ్లు. చల్ల, కూరగాయలు లాంటివాటిని ఉచితంగానే ఇచ్చేవారు. గ్రామాల్లోకి రూపాయి ప్రవేశంతో విలువల్లో, సంబంధాల్లో మార్పులొచ్చాయి. మానవ సంబంధాలు డబ్బు సంబంధాలుగా మారడం, విలువలు డబ్బు విలువలుగా మారడంలోని దుర్మార్గాన్ని కథలుగా మలిచారు. కథలకు ప్రాంతీయ ముద్ర ఆభరణంగా

ఉన్న మానవాంశను జోడిస్తూ కథలు రాశారు. ప్రపంచీకరణ విధ్వంసం మానవ సంబంధాల్లో తెచ్చిన మార్పులను, సంక్షోభాన్ని కథలుగా మలిచారు. మనిషి మనిషికి మధ్య పెరిగిన దూరాన్ని, ఆప్యాయతలు ఆదరణలు దూరమై డబ్బే ప్రధానం కావడంలోని దుర్మార్గాన్ని కథలుగా మలిచారు. కుటుంబ సంబంధాల్లోని మానవీయత విచ్ఛిన్నం కావడం, అన్నదమ్ములు, అక్కాచెల్లెండ్లు, తల్లిదండ్రులు, పిల్లలుపెద్దల మధ్య సంబంధాల్లో వచ్చిన మార్పులను గ్రామాలు గ్రామాలుగా ఉండలేక దౌర్భాగ్యాన్ని చిత్రించారు. యజమాని, పాలేరు సంబంధాలు, తండ్రీకొడుకుల సంబంధాలు, వృద్ధుల సమస్యలపై అనేక కథలు రాశారు. గ్రామాలు గ్రామీణ స్వభావాన్ని కోల్పోయి రూపాయితనంతో దుర్మార్గంగా మారే క్రమాన్ని, రూపాయితనం మనిషితనంలో తెచ్చిన మార్పును సంబంధాల విధ్వంసాన్ని కథలుగా మలిచారు.

వివిధ కారణాలతో యువకులు, చదువుకున్న వాళ్లు ఊళ్లొదిలిపోతుంటే గ్రామాల్లో గడపల దగ్గర కూచొని తమ కొడుకు కోసం ఎదురుచూసే వృద్ధుల మనోభావాలు, గ్రామాలను, దేశాలనే వదిలి తమ సుఖం తాము చూసుకుంటూ వెళ్లిపోయిన యువతరం, తల్లిదండ్రులు పడే ఆవేదనను రక్తసంబంధీకుల మధ్య ఏర్పడిన దూరాన్ని కథలుగా మలిచారు. బి.యస్. రాములు, కాలువ మల్లయ్య, జూకంటి జగన్నాథం, గీతాంజలి, సదానంద శారద లాంటి అనేక మంది రచయితలు బతుకుల్లో మానవాంశ విధ్వంసం గూర్చి రాశారు. అన్నీ ధ్వంసమై పోతూ కేవలం డబ్బు సంబంధాలే మిగిలిపోతుంటే జనాలు తమ మూలాలనే మరిచి విధ్వంసం దిక్కు పయనిస్తుంటే తమ మూలాల దిక్కు మర్లి చూసుకోవాల్సిన అవసరాన్ని, తమ వేళ్లలోకి వెళ్లాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతూ కథలు రాశారు. ఇటీవలి కాలంలో తెలంగాణ నుంచి రాస్తున్న కొందరి కథల్లో గతాన్ని గూర్చిన ప్రశంస ఉంటుందనే వాళ్లూ ఉన్నారు. పీడితులకు గతమెప్పుడూ గొప్పది కాదు. పీడితవర్గంలోంచి వచ్చిన, పీడితుల గూర్చి రాస్తున్న వాళ్లకూ గతం గొప్పది కదు. కాని గతంలో ఉన్న కాస్త మంచి కూడా పోయి మానవసంబంధాలు మృగ్యమై పోతున్నాయన్న బాధే ఈ కథలను చదివితే ధ్వనిస్తుంది. కాని గతాన్ని కీర్తించడం కాదు. పీడిత వర్గాల వారెవరికైనా గెలుచుకున్న, గెలుచుకుంటున్న జీవితమే గొప్పది.



# తెలంగాణ కథల్లో భాషా విప్లవాలు

ప్రతి భాషకూ మాండలికాలుంటాయి. ఇవే అసలు సిసలైన ప్రజల భాషలు. ఈ భాషను గ్రామ్యమని నిందించారు పండితులు. ప్రజల భాషను మాండలికమనో, గ్రామ్యమనో అనడం కంటే జీవద్భాష అనడమే సరైంది. ఈ జీవద్భాష గలగలపారే సెలయేరు నీటి వంటిది. గ్రాంథికం చలనం లేని చెరువు నీరు లాంటిది. ప్రాచీన కాలం నుంచి పండితుల అనాదరణకు గురవుతూ గ్రామ్యమని నిందింపబడుతున్నా ఈ భాష ప్రజల నోళ్లలో సజీవంగా ఉంది. ప్రజాస్వామికవాదులు, ప్రజాపక్షం వహించే వాళ్లు ఈ భాషను రాజకీయ ప్రచారానికి, మత ప్రచారానికి, సాహిత్య రచనకు ఉపయోగించి అద్భుతమైన ప్రయోజనాలు పొందారు. ఇందుకు ప్రబలమైన ఉదాహరణగా సంస్కృతంలో ప్రజల భాషయైన ప్రాకృతంలో రాయబడిన బౌద్ధ జాతక కథలు. ప్రజాస్వామిక కాలంలో ఈ భాష అవసరం మరింత పెరిగింది. ప్రపంచవ్యాప్తంగా ప్రజల భాషలో రాయబడిన గ్రంథాలే విశేష ఆదరణ పొందాయి. కన్యాశుల్కం నాటకానికి, రావిశాస్త్రి రచనలకు అంత బలం రావడానికి కారణం అవి ఆయా ప్రాంతాల ప్రజల జీవద్భాషలో రాయబడటమే. గద్దర్ పాటకున్న బలం, లాలూ ప్రసాద్ యాదవ్ ఉపన్యాసాలకున్న శక్తి జానపద బాణీలను స్వంతం చేసుకోవడంలోనే ఉంది.

ఈ విషయాన్ని గుర్తెరిగే తెలంగాణ కథా రచయితలు మొదట్నుంచీ జీవద్భాషకు ప్రాధాన్యతనిచ్చి రాస్తున్నారు. వీళ్లు తీసుకున్న విషయమూ అట్టడుగు వర్గాల జీవితాలదే కాబట్టి భాషా వాళ్లదే అయినందువల్ల ఎలిగారానికి బంగారమద్దినట్లు అయింది. తెలంగాణ భాషకు వర్గ స్వభావముండటం గమనించాల్సిన విషయం. ఈ భాష వర్గమాండలికమే. శ్రమజీవుల భాష. తెలుగుభాషను మాట్లాడినట్లే రాయడం ఎలా సాధ్యమో తెలంగాణ మాండలికాలకు ఉచ్చారణలోనే అర్థం గోచరిస్తుంది. అర్థం కోసం తల బద్దలు కొట్టుకోవాల్సిన అవసరం లేదు. ఇది శ్రమజీవుల భాష కావడమే అందుక్కారణం. తెలంగాణలో బ్రాహ్మణ స్త్రీలు ఇండ్లలో వాండ్లు, వీండ్లు అని మాట్లాడితే మిగతా అగ్రకులాలతో కలుపుకొని శ్రామిక కులాలవాళ్లంతా వాళ్లు, వీళ్లు, వాడు, వీడు అనే మాట్లాడుతారు. వచ్చిండ్రు, పోయిండ్రు, అత్తండ్రు, పోతండ్రు అనే స్వల్ప క్రియారూపాల్లో భేదాలతో అందరూ వాడతారు. అయితే గ్రామాల్లో అందరూ పొట్టి రూపాలనే వాడటం గమనార్హం. తెలంగాణ గ్రామాల్లో ఉన్నత శ్రామిక కులాల వారి భాషా వాడకంలో ఇతర ప్రాంతాల్లో ఉన్నట్టు పెద్దగా తేడాలు లేవు. ప్యూడల్ భావజాలపు

తిట్టు పదాలు దొరలు వాడితే ఫ్యూడల్ భావజాలపు బానిస పదాలు శ్రామికులు వాడతారు. నీ బాంచెన్, నీ కాల్మొక్తా, గీ పని చెయ్యి బిడ్డా లాంటి పదాల వాడకం కనబడుతుంది. ఇలా తెలంగాణ భాష శ్రామిక కులాల వర్గమాండలికమే. ఈ విషయాన్ని మనం తెలంగాణ మాండలికాన్ని వాడుతూ కథలు రాస్తున్న రచనలను చూసి అర్థం చేసుకోవచ్చు.

తెలంగాణ మాండలికం వర్గ మాండలికం కాబట్టే శ్రామిక వర్గాల్లోంచి వచ్చినవాళ్లు రచయితలుగా ఎదిగి మాండలికాన్ని వాడిన తర్వాత మాండలిక వాడకం బాగా పెరిగింది. మాండలికానికి సాహిత్య గౌరవం వచ్చింది. శ్రామికవర్గ రచయితలు శ్రామిక జీవితాన్ని తీసుకొని శ్రామిక సంస్కృతిని ఉన్నతీకరిస్తూ రాయడం వల్లనే ఆ భాషకున్న జవసత్వాలేంటో తెలిశాయి. తెలంగాణలోని వివిధ ఉద్యమాలు, రజాకారు వ్యతిరేక, భూపోరాట ఉద్యమాలు శ్రామికవర్గంలోంచి వచ్చిన రచయితలకు మనో ధైర్యాన్నిచ్చి విస్తృతంగా రాయడానికి ఉపయోగపడ్డాయి. ప్రజల భాషా ఉపయోగానికి మార్గం సుగమం చేశాయి. మొదటితరంలో చదువుకునే అవకాశాలు లేక పీడిత కులాల్లోంచి రచయితలుగా ఎదిగినవాళ్లంతగా లేకున్నా వివిధ ఉద్యమాల కారణాల వల్ల ఆ తర్వాతి తరాల్లో పీడిత కులాల్లోంచి రచయితలుగా ఎదిగి జీవితాలను గెలుచుకున్నారు. తమ చరిత్రను తాము రాసుకునే క్రమంలో తమ భాషను తామే సాహిత్యానికెక్కిస్తున్నారు. భాషకున్న పీడిత వర్గ స్వభావం వీళ్ల పనిని మరింత సులభం చేసింది. కోస్తా వాతావరణాన్ని, తెలంగాణ వాడుక భాషను పరిశీలించినప్పుడు మనకీ విషయం స్పష్టమవుతుంది. కోస్తా పీడిత కులాల వాళ్లు మాట్లాడినా వ్యావహారికంలా అనిపిస్తే తెలంగాణ ఉన్నత వర్గాల వాళ్లు మాట్లాడినా మాండలికంలా అనిపించడానికిదే కారణం. పాతిక ముప్పయ్యేళ్ల కింది తెలంగాణ గ్రామాల్లోని భాషను పరిశీలించినా, ఇప్పటికీ సాంస్కృతీకరణం చెందని గ్రామీణ భాషను పరిశీలించినా మనకీ విషయం స్పష్టమవుతుంది.

వీటన్నింటి నేపథ్యంలో తెలంగాణ రచయితలు మాండలికాన్ని హృదయానికి హత్తుకొని జీవద్భాషనుపయోగిస్తూ మొదటి తరం నుంచి కథలు రాస్తున్నారు. అయితే అందరూ మాండలికాన్ని సమర్థవంతంగా ఉపయోగించకపోవచ్చు. 'గ' భాషనుపయోగిస్తే అది మాండలికమవుతుందన్న భ్రమను వదలుకుంటే మంచిది. మాండలికాన్ని ఉపయోగించాలంటే ఆ జీవితంపై ప్రేముండాలి. ఆ భాషను హృదయానికి హత్తుకోవాలి. ఆ భాష మాట్లాడివారితో మమేకమై పోవాలి. అందులోంచి వచ్చిన వాళ్లయితే మరీ మంచిది. వాళ్ల బతుకులు మారాలన్న హృదయపూర్వకమైన



కాంక్ష ఉంటే తప్ప అందులో రాసి మెప్పించడం కష్టం. యాద్గిరీ అంటేనో, 'గ' భాషను ఉపయోగిస్తేనో మాండలికం కాదు. యాద్గిరి పదాన్నుపయోగించడానికి నల్లగొండ ప్రజల పోరాట చరిత్ర తెలుసుకోవాలి. మనకు తెలియని మన చరిత్రను చదవాలి. ఏదేమైనా మాండలికం కోసం మాండలికమని కాకుండా పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్టు కాకుండా ఆ భాష మీద ప్రేమతో, ఆ జీవితంపై మమకారంతో, ఆ సంస్కృతి మీది సాధికారంతో మాండలికాన్నుపయోగించి రాయాలి. అలా జీవద్భాషను తనది చేసుకొని హృదయానికి హత్తుకొని కథలు రాసిన వాళ్లు మొదటి తరం నుంచీ ఉన్నారు.

కథా రచనకు ఏ భాషనుపయోగించాలి అన్న విషయంలో వాదోపవాదాలు జరిగాయి. మొత్తం కథను వ్యావహారికంలోనే రాయాలా, మాండలికంలో రాయాలా అన్న విషయంలోనూ తర్జనభర్జనలయ్యాయి. తెలంగాణ రచయితలు జీవద్భాషను ఉపయోగించి విరివిగా రచనలు చేయడం ప్రారంభమైన తర్వాత ఈ వాదనలు మరీ ఎక్కువయ్యాయి. గురజాడ, రావిశాస్త్రి, మాగోఖలే, కరుణకుమార లాంటి వాళ్ల మాండలిక రచనల గూర్చి నోరెత్తనివాళ్లు తెలంగాణ మాండలిక రచనల గూర్చి వాదాలే లేవదీశారు. మాండలికాన్ని సంభాషణలకే పరిమితం చేస్తే సరిపోతుందని కితాబులూ ఇచ్చారు. కాని ఏ కథను ఏ భాషలో రాయాలో, ఎలా రాయాలో నిర్ణయించుకోవాల్సింది ఆయా రచయితలే తప్ప వేరెవరో కాదని కథకు ఉచితమైన భాషను ఎన్నుకొని కథలు రాశారు. ఇతర ప్రాంతాల మాండలికం అర్థమైనప్పుడు తమ ప్రాంత మాండలికం ఎందుకు అర్థం కాదని నిలదీసి ప్రశ్నించారు. తీసుకున్న వస్తువును బట్టి, ఉద్దేశించిన పాఠకులను బట్టి ఏ భాషలో రాయాలో నిర్ణయించుకోవాల్సింది రచయితలేనని నొక్కి చెప్పారు. ఇందుకు రచయితలు మూడు పద్ధతులను ఎన్నుకున్నారు. వస్తువు మాండలికమైంది అయినప్పుడు పూర్తి కథ మాండలికంలోనే రాస్తే కథ పాఠకులను చేరుతుందనుకున్నప్పుడు కథనంతా మాండలికంలోనే రాయడం ఒక పద్ధతి. వస్తువు మాండలికందే అయినా రచయిత కథనం వ్యావహారికంలో, సంభాషణలవీ పాత్రోచిత మాండలికంలో రాయడం రెండో పద్ధతి. కథా వస్తువు మాండలికంది కానప్పుడు రచయిత కథనం, సంభాషణలు వ్యావహారికంలో రాయడం మూడో పద్ధతి. ఈ మూడు ధోరణుల్లో కథలు రాసి మెప్పించారు.

తొలితరంలో వచ్చిన తెలంగాణ కథను పరిశీలిస్తే జీవద్భాషను వాళ్లెంత అద్భుతంగా ఉపయోగించుకున్నారో అర్థమవుతుంది. ఈ రచయితలకు రాష్ట్రావతరణ తర్వాత ప్రామాణికం పేరు మీద చ్చిన కోస్తా వ్యావహారికం వాడాలన్న నిబంధనలేవీ

లేవు. అప్పటికి పత్రికాభాషగా అది స్థిరపడనూ లేదు. అందుకొరకు వాళ్లు తాము చదువుకొన్న గ్రాంధిక బాషా వాడకంతోనూ, తెలంగాణలో ఉన్న వ్యవహారిక భాషలోనూ కథలు రాశారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడేవరకు వచ్చిన ఈ కాలంలోని రచనలు అప్పటి తెలంగాణ జీవితాన్ని వాస్తవికంగా చిత్రించాయి.

మీది బ్రౌణ్యాంధ్రం... మాది తౌరక్యాంధ్రం

మీది ఇంగ్లీషు దడదడ... మాది ఉర్దూ గడబిడ అన్నాడు ఇరు ప్రాంతాల భాషల గూర్చి సురవరం ప్రతాపరెడ్డి. మొదటితరం తెలంగాణ రచయితల్లో అగ్రగణ్యుడైన సురవరం ప్రతాపరెడ్డిగారు ఉర్దూ తెలుగు మిశ్రమ భాషలో కథలు రాశారు. ఈతని మొగలాయి కథలు చదువుతుంటే ఆ కాలంలో హైదరబాద్, మహబూబ్‌నగర్ ప్రాంతాల్లో తెలుగు భాష, జీవితం ఎలా ఉండేవో తెలుస్తుంది. అష్ట భాషా ప్రవీణుడు, పండితుడు, మేధావి, రాజకీయాల్లో చాణక్యున్ని మించిన వాడయిన పి.వి. నరసింహారావు గొల్ల రామవ్వ కథలో వాడిన మాండలిక భాషా సొగసులను గమనిస్తే ఆశ్చర్యం వేస్తుంది. గొర్లు కాసుకుంటూ బతికే గొల్లల భాషను అత్యంత సహజంగా ఉపయోగించాడు.

"ముల్లు తీసేయ్ ఉల్లుల్లుగ... అయొ... సిగ్గయితాందా వాన్ని ముట్టుకుంటే.. ఏం మానవతివిగదనే... నీ సిగ్గు అగ్గిలబడ"

"ఇగ లే కొడుకా... గింత గటుక చక్కటి సల్లల పిసుక్కచ్చిన.. గింత కడుపుల పడేసుకో... ఎన్నడన్న తాగినావు తాతా గట్క...? వరి బువ్వ తినెటోనివి నీకేమెరుక...? గొల్లరామవ్వ గట్కంటే ఏమనుకున్నౌ? పొయ్యే పానం మర్లుతది.."

ఇవీ గొల్ల రామవ్వ మాటలు.

మొదటితరం కథారచయితల్లో ఒకడైన, గూడూరి సీతారాం ఆ కాలంలోనే కథనానికి కూడా మాండలికం వాడి కథలు రాశాడు. తాము నిత్య జీవితంలో వాడే భాషను కథల్నిండా ఉపయోగించాడు. పూర్తి మాండలికంలో కథలు రాసి మెప్పించవచ్చునని అప్పుడే నిరూపించాడు.

"గదేందో సిత్రం... కచ్చురం మంచిగ వోయినట్టే పోయి పోయి ఒక్కపారే బొందల పడేదాక తెలువదు. నారిగాడి బతుకూ గట్లనే అయింది. గానాడు నారిగాడు ఎప్పటోలనే పొద్దుగాల తాళ్లకు వోయి కల్లు తెచ్చి తిని పడుకున్నడు. ఆనికి నిద్ర పట్టక ముందే లసుము రూపాయి పట్వ అమ్మింది.."

నారిగాడి బతుకు కథలోని మాటలివి.

ఆ కాలంలో జనం వాడుకలో ఉండి ఆ తర్వాతి కాలంలో వాడుకలోంచి



పోయిన ఎన్నో పదాలను తొలితరం కథారచయితల రచనల్లో గమనించవచ్చు. ఈ రచయితలు తీసుకున్న వస్తువు అట్టడుగు వర్గాలకు సంబంధించినదే కాబట్టి ఆ వస్తువుకు సహజమైన జీవద్భాషను వాడి తమ ప్రజపక్షపాతాన్ని చాటుకున్నారు వాళ్లు. అయితే రెండవతరం రచయితలు కలం పట్టేనాటికి పత్రికాభాషంటూ వచ్చింది. పత్రికలు పెరిగాయి. వ్యావహారిక భాషావాదంతో పాటు వ్యాపార రచనల జోరు పెరిగింది. ఈ సందిగ్ధావస్థలో మొదటితరంలో ప్రారంభమైన జీవద్భాషా రచనల పరంపరను మలితరం రచయితలు కొనసాగించలేకపోయారు. వీళ్లు చాలావరకు తమ రచనలకు ప్రామాణిక భాషని చెప్పబడే వ్యావహారికాన్నే వాడుకున్నారు. ఇది జీవద్భాషా రచనల పరంపరలకు కొంత గ్యాప్‌గానే చెప్పుకోవచ్చు.

తెలంగాణ నుంచి మూడవతరం కథా రచయితలు రచనలు ప్రారంభించే సమయంలోనే కరీంనగర్ నుంచి కరీంనగర్ బుక్ ట్రస్ట్‌వాళ్లు బద్‌లా అనే కథా సంకలనం ప్రచురించారు. ఇందులోని కొన్ని కథలు కరీంనగర్ జీవద్భాషలో రచయిత కథనం కూడా మాండలికంలో రాయబడి తెలంగాణ కథకు వన్నె తెచ్చాయి. ఈ సంకలనం ప్రభావంతోనే తాను రచయితనయ్యానని ప్రముఖ రచయిత అల్లం రాజయ్య అన్నారు. అప్పటికే తెలంగాణలో వేళ్లూనుకుంటున్న ప్రజాపోరాట ఉద్యమాల ప్రభావంతోనూ, సాహిత్యం ద్వారా సమాజానికి ఏదో చేయాలన్న తపనతోనూ ఆ కాలంలో చాలా మంది కలం పట్టారు. ప్రజల భాషను స్వంతం చేసుకున్నారు. ఏ ప్రజల్లోంచయితే వచ్చారో ఆ ప్రజల గురించే వాళ్ల భాషలోనే కథలు రాయడం మొదలు పెట్టారు. జీవద్భాషలో రాస్తున్న ఈ కథలకు ప్రజాసాహితి, అరుణతార, నూతన, సృజన లాంటి పత్రికలు ఆలంబనగా నిలిచాయి. మొదలు కొంచెం తటపటాయించినా ఈ పత్రికలతో పాటు క్రమక్రమంగా అన్ని పత్రికలు తెలంగాణ మాండలిక రచనలకు స్థానం కల్పించాయి. విప్లవ పత్రికల్లో అల్లం రాజయ్య, రఘోత్తమ రెడ్డి, కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, వుప్పల నరసింహంలాంటి వాళ్లు విరివిగా కథలు రాశారు. తెలంగాణ మాండలికానికి సాహిత్య గౌరవం తీసకొచ్చే ప్రయత్నం చేశారు. అయితే ఈ పత్రికల ద్వారా మాత్రమే జీవద్భాష, సంస్కృతి అన్ని ప్రాంతాల ప్రజలను, మాస్ పాఠకులను చేరడం కష్టం కాబట్టి కొందరు రచయితలు ఇతర పత్రికల్లోనూ విరివిగా రాశారు. అనివార్యంగా అన్ని పత్రికల్లోనూ రచనలు చోటు చేసుకునేందుకు కృషి చేశారు. ఇలా అన్ని పత్రికల్లో తెలంగాణ మాండలిక రచనలు చోటు చేసుకున్న తర్వాత ఈ భాష అన్ని ప్రాంతాల భాషయింది. ఈ భాషకు సాహిత్య గౌరవం వచ్చింది. తెలంగాణ భాషా సంస్కృతులు అందరికీ పరిచమయ్యాయి. ఇందుకు వాహికగా

ఉపయోగపడింది కథే. వివిధ కారణాల వల్ల ఈ రచయితలు కొన్ని కథల్లో రచయిత కథనానికి వ్యావహారిక భాష వాడినా పాత్రోచిత మాండలికం వాడి ప్రాంతీయ ముద్రతో రచనలను చేశారు.

తెలంగాణ నుడికారాలు, జాతీయాలు, సామెతలు, అట్టడుగు వర్గాలవారి సజీవ మాండలికం, జీవద్భాషా సొగసులు ఈ కథల్నిండా కనిపిస్తాయి. మూడవ తరంలోనే రచయిత కథనాన్ని కూడా మాండలికంలో రాసిన అనేక కథలకు శ్రీకారం చుట్టింది అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య కొలిమంటుకుంది, ఎదురుతిరిగితే, కథ, భూమి, వెలి, పాలేరు, మడేలయ్య మనసు, ఈ భూమి నాది లాంటి అనేక కథలు ఇందుకు ఉదాహరణలు. తమ తల్లి తండ్రి తన వాళ్లవైన జీవద్భాషను హృదయం నిండా నింపుకొని బర్ల నారయ్య, చాకలి రాజయ్య, సాలె మల్లయ్య, గొల్ల వెంకటి, సుంకరి సాయులు, కుమ్మరి హనుమవ్వ, మంగలి శంకరి, వడ్ల లసమయ్య, కమ్మరి బక్కయ్య, కూలినాలి చేసుకునే స్త్రీలు, సహస్ర వృత్తుల సమస్త చిహ్నాల వారిని తీసుకొని కథలు రాసి జీవద్భాషా మాధుర్యాన్ని విశ్వవ్యాప్తం చేశారు. ఏ పరిమితులూ లేకుండా వాడడానికి మార్గం సుగమం చేశారు.

మూడవ తరం రచయితలు తమ జీవద్భాషా రచనా పరంపరను కొనసాగిస్తుండగానే నాలుగవ తరం రచయితలు ఆ మార్గాన్ని మరింత విశాలం చేస్తూ అద్భుతంగా రచనలు చేస్తున్నారు. జూకంటి జగన్నాథం, కాలువ మల్లయ్యలతో పాటు పెద్దింటి అశోక్‌కుమార్ లాంటి వాళ్లు నాలుగవ తరంలో జీవద్భాషా మాధుర్యాన్ని పాఠకులకు చూపుతూ శ్రమైక జీవన సంస్కృతి ఔన్నత్యాన్ని రచనల ద్వారా చాటుతున్నారు. తెలంగాణ సాహిత్య, సాంస్కృతిక చలనం పెరిగిన తర్వాత ఎంతో మంది యువరచయితలు జీవద్భాషకు పట్టం గట్టి రచనావ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు. తెలంగాణ కథా వార్షికల ప్రచురణా మొదలైంది. మైనారిటీల జీవద్భాషలో, ఉర్దూ తెలుగు మిశ్రమ పదబంధాల ఉపయోగంలో ఓ కొత్త మాండలిక భాష ఇటీవలి కాలంలో తెలంగాణలో వచ్చిన మైనారిటీ కథోద్యమంతో వెలుగు చూసింది. స్కైబాబ, షాజహానా లాంటి వాళ్ల కథలు ఇందుకు ఉదాహరణలు. సోయి పత్రికలు, ముల్కి, నా తెలంగాణ, వతన్ కథల సంపుటి, 2003 తెలంగాణ కథ, 2004 తెలంగాణ కథ పుస్తకాల్లో తెలంగాణ జీవద్భాషా సొగసులను చూడవచ్చు. ఆంధ్రప్రదేశ్ అవతరణకు ముందున్న తెలంగాణ జీవద్భాష కోసం సురవరం ప్రతాపరెడ్డి, సురమౌళి, గూడూరి సీతారాం లాంటివాళ్ల రచనలు, స్వాతంత్ర్యం పూర్వం నుంచి 60,70ల వరకు తెలంగాణ భాష కోసం దాశరథి రంగాచార్య, వట్టికోట ఆళ్వారుస్వామి రచనలు, దెబ్బైల తర్వాతి



జీవద్భాష కోసం అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య రచనలు, ఇటీవలి భాష కోసం యువతరం రచయితల కథలు పరిశీలించాల్సి ఉంది.

తెలుగు సాహిత్యంలోనే మాండలిక భాషా విప్లవం లాంటిది తీసుకొచ్చి పూర్తి మాండలికంలో రాయడానికి ఇతర ప్రాంతాలవారికి మూడు నాలుగు తరాలలో ప్రేరణగా నిలిచారు తెలంగాణ రచయితలు. తెలంగాణ నుంచి విరివిగా జీవద్భాషా రచనలు రావడానికి కారకులయ్యారు. ప్రజల భాషను ప్రేమించి, ఆ జీవితాన్ని ప్రేమించి వాళ్ల జీవద్భాషలో రచనలు చేసినవాళ్లే తెలంగాణలో మంచి రచయితలుగా పేరు తెచ్చుకున్నారు. చేతులెత్తితే కార్జం కనిపించే బక్కోల గురించి కథలు రాసిన అల్లం రాజయ్య కథలు, బాతీల పోశెట్టి కథలు, కైత్కాల పోశెట్టి కతలు, అవ్వ తోడు గిది తెలంగాణ, థిల్లగి ము ృట్లు, తెలంగాణ మట్టి కథలు, పలుకుబడి, చల్నేదో బాలకిషన్, అల్లంకారం, ముద్ర, బండ కింది బతుకులు లాంటి శీర్షికా రచనలు తెలంగాణ జీవద్భాష జవసత్వాలేంటో, తెలంగాణ భాషకున్న అట్టడుగు వర్గ స్వభావమేంటో తెలిపే రచనలు. తెలంగాణ జనజీవితాన్ని తీసుకొని ప్రజల పక్షం వహించి తమ తల్లి భాషలో మూలాలను వెతుక్కుంటూ రాయబడుతున్న రచనలన్నీ జీవద్భాషా రచనలే. తెలంగాణ నుంచి ప్రజల భాషలో రచనలు చేస్తున్న వాళ్లందరూ అట్టడుగు వర్గాల నుంచి వచ్చినవాళ్లే కావడం విశేషం.

# తొలి, మలి, మూడవతరం
# తెలంగాణ కథ స్వరూప స్వభావాలు

తెలుగులో ఆధునిక కథ ఆరంభమైన కాలం నుంచి ఆంధ్రప్రదేశ్ అవతరణ వరకున్న కాలాన్ని తొలితరంగా పేర్కొనవచ్చు. ఈ కాలంలో తెలంగాణ నైజాం నవాబు పాలనలో ఉంది. నిజానికి నైజాం నవాబు పాలన ఆంగ్లేయుల పాలన కంటే అభివృద్ధి నిరోధకమైందేం కాదు. వ్యవసాయ సంబంధమైన నీటి పారుదల ప్రాజెక్టులు నిర్మించడంలో, చారిత్రాత్మక కట్టడాల్లో, విద్యాలయాలు నిర్మించడంలో, చెరువులు కుంటల నిర్మాణంలో అయా పరిమితులకు లోబడి అభివృద్ధి జరిగింది. అయితే ఈ అభివృద్ధి లేదా పథకాలు స్థానీయతను దృష్టిలో ఉంచుకొని చేసినవి. చరిత్రను, అభివృద్ధిని పాశ్చాత్య దృష్టికోణంలోంచి చూడటం అలవాటయిన మనకు తెలంగాణ అభివృద్ధి చెందకపోవడానికి కారణం నైజాం పాలనే అని ముద్ర వేయడం అలవాటయింది. రజాకారు పాలనాకాలం నైజాం పాలనలో దుర్మార్గమైందే. కాని అదొక్కటే మొత్తం పాలన కాదు. ఆ సమయాన్ని వదిలిపెడితే ఇతర రాచరిక పాలకుల పాలనకు తీసిపోకుండా నిజాం పాలననుండి రాచరిక పాలనకు అనుకూలమైన ఫ్యూడల్ భావాలు ఉన్నాయి. ఫ్యూడల్ సంస్కృతీ ఉంది. ఆంగ్లేయుల పాలనున్న ప్రాంతంలో ఫ్యూడల్ భావాలను కొంత ప్రజాస్వామికమవుతుంటే నిజాం ప్రాంతంలో అది లేదు. తేడా అంతే.

అందులో భాగంగానే తెలంగాణ భూస్వామ్య వ్యవస్థ వేళ్లూనుకుంది. కోస్తా ప్రాంతంలోనూ అంతకంటే ఎక్కువ భూస్వాములే ఉన్నా తెలంగాణ భూస్వామ్య వ్యవస్థకు ఫ్యూడల్ మూలాలెక్కువున్నాయి. తెలంగాణలో ఉర్దూ మీడియం, ఉర్దూ ప్రధానంగా చదివే అవకాశముంటే కోస్తాలో ఇంగ్లీషు చదవాల్సిన అవసరముండేది. అందుకే మొదటితరం తెలంగాణ వైతాళిక రచయిత సురవరం ప్రతాపరెడ్డి గారు కోస్తావాళ్లది బ్రౌణ్యాంధ్రం, తెలంగాణది తౌరక్యాంధ్రం అన్నారు. కోస్తాది ఇంగ్లీషే దడదడ అయితే తెలంగాణది ఉర్దూ గడబిడ అన్నారు. అయితే రెండు ప్రాంతాల్లోనూ తెలుగు చదువుకునే అవకాశాలున్నాయి. అందుకే పాలన ఎవరిదైనా మాతృభాషలో సాహిత్యం వికాసం మాత్రం ఆగిపోలేదు.

తెలంగాణ తొలితరంలో కథ పుట్టే కాలం నాటికి మధ్యతరగతి లేదు. తెలంగాణలో గాని, ఇతర ప్రాంతాల్లో కాని శ్రామిక కులాలు వర్గాలవారికి చదువుకునే అవకాశాలు చాలా తక్కువ. బలహీనవర్గాల వారినందరినీ చదువులకు దూరంగా,



అవమానాలకు దగ్గరగా ఉంచడం జరిగింది. ఎక్కడ ఎవరి పాలన ఉన్నా దేశంలోని వర్ణవ్యవస్థ దళితులను అంటరానివాళ్లుగానే చూసింది. అందుకే కోస్తా ప్రాంతంలో పాలకులుగా ఉన్నవారి మతం క్రైస్తవాన్ని తెలంగాణ పాలకులుగా ఉన్నవారి మతం ఇస్లాంను ఎక్కువ మంది స్వీకరించారు. ఇలాంటి రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులున్న కాలంలో తెలంగాణలో కథ పుట్టింది.

ఆధునిక కథ ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులోకొచ్చింది. కాని తెలంగాణలో ఉన్నది ఉర్దూ సాహిత్య ప్రభావం. అందుకే తెలంగాణ మొదటితరం కథల్లో కోస్తా ప్రాంతం కథల్లోలా ఇంగ్లీషు రచయితల, బెంగాల్ రచయితల ప్రభావం కనబడదు. ఆంగ్ల, బెంగాలీ సాహిత్యం కంటే ముందు, ఎక్కువగా పరిచయమైన ఉర్దూ సాహిత్య ప్రభావం చాలా వరకు ప్రేంచంద్ ముద్ర కనబడుతుంది. తెలంగాణ రచయితలను లేదా ప్రాంతానికి స్వాతంత్ర్యానికి ముందు కాలం నుంచీ మరాఠా ప్రాంతంతోనూ, ఉత్తర హిందూస్థానీ ప్రాంతంతోనూ పరిచయం, వలసలు ఉండటం కూడా ఇందుకు కారణం. ఇతర ప్రాంతంలో లాగానే మొదటితరంలో తెలంగాణ నుంచి సాహిత్యకారులుగా, కథారచయితలుగా ఎదిగిన వాళ్లలో దళిత బహుజన మూలాల్నుంచి వచ్చిన వాళ్లు చాలా తక్కువ. చదువుకునే అవకాశాలే మృగ్యమైతే రచయితలుగా ఎదగడం మాటెక్కడిది? అయితే తెలంగాణ నుంచి వచ్చిన కథారచయితలు మొదటితరం నుంచే సువిశాలమైన దృక్పథంతో మధ్యతరగతికే పరిమితం కాకుండా అట్టడుగు వర్గాలను హృదయానికి హత్తుకున్నారు. అట్టడుగు వర్గాల భాషనూ వాడుకున్నారు. తెలంగాణ వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డిగారు లిఖిత కథకు ఆశుసాంప్రదాయ పరిమళంతో మొగలాయీ కతలు రాసి మెప్పించారు. ఆంధ్రుల సాంఘిక చరిత్రను సాహిత్యాధారాల ద్వారా రాసి చూపించారు. ఇప్పుడు కావాల్సినవి సాంఘిక చరిత్రలని, రాజుల రాణుల చరిత్రలు కాదని సామాన్య మానవుడు కూడా చరిత్రకెక్కదగినవాడేనని ఒక కొత్త తరహా చరిత్ర రచనకు మార్గం వేశారు. ఆ మార్గాన్నే కథారచనలోనూ కొనసాగించి తర్వాతి తరం రచయితలకు మార్గం చూపించారు.

మొదటితరంలో తెలంగాణ కథా రచయితలు కొందరు శిష్టవ్యావహారికం, సంస్కరణ నేపథ్యంతో కథలు రాసినా చాలామంది కిందికి దిగి ప్రజల భాషలో సామాన్య జీవితాలను తీసుకొని సాహిత్య సృజన చేశారు. కోస్తా ప్రాంతంలో మొదటితరంలో వచ్చిన కథకు ఇంటలెక్చువల్ పోజ్ ఉన్నట్టు తెలంగాణ కథకు కనబడదు. అనేక ప్రతికూల సామాజిక సాహిత్య పరిస్థితులున్నప్పటికీ అవకాశాలు

మృగ్యమైనప్పటికీ మొదటితరంలో వందకు పైగా రచయితలు వేయికి పైగా కథలు రావడం విశేషం. ఆ కాలంలో వచ్చిన రజాకారు పోరాటాల గూర్చి, గ్రంథాలయోద్యమం గూర్చి, భూపోరాటాల గూర్చి, రాజకీయ సామాజిక ఆర్థిక పరిస్థితుల గురించి కథలు రాశారు. ఆ తరం కథా రచయితలు జీవితాన్ని, సాహిత్యాన్ని వేరుగా చూడకుండా తెలంగాణ వికాసానికి కృషి చేస్తూనే కథలు రాశారు. చాలామంది అగ్రకులాల నుంచి వచ్చినవారే అయినా నిమ్నవర్గాల పక్షం వహించి రాశారు. తొలితరంలో తెలంగాణ కథను సుసంపన్నం చేసిన వారిలో మాడపాటి హనుమంతరావు, ఒద్దిరాజు సోదరులు, నందగిరి దంపతులు, సురవరం ప్రతాపరెడ్డి, కాళోజీ, పొట్లపల్లి రామారావు, జి. రాములు, కాంచనపల్లి చినవెంకటరామారావు, వట్టికోట ఆళ్వారుస్వామి, కె. లింగరాజు, గూడూరి సీతారాం, జి. సురమౌళి, డి. రామలింగం, నెల్లూరి కేశవస్వామి, వెల్దుర్తి మాణిక్యరావు, పి.వి. నరసింహారావు లాంటి వాళ్లెంతో మంది ఉన్నారు.

తెలంగాణ నుంచి మొట్టమొదటి కథ రాసిన మాడపాటి హనుమంతరావు కథల్లో ప్రధానంగా సంస్కరణ నేపథ్యముంటుంది. మొదటి తరం తెలుగుకథ సంస్కరణ ప్రధానంగా వచ్చాయి. తెలుగు కథలా తెలంగాణ కథ కూడా వస్తుశిల్పాలు, భాష రీత్యా సద్యోయౌవనంలో పుట్టింది. తెలంగాణ పోరాటం గూర్చి తెలంగాణ కథకుల నుంచి చెప్పుకోదగ్గ కథలు రాకున్నా సి.వి. కృష్ణారావు, వట్టికోట ఆళ్వారుస్వామి లాంటి వాళ్లు కొన్ని కథలు రాశారు. పి.వి. నరసింహారావు రాసిన గొల్లరామవ్వ కథ రజాకార్లపై పోరాటాన్ని కాంగ్రెస్ దృష్టికోణంలోంచి చిత్రించిన గొప్ప కథ. మొదటితరంలో తెలంగాణ సాహిత్య సాంస్కృతిక రంగాల్లో విశేషంగా కృషి చేసి తెలంగాణ వికాసానికి అశేష కృషి చేసిన సురవరం ప్రతాపరెడ్డిగారు కథలనేకం రాశారు. ఆయన జీవించిన కాలంనాటి నైజాం రాష్ట్ర స్థితికి, భాషకు అద్దం పట్టే కథలవి. ఏ ఎండకాగొడుగు పట్టే రచయితల్లా కాకుండా సురవరం ప్రతాపరెడ్డి నైజాం పాలన కాలంలో జీవించి ఉంటూ ఆ పాలనలోని లొసుగులను ప్రజాపక్షం వహించి రాశారు. తెలంగాణ నేలకు, సాహిత్యానికున్న ప్రత్యేకత ఇది. అదే ప్రజా పక్షపాతం. రాజుల కాలంలో ఉంటూ కూడా అప్పటి కవులు రాజాస్థానాల కోసం, రాజుల మెప్పు కోసం వెంపర్లాడుతుంటే తన సాహిత్యాన్ని ఇమ్మనుజేశ్వరాధములకు అంకితమివ్వనని చెప్పిన పోతన మార్గాన్ని చాలా మంది కథకులు తనది చేసుకున్నారు.

జి. రాములు, సురమౌళి, గూడూరి సీతారాంలాంటి రచయితలు కరీంనగర్ జనజీవన సంస్కృతికి, భాషకు పట్టం కట్టారు. వివిధ వృత్తులు చేసుకుంటూ బతికే సృష్టికర్తలైన ప్రజల జీవన సంఘర్షణను కథలుగా మలిచారు. తమ తల్లిభాషలో,



తమ ప్రాంత భాషలో, అప్పటికి కల్తీలేని మాండలిక భాషలో చూసిన జీవితాన్ని చూసినట్టు అక్షరబద్ధం చేశారు. ఈ తరం రచయితల కథల్లో కల్తీ లేని నిఖార్సయిన జీవితం, తాము చదువుకున్న గ్రాంథిక భాష లేదా తాము గ్రామాల్లో మాట్లాడుకునే స్వచ్ఛమైన మాండలికం దర్శనమిస్తాయి. పి. యశోదారెడ్డి రాసిన మా ఊరి ముచ్చట్లు, ఎచ్చమ్మ కథలు అప్పటి తెలంగాణ మాండలిక భాషా స్వరూపానికి నిలువెత్తు దర్పణాలు. ఆ కథల్లో వాడిన ఎన్నో పదాలు ఈ తరం వాడుకలోంచి పోయాయి. ఆ పదాలన్నింటినీ నిక్షిప్తం చేయాల్సిన అవసరముంది. కాళోజీ ప్రజల మనిషి. పుటక నీది, చావు నీది, బతుకంతా దేశానిది అని బతికి చూపిన ప్రజాపక్షపాతి. ప్రజల గొడవను 'నా గొడవ'గా కవిత్వీకరించిన ఉత్తమశ్రేణి ప్రజాకవి కాళోజీ కథల్లో మానవతా పరిమళం విరజిమ్ముతుంది.

తొలితరంలో జరిగిన భూపోరాటాల ప్రభావంతో ప్రారంభమైన వినోబాభావే భూదానోద్యమంపై పెద్దగా కథలు వచ్చిన దాఖలాలు లేవు. గ్రంథాలయోద్యమంలో భాగంగా చదువు ప్రాముఖ్యత గూర్చి కథలు వచ్చినా ఈ ఉద్యమం గూర్చి రాలేదు. హైదరాబాద్‌లో స్థాపించబడిన ఆంధ్ర మహిళా సభ స్త్రీల కోసం చేసిన ఉద్యమాల గూర్చి కథలు వచ్చాయేమో తెలియదు. ఏదేమైనా తొలితరంలో తెలంగాణ నుంచి ఏ రంగంలో ప్రముఖులైనా సరే ఒకటి రెండు కథలు రాశారు. తొలితరంలో రాసిన వాళ్ల కథలు నీలగిరి, ఆంధ్రభారతి, కాకతీయ, ప్రజామత, గోలకొండ, గృహలక్ష్మి, చిత్రగుప్త, తెలుగు, స్వతంత్ర, ఆంధ్రపత్రిక, భారతి, ప్రజాశక్తి, విశాలాంధ్ర, అభ్యుదయ, ఆంధ్రప్రభ, కిన్నెర, ఆంధ్రవాణిలాంటి పత్రికల్లో అచ్చయ్యాయి. భాగ్యనగర్, సారస్వతజ్యోతి, స్రవంతి, మీజాన్ లాంటి పత్రికలు కూడా ఈ కథలను అచ్చు వేశాయి. ప్రజాహిత, ప్రయోజన దృక్పథంతో మొదటి తరం నుంచే అద్భుతమైన కథలు తెలంగాణ నుంచి వచ్చి భవిష్యత్తరాలకు మార్గనిర్దేశం చేశాయి. అయితే ఈ కథలను చూడటానికి ఖచ్చితంగా మధ్యతరగతి లిఖిత నిబంధనలే పాటించాల్సిన అవసరం లేదు.

తొలితరం రచయితలు కొందరు మలితరంలో రచనావ్యాసంగం కొనసాగించారు. తొలితరం తెలంగాణ సామాజిక, ఆర్థిక, సాహితి, సాంఘిక పరిస్థితులకు మలితరం పరిస్థితులకు మధ్య స్పష్టమైన తేడాలున్నాయి. కొత్త కొత్త వలసలు ప్రారంభమయ్యాయి. కొత్త కొత్త పత్రికలూ వచ్చాయి. కథల్లో ఉపయోగించే భాష విషయంలోను వాదాలు మొదలయ్యాయి. అందుక్కారణం ఆంధ్రప్రదేశ్ ఏర్పడటం కొత్త పరిచయాలు కలగడం, ఇంతవరకు పరిచయం లేని విషయాలపై యాజమాన్యంలో ఉన్న పత్రికలకు రాయడం.. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన 1956 ప్రాంతం నుంచి

1970, 75 ప్రాంతం వరకు కలం పట్టిన తెలంగాణ కథా రచయితలను మలితరం కథా రచయితలుగా పేర్కొనవచ్చు. నిజానికి మొదటితరం తెలంగాణ కథకు అంధకార యుగం కాదు. స్పష్టంగా, నిబద్ధతతో తమకు తెలిసిన భాషను వాడుతూ ప్రజాపక్షం వహించి కతలు రాశారు వాళ్లు. ఈ కథల గురించి ఇటీవలి కాలం వరకూ తగినంత ప్రచారం జరగకున్నా తొలితరం తెలంగాణ కథకు చెప్పుకోదగ్గ కాలమే.

మలితరం వచ్చేనాటికి పరిస్థితులు మారాయి. కోస్తా ప్రాంత పత్రికల ఆధిపత్యం పెరిగింది. వ్యావహారిక భాష పేరు మీద కొన్ని జిల్లాల భాష పత్రికా భాషయింది. స్వాతంత్ర్యానికి పూర్వం, స్వాతంత్ర్య సమయంలో పత్రికలకున్న సేవాభావం, తత్పరత క్రమక్రమంగా దూరం కావడం మొదలైంది. పత్రికల్లో వ్యాపార సాహిత్యం జోరు పెరిగింది. డిటెక్టివ్ నవలలు, ప్రేమ నవలల జోరు పెరిగింది. ఫలానా పద్ధతిలో రాస్తేనే, ఫలానా విషయంపై రాస్తేనే, ఆ భాషను ఉపయోగిస్తేనే పత్రికల్లో ప్రచురణ జరుగుతుందన్న అభిప్రాయమూ పెరిగింది. పాకెట్ నవలలు, సంచార గ్రంథాలయాలు, టేలాల్లో నవలలు పత్రికలు అమ్మడం లాంటివి పెరిగాయి. పాపులర్ సాహిత్యం మోజూ పెరిగింది. ఇదివరకున్నట్టు పత్రికలకు ఓ నిబద్ధత కాకుండా సర్క్యులేషన్ పెంచడం సంపాదకుల బాధ్యతయి పోయింది.

ఈ విషయాలన్నీ తెలంగాణ రచయితలకు కొత్త. తమకు తెలిసిందేదో రాయడం, అదీ ప్రయోజనం కోసం రాయడం అలవాటు ఉన్న రచయితలు ఈ ధోరణి అందుకోలేకపోయారు. పోతే ఫలానా పద్ధతిలోనే రాస్తేనే, ఆ భాషలో రాస్తేనే ప్రచురింపబడే అవకాశం ఉందన్న విషయాన్ని వాళ్లు ఊహించలేకపోయారు. అందుకే మొదటితరంలో కథలు రాసినవాళ్లలో దాదాపు అందరూ మలితరంలో కథలు రాయలేకపోయారు. ఆ పద్ధతులకు సర్దుబాటు కాలేకపోయారు. డిటెక్టివ్, ఆరడుగుల హీరో నవలలు రాసే పరిస్థితులు, ఉద్దేశ్యం ఇక్కడి రచయితలకు లేవు. ఇక కొత్త తరం రచయితలు కలం పట్టడానికి సన్నద్ధులవుతున్న దశలో ఇవన్నీ ముందుకొచ్చాయి. ఏం చేయాలో తోచని పరిస్థితి ఏర్పడింది. నిజానికి తెలంగాణ కథకు ఈ సమయం అంధకార యుగమనే చెప్పవచ్చు. తమ పూర్వీకులు రాసిన అట్టడుగు జీవితాన్ని తీసుకొని ప్రజల భాషలో కథలు రాస్తే అచ్చవుతాయో కావోనన్న భయం ఓ దిక్కు పాపులర్ రచనల హోరు మరో దిక్కు, తమ రచనలు ప్రచురింపబడాలన్న తపన ఇంకో దిక్కు. ఇన్ని సందిగ్ధాల నడుమ రచయితలు మధ్యేమార్గాన్ని ఎన్నుకున్నారు. అటు వ్యాపార సాహిత్యం వైపు మొగ్గలేదు. ఇటు పూర్తి జీవిత సంఘర్షణను ఎన్నుకునే సాహసం చేయలేదు. ఇలా సందిగ్ధావస్థలో కాలేజీ జీవితాల, విద్యార్థుల జీవితాలు, ఉపాధ్యాయుల



గూర్చి, ప్రయోగాల పేరు మీద కొంతవరకు మధ్యతరగతి దృష్టి కోణాన్ని దృష్టిలో పెట్టుకొని కథలు రాశారు. అలా కథారచయితలుగా ప్రసిద్ధులైనవారఇలో ?, నవీన్, తాడిగిరి పోతరాజు, మలయశ్రీ, రామా చంద్రమౌళి లాంటి వాళ్లున్నారు. వాళ్లు మాండలికం జోలికి పోలేదు. గ్రామీణ జీవితం వైపూ తక్కువే.

మలితరంలో తెలంగాణ నుంచి దాశరథి రంగాచార్య లాంటివాళ్లు తెలంగాణ జనజీవన సంఘర్షణను, తెలంగాణలోని చిల్లరదేవుళ్లను వివరిస్తూ చక్కని నవలలు రాశారు. ఈ కాలంలోనే సాహిత్యంలో నెలకొని ఉన్న స్తబ్దతను ఛేదిస్తూ దిగంబర కవితోద్యమం వచ్చింది. దిగంబర కవుల్లో ప్రసిద్ధులైనవారిలో నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు ముగ్గురూ తెలంగాణవారే. వీళ్లు కథలు కూడా రాశారు. అయితే ఈ కథల్లో తమ కవిత్వంలో ఉన్న స్తబ్దతను ఛేదించే వేగం, చైతన్యం కనబడదు. దుర్గాబాయి దేశ్‌ముఖ్ హైదరాబాద్‌లో స్థాపించిన ఆంధ్రమహిళాసభతో తెచ్చిన చైతన్యాన్ని కాని, తెలంగాణ పోరాట సంఘటనల గూర్చి కాని, 1968-69లో వచ్చిన తెలంగాణ ఉద్యమం గూర్చి కాని మలితరం రచయితలు పుట్టించుకొని కథలు రాసి ఉంటే మలితరంలో తెలంగాణ కథకు గ్యాప్ వచ్చి ఉండేది కాదు. దిగంబర కవితోద్యమ ఊపును కథకులు అందుకొని కథలు రాసి ఉన్నా తెలంగాణ కథకు చాలా మేలు జరిగి ఉండేది. తొలితరం రచయితల మార్గాన్ని సమధికోత్సాహంతో ముందుకు తీసుకువెళ్లినా తెలంగాణ కథ ఆ తరంలోనే మరింత పరిపుష్టమయ్యేుండేది. కాని వివిధ కారణాల వల్ల ఆ పని జరగలేదు. ఈ కాలంలో రచయితలు ముఖ్యంగా కవిత్వం, నవలలపై దృష్టి పెట్టారు. పాపులర్, యద్దనపూడి ప్రేమ నవలల ఉధృతి, డిటెక్టివ్ నవలల ప్రవాహం అధికంగా ఉండటం కూడా వీటన్నిటికీ కారణాలు. ఈ రచయితల్లో కొందరు ఆ తర్వాతి కాలంలో తెలంగాణ జనజీవన సంబంధమైన విషయాన్ని, భాషను తీసుకొని కథలు రాశారు. కాని ఆ సమయంలో రాలేదు. ఈ సమయంలో వచ్చిన చెరబండరాజు కథలు కొంత వరకు ఉద్యమాలను, గ్రామీణ జీవితాన్ని విస్తృతంగా చిత్రించిన రచనలు. ఆంధ్రజ్యోతి, స్వాతి మంత్లీ, ప్రగతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, అభ్యుదయ లాంటి పత్రికల్లో ఈ కథలు ప్రచురింపబడ్డాయి. తాడిగిరి పోతరాజు జైలు కథలు, నవీన్ కాలేజీ జీవితాల గూర్చి రాసిన లైఫ్ ఇన్ ఎ కాలేజీ సంపుటిలోని కథలు, ఎనిమిదో అడుగు కథల సంపుటి కథలు ఇందులో చెప్పదగినవి. నాలుగైదు కథలు రాసిన మలయశ్రీ కథల జోలికి పోకుండా నవలల వెంట పడ్డారు.

జాతర నవలతో ప్రసిద్ధుడైన బోయ జంగయ్య మలితరంలో వచ్చిన రచయితల్లో తెలంగాణ జనజీవితాన్ని, దళితుల బతుకువెతలను కొంత వరకు

అక్షరీకరించగలిగారు. చీమలు, దున్న, తెలంగాణ వెతలు, ఇప్పపూలు, బోజ కథలు లాంటి అనేక కథా సంపుటులను వెలువరించాడీతడు. మొత్తంగా చూస్తే మలితరంలో తెలంగాణను ప్రాంతీయ ముద్రతో అట్టడుగు జనజీవన, జీవద్భాషా పరిమళంతో, స్థలకాలాల చైతన్యంతో, తెలంగాణ ముద్రతో వచ్చిన కథలు తక్కువే. ఇందుక్కారణం అందరికీ తెలిసిందే.

రాశిలోనూ, వాసిలోనూ విస్తృతంగా తెలంగాణ నుంచి కథలు వచ్చింది మూడవతరం రచయితలు కలం పట్టిన గత శతాబ్ది డెబ్బైల తర్వాతే. మూడవతరం రచయితలు కలం పట్టేనాటికి తెలంగాణలో తెలంగాణ రాష్ట్ర ఉద్యమం మూడు వందల డెబ్బై మంది విద్యార్థులను బలి తీసుకొని చల్లారింది. అయితే దాని ప్రభావం యువతరంపై ఉంది. తెలంగాణలో రెండవసారి భూపోరాట ఉద్యమాలు ప్రారంభమై వేళ్లూనుకుంటున్నాయి. ఉధృత రూపం దాలుస్తున్నాయి. ఈ తరంలో కలం పట్టిన రచయితలు ఉద్యమాల ప్రభావాన్ని అనుభవించారు. కొందరు ఉద్యమాలతో నడిచారు. చుట్టూ జరుగుతున్న ఉద్యమ ఫలితాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో చవి చూశారు. ఆ జీవితాల్లోంచి వచ్చారు. భూపోరాట ఉద్యమాలు ఈ రచయితలపై విశేష ప్రభావాన్ని చూపాయి. ఉద్యమ జీవితంతో పాటు అనేక ఇతర విషయాల గూర్చి రాసినా వీళ్లపై ఆ ప్రభావం ఎక్కువే. స్వాతంత్ర్యానంతర కాలంలో పుట్టిపెరిగి చదువుకున్న తరం యువకులై విద్యావంతులై కలం పట్టిన తరం ఇది. వీళ్లకు ఫ్యూడల్ జీవితం తెలుసు. కుల పీడన తెలుసు. దాన్ని అనుభవించిన వాళ్లే ఇందలో ఎక్కువ ఉన్నారు.

మూడవ రంలో కలం పట్టిన చాలా మంది తెలంగాణ కథా రచయితలు అంతకు ముందు చువుకునే అవకాశాలు లేని శ్రామిక కులాల నుంచి వచ్చిన వాళ్లే. మొదటితరంలో చాలామంది కథా రచయితలు అగ్రకులాల నుంచి, మూడవతరంలో నిమ్న కులాల నుంచి రావడానికి మూలాలు తెలంగాణ సమాజంలోనే ఉన్నాయి. రజాకార్ల కాలంనాటి భూపోరాట ఉద్యమాలు, తెలంగాణ రాష్ట్రోద్యమం, అంబేడ్కర్ ఉద్యమాలు, శ్రీకాకుళం తర్వాత తెలంగాణలో ప్రారంభమైన భూపోరాటాలు తెలంగాణ పీడిత కులాల్లో ఆత్మవిశ్వాసాన్ని నింపాయి. స్వల్పంగానైనా ఉన్న చదువుకునే అవకాశాలు, పనికి చదువుకు సంబంధాలతో కొనసాగిన చదువులు వీళ్లు చదువుతో జీవితాలను గెలుచుకునేట్టు చేశాయి. అంబేద్కర్ ఉద్యమాల స్ఫూర్తి, భూపోరాట ఉద్యమాల వెలుగు వీళ్లకెంతో మనోబలాన్నిచ్చాయి. తాము అనుభవించిన జీవితం బాల్యంలోని వెతలు. ఫ్యూడల్ దొరల పెత్తనాలు వీళ్లతో కలం పట్టిం ాయి. వీళ్లు భూపోరాట ఉద్యమాలకు అద్దంపడుతూ, ఇతర కుల ఉద్యమాలకు అక్షరరూపం ఇస్తూ స్థల కాలాల చైతన్యంతో అద్భుతమైన కథలు రాశారు. మొదటి తరం తెలంగాణ పోరాట కథలకు లేని స్థల



కాలాల చైతన్యం, ప్రాంతీయతా సౌరభం ఈ కథలకబ్బింది. ఈ కాలంలో కలం పట్టిన వాళ్లందరూ శ్రామికకులాల నుంచి వచ్చినవాళ్లే కావడం వల్ల పీడిత ప్రజల మాండలికమైన తెలంగాణ మాండలికాన్ని వాడటానికి వీరికే ఇబ్బందీ కలుగలేదు. తమ తల్లిదండ్రుల భాషను, తమ పూర్వీకుల భాషను, తమ ఊరి వాళ్ల జీవద్భాషను వీళ్లు నిస్సంకోచంగా వాడారు. మలితరంలో రచయితలు భాషను, గ్రామీణ జీవిత చిత్రణను వాడటానికి సంకోచించినట్టు వీళ్లు సంకోచించలేదు.

గ్రామీణ జీవితాన్ని, భాషను ఎన్నుకొని తమకు తెలిసిన విషయాలను ఏ భయాలూ లేకుండా అక్షరీకరించారు. వీటిని ప్రచురించడానికి ఎదురైన అడ్డంకులను మనో నిబ్బరంతో అధిగమించారు. అనివార్యంగా ఆ కథలను ప్రచురించేటట్టు చేశారు. ఈ కథలను మొదట్లో సృజన, అరుణతార, ప్రజాసాహితి, నూతన, వడిసెల, ప్రగతి లాంటి విప్లవ పత్రికలు ప్రచురించినా ఆ తర్వాత అన్ని పత్రికలు ప్రచురించాయి. వేలాది మంది చదివే అన్ని పత్రికల్లో తెలంగాణ జనజీవనాన్ని, సంఘర్షణను చిత్రించిన కతలు, ఆ ప్రజల భాషలో వచ్చిన కథలు ప్రచురించడం ప్రారంభమైన తర్వాతే తెలంగాణ కథకు విశేషమైన వ్యాప్తి లభించింది. అందరి దృష్టిలో తెలంగాణ మాండలికానికి సాహిత్య గౌరవం లభించింది. ఈ రంగంలో విశేషంగా కృషి చేసి మూడవతరంలో తెలంగాణ కథను విశ్వవ్యాపితం చేసిన రచయితలు అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, రఘోత్తమరెడ్డి లాంటి వాళ్లున్నారు. వీళ్లతో పాటు పోరాట కథను, తెలంగాణ గ్రామీణ జీవిత కథను అన్ని రంగాల్లో ముందుకు తీసుకు వెళ్లడానికి కృషి చేసిన రచయితలు అనేక మందున్నారు. సదానంద శారద, వుప్పల నరసింహం, పి. చంద్, ఆడెపు లక్ష్మీపతి, కె.వి. నరేందర్, దేవరాజు మహారాజు, ఐతా చంద్రయ్య, జూకంటి జగన్నాథం, జింబో, కార్మిక, సిహెచ్. మధు, సరిపల్లి కృష్ణారెడ్డి, వసంతరావు దేవ్‌పాండే, సాహు, కె. రామ్మోహన్ రాజు లాంటి ఎంతో మంది రచయితలు తెలంగాణ కథను జవసత్వాలు కలదిగా తీర్చి దిద్దారు. వీళ్లతో పాటు ముప్పై, నలభై మంది రచయితలీ కాలంలో కలం పట్టారు. విరసం, ఇతర సాహిత్య సంస్థలు, ఉద్యమాలు తెలంగాణలో పెరిగిన ఆధునిక సాహిత్య చైతన్యం తెలంగాణ కథలు విస్తృతంగా రావడానికి తోడ్పడ్డాయి.

ఈ తరం రచయితల్లో చాలా మంది గ్రామాల నుంచి వచ్చినవాళ్లే. గ్రామీణ జీవన మూలాలనెరిగినవాళ్లే కావడం వల్ల వీళ్లకు కథా వస్తువు గ్రామమే అయింది. గ్రామాల్లోని జీవిత సంఘర్షణను, నశిస్తున్న విలువలను, పతనమవుతున్న వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులు, గ్రామాల్లో తలెత్తిన ఉద్యమాలను వీళ్లు కథలుగా మలిచారు. గ్రామీణ జీవితంతో పాటు వివిధ వృత్తులు చేసుకుంటూ బతికే ప్రజలు

తమ వృత్తులను కోల్పోయి బజార్లో నిలబడటం, వలసలు పోవడంలాంటి విషయాలన్నిటినీ బహుజన కథలుగా మలిచి పని సంస్కృతిని ఉన్నతీకరించారు. విద్యార్థులు, మేధావులు, రైతలు గూర్చి, భస్మాసుర హస్తంలా మారిన వ్యవసాయాల గూర్చి కథలల్లారు. చదువులు పరాయీకరణం నుంచి, మేధావుల క్రియా రాహిత్యం గూర్చి, జానపద కళలు నశించిపోవడం గూర్చి చక్కని కథలు రాశారు. అంతకు ముందు సాహిత్యంలో అంతగా చోటు చేసుకోని కార్మికవర్గం గూర్చి, బొగ్గు గని కార్మికుల గూర్చి అద్భుతమైన కథలు రాశారు.

మూడవ తరం రచయితలు జీవితాలను అన్ని కోణాల్లోంచి పరిశీలించి ఈ విషయంపై కథలు రాలేదన్న వాదం లేకుండా అన్ని విషయాల గూర్చి రాశారు. అడవుల్లో నివసించే గిరిజనుల బతుకు వెతలను అద్భుతంగా చిత్రించారు. మైదాన ప్రాంత దళితుల బతుకుల్లోని దైన్యానికి చిత్రికలు కట్టారు. మృగ్యమవుతున్న మానవ సంబంధాలను అక్షరీకరించారు. స్త్రీల పక్షాన నిలిచి దళిత స్త్రీ, శ్రామిక స్త్రీలకు సంబంధించిన అరుదైన కథలు రాశారు. విప్లవ కథతో పాటు విప్లవేతర కథను, అన్ని అంశాలపై కథలను రాసి తెలంగాణ కథను సమున్నతంగా నిలబెట్టారు. మొదటితరం కథా వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్లి తెలంగాణ కథకు నిబద్ధతే ప్రాణం అని నిరూపించారు. వీళ్ల కృషితో తెలంగాణ కథకు విశ్వవ్యాప్తి లభించింది.



# తెలుగులో కథా విప్లవాలు

సాహిత్యంలో ఓ విధానం లేదా వాదం ప్రవేశించి అది గణనీయంగా ప్రభావం చూపి, సాహిత్య మార్గాన్ని నిర్దేశించి, ఆ విధానం కొంతకాలమైనా కొనసాగే అనుచరవర్గమంటే ఆ విధానాన్ని సాహిత్య విప్లవమనవచ్చు. తెలుగు కథ పుట్టిన 1910 నుంచి ఇప్పటి వరకు కథా సాహిత్యంలో అనేక ధోరణులు తమ తమ ప్రభావాలను చూపుతూనే ఉన్నాయి. ఈ కాలం నుంచి ఈ కాలం వరకు కచ్చితంగా ఈ కథా విప్లవం కొనసాగింది. అలాంటి కథలు మాత్రమే వచ్చాయి అని చెప్పడం సాధ్యం కాకున్నా ఒకే కాలంలో ఒకటి కంటె ఎక్కువ కథా ధోరణులు కొనసాగినా ఆయా కాలాల్లో విస్తృతంగా వచ్చిన కథలను బట్టి ఫలానా కథా విప్లవం కొనసాగిందని చెప్పవచ్చు. ఇలా తెలుగు కథల్లో వచ్చిన ప్రధాన ధోరణులను వింగడించుకుంటే ఎనిమిది కథా విప్లవాలు వచ్చినట్టగుపడతాయి. అవి 1. సంస్కరణవాదం 2. స్త్రీవాదం 3. అభ్యుదయ వాదం 4. అట్టడుగు జీవితాలు 5. విప్లవ వాదం 6. దళిత వాదం 7. బహుజనవాదం 8. ప్రాంతీయ, మైనారిటీ వాదాలు.

ఈ కథా విప్లవాలను సవిమర్శకంగా, వాస్తవికతా దృక్పథంతో పరిశీలిస్తే తెలుగు కథ పోయిన పోకడలు తెలుసుకోవచ్చు. తెలుగు కథా సాహిత్యంలో వచ్చిన ఈ ధోరణుల ద్వారా ఆయా కాలాల్లోని, ప్రాంతాల్లోని తెలుగు జీవితం అవగతమవుతుంది. ఈ ధోరణులన్నింటినీ పరిశీలిస్తే తెలుగు సమాజ పోకడలతోపాటు తెలుగువారి సామాజిక ఆర్థిక సాంఘిక జీవనం గురించి రాయడానికి సరిపోయేంత ముడిసరుకు కథల్లో లభిస్తుంది. ప్రజల సాంఘిక చరిత్రలను సాహిత్యాధారాల ద్వారా రాసే క్రమాన్ని ఈ ధోరణి మరింత ముందుకు తీసుకు వెళ్తుంది. తెలుగు సమాజం అనేక రకాలుగా విభజింపబడుతున్న ఈ సమయంలో తెలుగు ప్రజల సాంఘిక చరిత్ర సాహిత్యంలో ఎలా నిక్షిప్తమైందో తెలుసుకోవడం చారిత్రకావసరం.. ఈ ప్రాజెక్టు అందుకుపయోగపడి సాహిత్యానికెంత బలం ఉందో తెలుసుకోవడానికి తెలుగ కథా ద్రోణులకు రెఫరెన్సుగా పనికివస్తుంది.

1. తెలుగులో మొట్టమొదటి కథకుడు గురజాడ.. వీరు రాసిన దిద్దుబాటు 1910లో ఆంధ్రభారతిలో అచ్చయింది... ఇదే మొదటి కథగా ప్రసిద్ధి పొందింది.. గురజాడ కలంపెట్టే నాటికి భారతదేశం పరాయిపాలనలో ఉంది... తెలుగు సమాజంలో సంస్కరణోద్యమాలు, స్వాతంత్రేచ్ఛ పెల్లుబుకుతున్నాయి.. కరుడుగట్టిన తెలుగు సమాజాన్ని సంస్కరణోద్యమంతో ముందుకు తీసుకెళ్ళిన వీరేశలింగం పంతులుగారు గురజాడకు సమకాలికులు... గురజాడ కలంపట్టేవరకు మనకు కాశీమజిలీకథలు,

నీతి చంద్రికకథలు తెనాలి రామకృష్ణుని కథలున్నా అవన్నీ ఆశుకథా సాంప్రదాయానికి చెందిన కథలు.. జానపద కథల్లాంటివి.. గురజాడ కథ ఆంగ్లభాషా సాహిత్య పరిచయంతో తెలుగులో వచ్చిన ఆధునిక కథ - వాటినే మనం కథానికలు అంటున్నాం...

ఆధునిక కథకుడు అంటే లిఖిత సాహిత్య కథకుడు తన చుట్టూ ఉన్న సమాజంలోంచే విషయాలను తీసుకొని రాస్తున్నా జానపద కథకుడికి ఆ జీవితంతో, భాషతో ఉన్నంత తాదాత్మ్యం లిఖిత సాహిత్య కథకుడికి లేదు. ఎందుకంటే ఆ కథకుడు జీవిస్తున్నదా జీవితంలోనే జానపద కథల్నుంచి, జీవితాల్నుంచి రచయితలు నేర్చుకోవాల్సినదెంతో ఉందంటాడు గోర్కీ. ఆధునిక సాహిత్యానికి యుగకర్తయైన గురజాడ మార్గం కవిత్వంలో కంటె కథల్లోనే కొనసాగింది. అంత వరకు ఆశు సాంప్రదాయంలో ఉన్న తెలుగు కథను లిఖిత సాంప్రదాయానికి చెందిన కథగా మార్చడం గురజాడ సాధించిన కథా విప్లవం.

గురజాడ కథలకు కేంద్రబిందువు స్త్రీ మార్గం సంస్కరణ. భాష పాత్రోచితం. మొదటి కథనే శిల్ప సౌందర్యం గల కథగా తీర్చిదిద్ది తెలుగు కథ సద్యోయౌవనమని నిరూపించాడు. అతడు రాసిన ఐదు కథలూ సంస్కరణోద్యమంలోని వివిధ భాగాలను తెలిసేవే. దిద్దుబాటు, మెటిల్డా కథల్లో వైవాహిక జీవిత సమస్యను, సంస్కర్త హృదయంతో వేశ్యాసమస్యను, మీ పేరేమిటి, పెద్ద మసీదులో మతసమస్యను చిత్రీకరించాడు. ఉత్తమ కథానికా లక్షణాలన్నీ గురజాడ మొదటి కథలోనే పరిపక్వం చెందాయి.

గురజాడ సంస్కరణవాద సాహిత్యానికి పొడిగింపుగా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అదే దృక్పథంతో కథలు రాశాడు. వీరేశలింగం సంస్కరణోద్యమం శ్రీపాదనూ ప్రభావితం చేసింది. అతడే కాకుండా కరుణకుమార, టేకుమళ్ల కామేశ్వరరావు గురజాడ తడిమిన సంస్కరణ అంశాలను మరింత లోతుగా స్పృశించి కథలు రాశారు.

కందుకూరి విధవా వివాహాల్లాంటి అంశాలనే కాకుండా వేశ్యాసమస్య, స్త్రీ విద్య, స్త్రీ స్వేచ్ఛ, మూఢనమ్మకాల పట్ల వ్యతిరేకత, కులమతాల పట్ల నిరసనను తమ కథల్లో చూపి ఆధునిక సంస్కరణ వాద కథలకు ఆద్యుడయ్యాడు గురజాడ. ఆశు సాంప్రదాయంలో ఉన్న కథను లిఖిత సాంప్రదాయానికి మళ్లించి అలవోకగా అరటిపండు ఒలిచి నోట్లో పెట్టినట్టు సాగే కథను శిల్ప సౌందర్యం గల కథలుగా తీర్చిదిద్ది కథలంటే సమకాలీన సమాజంలోంచి తీసుకొని రాయాల్సినవని చాటి చెప్పి కథకు సాంఘిక ప్రయోజనం ఉండాలని చెప్పాడు గురజాడ. ప్రయోజనమైన ప్రక్రియను తెలుగు పాఠకుడికి కొత్తదైన ఆధునిక కథను తెలుగులోకి తీసుకురావడం



గురజాడ సాధించిన కథా విప్లవం. ఈతని సంస్కరణవాద కథలను ఎంతో మంది అనుసరించారు. ఈ కాలంలోనే తెలంగాణ ప్రాంతం నుంచి మాడపాటి హనుమంతరావు సంస్కరణ నేపథ్యంగా కథలు రాశారు.

2. గురజాడ మార్గానికి పొడగింపుగా స్త్రీనే కేంద్ర బిందువుగా తీసుకొని స్త్రీ స్వేచ్ఛకు బలమైన ప్రతినిధిగా పేర్కొన బడేట్టు స్త్రీల గూర్చి కథలు రాసిన మరొక రచయిత చలం. స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించిన (అప్పుడూ ఇప్పుడూ) కొన్ని రాసినా స్త్రీవాద కథలకు బలమైన పునాది వేసింది చలమే. ఇతడు తెలుగు సాహిత్యంలో కట్టలు తెంచుకుని ప్రవహించే ఉధృత ప్రవాహం లాంటివాడు. స్త్రీల తరఫున బలమైన ప్రాతినిధ్యం వహించి కల్లా ఝుళిపించిన చలం కథలు తెలుగు సాహిత్యంలో గొప్ప సంచలనాన్నే కలిగించాయి. గురజాడలా కేవల సంస్కరణలతో తృప్తి పడలేదు చలం. చలం తన స్త్రీ పాత్రలను రెబెల్‌లా తిరుగుబాటు చేయాలని చెప్పాడు. స్త్రీ పాత్రలకు తిరుగుబాటు తత్వాన్ని నేర్పిన మొదటి ఆధునిక రచయిత చలం. చలం స్త్రీ స్వేచ్ఛను. ఇంకా అవసరమైతే లైంగిక స్వేచ్ఛను కోరుకుంటుంది.

స్త్రీని అక్కున చేర్చుకొని సాంఘిక నియమాలకే మాత్రం విలువివ్వకుండా కథలు రాసిన చలం స్త్రీ పక్షపాతి. స్త్రీల తరఫున వకాల్తా తీసుకొని బలమైన కథలు రాసిన స్త్రీల ప్రతినిధి. పెళ్లి కొరకే మొహం వాచిపోయినట్టుండే తత్వాన్ని, పెళ్లే జీవిత పరమార్థంగా భావించే విధానాన్ని ఎద్దేవా చేస్తూ కథలు రాశాడు. పురుషుడి హింసలను భరిస్తూ పాదదాసిగా పడి వుండటం కంటె తనకిష్టమున్న వాడితో లేచిపోయినా తప్పేం కాదని తన కథల ద్వారా చెప్పాడు.

నిండుగా కొంగు కప్పుకోవడాలు, అమ్మవారిలా బొట్టు, అర్థం లేని సంప్రదాయాలు, కట్టుబాట్లు, ఊపిరి పీల్చుకోలేని నిర్బంధం, స్త్రీలపై దౌర్జన్యం లాంటి వాటినన్నింటినీ నిరసించాడు చలం. పురుషుడికో నీతి, స్త్రీకో నీతి ఉండాల్సిన అవసరం లేదన్నాడు. ప్రముఖ విమర్శకులు రాచమల్లు రామచంద్రారెడ్డి గారు చలం కథల గూర్చి ఇలా అన్నారు.

"ముందు తరం రచయితలు స్త్రీల తరఫున నిర్భయంగా రాయడానికి మార్గం సుగమం చేసాడు. విమర్శలు, దూషణలన్నీ అందరి కంటే ముందు తానే అనుభవించాడు. మళ్లీ మళ్లీ సాంప్రదాయాలకు వ్యతిరేకంగా రాసి విమర్శలకు గురి కావాల్సిన అవసరాన్ని చలం తన తర్వాతి రచయితలకు అవసరం లేకుండా చేసాడు. స్త్రీల తరఫున హాలాహలాన్ని మింగి అమృతాన్ని పంచాడు.

మన సాహిత్యం మీద చలం ప్రభావం ఎంతగా దృఢంగా వుంది అంటే

చలం మన ఆలోచనా ధోరణిలో ఒక విడదీయరాని భాగమైనాడు. మన రక్తంలో జీవమైనాడు. సంస్కారంలో ఒక సంస్కారమైనాడు"

తెలుగు సాహిత్యాన్ని తన విప్లవాత్మక భావాలతో చలం మలుపు తిప్పాడు. చలం గూర్చి కొకు ఆధునిక తెలుగు రచన చరిత్రలో ఒక బ్రహ్మాండమైన ఉప్పెన చలం అని, అతని కలానికి అటూ ఇటూ కూడా ఎవరూ సాటి లేరని అన్నాడు.

నిర్భయంగా సాహిత్యమే జీవితంగా, జీవితమే సాహిత్యంగా భావించి తాను నమ్మిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టినవాడు చలం. చలం స్త్రీల దీనగాథలను గూర్చి, పురుషుల క్రూరత్వానికి బలవుతున్న స్థితిని గూర్చి రాసిన కథలు ఓ పువ్వు పూసింది, కర్మమిలా కాలింది, పతితులు, యౌవనవనం, కల్యాణి, ఆత్మార్పణ సంపుటాలుగా వెలువడ్డాయి. ఓ పువ్వు పూసింది ఫాంటసీని ఉపయోగించి రాసిన ఓ అద్భుత కళాఖండం.

ఇలా చలం తెలుగు సమాజాన్ని, తెలుగు పాఠకలోకాన్ని ఊపి సంచలనం సృష్టించాడు. చలం కథల ప్రభావం అటు తర్వాతి రచయితలు చాలామందిపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పడింది. చలంతో ప్రభావితుడై రావూరి భరద్వాజ మొదట్లో ఇవి చలం కథలే అనిపించే విధంగా కథలు రాసాడు. చలం స్త్రీవాద దృక్పథాన్ని ముందుకు తీసుకువెళుతూ మార్క్సిస్టు అవగాహనతో ముప్పాళ్ల రంగనాయకమ్మ చక్కని కథలు రాశారు. సాహిత్యం రాజకీయోద్యమాలు స్త్రీ విముక్తిని తమ ఉద్యమాల్లో భాగంగా ఎన్నుకున్నాయి. ఆ తర్వాతి కాలంలో స్త్రీల తరఫున బలమైన ప్రతినిధిగా కథలు రాసిన రచయిత్రి ఓల్గా. 80, 90 లలో స్త్రీవాద సాహిత్యోద్యమాలు బలపడటానికి ముందే చలం బలమైన సామాజిక పునాదిని ఏర్పాటు చేశాడు. పి. సత్యవతి, అబ్బూరి ఛాయాదేవి, కుప్పిలి పద్మ, కొండేపూడి నిర్మలలాంటివాళ్లు స్త్రీవాద సాహిత్యోద్యమాన్ని మరింత ముందుకు తీసుకెళ్లారు. స్త్రీవాద సాహిత్యోద్యమ కాలంలో స్త్రీ గూర్చి అనార్థడాక్స్ ధోరణిలో కథలు రాయడానికి చలమే మార్గం సుగమం చేశాడు. చలం, ఆ తర్వాత స్త్రీల గూర్చి వచ్చిన కథా సాహిత్యాన్ని స్త్రీవాద సాహిత్య విప్లవంగా పేర్కొనవచ్చు. స్త్రీకి స్వేచ్ఛను, తిరుగుబాటు తత్వాన్ని నేర్పి, ఆర్థడాక్స్ దోరణికి స్వస్తి పలికి స్త్రీల గురించి కథలు రాయడానికి మరింత ధైర్యంగా అభిప్రాయాలను చెప్పడానికి మార్గం సుగమం చేయడం చలం సాధించిన కథా విప్లవం.

3. చలం తర్వాత తెలుగు సాహిత్యంలో మరో గొప్ప దృక్పథానికి, మార్గానికి బాట వేసిన గొప్ప రచయిత కొ.కు. మార్క్సిజం అర్థం కానివాడు జీవితాన్ని అర్థం చేసుకోలేడు అని నమ్మిన మేధావి. శాస్త్రీయ దృక్పథంతో, అవగాహనతో సిద్ధాంతాలను



కాక జీవితాల్ని ప్రమాణంగా తీసుకొని కథా రచన చేశాడు. చలం అన్ఆర్థడాక్స్ ధోరణి, వీరేశలింగం సంస్కరణ ఆధునికతను, గురజాడ సాహిత్యవారసత్వాన్ని జీర్ణించుకొని తనదైన మార్గంలో తెలుగుకథను సామ్యవాదోన్ముఖం చేసాడు కొడవటిగంటి కుటుంబరావు. ఆకలి దశాబ్ది ప్రభావం, అభ్యుదయ రచయితల సంఘం ప్రభావం ఆలోచనాపరుడైన కొ.కు.పై విశేషంగా ఉంది.

కొ.కు. కథలన్నీ మధ్యతరగతికి చెందిన బ్రాహ్మణ జీవితాలకు చెందినవే. ఈతనికున్న అనుభవ పరిధి తక్కువైనా 'ఎరుక' చాలా ఎక్కువని తెలుగు సాహిత్యంలో ఇంత ఎరుకగలిగి కథలు రాసిన మరో రచయిత దొరకడం కష్టమంటారు ప్రముఖ విమర్శకులు వల్లంపాటి వెంకటసుబ్బయ్య. కొ.కు. తన రచనలలో అప్పటి స్త్రీల పరిస్థితిని, సాంఘిక స్థితిగతులను బ్రాహ్మణ జీవితాలను ఎక్స్‌రే ఫొటోగ్రఫీలోలా చూపారు. ఈతని కొన్ని కథలలో సాంప్రదాయ విరుద్ధ ముగింపులుంటాయి. గురజాడ సంస్కరణ దృక్పథంతో, చలం వ్యక్తిగతమైన స్వేచ్ఛను అభిలషిస్తూ కథలు రాస్తే కొ.కు. మరింత ముందుకు పోయి స్పష్టమైన అవగాహనతో స్త్రీ ఆ పరిస్థితికి గల కారణాలను పరిష్కారాలను సామాజికపరంగా చూపారు.

కొ.కు. కథల గూర్చి కేతు విశ్వనాథ రెడ్డి అన్న మాటలు గమనించదగ్గవి. "కథానికా తత్వం ఇంకా పట్టుబడని జాతికి అదేమిటో తన కథల ద్వారా తెలిపిన కథకుడు. త్రికాల జ్ఞానంతో కూడిన పుష్కలమైన విషయజ్ఞత, అనితర సాధ్యమైన శిల్పజ్ఞత, సంస్కారసహజమైన ఉద్రేకరహిత భావుకత్వం వున్న కథకుడాయన. కథను ఒక సామాజిక శక్తిగా నిరూపించిన కథకుడు.

శ్రీశ్రీ అన్నట్టు ఆయన ఆంధ్ర చెహోవ్ కాడు - విశ్వసాహిత్యంలో చెహోవ్ ఒక్కడే వున్నాడు. అలాగే కుటుంబరావు కూడా... తెలుగువాడు తప్ప మరెవరూ రాయడానికి వీలలేని తాతయ్య, అమ్మమ్మ, దత్తపుత్రుడు, తలుశమ్మగారు. అమాయకులు, ఫౌల్ కథలు చాలు తెలుగు ఎల్లలు దాటడానికి. కులద్వేషం, నువ్వులూ తెలకపిండి, కొత్త జీవితం, తిండి దొంగ, మహా ఇల్లాలు చాలు భారతీయ కథలను మించడానికి. హింస, కురూపి, ఫోర్త్ డైమన్షన్, స్వార్థ బుద్ధి, బకాసుర, దిబ్బ రాజ్యం కథలు, గ్రహశకలం, పట్నవాసం, పచ్చకాగితం వంటి కథలు విశ్వసాహిత్యంలో ఏ మంచి కథకుని సరసనయినా కొ.కు.ను నిలబెడతాయి.

కుటుంబరావు తీసుకున్న జీవితాలు మధ్యతరగతివే అయినా ఆయన దృక్పథం కార్మికవర్గ దృక్పథం, మార్క్సిస్టు అవగాహన. మధ్యతరగతి జీవితాలను తీసుకొని అప్పటికి కొత్తదైన కార్మికవర్గ దృక్పథంతో కథలు రాసిన మొట్టమొదటి కథకుడు

తెలుగులో కొడవటిగంటి కుటుంబరావు గారే. మధ్యతరగతి జీవితాలకు ఆలోచనలకు భిన్నమైన రీతిలో ముగింపులిచ్చి తెలుగు కథాపరిధిని మరింత పెంచి నూతనత్వానికి ఆద్యుడయ్యాడు కొ.కు. తనకు తెలియని కార్మికవర్గ జీవితాల జోలికి పోకుండా తెలిసిన మధ్యతరగతినే తీసుకొని కార్మికవర్గ దృక్పథంతో కథలు రాసిన గొప్ప కథకుడు కొ.కు.

కుటుంబ వ్యవస్థ గూర్చి రాసినా, వివాహ వ్యవస్థ గూర్చి రాసినా, సామాజిక సమస్యల గూర్చి రాసినా కొ.కు. సంప్రదాయ సిద్ధమైన మధ్యతరగతి విలువలను పరిరక్షించే ముగింపుల జోలికి పోలేదు. స్త్రీ పునర్వివాహం, వేశ్యావృత్తి, వరకట్న నిర్మూలన, స్త్రీ స్వాతంత్ర్యం, ప్రేమవివాహాలను ప్రోత్సహించడం లాంటి వివాహ సంబంధమైన కథల్లో స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం (చెడిపోయిన మనిషి), ఉన్నత విద్య (కురూపి) కావాలని చెప్పాడు. వవాహబంధం స్త్రీని కట్టిపడేసినంతగా పురుషుడ్ని కట్టి ఉంచడం లేదని (పచ్చకాగితం) నిర్ద్వంద్వంగానే చెప్పాడు.

అతడు రాసిన సామాజికపరమైన కథల్లోనూ సమాజ వికాసానికి, జాతి సంస్కార వికాసానికి తోడ్పడేటట్టు ముగింపులిచ్చాడు. గల్పిక లాంటి కొత్త సాహిత్య ప్రక్రియను తెలుగులో ప్రవేశపెట్టి నాలుగైదు వందల కథలు రాసి తెలుగు కథను ఉన్నత శిఖరాలకు తీసుకెళ్లాడు. మునిమాణిక్యం, ధనికొండ హనుమంతరావు, మధ్య తరగతి జీవితాల గూర్చి, మల్లాది రామకృష్ణశాస్త్రి మధ్యతరగతి లైంగిక సమస్యల గురించి రాసారు. మధ్యతరగతి జీవితాలను ప్రతిబింబించాయని అనదగిన కథలు మధురాంతకం రాజారాంగారు రాశారు. వీరి కథలన్నీ కార్మికవర్గ దృక్పథాన్ని సమర్థించేవని చెప్పడం కష్టం.

ఇలా కొ.కు. అంతకు ముందున్న మధ్యతరగతి జీవితాలకు, ముగింపులకు భిన్నంగా మధ్యతరగతి జీవితాలను తీసుకొని కార్మికవర్గ దృక్పథంతో కథలు రాసి తెలుగు కథకు కొత్త ద్వారాలు తెరవడం కొ.కు. సాధించిన కథా విప్లవం. కొ.కు. కథలను కార్మికవర్గ దృక్పథమన్న మధ్యతరగతి జీవితాల కథలుగా పేర్కొనవచ్చు.

4. తెలుగు కథా సాహిత్యంలో మరో కొత్త ధోరణికి బాట వేసిన ప్రతిభావంతుడైన రచయిత రాచకొండ విశ్వనాథ శాస్త్రి. కొ.కు. మొదలు పెట్టిన శ్రామికవర్గ దృక్పథాన్ని మరింత ముందుకు తీసుకెళుతూ అట్టడుగు జీవితాలను తీసుకొని కార్మికవర్గ దృక్పథంతో కథలు రాసిన ప్రగతిశీల రచయిత రావిశాస్త్రి. రావిశాస్త్రి కథల్లో జీవితాలూ, దృక్పథమూ కార్మికవర్గానివే. అట్టడుగు జీవితాలను పాత్రలుగా తీసుకొని శిల్పపు మెరుగులతో తీర్చిదిద్ది కార్మికవర్గ దృక్పథంతో కథలు రాసి మెప్పించిన గొప్ప కథకుడు. రావిశాస్త్రికి ముందే శ్రామికవర్గ ప్రజల గూర్చి మాగోఖలే,



కరుణకుమార, చింతా దీక్షితులు కొన్ని కథలు రాసినా వాళ్ల దృక్పథం కార్మికవర్గ దృక్పథం కాదు. జీవితాలు అట్టడుగువే అయినా దృష్టికోణం మధ్యతరగతిది. అట్టడుగు జీవితాల గూర్చి కార్మికవర్గ దృక్పథంతో ఉద్యమస్ఫూర్తితో కథలు రాసిన మొట్టమొదటి కథకుడు రావిశాస్త్రి.

సమాజం ఇలా ఉందని చెప్పడం మాత్రమే రచయిత బాధ్యత కాదని, అయ్యోఅయ్యో అంటూ సానుభూతి కలిగేలా చేయడమే రచన లక్ష్యం కాదని, అలా ఎందుకుందో అందుకు గల కారణాలేమిటో అవి పోవడానికేం చేయాలో చెప్పడం కూడా రచయిత బాధ్యతేనని గుర్తెరిగి తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించిన రచయిత రావిశాస్త్రి. రావిశాస్త్రి కథల్లో జీవితాలు, మానవసంబంధాలు మాత్రమే కాక వాటిని నడిపే సూత్రాలను తెలుసుకొని రాసిన పరిజ్ఞానం కనబడుతుంది. ఇతని రచనలకు వాస్తవికత ప్రాణం.

శ్రీశ్రీకి అగ్గిపుల్లా, కుక్కపిల్లా ఏవీ కవిత్వానికనర్హం కానట్టే రావిశాస్త్రికి కూడా కథకు అనర్హం కాని వస్తువే కనబడలేదు. సారా మీద, సారాలమ్మే వాళ్ల మీద, లంపెన్ బతుకుల మీద, అగ్గిపుల్లా, సబ్బుబిల్లా, కుక్కపిల్లా, రొట్టెముక్కా, బల్లచెక్కా, అరటి తొక్కా, తలుపుగొళ్లెం, హారతిపళ్లెం, గుర్రపు కళ్లెం, బర్రెల మీద, గోవుల మీద, వేశ్యల మీద, రాజ్యాంగం రాజ్యాంగాన్ని నడిపించే యంత్రాంగం, న్యాయవ్యవస్థలోని డొల్లతనం అన్నిటి మీదా కథలు రాశాడు. ఏ వస్తువును తీసుకొని కథలు రాసినా అతనిది పేదజనుల పక్షపాతమే. ఇతిహాసపు చీకటి కోణంలో అట్టడుగున పడి కాన్పించని దీనహీన మానవులను అక్కున చేర్చుకొని కథలల్లాడు. దీనహీన మానవుల్ని హృదయానికి హత్తుకొని వాళ్ల సంవేదనలకు అక్షరరూపమిచ్చి ఇంతటి ఉద్యమస్ఫూర్తితో, వర్గ దృక్పథంతో కథలు రాసి మెప్పించిన కథారచయిత రావిశాస్త్రి కంటె ముందు లేడు.

ఇతడు కథలు రాయడం మొదలుపెట్టిన తర్వాత విషయ సేకరణలో తెలుగు కథామార్గం నిర్ధారితమై పోయిందని చెప్పవచ్చు. సారాకథలు తెలుగు కథా సాహిత్యానికి నూతన దారులు చూపాయి. ఈ కథల్లోని ముత్యాలమ్మ, రామదాసు, రాకెట్ అప్పారావు, నీలయ్య, గురవయ్య, హెడ్‌కానిస్టేబుల్, లాయర్లు, పోలీసులంతా ఈ సమాజంలోని సజీవ పాత్రలే. మాయ కథలో ముత్యాలమ్మ ప్రసంగం మనలను అతలాకుతలం చేసి అట్టడుగు ప్రజల జీవిత దృశ్యాలను మన కళ్ల ముందుచుంతుంది. రాజ్యాంగం, పోలీసులు, చట్టాలు ఎవరి పక్షమో, ఏ వర్గాల ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నాయో తెలుపుతాయి. రావిశాస్త్రి సారా, సారో, పువ్వు, గుమస్తా, ఎండ, వర్షం దేన్ని గురించి రాసినా అతని చూపు దీనహీన మానవుల వైపే. సామాజిక అన్యాయానికి, ఆర్థిక అసమానతలకు గురవుతున్న అట్టడుగు వర్గం పైన్నే.

రావిశాస్త్రి శైలిలో బీనాదేవి, పతంజలి, అతని మార్గాన్ని ముందుక తీసుకువెళుతూ కారా మరెంతో మంది కథా రచయితలు రచనలు చేశారు. కారా రావిశాస్త్రి గార్లు కోస్తా ప్రాంతంలో ఉవ్వెత్తున లేవబోయే ప్రజాపోరాటాలకు నాందులు అనదగిన కథలు రాశారు. ఆ తర్వాత ప్రజా పోరాటాలకు ప్రతిస్పందనగా, పోరాటాలను చిత్రిస్తూ వచ్చిన కథలకు వీరి కథలు పునాదులు, ప్రేరణలు. కథ ఉద్యమ కథగా పరిణామం చెందే క్రమాన్నిఉద్యమ కథలకు పటిష్టమైన పునాదిని, ఉద్యమాల్లో పాల్గొనే భౌతికావసరాలు తీరని పోరాట ప్రజల జీవితాలను ఇతివృత్తాలుగా స్వీకరించడానికి నాందిని ఈ కథలు మనకిచ్చాయి.

సుస్పష్టమైన సాహిత్య ప్రయోజనంతో, స్వాహిత్యం సమాజానికి ఏదో విధంగా మేలు చేయాలన్న దృక్పథంతో మంచిని పెంచాలన్న కాంక్షతో రచనలు చేసినవాడు రావిశాస్త్రి. సర్వసంపదలకు సృష్టికర్తలై వుండి కూడా కనీసావసరాలైనా తీర్చుకోలేని దోపిడీ పీడనలకు గురవుతున్న వాళ్ల గూర్చి కార్మికవర్గ దృక్పథంతో కథలు రాసి తెలుగు కథ పరిధిని మరింత పెంచి ఉద్యమ కథలు రావడానికి పునాది వేసి మరో కథా విప్లవానికి బాట వేసిన గొప్ప కథకుడు రాచకొండ విశ్వనాథ శాస్త్రి. ఈతని కథలను అట్టడుగు జీవితకథలుగా పేర్కొనవచ్చు. ఈ కథలలో తెలుగు సాహిత్యంలో వస్తు సేకరణ మార్గం విశాలమైంది.

5. భూమినాది యన్న భూమి ఫక్కున నవ్వు
ధనము నాది యన్న ధనము నవ్వు
కదనభీతుజూచి కాలుండు నవ్వురా
విశ్వదాభిరామ వినురవేమ

అన్నాడు తెలుగులో మొట్టమొదటి ప్రజాకవి వేమన... భారతదేశ మంతట్లోనూ మొదట తెలంగాణలోనే భూపోరాటాలు మొదలయ్యాయి. స్వాతంత్ర్యనంతరం ఆ పోరాటాలు అణచివేయబడ్డాయి.. అటు తర్వాత నక్సల్‌బరీ స్ఫూర్తితో శ్రీకాకుళంలో 1968 – 69 ప్రాంతాల్లో భూపోరాటాలు ఉధృతమయ్యాయి. అవీ అణచివేయబడ్డాయి. శ్రీకాకుళ పోరాటాలకు ప్రతిస్పందనలుగా కళింగాంధ్ర నుంచి కథలు వచ్చాయి.. రా.వి.శాస్త్రి, కా.రా. కథలు శ్రీకాకుళం పోరాటానికి ముందున్న పరిస్థితులను చెబితే శ్రీకాకుళ పోరాటం గూర్చి భూషణం కథలు చెబుతాయి.. పోరాట ప్రతిస్పందనలతో కథలు రాసిన మొట్టమొదటి కథకుడు భూషణం – కొండగాలి, అడివంటుకుంది. పులుసు లాంటి కథలు శ్రీకాకుళ పోరాటం స్పందనలే. అక్కడి పోరాటిం అణచివేయబడ్డా రైతాంగ పోరాట ప్రతిస్పందనలుగా భూషణం, అప్పల్నాయుడు, ఎన్నెస్ ప్రకాశరావు, బి.టి. రామానుజం కథలు రాసారు. అటుతర్వాత తెలంగాణలో పోరాటాలు ఉధృతం



కావడం, అదే సమయంలో విప్లవ రచయితల సంఘం ఆవిర్భావం జరిగింది. దాంతో విప్లవ కథ ఓ రూపం తీసుకుంది...

తెలంగాణ పోరాట స్ఫూర్తితో కరీంనగర్ నుంచి వెలువడిన బద్‌లా సంకలనం కథల వారసత్వాన్ని ముందుకు తీసుకువెళ్తూ రా.వి. శాస్త్రి, కాళీపట్నంల కథా వారసత్వానికి పొడగింపు అన్నట్టుగా తలెంగాణా నుంచి ఉద్యమ కథలు వచ్చాయి... మొట్టమొదటి తెలంగాణ పోరాట ప్రతిస్పందనలుగా కొన్ని కథలు వచ్చినా అవి తెలంగాణవాళ్లు కానివాళ్ళు రాసి నవే ఎక్కువ. అయితే మొదటితరంలోనే అట్టడుగువర్గ జీవితాలను తీసుకొని, ప్రజల భాషలో సురవరం ప్రతాపరెడ్డి, కాళోజీ, దావరథి రంగాచార్యలాంటి వాళ్ళ కథలు రాసారు.. రెండవసారి ఉద్యమాలు ప్రారంభమౌఐన తరవాత తెలంగాణ నుంచి కథలు విరివిగా రావడం ప్రారంభమైంది. ఆ పోరాటాల్లోంచి వచ్చిన వాళ్ళు ఆ జీవితాలను చూస్తున్న వాళ్ళలోంచి రచయితలుగా ఎదిగి ఉద్యమ కథను సుసంపన్నం చేసారు. తెలుగు కథకు ఉద్యమ స్ఫూర్తిగా, విప్లవ కథగా మారిన దిశను చేకూర్చింది. భూషణం అల్లం రాజయ్యలతోపాటు తెలంగాణ రచయితలే..

రచయితకు కమిట్‌మెంట్ అవసరమన్న విషయాన్ని గుర్తించి ఉద్యమ కథలకు భాష్యాలకు తగిన కథలు రాసాడు అల్లంరాజయ్య. అతని కథల్లో ముఖ్య విషయం భూమి – భూపోరాటాలు.. ఈతని భూమి కథలు. సృష్టికర్తలు, శ్వేర రాత్రులు సంకలనం, రుతుపవనాలు, కార్మిక కథలు ప్రసిద్ధి చెందాయి.. నేల తల్లి విముక్తి కోస పేరుతో వచ్చిన కథాసంకలనం తెలంగాణ భూపోరాటాల క్రమాన్ని తెలిపే సంకలనం.. తెలంగాణపోరాట కథకు గొప్ప ఒరవడిని చేకూర్చి అట్టడుగు జనాల గూర్చి, రైతాంగం గూర్చి కార్మిక వర్గ దృక్పథంతో కథలురాసి కథకు ఉద్యమస్ఫూర్తి కలిగించిన ఉద్యమ కథల ప్రతినిధి అల్లం రాజయ్య.. రాజయ్యతోపాటు తెలెంగాణ పోరాటకథను అదే ఒకవడిలో సుసంపన్నం చేసిన రచయితలు బి.యస్.రాములు, వుప్పల నరసింహం, తుమ్మేటి రఘోతమరెడ్డి, కె. రామ్మోహన్‌రాజు, సాహూ, చుక్క గోపి, కాలువమల్లయ్య లాంటి వాళ్ళెంతో మందున్నారు. 1970–90ల మధ్య ఈ కథల ఉధృతి ఎక్కువగా ఉంది. తెలుగు నవల వ్యాపార మాయలో పడి కొట్టుకుపోతూ, తెలుగు కథ దిక్కులేని స్థితిలో ఉన్న కాలంలో తెలంగాణ నుంచి విప్లవ కథలు విరివిగా వచ్చాయి.. దీంతో ప్రజాకథల వైశాల్యం పెరిగింది. బర్లెంకడు, దుడ్డెల రామడు, పాలేరు, చాకలి రాజయ్య, మంగలి ముత్తయ్యలాంటి వాళ్ళంతా ఇందులో కథానాయికలయ్యారు.. తెలుగు కథ విప్లవ కథగా పరిణామం చెందిన కాలం ఇది...

అట్టడుగు జీవిత కథను పోరాటకథగా, విప్లవకథగా మార్పుచెందించడమే ఈ కథావిప్లవం యొక్క ప్రయోజనం.. ఇందులో కళిగాంధ్రప్రాంతం నుంచి భూషణంతోపాటు

మరికొందరు. తెలంగాణ నుంచి అల్లం రాజయ్యతోపాటు మరి కొందరు రచయితలు ముఖ్యపాత్ర వహించారు. తెలుగు కథా విప్లవాల్లో అతిముఖ్యమైనదైన ఈ కథావిప్లవం గురించి మరింత లోతుగా అధ్యయనం చేయాల్సి ఉంది.

6. ఏ భాషలోనయినా ఒక ప్రత్యేక స్వాతంత్రోద్యమం ఆ ప్రాంతం (దానితో ముడివడి ఉన్న భాష) లోని సాంఘిక, రాజకీయ ఉద్యమాల ననుసరించి లేదా అవసరాన్ని బట్టి ప్రస్ఫుటమవుతుంది... ప్రతి సాహిత్యోద్యమానికి బలమైన రాజకీయ సాంఘిక పునాదులుంటాయి.. అప్పుడే అది సాహిత్యాన్ని, సామాజిక తత్వాన్ని ఇతోధికంగా ముందుకు నెడుతుంది.. సజీవమైన ప్రతిస్పందనలు ఇచ్చి ప్రజల జీవనాడిగా నిలుస్తుంది.. అలాంటి ఉద్యమాల్లో దళత సాహిత్య ఉద్యమం ఒకటి.. జాతీయ ఉద్యమాకాలంలో దళితుల్లో ప్రధానభాగమైన హరిజన, గిరిజన ప్రజల సమస్యలు, సంవేదనల గురించి దేశవ్యాప్తంగా వివిధ భాషల్లో సంస్కరణ ధోరణిలో రచనలు వెలువడ్డాయి.. గాంధీతత్వం అ రచనలకు తోడ్పడింది... మరోవైపు 1938 తరవాత దేశంలో అల్లుకున్న అభ్యుదయ సాహిత్యోద్యమంలో అంతర్భాగంగా దళితుల సమస్యలను చిత్రించడం జరిగింది. కాని ప్రత్యేకించి మహారాష్ట్రలో మాత్రం డా॥ బి.ఆర్. అంబేద్కర్ ప్రభావంవల్ల మారాఠీభాషలో దళితసాహిత్య ఉద్యమాలకు పునాదులు పడ్డాయి. ఆ తరవాత 1970నాటికి మార్క్సిస్టు తత్వానికి దగ్గరై ఉద్యమం శక్తివంతంగా దూసుకువచ్చింది.. అనువాదాల ద్వారా ఇతర భాషల్లోకి వెళ్ళి మరాఠీ దళిత సాహిత్యం తమ ఉద్యమ ఉత్తేజాన్ని నిరూపించింది... అంటారు నిఖిలేశ్వర్..

తెలుగు దళిత సాహిత్యోద్యమం పుట్టడానికి మహారాష్ట్రలోలాగ రాజీకయ ఉద్యమాలు విడిగా దళితుల కోసం రాలేదు.. వివిధ ప్రగతిశీల సాహిత్యోద్యమాలు దళితుల సమస్యను తీసుకుని ఉద్యమ సాహిత్యంలో భాగంగా రాసారు.. అభ్యుయ విప్లవ సాహిత్యోద్యమాలూ అవే పనిచేసాయి..అయినా తెలుగు నాట '80ల తర్వాత స్త్రీవాద సాహిత్యోద్యమంతోపాటు దళిత సాహిత్యోద్యమమూ వచ్చింది. దళిత కథలూ వచ్చాయి.. ద.ర.క.మే. ఐక్యవేదిక, మాదిగ దండోరా, మాలమహానాడు, వివిధ కులోద్యమాలు, దళిత బహుజనుల నుంచి వచ్చిన రచయితలు ఈ సాహిత్యోద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళాయి.. ఈ ఉద్యమం తెలుగు విప్లవ కథకు నష్టం చేయలేదు.. తెలుగు కథ మరింత ముందుకు వెళ్ళడానికి, ఇదివరకు స్పృశించని మరిన్ని కోణాలను స్పృశించడానికి దోహదం చేసింది. స్త్రీవాద, దళిత సాహిత్యోద్యమాలు రావడానికి కారణం ఉద్యమాలు వీళ్ళ సమస్యలను పట్టించుకోవాల్సినంతగా పట్టించుకోపోవడంవల్లనే.. ఆ ఉద్యమాలకున్న విస్తృతిలో దళితుల ప్రత్యేక సమస్యలను, అణచివేతను, అంటరానితనాన్ని, క్షోభను గుర్తించాల్సిన విధంగా గుఇర్తంచకపోవడం



వల్లనే ఈ సాహిత్యోద్యమం రావడంవల్ల దళిత కథ తద్వారా తెలుగు కథ మరింత సుసంపన్నమైంది..

ఈ సాహిత్యోద్యమాన్ని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ముందుకు తీసుకెళ్ళిన వాళ్ళు బి.ఎస్.రాములు, కాలువ మల్లయ్య, బోయజంగయ్య కొ.ఇనాక్, గూడఅంజయ్య, ... లాంటి వాళ్ళు.. చెప్పులు కుట్టే వాళ్లు, డప్పులు కొట్టేవాళ్ళు, తొండాలు ...వాళ్ళు, కూలీలు, వెట్టివాళ్ళు, మాలలు, మాదిగలంతా ఇందులో పాత్రధారులైనారు.. మేమూ సాహిత్యానికికెక్కదగినవాళ్ళమేనన్న ఆత్మవిశ్వాసం వాళ్ళలో పెరిగింది. తమ పేర్ల చివర అగ్రకులాల వాళ్ళలా కులంపేరు పెట్టుకోవడం తక్కువేంకాదన్న భావం పెరిగింది.. వాళ్ళలో ఆత్మన్యూనతాభావం తగ్గింది... దళిత సాహిత్యోద్యమం ఉద్యమవే కాదనే వాళ్ళూ ఉన్నారు. వీరంతా దళిత సాహిత్యానికున్నంత విస్తృతి తెలుగు దళిత కథలకు లేకున్నా ఇటీవలికాలంలో వచ్చిన దళిత కథలు తెలుగు కథా సాహిత్య పరిధిని మరింత విశాలం చేసాయి.. కొలుకలూరి ఇనాక్ కథలు, కాలువ మల్లయ్య కథల సంపుటాలు, బి.ఎస్.రాములు కథలు, బోయజంగయ్య కథలు, యువచరచయితల కథా సంపుటాలు దళిత కథకు సంపదలనదగ్గవే. దళిత కథల విస్తృతి ఎంతో ఇటీవలి కాలంలో డా॥ రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, డా॥ లక్ష్మీనారాయణ వెలువరించిన ఎనిమిది దళత కథల సంకనాలను చూస్తే అర్థమవుతుంది.

ఇలా తెలుగుకథ పోరాట కథగానే కాకుండా స్త్రీవాద కథగా, దళితకథగా ప్రత్యేక శాఖలుగా విస్తరిల్లి ఆయా విభాగాల్లో అద్భుతమైన కథలు రావడానికి దోహదం చేసింది.. ఒకే దృష్టికోణంలోంచి సాహిత్యమూల్యాంకనం చేస్తే దళిత కథ బలమేంటో అర్థమవుతుంది. తెలుగు కథ మరింత లోతుల కెళ్ళిందనడానికి అందులో పొరబాటు లేదనడానికి తెలుగులో వచ్చిన దళిత కథలే నిదర్శనం... జీవన వాస్తవికత అంబేద్కర్ సిద్ధాంతాల ప్రభావంతో వచ్చిన దళిత కథలు తెలుగు కథా సాహిత్య సంపద ... ఇదో కథా విప్లవమే..

7. సర్వసంపదలకు సృష్టికర్తలైన శ్రామిక కులాలవాళ్ళకు మొదట్నుంచీ సాహిత్యంలో చోటు తక్కువే. బట్టలు కుట్టేవాడు, బట్టలుతికేవాడు, బట్టలునేసేవాడు, గొర్లు కాసేవాడు, నాగలిదున్నేవాడు, కుండలు చేసేవాడు, నగలు చేసేవాడు; కమ్మర్లు, వడ్రింగులు, చేపలు పట్టేవాళ్ళు, సాతానులు... ఇతర వృత్తుల వాళ్ళంతా పనిచేస్తూ బతికే వాళ్ళు... సంపదలను సృష్టించేవారు... సృష్టి కర్తలైన వీళ్లకు సాహిత్యంలో చోటులేదు. ఉన్నా అతి తక్కువ... బహుజన హితాయ బహుజన సుఖాయ అని బుద్ధుడు చెప్పినా, పూలే అంబేద్కర్‌లాంటివాళ్ళు కృషిచేసినా, రామ్‌మోనోహర్ లోహితూ

రాజకీయ దృక్పథం చూపినా వీళ్ళకు సాహిత్యంలో చోటు లభించింది మాత్రం స్వల్పమే... అయితే ఈ వర్గాల్లోంచి రచయితలు రావడం మొదలైన తరవాత పూలే అంబేద్కర్‌ల భావజాల వ్యాప్తి జరిగిన తరవాత బహుజనుల గురించి ఎందుకు రాసుకోకూడదన్న ప్రశ్న తలెత్తింది. మండల్ కమీషన్ నివేదిక బయటకొచ్చిన తరవాత, బహుజన సమాజ్‌పార్టీ, సమాజ్‌వాది పార్టీ రాష్ట్రీయ జనతాదళ్‌లాంటి సామాజిక న్యాయపార్టీల విజృంభణ పెరిగిన తరవాత ఈ భావజాలం మరింత పెరిగింది.. అయితే ఏ పార్టీలతో సంబంధం లేకుండా పని సంస్కృతిని ఉన్నతీకరిస్తూ మొదట్నుంచి తెలుగులో ముఖ్యంగా తెలంగాణ నుంచి రచనలు చేస్తున్నారు... వివిధ వృత్తులను సంబంధించిన వాళ్ళను తీసుకొని కథలుగా మలుస్తున్నారు.. అలా వచ్చినవే అవ్వతొడుగిది తెలంగాణ, తెలంగాణ మట్టికథలు, పల్లె మంగలికథలు లాంటి... కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, ఇతర తెలంగాణ రచయితలు, సుంకోజు దేవేంద్రాచారి, స్వామి లాంటి రచయితలు గోగుశ్యామల, నాయకి వృత్తుల గూర్చి కథలు రాస్తూ తెలుగు కథకు బహుజన పరిమళమద్దుతున్నారు. కొందరు పాతికేళ్ళుగా ఈ కథలకు రాస్తుంటే మరికొందరు ఇటీవలికాలంలో విరివిగా రాస్తున్నారు. తెలుగు సాహిత్యంలో బహుజన కథా విప్లవం ఓ ఉద్యమం నిలదొక్కుకోలేదన్న వాళ్ళున్న ఇటీవలికాలంలో తమ మూలాలను వెతుక్కుంటూ రాసే క్రమం ఉధృతమైంది. ఈ కథా ఉద్యమం గురించి మరింత లోతులకు వెళ్ళి పరిశీలించాలి..

8. ప్రాంతీయం కాని విశ్వజనీన సాహిత్యం ఉండదన్న సత్యాన్ని గుర్తెరిగి రాసేక్రమం ఇటీవల ఉధృతమైంది. అంతా పరాయీకరణం పాలయి తమ అస్తిత్వాలను కోల్పోతుంటే ప్రాంతీయ దృక్పథంతో, భాషతో తమ మూలాలను వెతుక్కుంటూ రాసే సాహిత్యోద్యమం తెలుగులో వేళ్ళూనుకుంటుంది... ఆయా ప్రాంతాల నుంచి వస్తున్న కథా సంకలనాలు, మైనారిటీ సాహిత్య సంపుటాలు, సంకలనాలు ఇందుకు ఉదాహరణలు.. ఇటీవలికాలంలో వచ్చిన వతన్ కథల సంకలనం తెలుగునేలలోని మూడు ప్రాంతాల ముస్లిం జీవితాలకు అద్దంపట్టే రచనలు.. ప్రాంతీయ. మైనారిటీ వాద సాహిత్యాలు తెలుగులో ఇంకా ఉద్యమ స్థాయినందు కోకున్నా అందుకునే స్థితిలో ఉన్నాయి.. వీటిని గురించి కూడా మరింత లోతులకు వెళ్లి పరిశీలించాల్సి ఉంది.



# తెలంగాణ కథా విప్లవాలు

భారతీయ సాహిత్యంలోకి ఆధునిక తెలుగు కథ ప్రవేశించింది ఆంగ్లభాషా సాహిత్య పరిచయంతోనే తెలుగులోకి కథానిక అని చెప్పబడే ఆధునిక కథ ప్రవేశించింది ఆంగ్లేయుల పరిపాలన ఉన్న కాలంలో... ఆంగ్లేయుల పరిపాలనతో, బెంగాల్ సాహిత్య సాంస్కృతి కేంద్ర ప్రభావంతో కోస్తా ప్రాంతంలో ఆధునికత ముందుగా ప్రవేశంతో ఆధునిక ప్రక్రియలూ వచ్చాయి... కోస్తాలోనే మొదటి ప్రజాస్వామిక ప్రక్రియయైన కథ వచ్చి వికాసం చెందడానికి మూలాలున్నాయి.. మధ్య తరగతి చదువరుల కోసమని పుచ్చిన లిఖిత కథను చదివే మధ్యతరగతి ఆవిర్భావం కోస్తాలో స్వాతంత్ర్యానికి ముందు నుంచే ఉంది. కోస్తా ప్రాంతంలో లిఖిత కథ ఆవిర్భావం జరిగి వికాసం చెందుతున్న సమయంలో తెలంగాణలో నైజాం పరిపాలనుంది... ఆధునికమని చెప్పబడే భావాలకు తెలంగాణా కడు దూరంలో ఉంది... ఆ కాలంలో తెలంగాణా గ్రామాల్లో పత్రిక చదవడం కూడా కష్టంగానే ఉండేది... మాతృభాష కంటెక్కువగా ఉర్దూ చదవాల్సుండేది. అప్పటికి మధ్య తరగతి ఆవిర్భావం జరుగనే లేదు.. ఉంటే జమీందార్లు, భూస్వాములు లేదా ఆ భూముల్లో పని చేసే కూలినాలీలు... చాలా మందిని ముఖ్యంగా పీడిత కులాల వారికి చదువుకువే అవకాశాలు కూడా తక్కువే.

ఇలాంటి నేపథ్యమున్న తెలంగాణలో ఆధునిక తెలుగుకథ కోస్తాలో వచ్చిన రెండు సంవత్సరాల తర్వాతే వచ్చింది... అదే సంస్కరణోద్యమాన్ని స్వంతం చేసుకుంది... మొదటి తరంలో రాసిన మాడపాటి హనుమంతరావు, పి.వి.నరసింహారావు, సురవరం ప్రతాపరెడ్డి లాంటి వాళ్ళంతా సామాజిక సంస్కరణలకోసం కథనుపయోగించారు.. అయితే తెలంగాణానుంచి మొదటితరంలో ఆ తర్వాతి తరంలోనూ కోస్తా నుంచి వచ్చి నట్టుగా విస్తృతంగా కథలు రాలేదు.. అప్పటికే తెలంగాణా సమాజంలో ప్రచారంలో ఉన్న ఆశు కథా సాంప్రదాయాన్ని స్వంతం చేయడానికి ఆశుకథ లిఖితకథకు గల మధ్యే మార్గాన్ని ఎన్నుకొని కథా రచనను కొనసాగించారు... ఆధునికత అడుగు పెట్టి తెలంగాణలో ఆధునిక సాహిత్య ప్రక్రియ నెన్నుకొని రాశిలో కోస్తా ప్రాంతంలో వచ్చినంత కాకున్నా వాసిలో మాత్రం మొదట్నుంచీ మంచి కథలే రాసారు... తెలంగాణలో కథ కొంచెం ఆలస్యంగానే ప్రవేశించినా తెలుగు కథను, సమాజాన్ని ప్రభావితం చేయగల అనేక కథా విప్లవాలు తెలంగాణ నుంచి వచ్చాయి... స్వాతంత్ర్యానంతరం పుట్టిపెరిగిన తరంవారు ఎదిగి కలం పట్టిన తర్వాత తెలంగాణా కథ తిరిగి చూడకుండా మునుముందుకే పోయింది. ఎదురు లేదన్నంతగా ఎదిగింది...

సమాజంలో సాహిత్యంలో ఓ పద్ధతి కొనసాగింపబడి దాని ప్రభావం సమాజంపై కొంతయనా పడి దానికి కొంత అనుచరవర్గముంటే అది విప్లవమమతుంది... ధోరణి బలంగా కొన సాగడమే విప్లవం.... ఇలా తెలుగు కథా సాహిత్యంలో కొన్ని కథా విప్లవాలు వచ్చాయి... ఆధునిక తెలుగు కథ తెలంగాణలో కొంత ఆలస్యంగానే ప్రవాశించినా ఇక్కడి నుంచి మొత్తం తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేయగల కథా విప్లవాలు వచ్చాయి... వెనుక బడిన ప్రాంతం నుంచి లేదా దోపిడి పీడనలు ఎక్కువగా ఉన్న ప్రాంతం నుంచి గొప్ప సాహిత్యం వస్తుందనడానికి తెలంగాణా నుంచి వచ్చిన సాహిత్యం ఒక ఉదాహరణ మాత్రమే... తెలుగు కథా సాహిత్యంలో చెప్పుకోదగ్గ కథాధోరణులు (విప్లవాలు) తెలంగాణా నుంచి వచ్చాయి... కొందరు ఒప్పుకోవడానికి సిద్ధంగా  చేకుంన్నా తెలంగాణ కథా విప్లవాలు కథా సాబిత్యంలో చూపిన ప్రభావం అనితర సాధ్యమైందే...

తెలంగాణ సమాజం ఆశు సమాజం... మౌఖిక కథా, ఇతర సాహిత్య ప్రక్రియలు సమాజంలో విస్తృతంగా ప్రచారంలో ఉన్నాయి... ప్రతి ఇంటి లోగిలీ ఆశు కథా కేంద్రమే.... చదువు వచ్చిన వాళ్ళయినా రానివాళ్ళయినా వాకిళ్ళలో కూచోని, రచ్చబండల మీద కూచొని కథలు చెప్పడం, వినడం ఎప్పట్నుంచో ఉంది... ఇలాంటి వాళ్ళకు కావాల్సిన కథా రూపం ఎలా ఉండాలో గుర్తించారు తెలంగాణ రచయితలు... మన కథకులు జానపదుల్లో ఉన్న ఆశుసాంప్రదాయ బాణీలను స్వంతం చేసుకుంటే గొప్ప కథలు, ప్రజలను చేరుకునే కథలు వచ్చే అవకాశముందంటారు విమర్శకులు... మొదటి తరంలోనే లిఖిత కథకు ఆశుసాంప్రదాయ పరిమళ మద్ది ప్రజలకు చేరే కథలను రాసారు తెలంగాణా నుంచి... సురవరం ప్రతాపరెడ్డి రాసిన మొగలాలు కథలు, సురమౌళి, గూడూరి సీతారం కథలు ఈ కోవకు చెందినవే... అంతే కాకుండా ఇతర ప్రాంతాల్లో ఆధునిక కథ మధ్య తరగతికే పరిమితమయితే తెలంగాణా కథకులు మొదటితరంలోనే అట్టడుగు జీవితాలను తీసుకున్నారు... ఇలా లిఖిత కథే అయినా కథకు ఆశుకథా లక్షణాలను జోడించి కథలో ఆశు విప్లవానికి బాటా వేసారు మొదటితరం తెలంగాణ రచయితలు... తాముతీసుకున్న వస్తుమకు ఆ శిల్పమే సరైందన్న దృత్పథంతోనూ సామాన్య ఫాఠకుడికి కథ చేరాలంటే, సాహిత్య ప్రయోజనం నెరవేరాలంటే శిల్పక్లిష్టత ఇబ్బంది కరం కాకూడదని ఈ మార్గాన్నెన్నుకున్నారు... మొదటి తరంలో వేసిన మార్గాన్ని రెండవతరం రచయితలు బాగా అనుసరించ లేదు... ఆ తరవాతి తరం రచయితలు ఈ మార్గంలో కథలు రాసి తెలంగాణా కథకు విస్తృతమైన ప్రచారం తీసుకొచ్చారు... రజాకారు  పోరాట కాలంలో కొంత కొంతగ, ఆ తర్వాత



భూపొరాటాల సమయంలో విస్తృతంగా, దళిత బహుజన ఉద్యమాల సమయంలో మరింతెక్కువగా ఆశు కథను ముందుకు నడిపించారు... మొదటితరంలో సురవరం ప్రతాపరెడ్డి, గూడూరి సీతారాం, సురమౌళి, భూపోరాట ఉద్యమాల సమయంలో అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య ఆ తర్వాత కాలంలో కాలువ మల్లయ్య, పెద్దింటి ఆశోక్‌కుమార్ లాంటి వాళ్ళు ఈ రంగంలో బలమైన కథలు రాసారు.. రాస్తున్నారు... సామాన్య పాఠకుడికి కథ చేరాలన్న దృక్పథంలో పాటు ప్రజల భాషను తీసుకొనేనేక కథలు రాసారు... ఇలా తెలుగులో ఆశు కథా విప్లవానికి బాటవేసి దాన్ని ముందుకు తీసుకు పోయింది తెలంగాణ రచయితలే... ఈ కథలను ఇప్పుడు లిఖిత కథకున్న శిల్ప ప్రమాణాలతో మాత్రమే కొలువడం సరైంది కాదు... లిఖిత కథలో ఆశు కథా ధోరణికి ఆదమైన కథలుగా సురవరం ప్రతాపరెడ్డి గారి మొగలాయి కథలను పేర్కొనవచ్చు...

తెలంగాణలో రెండో సారి భూపోరాటాలు తలెత్తేనాటికి అంతకు ముందు చదువుకునే అవకాశాలు లేని కులాలోంచి, వర్గాల్లోంచి చదువుకున్న వాళ్ళు వచ్చారు... తమ చుట్టూ పెరుగుతున్న పోరాటాలకు స్పందించారు... అనివర్యంగా కలం పట్టారు... భూపోరాటాలకు అద్దం పడుతూ, అట్టడుగు ప్రజా జీవితాలకు భాష్యం చెపుతూ పుంఖానుపుంఖాలుగా కథలు రాసారు... 1970-90 మధ్యకాలంలో తెలంగాణ నుంచి విప్లవ కథల ఉధృతిఉంది... శ్రీకాకుళం రైతాంగ పోరాటాలకు భూషణం భాష్యం పలికి  విప్లవ కథకు పునాది వేసారు... ఆ పునాదిని సుదృఢం చేస్తూ తెలంగాణ నుంచి విపరీతంగా కథలు వచ్చాయి... కథంటే విప్లవ కథే అనేంతగా సృజన, అరుణతార, ప్రజాసాహితి, నూతన, వడిసేల, సాంస్కృతిక ప్రగతి లాంటి పత్రికల్లో కథలు వచ్చాయి... ఆ కాలంలో నవల వ్యాపారమయమై అభివృద్ధి చెందిన ప్రాంత రచయితలు సినిమా, వ్యాపార నవలలు మోజులో పడిన సమయంలో తెలుగు సాహిత్యన్ని రక్షించింది తెలంగాణ కథకులే... చెత్త కథ, శృంగార కథ అంటూ సాహిత్యం వెర్రితలలు వేస్తున్న సమయంలో ఏ ప్రలోభాలకు లొంగకుండా తెలుగు కథను బతికించింది తెలంగాణకథా రచయితలే... తెలుగు కథకు విప్లవ పంథాను చూపి ప్రజల భాషా పరిమళ మద్ది విప్లవ కథగా తీర్చిదిద్ది విప్లవ కథా విప్లవానికి మార్గం వేసింది తెలంగాణ రచయితలు. ఇది ఇరవై ఏళ్ళ పాటు తెలుగు సాహిత్యన్నేలింది. అన్ని ప్రాంతాలవాళ్లకు మార్గదర్శకమైంది. బద్‌లా కథాసంకలనం తనను రచయితను చేసిందని అల్లం రాజయ్య చెప్పినా బద్‌లా వచ్చిన తర్వాతే తెలంగాణలో విప్లవ కథలు విరివిగా వచ్చాయి... పోరాట కథకు జవసత్వాల నిచ్చి ఎంతో మంది ప్రభావితం

చేసిన రచయిత అల్లం రాజయ్య... భూమి, సృష్టికర్తలు, అడవిలో వెన్నెల, బొగ్గు పోరల్లో, నల్ల కలువలు నేలతల్లి విముక్తి కోసం లాంటి అనేక కథా సంపుటలు, సంకలనాలు వచ్చి విప్లవ కథను సుసంపన్నం చేసాయి... అల్లం రాజయ్యతో పాటు పోరాట కథను సుసంపన్నం చేసిన రచయితలు తుమేటి రఘోత్తమరెడ్డి, బి.యస్. రాములు, కాలువ మల్లయ్య, పి. చంద్, సి.హేచ్.మధు, ఉప్పల నర్సింహం, సరిపల్లి కృష్ణారెడ్డి, కార్మిక, దేవరాజు మహారాజు, తోట మహరేవ్ లాంటి వాళ్ళు... విప్లవ పోరాటాల కాలంలోనూ, ఆ తర్వాత తెలంగాణ కథకు గుర్తింపు వచ్చింది. ఆ కాలంలో విప్లవ పత్రికల్లోనే కాకుండా ఇతర పత్రికల్లోనూ జీవిత వ్యాఖ్యాన కథలు తెలంగాణ నుంచి విరివిగానే వచ్చాయి.... అన్ని తరహా పాఠకుల మన్ననలు పొందాయి...

విప్లవ సాహిత్య ఉధృతి తగ్గుతున్న దశలో, ప్రపంచ వ్యాప్తంగా రష్యా సోషలిస్టు వ్యవస్థ పతనం లాంటి రాజకీయ పరిణామాలు చోటు చేసుకుంటున్న సమయంలో తెలుగులో స్త్రీవాద సాహిత్యోద్యమం తలెత్తింది... ఈ స్త్రీ వాద సాహిత్యోద్యమం తెలంగాణ రచయితలను (రచయిత్రులను) అంతగా ప్రభావితం చేయలేదు... అందుక్కారణం తెలంగాణ రచయితలు స్త్రీ సమస్యలను పోరాట సాహిత్యంలో భాగంగానే భావించడంకోచ్చు... తెలుగు సాహిత్యానికి స్త్రీవాద, సాహిత్య గొప్ప కాంట్రిబూషనే అయినప్పటికీ తెలంగాణ రచయితలు ఈ విభాగంలో అంతగా కథలు రాయలేదన్నది నగ్న సత్యం... అయితే స్త్రీవాద సాహిత్యోద్యమంలో భాగంగా వచ్చిన కథలు ఎగువ మధ్యతరగతి, చదువుకున్న స్త్రీల సమస్యలను మాత్రమే ప్రతిబింబించాయన్న వాదమూ ఉంది. దళిత, బహుజన, తెలంగాణా అట్టడుగు స్త్రీ గూర్చి వీళ్ళు పట్టించుకోలేదు... స్త్రీవాద సాహిత్యోద్యమ మన్న పేరుతో కాకున్నా వాళ్ళు పట్టించుకోని స్త్రీల గూర్చి తెలంగాణ రచయితలు అనేక కథలు రాసారు... అల్లం రాజయ్య (నీల, కమల), తుమ్మేటి రఘెత్తమరెడ్డి (జాడ), కాలువ మల్లయ్య (గలుమ, ఎంగిలిచేత్తో, ఉద్ధరింపు), బి.యస్.రాములు (ఇల్లాలు)లాంటి వాళ్ళు ఈ రంగంలో కృషి చేసారు. అలాంటి స్త్రీలను పట్టించుకొని రాయాల్సిన అవసరం గూర్చి నొక్కి చెప్పారు.. స్త్రీల గూర్చి తెలంగాణ రచయితల వాదాలు, వ్యాసాలు, కథలు అన్ని ప్రాంతాల వాళ్ళు స్త్రీల గురించి మరింత లోతుకు పోయి రాయాల్సిన అవసరాన్ని ముందుకు తెచ్చాయి...

తెలంగాణ నుంచి వచ్చిన మరో అద్భుత కథా విప్లవం దళిత బహుజన కథా విప్లవం. కొందరు విప్లవ కథ దగ్గరే ఆగిపోవడానికి సిద్ధపడెనా, వీటిని సాహిత్యోద్యమాలుగా అంగీకరించడానికి కొందరొప్పుకోకున్నా దళిత బహుజన సాహిత్యం విరివిగా రావడానికి ఈ సాహిత్యోద్యమాలే కారణం... ఆయారంగాల్లో



కొందరు నిర్విరామంగా రాయడమే కారణం. మొదట్నుంచి కొంత కొంతగా దళిత కథలు వచ్చినా ఇతర కాలంలోనే దళితుల గూర్చి అన్ని కోణాల్లోనిచి చిత్రించే కథలు వచ్చాయి. వివిధ వృత్తి పనుల వారి గురించి (బహాజనులు) సర్వసంపదలకు సృష్టికర్తలైన వారి గురించి తెలుగులో సాహిత్య మంతగా రాలేదు. రా.వి.శాస్త్రి వరకు వచ్చిన సాహిత్యమంతా విశ్రాంతి కులాల వారి గురించి వచ్చిందే నన్న విమర్శకుడి మాటల్లో కొంతయినా వాస్తవముంది. విప్లవకథ, ఇతర సాహిత్యోద్యమాలు దళిత బహుజనుల గూర్చి పట్టించు కోవాల్సినంతగా పట్టించు కోనందువల్లనే ఇవి ఉద్యమాలుగా వచ్చాయన్నదాంట్లో నిజం లేక పోలేదు. అంబేద్కర్ ప్రభావంతో, వివిధ సామాజికోధ్యమాల వెలుగులో దళిత బహాజనులు గూర్చి ఆయా వర్గాల్లోంచి, ఆయా కులాల్లోంచి వచ్చిన వాళ్ళు అద్భుతమైన కథలు రాసారు.

అంతకు ముందు సాహిత్యంలో చోటు చేసుకొని కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, సాలె, గొల్ల, కాపు, జానపద బిచ్చగాల్లు, గౌండ్ల, తెనుగు, బెస్త.... సహ స్రవృత్తుల సమస్త చిహ్నాల వాళ్ళు సాహిత్యంలో చోటు చేసుకున్నారు... కొందరు తమకు తెలిసిన జీవితాలను సాహితీకరించే క్రమంలో మొదట, ఆ తర్వాత సిద్ధాంతాల వెలుగులో మరింత స్పష్టంగా దళిత బహుజన కథలను రాసారు. మండల్ కమీషన్ నివేదిక బయటకు వచ్చిం తర్వాత, సామాజిక న్యాయపార్టీల ప్రాబల్యం పెరిగిన తర్వాత ఈ సాహిత్యం మరింత ఉధృతంగా రావడం యాదృచ్ఛికం కాదు... ద.ర.క.మే. ఐక్యవేదిక, తెలంగాణ నుంచి ఒకరిద్దరు రచయితలు మొదట్నుంచీ వివిధ వృత్తుల గూర్చి కథలు రాయడం, కంచ ఐలయ్య పనిసంస్కృతిని ఉన్నతీకరించే సిద్ధాంత ప్రతిపాదన లాంటివన్నీ దళిత బహుజన కథలు విరివిగా రావడానికి దోహదం చేసాయి. కాలువ మల్లయ్య, బోయ జంగయ్య, బి.యస్.రాములు వందలాది దళిత బహాజన కథలు రాసి ఈ సాహిత్యోధమాన్ని ముందుకు తీసుకెళ్ళారు.

ఈ మధ్య కాలంలో అన్ని ప్రాంతాల నుంచి ఇదువరకు పట్టించుకోని వృత్తి పనుల వారి గురించి కథలు రావడం ఇందులో భాగమే. అనేక కథాసంకలనాలు, సంపుటులు ప్రాంతీయ ముద్రతో బహుజన దృక్పథంతో వివిధ ప్రాంతాల నుంచి రావడం మంచి పరిణామం. అయినా వాటిని ఉద్యమాలుగా గుర్తించడానికి వెనుకాడే వాళ్ళున్నారు. ఏదేమైనా దళిత బహాజన సాహిత్యోద్యమం తెలంగాణలో మొదలయి తెలుగు దేశమంతటా విస్తరించింది... ఉద్యమాలే ఊపిరిగా ఉన్న ప్రాంతం నుంచి ఈ సాహిత్యోద్యమాలు రావడం సహజమే.

తెలంగాణ నుంచి బలంగా వేళ్ళూనుకుంటున్న మరో కథా విప్లవం ప్రాంతీయ అస్తిత్వ, మైనారిటీ సాహిత్యాలు... ఇవింకా విప్లవ లేదా ఉద్యమ స్థాయికి చేరుకోకున్నా అవి ఉద్యమాలుగా పరిణామం చెందుతాయనడంలో సందేహం లేదు... ఇటీవల వచ్చిన వాదాలు, వతన్ ముస్లిం కథల సంపుటి, సంకరవిత్తులు, ముక్కోటి రతనాల వీణ, మట్టి తడుస్తున్న వాసన, నిత్య గాయాలనది లాంటి కథలు ఇందుకు ప్రబల నిదర్శనం. బాబ్రీ మసీదు విధ్వంసంతో మొదలైన అభద్రతా భావం ముస్లింలు తమ జీవితాలను, సంస్కృతిని, సమస్యలను తాము రాసుకునే స్పృహను పెంచింది... స్త్రీవాద, దళిత వాద సాహిత్యోద్యమాలు వచ్చిన తర్వాత ఆయారంగాల్లో కథా సాహిత్యం ఎలా సుసంపన్నమయిందో అలాగే కొద్ది కాలంలో మైనారిటీ కథ సుసంపన్న మమతుందనడంలో సందేహం లేదు... ఎవరి సాహిత్యం వాళ్ళు మాత్రమే రాసుకోవాలనుకోవడం సరైంది కాకున్నా, ఎవరి గురించి వాళ్ళు రాసుకుంటే ఆయా రంగాల్లో సాహిత్యం పంపష్ఠ మయ్యే అవకాశముందనడంలో సందేహం లేదు. ఇందు కుదాహరణగా గత ఇరవై ఏళ్ళుగా వస్తున్న తెలంగాణ కథా సాహిత్యాన్న చూపవచ్చు తమ మూలాలను వెతుక్కుంటూ రాసే క్రమంలో నిమగ్నమైన తెలంగాణ కథకులు మరిన్ని అద్భుతాలు సృష్టిస్తారనడంలో సందేహం లేదు.

ప్రజాతంత్ర వార్షిక సంచిక



# కథల్లో నడిగడ్డ తెలంగాణ (కరీంనగర్)

తెలంగాణ నడిగడ్డ ప్రాంతం. దక్కను పీఠభూమిలో భూకంపాలకు, తుఫానుల్లాంటి ప్రకృతి భీభత్సాలకు దూరంగా ఉన్న ప్రాంతం. ఒక ఇంచు సముద్రతీరం లేకున్నా వేలాది ఎకరాల అటవీ సంపద. పారిశ్రామిక వనరులు విశేషంగా ఉన్న ప్రాంతం. తెలంగాణాలో నడిగడ్డ ప్రాంతం కరీంనగర్. ఏ ఇతర ప్రాంత జిల్లాలతో కలియకుండా తెలంగాణ మధ్యలో ఉన్న ప్రాంతం. తెలంగాణలోని మెదక్, హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల భాషపై ఉర్దూప్రభావం, నల్గొండ, ఖమ్మం జిల్లాలపై కోస్తా భాషా సంస్కృతుల ప్రభావం, మహబూబ్‌నగర్‌లో కన్నడ ప్రభావం, అదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలపై మరాఠీ ప్రభావం ఉంది. కరీంనగర్ వరంగల్ జిల్లాలు తెలంగాణ మధ్యలో ఉండడంవల్ల ఏ ఇతర భాషా సంస్కృతుల ప్రభావంలేదు. అందుకే కరీంనగర్ జిల్లా మాండలిక భాష అసలైన తెలంగాణ మాండలికమని విమర్శకుల అభిప్రాయం. అందుకు తగ్గట్టుగానే కరీంనగర్ నుంచి ప్రజల జీవద్భాషలో అద్భుతమైన సాహిత్యం వచ్చింది.

ప్రపంచకథలకు పుట్టినిల్లుగా 'బృహత్కథ' కరీంనగర్ నేలిన శాతవాహన రాజుల కాలంలో గుణాఢ్యుడిచే రాయబడింది. బృహత్కతను సోమదేవుడు కథా సంత్సాగారంగా అనువదించాడు. ఇతడు కరీంనగర్ జిల్లాకు చెందినవాడే.. ఇలా ప్రపంచ కథా సాహిత్యంలోకి వెళ్ళిన కథలు, ప్రపంచమంతటా ప్రచారం పొందిన కథలు కరీంనగర్ నుంచి అతి ప్రాచీనకాలం నుంచే రావడం చెప్పుకోదగ్గ విషయం. కరీంనగర్ ప్రాంతం, తెలంగాణ కథలకు కాణాచి.. మౌఖిక సాంప్రదాయానికి పుట్టినిల్లు. ప్రజల నోళ్ళలో అపారమైన ఆశు సాహిత్య సంపదుంది. ఏ ఇంటిలోగిళ్ళకెళ్ళినా అదో కథాకేంద్రంగా కనబడుతుంది. నులకమంచాల్లో కూచోని కథలు చెప్పుకునేవారు వాకిళ్ళలో కూచోని శాత్రాలు విప్పుకునేవారు, రచ్చబండలమీద కూచోని అనేక రకాల కథలు చెప్పుకునేవాళ్ళు కనబడేవాళ్ళు. ఇలా కరీంనగర్ జిల్లాకు, ప్రజలకు కథ కొత్తది కాదు. అతి ప్రాచీనకాలం నుంచే ప్రజల నాలుకలపై ఉంది.

అయితే ఇవన్నీ ఆశుసాంప్రదాయానికి సంబంధించిన కథలు. ఆధునిక కథగా చెప్పబడేకథానిక లిఖిత సాంప్రదాయానికి చెందింది. ఇది భారతీయ భాషల్లోకి, తెలుగులోకి ప్రవేశించింది ఆంగ్లభాషా సాహిత్యాల పరిచయంతోనే. ఆధునిక తెలుగు కథ తెలుగునేలపై అడుగు పెట్టింది 1910లో నయితే తెలంగాణలో ఈ కథ కొంచెం ఆలస్యంగా 1912లో వచ్చింది. గురజాడ రాసిన దిద్దుబాటు తెలుగులో మొట్టమొదటి కథానికగా మాడపాటిహనుమంతరావు రాసిన హృదయశల్యం తెలంగాణ నుంచి వచ్చిన

మొట్టమొదటి కథగా ప్రసిద్ధి పొందాయి. తెలుగులో మొదటి కథ వచ్చిన ముప్పయి సంవత్సరాలకు గాని కరీంనగర్ నుంచి ఆధునిక కథ అచ్చు కాలేదు. పత్రిక చదవడం నేరంగా, ఊళ్లోకి పత్రిక తేవడం ఘోరంగా భావింపబడుతున్న కాలంలో తెలుగులో కథ రావడం కష్టంతో కూడుకున్న పనే. అయినా తెలుగు చదవడమే అపురూపంగా భావింపబడి పాలకుల భాషయైన ఉర్దూ మీడియం చదువుతున్న సమయంలో కరీంనగర్ నుంచి మొట్టమొదటి కథ 1942 ప్రాంతంలో వచ్చింది. జి. రాములు గారి ఆత్మఘోష కథల సంపుటి అచ్చయింది. ఇలా జి. రాములుగారు కరీంనగర్ నుంచి కథలు రాసిన వారిలో తొలి కథకులు.

జి. రాములుగారి కథలు సంఘ సంస్కార నేపథ్యంలో రాయబడిన కథలు. స్వాతంత్ర్యానికి ముందు తెలుగు సమాజంలో ఉన్న సంస్కరణాభిలాష నేపథ్యం మొదటితరం రచయితల్లో కనబడుతుంది. ఆధునిక కథ ఆవిర్భావం కరీంనగర్‌లో కొంత ఆలస్యంగా అయినా కథలు రాయడం మొదలయినప్పటి నుంచి వెనుదిరిగి చూడలేదు. జి. రాములుతోనూ ఆ తర్వాత మొదటి తరంలో తెలుగు కథను సుసంపన్నం చేసిన రచయితలు గూడూరి సీతారాం, జి. సురమౌళి, పి. యశోదా రెడ్డి, పి.వి. నరసింహారావు యాభై దశకంలో కథలు రాయడం ప్రారంభించి అరవై దశకం వరకు 70,80 కథలు రాశాడు సీతారాం. వీరి నారిగాడి బతుకు, మారాజు లాంటి కథలు ప్రసిద్ధి చెందాయి. ప్రారంభదశలోనే పూర్తి మాండలికంలో కథలు రాసిన తొలి తెలంగాణ కథకుడు గూడూరి సీతారాం. తనకు తెలిసిన వివిధ వృత్తిపనివారల జీవితాలను నిఖార్సయిన తెలంగాణ మాండలికంలో రాసిన రచయిత సీతారాం. ఇటీవలే వీరి కథల సంపుటి గూడూరి సీతారాం కతలు పేరుతో వెలువడింది. సోషలిస్టు సిద్ధాంతాభిమాని, ప్రగతిశీల భావాలు గలవాడైన సురమౌళి పూర్తి మాండలికంలో కతలు రాసిన తొలి తరం రచయిత. అంగుడుపొద్దు వీరి ప్రసిద్ధ కథ. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు ప్రజల మనోభావాలను తెలిపే కత ముక్కోటి బలగమోయి. తెలంగాణవారి సహృదయత, సంస్కారం, అమాయకత్వం ఈ కథలో వాస్తవికంగా చిత్రించాడు రచయిత. ప్రజల భాషయైన మాండలికంలో ఎచ్చమ్మ కథలు రాసి మెప్పించిన రచయిత్రి యశోదారెడ్డి. ఈమె కథల్లో స్త్రీపురుష సంబంధాలు, స్త్రీ సమస్యలు స్వచ్ఛమైన మాండలికభాషలో చిత్రించబడ్డాయి. జనం వాడుకలోంచి పోతున్న మాండలిక పదాలు, తెలంగాణ జాతీయాలు, సామెతలనేకం ఈమె కథల్నిండా దర్శనమిస్తాయి. కరీంనగర్ నుండి మొదటితరంలో రాసిన రచయితలు మాండలికాన్ని హృదయానికి హత్తుకొని రాశారు. రాసినవాళ్లు తక్కువే అయినా ఏ ప్రలోభాల జోలికీ పోలేదు. ప్రజల జీవితాన్ని వస్తువుగా తీసుకొని ప్రజాపక్షం వహించి రాశారు. తెలుగు కథకు



జిల్లాలో సామాజిక పునాదిని ఏర్పాటు చేశారు.

పత్రికలు తక్కువైనా తొలి తరం రచయితలు తాను రాయదల్చుకున్నది స్వేచ్ఛగా రాశారు. భాష విషయంలో తమకు తెలిసిన భాషనే వాడారు. మలితరం రచయితలు కలం పట్టేనాటికి పత్రికల సంఖ్య హెచ్చింది. ఆంధ్రప్రదేశ్ అవతరణతో పత్రికాభాష వాడాలన్న వాదం మొదలైంది. అభివృద్ధి చెందిన ప్రాంతం వాళ్ల వాదే భాషను రాస్తేనే వేసుకుంటారని, వాళ్లలా రాయాలనే తపన పెరిగింది. తమ ముందుతరం రచయితలు వేసిన బాటలో వెళితే పేరు వస్తుందో రాదోనన్న భయం.... దానికితోడు వ్యావహారిక భాషే వాడాలన్న నియమాలు, అందరికీ అర్థమయ్యే విధంగా రాయాలన్న నిబంధనలతో మలితరంలో కరీంనగర్ నుంచి కథా రచనకు కొంత గ్యాప్ ఏర్పడింది. కరీంనగర్ జిల్లా నుంచి మలయశ్రీ, తాడిగిరి పోతరాజు, ముదుగంటి పాపిరెడ్డి, చొప్పకట్ల చంద్రమౌళి, ముప్పాళ్ల నరసింహారావు, యం.వి. తిరుపతయ్య లాంటివాళ్లు కథారచనకు పూనుకున్నారు. జైలు కథల రచయితగా ప్రసిద్ధుడైన తాడిగిరి పోతరాజు కోస్తా ప్రాంతం నుంచి వచ్చి కరీంనగర్‌లో స్థిరపడ్డవ్యక్తి. విప్లవ వాద భావాలతో మంచి కథలే రాసిన రచనను సీరియస్‌గా తీసుకోలేదు. మలయశ్రీ కొన్ని కథలు రాసినా ప్రధానంగా కవిత్వం, నవలలే ఎక్కువ రాసారు. మిగతా రచయితలు సీరియస్‌గా కాకుండా అప్పుడప్పుడు రాసినవారే. ఆ కాలం కరీంనగర్ కథా సాహిత్యానికి ఒక విధంగా చూస్తే తెలంగాణ కథా సాహిత్యానికి సంధి యుగం లాంటిదే. పత్రికల సంఖ్యతో వ్యాపార సాహిత్యం జోరు హెచ్చడం, ఇతర ప్రాంత రచయితలతో రచనలతో పోల్చుకోవడంలాంటి వాటివల్ల ఈ కాలంలో కరీంనగర్ నుంచి కథారచన అంతజోరుగా సాగలేదు. మొదటితరం కథా రచయితలు ఏర్పరచిన ప్రజా కథలు, జీవద్భాష వరంపరను ముందుకు తీసుకువెళ్ళుంటే కరీంనగర్ కథ అప్పుడే సుసంపన్నమయ్యుండేది. ఆ తరవాతి తరం రచయితలు భాష విషయంలో వివక్షను ఎదుర్కొవడానికి అవకాశం ఉండేది కాదు.

మొదటితరంలోనే గొల్లరామవ్వ లాంటి అద్భుత కథను రాసిన మన మాజీ ప్రధాని పి.వి. నరసింహారావుగారు, పల్లె బాణీలను పట్టుకొని పాటకు, గేయానికి పట్టం గట్టి జ్ఞానపీఠ్ అవార్డు లాంటి అత్యున్నత పురస్కారాన్ని అందుకున్న డా.సినారె లాంటి వాళ్ళు కథలు ఇంకా రాసుంటే బాగుండేది. గొల్ల రామవ్వ కథలోని భాష, శిల్పం పాఠకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి. భారతదేశంలోనే అత్యున్నత సాహితీ పురస్కారమైన జ్ఞానపీఠ్ అవార్డు అందుకున్న ఇద్దరు తెలుగువాళ్ళలో ఒకరు సి. నారాయణరెడ్డిగారు కరీంగనర్ జిల్లా వారు కాగా, విశ్వనాథ సత్యనారాయణగారు కరీంనగర్ ప్రిన్సిపాల్‌గా పనిచేసినవారు. గొల్ల కాపర్ల కుటుంబంలోని జీవద్భాషను

వాడి గొల్లరామవ్వ కథను రాసిన పి.వి. గారు భారతదేశ అత్యున్నత స్థానానికెదిగారు. ఇలాంటి సాహిత్య చరిత్ర ఉన్న కరీంనగర్ జిల్లా నుంచి మూడవతరం రచయితలు కలం పట్టిన తరవాత రాశిలోనూ, వాసిలోనూ విశేషసంఖ్యలో కథలు వచ్చాయి. మొత్తం తెలుగు సమాజం దృష్టి, సాహిత్య సమాజం చూపు కరీంనగర్ దిక్కు మరలేంత ప్రభావం చూపాయే కథలు. రెండవ తరంలో తెలంగాణ నుంచి కూడా కథలు రాస్తున్నారు అనే ధోరణి నుంచి తెలంగాణ నుంచి విస్తృతంగా కథలు వస్తున్నాయనే వరకూ పోయింది. కరీంనగర్ జిల్లా కథకు ఈ కాలం స్వర్ణయుగమనే చెప్పవచ్చు. విశాఖపట్టణం సముద్ర తీరం వెంట, విజయవాడ వీధులగుండా పయనిస్తున్న తెలుగు కథ కరీంనగర్, జగిత్యాల, పెద్దపల్లి పట్టణ వీధులకు, కరీంనగర్ జిల్లా పల్లెల్లోకి వచ్చింది. చాలా కాలంగా ఇక్కడే కాపురం చేస్తోంది. తెలంగాణ పల్లెల్లోని సౌందర్యాన్ని సంఘర్షణను, ప్రజల భాషా మాధుర్యాన్ని మిగతా ప్రపంచానికి చవిచూపింది. ఇక్కడి పోరాటాలను అక్షరబద్ధం చేసింది. వివిధ ఉద్యమాలను సాహిత్యీకరించింది. మధ్యతరగతి బతుకు వెతలను చవిచూపింది. కార్మిక, కర్షక, విద్యార్థి, మేధావి, దళిత, బహుజన, స్త్రీ, గ్రామీణ, నగర జీవుల పక్షం వహించి కథీకరించింది. కరీంనగర్ కథకు, తెలంగాణ కథకు, తెలుగు కథకు విప్లవ, దళిత, బహుజన పంథాను చూపి జాతీయ అంతర్జాతీయ కీర్తినార్జించింది. కరీంనగర్ కతకు, తెలంగాణ కథకు, తెలుగు కథకు విప్లవ, దళిత, బహుజన పంథాను చూపి జాతీయ అంతర్జాతీయ కీర్తినార్జించింది. కరీంనగర్ జిల్లా కథా రచయితలెవరూ అవార్డుల వెంటపడకున్నా అవార్డ్‌లే రచయితల వెంటపడ్డాయి. స్పష్టమైన దృక్పథంతో, అవగాహనతో, కమిట్‌మెంట్‌తో కథారచన కొనసాగింది. ఈ కాలంలో వ్యాపార రచనల జోరు హెచ్చినా, ఎన్ని ప్రలోభాలున్నా అటు పోకుండా ప్రజాపక్షం వహించి రచనలు చేయడం గమనించదగ్గ విషయం. ఇందుకు గల మూలాలు కారణాలు స్పష్టంగానే ఉన్నాయి.

తెలంగాణలో రెండవసారి భూపోరాట ఉద్యమాలు ప్రారంభమవుతున్న సమయంలో కరీంనగర్ నుంచి బద్‌లా అనే కథా సంకలనం వచ్చింది. ఇందులో ఉన్న కథలు ఏడే అయినా ఆ ఏడూ అగ్నికణాలే. ఇందులో చాలా కథలు కరీంనగర్ మాండలికంలో పోరాటాలకు ప్రజలను ఉద్యుక్తులను చేయడానికి రాయబడ్డాయి. ఈ కథలు తెలంగాణలో చాలా మంది రచయితలకు ప్రేరణ ఇచ్చాయి. ఈ కథలు చదివి ప్రేరేపితుడై తాను కథలు రాశానని ప్రముఖ రచయిత అల్లం రాజయ్యగారన్నారు. చట్టూ జరుగుతున్న పోరాటాలు, గ్రామాల్లో ఉన్న ఫ్యూడల్ వ్యవస్థ, పీడిత వర్గాల్లోంచి వచ్చిన రచయితల్నించి ఉత్తేజితుల్ని చేసాయి. తెలంగాణలో ఉవ్వెత్తున లేచిన పోరాటాల ప్రతిస్పందనలుగా కరీంనగర్ నుంచి పుంఖానుపుంఖాలుగా కథలు వచ్చాయి.



భూమికోసం భుక్తికోసం పేద ప్రజల విముక్తికోసం జరుగుతున్న పోరాటాల ఫలితాలను, పోరాట క్రమాన్ని, దున్నేవాడికీ భూమి చెందాలన్న దృక్పథంతో అనేక కథలొచ్చాయి. సృజన, అరుణతార, నూతన, ప్రజాసాహితి, వడిసెల, జీవనాడి, అభ్యుదయలాంటి పత్రికలతో పాటు మరికొన్ని పత్రికలు వీటిని ప్రచురించాయి. తెలుగు కథను విప్లవ కథగా తీర్చిదిద్దిన ఘనత అల్లం రాజయ్యదే. ఈతని కథలన్నీ ప్రజాపోరాటాల ప్రతిస్పందనలే.. ఈతనితోపాటు తుమ్మేటి రఘోత్తమరెడ్డి, కాలువ మల్లయ్య, బి.ఎస్.రాములు, సరిపల్లి కృష్ణారెడ్డి పి.చంద్ ఈ జిల్లా నుంచి పోరాట కథలు రాసారు. కరీంనగర్ బుక్‌ట్రస్ట్‌వారు ప్రచురించిన అడవిలో వెన్నెల, బొగ్గుపొరల్లో, భూమి, సృష్టికర్తలు కథా సంకలనాలు, అబంపి పబ్లికేషన్స్‌వారు ప్రచురించిన కోల్‌బెల్ట్ కథలు, భూమి సంకలనాలు, విరసంవారు ప్రచురించిన నేలతల్లి విముక్తి కోసం ఇందులో పేర్కొనదగ్గవి. పోరాటాల ప్రతిస్పందనలతో భూపోరాట కథలతో పాటు మూడవతరం రచయితలు తెలంగాణ జనజీవన సౌందర్యాన్ని, జనజీవన సంఘర్షణను చిత్రిస్తూ అనేక కథలు రాశారు. విప్లవ పత్రికల్లో రాస్తూనే కొందరు రచయితలు ఇతర అన్ని పత్రికల్లోనూ తెలంగాణ మాండలికంలో పుంఖానుపుంఖంగా కథలు రశారు. దీంతో తెలంగాణ కథకు విస్తృత ప్రచారం పెరిగింది. ఈ రచయితలెవరూ తెలంగాణ మాండలికాన్ని సాహిత్య భాషగా ఎన్నుకోవడానికి వెనుకంజవేయలేదు. అయితే వీళ్లు మాండలికంలో రాస్తే ప్రచురించడంలో మొదట్లో కొన్ని పత్రికల్లో కొంత కష్టమే అయినా వీళ్లు చేసిన నిరంతర కృషి వల్ల అన్ని పత్రికలు మాండలిక కథలు ప్రచురించడం మొదలుపెట్టాయి. బండకింది బతుకులు, అవ్వతోడు గిది తెలంగాణ, అల్లంకారం, కైత్కాల కథలు, థిల్లగి ముచ్చట్లు, తెలంగాణ మట్టి కథలు, మైనింగ్ మసాలా లాంటి మాండలిక రచనలు కాలమ్‌లు కూడా వచ్చాయి.

భూపోరాట నేపథ్యంతో ఉద్యమ కథలు ఉధృతంగా వచ్చినా వాటితో పాటు ఉద్యమేతర కథలు, తెలంగాణ గ్రామీణ జీవితం నేపథ్యంగా అనేక కథలొచ్చాయి. కాలువ మల్లయ్య, జూకంటి జగన్నాథం, బి.యస్. రాములు, కె.వి. నరేందర్, ఆడెపు లక్ష్మీపతి, ముదిగంటి సుజాతారెడ్డి, అల్లం రాజయ్య, రఘోత్తమరెడ్డి, బి. దామోదర్ రావు, రేగులపాటి కిషన్‌రావు, జింబో వంటివారు ఉద్యమేతర కథను సుసంపన్నం చేశారు. దళిత బహుజన కథలను కూడా ఈ జిల్లా రచయితలు విస్తృతంగా రాశారు. తెలంగాణ నుంచి ఉద్యమ కథతో పాటు జీవనసంఘర్షణ కథా సాహిత్యం విరివిగా ఉందని నిరూపించారు. అమ్మ, బురదలో జాబిల్లి, స్మృతి, మమతలు మానవసంబంధాలు, విసుర్రాయి, మింగుతున్న పట్నం, మా కథలు, ఘర్మజలానికి ఖరీదు కట్టే షరాబు, అవ్వతోడు గిధి తెలంగాణ, కాలువ మల్లయ్య కథలు, నాలుగు

దృశ్యాలు, వైపని, ఊటబాయి, వలసలు, నెలపొడుపు, మట్టిమనుషులు, తేనెటీగలు, వేపచెట్టు, జింబో కథలు, రేణ, భూనిర్వాసితులు లాంటి అనేక కథాసంపుటాలు ఈ జిల్లా నుంచి వచ్చాయి. ఇది వరకు సాహిత్యంలో అంతగా చోటు లేని సింగరేణి కార్మికవర్గంపై అనేక కథలొచ్చాయి. కార్మికులుగా పని చేస్తున్న అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమ రెడ్డి, ఆడెపు లక్ష్మీపతి, కాలువ మల్లయ్య, కార్మిక, వేల్పుల నారాయణ, పి. చంద్ లాంటివాళ్లంతా కార్మిక సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

గిరిజనులతో మమేకమై వాళ్లతో సహజీవనం గడుపుతూ వాళ్ల భాషను నేర్చుకొని ఆదిలాబాద్ గిరిజన జీవితాలకు భాష్యాలనదగిన కథలు రాసిన సాహు. ఈ తరంలో వచ్చిన రచయితలు స్వాతంత్ర్యానంతరం పుట్టి విద్యాబుద్ధులు నేర్చుకొని చదువుతో జీవితాలను గెలుచుకొని మూలాలను వెతుకుతూ రాస్తున్నవాళ్లు, తమ చరిత్రను తాము రాసుకుంటున్నవాళ్లు వీళ్లంతా పీడిత కులాల నుంచి వచ్చినవాళ్లే. తెలంగాణ కథ, జీవితం విశ్వవ్యాప్తం కావడానికి, జాతీయ అంతర్జాతీయ అవార్డులు రావడానికి ఈ రచయితల కృషి ఎంతో ఉంది. పత్రికలు పూర్తి వ్యాపారమయమై పోయిన కాలంలోనూ నవల మార్కెట్ సరుకైన తరుణంలోనూ భూతప్రేత పిశాచగణాల్లో విహరిస్తున్న సమయంలోనూ కరీంనగర్ రచయితలు నిబద్ధతతోనే రాశారు. వీళ్లంతా కలం పట్టిన తర్వాత ఇదివరకు సాహిత్యంలో చోటుచేసుకోని జగిత్యాల పల్లెలు, పెద్దపల్లి ప్రాంతాలు, సిరిసిల్ల గ్రామాలు, గోదావరి ఖని గనులు, మానేరు తరాలు, కోరుట్ల మెట్‌పల్లి వ్యాపార స్థలాలు, తెలంగాణ చెరువులు, కుంటలు, కష్టజీవులందరూ సాహిత్యంలో చోటుచేసుకున్నారు. కరీంనగర్ పల్లెలు విశ్వవ్యాపితమయ్యాయి. తెలుగు కథంటే, తెలంగాణ కథంటె కరీంనగర్ కథ అన్నంత విస్తృతంగా ఈ కథ వ్యాపించింది.

మూడవతరం వాళ్లు వేసిన సామాజిక కథాసాహిత్యపునాది నాసరాగా చేసుకొని ఆ తరం రచయితల్లో కొందరితోపాటు నవతరం రచయితలు అద్భుతమైన కథలు రాస్తున్నారు. పల్లెనాడిని పట్టుకొని నశిస్తున్న వృత్తులు, ప్రత్యామ్నాయంలేని బతుకులు, మృగ్యమవుతున్న మానవ సంబంధాలు, రూపాయి తనంతో. వ్యాపార విలువలతో వెలవెల బోతున్న పల్లెలు, నశిస్తున్న విలువలపై మూడవతరం రచయితలు కాలువ మల్లయ్య, బి.యస్.రాములు, కె.వి.నరేందర్‌లతో పాటు పెద్దింటి అశోక్‌కుమార్, బెజ్జారపు వినోద్‌కుమార్, బెజ్జారపు రవీందర్, బి.ఎన్. స్వామి, [illegible] ప్రకాశ్, పంజాల జగన్నాథం, వనమాల చంద్రశేఖర్ అన్నవరందేవేందర్ లాంటి అనేకమంది ఈ తరం రచయితలు కరీంనగర్ కథను, తెలంగాణ కథను, తెలుగు కథను సుసంపన్నం చేస్తున్నారు. ఈ రచయితలు చొరని చోటు లేదు. స్పృశించని వస్తువులేదు. దళిత బహుజన, అట్టడుగు జీవితాలతోపాటు ఎరుకలి, రాజన్నల.



యానాదుల జీవితాలను, సహస్రవృత్తుల సమస్త చిహ్నాలను వస్తువుగా తీసుకుని కథలు రాస్తున్నారు. తెలంగాణపల్లెను హృదయానికి హత్తుకొని పెద్దింటి అశోక్‌కుమార్ తెలంగాణ కథావారసత్వాన్ని ముందుకు తీసుకుపోతున్నాడు. ప్రపంచీకరణ విధ్వంస దృశ్యాలను అవి తెలంగాణ గ్రామాలను అతలాకుతలం చేస్తున్న వైనాన్ని, తత్ఫలితంగా జరుగుతున్న రైతుల, చేనేత కార్మికుల ఆత్మహత్యలను పెద్దింటి అశోక్‌కుమార్, జూకంటి జగన్నాథం, కాలువ మల్లయ్య, బి.యస్.రాములు, బి.వి.ఎన్.స్వామి, కె.వి. నరేందర్ లాంటి రచయితలు కథలుగా మలిచారు.

ఈ మధ్యకాలంలో వచ్చిన తెలంగాణ సాహిత్యోద్యమం ఈ జిల్లా రచయితలకు మరింత ప్రేరణ నిచ్చింది. మూడవతరంలో ప్రసిద్ధులైన కొందరు రచయితలతో పాటు ఈతరం రచయితలు, కొత్తగా కలంపట్టిన వారు సమధికోత్సాహంతో కథలు రాస్తున్నారు. తమ ముందు తరం వాళ్ళు వేసిన మాండలిక భాషా మార్గాన్ని మరింత విశాలం చేస్తూ జీవర్భాషలో కథలు రాస్తున్నారు. స్పష్టమైన నిబద్ధతతో రాస్తున్నారు. తెలంగాణపై జరుగుతున్న వివక్షపై కతలు రాయడంలోనూ వీళ్ళు ముందు వరుసలోనే ఉన్నారు. ఈ కథలకు సోయిలాంటి పత్రికలు అండగా నిలుస్తున్నాయి. నిత్యగాలయనది, ముక్కోటి రతనాలవీణ, పోరుతల్లి, మట్టి తడుస్తున్న వాసన లాంటి అనేక కథలు వివక్షపై వచ్చిన కథలు. ఏదేమైనా న్యూవరల్డ్ (ప్రపంచీకరణ) ఆర్డర్‌ను ధిక్కరిస్తూ, వివక్షను సవాలుచేస్తూ, దేశీయతను, గ్రామీణీకరణను ప్రేమిస్తూ, పని సంస్కృతిని గౌరవించే కథలు రాస్తున్న కరీంనగర్ కథకులు తెలుగు కథకు కేంద్రంగా ఉంటున్న కరీంనగర్ తెలుగు కథకు శాశ్వత కేంద్రంగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంటుందనడంలో సందేహం లేదు. రచయితల కథల సంపుటాలు, నయనం ప్రచురణలు, విశాలసాహితి ప్రచురించిన కరీంనగర్ జిల్లా కథల సంపుటాలు, భారతీయ సాహిత్యం తెలుగు కథలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. కేంద్రసాహిత్య అకాడమీ విశాలాంధ్ర, కథాసాగర్, కథాసాహితి, తెలుగుకథ లాంటి అనేక సంకలనాల్లో ఈ జిల్లా రచయితల కథలు చోటు చేసుకొని కరీంనగర్ కథను విశ్వవ్యాప్తం చేస్తున్నాయి. తమ మూలాలను వెతుక్కుంటూ తమ చరిత్రను తాము రాసుకునే క్రమంలో ఉన్న కరీంనగర్ రచయితలు 'బృహత్కథా' వారసత్వాన్ని ముందుకు తీసుకు వెళ్తారనడంలో సందేహానికి తావులేదు.

**శాతవాహన కళోత్సవాల వార్షికోత్సవ సంచికలో...**

# 13. భారతీయ సాహిత్యం - తెలంగాణ కథలు

కథమానవ జీవితానికి అత్యంత చేరువైనది. మనిషికి ఇది చాలా ఆత్మీయమైనది. బహుశా కథలు విననివాళ్లు, జీవితకాలంలో అప్పుడప్పుడైనా కథలు చెప్పనివాళ్లు లేరేమో ! తెలుగు ప్రజలకు, తెలంగాణావారికి కథలు మరింత సన్నిహితమైనవి. ఏ ఇంటిలోగిలికి వెళ్లినా అదొక కథా కేంద్రమన్నట్టుగా కనబడుతుంటుంది. కాశీమజిలీ కథలు, తెనాలి రామలింగని కథలు, పెదరాశి పెద్దమ్మ కథలు, ఏడు నిమ్మకాయలెత్తున్న రాకుమారి కథలు లాంటి అనేక కథలు మనం వింటూనే వున్నాం. అయితే ఇవన్నీ ఆశు సాంప్రదాయానికి సంబంధించిన కథలు. మౌఖిక కథలు. ఒక తరం నుండి మరో తరానికి మౌఖికంగా ప్రచారం పొందిన కథలు. ఇలా మౌఖికంగా జీవించడంలో చాలా సాహిత్యం కనుమరుగై పోయి వుండవచ్చు. ఆధునిక కథ అని చెప్పబడేది మాత్రం లిఖిత సాంప్రదాయానికి చెంది ఆంగ్ల భా... ప్రభావంతో భారతీయ భాషల్లోకి, తెలుగులోకి ప్రవేశించింది.

కథంటే చెవులు కొరుక్కునేవారు అతి ప్రాచీన కాలం నుంచే తెలు... సమాజంలోనూ, అన్ని సమాజాల్లోనూ ఉన్నారు. ఈ కథలనన్నిటినీ జానపద సాహి... రూపంలో తమవి చేసుకున్నారు శ్రామిక కులాలకు, వర్గాలకు చెందినవాళ్లు. భారతీయ లిఖిత సాహిత్యం ఒక విధంగా సుసంపన్నమైనదే. పురాణాలు, ఇతిహాసాలు, ప్రబంధాలు రకరకాల ప్రక్రియలతో పాటు ఆధునిక సాహిత్యం కూడా భారతీయ సాహిత్యంలో, తెలుగులో విరివిగానే వచ్చింది. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు, నాగరికత ఈ సాహిత్యంలో నిక్షిప్తమై ఉన్నాయి. మొదట్లో ఈ సాహిత్యం రాజాశ్రయమై కవిపండితులను పోషించడంగా జరుగుతుండేది. రామాయణ, మహాభారతాల్లోనూ, భగవద్గీతలోనూ ఇతర ప్రాచీన సాహిత్య ప్రక్రియలన్నిటిలోనూ కథా నాయకులు రాజులు. రాణులు, దేవతలు, మానవాతీత శక్తులు ఇలాంటివారే.

సామాన్య మానవుడికి ఈ సాహిత్యంలో చోటు తక్కువ. ధీరో... నాయకులు అతీంద్రియ శక్తులు ఈ కావ్యాల్లో చోటు చేసుకునేవి. అయి... శ్రామిక వర్గాలకు చెందిన పాత్రలున్నా వాళ్లెప్పుడూ కథా నాయకులు కారు. దే... మూఢ భక్తులుగా, రాజులకు సేవకావృత్తి చేసేవాళ్లుగా చిత్రించబడేవాళ్లు. సాహిత్యంలో స్థానం లభించింది అతి తక్కువనే చెప్పవచ్చు. దాదాపు లేదన్నా అ... కాదు. రాజాశ్రితమై సాహిత్యం వాళ్ల కనుసన్నల్లో మెదులుతున్న కాలంలో వాళ్ల ... పొందే ఇలాంటి సాహిత్యం రావడం సహజంగానే జరుగుతుండేది. సాహిత్యంలో భాష



విషయంలోనూ రాజులకు, దేవతలకు ధీరోదాత్తులకు గ్రాంథిక భాష వాడుతుండేవారు. ఉత్తమ పాత్రలకు సంస్కృతం, నీచ పాత్రలకు ప్రాకృతం వాడేవారు. ప్రాకృతం, సంస్కృతాలు నేటి మాండలిక, వ్యవహారిక భాషలాంటివి. సామాన్య ప్రజలను నీచ పాత్రలని, వాళ్లు మాట్లాడే భాషను గ్రామ్యమని నిందావాచకాలుగానూ వాడారు. ప్రాచీన అలంకారికుల నుండి మొన్న మొన్నటి చిన్నయసూరి వరకందరూ గ్రామ్య భాష సాహిత్యభాషగా పనికి రాదని సెలవిచ్చినవారే. అంటే ఈ సాహిత్యమంతా కొంత మంది ఉన్నత వర్గాల కోసం వాళ్ల గురించి సృష్టింపబడిందన్నమాట.

ఎవరి కోసం సృష్టింపబడినా, ఎందుకు సృష్టింపబడినా రామాయణ, మహాభారతాల్లాంటి మహాకావ్యాలు భారతీయ సాహిత్యంలో విశిష్ట సంపదలే. భారతీయ సాంస్కృతిక సంపదలనదగినవే. ఇలాంటి మహాకావ్యాలు, ఇతర సాహిత్య సంపద, ప్రపంచ సాహిత్యంలోనే అగ్రగణ్యమైనదిగా చెప్పబడే భగవద్గీత లాంటివన్నీ ఉన్నత వర్గాలవారి ప్రయోజనాలను కాపాడటానికి రాయబడ్డవే. ఆ కాలంలో అలాంటి సాహిత్యం రావడం సహజమే అయినా ఈ సాహిత్యం వర్ణాశ్రమ ధర్మాలను సురక్షితంగా కాపాడడానికి ఉపయోగపడ్డ సాహిత్యమే. భారతీయ కులసమాజంలో ఉన్నత కులాలవారి పాలనను స్థిరీకరించడానికి ఈ సాహిత్యం అద్భుతమైన సాంస్కృతిక నేపథ్యాన్ని ఏర్పరచింది. తత్ఫలితమే వర్ణాశ్రమ సంస్కృతే భారతీయ సంస్కృతిగా లెక్కింపబడటం అయితే నిరక్షరాస్యులు, శ్రమజీవులైన కోట్లాదిమంది జానపదులు, అట్టడుగు కులాలవారు. వర్గాలవారు తమ సాహిత్యాన్ని తాము సృష్టించుకున్నారు. ఆ సాహిత్యాన్ని పాటల ద్వారా, కథల ద్వారా ఇతర అనేక ప్రక్రియల ద్వారా వ్యక్తపరిచారు. తమ కష్టాలను, సుఖాలను, బాధలను, కన్నీళ్లను అన్నింటినీ కైగట్టి పాడుకున్నారు. కథలుగా చెప్పుకున్నారు. ఇదంతా మౌఖింగా జీవించింది. అదే జానపద సాహిత్యంగా పిలవబడుతుంది. శ్రామికులు సృష్టించుకున్న ఈ జానపద, ఆశు సాహిత్యమంతా పుస్తకాలకెక్కలేదు.

పోగా పోగా మిగిలిన కొద్ది సాహిత్యమే ఇటీవలి కాలంలో పరిశోధనల రూపంలో, ఇతరత్రా పుస్తకాలుగా వచ్చింది. అయినా ఈ సంపద అపూర్వమైనదే. శ్రమ జీవుల సృజనాత్మకకు అద్దం పట్టే సాహిత్య సంపదిది. లిఖిత సాహిత్యానికి మరో విధంగా చెప్పాలంటే భారతీయ లిఖిత వర్ణాశ్రమ సాహిత్యానికి ప్రత్యామ్నాయంగా శ్రామిక కులాలవారు సృష్టించుకున్న అపూర్వ సాహిత్య సంపదే ఆశు సాహిత్యం. ఇది చాలా వరకు గ్రామాల నుంచి వచ్చిందే. వీళ్లు దేవతలను, ఆచార వ్యవహారాలను, సంస్కృతిని తమవి తాము సృష్టించుకున్నారు. ఇవన్నీ ఉత్పత్తితో సంబంధం వున్నవే. అంటే వీళ్లది ఉత్పత్తితో సంబంధమున్న సాహిత్యమన్న మాట. ప్రకృతిని ప్రేమించడం,

ఆరాధించడం, సంస్కృతీ సాంప్రదాయాలను ప్రేమించడం, శ్రామిక సంస్కృతిని ఉన్నతీకరించడం, అన్యాయాలపై తిరుగుబాటు లాంటివన్నీ ఈ సాహిత్యంలో కనబడతాయి.

భారతదేశం కుల సమాజం. ఏ విధంగా పరిశీలించినా అన్ని రంగాల్లోనూ కుల ప్రభావం స్పష్టంగానే కనబడుతుంది. నిజానికి భారతీయ సంస్కృతికి, సంపదకు ఆయువుపట్టులాంటివి గ్రామాలు. శ్రామికజన వ్యవసాయ సంస్కృతీ సాంప్రదాయాలన్నీ గ్రామాల్లోనే నిక్షిప్తమై ఉన్నాయి. వ్యవసాయ సంస్కృతిని అభివృద్ధి చేసింది దళిత బహుజన శ్రామిక కులాలవారే. మనిషి జీవించడానికి అవసరమయ్యే అన్ని ఉత్పత్తులను చేసేదీ ఈ శ్రామిక కులాలవారే. సర్వసంపదలకు సృష్టికర్తలైన ఈ శ్రామికుల సంస్కృతే అసలు సిసలైన భారతీయ సంస్కృతి. అందుకే ఎన్ని పరిణామాలు జరిగినా, ఎందరెందరు దేశ, విదేశీ రాజులు పాలించినా గ్రామీణ సంస్కృతి విధ్వంసం కాలేదు. పట్టణ ప్రజలు, ఉత్పత్తితో సంబంధం లేని కులాలవారు వివిధ సంస్కృతుల ప్రభావానికి లొంగినట్టుగా గ్రామీణులు లొంగకుండా తమ ప్రత్యేకతను కాపాడుకుంటున్నారు. అందుకే ఇప్పటికీ డెబ్బై శాతం పైగా జనాలు గ్రామాల్లోనే నివసిస్తున్నారు. వ్యవసాయం, వ్యవసాయాధార పనులు, వృత్తిపనుల ద్వారానే జీవిస్తున్నారు. భారతదేశంలో ఏడు లక్షలకు పైగా గ్రామాలు పాశ్చాత్య ఇతర ప్రలోభాలకు పెద్దగా లొంగకుండా నిలదొక్కుకున్నాయి. నగరీకరణ, పాశ్చాత్యీకరణ, దేశ విదేశీ వలసలు, ఉద్యోగ రీత్యా వలసల్లాంటివి ఎన్ని జరిగినా గ్రామాల్లో అత్యధిక జనాభాగా వుంటుంది శ్రామిక కులాలవారే. ఉత్పత్తితో సంబంధం ఉన్నవాళ్లే. భారతీయ సంస్కృతిని కాపాడేవారే. అసలుసిసలైన భారతీయ సంస్కృతి గ్రామీణ సంస్కృతి.. వ్యవసాయ సంస్కృతి... వివిధ వృత్తిపనుల ఉత్పత్తి సంస్కృతి.. గిరిజన సంస్కృతి.. దళిత సంస్కృతి.. వందలు వేలాదిగా ఉన్న ఉత్పత్తి కులాల సంస్కృతి. సర్వసంపదలకు సృష్టికర్తలైన శ్రామిక కుల సంస్కృతి.

కాని ప్రాచీన భారతీయ సాహిత్యంలో ఈ సంస్కృతి చిత్రణకు చోటు లభించింది అతి తక్కువ. బౌద్ధ సాహిత్యం ఈ లోటును కొంత వరకు తీర్చినా దేశంలోంచి బౌద్ధం మటుమాయం కావడం వల్ల ఈ సంస్కృతి ఉన్నతీకరణకు చోటు లభించలేదు. ఆ తర్వాతి సాహిత్యమంతా దాదాపు ఉన్నత వర్గ, వర్ణ సంస్కృతిని ఆదర్శీకరించిందే. అందుకే ఆ వర్గాలవారు కలకాలం పాలకులుగా ఉండడానికి దోహదం చేస్తుంది. విదేశాల్లో ఉన్నంతయినా మన దేశంలో శ్రామికవర్గ సాహిత్యోన్నతీకరణ జరిగి వుంటే సిసలైన భారతీయ సంస్కృతి సాహిత్యంలో ప్రతిబింబించేది. రాచరిక వ్యవస్థలోని మాటెలా వున్నా ప్రజాస్వామిక పరిపాలనా కాలంలోనైనా అలాంటి సాహిత్యం ఉద్భృతంగా



రావాల్సింది. కానీ అలా జరగలేదు. శ్రామిక కులాలవారికి చదువుకునే అవకాశాలే మృగ్యమై ఆ కులాల్లోంచి రచయితలు రాకపోవడం ఒక కారణం అయి వుండవచ్చు. కవులుగా, రచయితలుగా ఎదిగే అవకాశాలు ఎక్కువగా కొన్ని వర్గాలవారికే ఉండటం వల్ల వాళ్లు ప్రాచీన సాహిత్య విషయ పరంపరనే ఆధునిక సాహిత్య ప్రక్రియల్లోనూ కొనసాగించారు.

తెలుగు కథ, తెలుగు సాహిత్యం ఇందుకు మినహాయింపేమి కాదు. కథ ప్రజాస్వామిక ప్రక్రియ. వచనం ప్రజాస్వామిక సంస్కృతి ప్రపంచమంతటా వేళ్లూనుకున్న కాలంలో అభివృద్ధి చెందింది. ఇది అందరికీ అందుబాటులో ఉండాల్సింది. అందరి గురించి రాయాల్సింది. తెలుగు కథ 1910లో పుట్టినా రావిశాస్త్రి అట్టడుగు జీవితాలను రాసేంత వరకు మధ్యతరగతి దృష్టి కోణాన్ని, మధ్యతరగతి జీవితాలను దాటి బయటకు రాలేదు. రావి శాస్త్రి రాసిందైనా లంపెన్ జీవితాలే. దళిత బహుజనుల గురించి అసలైన తెలుగు శ్రామిక సంస్కృతి గురించి తెలుగు కథల్లో చోటు చేసుకున్నది దాదాపు శూన్యం. అయితే వామపక్ష భావాల రచయితల సంఘాలు వచ్చిన తర్వాత వామపక్ష భావాలతో రాసేవాళ్లు కొంతవరకు దళిత బహుజనుల గురించి రాశారు. అయితే ఈ రచనల, రచయితల దృష్టికోణం వర్గస్పృహ, పోరాట స్పృహ. దోపిడీ పీడనలను అంతం చేయడం... ఈ విషయాలను ఉటంకిస్తూ రాయడంలో భారతీయ సంస్కృతి చిత్రణకు, ఉన్నతీకరణకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. వామపక్ష రచయితలు విప్లవ వస్తువుకిచ్చిన ప్రాధాన్యం శిల్పానికి, జీవిత చిత్రణకు ఇవ్వలేదన్న విమర్శ అందుకే వచ్చింది.

అట్టడుగు వర్గాలను పట్టించుకొని రాసినవే కాని అట్టడుగు కులాలను పట్టించుకొని రాసినవి కావు. ఈ దేశంలో కుల సమస్య తీవ్రతను మొట్టమొదటిసారిగా గుర్తించిన దళిత బహుజన తాత్వికుడు డా॥ బి.ఆర్. అంబేద్కర్. అంబేద్కర్ సిద్ధాంతాల ప్రభావంతోనూ, కుల స్పృహతోనూ భారతదేశ వ్యాప్తంగా కొన్ని ప్రాంతాల్లోంచి మంచి సాహిత్యమే వచ్చింది. బెంగాలీలో రాసిన మహాశ్వేతా దేవిది అంబేద్కర్ దృష్టి కోణం కాకున్నా అట్టడుగు గిరిజన సంస్కృతిని తన సాహిత్యం నిండా నింపింది. పూలే, అంబేద్కర్‌ల ప్రభావంతో మహారాష్ట్ర నుంచి మరాఠీలో అద్భుతమైన సాహిత్యం వచ్చింది. కన్నడంలో, మలయాళంలో అట్టడుగు జన సంస్కృతి చిత్రణతో కథలు వచ్చాయి. బీహార్‌లో బోజ్‌పురీ సాహిత్యం, హిందీ ప్రాంతంలో ప్రేంచంద్ మార్గంలో వచ్చిన సాహిత్యం ఈ అవసరాన్ని కొంత మేరకు తీర్చాయి.

దళిత బహుజనుల గురించి రాస్తేనే రచయితగా గుర్తింపబడుతాడు అనడం పూర్తిగా సరైంది కాకున్నా ఈ దేశంలో నేటి, ఏనాటి సామాజికావసరమైనా కుల

సమస్య తీవ్రతను గుర్తెరిగి రాయడం.. సర్వ సంపదలకు సృష్టికర్తలైన ఉత్పత్తి కులాల సంస్కృతిని, పని సంస్కృతిని ఉన్నతీకరిస్తూ రాయడం.. కుల స్పృహ లేని వర్గ స్పృహ, వర్గ స్పృహ లేని కుల స్పృహ పాక్షిక ఫలితాలను మాత్రమే ఇస్తాయన్న విషయం రుజువైంది. రష్యన్, ఐరోపా సాహిత్యానికి ఉన్నంత బలం భారతీయ సాహిత్యానికి లేకపోవడానికి కారణం భారతదేశానికి సహజమైన కుల, వర్గ స్పృహలను మిళితం చేసి రాయకపోవడమే.. అలాంటి సాహిత్యం చాలా తక్కువగా రావడమే.. తెలంగాణ నుంచి వచ్చిన సాహిత్యకారులు ఈ పనిని చాలా వరకు పూరించారు. ఇప్పుడా పనిని మరింత విస్తృతంగా చేస్తున్నారు. వస్తువును అప్రధానం చేసిన శిల్పం మాటున దాక్కునే వారు కొందరున్నా దళిత బహుజన సంస్కృతిని, తద్వారా భారతీయ సంస్కృతిని తమ కథల్లో నిక్షిప్తం చేస్తున్న రచయితలు తెలంగాణ రచయితలు. తెలిసో, తెలియకో తమకు తెలిసింది మాత్రమే రాయాలన్న తపనతోనో, వివిధ ఉద్యమాలు, అంబేడ్కర్ సిద్ధాంతాల ప్రభావంతోనో దళిత బహుజన కథలను విరవిగా రాస్తున్నారు. తమ మూలాల్లోకి వెళ్లి తమ చరిత్రను తాము అక్షరబద్ధం చేసుకుంటున్నారు.

తెలంగాణ నుంచి విరివిగా శ్రామిక సాహిత్యం రావడానికి కారణం ఇక్కడి ఉద్యమాలు. ఉద్యమ ప్రాంతంలో నివసించడం.. రచయితలు కూడా ఆ పోరాట వర్గాల నుంచి రావడం. తెలంగాణ నుంచి విస్తృతంగా రాస్తున్న రచయితలను పరిశీలిస్తే ఓ విషయం స్పష్టమవుతుంది. వీళ్లలోంచి దాదాపు అందరూ ఉత్పత్తి కులాల నుంచి వచ్చినవాళ్లే. ఒకప్పుడు వీళ్ల కులాల్లో చదువుకోవడమే అపురూపంగా భావించబడింది. అలాంటి స్థితిలోంచి చదువుకొని రచయితలైనవారు తమ చరిత్రను తాము రాసుకునే క్రమంలో పీడిత కుల, వర్గ సంస్కృతీ చిత్రణ వాస్తవిక దృక్పథంతో చేయడం జరుగుతుంది. ఈ జీవితాలను చిత్రించాల్సిన చారిత్రకావసరం ఈ రచయితలకు రావడం చెప్పుకోదగింది. వీళ్లు సృష్టించిన దళిత బహుజన కథలకు భారతీయ సాహిత్యంలో విశిష్ట స్థానం ఉంటుంది. భారతీయ సంస్కృతిని చిత్రించిన కథలుగా ఇవి శాశ్వతత్వం పొందుతాయి.

ఉద్యమ జీవితాలు, పోరాటాలు, వృత్తుల పతనం, ప్రత్యామ్నాయం లేని బతుకులు, లుప్తమవుతున్న మానవ సంబంధాలు, పని సంస్కృతి ఉన్నతీకరణ, చెమట విలువ, దళిత బహుజన సంస్కృతి చిత్రణ, సంఘర్షణ, చెప్పుడప్పు, నాగలి, నాడె, వల, గొంగడి, పార.. సంస్కృతుల చిత్రణతో తెలంగాణా బహుజన కథ సుసంపన్నమవుతుంది. 1980 ప్రాంతం నుంచి వివిధ వృత్తులపై ఉధృతంగా కథలు రావడం ప్రారంభమైన ఈ పరంపర వటవృక్షంలా, పెరుగుతూ అన్ని రాజకీయ, సామాజిక, ఆర్థిక ఉద్యమాలను తనలో సంలీనం చేసుకుంటూ విస్తరించుకుంటూ



పోతుంది. అంబేడ్కర్, మండల్, బహుజన ఉద్యమాలతో పాటు గ్రామాల మూలాల్లోకి వెళ్లుతూ కథలు రాస్తున్నారు. పాతికేళ్లుగా నిర్విరామంగా బహుజన పల్లె మూలాల్లోకి వెళ్లి కథలు రాస్తున్న ఈ రచయిత కథలను పరిశీలించినా, బి.యస్. రాములు, అల్లం రాజయ్య, ఇటీవలి కాలంలో కథలు రాస్తున్న పెద్దింటి అశోక్ కుమార్ కథలను పరిశీలించినా మనకీ విషయాలు అర్థమవుతాయి. వై అయామ్ నాట్ ఎ హిందూ, అవ్వతోడు గిది తెలంగాణ పుస్తకాలను పరిశీలించినా, ఇటీవల తెలంగాణ నుంచి వెలువడుతున్న కథలను, కథా సంపుటాలను, సంకలనాలను పరిశీలించినా బహుజనకథకు తెలంగాణ నుంచి పడుతున్న పునాది అర్థమవుతుంది. దళిత కథకు మారాఠీ సాహిత్యకథ ఇచ్చిన స్ఫూర్తి బహుజన కథకు తెలంగాణ బహుజన కథ దేశమంతటా స్ఫూర్తినిస్తుందనడంలో సందేహం లేదు. తెలంగాణ నుంచి వస్తున్న బహుజన కథ స్ఫూర్తితో ఇతర తెలుగు రచయితలు కథలు రాస్తుంటే మరికొందరు శిల్పం, సౌందర్యం ముసుగు కింద వీటిని చూడటానికి నిరాకరిస్తున్నారు. అయినా తెలంగాణ కథ పని సంస్కృతిని, భారతీయ సంస్కృతిని ఉన్నతీకరించే తన చారిత్రక కర్తవ్యాన్ని ముందుకు తీసుకెళుతూ భారతీయ సాహిత్యంలో శాశ్వత స్థానం సంపాదించుకుంటుంది.

**విశాలాంధ్ర సాహిత్యానుబంధం, జులై 2004**

# సమగ్ర సామాజిక చిత్రణ - తెలంగాణ కథ

**ఏకాంశ** వ్యగ్రత, స్వయం సమగ్రత, క్లుప్తతలను ఆధునిక కథకుండాల్సిన లక్షణాలుగా పేర్కొన్నారు. మరి ఆధునిక కథలని చెప్పబడేవన్నీ ఈ లక్షణాలు కలిగి వున్నాయా అంటే చెప్పడం కష్టమే. ఈ లక్షణాలకూ ఏ లక్షణాలకూ నియమాలకూ లొంగని ఎన్నో కథలున్నాయి. అంత మాత్రాన అవన్నీ కథలు కాకుండా పోవు. కత ఆధునిక వచన సాహిత్య ప్రక్రియ, ప్రజాస్వామిక ప్రక్రియ. ఈ నియమాల్లో ఒదిగేది మాత్రమే కథంటే స్వతంత్రుడైన ఏ రచయితా ఒప్పుకోడనుకుంటాను. అందు కోసం కథకు కాని, ఏ సాహిత్య ప్రక్రియకు కాని పూర్వ లాక్షణికులు పద్యాలకు పెట్టినట్టు ఛందోనియమాలను పెట్టడం సరైందా? ఏ ప్రజాస్వామిక ప్రక్రియలూ నూటికి నూరు పాళ్లుగా ఆ నియమాలకు లొంగక పోవచ్చు. అందులో భాగమే కథంటే క్లుప్తంగా ఉండాలని, ఇన్ని పేజీలను మించకుంటే మంచిదన్న నియమమున్నా పెద్ద పెద్ద కథలు రావడం.. క్లుప్తత అంటే పేజీల నియమం కాదు. వస్తువును తీసుకోవడంలో క్లుప్తత అనుకున్నప్పటికీ కథకు విశాలమైన కాన్వాసును తీసుకొని రాసిన వాళ్లున్నారు. ఒకే కథలో పాతికేళ్ల సామాజిక పరిణామాలను చిత్రించిన వాళ్లున్నారు. అలాగే ఏకాంశ వ్యగ్రత విషయంలోనూ కచ్చితంగా నియమాలను పాటించని కథలు చాలా వున్నాయి. కథల్లో సమగ్ర సామాజిక చిత్ర దర్శనం చేయించినవాళ్లున్నారు. పద్యానికి ఛందో నియమాల్లా కథకు కచ్చితంగా ఇవే నియమాలుండాలని భావిస్తే ప్రసిద్ధ కథలెన్నో కథలు కాకుండా పోతాయి. ఆ కథానియమాలను పాటిస్తూనే అంతకంటే విస్తృత, విశాలమైన భూమికను తీసుకొని తెలుగులో కథలు రాసిన వాళ్లున్నారు. లిఖిత సంప్రదాయ కథకు ఆశు సంప్రదాయ కథా లక్షణాలను పొదిగి కథలు రాసినవాళ్లున్నారు. ఆధునిక కథకు ప్రజల [illegible] అవసరమున్నా గ్రాంథిక, శిష్ట వ్యావహారిక, వ్యావహారిక, మాండలిక [illegible] వారున్నారు. ఆధునిక కథ సమకాలీన సామాజిక చిత్రణ, సామాజి[illegible]ంగా వచ్చిన ప్రక్రియే అయినా చారిత్రక, పౌరాణిక కథలు రాసిన [illegible]న్నారు.

అందుకోసం కథా నియమాలను పునర్నిర్వచించుకోవాల్సి ఉన్నా కచ్చితంగా ఈ నియమాలు పాటిస్తేనే కథవుతుందనుకోవడం అప్రజాస్వామికం. ఆధునిక కథకు వస్తువు భాషతో పాటు శిల్పమూ ప్రధానమైనదే. అయితే అది పాఠకులకు అందుబాటులో లేకుండాపోతే ప్రబంధ గద్యంలా క్లిష్టతరమైతే కథా ప్రయోజనం దెబ్బ తింటుంది. తెలుగు సాహిత్యంలో మొదట్నుంచి కూడా పెద్ద కథలు, కొన్నేండ్ల, తరాల సామాజిక చిత్రణ చేసే కథలు వస్తూనే ఉన్నాయి. సూక్ష్మంలో మోక్షంలా కథ నిడివితో సంబంధం



లేకుండా సమగ్ర సామాజిక చిత్రణను చేసిన కథలూ వున్నాయి. ఆధునిక కథకు సమగ్ర సామాజిక చిత్రణ ఓ భాగం అనడంలో సందేహం లేదు. నిజానికి సమగ్ర సామాజిక చిత్రణ చేసిన కథలే గొప్ప కథలయ్యాయి కూడా.

కాళీపట్నం రామారావుగారి ప్రసిద్ధ కథ యజ్ఞం. ఈ కథపై వచ్చినంత విమర్శ తెలుగులో ఏ ఇతర కథపైనా రాలేదు. ఇది పేరుకు కథే అయినా నవలంత విస్తృత జీవితాన్ని అక్షరబద్ధం చేసిన కథ. శ్రీకాకుళ గిరిజన తిరుగుబాటుకు ముందు కళింగాంధ్రలో నివురుగప్పిన నిప్పులా ఉన్న పరిస్థితులను తెలిపిన కథ ఇది. పాతికేళ్ల జీవితాన్ని, బాకీ బతుకులను గాంధీ పేరు మీదనే మెత్తని కత్తిలా ప్రవర్తించే శ్రీరాములునాయుడి వర్గ స్వభావాన్ని వాస్తవికంగా చిత్రించిన కథ. కథ ముగింపు విషయంలో కొన్ని అభ్యంతరాలున్నా ఒక్క కథలో పాతికేళ్ల జీవితాన్ని చిత్రించి కథంటే సమగ్ర సామాజిక చిత్రణ అనేదాన్ని నిరూపించారు రచయిత. ఆ కథలో పేలడానికి సిద్ధంగా వున్న పరిస్థితులను చూచాయగా చూపితే కొద్ది కాలంలోనే శ్రీకాకుళంలో తిరుగుబాటు విస్ఫోటనం జరిగింది. ఇది రచయిత భవిష్యత్ దర్శనానికి చక్కని ఉదాహరణ. ఈ కథను తెలుగులో మొదటి కథకుడు గురజాడ అప్పారావుగారి ప్రసిద్ధ కథ దేవుళ్లారా మీ పేరేమిటితో పోల్చవచ్చు. అందులోనూ ఆ కాలంలో మతం పేరు మీద జరుగుతున్న మూఢ విశ్వాసాలు, బ్రాహ్మణ కుటుంబాల్లో ఉన్న కంగాలీని సమగ్ర దర్శనం చేయిస్తాడు రచయిత. శైవవైష్ణవ మతాల పేరు మీద కొట్టుకు చచ్చే మౌఢ్యాన్ని వివరించాడు. గోపీచంద్ ధర్మవడ్డీ కథను తీసుకున్నా, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కలుపు మొక్కలు కథను పరిశీలించినా కథ ద్వారా సమగ్ర సామాజిక చిత్రణ సాధ్యమేనన్న విషయం అర్థమవుతుంది. రావిశాస్త్రి కథలను తీసుకుంటే విశాఖ ప్రాంత జీవిత చిత్రణ దర్శనమిస్తుంది. ప్రాంతీయతంటే సంకుచిత ప్రాంతీయతా భావం కాదు. ఆ ప్రాంత జీవిత చిత్రణ. ప్రాంతీయతా ముద్ర కలిగి సమగ్ర జీవిత చిత్రణతో ఉన్న కథలు విశ్వజనీన కథలయ్యాయి. కరుణకుమార కొత్త చెప్పులు, సింగమనేని జూదం కథ, కేతు విశ్వనాథరెడ్డి కథల్లో కొన్ని సమగ్ర జీవితాన్ని చిత్రించినవే.

ప్రాంతీయతా ముద్రతో, ప్రజల భాషలో రాసి సమగ్ర జీవిత చిత్రణతో రాయబడిన కథలు తెలంగాణ నుంచి విరివిగానే వచ్చాయి. సురవరం ప్రతాపరెడ్డి నిరీక్షణ కథ చారిత్రక ప్రదేశం ఆధారంగా రాయబడిన కథ. పి.వి. నరసింహారావు గొల్ల రామవ్వ కథ రజాకార్ల దౌర్జన్యాలను, కాంగ్రెస్ కార్యకర్త రజాకార్లకు ఎదురు తిరగడాన్ని, గొల్లల బతుకు పరిస్థితులను చిత్రించిన కథ. తెలంగాణలో మొదటి నుంచి మంచి కథలే వస్తున్నా కథల ఉధృతి గత పాతికేళ్లుగా పెరిగింది. రజాకారు వ్యతిరేక పోరాట కాలంలో తెలంగాణ రచయితలు విరివిగా కథలు రాయకున్నా

డెబ్బైలలో ప్రారంభమైన భూపోరాటాల ప్రభావంతో చాలా కథలు వచ్చాయి. అప్పటి నుంచి ఉధృతమైన కథా పరంపర విప్లవ, దళిత, బహుజన కథలుగా విస్తరించుకుంటూ పోయింది. ఈ కథల్లో సమగ్ర సామాజిక దర్శనం కనబడుతుంది. ప్రాంతీయతా ముద్ర కనబడుతుంది. ప్రజల భాష దర్శనమిస్తుంది. విస్తృతమైన ప్రజా జీవితం కనబడుతుంది. ప్రజాపోరాటాలతో పాటు పోరాటేతర జీవిత దర్శనం ఈ కథల్లో చూడవచ్చు. కథంటే ఏకాంశవ్యగ్రమైంది మాత్రమే కాదు స్వయం సమగ్రమైందని, సమగ్ర సామాజిక చిత్రణకు వాహిక అని ఈ కథలు చదివితే అర్థమవుతుంది.

అల్లం రాజయ్య అతడు, ఈ రచయిత అన్న కథలు గోదావరిఖని పారిశ్రామిక ప్రాంతంలో కార్మికోద్యమాన్ని నిర్మించిన సామాన్యులైన కార్మికులు అన్నలుగా, నాయకులుగా లక్షలాది మంది గని కార్మికుల హృదయాల్లో శాశ్వత స్థానం సంపాదించుకున్న వాళ్ల కథలు. సింగరేణి బొగ్గుగని ప్రాంతాల్లో ఉద్యమాలు వచ్చిన తర్వాత విప్లవ పార్టీలకు అనుగుణంగా కార్మికోద్యమం నిర్మించడానికి, కార్మికుల తలలో నాలుకలుగా మారి ఎన్నో కష్టనష్టాలకోర్చి, ప్రమాదాలనధిగమించి ఉద్యమ నిర్మాతలైన వారి కథలివి. ఉద్యమంలో ఉన్న ఆటుపోట్లు, ఉత్థాన పతనాలు, వైరుధ్యాలు, శతృత్వాలు, నిర్మాణక్రమం అన్నీ ఈ కథల్లో చిత్రించడం జరిగింది. అన్నలుగా ప్రజల హృదయాల్లో స్థానం సంపాదించుకున్న వాళ్లు పోలీసు కాల్పులకు గురై మరణిస్తే ప్రజలు గొడగొడా ఏడ్వడం, తమ నుండి తల్లిపేగును వేరు చేసినట్టు బాధపడటం ఈ కథల్లో చూడవచ్చు. ఇరవై, ఇరవై ఐదేండ్ల ఉద్యమ జీవితాన్ని మనమీ కథల్లో గమనించవచ్చు. నవలకున్న విస్తృతి కథకు లేకున్నా సమగ్ర సామాజిక, సాంఘిక, ఉద్యమ, ఉద్యమేతర జీవితాన్ని చిత్రించడానికి కథ ఉపయోగపడుతుందని మనమీ కథలను చదివితే అర్థమవుతుంది. తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన పగలూరేయీ శ్రమపడుతున్నా కథ రైతు జీవితంలో విషాదాన్ని తెలిపే కథ. ఆరుగలం నిరంతరంగా కృషి చేసినా రక్తాన్ని చెమటగా మార్చి నేలపాలు చేసినా రైతు డొక్కలెండుకపోయుండే క్రమాన్ని తెలిపే కథ. ఇతనిదే మరో కథ పనిపిల్ల సమగ్ర సామజిక చిత్రణకు మంచి ఉదాహరణగా పేర్కొనవచ్చు. నేలతల్లి విముక్తి కోసం కథల సంపుటిలో పాతికేళ్ల పోరాటక్రమం పూసగ్రుచ్చిట్టుగా చిత్రించబడింది.

బి.యస్. రాములు దక్షయజ్ఞం, వారసత్వం, ఈ రచయిత యుద్ధభూమి కథల్లో సామాజిక చిత్రణ ఎలా సాధ్యమవుతుందో తెలుసుకోవడానికి ఉదాహరణప్రాయమైన కథలు. తెలంగాణ భూపోరాటల్లో అసువులు కోల్పోతున్న వందలాది మంది యువకుల బలిదానాలను చిత్రించిన కథ దక్షయజ్ఞం. పోరాటాలనేవి దక్షయజ్ఞంలాంటివైతే అందులో ఆహుతైపోతున్నది. దళితులు, వెనకబడిన కులాలవాళ్లు, పేదలు, అట్టడుగు వర్గాలవారే.



పోరాటాలు జరుగుతున్నది ఆ వర్గాల కోసమే అయినా ఆ వర్గాల నుంచే చాలా మంది బలయిపోవడాన్ని హృదయవిదారకంగా చిత్రించిన కథ. తెలంగాణలో భూపోరాటాలు ప్రారంభమైన తర్వాత పాతిక ముప్పయ్యేళ్లలో జరిగిన బలిదానాలకు పోరాటాల పేరు మీద జరిగిన పరిణామాలను చిత్రించిన కథ దక్షయజ్ఞం. వారసత్వం కథలో స్వాతంత్ర్యానంతరం పద్మశాలి కులాలవారు జీవితాలను గెలుచుకున్న క్రమం చిత్రించబడింది. వృత్తులనే కాకుండా చదువులను, వ్యాపారాలను స్వంతం చేసుకొని ఇది వరకు తమపై జరుగుతున్న పీడన నుండి విముక్తమై జీవితాలను గెలుచుకున్న వైనం, పాతికేళ్ల సామాజిక పరిణామాలు ఈ కథలో చిత్రించడం జరిగింది. యుద్ధభూమి కథలో పోరాటాలు, తెలంగాణలో జరుగుతున్న ఉద్యమాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భూమి చేరాల్సిన వారి చేతుల్లోకి చేరే క్రమాన్ని చిత్రించిన కథ. భూమిపై ఎంతో ప్రేమున్న వ్యక్తి ఉద్యోగరీత్యా భూమికి దూరమైతే గ్రామాల్లో జరిగిన పరిణామాల వల్ల ఆ భూమి పాలేరుగా ఉన్న వ్యక్తి చేతిలోకి పోతుంది. భూమి కోల్పోయిన ఆ ఉద్యోగి తాను భూమికి దూరమవుతున్నందుకు దుఃఖిస్తూనే అది దున్నేవాళ్ల చేతుల్లోకి పోతున్నందుకు సంతోషిస్తాడు. భూమి సంబంధాల్లో, మానవ సంబంధాల్లో గత రెండు దశాబ్దాలుగా వచ్చిన మార్పులను చిత్రించిన కథ ఇది. ఈ రచయితదే మరో కథ శనార్థి గొర్ల కాపర్ల కుటుంబంలో పుట్టిన వ్యక్తి చదువుకొని జీవితాన్ని గెలుచుకుని సమాజంలో స్థానం సంపాదించుకొని తన మూలాలను వెతుక్కునే క్రమాన్ని చిత్రించిన కథ.

ఆడెపు లక్ష్మీపతి జీవన్మృతుడు, ఈ రచయిత పొగగొట్టం, రఘోత్తమరెడ్డి ఉరి కథలు కార్మికుల బతుకు వెతలను చిత్రించిన మంచికథలు. బతుకు దెరువు కోసమై పొట్టలు చేతుల్లో పట్టుకొని పారిశ్రామిక ప్రాంతాలకు వలసలు పోయిన వ్యవసాయ కుటుంబాల్లోని చదువుకున్నవాళ్లు, నిరక్షరాస్యులు కార్మికులుగా పెనంలోంచి పొయ్యిలోకి పడ్డ వైనాన్ని చిత్రించిన కథలివి. 1970–80 ప్రాంతాల్లో కార్మికుల పరిస్థితి బాగానే ఉండేది. వ్యవసాయం కంటే కార్మికుడిగా చేరడమే బతుకుదెరువు మార్గంగా భావించేవారు. తెలంగాణ గ్రామాల్నుండి పారిశ్రామికవాడలకు వలసలు బాగా పెరిగాయి. అప్పుడు కర్మాగారాలు, పారిశ్రామిక నగరాలు బతుకుదెరువు మార్గాలను చూపేవిగా కనబడ్డాయి. కాని క్రమక్రమంగా ప్రభుత్వ విధానాల్లో వచ్చిన మార్పుల వల్ల, ఇంకా అనేక కారణాల వల్ల ఇరవయ్యవ శతాబ్ది చివరి వరకు కార్మికవాడలు, పారిశ్రామిక నగరాలు బోసిపోవడం ప్రారంభమైంది. అనేక కర్మాగారాలు మూతపడటం మొదలైంది. కార్మికుల బతుకులు గట్టు మీది చేపల్లా మారాయి. తమకు బతుకుదెరువునిస్తాయనుకున్న కర్మాగారాలు మూతపడటంతో బతుకులు అల్లకల్లోలమై తల్లడిల్లారు. ఈ ఇరవయ్యేళ్ల కార్మికుల బతుకుల్లో వచ్చిన మార్పులను, అల్లకల్లోలాలను, వాళ్లు పడుతున్న సంఘర్షణను, కార్మిక చట్టాల్లో వచ్చిన కార్మిక వ్యతిరేక విధానాలను చిత్రించిన కథలివి. అల్లం రాజయ్య భూమి కథలు,

సృష్టికర్తలు రైతుకు వ్యవసాయ భూమిపై ఉండే మమకారాన్ని, దాని కోసం అతను పడే తపనను, సర్వసంపదలకు సృష్టికర్తలైన ప్రజల బతుకు వెతలను చిత్రించిన కథలు.. ఈ రచయిత నిరుడు కురిసిన హిమసమూహములు, అమ్మ మీది సొమ్ములు యాంత్రికత పేరు మీద గత రెండు దశాబ్దాలుగా ఊళ్లు ఊళ్లుగా లేని క్రమాన్ని, మానవ సంబంధాల్లో, విలువల్లో వచ్చిన మార్పులను చిత్రించిన కథలు.

ఇటీవలి కాలంలో కె.వి. నరేందర్, పెద్దింటి అశోక్‌కుమార్‌లాంటి రచయితలు తమ కథల ద్వారా సామాజిక జీవితాన్ని చిత్రించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇలా తెలంగాణ నుంచి వస్తున్న చాలా కథలు వివిధ వృత్తుల గురించి, ఈ వృత్తుల పతనంతో బతుకుదెరువు కోల్పోయిన జనం గురించి, ప్రత్యామ్నాం లేని బతుకుల గురించి, మృగ్యమవుతున్న మానవ సంబంధాల గురించి, మారుతున్న విలువల గురించి, సామాజిక పరిణామ క్రమంలో వస్తున్న మార్పుల గురించి చిత్రీకరించినవే. పారిశ్రామికీకరణ, యాంత్రీకరణ, ప్రపంచీకరణ పల్లెల్లో దళిత బహుజనుల బతుకుల్లో తెస్తున్న పరిణామాలను చిత్రిస్తూ కథంటే 'సమగ్ర సామాజిక చిత్రణే' అని రుజువు చేస్తున్నారు. ప్రజల భాషయైన మాండలికానికి పట్టం కడుతూ ప్రాంతీయతా ముద్రతో కథను విశ్వజనీనం చేస్తూ జీవితాల్లోంచి కథా వస్తువునేరుకుంటూ జీవన పరిమళం ఉన్న వైవిధ్యభరితమైన కథలు రాస్తున్నారు. శ్వేతరాత్రులు కథల్లో తెలంగాణ జనజీవన సంఘర్షణుంటే, నా తెలంగాణ కథల్లో దళితుల జీవితాల్లో పాతికేళ్ల పరిణామాలు, వలసపక్షి కథలో వృత్తిపనివాళ్ల జీవన పోరాటం ఉంది. తెలంగాణ నుంచి బహుజన కథలు విస్తృతంగా రావడం వల్ల సమగ్ర సామాజిక చిత్రణ సాధ్యమవుతుంది. సమగ్ర సామాజిక జీవన చిత్రణతో సహస్రవృత్తుల సమస్త జీవుల బహుజన బతుకుల కథలు మరింత విరివిగా రావడం నేటి సామాజికావసరం. ఆ అవసరాన్ని గుర్తించి తెలంగాణ కథకులు కథకు బహుజన పరిమళమద్దుతున్నారు.

కథల ద్వారా సూక్ష్మాతిసూక్ష్మమైన జీవితాలను చిత్రించడం తెలంగాణ కథల ప్రత్యేకత. ఇంత కాలంగా సాహిత్యానికెక్కని అట్టడుగు కుల, వృత్తుల జీవితాలను కథలకెక్కించి శ్రామికజన సంస్కృతిని ఉన్నతీకరించే కథలు వస్తున్నాయి. వైదిక ధర్మ భావాలను సజీవంగా ఉంచడానికి రామాయణ, మహాభారతాలు ఉపయోగపడుతున్నాయి. అందులోవన్నీ కథలూ, ఉపకథలూ, ఆఖ్యానాలే. అలాగే శ్రామిక జన సంస్కృతిని ప్రతిబింబించడానికి, పని సంస్కృతిని ఉన్నతకరీంచడానికి ఈ కథలు ఉపయోగపడాలి. కథల్లో సమగ్ర సామాజిక చరిత్ర రాయడానికి అవసరమయ్యే ముడిసరుకు లభిస్తుంది.

**విశాలాంధ్ర సాహిత్యానుబంధం, 29.6.2004**



# ఫ్యూడల్‌వ్యవస్థపై తిరుగుబాటు తెలంగాణకథలు

ఆంధ్రప్రదేశ్‌లోని మిగతా ప్రాంతాల కంటే తెలంగాణలో ఫ్యూడల్ సంస్కృతి ఎక్కువగా వుండేది. పీడిత ప్రజలు అయ్యబాంచెన్, అవ్వ బాంచెనంటూ బతకడం, నీ బాంచెన్ కాల్మొక్తా గులాపోన్ని అంటూ దొరలను సంబోధించడం మొన్న మొన్నటివరకూ కొనసాగింది. దొరతనం, దొరల జులుం గ్రామాల్లోని ప్రత్యేకత. కరణం, మునసబు విధానమే, పట్వారీ, పోలీసు పటేలు పేర్లతో ఉన్నా వీళ్లకు అపరిమితంగా అధికారాలుండేవి. దొరలు, వతన్‌దార్లయిన ఈ చిల్లర దేవుళ్లు నైజాం కాలంలో అతనికి తాబేదార్లుగా వుంటూ, అటు తర్వాత టోపీలు మార్చుకొని ఊళ్లను విశృంఖలంగా దోచారు. తెలంగాణ గ్రామాల్లో హరిజనులతో సహపంక్తి భోజనం పోరాట కాలంలోనూ లేదంటే ఫ్యూడల్ అవశేషాల మూలాలెంత పాతుకుపోతున్నాయో గమనించవచ్చు.

సామాన్య ప్రజలపై దొరల జులుం గురించి, ఇక్కడి ఫ్యూడల్ సంస్కృతి గురించి, వెట్టి చాకిరీ గురించి, దొరా, బాంచెన్ గుపాలోన్ని అంటూ బతికే బతుకుల గురించి అనేక కథలు వచ్చాయి. పీడితులపై పెత్తందార్ల దోపిడీ గురించి అన్ని ప్రాంతాల నుంచి కథలొచ్చినా ఇక్కడి నుంచి వచ్చిన కథలకు ప్రత్యేకత ఉంది. ఈ కథలు చదవితే రచయిత పేరు తెలియకున్నా కచ్చితంగా తెలంగాణ రచయిత రాసినవే అని గుర్తించవచ్చు. ఇక్కడి వాళ్లు తప్ప రాయలేనంత స్థలకాలాల చైతన్యమున్న కథలివి.

'గువురిగా ఓరి గువురిగా..' అంటూ పిలిచాడు కాదు అరిచాడు దొర. ఎముకలపై ఆరేయబడ్డ ఒళ్లును మోస్తూ కర్రల్లాంటి రెండు కాళ్లు నడిచివచ్చాయి.

'ఏంది బాంచెను..' అంది ఎముకల గూడు మీది తల.. సదానంద శారద కథ 'జాడీ'లోని ప్రారంభ వాక్యాలివి. పట్నంలో ఉన్న తన కొడుక్కు మామిడికాయ పచ్చడి ఇచ్చి రావడానికై దొర తన పాలేరు గవురయ్యను తోలుతాడు.

'ఓయ్య నాకేమన్న కొనుక్కురాయే..' అన్న కూతురుతో 'అట్లనే తెత్తబిడ్డా' అని బయలుదేరుతాడు. భుజాలు నొప్పి పెడుతుంటే, ఒళ్లు చల్లబడుతుంటే, కళ్లకు చీకట్లు కమ్ముతుంటే చలికి వణికిపోతూ ఇరవై మైళ్లు అష్టకష్టాలు పడుతూ నడిచి వెళతాడు గవురయ్య. జాడీ తీసుకున్న చిన్న దొర్సాని ఆకలవుతుందన్న గవురయ్యకు బుక్కెడు అన్నం కూడా పెట్టకుండా గభాలున తలుపేసుకుంటుంది. ఇదీ తెలంగాణ గ్రామాల్లోని పాలేర్ల దుస్థితి.

తెలంగాణ గ్రామాల్లో చాకలి, మంగలి వృత్తి చేసేవాళ్లను అన్ని పనులకూ

వాడుకుంటారు. దొరలిండ్లలో శుభకార్యాలైతే పనులన్నీ చేయడమే కాకుండా పత్రికలు ఇచ్చిన రావడానికి మైళ్ల దూరం వాళ్లు నడిచిపోవాలి. అంత దూరం నడిచిపోతే వాళ్లకింత కల్లు తాగించడమో, గొణుగుతూ అన్నం పెట్టడమో జరుగుతుంది. రూపాయో, అర్ధరూపాయో ఇవ్వడానికి కూడా గుణిపింపులే... తిట్లే.. పాలేర్ల బతుకులు దొరల చేతుల్లో పడి ఎంత పరాధీనంగా, అమ్ముడు పోయినట్లుగా మారుతాయో తెలిపే కథ సదానంద శారద గారి 'తొక్కుడు బండ'. పిల్లి అయినా గదిలో వేసి కొడితే తిరగబడుతుందన్నట్లు ఎంత తొక్కుడు బండలా ఓపికున్న మనిషైనా తిరుగబడతాడని చెప్పే కథ తొక్కుడుబండ.

దొర పాలేరు సాతాని మనెమ్మ అంబలి తాగాడని ఆగ్రహిస్తాడు దొర. 'మాదిగదాని చేతికూడు తింటావురా కుక్కల కొడకా' హంటర్‌తో కొడతాడు. కాళ్లు పట్టుకున్నా బాంచెన్ కాల్మొక్తా అని వేడుకున్నా వినడు.

'నీకు బుద్ధి లేకపోతే ఆ మండకుండద్దా..? నిన్ను ముట్టుకుంటుందా? నీకు అంబలి తాగిస్తదా?' అని విపరీతంగా కొడతూనే ఉన్నాడు దొర.

ఒక సహించలేక తిరగబడతాడు గంగయ్య.

తెలంగాణ గ్రామాల్లో క్రౌర్యానికి, దుష్టత్వానికి, దౌర్జన్యానికి మారు పేరు దొర. కరుడుగట్టిన కాఠిన్యం, సెక్సు దోపిడీ, ప్రజలపై జులుం ఇక్కడ మామూలే. పని పాటలు చేస్తూ బతికే స్త్రీలను, పాలేర్ల భార్యలను మాటలతో అవమానించడం, వాళ్ల శరీరాలతో ఆడుకోవడం జరుగుతూనే ఉంటుంది. తమ శ్రమశక్తిని దొరలకు ధారబోయడమే కాకుండా తమ చనుబాలను కూడా తమ పిల్లలకు ఇచ్చుకోలేని స్థితి. దొరసానికి పాలు పడలేదని పాలేరు అయిలయ్య భార్య పాలను తన బాబుకివ్వాలంటాడు దొర. తన బిడ్డను మాడ్చి దొర కొడుక్కు పాలివ్వడానికి ఒప్పిస్తాడు అయిలయ్య. 'పలుపు' కథలోని ఈ మాటలు దొరల దౌర్జన్యపూరిత అహంకారానికి చక్కటి ఉదాహరణలు.

'అహోం.. ఆ పోరికి పాలిచ్చి ఆ ఎంగిలి పాలు మా బాబుకిస్తావు.. వీల్లేదు.. నువ్విక్కన్నుంచి కదలద్దు.. వాడే ఏ పాలో పోసి చూసుకుంటాడు.. నువ్విక్కన్నే ఉండు.."

దొరల సెక్సు దోపిడీకి నిలువెత్తు దర్పణం లాంటి కథ ఈ రచయిత రాసిన 'దొరసాని చీర' కథ. దొరసాని కట్టుకున్న చీరలాంటిది కట్టుకోవాలన్న కోర్కె కలుగుతుంది చాకలి పుల్లమ్మకు. కొనుక్కోవడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా సాధ్యం కాదామెకు. చీర కట్టుకోవాలన్న కోర్కెను అణుచుకోలేక ఒక్కసారయినా కట్టుకుందామని కట్టుకుంటుందామె. ఆ విషయం దొరకు తెలుస్తుంది. పిలిపిస్తాడు. ఆమె ఎంత



మొత్తుకున్నా, కాళ్లావేళ్లా పడ్డా వినకుండా దౌర్జన్యం చేస్తాడు. ఈ కథలోని ఈ వాక్యాలు దొర ఫ్యూడల్ స్వభావాన్ని తెలుపుతాయి.

పుల్లమ్మ కట్టిన చీర దిక్కూ, ఆమె శరీరం దిక్కూ ఆకలిగా చూస్తున్నాడు. 'దొరసాని చీర గడ్తావే.. అయితే నువ్వు నాకేమైతవ్..' అని కపట నవ్వు నవ్వి పుల్లమ్మ జబ్బలు పట్టుకొని లోపలకు తీసుకెళ్లాడు. ఆమె ఏడ్పులు, అరుపులు, పెడబొబ్బలు ఎకరం వైశాల్యంలో కట్టబడున్న ఆ ఇంట్లో అరణ్యరోదనమే అయ్యాయి.

సంపన్న కుటుంబాల్లో జరిగే అక్రమ పనులు, అందుకు పాలేర్లలాంటి వాళ్లను బలిపశువులను చేయడం గురించి చెప్పే కథ నవీన్ రాసిన నిప్పురవ్వలు.. ఇంటి పాలేరుతో అక్రమ సంబంధం పెట్టుకున్న రెడ్డి కూతురు విషయం తండ్రికి తెలిస్తే దొర తనను చంపేస్తాడని పిచ్చిగాడు ఊరే వదిలి పారిపోవాల్సి వస్తుంది. తెలంగాణ పల్లెల్లో ఉన్న వెట్టిలాంటి బతుకులకు, దొరల అమానుష ప్రవర్తనలకు సజీవ ఉదాహరణలాంటి కత నవీన్ రాసిన 'చెర'. ఉద్యోగమిస్తానని ఆశ చూపి పేదవాడైన సాంబయ్యతో నీచమైన పనులన్నీ చేయించుకుంటాడు దొర. తన తండ్రి చనిపోయే వరకు అన్ని విధాలా చాకిరీ తుదకు దొడ్డి కూడా ఎత్తిపోయించి సాంబయ్య బతుకును చెరబడతాడు దొర. అయినా అతనికి ఉద్యోగం దొరకక పోవడం వల్ల కూలీగా చేరడమా, లారీ కింద పడి చావడమా అని ఆలోచిస్తాడు సాంబయ్య. దొరలను నమ్మి నానా యాతనలు పడ్డ యువకుడి ఆవేదనే ఈ కథాంశం.

పొద్దంతా దొరల పశువుల కాపర్లుగా బతికి, ఆ పశువుల్లో పశువులుగా బతికే పాలేర్లకు దొరల పశువుల కొట్టే అధికారం కూడా లేదు. దొర పశువును కొట్టినందుకు పశువుల కాపరి దొర తిట్లను, దెబ్బలను పడాల్సిన దుస్థితిని తెలిపే కత దాడి. ఈ కథలోని దొర మాటలు పాలేర్లపై వాళ్ల ఆధిపత్యాన్ని, దౌర్జన్యాన్ని తెలుపుతున్నాయి.

"ఆ రామదు లంజొడుకు ఇగ నా ఎడ్లను ఉంచద్రా..! కొట్టి కొట్టి చంపుతడు... మొన్ననే వెయ్యి రూపాయలు బోసి కొన్న కోడెను ఎట్ల గొట్టి చంపిండేమిరా..? చర్మం వొలిచి పారేసిండు గాడిద కొడుకు..

దీన్ని గొట్టినట్టు వాన్నోసారి కొడ్తె గని వాని కావరం అణుగుతుందిరా.. సంఘుంల దిగుతాండట గదా..!"

అన్నంత పనీ చేస్తాడు దొర.

తెలంగాణ గ్రామాల్లోని ఘోరమైన పేదరికం, బాలింతరాలయినా పనిచేయక తప్పని పరస్థితిని, ఎండ దెబ్బ తగిలినా హాస్పిటల్‌కు పోలేని కంట్రాక్టర్ దౌర్జన్యాన్ని తెలిపే కథ 'ఎండ'.

"గిట్ల ఎన్నాళ్లు పంటవే.. దునియల నువ్వే నీళ్లాడినవా? ఎంత సుఖోసి పానమైపోయెనేమె.. ఇయ్యాల్ల ఆ ముత్తి రామితో బ్రిడ్జికాడికి రా.." అంటాడు నిస్సహాయుడైన భర్త.

కోస్తాలో ఒకప్పుడు పెళ్లిళ్లలో భోగం మేళాల్లాంటివి ఉంటే తెలంగాణలో ముఖ్యంగా హైదరాబాద్ ప్రాంతంలో ముస్లిమ్ సంస్కృతికి దగ్గరుండే బారాతులుండేవి. ఫ్యూడల్ అవలక్షణమైన బారాత్‌ల గురించి చెప్పే కథ సదానంద శారద రాసిన 'ఇంటికి వెలుగు'.

ప్రజల అమాయకత్వాన్ని, వెనుకబాటు తనాన్ని, నిరక్షరాస్యతను ఆసరాగా చేసుకొని వడ్డీ వ్యాపారం చేసి లక్షలు సంపాదించిన షావుకార్లున్నారు. ఓ దిక్కు కట్టుబట్టల్తో ఊళ్లోకొచ్చిన షావుకార్లు భూములు కొంటూ, లక్షలార్జిస్తుంటే మరో దిక్కు రైతులు కూలీలుగా మారిన సంఘటనలెన్నో ఉన్నాయి. ప్రజల అజ్ఞానాన్ని ఆసరా చేసుకొని వేలిముద్రలేయించుకొని ఒకటికి ఐదారు రెట్లు బాకీ పేరు మీద వసూలు చేయడం, పంచాయతీలు, ఊరిపెద్దలు షావుకార్లకే మద్దతు పలుకడం జరుగుతూనే ఉంటాయి. షావుకార్ల నిర్దాక్షిణ్యం, ఊరి పెద్దలు ఉన్నవాళ్ల దిక్కే ఉండే పక్షపాత ధోరణిని గురించి తెలిపే అప్పు కథలు హద్దురాయి, తీర్మానం.

చర్మం వొలిచి మీకు చెప్పులు కుట్టించి ఇచ్చెనా అప్పు తీరుస్త.. అన్నడు అమాయకుడు.

సగం పొలం కట్టేంత అప్పున్నాది... గంత అప్పెక్కడిది? అన్న ప్రశ్న రాజయ్య గొంతులోనే ఉండిపోతుంది. హద్దురాయి కతలోని ఈ మాటలు పేదరైతుల నిస్సహాయ స్థితిని తెలిపే మాటలు.

తెల్లకాగితం మీద వేలి ముద్రలేయించుకోవడం, దొంగ బాకీలు సృష్టించడం, బాకీల పేరు మీద వెట్టి చేయించుకోవడం, తండ్రి చనిపోతే ఆ బాకీ వారసత్వంగా కొడుకులకు రావడం, అలాంటి బాకీలు తీర్చడానికి బానిసలుగా, వెట్టవాళ్లుగా బతకడం తెలంగాణ గ్రామాల్లో తరతరాలుగా సాగుతూనే వుంది. రైతాంగ ఉద్యమాల ప్రభావం గ్రామాల్లో పడింతర్వాత అమాయకంగా వుండే ప్రజల్లో కొంత చైతన్యం వచ్చి దొంగ అప్పులను ధిక్కరించడం, పెద్ద మనుషులను ఎదిరించడం మొదలైంది.

వాకిట్లో శవముండగానే ఆ శవాన్ని కదలనీయకుండా అన్న బాకున్నాడని, ఆ బాకీ బాధ్యత తీసుకోవాల్సిందిగా తమ్ముని వేలిముద్ర వేయించుకుంటాడు షావుకారి. ఆ బాకీ వసూలు కోసం పంచాయతీ జరగడం, చైతన్యంతో కొడుకులు తిరగబడటం కె. రామ్మోహన్‌రాజు కత 'తీర్మానం'లోని అంశం.



తెలంగాణా గ్రామాల్లో బడులే లేని ఊళ్లెన్నో ఉన్నాయి. ఉన్న బళ్లలోనైనా కనీస వసతులుండవు. ఆ బళ్లపై కూడా దొరల, చైర్మన్‌ల పెత్తనం, ఉపాధ్యాయులపై వాళ్ల అధికారం మామూలే. బడిలో కనీస సౌకర్యాలుండాలని అడిగిన విద్యార్థిని టీసీ ఇచ్చి పంపమని చెప్పిన చైర్మన్.. హెడ్ మాష్టారు నిస్సహాయత 'బడి' కథ ద్వారా తెలుపుతున్నారు బి.యస్. రాములు. బడి పంతుళ్ల నిస్సహాయత తెలంగాణా బడి స్వరూపం హెడ్ మాస్టారు మాటల వల్ల తెలుస్తాయి.

"నేను దేశ సేవ కోసమో, మరి దేని కోసమో ఈ వుద్యోగం చేస్తలేను.. నా తల్లిదండ్రులను భార్యాపిల్లలను సాకాలె నేను.. ఇంట్లో పెండ్లిగాని చెల్లెలున్నది... మా అమ్మ మంచాల పడున్నది... మా నాన్నకు కాలు పడిపోయింది.. వానికి టీసీ ఇవ్వకపోతే చైర్మన్‌గారు నాకు టీసీ ఇస్తానన్నారు.. నా గోడు ఎవ్వలకు జెప్పుకోవాలె.."

దొరలు తమనెంత పీడిస్తున్నా ఎన్ని అధికారాలు చలాయిస్తున్నా అది వాళ్ల హక్కయినట్టు, పడటం తమ బాధ్యతయినట్టు భావించే అమాయకులూ గ్రామాల్లో ఉన్నారు. దొరనే నమ్మి, దొర సేవలోనే సర్వస్వం గడిపి దొర తన పిల్లలను చదివియ్యమంటేనే చదివించిన వాళ్లూ లేదా పాలేరుంచిన వాళ్లూ ఉన్నారు. ప్రజలు విద్యావంతులై చైతన్యవంతులైతే తమ ఆటలు సాగవని కొడుకులను చదివిస్తామన్న తండ్రులతో వద్దని సలహా ఇచ్చిన దొరల స్వభావం బోయ జంగయ్య ఎచ్చరిక, కాలువ మల్లయ్య కిటుకు కథల ద్వారా తెలుస్తుంది.

తప కొడుకును పంపిద్దామన్న వ్యక్తితో పటేలు "ఎందుకురా..సదివి ఏమెలగ బెడతాడు? అరే.. ఈ భూమి, ఈ యవసాయం ఎవరికిర..? చేసుకుని మంచిగ బతక్క.." అంటాడు దళితుడు బుచ్చయ్యతో దొర.

"వారి బుచ్చిగా! నీకెవ్వలు గీ మాటలు సెప్పింది.. చదువుకొని రాజ్జాలేలుతాడ్ర నీ కొడుకు..."

అయితే ఎచ్చరికలో కతలో తండ్రి దొర మాటలు విని బడికి పంపించక తర్వాత పశ్చాత్తాప పడితే, కిటుకు కథలో బుచ్చయ్య భార్య ప్రోత్సాహంతో కొడుకును చదివించి గర్వపడతాడు.

తెలంగాణా గ్రామాలున్నంచి భీవండి, షోలాపూర్, బొంబాయి లాంటి ప్రదేశాలకు బతుకుదెరువు వెతుక్కుంటూ వలసపోయే పద్మశాలీ కుటుంబాల గురించి తెలిపే కథలు జూకంటి జగన్నాథం రాసిన వలస, కాలువ మల్లయ్య రాసిన వారసత్వం.

ఉన్న ఊరును, కనిపెంచిన తల్లిదండ్రులను, అయినవాళ్లందరినీ వదిలి పొట్ట చేతబట్టుకొని భీవండికి పోతున్న కొడుకుతో తండ్రి అన్న ఈ మాటలు పాఠకుల హృదయాల్ని కదిలిస్తాయి.

"నిన్ను కన్నందుకేం పంచియ్యలేదు గని బిడ్డ నా తీరుగ ఊరిడిసి పోవుడయితె నీకు తప్ప లేదు"

గ్రామాధికార్ల వ్యవస్థలో క్రూరమైన చాకిరీకి, అణచివేతకు గురయ్యే వ్యక్తి సుంకరి. ఎక్కడా లేనంత బాంచె పని, వెట్టిని మించిన చాకిరీ తెలంగాణ సుంకర్లు చేయాల్సి ఉంటుంది. సర్పంచ్, పట్వారీ, పోలీసు పటేలు, మాలి పటేలు మొదలుకొని ఊరి దొరలు, పంచాయతీ పెద్దలంతా సుంకర్లపై అధికారం చలాయించేవాళ్లే. ఊరికి ఏ అధికారి వచ్చినా ఆసులో గొట్టంలా తిరగాల్సిందే. రెవెన్యూ వసూళ్ల సమయంలోనయితే సుంకర్లకసలే తీరికుండదు. తహసీలు కట్టాల్సిన రైతు దొరకకున్నా, రెవెన్యూ కట్టకున్నా సుంకరికి తిట్లు తప్పవు. అటు పన్నులు కట్టే తన వర్గం వాళ్ల మీద సానుభూతి, ఇటు అధికార్ల ఒత్తిడి.. మానసిక ఘర్షణ తప్పదు. తెలంగాణ సుంకర్ల వెట్టి చాకిరీని గురించి తెలిపే కథ వుప్పల నరసింహం రాసిన తిరుగబడ్డ భూమి. ఈ కథలో సుంకరి ముత్యాలు స్వగతంలో అనుకున్న ఈ మాటలు సుంకర్ల దయనీయమైన బతుకులను, పెద్దల జబర్దస్తీని, వెట్టిని మించిన చాకిరీని తెలుపుతున్నాయి.

"ఊల్లెకు గిర్దావర్ వొస్తే వారి సుట్టు దిర్గాలే. అమీన్‌సాబొస్తే ఆనెనుక దిర్గాలే. తహసిల్దారొస్తే సంకల కట్టె యిరికిచ్చుకుని సాకలిండ్లు, సాలిండ్లు, ఎర్కలిండ్లు ఎనాదులిండ్లు తర్వాయిగ దిర్గాలే. ఈల్లుగాక యెల్లిగాడు, మల్లిగాడు యెవ్వలచ్చినా ముందుగాల నా పంగ పలుగతది. నీళ్లు దెచ్చుడు కాన్నుంచి కట్టెలు కొట్టేదాక యిరాం లేకుంట, రెక్కకు శైన్ లేకుంట గాడ్డి లెక్క ఒకటే పనాయె.. నీ యవ్వ పనికినా వారెత్తు.. ఒగడు గాకుంటె ఒగడు పని జెప్పుడేనాయె.. నీయవ్వ బతుకున్న వారేత్తు.."

జమీందార్లు, పటేండ్లు సంచార తెగలపై చేసే దోపిడీని తెలిపే కథ వుప్పల నరసింహం "సాపలు". చాపలు అమ్ముకునే ముత్తమ్మ దగ్గర అంజిరెడ్డి నామమాత్రపు ధరకు చాపలు తీసుకుంటే ఆమె పడిన ఆవేదనను తెలిపే కథ. తెలంగాణ గ్రామాల్లోని పాశవిక ఫ్యూడల్ భావాలను దౌర్జన్యపూరిత దొరల దోపిడీకి అద్దం పట్టే కథ ఇత్తనపు కోడె. తన ఇత్తనపు కోడె పారడం వల్ల పుట్టిందన్న సాకుతో లేగదూడను ఆవు నుంచి వేరు చేసి తీసుకుపోతనంటాడు దొర మనిషి పాషా. ఆవుదూడ స్వంతదారుడైన పోశయ్య పాషా కాళ్ల మీద పడి రోదిస్తాడు.

"పాషాభాయి నీ కాల్మొక్త.. గులాపోన్ని అయిత. గా పని మాత్రం చేయకు.. ఈపుల గొట్టు గాని కడుపు మీద కొట్టకు.. పొట్టకు ఎల్లక, సంసారం గడవక, ఊపాసం ఉండి, ఉప్పిడుండి ఆ ఆవును నడుపుకున్నం. దాన్ని పువ్వును కాపాడుకున్నట్టు కాపాడుకున్నం.. ఇప్పుడు నువ్వు తీసుకుపోతాంటె ఎట్ల..? జెర నువ్వే జెప్పు? జెర మా మీద కన్నెయ్యకుండ్రి మీ కాల్మొక్త.."



దొర మనుషులంటేనే ఇంత భయమైతే ఇక దొరలంటే ఇంకెంత భయముంటుందో ఊహించుకోవాల్సిందే.. అల్లం రాజయ్య కథల్లోని బొత్త కొంరడు, గట్టుమల్లు, కర్రె లింగడు, సుంకరి నర్మిమ్మడు, బర్ల ఓదేలు, నారన్న లాంటోల్లంత ఫ్యూడల్ దొరల దోపిడీ పీడనలను అనుభవించిన వాళ్లే. అయితే అమాయకుల్లా కనిపించే ఆ ప్రజలే తిరుగుబడితే పెద్ద పులోల్లా కనబడే దొరలెలా కాగిదం పులుల్లా తేలిపోతారో, వాళ్ల శక్తేంటో తన కథల ద్వారా తెలియజేశారు.

భారతదేశానికే భూపోరాట వారసత్వాన్ని అందించిన తెలంగాణా భూపోరాటాలు ముగిసింతర్వాత తెలంగాణ గ్రామాలు మళ్లీ దొరల చేతుల్లోకి పోయాయి. ఇదువరకటి కంటెక్కువగా ఫ్యూడల్ భావాలు వ్యాపించాయి. అయ్యా బాంచెన్ సంస్కృతి మూడు పూవులు ఆరు కాయలైంది. కొన్ని వైయక్తిక తిరుగుబాట్లు జరిగినా 70లలో భూపోరాటాలు ప్రారంభమయ్యేంత వరకు ఆ ఫ్యూడల్ సంస్కృతి, దొరల దౌర్జన్యాలు నిరంతరం సాగుతూనే ఉన్నాయి. ఈ కథలు రాయబడిన కాలం ఆ తర్వాతి కాలమైనా స్వాతంత్ర్యానంతరం నుంచి 70,80ల వరకు తెలంగాణా గ్రామాల్లోని ఫ్యూడల్ దొరల దౌర్జన్యాలకు అద్దం పట్టే కథలివి. అప్పుడప్పుడే వాళ్లపై తిరుగుబాటు ప్రారంభం కావడం మనమీ కథల్లో గమినించవచ్చు.

**విశాలాంధ్ర సాహిత్యానుబంధం, 10.5.2004**

# తెలంగాణ భాషను చిన్నచూపు చూస్తున్నారా?

మొదట్నుంచీ తెలంగాణ నుంచి అద్భుతమైన సాహిత్యమే వస్తుంది. మొదటితరంలో రాశిలో కొంత తక్కువ వచ్చినట్టనిపించినా వాసిలో మాత్రం మంచి సాహత్యమే వచ్చింది. తెలంగాణ కథకు కోస్తా ప్రాంత కథకున్నంత ఆంగ్ల సాహిత్య ప్రభావం లేకున్నా మొదట్నుంచీ ప్రయోజనకర సాహిత్యం రావడం గమనించవచ్చు. కోస్తా కథ ఆధునిక కథకు సహజమైన మధ్యతరగతి వస్తువును ముడిసరుకుగా తీసుకుంటే తెలంగాణ కథ మొదటితరం నుంచే మరింత ముందుకు పోయి అట్టడుగు జీవితాలను స్వంతం చేసుకుంది. అందుకు తగ్గట్టే భాషనూ స్వంతం చేసుకుంది. మొదటితరం కథల్లో కొందరు గ్రాంధిక భాషను ఉపయోగించినా సురవరం ప్రతాపరెడ్డి, సురమౌళి, గూడూరి సీతారాం, పి.వి. నరసింహారావు లాటి వాళ్లు మాండలికాన్ని వాడి కథను మరింత ప్రజాస్వామ్యీకరించారు. స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన కథల్లో తెలంగాణ మాండలిక భాషా వాడకం సమస్యగా ఉన్నట్టు కనబడదు.

కాని చాలా కాలం నుంచి తెలంగాణ భాషను చిన్న చూపు చూస్తున్నారన్న వాదం వినబడుతుంది. తెలంగాణ మాండలికంలో రాస్తే ప్రచురించడం లేదనీ అనేవాళ్లున్నారు. తెలంగాణ యాసను ప్రసార సాధనాలు అవహేళనకు ఉపయోగించుకోవడం గమనిస్తూనే ఉన్నాం. విలన్లకు, రౌడీలకు, హాస్యకారులకు ఈ భాషను ఉపయోగించి ప్రసార సాధానలు తమ పక్షపాతాన్ని నిరూపించుకున్నాయి. అయితే కథల్లో రచనల్లో తెలంగాణ మాండలికం వాడకంపై అభ్యంతరం చెప్పిన సంఘటనలూ ఉన్నాయనడంలో సందేహం లేదు. గూడూరి సీతారాం, సురమౌళి లాంటివాళ్లు పూర్తి మాండలికంలో కథలు రాయడం మొదటితరంలోనే చేసినా స్వాతంత్ర్యానంతరం లేదా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత మాండలిక రచనలకు కొంత గ్యాప్ ఏర్పడింది. రెండవతరం రచయితలు కలం పట్టేనాటికి పత్రికల సంఖ్య పెరిగింది. కోస్తా భాష ప్రభావమూ పెరిగింది. వ్యావహారిక భాష పేరు మీద మధ్య మండల మాండలికం పత్రికా భాషగా చలామణి కావడం మొదలైంది. డిటెక్టివ్ నవలలు, ఆరడుగుల హీరోలు, పడవల్లాంటి కార్ల జీవితాల, నవలలు ఉపయోగించే భాష వ్యవహారికమే. పత్రికలన్నీ దాదాపు కోస్తా ప్రాంతం వాళ్లవే. ఆ పత్రికల్లో తమ పేర్లను చూసుకోవడమే భాగ్యంగా తెలంగాణ రచయితలు రచనలు చేశారు. ఆ నవలల్లా రాయాలన్న తపనతో మాండలికంలో రాస్తే ప్రచురిస్తారో లేదోనన్న భయంతో కొంత మాండలికాన్ని కొంత వరకు విస్మరించారనే చెప్పవచ్చు. మొదటితరం రచయితే అయిన దాశరథి రంగాచార్య కథలు రాయకుండా నవలలే రాశారు. తన నవలల్లో పాత్రోచిత మాండలికాన్ని వాడినా తర్వాతి తరం రచయితలైన నవీన్, మలయశ్రీ, తాడిగిర పోతరాజులాంటివాళ్లు మాండలికాన్ని ఉపయోగించలేదు. ఈ కాలంలో పూర్తి మాండలికంలో వచ్చిన రచనలు దొరుకకపోవచ్చు. ఈ కారణాల వల్లనే సాహిత్యంలో తెలంగాణ మాండలికానికి గ్యాప్ ఏర్పడినట్టనిపిస్తుంది.

అయితే 1973లో కరీంనగర్ నుండి వెలువడిన బద్‌లా కథాసంకలనంలోని భాష మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. ఆ సంకలనంలోని రచయితల్లో చాలామంది ఆ తర్వాతి కాలంలో రచనలను కొనసాగించలేకపోయారు. ఆ తర్వాత తెలంగాణ నుంచి వచ్చిన రచయితలు నిర్భయంగా నిర్మొహమాటంగా పాత్రోచిత, పూర్తి మాండలికంలో రచనలు చేశారు. అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, ఉప్పల నరసింహం లాంటి వాళ్లు మాండలికంలో విరివిగా రచనలు చేయడం మొదలైన తర్వాత మాండలికాలపై చర్చ మొదలైంది. పాత్రోచిత మాండలికం చాలని, పూర్తి మాండలికం వద్దని, మాండలికం ఇతర ప్రాంతాలవారికి అర్థం కాదన్న వాదాలు లేవదీశారు. చర్చోపచర్చలు జరిగాయి. అప్పటికే మాగోఖలే, కరుణకుమార, రావిశాస్త్రి లాంటివాళ్లు మాండలికంలో చేసిన రచనలను తెలుగు ప్రజలందరూ చదివారు. విజయనగర మాండలికంలో ఉన్న కన్యాశుల్కం గొప్పరచనగా పేరు ప్రఖ్యాతులు పొందింది. ఈ రచనలన్నిటికీ లేని అభ్యంతరం వీటికెందుకన్న వాదాలు వచ్చాయి. మాండలికాల్లోని లయ, ప్రజల భాష, నాద సౌందర్యం అందర్నీ ఆకర్షించాయి. అన్ని ప్రాంతాల మాండలికాలకూ సాహిత్యంలో చోటు దొరికింది.

తెలంగాణ మాండలికంపై కొంత వివక్ష చూపిన మాట నిజమే కాని నేను రాసిన కథలన్నింటినీ మాండలికం అన్న నెపంతో ప్రచురించడానికి నిరాకరించిన పత్రికలు దాదాపు లేవు. మాండలికం నాకు మాత్రం సమస్య కాలేదు. భూమి పుత్రుడు అనే నవలను మాత్రం చలసాని ప్రసాదరావు రెండు సార్లు తిరగ రాయించాడు. ఎనబై తొంబైలలో పాత్రోచిత మాండలికంతో పాటు పూర్తి మాండలికంలో రాసిన అనేక రచనలు ప్రచురింపబడ్డాయి. అలా ప్రచురింపబడ్డ రచనలే కొలిమంటుకుంది ఇతర కథలు, అవ్వతోడు గిది తెలంగాణ ఇతర కథలు, బండ కింది బతుకులు, ముద్ర ఇతర కథలు. అన్ని పత్రికలవాళ్లు మాండలిక రచనలను ప్రచురించని మాట వాస్తవమే అయినా చాలా పత్రికలు ప్రచురించాయి. అయినా తెలంగాణ మాండలిక రచనల ప్రచురణ ఆ తర్వాత కష్టమైందన్న వాదనలున్నాయి. కొంత మంది రచయితలు కథలు రాసి తీసుకపోతే ఇదేం భాష అని ఎద్దేవా చేశారన్న వాదాలు ఉన్నాయి. అయినా విప్లవ దశాబ్దకాలం నుంచి తెలంగాణ మాండలిక రచనల ప్రచురణ విరివిగా సాగుతుంది.

అయినప్పటికీ తెలంగాణ భాషపై, యాసపై, రచనలపై వివక్ష

కొనసాగుతుందన్న విషయంలో వాస్తవం ఉంది. అందులో భాగమే ప్రసారసాధనాల్లో తెలంగాణ భాషను కించపరచడం, సంకలనాల్లో తెలంగాణ కథలకు నామమాత్రంగానే చోటివ్వడం.. కొన్నిసార్లు చోటే ఇవ్వకపోవడం.. తెలంగాణ నుంచి అద్భుతమైన సాహిత్యం, ప్రజల జీవద్భాషలో వచ్చే రచనలు వస్తున్నా ఏదో మేరకు వివక్ష కొనసాగడం జరుగుతున్నది నిజం. అందుకే తెలంగాణలో ఇటీవలి కాలంలో సాహిత్యోద్యమం ఉధృతంగా వచ్చింది. ఇదివరకే లబ్ధప్రతిష్టులైన రచయితలతో పాటు యువతరం నుంచి అనేక మంది సమధికోత్సాహంతో రచనలు చేస్తున్నారు. తమకున్న గ్రామీణ మాండలిక జీవన నేపథ్యంతో జీవద్భాషలో రాస్తున్నారు. తెలంగాణ కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నారు. అయితే ఇప్పటికీ దినపత్రికల్లో, వారపత్రికల్లో తెలంగాణ మాండలిక నవల సీరియల్‌గా రావడం సమస్యగానే ఉంది. కథలు, కథనాలు, శీర్షికలు ప్రచురిస్తున్న పత్రికాధిపతులు మాండలిక నవలలను సీరియల్‌గా ప్రచురించడానికి జంకుతున్నారు. తెలంగాణ మాండలిక నవలలు దినపత్రిక డైలీ సీరియల్లుగా, వారపత్రికల్లో సీరియల్లుగా విరివిగా వచ్చనప్పుడే తెలంగాణ మాండలిక భాషను గౌరవించినట్టవుతుంది. అప్పుడే తెలంగాణ భాషను చిన్నచూపు చూడనట్టవుతుంది. ఏ ప్రాంత మాండలికమైనా విరివిగా వచ్చి అన్ని ప్రాంతాలవాళ్లు చదివితే ఆయా ప్రాంతాల ప్రజల మధ్య సహోదరత్వం వెల్లివిరిసే అవకాశం ఉంది. మాండలికాన్ని పాత్రల వరకే పరిమితం చేయాలని, పూర్తి మాండలికంలో రాయొద్దని ఆంక్షలు విధించడం అప్రజాస్వామికమే అవుతుంది. తన రచనకు ఏ భాషను ఉపయోగించుకోవాలో నిర్ణయించుకునేది రచయితే..

ప్రజాతంత్ర, **20.6.2004**



# తెలుగులో రాసినవన్నీ తెలుగుకథలేనా?

ఫలానా రచయిత తెలుగుకథలు బాగా రాస్తున్నాడు. ఫలానా రచయిత తెలుగు కథలు రాయడంలో దిట్ట. తెలుగులో కథాసాహిత్యం బాగానే వస్తుంది. ఇలాంటి మాటలు మనం తరచూ వింటుంటాం. చదువుతాం... ప్రాంతీయ మూమెంట్ వచ్చింతర్వాత నేనూ తెలంగాణా కథలు బాగా రాస్తున్నవాన్నే. నేను తెలంగాణా రచయితనే. నేనూ రాయలసీమ జీవితాన్ని రాస్తున్నాను. ఫలానా రచయితలు కళింగ ప్రాంతం నుంచి బాగా రాస్తున్నారు. తెలుగుకథ వెనుకబడిన ప్రాంతాల నుంచే బాగా వస్తుంది. ఇలాంటి మాటలు రాతల్లో, ఉపన్యాసాల్లోను చూస్తున్నాం.... ఇంతకీ తెలుగుకథంటే? ఏది తెలుగుకథ?

తెలుగులిపిలో రాసినవన్నీ తెలుగు కథలేనా? లేదా తెలుగువాడు రాసినవన్నీ తెలుగుకథలేనా? తెలుగు మాట్లాడే రాష్ట్రంలో ఉండి రాయబడేవన్నీ తెలుగు కథలేనా? ఇవన్నీ తెలుగుకథలు కావాల్సిన అక్కర్లేదు. కావుకూడా. తెలుగు లిపిలో వచ్చినంత మాత్రాన అది తెలుగు కథ కాదు. అలాగే తెలంగాణా ప్రాంతం వ్యక్తి రాసినంత మాత్రాన తెలంగాణా కథా కాదు. నేనూ తెలుగుకథలు రాస్తున్నానని తెలుగు జీవితానికి, సంస్కృతికి ఏ మాత్రం సంబంధం లేని కథలు రాసినంత మాత్రాన అవి తెలుగు కథలు కావు. నేడు ప్రసార సాధనాల్లో వస్తున్న కృత్రిమ భాషలా అది ఏ సంస్కృతిని ఉన్నతీకరించడానికి రాయబడుతున్నాయో కూడా తెలియకుండా వచ్చే కథలు తెలుగు కథలవుతాయా? ఏ ప్రాంతం నుంచి వచ్చే కథయినా ఆయా ప్రాంత జీవితాన్ని చిత్రించకుంటే అది తెలుగు కథెలా అవుతుంది?

తెలుగు కథ పేరు మీద తెలుగు అక్షరాల్లో తెలుగు కథలు కానివే విరివిగా వస్తున్నాయి. తెలుగు జీవన సంస్కృతిని ప్రతిబింబించకుండా, తెలుగు నుడికారం ఉపయోగించుకుండా ఆయా ప్రాంత పాత్రోచిత మాండలిక భాషనైనా వాడకుండా వచ్చే కథలు తెలుగుకథలెలా అవుతాయో అర్థంకాని విషయం. ఇలాంటి కొన్ని కథల్లో శిల్పం బాగానే ఉండొచ్చు. ఆ కథలకు అవార్డులొచ్చినా రావచ్చు. అది కథగా గొప్ప కథే కావచ్చు. కథానికా లక్షణాలన్నింటినీ కలిగి ఉండొచ్చు. అంత మాత్రాన అది తెలుగు కథ కాదు. అయితే గియితే కథవుతుంది. అంటే కథలన్నీ తెలుగుకథలు కావు. ఆర్.కె. నారాయణన్ ఇంగ్లీషులో రాసినా భారతీయ జీవన వాస్తవికతను చిత్రించాడు కాబట్టి అవి భారతీయ కథలే అవుతాయి. టాల్‌స్టాయ్ కతలు రష్యా

జీవన చిత్రాలు కాబట్టి అవి రష్యన్ కథలే అవుతాయి. ప్రేమ్‌చంద్ హిందీ ప్రాంత జీవన సంస్కృతిని బంకిం, టాగోర్, శరత్ బెంగాలీ జనజీవన దృశ్యాలను చిత్రించారు కాబట్టి అవి ఆయా భాషల కథలవుతూనే భారతీయ కథలవుతాయి.

విదేశీ అనుకరణగానో, కృత్రిమ భాషలోనో, ఇంగ్లీషు, ఇతర భాషా కథలకు అనుకరణలుగానో వచ్చే తెలుగు లిపిలో ఉన్న కథలను తెలుగు కథలుగా పరిగణించాల్సిన అవసరం లేదు. ఇవి ఎలా ఉంటాయంటే స్టార్ హోటల్లో కూచొని కరీంనగర్ ఎన్‌కౌంటర్ల గురించి రాసినట్టుంటాయి. ఒక్కో పెగ్గు తాగుతూ పేదరికం గూర్చి ఒక్కో వాక్యం రాసినట్టుంటుంది. మసిఅంటే ఏంటో తెలియనివాల్లు మసిబొంత పేగుల గురించి కథలు రాసినట్టుంటుంది. ఇంట్లో ఆడవాళ్లను హీనంగా చూస్తూ స్త్రీ హక్కుల గూర్చి గ్రంథాలు రాసినట్టుంటుంది. ఈ రచనల్లో ఆర్ద్రత ఉండదు. ఆర్తీ ఉండదు. నిజాయితీ ఉండదు. మన ఆలోచనలన్నీ విదేశీ సంస్కృతి మీద, మోజులన్నీ విదేశీ బతుకుల మీద రాస్తున్నదేమో తెలుగుజీవితం గూర్చి అంటే ఆ రచనలో ఆర్ద్రత ఎలా ఉంటుంది? అంతరాంతరాల్లో పరాయి బతుకును కోరుకుంటూ, పరాయీకరణ చెందుతూ రాస్తున్నది మాత్రం తెలుగులోనే అంటే అర్థమేముంటుంది? ఇలాంటివి తెలుగులో వచ్చిన కథలవుతాయి తప్ప తెలుగు కథలు కావు.

సమాజంలో సంక్లిష్టతుంది కాబట్టి మా కథలు కూడా సంక్లిష్టంగానే ఉంటాయి అనేవాళ్లూ ఉన్నారు. సంక్లిష్టత పేరు మీద జీవితానికి, సంస్కృతికి, పాఠకులకు దూరమైన రచనలు చేసేవీళ్లు రచయితలయితే కావచ్చు కాని తెలుగు రచయితలు మాత్రం కారు. గ్లోబలైజేషన్ గూర్చి రాసినా, దళిత వాద కథ రాసినా, స్త్రీవాదం గూర్చి రాసినా, బహుజన జీవితాల గూర్చి రాసినా తెలుగు జీవితానికి తెలుగు నేలలోని ఆయా ప్రాంతాలకు ప్రత్యేకమైన పరిస్థితులున్నాయి. గ్లోబలైజేషన్ తెలంగాణా ప్రాంతానికి, కోస్తా ప్రాంతానికి ఒకే విధంగా లేదు. ప్రపంచీకరణ ఆయా ప్రాంతాలను ముంచివేసిన క్రమంలో తేడాలున్నాయి. వాటి విషఫలితాలు ఆయా ప్రాంతాలపై భిన్న రీతుల్లో ఉన్నాయి. అలాగే మొత్తం తెలుగు సమాజంపై ప్రత్యేక రీతిలో ఉంది. ఈ భేదాలను గుర్తెరిగి రాసినప్పుడే ఏ విషయం గూర్చి రాసినా అది తెలుగుకథ అవుతుంది. ఇంగ్లీషు కాపీ ప్రపంచీకరణ, ఇతర భాషల మోడల్ దళితీకరణ తెలుగు సంస్కృతికి సంబంధించినవి కావు.

తెలంగాణాలో సాహిత్య సాంస్కృతిక రంగాల్లో కదలిక వచ్చింతర్వాత మేమంతా తెలంగాణా గురించి రాసినవాళ్లమేనంటున్నారు. మేం రాసినవే తెలంగాణా



కథలేనంటున్నారు. తెలంగాణా మాండలిక భాషలో రాయడం తక్కువ స్థాయిగా భావించిన వాళ్లు, తెలంగాణా జీవితాన్ని గూర్చి రాయడాన్నే ఎద్దేవా చేసినవాళ్లు మేమూ తెలంగాణా కథకులమంటున్నారు. వీళ్లంతా అంతకు ముందేం రాశారో, తాము రాస్తున్నది తెలుగుకథలేనేమో ఒక్కసారి పునరాలోచించుకుంటే మంచిది. ఏ ప్రాంతం వాళ్లయినా తమ తమ ప్రాంత జీవితాలపై కథలు రాస్తూ తద్వారా తెలుగు కథలు రాస్తే మంచిది. మొదటితరంలో కోస్తా ప్రాంతం నుంచి అద్భుతమైన తెలుగు కథా సాహిత్యం వచ్చిన మాట నిజమే. ఆ తర్వాత తెలంగాణా, రాయలసీమ నుంచే చాలా మంది తెలుగు కథలనబడేవి రాస్తున్నారన్నది వాస్తవం. అందుక్కారణం కోస్తాలోలా ఊహాజగత్తులో విహరింపజేసే నవలలు, భూతప్రేత వ్యాపారనవలలు, ఈ ప్రాంతాల నుంచి రాకపోవడమే. వ్యాపార కథలేవీ తెలుగు కథలనడానికి వీల్లేదు. సమస్యలున్న చోటినుంచే గొప్ప సాహిత్యం వస్తుందని తప్పించుకుంటే చెప్పడానికేముండదు. రచయిత తనను తాను పరాయీకరించుకోకుంటే, ప్రవాహంలో కొట్టుకుపోకుండా నిలబడితే ఏ ప్రాంతంలో ఉన్నా మంచి సాహిత్యం సృష్టించొచ్చు. కోస్తా ప్రాంతంలో దళితులను పీడించే కులాల్లోంచి వచ్చిన రచయితలు తమవాళ్లకు వ్యతిరేకంగా దళితుల పక్షాన నిలబడి మాట్లాడగలరా? గ్లోబలైజేషన్‌ను సమర్థిస్తూ గుంపులో గోవిందా అన్నట్టు గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా కథ రాస్తే అది కథాలక్షణాలున్న కథ కావచ్చు కాని తెలుగు కథ కాదు. మన ప్రాంతాన్ని, జాతిని, సంస్కృతిని, మనిషిని ప్రేమించుకుండా తెలుగుకథ రాయడం సాధ్యం కాదు. ఆయా ప్రాంత ప్రజల భాషను, జన జీవనాన్ని అక్కున చేర్చుకోకుండా తెలుగు కథ రాయడం అసాధ్యం. ఇరవై నాలుగు గంటల ప్రసారసాధనాల హోరు. మనది కాని సంస్కృతిని, భావజాలాన్ని మనపై రుద్దడం. కొన్ని జాతులు ఆధిపత్య జాతుల, భాషల ప్రభావంతో ఘటుమాయమైపోయే ప్రమాదమున్న సమయంలో ఆయా ప్రాంత కథలు విరివిగా వచ్చి బలమైన సాంస్కృతిక పునాదిని ఏర్పరచవలసిన అవసరముంది. మానవ జీవితానికి చేరువైనదైన కథ సమకాలీన సామాజిక చిత్రణలో అసలైన తెలుగు కథగా రావాల్సిన అసరముంది.

మన సంస్కృతిని, జాతిని, మనల్ని మనం సమున్నతంగా నిలబెట్టేదే, నశిస్తున్న వృత్తులకు ప్రత్యామ్నాయం చూపేదే, మానవాంశను పెంపొందించేదే తెలుగుకథ మనకిప్పుడు కావాల్సింది తెలుగుకథ. తెలుగుకథంటే తెలుగు ప్రజల జీవన సంస్కృతిని చిత్రించేదే.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 25 ఆగస్టు 2003**

# 'బద్‌లా' కోరిన కరీంనగర్ కథ

తెలుగులో ప్రసిద్ధ కథ 'యజ్ఞం' 1964లో వెలువడింది. ఆ కథలోని ముగింపు మాటెలా వున్నా ఆ కథపై జరిగినంత చర్చ తెలుగు కథల్లో దేనిపై జరుగలేదు. యజ్ఞం కోస్తా ప్రాంతంలో నివురుగప్పిన నిప్పులా ఉన్న పరిస్థితిని చూచాయగా తెలియజేసిన ముందుచూపున్న కథ.... పేలడానికి సిద్ధంగా ఉన్న అగ్నిపర్వతం లాంటి పరిస్థితిని కొన్నేళ్ల ముందే తెలిపింది. రచయిత భవిష్యద్దర్శనం సరైందేనని సూచిస్తూ 1967లో శ్రీకాకుళంలో లావా విరజిమ్మింది. కారా, రావిశాస్త్రి కథలు ప్రజాపోరాటాల ప్రతిస్పందనలకు నాందులని చెప్పవచ్చు. అయితే శ్రీకాకుళంలో ఉవ్వెత్తున లేచిన పోరాటాలు అనతికాలంలోనే అణచివేయబడి తెలంగాణాలో వేళ్లూనుకున్నాయి.

శ్రీకాకుళ పోరాటాల ప్రతిస్పందనతో పోరాట ప్రాంతం నుంచి మంచి కథలే వచ్చాయి. 1971లో విశాఖపట్నం న్యూవేవ్ సంస్థ 'హోరు' అనే కథా సంకలనం ప్రచురించింది. ఇందులో ఉన్న పన్నెండు కథలూ ఈ వ్యవస్థపై ఆగ్రహాన్ని వెళ్లగక్కేవే. ఈ వ్యవస్థలో మార్పు రావాలని కోరేవే. ఉన్న వ్యవస్థ పట్ల అసంతృప్తిని ప్రకటించేవే. అదే సంవత్సరం విశాఖపట్నం నుంచే విప్లవ రచయితల సంఘం వారు 'ఇప్పుడు వీస్తున్న గాలి' అనే కథా సంకలనాన్ని ప్రచురించారు. ఇందులోని కథలూ సమాజం సమూలంగా మారాల్సిన అవసరాన్ని తెలిపేవే. ఈ సంకలనం గూర్చి కొకు అన్న మాటలు గమనించదగ్గవి. 'ఈ సంకలనం తెలుగు సాహిత్యంలో వస్తున్న సరికొత్త కెరటం. ఈ కెరటం ఇంకా విస్తరిస్తుంది. ఇంకా పైకి లేస్తుంది..."

ఈ రెండు సంకలనాల్లోనూ ఎన్నెస్ ప్రకాశరావు, మరువాడ రాజేశ్వరరావు, డి. వెంకట్రామయ్య, సి.ఎస్. రావు, నగ్నముని, నిఖిల్, తేజోనిధి, బి.టి. రామానుజంలతో పాటు మరికొంత మంది రచయితలు కథలు రాశారు. ఈ రెండు సంకలనాలూ విరసం ఆరంభకాలంలో వచ్చిన కథలు. శ్రీకాకుళ పోరాటాలను, విరసం భావజాలాన్ని ముందుకు తీసుకుపోయిన మొదటితరం కథలివి. ఇవి కోస్తా ప్రాంతాల్లో నిక్షిప్తమై ఉన్న శ్రీకాకుళంలో ఎగిసిన తిరుగుబాటు తత్వాన్ని తెలిపే కథలు.

కొకు చెప్పినట్లు తిరుగుబాటు కథల ఈ సరికొత్త కెరటం ఇంకా విస్తరించి చాలా ఎత్తులకెదిగి పోరాట కథారూపం తీసుకుంది. అది పోరాట ప్రాంతమైన తెలంగాణాలో పాతుకుపోయింది. అది తెలంగాణా పోరాటాలు వేళ్లూనుకుంటున్న సమయం. విరసం ఆవిర్భావం జరిగి మూడేళ్లు గడిచింది. తెలంగాణాలోని యువతరం



రచయితలు పోరాటాలకు స్పందించి తమ కలాలను ఝుళిపిస్తున్న వేళ. అదే సమయంలో నడిగడ్డ తెలంగాణా ప్రాంతం, పోరాటాలకు కేంద్రబిందువైన కరీంనగర్ నుండి వెలువడిన కథా సంకలనం 'బద్‌లా' ఉద్యమ సాహితీవారు ప్రచురించిన ఈ సంకలనం ఆ సమయంలో రావడం ఎంతో సాహసంతో కూడుకున్న పని. తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి పోరాట కథాసంకలనాలుగా హోరు, ఇప్పుడు వస్తున్న గాలి ప్రసిద్ధి పొందితే తెలంగాణా నుంచి వచ్చిన మొట్టమొదటి పోరాట కథాసంకలనంగా బద్‌లా ప్రఖ్యాతి వహించింది. ఈ సంకలనానికి చారిత్రక ప్రాధాన్యం ఉంది. అప్పుడు కలం పట్టిన ఎంతో మంది రచయితలకిది ప్రేరణయింది. ప్రముఖ విప్లవ కథా రచయిత అల్లం రాజయ్య ఈ సంకలనమే తనను రచయితను చేసిందన్నాడు.

ఇందులో ఆరు కథలున్నాయి. ఈ కథలన్నీ ఈ వ్యవస్థపై ఆగ్రహాన్ని వెళ్లగక్కేవే. అప్పుడప్పుడే తెలంగాణాలో వేళ్లూనుకుంటున్న విప్లవోద్యమాల పట్ల సానుకూల వైఖరిని పెంచేవే. ఉధృతం కానున్న పోరాటాలను భవిష్యద్దర్శనం చేయించేవే. కొకు ఊహించినట్టు కళింగ ప్రాంతంలో కాకుండా తెలంగాణాలో కథ పోరాట రూపం తీసుకుంటానికి విప్లవోద్యమాల ఆరంభ కాలంలో వచ్చిన కథలివి. ఇందులోని ఆరు కథలూ అగ్నికణాల్లాంటివే. ఆవేశంతో ఆక్రోశంతో పిడికిళ్లు బిగింపజేసే ఈ కథలు కరీంనగర్ ప్రజల భాషలో రాయబడినవే. ఇందులోని చాలా కథల్లో కరీంనగర్ జిల్లా పలుకుబళ్లు, మాండలిక వాక్యనిర్మాణం సమర్థవంతంగా ఉపయోగింపబడింది. తాడిగిరి పోతరాజు రాసిన బ్లాక్ అండ్ వైట్, వినోద్ రాసిన పునాది, తిరుపతి రాసిన పిడికిల్లు బిగిసుకున్న రాత్రి, ఎం.వి. తిరుపతయ్య రాసిన న్యాయం, శరత్‌కుమార్ రాసిన రేపటి ఉదయం, ఉమ్మెత్తల వెంకటరెడ్డి రాసిన పోచమ్మ కథలిందులో ఉన్నాయి. తాడిగిరి పోతరాజు తెలంగాణా ఆర్తితోనే కథలు రాసినా, పోరాటాల వల్ల స్పందనతోనే రాసినా వేరే ప్రాంతం నుంచి వచ్చి స్థిరపడినవాడు కాబట్టి అప్పటికి తెలంగాణా మాండలికాన్ని ఉపయోగించలేకపోయాడు. మిగతావాళ్లంతా స్వచ్ఛమైన మాండలికంలో కథలు రాశారు. వీళ్లలో కొందరు రాజ్యాన్ని ప్రశ్నించినందుకు నిర్బంధాలనూ ఎదుర్కొన్నారు. పోలీసుల వేధింపులనూ అనుభవించారు. తాడిగిరి పోతరాజు రాసిన బ్లాక్ అండ్ వైట్ కథాశిల్పం రీత్యా అద్భుతమైన కథ. పోలీసు వ్యవస్థలోని కుళ్లును, క్రూరత్వాన్ని నిర్మొహమాటంగా నిర్భయంగా వెల్లడించిన కథ. తెలంగాణాలో విప్లవోద్యమాలు ప్రారంభమైన కాలంలో విప్లవపార్టీలవాళ్లు ఎన్నికల బహిష్కరణ పిలుపునిచ్చారు. ఈ ఎన్నికల బహిష్కరణ పిలుపును కొన్ని గ్రూపులు ఇప్పటికీ కొనసాగిస్తున్నాయి. విప్లవోద్యమాన్ని సమర్థిస్తూ

రాసే రచయితలు కూడా నిబద్ధత పేరుతో తమ కథల్లో ఎన్నికల బహిష్కరణను సమర్థిస్తూ కథలు రాశారు. ఇది నిబద్ధత పేరు మీద పార్టీకి తోకగా మారడమే అయినా విప్లవోద్యమాల ఆరంభకాలంలో ఈ విషయాన్ని సమర్థిస్తూ కథలొచ్చాయి. అలాంటి కథే వినోద్ రాసిన పునాది. ఎన్నికలను బహిష్కరించమని ప్రచారం చేస్తూ యువకులు అరెస్టు కావడం ఈ కథలోని వస్తువు.

తిరుపతి రాసిన పిడికిల్లు బిగుసుకున్న రాత్రి నిబద్ధత పేరు మీద పార్టీ పిలుపును సమర్థించే కథే... మొదట్లో వర్గశత్రువైన భూస్వామిని నిర్మూలించడమే అంశంగా ఖతం కార్యక్రమాన్ని సమర్థిస్తూ వచ్చిన కథల్లో ఈ కథ ఒకటి. ఖతం కార్యక్రమంతో వర్గ శత్రువును నిర్మూలిస్తే విప్లవం వస్తుందని పార్టీ నమ్మిన విషయాన్నే రచయిత సమర్థిస్తూ రాయడం గమనించవచ్చు. యం.వి. తిరుపతయ్య రాసిన న్యాయం కథ తెలంగాణా గ్రామాల్లోని ఫ్యూడల్ న్యాయాన్ని, దొరల దౌర్జన్యాన్ని తెలిపే కథ. సాగుకు యోగ్యంగాలేని భూమిని తీసుకున్న రైతు అష్టకష్టాలు పడి దాన్ని సాగుకు అనుకూలంగా మారుస్తాడు. అది ఉపయోగకరమైన భూమిగా మారింతర్వాత ఊరి దొర అది తనదని లాక్కుంటాడు. రైతు ఏండ్ల శ్రమ వృధా అవుతుంది. అతడు తనకు న్యాయం చేయమని ఎందరి చుట్టూ తిరిగినా ఫలితం శూన్యం. ఇక తనకూళ్లో న్యాయం దొరుకదని న్యాయం కోసం అడవుల్లోకి వెళ్లిపోయి ఉద్యమకారుడుగా మారుతాడు. ఈ కథ రాసి రచయిత అనేక కష్టాలు పడతాడు. ఈ విషయాన్ని అంపశయ్య నవీన్ చీకటిరోజులు నవలలో పొందుపరిచాడు. శరత్‌కుమార్ రాసిన 'రేపటి ఉదయం' పాలేరుగా ఉన్న వ్యక్తియొుక్క అంతర్మథనాన్ని చిత్రించిన కథ., తెలంగాణా గ్రామాల్లో ఫ్యూడల్ భూస్వాముల దగ్గర పాలేరుగా పని చేయడం ఎంత కష్టంతో కూడుకున్న పనో ఈ కథను చదివితే అర్థమవుతుంది. ఉద్యమాలు పాలేర్లలో కల్గించిన చైతన్యం ఇందులో చిత్రించబడింది. ఉమ్మెత్తల వెంకటరెడ్డి రాసిన పోచమ్మ కథ ఊళ్లోని మూఢ నమ్మకాల ఆధారంగా పేదలపై జరిగే దోపిడీని వాస్తవికంగా చిత్రించిన కథ. ఈ ఆరు కథలూ తెలంగాణాలోని ఫ్యూడల్ దొరల దౌర్జన్యాలను తెలంగాణా స్థితిగతులను, పేదలపై జరుగుతున్న అణచివేతను అనివార్యంగా అడవుల్లోకెళ్లిన క్రమాన్ని తెలిపే కథ. ఈ రచయితలు తమ రచనా పరంపరను కొనసాగించి ఉంటే బాగుండేది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 20 అక్టోబర్ 2003**



# పోరాటం ఊపిరిగా తెలంగాణా కథ

శ్రీకాకుళ పోరాటాలనంతరం తెలంగాణాలో పెల్లుబుకిన పోరాటాలు మూడు దశాబ్దాలకు పైగా కొనసాగుతూనే ఉన్నాయి. శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటాలకు భాష్యం పలుకుతూ భూషణం, వంగపండు ప్రసాదరావు, అప్పల్నాయుడు లాంటి వాళ్లు చక్కని కథలు రాశారు. విశాఖపట్నం నుండి పోరాటాల ప్రారంభ దశను తెలుపుతూ హోరు, ఇప్పుడు వీస్తున్న గాలి కథా సంకలనాలు వస్తే, తెలంగాణలోని పోరాటాల ప్రారంభ దశను బద్‌లా సంకలనం అక్షరీకరించింది. 1970 ప్రాంతంలో భూపోరాటాలు ప్రారంభమైన తర్వాత తెలంగాణా నుండి విరివిగా కథలొచ్చాయి. గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చిన రచయితలతో ఈ పోరాటాలు కలం పట్టిచ్చాయి. కొందరు అనివార్యంగా రచయితలయితే కొందరు పోరాటాలకు స్పందించి పుంఖానుపుంఖాలుగా కథలు రాశారు. భారతదేశానికి భూపోరాటాల వారసత్వాన్నందించిన తెలంగాణా, పోరాట కథలందించే వారసత్వంగా ముందుకు తీసుకుపోయారు. ఇందులో కొందరు పోరాటాల్లో పాలు పంచుకుంటూ మరికొందరు బయట నుండి చూస్తూ ఫలాలను అనుభవిస్తూ కథలు రాశారు.

రజాకారు పోరాటాల ప్రతిస్పందనలుగా వచ్చిన కథలకూ ఈ కథలకూ స్పష్టమైన తేడాలున్నాయి. ఆ కథలను చాలా మంది ఇతర ప్రాంత రచయితలు రాశారు. పోరాటాలను గూర్చి తెలుసుకొని, వార్తాపత్రికల్లో చదివి రాశారు. కాని ఈ కథలను పోరాట ప్రాంతంలో ఉన్నవాళ్లు ఆయా పోరాటాల ఆటుపోట్లనుభవిస్తూ రాశారు. కాని ఈ పోరాటకథలకున్న వైవిధ్యం, స్థలకాలాల చైతన్యం, ప్రజల భాషను స్వంతం చేసుకొని రాయబద్ద గుణం రజాకారు పోరాటాల కాలంనాటి కథలకు లేవు. అందుకే 1970–90 కాలాన్ని తెలంగాణా పోరాట కథల కాలంగా పేర్కొనవచ్చు. సృజన, అరుణతార, ప్రజాసాహితి, నూతన, ప్రగతి, ఒడిసెలలాంటి అనేక పత్రికలీ కథలను ప్రచురించాయి. స్పష్టమైన దృక్పథంతో ఈ వ్యవస్థ మారాలన్న ఆకాంక్షతో పోరాటాలను సమర్థిస్తూ రాయబడిన ఈ కథలు తెలుగుకథకు విప్లవ కథామార్గాన్ని చూపాయి. ఈ కథలను రాసిన కొందరు కథ ప్రజలను చేరడమే లక్ష్యంగా ఈ కథపై తమ కర్తృత్వాన్ని కూడా వదులుకున్నారు.

తెలంగాణా కథకు, తెలంగాణా నుంచి కూడా విరివిగానే కతలొస్తున్నాయన్న గుర్తింపు రావడానికి ఈ కాలంలో వచ్చిన కథలు దోహదం చేశాయి. పోరాటకథలతో పాటు తెలంగాణా జనజీవన సంస్కృతిని చిత్రీకరిస్తూ కూడా అనేక కథలొచ్చాయి.

తెలంగాణా కథంటే పోరాట కథ మాత్రమే [illegible]ంత విరివిగా ప్రచారం జరగడం వల్ల మాత్రం కొంత నష్టమే జరిగింది. తెలంగాణా జనజీవితాన్ని గూర్చి, పోరాటేతర ప్రజల గూర్చి వివిధ కోణాల్లోంచి వచ్చిన అనేక కథలను గుర్తించనట్టయింది. పోరాట కథలకున్న ప్రాధాన్యత వాటికున్న వైవిధ్యపూరితమైన ఈ కథలూ తెలుగు సాహిత్యంలో ఎన్నదగ్గవే. ఏదేమైనా 1970-90 ప్రాంతం తెలంగాణా నుంచి విరివిగా పోరాట కథలొచ్చాయి. ఈ కాలంలో పోరాట కథలతో పాటు తెలంగాణా జనజీవన కథలనదగిన కథలను రాసిన రచయితలెంతో మందున్నారు. అల్లం రాజయ్య, అందుగుల మొండయ్య, కాలువ మల్లయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, యాదగిరి, సరిపల్లి కృష్ణారెడ్డి, ఉప్పల నరసింహం, కాంతి, అజ్ఞాత సూరీడు, కిరణ్, గోదారి, నిఖిలేశ్వర్, సిహెచ్. మధు, కర్షక, కార్మిక, తోట మహదేవ్, జూకంటి జగన్నాథం, జయధీర్ తిర్మల్ రావు. తిర్మల్, జీవన్, రాములు, బోయ జంగయ్య లాంటివాళ్లింకెంతో మంది కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

పోరాటాలు ఉధృతంగా జరుగుతున్న కాలంలో పోరాట ప్రాంతం నుంచి పోరాటాలకు ప్రతిస్పందనగా సమకాలీన విషయాల గూర్చి కథలు రావడం అరుదైన విషయం. ఎందుకంటే ఆ నిర్బంధాలనెదుర్కొని, వేధింపులను భరిస్తూ రాయడం కష్టమైన పని. అయినా సరే అన్ని ఒత్తిడులకూ తట్టుకొని తెలంగాణా రచయితలా పనిచేశారు. అందుకే వీళ్లలో కొందరు రహస్యజీవితం గడపాల్సి వచ్చింది. కొందరు మారు పేర్లతో రాయాల్సి వచ్చింది. కోస్తా ప్రాంతం నుంచి కూడా కొన్ని పోరాట కథలొచ్చినా పోరాట ప్రాంతం తెలంగాణాలోనే ఉండటం వల్ల ఈ ప్రాంతం నుంచే విరివిగా కథలొచ్చాయి. రైతాంగ పోరాటాల్లోనే వివిధ దశలను చిత్రించిన ఈ కథలు పోరాట ప్రాంత ప్రజలకు, పోరాటాల్లో పాల్గొనే వారికెంతో ఉత్తేజాన్నిచ్చాయి. తమ సాహిత్య ప్రయోజనాన్ని నెరవేర్చాయి. ఈ కాలంలోనూ, ఈ కథలకు రచయితలెన్నుకున్న మార్గం ఆశు కథా సాంప్రదాయం, ఆధునిక కథ లిఖిత కథా సాంప్రదాయనికి చెందింది. కథ ప్రజలను చేరడానికి ఆశు సాంప్రదాయానెన్నుకొని రాసిన ఈ కథల్లో లిఖిత సాంప్రదాయ శిల్పం కొంత తక్కువన్న విమర్శుంది. కథలు వచ్చిన సందర్భాన్ని, తెలంగాణా కథను ఎలా చూడాలో గమనించకుండా మూసపోసిన నియమాల పరిధిలో వచ్చిన విమర్శలు కాలగర్భంలో కలిసిపోతాయి. కథలు నిలుస్తాయి. ఈ కథల్లో ప్రధానంగా తెలంగాణా మాండలికం విరివిగా వాడబడింది. పోరాట కథలను ప్రచురించని కథల్లోనూ మాస్ సర్క్యులేషన్ ఉన్న పత్రికల్లోనూ ఈ కాలంలో తెలంగాణా మాండలిక రచనలు విరివిగా వచ్చాయి. తెలంగాణా మాండలికాన్ని ప్రచురించమని భీష్మించుకొని కూర్చున్న పత్రికలు



కూడా మాండలిక కథలను ప్రచురించాల్సి వచ్చింది. దీంతో తెలంగాణా మాండలికానికి సాహిత్య గౌరవమొచ్చిందీ కాలంలోనే. మొదటితరంలోనే తెలంగాణా మాండలికం కథల్లో వాడబడిన ఈ కాలంలోనే ఈ మాండలికం విరివిగా కథల్లోకెక్కి ఈ తరం రచయితలకు మాండలికం వాడటానికి మార్గం సుగమమైంది.

1970-90 ప్రాంతంలో విరివిగా వచ్చిన పోరాట కథలు పోరాటాల్లోని వివిధ అంశాలను స్పృశించాయి. ఇందులో ముఖ్యమైనవి భూపోరాటాలు. దున్నేవాడికే భూమి చెందాలన్న దృక్పథంతో రాయబడిన కథలివి. సాంస్కృతిక రంగాల్లో రావాల్సిన మార్పుల గూర్చి తెలిపేవి సాంస్కృతిక పోరాట కథలు. పోరాటాలు విజయవంతమవడానికి అడ్డుగా ఉన్న వర్గశత్రువును నిర్మూలించాలని చెప్పే కథలు వర్గ శత్రు నిర్మూలన కథలు. రైతు కూలీల సమస్యలపై రైతులపై అప్పుల భారం సమస్యలపై వచ్చిన కథలు రైతుకూలీల కథలు. సింగరేణి, ఇతర కార్మికుల పోరాటాలను చిత్రించిన కథలు కార్మిక కథలు. ఆదిలాబాద్ పోరాట ప్రాంత గిరిజనుల పోరాటాలను చిత్రించిన కథలు గిరిజనుల కథలు. మధ్యతరగతి జీవుల ఆవేదనలు, ఆక్రందనలు చిత్రించినవి మధ్యతరగతి జీవనకథలు. పోరాట స్త్రీల గూర్చి రాసిన కథలు స్త్రీల కథలు. దళితుల సమస్యలపై వచ్చిన కథలు దళిత కథలు. వైవిధ్యపూరితమైన ఈ కథలు తెలుగు సాహిత్యానికి విప్లవ కథా పంథాను చూపడమే కాక తెలంగాణా పోరాట వారసత్వాన్ని ముందుకు తీసుకువెళ్లాయి.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 3 నవంబర్ 2003**

# భూపోరాట కథలు

ఏ మట్టిలోనైతే నిరంతరం పని చేస్తున్నాడో, మట్టిలో మట్టియి బొర్లుతున్నాడో ఆ మట్టిపై అధికారం, హక్కు తనకు కావాలని చేసే జీవన్మరణ పోరాటాలు రైతాంగ పోరాటాలు. భూమి సమస్యే ఇరుసుగా జరిగే ఈ పోరాటాలు మట్టివాసనే తగలనివానికి భూమిపై ఉండే అధికారాన్ని ప్రశ్నిస్తున్నాయి. భూమిపై ఎవరైతే పని చేస్తున్నారో ఆ భూమి పుత్రులకే భూమి చెందాలని ఈ పోరాటాల ఉద్దేశ్యం...

భూమి కోసం, భుక్తికోసం పేదల ప్రజల విముక్తి కోసం చేయబడుతున్నవని చెప్పబడే ఈ పోరాటాలకు దర్పణం పడుతూ తెలంగాణా నుంచి అనేక కథలొచ్చాయి. ఈ కథలు ఇతర ప్రాంతాల నుంచి కొన్నొచ్చినా తెలంగాణా నుంచే గణనీయమైన సంఖ్యలో రావడం విశేషం. ఈ కథల్లో ఉపయోగించబడిన ప్రజల భాష, సజీవ నుడికారం బంగారానికి తావబ్బినట్టయింది. ఈ కథలకు తెలుగు సాహిత్యంలో విశిష్ట స్థానముంది. దున్నేవాడికే భూమి చెందాలన్న తాత్విక దృక్పథంతో రాయబడిన ఈ కథలు తెలుగు సాహిత్యంలో ప్రత్యేకమైనవే. శ్రీకాకుళ పోరాటాల గూర్చి భూషణం విరివిగా కథలు రాస్తే తెలంగాణాలో జరిగిన భూపోరాటాల గూర్చి అల్లం రాజయ్య విరివిగా కథలు రాశాడు. ఈ కథలకు సుస్థిరమైన పునాదినేర్పరిచింది అల్లం రాజయ్య. అతనితో పాటు బి.ఎస్. రాములు, కాలువ మల్లయ్య, వుప్పల నరసింహం, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, యాదగిరి, సిహెచ్. మధు లాంటి వాళ్లెంతోమంది భూపోరాటాలకు భాష్యాలనదగిన చక్కని కథలు రాశారు. భూపోరాట కథా సాహిత్యం 1970-90ల మధ్య సుసంపన్నమైంది.

ఈ బద్‌లా కథల సంకలనంతో ప్రారంభమైన ఈ పరంపర అల్లం రాజయ్య కొలిమంటుకుంది నవలతో ఎదురుతిరిగితే కథతో ఊపందుకుంది. ఫ్యూడల్ దొరల, భూస్వాముల అణచివేతకు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా, భూమిపై హక్కు కోసం, దున్నేవాడికే చెందాలన్న ఉద్దేశ్యం కోసం ప్రజలు ఎదురుతిరగాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతుందీ కథ. ఇతడే రాసిన సృష్టికర్తలు అద్భుతమైన కథ... సర్వసంపదలకు సృష్టికర్తలైన రైతాంగం పంటలను సృష్టించేవారే కాని వాటిని నాశనం చేసేవారు కారని, ప్రజలే నిజమైన సృష్టికర్తలని చెప్పే చక్కని కథ... భూమిపై భూమిపుత్రుల హక్కుకోసం తిరుగుబాటు ఉద్యమాల ఆవశ్యకతను తెలిపే కథలు భూమికథలు.. ఇంకా ఈ రచయఇత రాసిన ఊరూరి కథ, దొరగారి కుక్క, సత్యంలాంటి ఎన్నో



కథలు భూపోరాటాల కథల్లో ఎన్నదగినవి. జయధీర్ తిరుమలరావు రాసిన పురివిప్పిన కర్తవ్యం, జీవన్ రాసిన పేపర్ టైగర్, యెన్నెం సత్యం రాసిన తోడేల్లు, సిహెచ్. మధు రాసిన భూమి భూమిపై శ్రమజీవుల హక్కు కోసం తిరగబడాల్సిన అవసరాన్ని తెలిపేదే.

తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన ఈ భూమి ఎవరిచ్చింద్రు? భూపోరాట కథల్లో ఎన్నదగిన కథ. బీడుగా పడి ఉన్న పరంపోగు భూమిని ఆరుగాలం కష్టపడి సాగుకు తెస్తే ఈ భూమిపై హక్కు పొందాల్సిన రైతు భూమిలేని వాడై దొర ఆ భూమిని ఆక్రమించుకుంటే తెల్లమొహం వేస్తాడు - న్యాయంగా రైతుకు చెందాల్సిన భూమి దొరకు చెందడంలోని ఔచిత్యాన్ని ప్రశ్నిస్తూ తిరుగుబాటు ద్వారా మాత్రమే ఆ భూమి రైతుకు చెందడం సాధ్యమవుతుందని నొక్కి చెప్పే కథ.... వుప్పల నరసింహం రాసిన ముళ్లతీగ, కనుపాపను కబళిస్తే, ఇత్తనపు కోడెలాంటి కథలు తెలంగాణా గ్రామాల్లోని ఫ్యూడల్ సంస్కృతిని కళ్లముందుంచే కథలు... పాలేర్లపై దౌర్జన్యాలు, పాలేర్ల వెట్టిన మించి చాకిరీ, కొట్టుకుంటూ తిట్టుకుంటూ ఇచ్చే స్వల్పమైన జీతం ధాన్యం కోసం అమ్ముడు పోయినట్టు పని చేయడం లాంటి అనేక విషయాలను తన కథల ద్వారా చెప్పాడు రచయిత - దొర చేను కంచె ముళ్లతీగకు కరెంటు పెట్టి అది షాక్ కొట్టి పాలేరు చచ్చినా కిమ్మనని దొర మీదికి ఎదురు తిరుగుతారు ప్రజలు. రైతు ఆవుపై తన ఇత్తనపు కోడె పారింది కాబట్టి ఆ ఆవుకు పుట్టిన దూడ తనదేనని తల్లిబిడ్డలను వేరే చేసి లాక్కుపోతాడు దొర. ఆవు యొక్క చావును దాని కళ్లలోని కోపాన్ని తద్వారా కాబోయే భూస్వామ్య వ్యవస్థ పతనాన్ని ప్రతీకాత్మకంగా చెబుతాడీ కథలో...

ఇంకా అల్లం రాజయ్య రాసిన ధ్వనీ ప్రతిధ్వని, తల్లి చేప, మట్టిమనిషి, తుమ్మేటి రఘోత్తమరెడ్డి ధిక్కారం లాంటి కథలీ విభాగంలో ఎన్నదగిన కథలు. భూమి భూమిపుత్రులైన రైతుల చేతుల్లోకి పోయినప్పుడు పులకించిపోయి నవ్వుతుందని, అదే భూమి కర్రపెత్తనం చేలాయించే భూమిపై ఒక్క చెమట చుక్క కూడా తడపని దొరల చేతుల్లోకి పోయినప్పుడు వలవలా ఏడస్తుందని భూమి ఎవరికి చెందాలో ప్రతీకాత్మకంగా చెప్పిన కథ భూమి నవ్వింది. భూస్వామ్య భీజాలున్న గ్రామాలలో పేదలకు జరిగే అన్యాయాలను, న్యాయం పేరిట జరిగే దురన్యాయం గూర్చి చెప్పే కథ గిరి రాసిన న్యాయం... ఉన్నవాళ్లే నేరం చేసి ఆ తప్పుల్ని పేదల మీదికి నెట్టి దండుగలు లాగడం లాంటి దుర్మార్గాన్ని ప్రశ్నించే కథ... ఎన్నికల్లో కూలినాలి జనాలను నాయకులు పావులుగా ఉపయోగించుకోవడం, తమ ప్రయోజనాల కోసం తాగుడులాంటి దురలవాట్లక[illegible]యడం, అటు తర్వాత విదిలించి కొట్టడం అంశంగా గల కథ

తిర్మల్ రాసిన 'తెల్లారని రాత్రి...' అయితే భూపోరాటాలతో చైతన్యవంతులైన ప్రజలు ఇంతకు ముందులా కాకుండా నాయకుల నిజస్వరూపాల గూర్చి తెలుసుకొని తిరుగుబాటు దిక్కు దృష్టి సారిస్తారు.

మన్ను పిసికి అన్నం అందించే మహోన్నత అన్నదాత వృత్తిలోంచి భూమిని తలకిందులు చేసి బువ్వ పంచే పవిత్ర వృత్తిలోంచి గుండె వంటి భూమి నుంచి భూమాత వొడినుంచి ఈ దోపిడీ వ్యవస్థలో సర్వస్వం దోచుకోబడి భూమి అట్టడుగు పొరల్లోని ఫ్యాక్టరీ యంత్రాల మధ్యకి విసిరేయబడ్డవారిని, వారి చేజారిన స్వతంత్ర జీవనాన్ని గతించిన వసంతాల మధుర జీవితాన్ని చప్పున గుర్తుకు తెస్తాయి అల్లం రాజయ్య కథలు అన్న తుమ్మేటి రఘోత్తమరెడ్డి వాక్యాలు భూపోరాట కథలన్నిటికీ వర్తిస్తాయి.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 27 అక్టోబర్ 2003**



# అతివాద కథలు - సిద్ధాంతాల బరువు

ఉద్యమాలు ప్రారంభమైన కాలంలో చార్ మజుందార్ ఇచ్చిన అతివాద ధోరణియైన ఖతం కార్యక్రమం చాలాకాలం వరకు అమల్లో ఉంది. పార్టీ అవలంభించిన ఈ పద్ధతినే రచయితలు తమ కథల ద్వారా సమర్థించారు. నిబద్ధత పేరు మీద పార్టీ ఏది చెబితే అది చేయడం, రాయడం పార్టీలకు తోకలుగా మారడమే అవుతుంది. రచయితైన వాడు సరియైన మార్గనిర్దేశనం చేయాలి. అదేం చేయకుండా ఆవేశ ప్రవృత్తితో తమ కథల్లో వర్గశత్రు నిర్మూలనను, ఖతం కార్యక్రమాన్ని సమర్థించారు రచయితలు.. పార్టీ వర్గ శత్రు నిర్మూలన సిద్ధాంతం అమల్లో ఉన్నంతకాలం ఈ తరహా కథలొచ్చాయి. ఖతం కార్యక్రమం సరైంది కాదని 1974లో పార్టీ గుర్తించిన తర్వాత ఖతం చేయడం వద్దన్న ముగింపుతో కథలొచ్చాయి. 1974 వరకు భూస్వాములను చంపివేయడమే తమ కథల్లో ముగింపులుగా ఇస్తే 1974 తర్వాత అలాంటి ముగింపులతో కథలు రాలేదు. అయితే ఖతం కార్యక్రమాన్ని సమర్థిస్తూ కథలు రాసినవారిలో చాలా మంది పోరాట ప్రాంతానికి దూరంగా వున్నవాళ్లే.. పోరాట ప్రాంతంలో, ముఖ్యంగా తెలంగాణాలో ఉంటూ ఖతం కార్యక్రమాన్ని సమర్థిస్తూ కథలు రాస్తే నిర్బంధం తప్పని పరిస్థితుండేదప్పుడు. రజాకారు పోరాటాల గూర్చి తెలంగాణేతరులు రాసినటువంటి కథలే ఇవి. తెలంగాణా నుంచి కూడా ఒకటిరెండు వర్గ శత్రునిర్మూలనలను సమర్థించే కథలొచ్చినా, సమస్యల పరిష్కారం కోసం అడవులకు పోయినట్లు, ఊరొదిలి పోయినట్టు అన్నల్లో కలిసినట్టు వచ్చిన ముగింపులతో వచ్చిన కథలే ఎక్కువ.

తెలుగు సాహిత్యంలో నిబద్ధతను ఓ సిద్ధాంతంగా ముందుకు తీసుకొచ్చింది అభ్యుదయ రచయితల సంఘం. విప్లవ రయితల సంఘం దానికి మరింత బలం చేకూర్చి నిబద్ధతతో రాయంది సాహిత్యమే కాదన్నంతగా ప్రచారం చేసింది. రచయితలకు నిబద్ధత అవసరమే అయినా అది పార్టీ సిద్ధాంతాలకో, పార్టీలకు తోకలుగా మారేంతగా ఉండాల్సిన పన్లేదు. రచయితకు రాజకీయాలవసరమే కానీ కేవలం రాజకీయాలే రచనలు కావడం కూడా రచనల్లో అతివాద ధోరణి అవుతుంది. సాంస్కృతిక, సాహిత్య, రాజకీయ సంస్థల మధ్య పరస్పర సంబంధాలున్నా నూటికి నూరుపాళ్లు అభేదాన్ని పాటించడమూ సరైంది కాదు. రచనల సార్వకాలీనత సంగతెలా వున్నా కేవలం సిద్ధాంతమే సాహిత్యంగా కొనసాగడం ఈ కథల్లో కనబడుతుంది. కడవలకొద్దీ ఘర్మజలాన్ని ధారబోసి రిక్షా లాగుతూ సంపాదించే డబ్బు, అతని శ్రమ ఫలితం

అతనికి చెందడం లేదు. దున్నుతున్నవాడిదే భూమి కానట్టే రిక్షా లాగుతున్నవాడిదే రిక్షా కాదు. దానిపై యాజమాన్యం మరొకరిది. కిరాయ పేరు మీద రిక్షా లాగితే వచ్చే డబ్బులో చాలా భాగం యజమానికే ఇవ్వాల్సుంటుంది. రిక్షా పాడయి, మరమ్మతు చేయించుకోవడానికి డబ్బుల్లేక కటకట పడుతున్న రిక్షా కార్మికుల్ని డబ్బు కట్టమని వేధిస్తూ కొడతాడు యజమాని. రిక్షావాడు భార్యను కూడా కోల్పోయి సమస్యల వలయంలో చిక్కుకుంటాడు. ఇక బతకడం సాధ్యం కాదని గుర్తించిన రిక్షా కార్మికుడు తన సమస్యలకు పరిష్కారం తూర్పు దిక్కు వెళ్లడమే అని భావించడం అంశంగా గల కథ వేణు రాసిన 'రిక్షావాలా...!'. విప్లవాన్ని ఎరుపును కోరుతూ వాళ్లలో కలసిపోయాడని పరోక్షంగా చెబుతాడు రచయిత.

తెలంగాణా గ్రామాల్లోని దొరల దౌర్జన్యానికి అద్దం పట్టే కథ నందిని సిధారెడ్డి రాసిన పాముల మధ్య చీమ. ఊళ్లో సర్వాధికారాలను చలాయిస్తున్న వెంకటరెడ్డి తన ఇంట్లో ఉంగరం పోతే ఆ నేరాన్ని పాలేరుపై మోపి విపరీతంగా హింసిస్తాడు. అయితే అసలు దొంగ కరణమని ఆ తర్వాత తేలుతుంది. తెలంగాణా గ్రామాల్లో పెద్దలు చేసిన నేరాలకు పేదలు శిక్షననుభవించడం జరుగుతూనే ఉండేది. గ్రామాల్లో పోరాటాలు ప్రారంభమైన తర్వాత ఈ స్థితిని ప్రశ్నించడం, తిరగబడటం నేర్చుకున్నారు ప్రజలు. రెడ్డి పాలేరు కిట్టయ్యకు జరిగిన అన్యాయం గూర్చి అడగడానికి జనం కోపంతో దొర, కరణం ఇంటికి దిక్కు నడుస్తారు. తెల్లవారి నుంచి కిట్టయ్య పగతీర్చుకోవడానికి ఊళ్లో నుంచి ఎక్కడికో వెళ్లిపోతాడు. ఉద్యమాల్లో లీనమవడానికి అడవులకెళ్లాడని ధ్వనిగర్భితంగా చెబుతాడు రచయిత.

గ్రామాల్లో అప్పు పేరు మీద తరతరాలుగా వెట్టి చేయించుకోవడం ఉండేది. ఎన్నేండ్లు దొరలిండ్లలో పని చేసినా బాకీలు తీర్చే ప్రసక్తే లేదు. గ్రామాల్లో పోరాటాలు ప్రారంభమైన తర్వాత షావుకార్లను ప్రశ్నించడం, తిరగబడటం మొదలైంది. సేటు దౌర్జన్యానికి బలయిన కూతరు బతుకును చూసి ఇంతకు ముందులా మౌనంగా ఉండక తిరుగుబాటు చేస్తాడు తండ్రి. తర్వాత రాబోయే పరిణామాలను దృష్టిలో పెట్టుకుని పోలీసులకు లొంగిపోకుండా తూర్పు దిక్కుకెళ్లడం అంశంగా గల కథ సృజన్ రాసిన మార్గం. అతడెన్నుకున్న మార్గం అడవులకెళ్లడమే..

వర్గశత్రు నిర్మూలనను సమర్థిస్తూ వచ్చిన ఈ కథల్లో జీవితం పాలు తక్కువ. సిద్ధాంతాల బరువు ఎక్కువ. ఏ విషయాన్నయితే చెప్పాలో ఆ విషయాన్ని చెప్పడానికి తొందరపడ్డట్టు ఈ కథలు చదివితే అర్థమవుతుంది. పోరాట ఎత్తుగడలకు



సంబంధించిన ఈ కథల్లో నిర్మాణం పాలు తక్కువై వాచ్యంగా చెప్పడం ఎక్కువయింది. ముగింపుల్లో వైవిధ్యం లేకున్నా పీడింపబడే వ్యక్తులను కథావస్తువులుగా తీసుకోవడంలో కావాల్సినంత వైవిధ్యముంది. భూస్వామ్య వర్గాలచే రకరకాల దోపిడీకి, పీడనకు గురయిన పేదలు అన్ని విధాలుగా ప్రయత్నించి అనివార్యంగా విప్లవ మార్గాన్ని ఎన్నుకోవడం పరిష్కారంగా భావించడం ఈ కథల్లో చూడవచ్చు. పీడింపబడే వర్గాలకు పోరాటాలపై అచంచల విశ్వాసం, పీడకులపై చెప్పలేనంత ఆగ్రహం ఉండటం ఈ కథల ద్వారా తెలుసుకోవచ్చు.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 24 నవంబర్ 2003**

# కథలు - సాంస్కృతిక కళారూపాలు

1970-90 పోరాటాలకు భూమి సమస్యే ప్రధానమైంది. అయితే భూమి సమస్యకు అనుబంధ పోరాటాలుగా సాంస్కృతిక కళారూపాల గూర్చి కూడా పోరాటాలు బాగానే జరిగాయి. భూమి మీద, సంపద మీద అధికారం గల భూస్వాములు, దొరలు ప్రజల సాంస్కృతిక సంబంధాలను నిర్ణయించే శక్తులుగా కూడా మారారు. అసలైన ప్రజా సంస్కృతికి, గ్రామీణ సంస్కృతికి వారసులు శ్రామికులైన జానపదులయితే ఆ సంబంధాలను నిర్ణయించేది మాత్రం భూస్వాములు కావడం విశేషం. భూమ్మీద ఒక్క చెమట చుక్క ధారబోయకున్నా భూమిపై కర్తృత్వం వహించడం లాంటిదే ఇది కూడా. బతుకమ్మ పండుగను అత్యంతుత్సాహంతో జరుపుకునేది గ్రామీణులైతే బతుకమ్ముండాల్సింది మాత్రం దొరల ఇంటిముందు. పండగలు, పబ్బాల సంస్కృతి మొత్తం పేద, శ్రామిక కులాల్లోనే నిక్షిప్తమై ఉంటే వాటిపై అధికారం మాత్రం దొరకెందుకుండాలో అర్థం కాని విషయం. అందుకే భూమి కోసం పోరాటాలు చేయడంతో పాటు సాంస్కృతిక సంబంధాలను నిర్ణయించే శక్తులతోనూ పోరాటం చేయాల్సి వచ్చింది. ఆ పోరాటాలను సమర్థిస్తూ, ప్రజాకళారూపాలు తీసుకోవాల్సిన దిశను నిర్ణయిస్తూ, సాహిత్యం కళలు ఎవరి కోసం ఉండాలో చెబుతూ అనేక కథలొచ్చాయి.

సామాజికావసరాలకు ఉపయోగపడే అన్ని విధాల పనులు చేసే దళితులు కొన్ని పండుగలు జరుపుకోరాదు. గుళ్లోకి ప్రవేశించరాదు. వాళ్లు అంటరానివాళ్లుగానే ఉండాలి. భూస్వామ్య ఫ్యూడల్ సంస్కృతి వాళ్లను దూరదూరంగానే ఉంచింది. శ్రామిక కులాలవాళ్లు పండగలను స్వతంత్రంగా జరుపుకోవడం భూస్వాముల పడగ నీడల నుండి బయటకు రావడం, దళితులకు గుళ్లోకి ప్రవేశం లాంటి సాంస్కృతిక సంబంధమైన పోరాటాల పట్ల సుముఖులను చేయడానికి కళలను ఉపయోగించుకోవడం జరిగింది. ఈ విషయాలన్నిటికి సంబంధించిన కథలే సాంస్కృతిక కళారూపాలపై కథలు. పోరాటాలు ఉధృతంగా జరుగుతున్న కాలంలో ఈ కథలెక్కువగా తెలంగాణేతర ప్రాంతాల నుండి వచ్చాయి. తెలంగాణా ప్రాంతాల నుండీ వచ్చాయి. తెలంగాణా ప్రాంతం నుండి భూపోరాటాల కథలుధృతంగా వచ్చాయి. తెలంగాణా ప్రాంతం నుండి వచ్చిన సాంస్కృతిక కళారూపాల కథలు ముఖ్యంగా సాంస్కృతిక సంబంధాల్లో ఫ్యూడల్ దొరల పెత్తనాన్ని ఎదిరించేవే.

ఈ కథల్లో అల్లం రాజయ్య రాసిన 'కథ' పేర్కోదగ్గది. ఇది కవిత్వం



ఎలాగుండాలో చెబుతూ రాసిన అధివాస్తవిక కవిత్వం లాంటిది. దీన్ని అధివాస్తవిక కథ అనొచ్చు. బుడిగె జంఘాలు బుడిగె మోగిస్తూ కథలు చెబుతూ అడుక్కునేవారు. ప్రజా పోరాటాల కాలంలో బుడిగె జంఘాలు చెప్పాల్సిన కథ ఎలా ఉండాలో చెప్పే కథే ఈ కథ. రజాకారు పోరాట కాలంలో కళలు ప్రజలను ఉత్తేజితుల్ని చేయడానికి ప్రజాకళల రూపం తీసుకున్నాయి. ఆనాటి విషయాలను శారదకాళ్లు కథల రూపంలో చెబుతున్నారు. రాజాకారు వ్యతిరేక పోరాటంలో పాల్గొన్న గట్టెపల్లి మురళయ్య, అనభేరి ప్రభాకరరెడ్డి, ఠాకూర్ శ్యాంసుందర్ సింగ్ లాంటి వాళ్ల జీవితాలను కథలుగా చెప్పేవారు శారదకాళ్లు. ఆ కాలంలో సుంకర, సుద్దాల హనుమంతు ప్రజల కోసం కళలనెలా ఉయోగించారో తెలియంది కాదు. ఇప్పుడు బుడిగె జంఘాలు చెప్పే కథ ప్రజా పోరాటాలను కీర్తించేదిగా, ప్రజలను పోరాటాలకు సన్నద్ధులను చేసేదిగా ఉండాలని చెప్పే కథే ఈ 'కథ'.

ఓ దిక్కు అగ్నిగుండంలా మండుతున్న తెలంగాణా ఉవ్వెత్తున పడిలేస్తున్న పోరాటాలు. ఆ పోరాటాల్లో ఆహుతవుతున్న యువతరం - ఇలాంటి సమయంలో రచయితేం చేయాలి? ప్రేమకథలు, ప్రకృతి సౌందర్య కథలు రాస్తూ కూర్చోవాలా? రచయిత ఎవరి పక్షం వహించి రాయాలి? ఇలాంటి సమయంలో రచయిత కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ ప్రజా పోరాటాలను చిత్రించాల్సిన అవసరాన్ని, ప్రజల పక్షం వహించి రాయాల్సిన కర్తవ్యాన్ని గుర్తు చేసే కథ సత్యం రాసిన కర్తవ్యం. రచయితలు మామూలు కథలు కాక ప్రజల వీరగాథలు రాయాలంటాడు రచయిత.

తెలంగాణాలో బతుకమ్మ ముఖ్యమైన పండుగ. ఇదొక్క తెలంగాణాలో మాత్రమే ఉంది. ఆ తర్వాత వచ్చేది దసరా. దసరానాడు జంబాకు తెంపడం పరస్పరం ఇచ్చుకొని దండాలు పెట్టుకోవడం ఓ ఆచారం. అయితే ఇందులోనూ ఫ్యూడల్ భావాలే. ఊరి పెద్ద దొరే ముందుగా జంబాకు తెంపాలి. ఆ తర్వాతే అందరూ. గ్రామాల్లో చదువుకున్న యువతరం వచ్చింతర్వాత ఇలాంటి విషయాలను ప్రశ్నించడం జరిగింది. ప్రజా పోరాటాలు వచ్చి యువకులకు, శ్రామిక కులాలవారికి అండదండగా నిలిచాయి. పండుగనాడు జంబాకు తెంపే అవకాశాన్ని దొరకు ఇవ్వాల్సిన అవసరం లేదని యువకులు, శ్రామికులు చేసిన తిరుగుబాటే అంశంగా గల కథ అల్లం రాజయ్య కథ ఎత్తుండ్రి పిడికిల్లు, ఊళ్లో దొరలు, భూస్వాములు, ఉన్నవాళ్లు ఎన్ని తప్పులు చేసినా అడిగే వాళ్లు లేరు. అదే చిన్న కులాలవాళ్లు పేదవాళ్లు చేయని తప్పును తప్పుగా చిత్రించడం, చిన్న చిన్న తప్పులను భూతద్దంలో చూస్తూ పెద్దవి చేయడం, దండుగల

పేర్ల మీద వేలాది రూపాయలు గుంజడం, కులంలోంచి వెలివేయడం లాంటి సంఘటనలు మామూలే. తాను పెళ్లి చేసుకోబోయే వితంతు మరదలితో సంబంధం వల్ల ఆమె గర్భవతవుతుంది. తాను వెంటనే పెళ్లి చేసుకుంటానన్నా వినకుండా దండగ కట్టమని కులంలోంచి వెలివేస్తారో యువకున్ని. ప్రజా పోరాటాల స్పందనతో చైతన్యవంతుడైన ఆ యువకుడు దొరల మాటలను ధిక్కరిస్తాడు. రెక్కల కష్టంతో బతికే వానికి ఏ ఊరయినా ఒక్కటేనని తన మరదల్ని తీసుకొని వెళ్లిపోవడం అంశంగా గల కథ కాలువ మల్లయ్య రాసిన వెలి.

సుత్తీకొడవలి అక్కాచెల్లెండ్లుగా మాట్లాడుకున్న విషయాన్ని ఇల్లు కథగా రాశాడు బి.ఎస్. రాములు. ఇల్లు సమాజంలో ఓ భాగం మాత్రమే. ఇల్లును మాత్రమే చక్కదిద్దుకుంటే సరిపోదు. సమాజంలోని పరిస్థితులను చక్కదిద్దాలి. అప్పుడే ఇల్లును చక్కదిద్దినట్టవుతుందంటాడు రచయిత. సమాజాన్ని సరిదిద్దడమే ఇల్లును సరిదిద్దనట్టని చెప్పే అంశం గల కథే ఇల్లు. తెలంగాణాలో మూఢనమ్మకాలింకా ఉన్నాయి. మూఢ నమ్మకాలు పోవాల్సిన అవసరాన్ని, దొరల ఎత్తుగడలకు లోబడి మూఢనమ్మకాల ఊబిలో పడి కొట్టుకోవద్దని తెలిపే కథ జి.ఎల్లం రాసిన బొడ్డురాయి. ఇంకా దేవరాజు మహారాజు రాసిన డోలు, తాడిగిరి పోతరాజు రాసిన సృష్టి లాంటి ఎన్నో కథలు సాంస్కృతిక సంబంధాలపై వచ్చిన మంచి కథలు.

కళ ప్రయోజనం చైతన్యమని, కళ కేవలం కళకోసం మాత్రమే కాదని తెలిపే కథలివి. విలువలను ప్రశ్నించే కథలు. ఈ విభాగంలో వచ్చిన కథల్లో చక్కని సామాజిక, నైసర్గిక నేపథ్యముంది. జీవితం, సిద్ధాంతం, ప్రయోజనం సమపాళ్లలో జోడించిన చక్కని శిల్పసౌందర్యంతో తీర్చిదిద్దబడిన కథలివి. కళల యొక్క ప్రయోజనాన్ని కళలు ప్రజా పోరాటాలుగా మారాల్సిన అవసరాన్ని, అవి అట్టడుగు జనాలకు అందదండగా ఉండాల్సిన అగత్యాన్ని తెలిపే కథలివి.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 17 నవంబర్ 2003**



# రైతుల అప్పుల కథలు

భారతదేశంలో అప్పు చేయని రైతులుండటం చాలా తక్కువ. వడ్డీతో సహా అప్పులు చెల్లించాలన్న నిజాయితే రైతులను కష్టాల ఊబిలోకి నెట్టుతుంది. అయినా రైతు తన నిజాయితీని వదులుకోడు. అప్పులకు చిన్న రైతులు భూములు కోల్పోవడం, కుటుంబమంతా భూస్వాముల భూముల్లో పని చేయడం, కొన్ని కుటుంబాలయితే తరాలకొద్దీ దొరలకు వెట్టి చేయడం తెలంగాణా గ్రామాల్లో మామూలే. ఏళ్ల తరబడి వెట్టి చేసే వాళ్ల బతుకులు బాకీ బతుకులే.

రైతుపై మోయలేని భారాన్ని మోపుతూ అతని నడ్డి విరగగొడ్తున్న అప్పుల్లో రెండు రకాలున్నాయి. ఒకటి ప్రైవేటు అప్పులు... షావుకార్ల దగ్గర, దొరల దగ్గర చేసే ఈ అప్పుల్లో వడ్డీ అపరిమితంగా ఉండేది. ఈతాకిచ్చి తాటాకు దొబ్బే విధంగా ఉండే ఈ అప్పులే ఎంతోమందిని వెట్టిలోకి నెట్టాయి. రెండో రకం అప్పులు బ్యాంకుల అప్పులు. దొందూ దొందే అన్నట్లు ఉండేయి ఈ అప్పులు. కల్లం మీదికే కుంచం బిందె, సంచులు తీసుకొచ్చి ధాన్యం కొలుచుకుపోతాడు షావుకారి. పండిన పంటంతా షావుకారి అప్పుల కిందికే పోతుంది. నాగటి మీదెడ్లను వేలం వేస్తాడు బ్యాంకు అధికారి. వీళ్లిద్దరూ రైతు భార్యమీది గంటె పుస్తెలనమ్మి బాకీలు వసూలు చేసుకోవడానికి కూడా వెనుకకు పోరు.

ప్రైవేటు, ప్రభుత్వ అప్పుల సుడిగుండంలో పడి కొట్టుకుపోతున్న రైతులకు సంఘాలొచ్చి మద్దతుగా నిలిచాయి. దేశానికి వెన్నెముకలాంటివాడైన రైతు ఆ వెన్నెముకే విరిగిపోయి అప్పుల సుడిగుండంలో కొట్టుమిట్టాడుతున్న విషయాలను కథలుగా మలిచారు రచయితలు.

ఎంతగా రెక్కలు ముక్కలుగా చేసుకుంటున్నా డొక్కలైనా నింపుకోలేని రైతులు, కూలీలు గ్రామాల్లో షావుకార్ల కబంధహస్తాల్లో పడి ఎలా విలవిలా కొట్టుకుంటున్నారో తెలిపే కథ చెరబండరాజు రాసిన 'శాంతి'. పోరాటాలు లేని కాలంలో బాకీల సుడిగుండంలో పడ్డవాడు బయటపడటం ఎంత అసాధ్యమో ఈ కథ చదివితే అర్థమవుతుంది. ఎలాగూ రుణవిముక్తుడు కావడం సాధ్యం కాదు కనుక తననెవరూ కలుసుకోవద్దని, ఈ విధంగానైనా తనను రుణ విముక్తుడ్ని చేయమని కోరుకోవడం పాఠకుల హృదయాలను కదిలిస్తుంది. గ్రామీణ ప్రాంతాల్లోని అప్పుల వల్ల, షావుకార్ల కబంధహస్తాల్లో చిక్కుకొని విలవిలలాడే వ్యావసాయిక కుటుంబాలను గూర్చి షావుకార్ల

రాక్షసత్వాన్ని గూర్చి తెలిపే కథ కె. రామమోహన్ రాజు రాసిన తీర్మానం, మానవత్వాన్నే మరిచి చావుబతుకుల్లో ఉన్న మనిషితో బాకీ మాఫీ అయినట్టుగా తెల్ల కాగితంపై సంతకం తీసుకున్న షావుకారి దుర్మార్గ బాకీల వికృత స్వరూపాన్ని కళ్లకు కట్టిస్తుంది. అప్పుల విషయంలోనైనా, మరే విషయంలోనైనా ఊరి కరణం, పెద్దులు ఉన్నవాడయిన షావుకారి దిక్కే ఉంటారు. అయితే గ్రామాల్లోకి సంఘాలొచ్చింతర్వాత ప్రజల్లో చైతన్యం వచ్చి వాళ్లు షావుకార్లపైకి తిరగబడి తమ అప్పులు అప్పులే కావని, తామిదివరకే వడ్డీల రూపంలో చెల్లించినవే ఎక్కువని షావుకార్లే తమకు తిరిగి ఇవ్వాలని తీర్మానించి అప్పు పత్రం చింపేస్తాడు గ్రామీణ కూలీ. యజ్ఞం కథలో పోరాటాలకు ముందు స్థితిగతులు చిత్రించబడితే పోరాటాల కాలంలో తెలంగాణా రైతు కూలీలు నేరుగా తిరగబడటం ఈ కథలో గమనించవచ్చు. భౌగోళిక, చారిత్రక నేపథ్యమున్న మంచి కథ తీర్మానం.

పేదల కష్టాన్ని బాకీల రూపంలో దోచుకునే వాళ్లకు నీతినియమాలు ఉండవని, తుదకు పేడనైనా తీసుకోవడానికి సిద్ధపడతారని బాకీ బతుకుల్లోని దారుణాన్ని గూర్చి తెలిపే తరతరాల బాకీ కథ కె. హనుమంతరెడ్డి రాసిన బండి. పిల్లల తరంలోనైనా విప్లవాలు చెలరేగి భవిష్యత్తు వాళ్లదవుతుందని సింబాలిక్‌గా చెబుతాడీ కథలో. ప్రభుత్వం అప్పులు మాఫీ చేయడంలోని బూటకం, ఈ వ్యవస్థలో లాయర్లు చెదలు వంటివారని దోపిడీ ఉన్న చోట పోరాటాలుంటాయని తెలిపే కథ సిహెచ్. మధు రాసిన చెదలు. ప్రభుత్వ అప్పులకు వడ్డీ తక్కువనిపించినా పట్వారీ నుండి మొదలుకొని బ్యాంకు అధికారి వరకందరూ తీసుకునే లంచాలతో కలుపుకొని అది తడిసిమోపెడవుతుంది. రుణభారాన్ని భరించలేక రైతు వ్యవసాయ మంత్రి ముందటే ఎండ్రిన్ తాగి ఆత్మహత్య చేసుకోవడానికి ప్రయత్నించడం ఓ వింతయితే ఇప్పుడు రైతుల ఆత్మహత్యలు అతి సాధారణమైపోయాయి. గూడెం రామయ్య కేశవరావు దగ్గర అప్పు తీసుకున్నందుకు వెట్టి బతుకు తప్ప లేదు. ఊళ్లోకి సంఘాలొచ్చినట్టు, పంతులు కోరలు పీకేసినట్టు, జీతాలు పెరిగినట్టు ఊహిస్తాడు రైతుకూలీ. దొరలు, బాకీలిచ్చే పంతుల్లు తోకలు ముడిసినట్టు సింబాలిక్‌గా చెబుతాడీ కథలో... ఉప్పల నరసింహం రాసిన నిజమయ్యే స్వప్నం కథలోని కూలి కలగన్నట్టే తెలంగాణా ప్రాంతంలో సంఘాలేర్పడి గ్రామాల్లోని దారుణమైన వెట్టి బతుకులకు విముక్తి లభిస్తుంది. ప్రైవేట్ అప్పులు పెనం లాంటివైతే ప్రభుత్వ బాకీలు పొయ్యి లాంటివని తెలిపే కథ కేసరి రాసిన సర్కారు బాకీ. సర్కారు బాకీ కింద బర్రెను కొనుక్కున్న రైతు అది ఈనితే పాలమ్మి కూతురుకు పట్టగొలుసులు



కొంటానని సంబరపడతాడు. కాని అతని సంతోషమెంతో సేపు నిలవదు. సర్కారు జీపొచ్చి బాకీ చెల్లించలేదని దూడను లాక్కెళ్లుతుంది. బర్రె అంగలార్చినా, రైతు మొత్తుకున్నా ఎవరూ వినరు. తుదకు బర్రెను అమ్ముతానని షావుకారి దగ్గరికెళ్తే దూడ చచ్చిన బర్రెను కొననంటాడు. అతని బతుకు రెంటికి చెడ్డ రేవడిలా అవుతుంది. గ్రామీణ రైతాంగంపై మోయలేని భారంగా వున్న అప్పుల గూర్చి రాయబడిన ఈ కథలు ప్రైవేట్, ప్రభుత్వ అప్పుల బండారాన్ని, బాగోతాన్ని బయటపెడ్తున్నాయి. ప్రభుత్వ అప్పులు కూడా రైతుకేమంత ఉపయోగకరంగా లేవని వాటిపై ఉన్న భ్రమలను తొలగిస్తున్నాయి. షావుకార్లిచ్చే అప్పుల పైన్నే కాకుండా ప్రభుత్వ బ్యాంకులపై, వాళ్లిచ్చే అప్పులపై ఈ కథలు రాసిన రచయితలకు సదభిప్రాయం లేదు. ఈ కథల్లోని పాత్రలు, స్వభావాలు, అవింకా తెలంగాణా గ్రామాల్లో వేళ్లూనుకొని వుండటం గమనించవచ్చు. సంఘ బలంతో ప్రజలు ఈ అప్పులను ఎదుర్కోవడం, అప్పు కాగితాలను చింపివేయడం మనమీ కథల్లో చూడవచ్చు. సంఘాలు రైతు, కూలీలు అప్పులపై పోరాటాలు చేశాయని, అంతకు ముందున్న మధ్యతరగతి రైతు ఆలోచనకు భిన్నంగా అన్యాయపు బాకీలు ఎగవేసినా తప్పు లేదని చెప్పాయని అర్థం చేసుకోవచ్చు. రుణానందలహరి కథల్లా ఇవి కాల్పనిక కథలు కావు. తెలంగాణా జీవన వాస్తవికతను అక్షరీకరించిన మంచి కథలు. అప్పటి అప్పుల బాగోతాలకు ఆధునిక రూపమే ఫైనాన్సులు, షేర్లు, బ్యాంకు దివాళాల పేర్ల మీద జరుగుతున్న మోసాలు. నష్టపోయేది అదే మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి, అట్టడుగు జనాలే...

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 8 డిసెంబర్ 2003**

# ఏటికేతం బెట్టి ఎయిపుట్లు పండిత్తె...

మనది ప్రధానంగా వ్యావసాయిక దేశం. ఇప్పటికే దేశంలోని నాలుగింట మూడవ భాగం జనాలు వ్యవసాయం, వ్యవసాయాధార వృత్తులు, వ్యవసాయ కూలీలుగానే బతుకుతున్నారు. ప్రజల ఆకలిని తీర్చేది సర్వసంపదలకు సృష్టికర్తలైన రైతులు. దేశ ప్రజలకవసరమయ్యే అన్ని పంటలు పండించేది ఎటికేతంబెట్టి ఎయిపుట్లు పడించే రైతన్న. కానీ రైతుల బతుకు ఆ పాటలోని ఎన్నడో మెతుకురెగనన్నట్టే, గంజిలకు మెతుకెరగనన్నట్టే ఉంటుంది. అతివృష్టి, అనావృష్టి, నీటివసతి లేకపోవడం, పంటలు సరిగా పండకపోవడం, ఒకవేళ పండినా ఆ పంటకు ధరుండకపోవడం అతి మామూలు విషయాలు. మరో దిక్కు పెత్తందార్ల, ప్రభుత్వోద్యోగుల దోపిడీ, రుణభారం రైతును మరింత కుంగదీస్తున్నాయి. ఉన్న కాస్త భూమిని కూడా కోల్పోయి రైతు రైతుకూలీగా మారుతున్నాడు. గొర్రెను తినేవాడు పోయి బర్రెను తినేవాడొచ్చినట్టు ప్రభుత్వ విధానాలు రైతుకనుకూలంగా లేవు. సమస్యల సుడిగుండంలో ఇరుక్కున్న అన్నదాత ఆత్మహత్యలు చేసుకోవడం ఈ దేశంలోని విషాదం.

డెబ్బైలలో తెలంగాణాలో ప్రారంభమైన రైతాంగ పోరాటాల్లో భాగంగానే రైతు సమస్యలను తీసుకున్నారు. భూమి సమస్యే ఇరుసుగా జరిగిన ఈ పోరాటాలు కొందరు భూమిపుత్రులకు భూమి పంచడం వరకూ విస్తరించాయి. పి.వి. నరసింహారావుగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు కంటితుడుపు కొరకైనా ప్రవేశపెట్టిన భూసంస్కరణలు నామమాత్రంగానైనా అమలు జరిగుంటే తెలంగాణాలో విప్లవ పోరాటాలు మరికొంత ఆలస్యమయ్యుండేవేమో! ఏదేమైనా ఈ పోరాటాలు ప్రధానంగా రైతుకూలీలను, ఆ తర్వాత చిన్న రైతులను అక్కున చేర్చుకున్నాయి.

సమకాలీన పోరాటాలను సాహిత్యీకరించిన తెలంగాణా రచయితలు రైతు సమస్యలపై చేసిన పోరాటాలకనుగుణంగా రైతు హృదయాన్నర్థం చేసుకొని కథలు రాశారు. చిన్న రైతులతో పాటు రైతుకూలీలు, పాలేర్ల జీతాల పెంపు, వెట్టిపనులు, వెట్టి నిర్మూలనలాంటి విషయాలపై జరిగిన పోరాటాలను అక్షరీకరించారు. ఏటికేతం బెట్టి ఎయిపుట్లు పండించే రైతు, సర్వ విధాల పనులు చేసే కూలీలు ఏమీ లేనివాళ్లుగా ఉంటున్నా దుర్మార్గాన్ని, పోరాటావసరాన్ని గుర్తు చేస్తూ కథలు రాశారు. తెలంగాణా గ్రామాల్లో రెడ్లు గ్రామాధికారం చెలాయించే పోలీసు పటేండ్లు, పట్వారీలు, సర్పంచ్‌లు, జమీందార్లుగా ఉన్నారు. అట్లని అందరు రెడ్లూ భూస్వాములేం కారు. వాళ్లలో



ఎంతోమంది ఒంటి నాగలెవుసం చేసుకునే బక్కరైతులుగానూ ఉన్నారు. అలాంటి ఓ రైతుకు, పాలేరుకు మధ్య జరిగిన సంఘర్షణే తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన కథ 'పగలూ రేయీ శ్రమపడుతున్నా...' జీతం పెంచాలని పాలేరు, వ్యవసాయంలో తనకు కూలి కూడా పడటం లేదని రైతు వాదించుకుంటారు. నిజానికా ఇద్దరూ పీడితులే. వాళ్లిద్దరూ పగలూ రేయీ శ్రమపడుతున్నా పొట్ట గడవని వాళ్లే. అయినా వాళ్ల మధ్య సంఘర్షణ తప్పలేదు. 'తడి బట్టను వడిపెడితే నీళ్లెల్లుతయి కాని పొడిబట్టను వడి వెడ్తె వెళ్తయ్యా' అన్న రైతు మాటలు బక్క రైతుల స్థితిగతులను బయటపెడ్తున్నాయి. రైతుకూలీల పరిష్కారానికి ఇద్దరూ కలిసి పోరాడాలని చెప్పే కథ. పేరుకు వ్యవసాయ మార్కెట్. కాని అది వ్యవసాయదార్లకు ఉపయోగపడే మార్కెట్ కాదు.. దళారీలు, వ్యాపారుల ప్రయోజనాలు కాపాడేదే. ధాన్యం అమ్ముకోవడానికి వ్యవసాయ మార్కెట్‌కు పోయిన రైతుపై తెల్లబట్టలవాళ్ల దోపిడీని తేటతెల్లం చేసే కథ 'ఒక్కటైతే'. ప్రాజెక్టయినా, మరేదయినా ఉన్నవాళ్ల కోసం మాత్రమేనని చెప్పే గల్పిక 'గదీ సంగతి..'

కె. రామ్మోహన్ రాజు రాసిన గొల్ల కథ వాస్తవికతా పరిమళంతో, తెలంగాణా మాండలిక భాషా సౌరభంతో పరిఢవిల్లే చక్కని కథ. గ్రామాల్లో పేదరైతుల స్థితిగతులకు దర్పణం పట్టే మంచి కథ.. షావుకార్లు, పటేండ్లు, పెద్ద భూస్వాములు పేద రైతుతో ప్రవర్తించే తీరు ఈ కథలో అత్యంత వాస్తవికంగా చిత్రించబడింది. రైతు భార్యకు జబ్బు చేస్తే దవాఖానకు తీసుకెళ్లడానికెవరూ ఎడ్లబండినివ్వరు. ఎంత ప్రాధేయపడినా సాయం జెయ్యరు. 'నేను పేదోన్నిరా... నాకెవడు సాయం జేత్తార్రా?' అని తన భార్యను భుజం మీదేసుకొని గంభీరంగా నడుస్తాడా రైతు...

రైతుకూలీ యదార్థ జీవిత చిత్రణ ఉప్పల నరసింహం రాసిన అద్దం తిరిగిన కథ... సంఘ చైతన్యంతో తమపై జరుగుతున్న అన్యాయాలు, పీడనల గూర్చి నిజాలు తెలుసుకున్న పేద ప్రజలు జమీందార్లపై తిరుగుబాటు చేయడమే అంశంగా గల కథ. చక్కని మాండలిక భాషా ప్రయోగం ఈ కథకు వన్నె తెచ్చింది. విప్లవ కవి చెరబండరాజు గొప్ప రచయిత కూడా. స్వయంగా రైతయిన ఈ రచయితకు రైతుల కష్టాలన్నీ కరతలామలకమే. ఎంతగా కష్టపడ్డా గ్రామాల్లో డొక్కలు నిండక షావుకార్ల కబంధ హస్తాల్లో పడి గిలగిలా కొట్టుకుంటున్న బక్క రైతుల కథే శాంతి..

ఆరుగాలం పనిచేసినా ఎక్కడేసిన గొంగడి అక్కడే ఉన్నట్టు ఏడికి పోయినా ఏడే మాన్కలన్నట్టున్న సృష్టికర్తల బతుకు వెతలను తెలిపే కథ భస్మాసుర హసం. పొయ్యూదుతూ, ఇంటి పని చేసుకుంటూ తన రైతు కూలీ జీవితాన్ని, భర్త కష్టమయ

బతుకును మననం చేసుకుంటుంది సాయమ్మ. పటేలుపై ఆగ్రహం వెళ్లగక్కుతుంది. ఆమె భర్తను అంజిరెడ్డి కొడుతున్నాడని తెలియగానే విడిపించుకోవడానికి చీపురు చేతిలో పట్టుకొని పరుగులు తీస్తుంది కథ అడ్డం తిరిగింది కథలో...

రైతుకూలీల జీవితాలను గూర్చి తెలిపే ఈ కథల ద్వారా మనకనేక విషయాలు అవగతమయ్యే అవకాశముంది. ఈ కథలు వెలువడేనాటికి తెలంగాణా గ్రామాల్లో ఫ్యూడల్ సంస్కృతి బలంగా వేళ్లూనుకొని ఉన్నట్లు తెలుస్తుంది. దొరలు, భూస్వాముల దౌర్జన్యాలు, కూలినాలి జనంపై వాళ్లు చేసే అధికారం, చిన్న రైతులపై చేసే దోపిడీ అపరిమితంగా ఉన్నట్టు అర్థమవుతుంది. దొరల కంచెకు పెట్టిన కరెంటు తీగ్రతకి మరణించినా, మొగురాలకు కట్టేసి కూలీలను, పాలేర్లను విపరీతంగా బాదినా దిక్కులేని పరిస్థితే వుండేది. రైతుకూలీ సంఘాలు కూలీలకండగా నిలిచి పోరాటం చేయడం, వెట్టిలాంటి వాటికి విముక్తి కలిగించడం జరిగిందని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. రైతుకూలీలపై అధికారాలు చేసే దొరలు సంఘాలొచ్చింతర్వాత కోరలు తీసిన పాముల్లా మారడం, సంఘాలు తమ సమస్యలను పరిష్కరించి అక్కున చేర్చుకునేవని కూలీలు భావించడం ఈ కథలవల్ల తెలుసుకోవచ్చు.

గ్రామాల్లో రైతుకూలీ సంఘాల వల్ల విప్లవ పోరాటాల వల్ల మధ్యతరగతి రైతుకు పెద్దగా లాభం జరగకున్నా రైతుకూలీలకు మాత్రం విశేషంగా లాభం జరిగింది. కూలీరేట్లు, పాలేర్ల జీతాలు పెరగడం, కూలీల హక్కుల పరిరక్షణ జరిగిందని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. స్వాతంత్ర్యం వచ్చి దశాబ్దాలు గడిచినా సాంప్రదాయక పద్ధతుల్లోనే వ్యవసాయం చేయడం గమనించవచ్చు. రైతు జీవితాలపై కూలీల వెతలపై వచ్చి అద్భుత కథలివి.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 15 డిసెంబర్ 2003**



# బొగ్గు, బీడి కార్మికుల కథలు

మూడు దశాబ్దాలకు పైగా తెలంగాణాలో జరుగుతున్న రైతాంగ పోరాటాలకు ముఖ్య పార్శ్వం భూమి సమస్యే అయినా దాంతో పాటు అనేక పోరాటాలు జరుగుతున్నాయి. రజాకారు వ్యతిరేక పోరాట కాలంలో తెలంగాణాలో లేని పరిశ్రమలు దేశంలో ప్రారంభమైన పోరాటాల కాలంనాటికి విస్తరించాయి. దాంతో పాటు సంఘటిత కార్మిక వర్గమూ పెరిగింది. వ్యవసాయ, అసంఘటిత కార్మికవర్గం కంటే పరిశ్రమల్లో పనిచేసే సంఘటిత కార్మికవర్గం ఎక్కువ చైతన్యవంతమైంది. అందుకోసం కార్మిక వర్గపోరాటాలు పెరిగాయి. ఉద్యమాలు రైతాంగ పోరాటాలతో పాటు కార్మిక వర్గ పోరాటాలనూ తమవి చేసుకున్నాయి. దున్నేవాడికే భూమి చెందాలన్న తాత్విక దృక్పథంతో భూపోరాటాలు జరిగితే నడిపేవాళ్లకే మిల్లు చెందాలన్న తాత్వికతతోనూ, కార్మికుల శ్రమఫలితాన్ని దోచుకునే దోపిడీదారులనెదిరించాలనే దృక్పథంతోనూ కార్మిక పోరాటాలు జరిగాయి. ఈ పోరాటాల్లో ముఖ్యమైనవి సింగరేణి కార్మిక పోరాటాలు, బీడీ కార్మిక పోరాటాలు.

జరిగిన విషయాల గూర్చి ఆ తర్వాతి కాలంలో సాహిత్యం రావడం ఒక పార్శ్వమైతే, పోరాటాలు జరుగుతున్న కాలంలో సమకాలీన పోరాటాల గూర్చి సాహిత్య సృజన జరగడం మరో పార్శ్వం. సమకాలీన పోరాటాల గూర్చి కథలు రాయడం కొంత ఇబ్బందితో కూడుకున్న పనే. రజాకారు పోరాటాల గూర్చి తెలంగాణా నుంచి వచ్చిన కథల్లో చాలా కథలు పోరాటాలు ముగిసంతర్వాత వచ్చినవే. గోర్కీ, లూషన్ లాంటి మహా రచయితలు తమ దేశాల్లో జరుగుతున్న విప్లవాల గూర్చి పోరాటాలు జరుగుతున్న కాలంలోనే సాహిత్యాన్ని సృష్టించి పేరు ప్రఖ్యాతులతో పాటు అనేక ఇబ్బందులూ ఎదుర్కొన్నారు. తెలంగాణాలో కార్మికుల గూర్చి వచ్చిన కథలు పోరాటాలు ఉధృతంగా నడుస్తున్న కాలంలో వచ్చినవే. వస్తు సేకరణలో ఉద్యమాలు గణనీయమైన మార్పులు తెచ్చాయనడానికి తెలంగాణా నుంచి సింగరేణి కార్మికుల గూర్చి వచ్చిన కథలే మంచి ఉదాహరణలు.

ప్రపంచ విప్లవానికి, సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి జరిగే పోరాటాలకు కార్మిక వర్గమే నాయకత్వం వహిస్తుందన్న కారల్ మార్క్స్ భాష్యం మాటెలా ఉన్నా సింగరేణి పోరాటాలకు ఆ సమయంలో జరిగిన ఇతర పోరాటాలకు మాత్రం కార్మికుల నుంచి వచ్చినవాళ్లే నాయకత్వం వహించారు. వీళ్ల గూర్చి కథలు రాసినవాళ్లలో

చాలామంది కార్మికవర్గం నుంచి వచ్చినవాళ్లే కావడం విశేషం. కార్మిక వర్గం గురించి మీరెందుకు కథలు రాయడం లేదని కొకును అడిగితే నాకు తెలియని ఏ విషయం గురించయినా రాయాలన్న మాట అని ఇచ్చిన సమాధానాన్ని గుర్తుంచుకోవడం ముఖ్యం. ఏదేమైనా కార్మికుల్లోంచి, కార్మికవర్గంలోంచి వచ్చినవాళ్లు కార్మికుల గూర్చి రాసిన ఈ కథలు కార్మిక వర్గ పోరాటాలకు దర్పణాలనదగ్గవి.

తెలంగాణా బీడీ కార్మికుల గూర్చి వచ్చిన సాహిత్యం చాలా తక్కువే. బి.ఎస్. రాములు రాసిన 'బతుకుపోరు' బీడీ కార్మికుల గూర్చి వచ్చిన మొట్టమొదటి మంచి నవల. లాభాల కోసం పెట్టుబడిదారుడు ఆత్మహత్యయినా చేసుకుంటాడంటాడు మార్క్స్. యజమానులకుండే ధనదాహం వాళ్లతో ఎన్ని దౌర్జన్యాలనైనా చేయిస్తుంది. కార్మికులకు న్యాయంగా రావాల్సిన 20శాతం బోనస్‌ను లాభాలు లేవన్న నెపంతో పదిశాతం ఇవ్వడానికి ప్రయత్నిస్తాడు యజమాని. కార్మికులు న్యాయం కోసం సంఘటితంగా పోరాడటం పులుగు శ్రీనివాస్ కథ 'బోనస్'లోని అంశం. కార్మిక నాయకుడు చంద్రంను మోసపూరితంగా కరెంటు షాక్‌తో చంపిస్తాడు మేనేజర్. యజమానులెన్ని కుయుక్తులు పన్నినా తుది విజయం కార్మికులదేనని సింబాలిక్‌గా చెబుతాడు రచయిత. బొగ్గు ఆధారంగా ఎరువుల తయారీ అనే కొత్త టెక్నాలజీని అభివృద్ధి చెందిన దేశాలు మన డబ్బుతో మనపై ప్రయోగం చేయడాన్ని గూర్చి వ్యంగ్యంగా చెప్పే గల్పిక తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన 'ప్రయోగం'.

వేదాంతం పేరు చెబుతూ, చాతుర్వర్ణ వ్యవస్థను సమర్థిస్తూ మనమంతా ఒకే కుటుంబం వాళ్లమని మోసపూరిత ఉపన్యాసాలిస్తూ కూలివాళ్లతో ఎక్కువ పని చేయించుకుంటూ తక్కువ కూలి ఇచ్చే బతుక నేర్చిన వాడి కథ సృజన్ రాసిన 'ఆత్మశక్తి – ధీశక్తి'. నాయకులుగా చలామణి అవుతూ యాజమాన్యంతో కుమ్మక్కయి కార్మికులను మోసం చేసే దొంగ నాయకుల బండారాన్ని బయటపెట్టే కథ అల్లం రాజయ్య రాసిన 'పుట్ట గొడుగులు'. ఆస్పత్రి నుంచి గెంటివేయబడ్డ నిండు గర్భవతి, దొంగ రవాణాలో చిక్కుకున్న కార్మికుడు, రొట్టెలు చేసే అవ్వ – ఇలా దగాపడ్డ ఎందరెందరో జీవితాల ద్వారా ఎన్నో అనుభవాలు గడించి ప్రజా ఉద్యమాలే సమస్యల పరిష్కారానికి మార్గమని తెలుసుకున్న కార్మికుడి జీవిత చిత్రణే పులుగు శ్రీనివాస్ రాసిన 'పరిష్కారం'. పెట్టుబడిదారీ వ్యవస్థలోని పారిశ్రామికవేత్తలు మనిషి ప్రాణానికిచ్చే విలువ శూన్యమని అతడు లాభాల కోసం ఎంతమందినైనా బలి తీసుకుంటాడని తెలిపే కథ విమల రాసిన 'నరబలి'. తను సృష్టించే సంపదపై తనకే అధికారం లేని వైనాన్ని వర్ణించే కథ



కుంపటి. గని కార్మికుడు తన చెమటతో తడిసిన బొగ్గు పెల్లను కూడా తీసుకుపోలేని పరాయీకరణను అల్లం రాజయ్య ఈ కథలో అద్భుతంగా చిత్రించాడు.

తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన నీడ కోసం ఎన్నో నైతికాంశాలను వెలికితీసిన కథ పాతికేళ్లుగా గని కార్మికుడిగా పనిచేస్తున్నా ఇల్లు లేని పరిస్థితి కొడుక్కు పెళ్లి చేస్తే వాళ్లెక్కడుండాలో తెలియని స్థితి ఈ కథలో ఓ కార్మికుడి దృష్టి కోణంలోంచి చిత్రించబడింది. ఈ రచయిత రాసిందే నీళ్ల తగవు. నేను రాసిన నీళ్లు సింగరేణి కార్మికులు తాగే నీళ్లకోసం చేసిన పోరాటాలను అక్షరీకరించిన కథలు. ఈ రచయితలే రాసిన బొగ్గుపొరల్లో, వక్రమార్గం కథలు గని కార్మికుల స్థితిగతులను, మేనేజిమెంటు వాళ్లు కార్మికులను తప్పుదారిలో పెట్టడానికి పన్నే వక్రమార్గాలను చిత్రించిన కథలు. రైటర్లను కూడా తమలో కలుపుకోవాలని చెప్పే కథ సృజన్ రాసిన చెల్లు. తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన ఉరి, నా కథ ఉరితాడు ఫ్యాక్టరీ ఉద్యోగాలు కార్మికులకెలా ఉరితాళ్లవుతున్నాయో చెప్పే మంచికథలు. మరమగ్గాల కార్మికుల గూర్చి రాసిన వెంకన్న కథ నాడె, బీడీ కార్మికుల గూర్చి బి.ఎస్. రాములు రాసిన పోరు కార్మికుల గూర్చి వచ్చిన మంచి కథలు. ఇంకా సమ్మె, సమ్మె విస్తరణ, లీడర్, కొత్త ఎత్తు, నిర్బంధంలో సమ్మె, విజయం మనదే లాంటి కథలు తమ డిమాండ్ల సాధన కోసం కార్మికులు సమ్మెను ఆయుధంగా ఉపయోగించుకునే క్రమాన్ని తెలిపే కతలు. ఈ కథలన్నీ కార్మిక రాసిన నెలమ, పిచ్చోడు, అల్లం రాజయ్య రాసిన జైలు, జయ రాసిన క్లబ్బు, హెచ్చార్కె రాసిన బువ్వ జీతగాడు ఇందులో ఎన్నదగ్గవి.

గోదావరిలోయ పారిశ్రామిక ప్రాంతం నుంచే ఎక్కువగా వచ్చిన ఈ కథలు కార్మికున్ని హృదయానికి హత్తుకున్నాయి. తెలుగు కథా సాహిత్యంలో కార్మికులపై వచ్చిన కథల్లో ఎన్నదగిన కథలివి. వరుసగా కర్మాగారాల మూసివేతలు, ప్రైవేట్ మంత్ర జపం నిరాఘాటంగా సాగుతున్నా ప్రతిఘటన లేకపోవడం విషాదాల్లోకెల్లా విషాదం.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 2 ఫిబ్రవరి 2004**

# విద్యార్థులు - మేధావుల కథలు

నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతం కావాలంటే కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, మేధావులంతా పోరాటంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భాగస్వాములు కావాలన్నది సిద్ధాంతం. కార్మికులు, కర్షకులు ఎలాగూ ప్రజా పోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొంటారు. పోరాట జనానికి నైతిక బలం ఇచ్చేవారుగా, సలహాదారులుగా, వారి సమస్యలను వెలికి తీసేవారుగా, సిద్ధాంతకర్తలుగా మేధావులు పని చేస్తుంటారు. తెలంగాణా పోరాటాలకూ ఈ మేధావుల మద్దతుంది. అయితే ఈ పోరాటాలకే కాకుండా ఏ పోరాటాలకైనా మెజారిటీ మేధావివర్గం నుంచి లభించాల్సినంత మద్దతు లభించడం లేదన్నది వాస్తవం. చాలా మంది మేధావుల్లో ప్రజా సమస్యల పట్ల స్పందనే ఉండటం లేదు. చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష అనుకుంటూ తమ చుట్టే ఓ పరిధి గీసుకుని బతుకుతున్న వాళ్లే ఎక్కువ. కొందరు మేధావులకు పుస్తకజ్ఞానం తప్ప సామాజిక అవగాహనే మాత్రమూ లేకుంటే మరికొందరు ఉద్యమాలకు తప్పుడు భాష్యాలు చెప్పేవారున్నారు.

ప్రజా పోరాటాలకు మద్దతునిస్తున్న మేధావుల గూర్చి, మేధావులుగా చలామణి అవుతున్న కుహనా మేధావుల గూర్చి, వారి అజ్ఞానాన్ని గూర్చి మంచి కథలే వచ్చాయి. మేధావులు మెజారిటీగా ఉన్న ప్రజలకుపయోగపడాల్సిన అవసరాన్ని గూర్చి, వారి మేధాసంపత్తిని సామాన్య ప్రజల ప్రయోజనాల కోసం ఉపయోగించాల్సిన అవసరం గూర్చి కథలొచ్చాయి. మేధావుల్లో ఉన్న జడత్వాన్ని వదిలించి సమాజం పట్ల అవగాహనను కలిగించే కథలూ వచ్చాయి.

ప్రజా ఉద్యమాల్లో ఏదో విధంగా పాల్గొనే బలమైన వర్గం విద్యార్థులు.. చాలా విషయాల్లో విద్యార్థులు నిర్ణాయక శక్తులుగా మారడం గమనిస్తూనే ఉన్నాం. సలసల మరిగే వేడిరక్తం గల విద్యార్థులు ప్రజోద్యమాలకు స్పందించిన వాళ్లున్నారు. అందుకే యువకుల గూర్చి శ్రీశ్రీ కొంత మంది యువకులు రాబోవు యుగం దూతలు.. పావన నవజీవన బృందావన నిర్మాతలు అన్నాడు. అదే శ్రీశ్రీ తిరోగమన భావాల ఊబిలో దిగబడిపోయిన యువకుల గూర్చి కొంత మంది యువకులు పుట్టుకతో వృద్ధులు... నాన్నగారి తాతగారి భావాలకు దాసులు అన్నాడు. ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాల్లోనూ, ఇటీవలి ప్రజా ఉద్యమాల్లోనూ విద్యార్థులు, విద్యార్థి యూనియన్లు ప్రముఖ పాత్రే వహించాయి.

విద్యార్థులు విద్యా సంబంధమైన సమస్యల గూర్చి, హాస్టల్ స్థితిగతుల గూర్చి,



నిజ జీవితంలో ఉపయోగపడని చదువుల గూర్చి, ప్రజా సమస్యల గూర్చి చేసిన పోరాటాలను కథలుగా మలిచారు రచయితలు.

ధనవంతులు, పేదవాళ్ల మధ్య చదువుకునే సమయంలోనూ చూపే వివక్షను, వ్యత్యాసాలను నిలదీసి ప్రశ్నిస్తున్న కత డి. అమర్ రాసిన (....?). పసిపిల్లల హృదయాల్లో సామాజిక వ్యత్యాసాల బీజాలను నాటే దుష్ట సాంప్రదాయాల్ని ఖండిస్తుందీ కథ. సైకిలమ్మి ఫీజు కట్టే అటెండర్ కొడుకు, దర్జాగా కార్లో బడికెళ్లే ఆఫీసర్‌గారి కొడుకు మధ్యగల సామాజిక వ్యత్యాసాలను ప్రశ్నిస్తాడు రచయిత. అందుకుగల కారణాలను అన్వేషిస్తాడు. ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో విద్యార్థులు, ఉపాధ్యాయులు, మేధావులందరిపై ప్రభుత్వ యంత్రాంగం జరిపిన హింసను, టార్చర్‌ను తెలిపే కథ ఉపాధ్యాయ రాసిన 'పాఠశాల'. డ్రామా వేయించిన నేరానికి విప్లవ పాఠాలు బోధించాడని, అండర్‌గ్రౌండ్‌లో ఉన్న విప్లవకారుల గూర్చి చెప్పమని ఉపాధ్యాయున్ని, కరపత్రాలు పంచాడని విద్యార్థిని జైల్లో పెడతారు పోలీసులు. అయితే ఆ జైలే నిజమైన పాఠశాలవుతుంది వాళ్లకు. ఉద్యమాలున్న ప్రాంతంలో యువకులు, విద్యార్థులపై జరిపే హింసను, టార్చర్‌ను అక్షరీకరించిన కత కిరణ్ రాసిన 'మనుషుల వేట'. లాకప్‌లో మరణించిన ఆ విద్యార్థిని ఎన్‌కౌంటర్‌లో మరణించినట్టు చెబుతారు. ఆ తతంగాన్నంతా ప్రత్యక్షంగా చూసిన మానవత్వమున్న పోలీసు కానిస్టేబుల్ 'ఏ తండ్రి కన్నరో నా తండ్రీ...! నువ్వు సింహం బోనులో దిక్కులేని సావు సచ్చినవ్' అని వాపోతాడు.

పోలీసుల సమ్మెకు మద్దతు తెలిపి అరెస్టయిన విద్యార్థుల గూర్చి తెలిపే కథ సి. హెచ్. మధు రాసిన 'అనుభూతి లేదా నాకు బెయిల్ దొరకలేదు'. రాబోయే యుగం దూతల్లాంటి వారయిన విద్యార్థులు న్యాయసమ్మతమైన ఏ పోరాటానికైనా మద్దతిస్తారు. దేశానికి, దేశభవిష్యత్తుకు, రాబోయే తరానికి పునాది రాళ్ల వంటి వాళ్లయిన విద్యార్థుల ఔన్నత్యాన్ని చిత్రీకరించిన కథ అమరజ్యోతి రాసిన 'పునాదిరాళ్లు'. ఒక్క పూటకు కూడా తిండిలేని దుర్భర పేదరికంలో వున్న రవి కుటుంబంలో ఆతని తండ్రి రోజూ తల్లిని కొడుతుంటాడు. అలాంటి పరిస్థితులు విద్యార్థులపై చూపే ప్రభావాన్ని కథలో వాస్తవికంగా చిత్రించారు.

సాంఘిక సంక్షేమ హాస్టళ్లలో విద్యార్థుల దుస్థితిని, అధికార్ల లాలూచీని, ప్రభుత్వం నుండి లభించే స్వల్పమైన సహాన్నయినా విద్యార్థులకందనీయని పరిస్థితులను తెలిపే కథ క్రాంతికిరణ్ రాసిన 'కడుపు మండితే...' ఉద్యమాలు లేకముందు హాస్టళ్లలో అధికార్లదే ఇష్టారాజ్యంగా సాగితే ఉద్యమాలొచ్చింతర్వాత విద్యార్థులు తమకు జరుగుతున్న అన్యాయాలను ప్రశ్నించే చైతన్యాన్ని అలవరుచుకున్నారు.

ఆర్థిక ఇబ్బందులే తప్ప స్వాతంత్ర్యోద్యమంలో........ తల్లులు... లడ్డూల కోసమని డబ్బులు వసూలు చేసి ............. హెడ్‌మాస్టర్లు.... చదువుకునే అవకాశమే లేని పేద పిల్లలున్న దేశంలో స్వాతంత్ర్యం వచ్చిందని చెప్పబడుతున్నా అది పేదలకు రాలేదని, వాళ్ల బతుకులేం మారలేదని తెలిపే కథ నూతన్ రాసిన 'సాసంత్రం'. జెండా వందనానికి కొత్త బట్టలు కుట్టించుకునే స్థితిలో లేని పేదరికంతో ఎంతో మంది విద్యార్థులుంటే స్వాతంత్ర్యం ఎవరికొచ్చినట్టు...? వార్తపత్రికలను రోజూ చదివే మేధావులున్నారు. మధ్యతరగతివాళ్లున్నారు. ఇంకా చాలా మందే ఉన్నారు. రోజూ పేపర్లో మునుగుతూ ప్రపంచాన్ని చుట్టి వస్తున్నా వివిధ రకాల సామాజిక సమస్యలకు గల మూలాలను తెలుసుకోలేని వృత్తుల గూర్చి చెప్పే కథ అల్లం రాజయ్య రాసిన 'మూలం'. జీతం పెరిగినా దరిద్రం, పిల్లలకు చిన్న సైకిల్ కూడా కొనివ్వలేని అశక్తత. అంతరాలను బోధించే తల్లిదండ్రులు... దేశం నిండా కొట్లాటలు... కాల్పులు.. సంఘాలు... విచారణలు... ఇవన్నీ ఎందుకు జరుగుతున్నాయో రోజూ పేపర్ చదువుతున్నా తెలుసుకోలేని ఉద్యోగి మధ్యతరగతి మనస్తత్వాన్ని సున్నితంగా ఎద్దేవా చేసే కథ.

సాహిత్యం, కళలు ప్రజల పక్షం వహించాలని, వాటిని సృష్టించే మేధావులైన రచయితలు, ఎడిటర్లు ప్రజలను పట్టించుకొని రాయాలని, మెజారిటీగా ఉన్న సామాన్యజనం గూర్చి మేధావులు స్పందించాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తున్నాయి. కేవలం డబ్బు సంపాదనలో తలమునకలయ్యే వ్యక్తి కంటే సామాజిక కార్యక్రమాల్లో, ఉద్యమాల్లో మునిగితేలే వ్యక్తే ఎక్కువ సంతృప్తికరంగా బతుకుతాడని, అతడి జీవితమే ఉపయోగకరమైందని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. ఇప్పుడున్న చదువులకంటే సమాజాన్ని గూర్చి అవగాహన కలిగించే చదువులే అసలైన చదువులని తెలియజేస్తున్నాయి. ఉన్నవాళ్ల ప్రయోజనాలు కాపాడే ఈ చదువులు ఉన్నంత వరకైనా పేదలకందుబాటులో లేవని, పేదవాడు చదువుకోవడం ఇప్పటికీ సమస్యగానే ఉందని ఈ కథలు రాసిన రచయితల అభిప్రాయం. ఈ వ్యవస్థలో మేధావులు, రచయితలు, విద్యార్థులు నిర్వహించాల్సిన పాత్రను స్పష్టంగా చెబుతున్నాయీ కథలు. శిల్ప ప్రమాణాలతో పోలిస్తే ఇవి గొప్ప కథలు కాకున్నా ప్రయోజనం దృష్ట్యా కర్తవ్యాన్ని బోధించే మంచి కథలే...



# త్రిశంకు వర్గాల కథలు

రోజూ ఆవకాయ తిన్నట్టు రోటీన్ అలవాటైన
బల్లపరుపు జీవితం కింద కాషన్‌గా దాచిన
కోర్కెల సీక్రెట్ బాక్స్‌లోంచి తీసి
ఉద్రేకాన్ని సెక్సునూ శృంగారాన్ని
క్రిమ్‌నీ షాక్‌నీ లాటరీ కాగితాల్నీ
చాటుకుండా చూసుకొని నవ్వుకొని మీసం మెలేసుకొని
మాట్లాడకుండా జెంటిల్‌మెన్‌లా
మత్తుగా పడుకుంది గొంగళిపురుగు

అంటారు మధ్యతరగతి జీవుల గూర్చి బాలగంగాధర తిలక్. అటు పైకీ పోలేక ఇటు కిందికీ రాలేక త్రిశంకు స్వర్గంలో కొట్టుమిట్టాడుతూ బతికే గొంగళి పురుగుల్లాంటి వాళ్లు వీళ్లు. వీళ్లకు కడుపు పూర్తిగా నిండకున్నా చాలీచాలని విధంగానైనా నిండుతుంది. కాబట్టి ఈ వ్యవస్థపై చాలా భ్రమలుంటాయి. ఈ వ్యవస్థలో తమకేదో భద్రత ఉందని, ఈ జీవితంలో తామేదో బాముకుంటామన్న కోర్కెలుంటాయి. ఆ భద్రత ఎండమావిలాంటిదేనని అనుభవంలోకి వచ్చినా వీళ్లు కదలరూ మెదలరు. ఈ వర్గానిదెప్పుడూ ఊగిసలాటే. అట్టడుగు వర్గం జనంలా వీళ్లు తాడోపేడో తేల్చుకోలేరు. అడిగినంత కట్నమిచ్చి కూతురు పెళ్లి చేయలేరు. ఎటూ తేల్చుకోలేని వీళ్లకు పెద్ద భయం పెద్ద ఆస్తి. అయితే విలువలంటూ ఏ మేరకైనా బతికున్నాయంటే అవీ వర్గంలోనే...

సాధారణంగా ఈ మధ్యతరగతి ప్రజలు ఉద్యమాల వెంట నడువరు. నడిస్తే ఏదో పోతుందన్న భయం. చాలా ఉద్యమాలు విజయవంతం కాకపోవడానికి కారణం మధ్యతరగతి జీవుల క్రియారాహిత్యమే. స్వతంత్ర పోరాట కాలంలో మాత్రం ఈ మధ్య తరగతి పోరాటంలో పాల్గొన్నారు.

డెబ్బైలలో అంటే తెలంగాణాలో భూపోరాట ఉద్యమాలు ప్రారంభమైన కాలంలో తెలంగాణాలో మధ్యతరగతి చాలా తక్కువ. అందుకే ఉద్యమాలెక్కువ. ఆ తర్వాత మధ్యతరగతి కొంత పెరిగింది. బిసి దళిత శ్రామికవర్గాల నుంచి మధ్యతరగతి ఎదిగింతర్వాత ఉద్యమాలకు కొంత మద్దతు తగ్గింది. ఈ వర్గంలో కృత్రిమ విలువలు పెరిగాయి. కుహనా భద్రతా భావమూ పెరిగింది. ఈ మధ్య తరగతి జీవుల గూర్చి

వచ్చిన పోరాట కథల్లో కోస్తా ప్రాంతం నుంచి వచ్చిన కథలే ఎక్కువ. కొ.కు. వరకు వచ్చిన కథల్లో చాలావరకు మధ్యతరగతి దృష్టి కోణంలోంచి వచ్చినవే. ముగింపులూ మధ్యతరగతివే. కొకు మాత్రం మధ్యతరగతి జీవితాలనే తీసుకున్నా కార్మికవర్గ దృక్పథంతో ముగింపులిచ్చారు. తెలంగాణాలో చాలా కాలం వరకు మధ్యతరగతి లేదు. కాబట్టి వాళ్ల గురించి కథలంతగా రాలేదు. దీన్ని చూసే మధ్యతరగతి దృష్టికోణంలోంచి మాత్రమే చూసే విమర్శకులు కొందరు తెలంగాణా నుంచి కథలే రావడం లేదన్నారు. ఆ వర్గం గూర్చి రాయడం ప్రారంభమైన తర్వాతే ఇక్కణ్నుంచి కథలొస్తున్నాయని సెలవిచ్చినవారూ ఉన్నారు. పోరాటాలు ఉధృతంగా జరుగుతున్న 1970-90 మధ్యకాలంలో తెలంగాణా నుంచి మధ్యతరగతి జీవుల గూర్చి కొన్ని కథలు వచ్చాయి. ఇందులో విషయం మధ్యతరగతిదే అయినా ముగింపులు మాత్రం కార్మికవర్గ దృక్కోణంలోంచి ఇచ్చినవే..

చాలీచాలని జీతం పొందే వేతన జీవుల బతుకుల్లోని విషాదాన్ని చిన్న చిన్న అవసరాలను కూడా తీర్చుకోలేని అశక్తతను వివరించే కత చెరబండరాజు రాసిన 'పలకాబలపం'. జీతం వచ్చిన నాటికంటే అప్పు పుట్టిన రోజే ఎక్కువ సంతోషం, గర్వం అనుభవించే ఉద్యోగి బతుకులోని దైన్యతను, కూతురు కొనియ్యమన్న పలకాబలపం కూడా కొనియ్యలేని దుస్థితిని, మధ్యతరగతి బతుకుల్లోని అశక్తతను తెలిపే మంచి కథ... ప్రభుత్వం సమర్పించే బడ్జెట్‌లు జీతం రాళ్లు వారి బతుకులతో ఆడుకుంటున్న ఆటలు. ఇంట్లో అనివార్యంగా ఏ చిన్న ఖర్చు పెరిగినా ఆ ఖర్చును పూడ్చుకోవడానికి గుమస్తా బతుకుల వాళ్లు ఉపవాసముండాల్సి వస్తున్న పరిస్థితులను గూర్చి తెలుపుతున్న కథ నందిగం కృష్ణ రాసిన 'జేబు కొట్టేసారు'. ప్రతి బడ్జెట్ ముందూ ధరలు పెరిగి బొటాబొటి జీతగాళ్ల బతుకుల్లో కలవరాన్ని, కల్లోలాన్ని లేపుతున్నాయి. తన జేబునెవరో కొట్టేశారని భావించిన ఉద్యోగి అసలు జేబుదొంగ కొత్త బడ్జెట్ వల్ల జరిగిన ధరల పెరుగుదల అని, అందువల్ల జీతం ఇరవై రోజులకే సరిపోతుందని తెలుసుకొని ఆశ్చర్యపోతాడు. ఉద్యోగుల జీవితాల్లో కలవరం లేపుతున్న జేబుదొంగల్లాంటి బడ్జెట్‌ల బండారాన్ని బయటపెడ్తూ వాటిని గూర్చి జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తుందీ కథ.

అవసరాల కోసం, ఆకలి కోసం కొందరు తప్పనిసరిగా పరిస్థితుల్లో దొంగలవుతుంటే, చట్టాన్ని చేతుల్లో ఉంచుకున్న వాళ్లే కనబడని దొంగలుగా ఉన్న వ్యవస్థను, సామాజిక విలువలను ప్రశ్నించే కథ ఉదయ శరత్ రాసిన 'దొంగలు'. బంగారం దోచుకొని వచ్చిన వ్యక్తి చేతుల్లోంచి గొలుసును లాక్కుంటారు పోలీసులు.



తామ... ...న మోటారు సామాన్ల దొంగతనాన్ని ఒప్పింపజేసి జైలుకు పంపిస్తారు. జైల్లో ...ర్థుల ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకొని ఈ సమాజంలోని అసలు దొ... స్వరూపాన్ని అర్థం చేసుకుంటాడా దొంగ. పోరాటాలు జరుగుతున్న కాలంలో జైళ్ల ...ఠశాలలవుతాయి. మాలోని వాడివే మా వాడివే నీవు, పొట్టకూటికి నీవు పోలీసువైనావు అన్నాడు పోలీసుల గూర్చి చెరబండరాజు. పోలీసు ఉద్యోగం చేస్తున్న వాడి మనస్తత్వాన్ని వివరించే కథే రామేశం రాసిన మాలోనివాడివే. ఓ కానిస్టేబుల్ బావమరిది వరుసున్న వ్యక్తితో పోలీసు జులుం గూర్చి, పోలీసులు విద్యార్థులను కొట్టిన వైనం గూర్చి చెబుతుంటాడు. పోలీసులతో తగాదాలు, సంబంధాలు పెట్టుకోవద్దని చెబుతూనే అతని కొడుకు ఎర్రజెండా పార్టీలో తిరిగే విషయాన్ని ప్రస్తావిస్తాడు. తాను పోలీసై వుండగా తన కొడుకు ఎర్రజెండా పార్టీలో ఉండటం నేరంగా భావిస్తాడు.

ప్రజల కనీసావసరాలు తీర్చడానికి డబ్బుల్లేవనే ప్రభుత్వాలు, కోట్ల రూపాయల అప్పులు చేసి ఆసియాడ్ క్రీడలను నిర్వహించిన వైనాన్ని ఓ మధ్యతరగతివాడి దృక్కోణంలోంచి వివరించే కథ సిహెచ్. మధు రాసిన 'ఆసియాడ్'. ఓ మధ్యతరగతి ఉద్యోగి తనలో తానే మథనపడుతుంటాడు. అయితే పైకి గట్టిగా అనలేని అశక్తత.. స్కాలర్‌షిప్పులు ఇవ్వడానికి, విద్యాలయాలు కట్టడానికి, ఉపాధ్యాయులకు జీతాలివ్వడానికి లేని డబ్బులు ఆటల కోసముంటాయా అని ఆవేదన పడతాడు. ఆసియాడ్ ముందు కుబేరులుగా, అప్పిచ్చే దేశాల ముందు బిచ్చగాళ్లుగా ఉంటున్న వైనాన్ని వేలకోట్ల అప్పు చేసి ప్రజలపై భారాన్ని మోపే విధానాన్ని మధ్యతరగతి ఉద్యోగి దృక్కోణంలోంచి వివరించే మంచి కథ. ప్రజల కనీసావసరాలను తీర్చాల్సిన ప్రభుత్వ బాధ్యతను గుర్తు చేసే కథ. అయితే ఉద్యోగి ఈ కథలో తన ఆవేదనను వ్యక్తపరుస్తాడు కానీ తన మనస్తత్వానికి భిన్నంగా ఆక్రోశాన్ని వెళ్లగక్కడు.

పోరాట పత్రికల్లో కాకుండా బయటి పత్రికల్లో త్రిశంకు వర్గ బతుకులపై అనేక కథలొచ్చాయి. తెలంగాణా నుంచి మధ్యతరగతి గూర్చి విరివిగా కథలు రావడం తొంబైల తర్వాత మొదలయింది. అప్పటికి మధ్యతరగతి స్థిరపడింది.

మధ్యతరగతి మనస్తత్వాన్ని ఎక్స్‌రే తీసి చూపుతూ ఆ మనస్తత్వం నుంచి బయటపడాల్సి... ...వసరాన్ని నొక్కి చెబుతున్నాయీ కథలు.

మధ్య...తి బతుకుల్లోని విషాదాన్ని, మధ్యతరగతి జీవుల అల్ప సంతోష మనస్తత్వాన్ని ...... జీతంరాళ్లు వాళ్ల బతుకుల్లో లేపుతున్న కల్లోలాల్ని ఈ కథలు స్పష్టంగా చేస్తు... ...యి. ఈ కథలు రాసిన రచయితలకు మధ్యతరగతి బతుకులపై

సానుభూతుంది. కాని వాళ్ల త్రిశంకు స్వర్గంలో కొట్టుమిట్లాడుతుండటం పట్ల ఆగ్రహముంది. మధ్యతరగతి కృత్రిమ విలువలను భగ్నం చేయాల్సిన అవసరాన్ని కథలు చెబుతున్నాయి. తమ సమస్యల పరిష్కారానికి పోరాటమే శరణ్యమని సెలవిస్తున్నాయి. ఇప్పుడు మరింత దుర్మార్గంగా మధ్యతరగతి బతుకులే ప్రశ్నార్థకాలు అవుతుండటం రచయితలను కదిలించాల్సి ఉంది. త్రిశంకువర్గంలో కదలిక రాందే ఏ ఉద్యమమూ విజయవంతం కాదు గదా!

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 26 జనవరి 2004**



# స్త్రీ పోరాట కథ

సమాజం మాతృస్వామ్య వ్యవస్థ నుండి పితృస్వామ్య వ్యవస్థలోకి మారింతర్వాత స్త్రీపై కట్టుబాట్లు విధించి ఆమెను వంటింటికే పరిమితం చేయడం జరిగింది. కార్యేషు దాసీ, శయనేషు రంభా అని నియమాలు విధించి అబలను చేసి ఆమెపై రకరకాలుగా దోపిడీని అమలు చేసిందీ వ్యవస్థ. రాచరిక వ్యవస్థలో స్త్రీ అంటే భోగవస్తువే. భూస్వామ్య వ్యవస్థలోనూ ఆమెకున్న స్థానం శూన్యమే. పెట్టుబడిదారీ వ్యవస్థలో స్త్రీ ఒక విలాస వస్తువు. ప్రాచీన కాలం నుండి కూడా స్త్రీల గూర్చి కొద్దో గొప్పో పోరాటాలు జరిగినా వాళ్ల పరిస్థితుల్లో వచ్చిన మార్పులు అతి స్వల్పం. ఒక్క సోషలిస్టు వ్యవస్థలోనే స్త్రీని పురుషుడితో సమానంగా చూడటం జరుగుతుంది. అయితే ఇటీవలి పోరాటాలను స్త్రీల సమస్యలను ప్రత్యేకంగా చూడలేదు. నూతన ప్రజాస్వామిక పోరాటాల్లో భాగంగానే స్త్రీల సమస్యలపై కూడా పోరాటాలు చేశారు. ఈ పోరాటాలను సమర్థిస్తూ వచ్చిన కథల్లో స్త్రీల గూర్చి వచ్చిన కథలూ ఉన్నాయి.

ఆధునిక స్త్రీ చరిత్రను తిరగరాస్తుందని స్త్రీపై అపార నమ్మకంతో స్త్రీనే కేంద్ర బిందువుగా తీసుకొని కథలు రాశాడు గురజాడ. స్త్రీల సమస్యలపై చలం, రంగనాయకమ్మ చక్కని కథలు రాసి తెలుగు సాహిత్యంలో స్త్రీల కథలకు గట్టి పునాదే వేశారు. ఓల్గా ఇతర స్త్రీవాద రచయితలు ఈ పరంపరను మరింత బలంగా ముందుకు తీసుకెళ్లారు. 1970-90 ప్రాంతంలో పోరాట పత్రికల్లో స్త్రీల గూర్చి గణనీయమైన సంఖ్యలో కథలొచ్చాయి. ఇందులో ప్రగతిశీల దృక్పథంతో రాసిన కథలనేకమున్నాయి. ఈ కథల్లో స్త్రీలపై జరుగుతున్న లైంగిక దోపిడీ, స్త్రీపురుష సంబంధాలు, కుహనా ప్రేమలు, విలువలను గూర్చి ప్రశ్నించడం గమనించవచ్చు. పురుషాహంకారం, కుహనా అభ్యుదయం, స్త్రీపై జరిగే ఆర్థిక దోపిడీలాంటి అనేక విషయాలను సరియైన అవగాహనతో చిత్రించారు రచయితలు. విమోచనోద్యమాలు, రైతాంగ పోరాటాలు, వ్యవస్థలో వచ్చే సమూల మార్పులే స్త్రీ పరిస్థితిలో మార్పు తీసుకొస్తాయని అందుకోసం వ్యవస్థను సమూలంగా మార్చాలని ఈ కథలు చెబుతున్నాయి.

వ్యవస్థ మార్పుకు పైపైపూతలు, చర్యలు సరిపోవని విప్లవమనే శస్త్రచికిత్స ద్వారానే అది సాధ్యమవుతుందని నమ్ముతూ కథలు రాశారు. స్త్రీలో చెల్లిని, తల్లిని, సహధర్మచారిణిని చూడాలి కాని కేవలం భోగవస్తువుగా చూసే సంస్కృతిని నిరసించాలని ఈ కథలు చెబుతున్నాయి. ఈ విషయాల గూర్చే చెబుతూ తెలంగాణా

నుంచి వచ్చిన కొన్ని కథలు స్త్రీకి మనోధైర్యాన్ని, సాహసాన్ని, తిరుగుబాటు తత్వాన్ని నేర్పాయి.

కూలినాలి జనాల్లో ఉండే తెగింపు మధ్యతరగతి జనాల్లో ఉండదు. విధవా వివాహాల్లాంటివి అట్టడుగు జనాల్లో సమస్యలే కావు. చిన్న వయసులోనే విధవగా మారి నిత్యం అత్తమామల గుణింపులు పడుతూ కాలం గడుపుతున్న అమ్మాయి సీతతో పాలేరు తమ కుటుంబాల్లో జరిగే విధవా వివాహాల గూర్చి చెబుతాడు. పాలేరుకదో సమస్యే కాకుంటే ఆదర్శాలు మాట్లాడే యువకుడు తాను విధవను పెళ్లి చేసుకుంటానికి తల్లిదండ్రుల అభ్యంతరాన్ని, నిరుద్యోగాన్ని సాకుగా చూపుతూ తనను తాను మభ్యపెట్టుకుంటాడు. కుహనా సంస్కర్తల, కుహనా అభ్యుదయవాదుల బండారాన్ని మధ్యతరగతి విలువలతో సతమతమయ్యే కుటుంబాల్లో స్త్రీ పరిస్థితిని వివరించే కథ చేతన్ రాసిన 'ఆదర్శం'. మగవాడి దౌర్జన్యం, అహంకారం నుండి స్త్రీ తనను తాను కాపాడుకోవాలి. ఆమె తన కాళ్లపై తాను నిలబడినప్పుడే ఇది సాధ్యమవుతుందని, స్త్రీలు కళ్లు తెరవాల్సిన అవసరాన్ని గుర్తు చేసే కథే విమల రాసిన 'విలువలు'. స్త్రీల గూర్చి పెద్ద పెద్ద ఉపన్యాసాలిస్తూ మాటలకూ, చేతలకూ పొంతన లేకుండా బతికే కుహనా అభ్యుదయవాది బండారాన్ని బయటపెట్టే కథ 'స్త్రీ జనోద్ధరణ'.

ఉద్యమాలు, రైతాంగ పోరాటాలు స్త్రీలలో చైతన్యాన్ని నింపాయి. కట్నం పేరుతో భర్త వేధింపులకు, హింసలకు గురయిన స్త్రీ భర్తపై తిరగబడుతుంది. ఇంతవరకు తను చేసిన పనికి ఖరీదివ్వమని నిలదీసి ప్రశ్నించడం అంశంగా గల కథ ఎస్. జయ రాసిన 'ఖరీదు'. స్త్రీ తనను తాను తెలుసుకొని తిరగబడ్డప్పుడే ఆమె సమస్యలు పరిష్కారమవుతాయని తెలుపుతుందీ కత. స్త్రీ పరాధీన బతుకును, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని వివరించే కథ హెచ్చార్కె రాసిన 'అమ్మ'. ఇంటి కోసం తన సర్వస్వాన్ని ధారబోస్తున్నా ఆమె ప్రతి చిన్న విషయానికీ భర్త ముందు భయపడుతూనే ఉంటుంది. తమ విలాసాలకు వేలు ఖర్చు చేసే పురుషులు స్త్రీలపై మాత్రం ఎన్నో కట్టుబాట్లు విధిస్తారు. పట్టుచీర పోగొట్టుకున్నందుకు ఆమె గజగజా వణుకుతుంది. ఆమె భయంలో ఎన్నో భావాలు, భయంకర కాలమేఘాలు, చేదు అనుభవాలను చూసిన కూతురు తల్లి పరిస్థితికి జాలి పడుతుంది.

స్త్రీని కించపరిచే విధంగా వ్యాపార వస్తువుగా ప్రకటనల్లో అసభ్యంగా చిత్రించే నైచ్యాన్ని, అందాల పోటీల్లోని బండారాన్ని బయటపెట్టే కథ సాక్షి రాసిన మిస్ ఇండియా. గుడ్డలిప్పేసి సముద్రంలోకి ఉరుకుతున్నట్లు చూపే వ్యాపార ప్రకటనకూ, స్త్రీ శరీరంతో



వ్యాపారం చేసే బ్రోకరిజానికి తేడా లేదంటాడు రచయిత. పురుషస్వామ్య వ్యవస్థలో పురుషుడు తన అహంకారాన్ని ప్రదర్శించడం కోసం భార్యను హింసించే మనస్తత్వాన్ని తెలిపే కథ నవీన్ రాసిన 'తీరని కోరిక'. తన శాడిస్టు మెంటాలిటీని సంతృప్తి పరుచుకోవడానికి కొందరు, తమ ఆధిపత్యం చాటుకోవడానికి ఇంకొందరు స్త్రీలను హింసించి రాక్షసానందం పొందుతారు. బయట ఎవరినీ ఏం చేయలేని వాడికి భార్యే అలుసుగా లభించడం ఈ సమాజంలో జరుగుతున్నదే. ప్రభుత్వ యంత్రాంగంలో ముఖ్యభాగమైన పోలీసు డిపార్ట్‌మెంట్ స్త్రీ శీలానికిచ్చే విలువను, ఈ సమాజంలో స్త్రీకున్న స్థానాన్ని గూర్చి ప్రశ్నింపజేసే కథ హెచ్చార్కె రాసిన 'అతిథి సత్కారం'. ఇంటికి అతిథిగా వచ్చిన మిత్రుడికి తాను రైడ్ చేసి పట్టుకున్న స్త్రీని కానుకగా పంపిన ఎస్సైగారి రాక్షసత్వాన్ని తెలిపే కథ. మన పురాణాల్లో అతిథుల దగ్గరకు తమ కన్యలను పంపితే ఇక్కడ పరాయి స్త్రీలను పంపుతారు రక్షకభటులు. స్త్రీని కేవలం శారీరక సుఖాలనిచ్చే దానిగా చూపే నైచ్యాన్ని ప్రశ్నిస్తున్న కథ.

తల్లిగా స్త్రీ... కూతురుగా స్త్రీ... ఆకాశంలో సగంగా ఉన్న స్త్రీల సమస్యలపై వచ్చిన మంచి కథలివి. ఈ కథలు రాసిన రచయితలకు స్త్రీలపై ప్రగాఢమైన సానుభూతుంది. వాళ్ల సమస్యలపై చక్కని అవగాహనుంది. దళిత రచయితలే దళిత సమస్యలను, స్త్రీలే స్త్రీ సమస్యలను బాగా చిత్రించగలరన్న వాదం సబబైనదే అయినా అవగాహన, ఆర్తి అంటూ ఉంటే ఎవరివి వాళ్లు కాకున్నా బాగానే చిత్రించగలరని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. స్త్రీలపై రకరకాల దోపిడీ జరుగుతున్న కాలంలో పోరాటాలు స్త్రీల సమస్యలను కూడా తమ పోరాటాల్లో భాగంగా స్వీకరించాయి. వాటినే అక్షరీకరించారు రచయితలు. ఉద్యమాలు స్త్రీకి మనోధైర్యాన్ని కల్గించడం, తిరుగుబాటు తత్వాన్ని నేర్పడం ఈ కథల్లో చిత్రించడం జరిగింది. ఈ కథలు రాసిన రచయితలకు వ్యాపార పత్రికల్లో వచ్చే కథల్లోలా అవాస్తవిక ప్రేమ వివాహాలపై విశ్వాసం లేదు. స్త్రీల సమస్యలపై హృదయపూర్వక స్పందన, పురుషాధిపత్యంపై ఆగ్రహం ఈ కథల్లో కనబడుతుంది. భూపోరాటాల కాలంలో వచ్చిన ఈ కథలు స్త్రీల గూర్చి వచ్చిన మంచికథలే. నాగరికులని చెప్పబడే స్త్రీలు, కూలినాలి చేసుకునే స్త్రీలలోని విలువల్లోని అంతర్యాలను చక్కగా చిత్రించాయి. ఈ కథలుగాని, ఈ కాలంలో వచ్చిన ఇతర కథలుగాని స్త్రీ జీవితాన్ని సమగ్రంగా ఆవిష్కరించలేకపోయాయి. అందుకే స్త్రీవాద సాహిత్యోద్యమం రావాల్సిన అవసరం ఏర్పడింది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 9 ఫిబ్రవరి 2004**

# గిరిజన పోరాటకథలు

"గిరిజనులందరూ కూడా ఇప్పటివరకు ఆయా ప్రాంతాల వర్గసమాజ విస్తరణకు లొంగని వాళ్లు. ఈ విస్తరణ మన దేశ చరిత్రలోని ముఖ్యమైన భౌతిక క్రమాల్లో ఒకటి. నాలుగు వేల సంవత్సరాలుగా మైదానాలు అడవులను ఆక్రమించుకుంటున్నాయి. ఇది ఇప్పటికీ అంతరించని క్రమం. ఇది శాంతియుతంగానూ, మర్యాదగానూ సాగింది అనుకుంటే భ్రమే అవుతుంది. ఇవ్వాళ్ల కాంట్రాక్టర్ల ద్వారా, ప్లాంటేషన్ల ద్వారా, వడ్డీ వ్యాపారస్థుల ద్వారా గిరిజనేతర భూస్వాములు భూఆక్రమణల ద్వారా ఎంత దౌర్జన్యంగా సాగుతున్నదో గతంలో కూడా అంతే దౌర్జన్యంగా సాగింది.

30, 40 యేళ్ల క్రితం గోండుల స్థితిగతులు ఎంతో మెరుగ్గా ఉండేవి. వాళ్లకు స్వంత భూమి పుట్రా ఉండేది. పండిన పంటల ఆదాయంతోటి ఎంతో కొంత సుఖమూ, సంతృప్తీ ఉండేది. నానాటికీ తీసికట్టయి, ప్రస్తుతం వాళ్లు కనాకష్టంగా బతకవలసి వస్తోంది... రోజురోజుకీ దరిద్రం ఊబిలో దిగబడిపోతున్నారు.." ఇవి కె.వి.ఆర్. గిరిజనుల గూర్చి పాతికేళ్ల క్రితం అన్న మాటలు...

కొమురం భీం పోరాటకాలం వరకు లేదా మైదాన ప్రాంతాలవాళ్లు గిరిజన గూడాల్లో అడుగుపెట్టేవరకు వీళ్ల బతుకులు బాగానే ఉండేవి. తమ బతుకులు తాము బతుకుతూ ఉండేవారు. నాగరికులనబడే మైదాన ప్రాంతాల వాళ్లు అక్కడ అడుగు పెట్టగానే వాళ్లలో కల్లోలం మొదలైంది. వాళ్ల అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకొని షావుకార్లు తెలివిగల వాళ్లంతా దోచుకోవడం మొదలుపెట్టారు. ఆ అడవితల్లి బిడ్డలిచ్చే అడవి సంపదను అతి తక్కువ రేటు తీసుకోవడం బెల్లం, పొగాకు లాంటి వ్యాపార సరుకులను అడ్డగోలు ధరలకమ్మడం సాగించారు. బాకీల పేర్ల మీద నాగటెడ్లను, పండిన పంటలను, తుదకు పంటభూములను కూడా ఆక్రమించుకున్నారు నాగరికులు. వాళ్ల భూముల్లో వాళ్లనే కూలీలను చేశారు. వాళ్ల స్త్రీల మానాలను దోచుకున్నారు. మరో దిక్కు ఫారెస్టు అధికార్ల దౌర్జన్యం వీళ్లపై కొనసాగుతూనే ఉంది. వీళ్లు అడవికి మకుటం లేని మహారాజుల్లా ప్రవర్తిస్తూ గిరిజనుల మేకలు, పశువులు అడవిలోకి వచ్చాయన్న నెపంతోనో, గంజాయి పండించారన్న సాకుతోనో, సారా కాచారన్న కారణంతోనో ఆ అడవితల్లి బిడ్డలపై దౌర్జన్యాలు సాగించారు. గిరిజనులు కాచుకున్న సారాను, ఏరుకున్న పువ్వును, పండించుకున్న పంటను, బంకను అన్నింటినీ తీసుకెళ్లడమే.... తత్ఫలితంగా అడవితల్లి బిడ్డలకే అడవిలో బతకడం దుర్భరమైంది.



ఇలాంటి సమయంలో అన్నలని పిలువబడే ఉద్యమకారులు అడవిలో ప్రవేశించారు. తమకండగా నిలుస్తామన్న వాళ్లకు ఆ అడవిబిడ్డలు చేయూతనిచ్చారు. కొమురం భీం వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్లారు. గిరిజన పోరాటాలు ఉధృతమయ్యాయి. రైతాంగ, సాంస్కృతిక, కార్మిక పోరాటాలు మైదాన ప్రాంతాలకు సంబంధించిన వాళ్లవయితే ఈ ఉద్యమాలు అడవితల్లి బిడ్డలవి. ఈ పోరాటాలు వచ్చింతర్వాత అంతకు ముందు అంతగా సాహిత్యానెకెక్కని గిరిజనుల గూర్చి కథలు రావడం ప్రారంభమైంది. అంతకు ముందు చింతా దీక్షితులు 1920లో సుగాలీ కుటుంబం, భూషణం అడవంటుకుంది, సాహు అల్లం రాజయ్య కొమురం భీం రాసినా ఆదిలాబాద్ గిరిజనుల గూర్చి పోరాటాలు ఉధృతమైన తర్వాతే మంచి కథలొచ్చాయి. గిరిజనుల గూర్చి అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించడమే కాకుండా వాళ్లతో మమేకమై జీవించిన గిరిజన బంధు సాహు..

నీళ్లు చేపలను తన కడుపులో దాచుకున్నట్లు ప్రజలు తమ కోసం పనిచేసే ఉద్యమకారులను తమలో దాచుకుంటారు. ఉద్యమకారులు నీళ్లలో చేపల్లా ప్రజలతో కలిసి పనిచేసే విధానాన్ని, ప్రజలు వాళ్లను తమ మనుషులుగా దాచుకోవడాన్ని చిత్రించే కత్త కాంతి రాసిన గంగజిమ్మ... "మీరు పోరాటం జెయ్యని... మీరు కదులుతుంటే మీ కోసం మేం ప్రాణాలిచ్చుటానికి తయారున్నం... మమ్ము సంపుకున్న మీరే... సాదుకున్న మీరే" అని ఉద్యమకారులు గిరిజనులకు అండదండగా నిలిచారు. పోరాటంలోని స్మృతులను, మృతవీరులను మననం చేసుకునే సెంట్రీ సుధాకర్ అంతరంగ మథనమే అమరజ్యోతి రాసిన 'తునికి చెట్టు' కథ. బాండే రాసిన "పొత్తిళ్లలో ప్రజాసైన్యం", మయూరి రాసిన 'కొండ సిగలో గోగుపూలు' ప్రజల పట్ల పార్టీకుండే బాధ్యతను, ప్రజలతో ఉద్యమకారులకుండే సంబంధాలను, ఉద్యమకారులతో గిరిజన బతుకుల్లో వచ్చిన మార్పులను చిత్రించిన కథలు....

గిరిజన స్త్రీ జీవితాన్ని, గిరిజన సంస్కృతిని అత్యంత వాస్తవికంగా చిత్రించిన కథ గోపి భాగ్యలక్ష్మి రాసిన 'జంగూభాయి'. తెలంగాణా ప్రాంతం నుంచి గిరిజనుల గూర్చి వచ్చిన కథల్లో చాలా భాగం ఆదిలాబాద్ జిల్లా గిరిజన ప్రజాపోరాటాలను చిత్రించినవే. గిరిజన జీవితాల గూర్చి వారి పోరాటాల గూర్చి వచ్చిన కథల్లో ఉత్తమోత్తమ కథగా బి.ఎస్. రాములు రాసిన 'అడవిలో వెన్నెల'ను పేర్కొనవచ్చు. కథా సౌందర్య విలువల దృష్ట్యా, వాస్తవిక జీవన చిత్రణ దృష్ట్యా ఏ కోణంలోంచి చూసినా ఇది అత్యుత్తమ కథే. గిరిజనులతో మమేకమై గిరిజన జీవితాలతో తాదాత్మ్యం చెంది వాళ్లతో సహజీవనం సాగించినప్పుడు మాత్రమే ఇలాంటి కథ రాయడం సాధ్యమవుతుంది.

1985 కొ.కు. స్మారక బహుమతి పొందిన ఈ కథ గిరిజన బతుకులు అడవిగాచిన వెన్నెలలు కావని, అడవిలో వెన్నెలలు కావాలని చెప్పే కథ. గిరిజనులతో దొరలు జరిపే పంచాయతీ స్వరూపం, చైతన్యవంతులైన గిరిజనులు సంఘ చైతన్యంతో దాని నెదుర్కోవడం రవి రాసిన బదిలీ కథలోని వస్తువు. 'సకల సంపదలు కల్ల దేశమున దరిద్రమెట్లుండె నాయనా అని మనకూ పాడాలనిపిస్తుంది ఈ కథ చదువుతుంటే.. శ్రీకాకుళ ప్రాంత గిరిజన పోరాట కథల్లో కొన్నింట్లో సత్యం మా[illegible]రు నాయకుడయితే ఆదిలాబాద్ గిరిజన పోరాట కథల్లో పొరుకల సారు కథానాయకు[illegible]తడు గిరిజనుల్లో చైతన్యం రగిలించాడు.

తుడుం మోగించి గిరిజనులను ఒక్క చోటికి చేర్చి శత్రు[illegible] తరిమివేయడం అంశంగా గల కథ గోదావరి రాసిన 'తుడుం'. సాహు రాసి[illegible]పింజెర, మనం తుడుం గొట్టాలె, కన్నీటికథ – నీటి కథ, పెళ్లి కావాలి, వాయి[illegible]దు రూపాయల కథ గిరిజన పోరాటాలను, వాళ్లపై జరుగుతున్న దోపిడీ పీడనల విశ్వరూపాన్ని చిత్రించే గొప్ప కథలు... ఆదిలాబాద్ జిల్లా చెన్నూరు అడవుల్లో జరిగినట్టు చెప్పిన గిరిజనుల కథ పి. చంద్ రాసిన 'గెరిల్లా' గిరిజన రైతాంగ పోరాటంలోని భాగమైన కొన్ని యథార్థ సంఘటనలను చిత్రించిన కథ. తొడసం జంగు రాసిన 'రగుల్ రాజైం మైనాసివాకట్..' గిరిజన రైతాంగ పోరాటాల్లోని ఎత్తుపల్లాలను, కష్టసుఖాలను, ఎన్‌కౌంటర్ హత్యలను, విప్లవకారుల కర్తవ్యాన్ని, విప్లవకారులు ప్రజల్లో కలిసి వాళ్లకు మనోధైర్యం కలిగించాల్సిన విషయాలను తెలిపే కథ. కొమురం భీం చుదూర్ రాసిన 'తేనెటీగలు' గిరిజనులపై కంట్రాక్టర్ల దోపిడీని, పి. చంద్ రాసిన 'గుమ్మాన్ ఎక్లాస్‌పూర్ గ్రామస్థుడు చిత్రిస్తే, బంక అమ్ముకునే గిరిజనులపై షావుకార్ల దోపిడీని తిర్మల్ రాసిన ఎర్రజీర చిత్రించింది. తుపాకులు ఆకులు కోయించవు అంటాడు కాడి....

ఎనభైలు, తొంభైలలో ఆదిలాబాద్ గిరిజన పోరాటాలు ప్రారంభమైన తర్వాత గిరిజనుల్లో వచ్చిన మార్పులను, ఉద్యమకారులు ఆ అడవితల్లి బిడ్డలకండదండగా ఉండటాన్ని చిత్రించిన కథలివి. కొన్ని కథల్లో సిద్ధాంతాల బరువెక్కువై, కథామూల్యాలకు ఇవ్వవలసినంత ప్రాముఖ్యతివ్వకపోయినా గిరిజన జీవితాల గూర్చి వచ్చిన అద్భుత కథలివి. ఆదిలాబాద్ అడవులను, అడవి తల్లి బిడ్డల జీవితాలను కళ్ల ముందుంచిన కథలు..

ఎంత గోవుల్లాంటి అమాయకులైనా అడవి తల్లి బిడ్డలు తమకండదండగా నిలబడేవాళ్లుంటే తమ శక్తేంటో చూపిస్తారని, ప్రజాశక్తి ముందు ఏ శక్తులూ నిలువయని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. గిరిజన బతుకుల్లోని విషాదాన్ని, ఉద్యమాలు



వాళ్లలో నింపిన ఉత్సాహాన్ని, పోరాటాల ఫలితంగా నామమాత్రంగానైనా ప్రభుత్వాలు వాళ్లకోసం చౌకధరల దుకాణాలు తెరవడం ఈ కథలద్వారా తెలుసుకోవచ్చు. ఇంత వరకూ అంతగా పట్టించుకోని గిరిజనుల గూర్చి కథలు రావడం మంచి పరిణామం.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 12 జనవరి 2004**

# 'సారా'జ్యాన్ని ప్రశ్నించే కథలు

ఈ వ్యవస్థలోని సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, నైతిక సంబంధమైన విషయాలను ప్రశ్నిస్తూ కథలు రాశారు రచయితలు. విలువలను, సామాజిక సంబంధాలను ప్రశ్నిస్తూ అందుకుగల కారణాలు వ్యవస్థవేనని, కేవలం వ్యక్తులు కాదన్న అవగాహనతో వ్యవస్థ మారాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతూ కథలు రాశారు. సారా, మద్యపానం, మత్తుపదార్థాలు ప్రజల్ని మత్తులో ముంచుతూ సమాజానికి చేటు తెచ్చేవి. ప్రజల్ని ఆర్థికంగానూ, నైతికంగానూ పతనం చేసే దురలవాట్లు... వీటికి వ్యతిరేకంగా స్వచ్ఛంద సంస్థలు, సంఘ సేవాపరాయణులు ఉద్యమాలు చేశారు. తెలంగాణాలో జరిగిన రైతాంగ పోరాటాలు, సారా పోరాటాలను కూడా చేపట్టాయి. ప్రభుత్వం సారాను నిషేధించాలని, ప్రజల ఆ దురభ్యాసానికి దూరంగా ఉండాలని పోరాడారు. స్వచ్ఛంద సంస్థలు చేసిన సారా పోరాటాలకు ఉద్యమకారులు చేసిన సారా పోరాటాలకు తేడా ఉంది. వీళ్ల పోరాటాలు హింసారూపం తీసుకున్నాయి.

అయితే గాంధీగారిని జాతిపితగా, మహాత్ముడిగా అంగీకరించే ప్రభుత్వాలు ఆ గాంధీగారు కావాలన్న మద్యనిషేధాన్ని మాత్రం అమలు చేయరు. అందుకు భిన్నంగా ఉద్యమకారులు మద్యనిషేధాన్ని సమర్థిస్తుంటే ప్రభుత్వం అణిచివేయడం సమాజంలోని వైరుధ్యమే. ఉద్యమకారులు సారా గూర్చి జరిపిన పోరాటాలను కథలుగా మలిచారు రచయితలు. తెలుగు కథా సాహిత్యంలో రావిశాస్త్రిగారి సారా కథలు అద్భుతమైన కథలు. డబ్బే రాజ్యమేలుతున్న ఈ వ్యవస్థ అసలు స్వరూపాన్ని, ఉన్నవాడికి చుట్టాలైన చట్టాల నిజస్వరూపాన్ని, ఈ వ్యవస్థలో సామాన్యుడి బతుకును ప్రతిభావంతంగా చిత్రించడం జరిగిందీ కథల్లో... పోరాటాల కాలంలో తెలంగాణా నుంచి వచ్చినా రావిశాస్త్రి కథలకున్న సార్వజనీనత ఈ 'సారా'కథలకు లేదు. ఈ కథలకున్న శిల్ప సౌందర్యమూ లేదు. అయితే ఆ కథల్లోని కాల్పనికత ఈ సారా కథల్లో లేదు. వ్యవస్థను ప్రశ్నించే కథల్లో భాగంగా ఈ కథలూ వచ్చాయి.

తాము నిమ్నవర్గాలకి చెందినవాళ్లే... అయినా వాళ్లు తమను దోచే దొరలకే అండగా ఉంటారు. తమ వర్గప్రయోజనాలను దెబ్బ తీస్తూ కుక్కబతుకు బతికేవా[illegible] గూర్చి చెప్పే కథ హెచ్చార్కె రాసిన 'దొరగారి కుక్క'. దొరల ఎంగిలి మెతుకులు తింటూ బతికే వారి బతుకుల్లోని విషాదాన్ని, హైన్యాన్ని ప్రశ్నిస్తుందీ కథ. బయట ప్రపంచాన్ని చూడకుండా గడీలోనే బతుకుతున్న కుక్క బయటకొస్తే దాని బతుకును



ఎత్తి చూపుతాయి బయటి జంతువులు. బానిసగా బతుకుతూ దొరగారి కుక్కలా బిస్కట్లు తినడం కంటే స్వతంత్రంగా బతుకుతూ గడ్డి తిన్నా మంచిదేనని చెప్పే కథ... సారా ధర తగ్గాలని ఉద్యమకారులు చేస్తున్న పోరాటాలనణచడానికి ఎన్ని పోలీసు క్యాంపులు పెట్టినా సారాను తగలబెట్టడం అంశంగాగల కథ విదురుడు రాసిన 'సారాంశం'. సింగరేణి బొగ్గు గనుల్లో పనిచేస్తున్న కార్మికులు కారణాలేవైనా చాలామంది సారాకు బానిసలై ఆర్థికంగానూ, ఆరోగ్యపరంగానూ నష్టపోతున్నారు. కల్తీ సారాకు ఎంతో మంది జీవితాలు బుగ్గవుతున్నాయి. కల్తీ సారా తాగి మరణించిన కార్మికుని గూర్చి ఆందోళన చేస్తారు కార్మికులు. ఐదు వందల లీటర్ల సారాను ఎన్నో రెట్లు కల్తీ చేసి అమ్ముతూ కార్మికుల మరణానికి గురవుతున్న కాంట్రాక్టర్‌ను ఏమీ చేయలేని ప్రభుత్వం పోరాటం చేస్తున్న కార్మికులను కోర్టుకీడ్వడం అంశంగా గల కథే కార్మిక రాసిన 'మరో సారా కథ'. 'అవును సార్... పిడికెడు మెతుకులు ఎత్తుకపోతే దొంగయిపోతాడు.. కాని వేల బస్తాలు బ్లాకులో అమ్మే కాంట్రాక్టరు పెద్ద మనిషై పోతాండు... ఎవడన్నా పండగకో, పబ్బానికో సారా కాసుకుంటే దొంగ - పబ్లిగ్గా దొంగసారా అమ్మే కాంట్రాక్టర్ దొర..' అని వాదిస్తాడు కార్మికుడు కోర్టులో.

ఉద్యమకారులు భూస్వాములకు వ్యతిరేకంగా సారా పోరాటాన్ని ఎక్కు పెట్టడం కాకుండా ఐచ్ఛికంగా జనం మానుకునేట్టు చేయాలని సంఘాల ద్వారా ప్రయత్నించడాన్ని చిత్రించిన కథ వెంకన్న రాసిన 'సారా కథ'. తాము లక్షలు సంపాదిస్తూ దొంగ సారా కేసుల్లో సారా కేసుల్లో పాలేర్లను బలిపశువులను చేసే దొరల స్వభావాన్ని ప్రశ్నిస్తుందీ కథ.. సాక్షి రాసిన 'కమ్యూనిస్టు గాడిద' అద్భుతమైన రాజకీయ వ్యంగ్య కథ... పాలకవర్గ పార్టీలు తమకు నచ్చని పనులు జరిగితే అవి కమ్యూనిస్టుల పనులని చెప్పి చేతులు దులుపుకుంటాయి. కరువు కాలంలో పోస్టర్లు మేస్తూ బతుకుతున్న చాకలి రాములు గాడిదను అది ప్రతిపక్షాల కుట్రని అరెస్టు చేస్తారు. కోర్టులో తర్జనభర్జనలైన తర్వాత అది కాంగ్రెస్ గాడిద కాదని, తెలుగుదేశం గాడిదా కాదని కమ్యూనిస్టు గాడిదేనని కేసు నమోదు చేస్తారు. పాలకవర్గ పార్టీలకు కమ్యూనిస్టులపై ఉన్న అభిప్రాయాన్ని వ్యంగ్యంగా చిత్రించిన కథ ఇది. ప్రజాస్వామ్యాన్ని తామే పొట్టన పెట్టుకుంటూ ఆ పేరుతో పాలన సాగిస్తూ ప్రజలను అజ్ఞానంలో వుంచి, ఓట్ల రాజకీయాల్లాగే దుర్నీతిని ప్రశ్నించే కథ. పి. చంద్ రాసిన 'ప్రజాస్వామ్యం'. ప్రజలతో సంబంధం లేకుండానే, ప్రజాసమస్యల పట్ల కనీస అవగాహన లేకుండా ప్రజాప్రతినిధులుగా, నాయకులుగా చలామణీ అయ్యేవాళ్ల అజ్ఞానాన్ని ప్రశ్నించే గల్పిక 'గద్దుప్రశ్న'.

కనిపించని ప్రభుత్వం పేరు చెప్పి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో దోచుకుతినే మోసగాళ్ల గూర్చి జాగ్రత్తగా వుండాలని, అలాంటివాళ్లను వదిలి పెట్టకూడదని చెప్పే కథ దేవరాజు మహారాజు రాసిన 'దాడి'. పాలకుల పేరు చెప్పుకొని ప్రజలను పీడించే నక్క, తోడేలులాంటి వాళ్ల గూర్చి జాగ్రత్తగా వుండాలని హెచ్చరిస్తుందీ కథ. న్యాయవాదులు డబ్బుకు అమ్ముడుపోతూ రకరకాల అన్యాయాలకు పాల్పడటాన్ని, వాళ్లు చేసే దోపిడీని గూర్చి ప్రశ్నించే కథ జీవన్ రాసిన 'ఓ రోడ్డు కథ'. లాయర్ల ధనదాహం, నీతిరాహిత్యాన్ని చెప్పే మంచికథ. రోడ్డు ప్రమాదానికి గురయిన వ్యక్తికి కాంపెన్సేషన్‌గా వచ్చిన యాభై వేలను పదివేలేనని చెప్పి ఐదు వేలు చేతిలో పెడతాడు లాయర్. మానవశక్తిపై కాకుండా అదృష్టంపై, లాటరీలాంటి జూదాలపై నమ్మకాన్ని పెంచే విధానాన్ని ఖండించే కథ నందిగం కృష్ణ రాసిన 'కలల ఖరీదు'. ఈ వ్యవస్థలో అసలు డెఫిషియెన్సీ రక్తమవీ కావని, డబ్బు మాత్రమేనని తెలిపే కథ చంద్ర రాసిన డెఫిషెయన్సీ... దేశంలోని పేదరిక పరిస్థితులను ప్రశ్నించే కథ. బతికున్న తల్లిదండ్రులకు కూడుగుడ్డనివ్వని వాళ్లు కర్మను ఘనంగా చేస్తారు. అవసరాల్లో ఆదుకోని వాళ్లు అటు తర్వాత పేదవులపై సానుభూతి చూపిస్తారు. ఆకలితో అలమటిస్తున్న పైసా దానం చేయనివాళ్లు శవదహనానికైతే డబ్బులు విసిరేస్తారు. మనిషి బతికున్నప్పుడు కాకుండా చనిపోయింతర్వాత చూపే జాలి మురికి నీళ్లకన్నా కడుహీనమైందని మనుషుల స్వభావాన్ని సవాలు చేస్తున్న కథ తిర్మల్ రాసిన 'విలువలు'.

చెప్పిందొకటి చేసేదొకటిగా వున్న ఈ వ్యవస్థను నిలదీసి ప్రశ్నిస్తున్నాయీ కథలు... గాంధీ పేరు చెప్పుకుంటూనే పరిపాలన సాగించే వాళ్లు సారా పోరాటాన్ని వ్యతిరేకించే తత్వాన్ని నిలదీస్తున్నాయి. ఈ కథలు రాజకీయాల్లోని డొల్లతనాన్ని, విలువలను, వంచనను నిలదీస్తున్నాయి. న్యాయవ్యవస్థ ఎవరికండగా ఉంటుందో అదెంత బహిరంగంగా ఉన్నవాళ్ల పక్షం వహిస్తుందో ఈ సమాజంలో పేదవాడికి న్యాయం జరగడం ఎంత అసంభవమో ఈ కథలు చదివితే అర్థమవుతుంది. మేడిపండు లాంటి సమాజం గుట్టుమట్లను ఈ కథలు బహిర్గత పరుస్తున్నాయి. ఈ కథలో సునిశితమైన వ్యంగ్యముంది. రాజకీయాలపై సునిశిత విమర్శ ఉంది. రాజకీయ, సామాజిక న్యాయవ్యవస్థలను నిలదీసే స్వభావముంది. శిల్పరీత్యా ఇందులోని కథలన్నీ గొప్ప కథలు కాకున్నా వస్తురీత్యా చెప్పుకోదగ్గ మంచి కథలే.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 19 జనవరి 2004**



# బొగ్గు పొరల్లోని బతుకు వెతలు

ఇరవయవ శతాబ్దిలో పరిశ్రమల విస్తరణతో పాటు కార్మిక వర్గమూ పెరిగింది. అంతకు ముందున్న వ్యవసాయ, అసంఘటిత కార్మిక వర్గంతో పాటు సంఘటిత పారిశ్రామిక వర్గం పెరిగింది. కార్మికుల శ్రమశక్తిని దోచే కాంట్రాక్టర్లు, పెట్టుబడిదారి వర్గమూ పెరిగింది. దాంతో కార్మికవర్గం నుంచి నాయకత్వం, పోరాటాలు, కార్మిక చట్టాలు, సమ్మెలు, హక్కుల కోసం పోరాటాలుపెరిగాయి. వివిధ రాజకీయ పార్టీల కనుబంధంగా ట్రేడ్ యూనియన్లు, నాయకులతో పాటు చెట్టు పేరు చెప్పుకొని కాయలమ్ముకునేవాళ్లు వచ్చారు. తెలంగాణాలో బొగ్గు పరిశ్రమ అతి ముఖ్యమైనది. బొగ్గు ఆధారితంగా అనేక పరిశ్రమలొచ్చాయి. నైజాం పాలనా కాలంలో బొగ్గు గనులు వచ్చింతర్వాత తెలంగాణాలో పారిశ్రామిక సంస్కృతి విస్తరించింది. కార్మిక వర్గమూ గణనీయంగా పెరిగింది. ఖమ్మం జిల్లాలోని ఇల్లెందులో ప్రారంభమైన ఈ గనులు గోదావరి తీరం వెంట ఆదిలాబాద్ జిల్లాలోని బెల్లంపల్లి మంచిర్యాల ప్రాంతం గుండా విస్తరించి నాలుగు జిల్లాల్లో కార్మికవర్గం విపరీతంగా పెరగడానికి దోహదం చేసింది. స్వాతంత్ర్యానికి ముందు నుంచే మన రాష్ట్రంలో కార్మిక వర్గమున్నా కార్మికుల గూర్చి వచ్చిన సాహిత్యం తక్కువే. డెబ్బైల తర్వాత తెలంగాణాలో వచ్చిన భూపోరాటాలు, భూపోరాటాలతో పాటు వచ్చిన కార్మికపోరాటాలు చాలామందిని అనివార్యంగా రచయితలను చేశాయి. వ్యవసాయ కుటుంబంలోంచి వచ్చిన వాళ్లు, కార్మికుల్లోంచి వచ్చినవాళ్లు తమ చరిత్ర తాము రాసుకునే క్రమంలో కార్మికవర్గం గూర్చి రాయడం మొదలుపెట్టారు. అంటే శ్రామిక కులాల్లోంచి రచయితలు వచ్చింతర్వాతే కార్మికుల గూర్చి కథలు రావడం ఎక్కువైంది.

స్వాతంత్ర్యానికి ముందు శ్రామిక కులాలవారికి చదువుకునే అవకాశాలు దాదాపు మృగ్యం. ఇక రచయితలయ్యే అవకాశమెక్కడిది? స్వాతంత్ర్యానంతరం పుట్టి పెరిగి విద్యాబుద్ధులు నేర్చుకున్న వాళ్లలోంచి రచయితలుగా ఎదిగినవాళ్లు వ్యవసాయ కార్మికులతో పాటు సింగరేణి కార్మికుల గూర్చి కథలు రాశారు. సింగరేణి పారిశ్రామిక ప్రాంతంలో జరుగుతున్న పోరాటాలను రికార్డు చేశారు. కార్మికవర్గం నుండి నాయకత్వం ఎదుగుతుందనడానికి సింగరేణి పారిశ్రామిక ప్రాంతంలో ఎదిగిన నాయకులే చక్కని ఉదాహరణ.

దున్నేవాడికే భూమి చెందాలన్న తాత్విక దృక్పథానికి అనుగుణంగా భూపోరాటాలు జరిగితే - నడిపేవాడికే మిల్లు భాగస్వామ్యం కావాలన్న దృక్పథంతోనూ, కార్మికుల శ్రమ ఫలితాన్ని అనుభవించే దోపిడీదారులనెదిరించాలనే లక్ష్యంతోనూ కార్మిక పోరాటాలు జరిగాయి. అయితే ఈ రెండు పోరాటాలకూ స్పష్టమైన తేడా ఉంది. భూపోరాటాల్లోని టార్గెట్ వర్గం గ్రామీణ పేదలు - అసంఘటిత కార్మికులు - కార్మిక పోరాటాల్లోని టార్గెట్ వర్గం సంఘటిత కార్మికవర్గం.. వీళ్లు కొద్దో గొప్పో చదువుకున్న వాళ్లు.. వీళ్లలో చైతన్యం స్థాయి ఎక్కువే. సింగరేణి బొగ్గు గనుల్లో పనిచేసే పనిచేసే కార్మికుల్లో చాలామంది చదువురాని వాళ్లే అయినా కార్మికులుగా మారింతర్వాత అనివార్యంగా జరుగుతున్న పోరాటాల వల్ల చైతన్యవంతులయ్యారు. అందుకోసం వీళ్లకు నాయకత్వం వహించడం అంత సులభం కాదు. వీళ్ల గూర్చి రాయడమూ సులభం కాదు. కార్మికవర్గం, కార్మిక పోరాటాల గూర్చి రాయడమూ సులభం కాదు. కార్మికవర్గం, కార్మిక పోరాటాల గూర్చి స్పష్టమైన అవగాహన ఉంటేనే వీళ్ల గూర్చి రాసి మెప్పించడం జరుగుతుంది. ఆ పనిని సమర్థవంతంగా నిర్వహించారు. శ్రామిక వర్గం నుంచి వచ్చిన రచయితలు అల్లం రాజయ్య, వేల్పుల నారాయణ, కాలువ మల్లయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, పి. చంద్, కార్మిక, చైతన్య లాంటి రచయితలు కార్మికుల జీవితాలకు భాష్యం చెబుతూ చక్కని కథలు రాశారు.

ఇటీవలి కాలంలో సింగరేణి కార్మికుల గూర్చి కథలు విరివిగానే వచ్చాయి. అనేక సంకలనాల్లో చోటు చేసుకున్నాయి. కాని సింగరేణి కార్మిక జీవితాల గూర్చి వచ్చిన ప్రత్యేక సంకలనాలు రెండే రెండు. ఒకటి కరీంనగర్ బుక్‌ట్రస్టువాళ్లు ప్రచురించిన బొగ్గుపొరల్లో... రెండవది అబంపి పిబ్లికేషన్స్ వాళ్లు వేసిన కోల్‌బెల్ట్ కథలు. ఇవి కార్మికుల గుండె చప్పుళ్లు... వేలాదిమంది కార్మికులకు ప్రతిరూపం. కార్మికులు రాసుకున్న కార్మికుల కథలు. జీవితమే వాళ్లకు పోరాటాలు నేర్పితే ఆ పోరాటమే వాళ్లను రచయితలను చేసింది. అందుకే ఈ రచయితలు ఈ కథలకు తమ కర్తృత్వాన్ని కూడా వదులుకున్నారు. కార్మిక పేరుతోనే కథలు రాశారు. ఆ కార్మిక ఎవరైనా కావచ్చు. 'బొగ్గు పొరల్లో' కథా సంకలనంలో రాజీ, బొగ్గుపొరల్లో, లీడర్, సమ్మె, ఇంధనం అనే ఐదు కథలున్నాయి. పొట్టలు చేతుల బట్టుకొని బతుకు తెరువును వెతుక్కుంటూ పల్లెలొదిలి సింగరేణి బొగ్గు గనుల్లోకి కార్మికులుగా వచ్చారు చాలామంది. అక్కడా దుర్భరమైన పని పరిస్థితులనెదుర్కొంటూ బతకాల్సి వస్తుంది. ప్రమాదభూయిష్టమైన పరిస్థితులు - కూలడానికి సిద్ధంగా ఉన్న గని కప్పులు - సేఫ్టీ



డిపార్ట్‌మెంటున్నా ఏ మాత్రం శ్రద్ధ తీసుకోని అధికార్లు - ఉత్పత్తినే లక్ష్యంగా నిర్ణయించడం తప్ప కార్మికులను, వాళ్ల రక్షణను పట్టించుకోని యాజమాన్యం... ఇవీ సింగరేణి గనుల్లోని పరిస్థితులు... ఫలితంగా గని కార్మికులు ఎన్నో ప్రమాదాలకు గురవుతూ అంగవైకల్యానికి గురికావడం, మృత్యువాత పడటం జరుగుతుంటుంది. గని కార్మికుల ఎలాంటి దుర్భర పరిస్థితుల్లో పని చేయాల్సి వస్తుందో తెలుపుతూ కార్మికులు భద్రత కోసం, పని పరిస్థితుల మెరుగు కోసం కార్మికులు సమ్మెలు, పోరాటాలు చేయాల్సిన అవసరాన్ని గూర్చి తెలిపే కథ బొగ్గుపొరల్లో... పుట్టెడు బండ కింద పనిచేసే కార్మికుడు తన డ్యూటీ ముగించుకొని బయటకు రావడమంటే అతనికి పునర్జన్మలాంటిదే. అయినా నాలుగువేళ్లు నోట్లోకి పోవడానికి పనిచేయక తప్పదు. ప్రమాదాలను, మృత్యువును కౌగలించుకోకా తప్పదు. గని కార్మికుల గూర్చి వచ్చిన మంచి కథే బొగ్గుపొరల్లో... సమ్మె కార్మికుడి ఆయుధం. సింగరేణి కార్మికుల పాలిటి శాపం లాంటిది మస్టర్ల కోత. మస్టర్ల కోత చట్టాన్ని విరమించుకోవాలని, దొంగ ట్రేడ్ యూనియన్ల శిఖండి పాత్ర నశించాలని, కార్మికుల ఐక్యత వర్ధిల్లాలని, యాజమాన్యం దౌర్జన్యం నశించాలని మస్టర్ల కోతను వ్యతిరేకిస్తూ కార్మికులు చేసిన సమ్మెను చిత్రించిన కథ సమ్మె. ఇదే క్రమంలో సమ్మె గూర్చి సమ్మె విస్తరణ, నిర్బంధంలో సమ్మె, విజయం మనదే లాంటి కథలొచ్చాయి. కార్మికులకు మనోధైర్యాన్నిచ్చే కథలివి. నాయకుడి పేరు మీద కార్మికులకు ద్రోహం చేసే దొంగ నాయకుడి కథే లీడర్. నాయకుల కార్మిక వ్యతిరేక స్వభావాన్ని చిత్రించే కథ ఇంధనం. ఈ కథలన్నీ సింగరేణి కార్మికుల జీవితాలకు భాష్యాలు. సింగరేణి కార్మికుల గూర్చి వచ్చిన యాభై అరవై కథలను సంకలనంగా తీసుకురావాల్సిన అవసరముంది. అప్పుడే వాళ్ల జీవితాలు, పోరాటాలు, బొగ్గు పొరల్లోని బతుకు వెతలు, సుఖదుఃఖాలు అందరికీ తెలిసే అవకాశముంది.

సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 28 జూలై 2003

## దళిత పోరాట కథలు

"ఏ భాషలోనైనా ఒక ప్రత్యేక సాహిత్యోద్యమం ఆ ప్రాంతం (దానితో ముడిపడి ఉన్న) భాషలోని సాంఘిక, రాజకీయ ఉద్యమాలననుసరించి లేదా అవసరాన్ని బట్టి ప్రస్ఫుటమవుతుంది. ప్రతి సాహిత్యోద్యమానికీ బలమైన రాజకీయ, సాంఘిక పునాదులుంటాయి. అప్పుడే అది సాహిత్యాన్ని, సామాజిక తత్వాన్ని ఇతోధికంగా ముందుకు నెడుతుంది. సజీవమైన ప్రతిస్పందనను ఇచ్చి ప్రజల జీవనాడిగా నిలుస్తుంది. అలాంటి ఉద్యమాల్లో దళిత సాహిత్య ఉద్యమం ఒకటి. జాతీయ ఉద్యమ కాలంలో దళితుల్లో ప్రధాన భాగమైన హరిజన, గిరిజన ప్రజల సమస్యలు, సంవేదనల గురించి దేశవ్యాప్తంగా వివిధ భాషల్లో సంస్కరణ ధోరణిలో రచనలు వెలువడ్డాయి. గాంధీతత్వం ఈ రచనలకు తోడ్పడింది. మరోవైపు 1938 తర్వాత దేశంలో అల్లుకున్న అభ్యుదయ సాహిత్యోద్యమంలో అంతర్భాగంగా దళితుల సమస్యలు చిత్రించడం జరిగింది. కాని ప్రత్యేకించి మహారాష్ట్రలో మాత్రం డా. బి.ఆర్. అంబేద్కర్ ప్రభావం వల్ల మరాఠీ భాషలో దళిత సాహిత్య ఉద్యమానికి పునాదులు పడ్డాయి. తెలుగులో దళిత సాహిత్యోద్యమం పుట్టడానికి మహారాష్ట్రలోలాగా రాజకీయ ఉద్యమాలు విడిగా దళితుల కోసం రాలేదు" అంటారు 'కదలిక' 88 సంచికలో నిఖిలేశ్వర్.

అవును - 1970-90ల మధ్య పోరాట సాహిత్యం విరివిగా వస్తున్న కాలంలో ప్రత్యేకంగా దళితుల గూర్చంటూ ఉద్యమస్ఫూర్తి కథలేం రాలేదు. ఉద్యమ కథల్లో భాగంగానే దళిత కథలూ వచ్చాయి. ఉద్యమాలు దళిత సమస్యను ఉద్యమాల్లో భాగంగానే పరిగణించాయి. అయితే ఆ తర్వాత దళిత సాహిత్యోద్యమం తెలుగులో చెప్పుకోదగ్గంత ఉధృతంగానే వచ్చింది. అందుక్కారణం ఉద్యమ సాహిత్యంలో భాగంగా దళితుల గూర్చి, దళిత సంవేదన గూర్చి రావాల్సినంత సాహిత్యం రాలేకపోవడం.. స్త్రీవాదోద్యమం వచ్చింతర్వాత స్త్రీల గూర్చి అద్భుతమైన కథలు, సాహిత్యం వచ్చినట్టే దళిత సాహిత్యోద్యమం వచ్చింతర్వాత దళితుల గూర్చి కావాల్సినంత సాహిత్యం వచ్చింది. వాళ్ల గూర్చి ఇదవరకు స్పృశించని అనేక పార్శ్వాలను స్పృశిస్తూ కథలొచ్చాయి. ఇవి పీడితవర్గ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. ఇందుకు ఉదాహరణలుగా కె. లక్ష్మీనారాయణ అనంతపురం నుంచి, బి.యస్. రాములు జగిత్యాల నుంచి తీసిన కథాసంకలనాలే నిదర్శనం. ఏదేమైనా పోరాట సాహిత్యంలో భాగంగా వచ్చిన దళిత కథలకున్న ప్రత్యేకత ఉండనే ఉన్నది.



ఇంతకీ దళితులంటే ఎవరు? పీడితులంతా దళితులే. ఒక విధంగా చూస్తే స్త్రీలు కూడా దళితులే అన్న మాట వాస్తవమే అయినా అలా అనడం వల్ల సరైన దళిత సమస్య తీవ్రతను తగ్గించనట్టే అవుతుంది. అందువల్ల దళితులంటే అంటరానితనమనే సామాజిక రుగ్మతకు గురవుతూ హరిజనులని పిలువబడేవారు. దగ్గరకు పోలేనివాళ్లు... మాలమాదిగల్లాంటి కులాలవాళ్ల గురించి వచ్చిన కథలే దళిత కథలు. దళితులు, కూలినాలి చేసుకుని బతికే పేదవాళ్ల సమస్యల పరిష్కారానికి ఎర్రజెండా పార్టీలననుసరించడమే మార్గమని తెలిపే కథ ఎన్నార్ భోలా రాసిన 'నూలుపోగు'. మెజారిటీ ప్రజల ఓట్లతో గెలిచి, హరిజన ఇతర దళిత వర్గాల ఓట్లతో అధికారానికి వచ్చి వాళ్లకే వ్యతిరేకంగా నిర్ణయాలు చేసే కపట రాజకీయ నాయకుల బండారాన్ని బయటపెట్టే కథ సిహెచ్. మధు రాసిన 'బావి'. సంస్కరణల పేరుతో కులాలను పెంచి పోషించే దుర్మార్గాన్ని, హరిజనులకు వేరే మంచినీళ్ల బావి తవ్వించడమనే విషయాన్ని, హరిజనులకు హోటళ్లలో వేరే గ్లాసులు పెట్టే విషయాన్ని ఎదిరించడం అంశాలుగా గల కథ ఇది. దళితులు సవర్ణుల మధ్య సంఘర్షణ అంతం కావడానికి పోరాటమే మార్గం. పొట్టకూటి కోసం పాములను కరిపించుకుంటూ, పాములనాడిస్తూ బతికే పాములవాడి భార్యను బలాత్కరిస్తాడు దొర. తమ స్త్రీకి జరిగిన అవమానానికి ప్రతీకారంగా దేశద్రిమ్మరులంతా ఏకమై దొరపై దాడి చేయడం అంశంగా గల కథే భూపాల్ రాసిన పాము. సంచార తెగవారిపై ఊరిదొరలు సాగించే దోపిడీని, పెత్తనాన్ని గూర్చి తెలిపే మరో కథ ఉప్పల నరసింహం రాసిన 'ఇప్పుడే ఉదయిస్తున్న సూర్యుడు'. తెలంగాణా గ్రామాల్లోని దొరల స్వరూపాన్ని, దోపిడీని చేపలమ్ముకుంటూ బతికే స్త్రీదృక్కోణంలోంచి చిత్రిస్తున్న కథ ఇది. ఈ కథ నిండా చక్కని మాండలిక భాషా పదాల ప్రయోగం తెలంగాణా జీవితాలున్నాయి. పోరాటాలతో సూర్యుడు సంచార జాతులవారి జీవితాల్లోనూ ఉదయిస్తున్నాడంటాడు రచయిత. మెదక్ కరువుతో బిచ్చగాడిగా మారిన కిష్టయ్య, ధర్మం చేయండంటూ హృదయ విదారకంగా అరుస్తూ అడుక్కుతినే లచ్చవ్వ... లారీ క్లీనర్... కుంటి, గుడ్డి, కుష్ఠురోగి లాంటి వాళ్లందరి సమస్యలకు పోరాటమే మార్గమని తెలిపే కథే ఉప్పల నరసింహం కలం నుంచి వెలువడిన బహిరంగసభ. ప్రజాకళలు, ప్రజాకళాకారుల లక్ష్యం కళను ప్రజల దగ్గరకు చేర్చడమే కదా! పరిస్థితులు వికటించి బిచ్చగాళ్లుగా బతుకుతున్నవాళ్లపై సానుభూతి చూపడం కాకుండా కాఠిన్యం వహించే పెద్దల రాక్షసత్వాన్ని ప్రశ్నించే కథ దేవరాజు మహారాజు, బి. విద్యాసాగర్‌రావు రాసిన 'ఊరేగింపు' పారిశ్రామికవేత్తలు, రాజకీయ

దురంధరులు, ఖరీదైన బట్టలవాళ్లంతా నగరం అందాన్ని కాపాడాలన్న సాకుతో బిచ్చగాళ్లను, కుష్ఠురోగులను నగరానికి దూరంగా లాక్కుపోవాలని ఊరేగింపు తీస్తారు. వాళ్లను కుక్కల్లా పట్టుకుపోతున్న విధానానికి నిరసనగా విద్యార్థులు సమ్మె చేస్తారు. దశాబ్దాలుగా దొరకు పాలేరున్నా ఆ దళితుడికి ఒరిగిందేం లేదు. కడుపు నిండా తిండి కూడా దొరకలేదు. ఉద్యమాల వెలుగులో తన జీవితాన్ని మననం చేసుకొని తిరుగుబాటే శరణ్యమని నిర్ణయించుకున్న దళిత పాలేరు కథే నేను రాసిన 'పాలేరు'. మురికి కాలువల్లోని బురదను, చెత్తను శుభ్రం చేస్తూ బతికే మసికట్లవాడిపై దోపిడీని గూర్చి తెలిపే కథ నటరాజ్ రాసిన 'సహనరేఖ'. ఆకలికి కులాలుండవని, దోపిడీకి వావివరుసలుండవని తెలిపే కథ. ఈ కథల్లో దళితుల సమస్యలు కొంతమేరకైనా చిత్రించడం జరిగినా ఆ చిత్రీకరణ దళితులపై, దళిత సమస్యపై సానుభూతితో చిత్రించనవే. ప్రజాస్వామిక యుగమని; పాలనని చెప్పబడుతున్న కాలంలోనూ అస్పృశ్యత లాంటి దురాచారం వుండటం, దళితులు దాన్ని ప్రతిఘటించడానికి ప్రయత్నించడం ఈ కథల్లో గమనించవచ్చు. ఉద్యమకారులు దళితుల సమస్యలను వేరుగా భావించనట్టే ఈ కథలు రాసిన రచయితలు కూడా ఆ సమస్యలను వేరుగా భావించలేదు. ఎవరి జీవితాలను వాళ్లు రాయడం వల్ల ఆ విషయంలో సమగ్రత వస్తుందన్న వాదంలో బలమున్నా ఈ కథలను దళితేతరులే రాయడం విశేషం. సంస్కరణలు పైపైపూతల వంటివని, సమాజంలో సమూల మార్పు రానిదే దళితుల సమస్యలు పరిష్కారం కావని, అందు కోసం వాళ్లు విప్లవోద్యమాల్లో పాల్గొనడమే మార్గమని ఈ కథలు చెబుతున్నాయి.

తెలుగునేలపై ఒకనాడు ఉజ్వలమైన పాత్ర వహించిన అభ్యుదయ సాహిత్యోద్యమం దళిత, ఇతర నిమ్నవర్గాల సమస్యలను రైతాంగ పోరాటాల్లో భాగంగానే చూసింది. అంబేద్కర్‌లా, పూలేలా కులసమస్య తీవ్రతను ఈ ఉద్యమాలు గుర్తించలేదు. వర్గ స్పృహ లేని కులస్పృహ, కుల స్పృహలేని వర్గస్పృహ పాక్షిక ఫలితాలనే యిస్తాయన్న విషయం గమనించాలి. అందుకే ఆ తర్వాత దళిత సాహిత్యం విరివిగా వచ్చి ఆ రంగంలో సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. ఇప్పుడా సాహిత్యం అవసరం మరింత పెరిగింది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 23 ఫిబ్రవరి 2004**



# కథల్లో నిక్షిప్తమైన తెలంగాణ చరిత్ర

నా విష్ణుః పృథ్వీపతిః అని విశ్వసించబడినంత వరకు రాజుల, రాజస్థానాల కథలే, రాణుల రాణివాసాల గాథలే చరిత్ర కావడం ఎవ్వరికీ ఎబ్బెట్టుగా తోచలేదు కూడా.

రాజులు, రాణులు పోయినందున ప్రజలే రాజులవుతున్నందున ఇక చరిత్ర స్వరూపమే మారిపోవాలి. ఈ ప్రజాయుగంలో వెలువడివలసినవి ప్రజాచరిత్రలు. ఈ చరిత్ర దాదాపు ఒక జీవితకాలపు పరిశోధనా ముక్తాఫలం...

సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర గూర్చి రాస్తూ నార్ల వెంకటేశ్వరరావుగారన్న మాటలివి.

మనకీ పోరాట కథల్లో సామాన్య మానవుడే నాయకుడవడం కనబడుతుంది. ఈ కథల్లో కథానాయకులు సర్వసంపదలకు సృష్టికర్తలై ఉండి కూడా ఆ సంపదలను అనుభవించలేని స్థితిలో ఉన్న పోచయ్యలు, నర్సయ్యలు, రాజయ్యలు, నర్సమ్మలు, భూదేవిలు, మల్లయ్యలు, ఎంకయ్యలు, నర్సక్కలు.. లాంటి అతి సామాన్యులే. ఈ కతలు రాసిన రచయితలంతా ప్రజల పక్షం వహించి వాళ్లకు చేదోడువాదోడుగా ఉంటూ ధైర్యాన్ని నూరిపోస్తూ పోరాటావసరాన్ని గుర్తు చేస్తూ రచనలు చేశారు. ఇక్కడ ప్రజలంటే నిత్యం దోపిడీపీడనలకు గురయ్యే అథోజగత్సహోదరులేనన్న విషయం స్పష్టం. ఈ కథల్లో ముఖ్యంగా కార్మిక దృక్పథముండి అట్టడుగు వర్గాలకు ప్రాధాన్యతుండటం గమనించవచ్చు. ఈ కథల్లో తెలంగాణా సామాన్య ప్రజల సాంఘిక, ఆర్థిక, సామాజిక చరిత్ర నిక్షిప్తమై ఉంది. వెయ్యేళ్ల సాహితీ ఆధారాలతోసురవరం ప్రతాపరెడ్డిగారు తెలుగువాళ్ల వెయ్యేళ్ల సాంఘిక చరిత్రను రాశారు. ఈ కథలు మరికొన్ని కథల ద్వారా తెలంగాణా ప్రజల సాంఘిక చరిత్రను రాయవచ్చు. సాహిత్యం సాంఘిక జీవిత ముక్తాఫలం అని చెప్పడానికీ కథలు సజీవ ఉదాహరణలు.

గాంధీ, అరవింద ఘోష్ లాంటి అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని కోరేవాళ్లు గీతను ఆశ్రయిస్తే కబీర్, వేమన, నాందేవ్‌లాంటి వారు గీతనాశ్రయించలేదంటారు ప్రఖ్యాత చరిత్రకారులు డి.డి. కొశాంబి. శతక రచయితలు, వేమనలాంటి ప్రజాకవులు సామాన్య ప్రజల పక్షం వహించి సమాజం గుట్టు విప్పి చెప్పినట్టుగా ఈ కథలు రాసిన రచయితలు సామాన్య ప్రజలది కాని ఈ వ్యవస్థలోని లోపాలను నిర్మొహమాటంగా బయటపెట్టారు.

వేమన మార్గాన్ని, గురజాడ దృక్పథాన్ని, కా.రా., రా.వి. శాస్త్రి గార్ల అట్టడుగు ప్రజా జీవిత సాహిత్య మార్గాన్ని మరింత విశాలం చేస్తూ ముందుకు తీసుకెళ్లారీ రచయితలు. ఈ కథల ద్వారా తెలంగాణా ఉద్యమ చరిత్రనూ తెలుసుకోవచ్చు. ఉద్యమాల్లో ఎవరి పాత్రేంటో ఇందులో ఎక్కువగా పాల్గొన్నవాళ్లెవరో ఈ కథలు చదివితే అర్థమవుతుంది.

నూటికి ఎనభై మంది నివసించే గ్రామాల గూర్చి అంతగా కథలు రాని కొరతను ఈ కథలు తీర్చాయి. గ్రామాలను రొమాంటిక్ భ్రమలతో కాకుండా వాస్తవిక దృక్పథంతో చిత్రించడం ఈ కథల్లో చూడవచ్చు. ఈ కథలు తెలంగాణా గ్రామీణ జీవితాల మాగ్నాకార్టాలని చెప్పవచ్చు. నిరంతర పోరాటాలతో అగ్ని గుండాలుగా మారిన తెలంగాణా గ్రామాలు ఈ కథల్నిండా కనబడతాయి. తెలంగాణా గ్రామాల్లో రెడ్లు, వెలమలు, కరణాలు, దొరలు, పటేండ్లు, పంతుల్లుగా పిలవబడే వాళ్లు.... గౌరవ వాచకాలుగా ఉపయోగించబడిన ఈ పదాలు పోరాటాల కాలంలో తిట్టుపదాలనేంత వ్యతిరేకార్థంలో ఉపయోగింపబడినట్లు ఈ కథలు చదివితే అర్థమవుతుంది. ఈ కథల్లో ప్రతినాయకులు వీళ్లే....

తెలంగాణా గ్రామాల్లో భూస్వామ్య, ఫ్యూడల్ నాగరికత ఈ కథలు వెలువడే నాటికి వేళ్లూనుకొనుందని ఇవి చదివితే అర్థమవుతుంది. దొరా, బాంచెన్, నీ గులాపోన్ని లాంటి పదాలు ఇంకా వాడకంలో ఉండటం మరో దిక్కు పోరాటాలు ఉధృతంగా సాగుతుండటం ఈ కథల ద్వారా అర్థమవుతుంది. ఈ కథలు వచ్చే కాలం నాటికే కాకుండా చాలావరకు ఇప్పటికి కూడా సాంప్రదాయిక పద్ధతిలోనే వ్యవసాయాలు చేయడం తెలంగాణా గ్రామాల్లో ఉంది. ప్రజా పోరాటాలు గ్రామాల్లో తీసుకొచ్చిన మార్పులను, అట్టడుగు జనాలను అక్కున చేర్చుకున్న విషయాన్ని మనమీ కథల ద్వారా తెలుసుకోవచ్చు. తెలంగాణా గ్రామాల్లో ప్రజాపోరాటాల పట్ల స్పందన ఎక్కువగా కనబడటానికి కారణం అక్కడి పరిస్థితులేనని, దోపిడీ పీడనలకు గురవుతున్న ప్రజలకు పోరాటాలు మనోధైర్యాన్నిచ్చాయని ఈ కథలు చదివితే అర్థమవుతుంది. భూస్వామ్య వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ వ్యవస్థకు, ఆ తర్వాత సోషలిస్టు సమాజానికి మారడమనేది క్రమం. తెలంగాణా గ్రామాల్లో భూస్వామ్య వ్యవస్థ నుండి నేరుగా సోషలిస్టు వ్యవస్థ ధ్యేయంగా పోరాటాలు సాగాయని ఈ కథలు చెబుతున్నాయి.

ఈ కథల్లో మెజారిటీ కథలు గ్రామాల గురించి వచ్చినవే. గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చి కలం పట్టి గ్రామాల గూర్చి రాసిన రచయితలే ఎక్కువ. తమకు తెలిసిన విషయాలు, చుట్టూ జరుగుతున్న పోరాటాల గూర్చి రాశారు కాబట్టే ఇందులో వాస్తవికతా



పరిమళముంది. ఏనాటికైనా శ్రమజీవులదే పైచేయి అవుతుందని, రైతాంగ పోరాటాలే ప్రజల సమస్యలకు పరిష్కారాలని చెబుతున్నాయీ కథలు. జాతీయ సంస్కరణోద్యమాలు జరుగుతున్న కాలంలో వచ్చిన కథల్లో గాంధీజీ, వీరేశలింగం పంతులు, రాజారామ్ మోహన్ రాయ్‌లాంటి వాళ్లు నాయకులుగానో, పరోక్ష నాయకులుగానో చిత్రింపబడితే పోరాటాలు ఉధృతంగా సాగుతున్న కాలంలో వచ్చిన కథల్లో పోరాటవీరులు, పోరుకల సార్లు, సత్యం మాస్టార్లు గిరిజనుల నాయకులయ్యారు. ప్రభుత్వాలు పోరాటాలకు గల మూలాలను గుర్తించకుండా ఎంత అణచడానికి ప్రయత్నించినా సాధ్యం కాకపోవడానికి కారణం ఆ పోరాటాలకున్న ప్రజాబలమేనన్న విషయం ఈ కథల ద్వారా తెలుసుకోవచ్చు.

పోరాట ప్రాంతమైన తెలంగాణా గ్రామాల్లోని అల్లకల్లోలాన్ని, అలజడిని చిత్రించిన కథలివి. ప్రజల ప్రయోజనాలను కాపాడకుండా ప్రజా పోరాటాలను అణచడానికి ఉపయోగపడే పోలీసు వ్యవస్థపై ఈ కథలు రాసిన రచయితలకు సదభిప్రాయం లేదు. అయితే పొట్ట నింపుకోవడానికి ఉద్యోగం చేసే పోలీసులను ఉద్యమకారులు వర్గశత్రువులుగా భావించడం, వాటిని సమర్థిస్తూ కొందరు కథలు రాయడం సరైంది కాదు. ప్రజా సమస్యల పట్ల, ప్రజా సంవేదనల పట్ల స్పష్టమైన అవగాహన, సామాన్య మానవుడి ప్రయోజనాలను కాపాడని ఈ వ్యవస్థపై ఆగ్రహం ఈ కథల్లో కనబడుతుంది. ఈ కథల్లో సిద్ధాంతాల బరువు కొంతున్నా సాహిత్యం జీవిత వృక్షానికి పూసే పువ్వు అన్న కొడవటిగంటి కుటుంబరావు మాటలు సత్యాలని ఈ కథ చదివితే అర్థమవుతుంది.

అథోజగత్సహోదరులను హృదయానికి హత్తుకొని వాళ్ల జీవితాల్లో మార్పును కోరుతూ రాయబడిన ఈ కథల్లో వాళ్ల భాషయైన మాండలికమూ చోటు చేసుకుంది. ప్రజల భాషకు పట్టం గట్టి ఈ కథల ద్వారా విస్తృత ప్రచారం తీసుకురావడం గమనించవచ్చు. మాండలికాన్ని పాజిటివ్ ఫ్యాక్టర్‌గా ముందుకు తెచ్చి అలా తప్పకుండా రాయాలన్న ఆలోచనను రేకెత్తించే కథలివి. ఈ కథలను గొప్పోళ్ల రాజ్యంపై కోపం ప్రకటించే కథలుగా పేర్కొనవచ్చు. ఈ కథలన్నింటిలోనూ కొ.కు. చెప్పినట్టు వస్తువే ప్రాధాన్యం వహించినా కథ రాయడంలోని మెలుకువలు, రాసే నేర్పుంటే ఏ వస్తువును తీసుకున్నా అద్భుత కళాఖండంగా తీర్చిదిద్దవచ్చని ఇందులోని కొన్ని కథలు చదివితే తెలుస్తుంది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 16 ఫిబ్రవరి 2004**

# పట్టణ జీవిత సంఘర్షణా చిత్రణ

తెలంగాణాలో రచయితలుగా పేరు తెచ్చుకున్నవారిలో చాలామంది గ్రామాల గూర్చి రాసినవాళ్లే. గ్రామీణ జీవితంలోని సంఘర్షణను, విలువలను, నశిస్తున్న వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులను ఇతివృత్తాలుగా తీసుకొని సాహితీ సృజన చేశారు. మాండలిక భాషను, నుడికారాన్ని పట్టుకున్నారు. తొలి తరంలోనైనా, మలితరంలోనైనా, ఆ తరువాతి తరంలోనైనా ఈ పరంపరే కొనసాగుతుంది. మరికొందరు వలసలు, ఊళ్లో ఉండలేని, బతుకుదెరువు లేని అనివార్య పరిస్థితుల వల్ల ఊళ్లొదిలిపోవడం గూర్చి చిత్రించి రచయితలుగా పేరు సంపాదించుకున్నారు. కొందరు రజాకారు పోరాటాల గూర్చి అటు తర్వాత వచ్చిన రైతాంగ పోరాటాల గూర్చి రాసి పోరాట సంప్రదాయాన్ని సాహిత్యానికెక్కించారు. 1970-90ల మధ్యనయితే తెలంగాణా కథంటే పోరాట కథేనన్నంత విస్తృతంగా కథలొచ్చాయి. విరసం ఆవిర్భావం, విప్లవోద్యమాలు పుంజుకోవడం, విప్లవకథను ప్రచురించే పత్రికలు విరివిగా రావడం వల్ల ఈ స్థితి సంభవించింది. విప్లవోద్యమాలున్న సమయంలో పోరాట కథ రాయకుండా ఉండటం ఎలా సాధ్యం కాలేదో మొత్తంగా తెలంగాణా కథంటే గ్రామీణ జీవిత కథన్నంతగా ప్రచారం పొందింది. ఇందుక్కారణం గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చిన వాళ్లే ఎక్కువ మంది రచయితలుగా పేరు తెచ్చుకోవడం. గ్రామీణుల మాండలిక భాషను పట్టుకోవడం. కొందరు పట్టణాల్లో స్థిరపడ్డ రచయితలున్నా గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చినవాళ్లే. పోతే హైదరాబాద్, వరంగల్ లాంటి రెండు నగరాలు తప్ప జిల్లా కేంద్రాలైన పట్టణాలు కూడా చిన్న చిన్న గ్రామాలున్నట్టుగా ఉండటం, ఈ మధ్యకాలంలోనే చాలా పట్టణాలు పట్టణ లక్షణాలను సంతరించుకుంటున్నాయి. అటు తర్వాత కులపోరాటాలు, బహుజనుల గూర్చి కథలూ విరివిగానే వచ్చాయి. ఇవి కూడా ముఖ్యంగా గ్రామాల గురించే.

అయితే పట్టణాలకు లేదా హైదరాబాద్‌లాంటి నగరాలకు వలసపోయి తమకు తెలిసిన తాము అనుభవించిన పట్టణజీవిత సంఘర్షణను గమనించిన పట్టణాన్ని గూర్చి రాసిన కథకులూ ఉన్నారు. పట్టణ సంక్లిష్టతను కవితలుగా రాసిన వాళ్ల పేరు తెచ్చుకున్నారు. కాని కథలుగా రాసినవాళ్లకు పెద్దగా పేరు రాలేదు. ఇలాంటివాళ్లను దాదాపు విస్మృతి గర్భంలో కలిపేశారు. అలాంటివారిలో పేర్కొనదగినవారు దేవరాజు మహరాజు, పులుగు శ్రీనివాస్, కాసుల ప్రతాపరెడ్డి. వీళ్లు రాసిన కథల్లో హైదరాబాద్



నగర సంఘర్షణ, సంక్లిష్టత, అశాంతి, ఒత్తిడి, అసంతృప్తి దర్శనమిస్తాయి. గ్రామాలు వీడి పట్టణంలో బతుకుదామని వచ్చిన ఈ జనారణ్యంలో తాము అనుభవిస్తున్న తీవ్ర సంఘర్షణను కథలుగా మలిచారు. దేవరాజు మహరాజు, బి. విద్యాసాగర్ రావు కలిసి రాసిన ఇలాంటి రెండు కథలు శవం నడిచి వెళ్తుంది, బతుకుతీపి. ఓ దిక్కు శవంగా పడి ఉన్న మనిషి. అతడు బతికున్నప్పుడు అతనితో రకరకాల సహాయాలు పొందినవాళ్లు కూడా ఆ శవాన్ని పట్టించుకోరు. పైగా వ్యతిరేక వ్యాఖ్యానాలు. అయితే శవం నిండా పూలదండలు. పట్టణంలో కర్ఫ్యూ. ఇది మామూలు విషయమే. ఎప్పుడూ ఏ ఆందోళన జరుగుతుందో, ఏ సమయంలో కర్ఫ్యూ పెడతారో ఎవరికీ తెలియదు. మరో దిక్కు మతకలహాల గొడవలు. ఒత్తిడి, కరువైన ప్రశాంతత, సామాన్య మానవుడి సంఘర్షణ ఫైరింగవుతుంది..... పారిపోండి అని కేకలు... పెడబొబ్బలు... కేకలు.. పోలీసు వ్యాన్లు... భాష్పవాయు ప్రయోగాలు.... గుండెలు ఊడిపోతున్న భయం... తుపాకీ దెబ్బ... సందుల గుండా పరుగు... మరో దిక్కు వర్షం... శవం ఊరేగింపులో పాల్గొందామని వచ్చిన వాళ్లు ఫైరింగ్‌కు భయపడి వదిలిపెట్టి పరుగెత్తడం... శవమొక్కటే మిగుల్తుంది. వర్షపు నీటి ప్రవాహంలో ఆ శవం నడిచి వెళ్తుంది. పట్టణ జీవితంలోని సంఘర్షణను, ఒకర్నొకరు పట్టించుకోని విధానాన్ని ప్రతీకాత్మకంగా అద్భుతంగా చిత్రించాడు రచయిత. డబ్బుల్ డెక్‌లో పోతున్న మనిషి తీవ్రమైన ఒత్తిడికి గురయిన తనను తాను తెలుసుకుంటాడు. తన దగ్గరున్న ట్విక్ ట్వంటీ నల్లుల మందుతో ఆత్మహత్య చేసుకోవాలనుకుంటాడు. అదీ ఐదు రూపాయలప్పు చేసి కొన్నదే. గదిలోకెళ్లి బాటిల్ టేబుల్‌పై పెడతాడు. ఇంటావిడ కూతురు నల్లులను చంపడానికి తెచ్చారా అనడంతో అవునంటాడు. ఆమె అందం, మాటలు అతనిలో మార్పు తీసుకొస్తాయి. బతుకుపై తీపి పెరుగుతుంది. ఆత్మహత్య ప్రయత్నం విరమించుకుంటాడు. ఆ మందును నల్లులను చంపడానికే ఉపయోగిస్తాడు. పట్టణ జీవితంలోని ఒత్తిడిని తట్టుకోలేక ఎంతమంది ఆత్మహత్యలు చేసుకున్నారో. మనిషి ఎలా బతికాడన్నది కాదు ఎలా చచ్చాడన్నది ముఖ్యమంటారీ రచయిత కథలో.

పులుగు శ్రీనివాస్ రాసిన వెలుగురేఖలు కథ నగరంలో మనిషి పడుతున్న కష్టాలను, నగర జీవితంలోని విషాదాన్ని తెలిపే మంచి కథ.... చల్లటి గాలి, కమ్మటి నీళ్లు దొరికే ఊళ్లనుంచి పట్నానికొస్తే ఏముంది? అన్నీ కష్టాలే... ఖర్చులే... ఎక్కడికి పోదామన్నా డబ్బుతో ముడిపడి ఉన్న వ్యవహారాలే. వాన. వరద... రోడ్లు... లోయర్ మిడిల్ క్లాస్ ఆలోచనలు... డొక్కు స్కూటర్ బతుకు.... నగర జీవితంలోని విషాదాన్ని

తెలిపే కథ వెలుగురేకలు...

పట్టణంలో బతుకుదామని వచ్చిన బాటసారికి ఎంత కష్టం? ఎంత కష్టం? అన్న శ్రీశ్రీ గేయంలోని వాక్యాలు గుర్తుకొస్తాయి కాసుల ప్రతాపరెడ్డి కథలు చదువుతుంటే... పల్లెల్లో వ్యవసాయాలు నడవకనో, చదువుకోవడం కోసమో, బతుకుదెరువును వెతుక్కుంటూనో, ఉద్యోగ రీత్యానో వ్యవసాయ కుటుంబాల్లోని వ్యక్తులు నగరానికొచ్చి పడుతున్న బాధలను, అనుభవిస్తున్న మానసిక సంఘర్షణను తన కథల్లో చిత్రించాడీ రచయిత. బొద్దింక, పరాన్నజీవి, సిక్‌నెస్, కనకదాసు, వెన్నెల మెట్లు, ఆఫ్టర్ ట్వంటీ ఇయర్స్ అనే కథల్లో మనకీ సంఘర్షణ కనబడుతుంది. ఇరవై ఏండ్ల తర్వాత కలిసిన పోలీసు ఇన్‌స్పెక్టరయిన మిత్రున్ని కలుసుకోవడానికి పడుతున్న మానసిక సంఘర్షణే ఆఫ్టర్ ట్వంటీ ఇయర్స్... నక్సల్స్ సానుభూతిపరుడైన తనను అతను నక్సల్‌గానే చూస్తున్నాడేమోనని మానసిక వేదనకు గురువుతాడా వ్యక్తి. కాలేజీ జీవితంలోని రంగు రంగుల జీవితం అటు తర్వాత నిజ జీవితంలోకి ప్రవేశించాక ఎలా వాస్తవం కాదో వెన్నెలమెట్లు కథలో చిత్రించాడు.

వ్యవసాయ కుటుంబాల్లో ఇద్దరు కొడుకులుంటే ఒకర్ని చదివించడం మరొకర్ని వ్యవసాయం చేయడానికి ఉంచడం మామూలే. చదువుకుంటున్నవాడు పెద్దవాడైనా తను ఖర్చుల కోసం పని చేసే తమ్ముని మీద ఆధారపడి బతకాల్సిందే. పట్టణంలో చదువుకుంటున్న అన్న ఫీజుల కోసం తమ్ముణ్నడగడం తక్కువగా భావిస్తాడు. తానెంత పరాన్నజీవిగా బతుకున్నాడోనని పడే మనఃసంఘర్షణే పరాన్నజీవి కథ. చిన్న ఉద్యోగులు చాలీచాలని జీతం బతుకులతో పట్నంలో పడే పాట్లను తెలిపే కథ బొద్దింక... పట్టణంలో చదువుకుంటున్న వ్యక్తి ఊరి మీద బెంగతో వేదనా పీడుతుడు కావడం అంశంగా గల కథ సిక్‌నెస్. అలాంటి మరో కథే కనకదాసు... పది, పదిహేనేళ్ల క్రితం వరకూ కూడా గ్రామాల్లోంచి వచ్చి పట్టణాల్లో చదువుకోవడం అపురూపమే. చంద్ర రాసిన కాకులు, నవీన్ కథల్లోనూ పట్టణ సంఘర్షణ కనబడుతుంది. పట్టణ సంఘర్షణను చిత్రించిన కథలుగా ఈ కథలకు, కథకులకు తెలుగు సాహిత్యంలో సముచిత స్థానం ఉంటుంది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 13 అక్టోబర్ 2003**



# మాండలికంలోనే మాట్లాడండి

పది పన్నెండేండ్ల క్రితమనుకుంటాను. నేనో ప్రొఫెసర్‌గారి దగ్గరికెళ్లాను. అతను మంచి రచయిత కూడా. నా పేరు, రచనలు అతనికి, అతని పేరు, రచనలు నాకు తెలుసు. కాని మేం ఒకర్నొకరం కలుసుకోలేదప్పటివరకు. నేను పోయేసరికి ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతున్నాడు. ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాను. 'పద్దైదు రూపాయలకు కక్కుర్తి పడతాడు వాడు. అలాంటి నా కొడుకులతో మనకేంటి..?' అని దీర్ఘాలు తీస్తూ అచ్చమైన రాయలసీమ మాండలికంలో మాట్లాడుతున్నాడు. ఐదు నిమిషాలకు పైన్నే మాట్లాడాడు. నేను వింటూ కూర్చున్నాను.. చాలా ఎంజాయ్ చేశాను. అతడు తన మాండలికంలో మాట్లాడటం నాకెంతో సంతోషాన్నిచ్చింది. ఆశ్చర్యం కూడా కల్గించింది. యూనివర్శిటీ ప్రొఫెసర్ స్థాయిలో ఉన్న వ్యక్తి, మంచి రచయిత అంత స్వచ్ఛంగా మాండలికంలో మాట్లాడటం...! పోతే ఆయన మాండలికంలోనే రాయాలని అనేవారేం కాదు. పాత్రోచిత మాండలికం, వ్యావహారికంలో రాసేవాడు. రాయడం మాటెలా ఉన్నా తన ప్రాంత, తన తల్లిదండ్రుల భాషలో ప్రొఫెసర్ స్థాయికెదిగి కూడా మాట్లాడటం నాకెంతో సంతోషాన్నిచ్చింది. తన మూలాలను మరిచిపోక పోవడం ఆనందాన్నిచ్చింది. తర్వాత చాలా మంది ఇతర రచయితలు మాట్లాడే తీరును గమనించాను. కోస్తా, రాయలసీమల వాళ్లు చాలామంది తమ తమ మాండలికాల్లోనే మాట్లాడుతున్నారు. తెలంగాణా రచయితలు మాత్రం చాలామంది మాటల్లో మాండలికాన్ని వదిలిపెట్టారు. రాతల్లో మాండలికం రాస్తూ మాటల్లో మాత్రం మరిచిపోవడం గమ్మత్తయిన విషయం. ఇందుకనేక కారణాలున్నాయి. ఇవి కొందరికి బాధ కలిగించినా ప్రస్తావించక తప్పలేదు.

అందుకుగల ప్రధాన కారణం ఆత్మన్యూనత. పల్లీయుల భాషలో మాట్లాడితే తమను తక్కువ చూస్తారన్న భావం. తామూ చదువుకొని సాంస్కృతీకరణం చెందామని చాటడం కోసం పాలకుల భాషే నా భాష అని చెప్పుకోవడం కోసం. మొదట్నుంచీ తెలంగాణావాళ్లకున్న ఆత్మన్యూనతా భావాన్ని రచయితలైన వాళ్లు కూడా పోగొట్టుకోక పోవడం విషాద విషయమే.

ఇందుకు గల మరోకారణం అనుకరణ మనస్తత్వాలు. ఇతరులను లేదా పాలకులైన వారి భాషను అనుకరించి మేమూ నాగరికులమేనని చెప్పుకోవడం కోసం.. లేదా తామనుకోవడం. అంతరంతరాల్లో ఉన్న అనుకరణ మనస్తత్వం

కష్టజీవులకిరువైపులా ఉండాల్సిన రచయితలతో కష్టజీవుల భాషను, తన తల్లిదండ్రుల భాషను మాట్లాడకుండా చేసింది. తాము కష్టజీవుల గూర్చి రాస్తున్నాం, వాళ్ల భాషలోనే రాస్తున్నామని చెప్పుకోవడానికి పాత్రల సంభాషణకు మాత్రం మాండలికం ఎన్నుకున్నారు.

ఇందుకు గల మరో కారణం తాము చదివిన పాఠ్యపుస్తకాల్లో ఎక్కడా మాండలికం లేకపోవడం. పాఠ్యపుస్తకాల భాషను మాట్లాడటానికి తనను తాను తయారు చేసుకున్నారు. అంతరాంతరాల్లో పరాయీకరణకు గురయ్యారు. మరో కారణం ఉద్యోగించడం. ఉద్యోగం చేస్తున్నప్పుడు రకరకాల ప్రాంతాల వారితో మాట్లాడవలసి రావడం. తమ మాండలికంలో మాట్లాడితే ఏమనుకుంటారోనన్న భావం ఓ కారణమైతే వాళ్లకు అర్థమవుతుందో కాదోనన్న జంకు మరో కారణం...

అంతరాంతరాల్లో మాండలికాన్ని తనదైన భాషను చేసుకోకపోవడం... తమపై తమకే నమ్మకం లేకపోవడం. తమది వెనుకబడిన ప్రాంతమనుకోవడం....

ఇంకా అనేక ఇతర కారణాలు, వివక్ష వల్ల కొందరు రయితలు ప్రయత్నించి వ్యావహారికంలో మాట్లాడటం, ఉపన్యసించడం నేర్చుకున్నారు. మాటల్లో మాండలికాన్ని బలవంతంగా తరిమేశారు.

ఇంకా ఎన్నెన్నో కారణాల వల్ల తెలంగాణా రచయితలు చాలా మంది సంభాషణల్లో సాంస్కృతీకరణం చెందారు. రాతల్లో మాత్రం మాండలికాన్ని తమ హృదయాల నిండా నింపుకున్నారు. కొందరు మాత్రం మాటల్లోనూ, రాతల్లోనూ పరాయీకరణం చెందారు.

మిగతా ప్రాంతాల వాళ్లలో చాలా మంది ఏ ఆర్థిక, సామాజిక స్థాయిల్లో ఉన్నవాళ్లయినా వాళ్ల మాండలికంలో మాట్లాడుతుంటే తెలంగాణా రచయితలు, ఉన్నత స్థాయి విద్యగల వాళ్లు తమ మాండలికంలో మాట్లాడితే నష్టమేంటో అర్థం కాని విషయం. ఢిల్లీకి రాజయినా తల్లికి కొడుకేనన్న విషయం మరిచిపోకూడదు. వేముల పెరుమాళ్లలా, మన మాజీ ముఖ్యమంత్రి టంగుటూరి అంజయ్యలా, మాజీ అధికార భాషా సంఘం అధ్యక్షురాలు పి. యశోదారెడ్డిలా మాండలికంలో మాట్లాడితే చదువుకున్న వాళ్ల గౌరవానికేమైనా భంగం కలుగుతుందా? ఉపన్యాసాలిచ్చేటప్పుడు తమ ప్రాంతమేదో కూడా తెలియకుండా ఉండేట్టు జాగ్రత్త పడుతుండటం ఏం ప్రయోజనం కోసం?

అన్నా, తమ్మీ, బావా, బామ్మర్దీ అని పిల్చుకోవడంలో ఎంత ఆత్మీయతుంది?



అక్కా మంచిగున్నవా? తాతా ఎప్పుడచ్చినవ్? అని పలకరించడంలో ఎంత సమీపృతుంది? పరిమళభరితమైన పుష్పాల్లాంటి తల్లి భాషను మాట్లాడక కాగితం పూల భాషను మాట్లాడటం దేనికి? చిన్నతనంలో అవ్వయ్యల భాషలో మాట్లాడిన వాళ్లు తాము చదువుకున్న వాళ్లు కాబట్టి మాండలికంలో మాట్లాడితే తక్కువని భావించడం దేనికి?

ఓ దిక్కు ప్రాంతీయ భాషలు, ప్రాంతీయ మాండలికాలు మటమాయమయ్యే పరిస్థితులు ముంచుకొస్తున్నాయి. అంతా ప్రపంచీకరణం మాయలో కొట్టుకుపోతున్న సమయంలో ప్రాంతీయ మాండలికాలకు మరింత ప్రమాదమేర్పడుతుంది. అందుకే అస్తిత్వ ఉద్యమాలు, భాషా పరిరక్షణ ఉద్యమాలు తలెత్తుతున్నాయి. ఇలాంటి సమయంలో కేవలం రాతలతో మాండలికాల పరిరక్షణ కాదు. రాతలతో పాటు మాండలికంలోనే మాట్లాడటం అలవాటు చేసుకోవాలి. మేం మాత్రం సాంస్కృతీకరణం చెందిన భాషలో మాట్లాడుతాం – గ్రామీణులు మాత్రం మాండలికాల్లో మాట్లాడాలంటే ఏం బాగుంటుంది? ఆచరణ లేని ఉపదేశానికేం విలువుంటుంది?

అందుకోసం భాషను, మాండలికాలను కాపాడుకోవడానికి ఎవరి మాండలికంలో వాళ్లు మాట్లాడితేనే మంచిది. మాట్లాడటం మాత్రమే కాదు మాట్లాడించాలి. ఇది కష్టమైన పనేం కాదు. నిజానికి తెలంగాణా మాండలికాన్ని సురక్షితంగా ఉంచుతున్నది పల్లీయులు, నిరక్షరాస్యులు, పట్టణ కూలీలు, తక్కువ చదువుకున్న వాళ్లు, చదువుకున్నవాళ్లు, రచయితలు ఈ విషయాన్ని గమనించి తాము మాండలిక భాషా పరిరక్షణకు మాట్లాడటం ద్వారానూ తోడ్పడితే మంచిది.

ఒకప్పుడు మాట్లాడినట్టు రాయాలనేవారు. ఇప్పుడు రాసినట్టు మాట్లాడాలని తీర్మానించాలా? తెలంగాణా రచయితలంతా ఆలోచిస్తే మంచిది. ఆచరించడం మరీ మంచిది. ప్రయత్నిస్తే కానిదంటూ ఏమీ లేదు. ఈ విషయాన్ని ఇతర ప్రాంత రచయితలూ గుర్తిస్తే ఇంకా మంచిది.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 5 జనవరి 2004**

# అద్వితీయమైన వస్తువైవిధ్యంతో కథలు రాస్తున్న తెలంగాణా కథకులు

తన చరిత్రను తనే పఠించి
ఫక్కున నవ్వింది ధరణి
తన గాథను తనె స్మరించి
భోరున ఏడ్చింది ధరణి....

అవును... స్వాతంత్ర్యం వచ్చిన దరిదాపు సమయాల్లో పుట్టి, విద్యాబుద్ధులు నేర్చుకొని తమకున్న స్వల్ప అవకాశాలతో రచయితలుగా ఎదిగి, జీవితాలను గెల్చుకొన్నవాళ్లు, గెలుచుకుంటున్న తెలంగాణా రచయితలు అపారమైన వస్తు వైవిధ్యంతో కథలు రాస్తున్నారు. ఏడుస్తున్న, నవ్వుతున్న రకరకాల మార్పులకు లోనవుతున్న భూమాత సొదను స్వంతం చేసుకొని రాస్తున్నారు. వీళ్లలో చాలా మంది పీడిత కులాల నుంచి వచ్చినవాళ్లే. విశ్రాంతి సంస్కృతికి దూరంగా వున్నవాళ్లే. పని చేసుకుంటూ చదువుకున్న వాళ్లే. శ్రమజీవులను, శ్రమను హృదయానికి హత్తుకున్నవాళ్లే. అందుకే వీళ్లు తమ శ్రమ మూలాల్లోకి వెళ్లి రాస్తున్నారు. తమ మూలాలను మరిచిపోకుండా రాస్తున్నారు. తమను తాము తెలుసుకొని రాస్తున్నారు. పీడిత కులసంస్కృతిని ఉన్నతీకరిస్తూ రాస్తున్నారు. అందుకే తెలంగాణ నుంచి ఉద్యమ సాహిత్యం విరివిగా వచ్చింది. దళిత సాహిత్యానికి మార్గనిర్దేశం జరిగింది. బహుజన కథకు పునాదులు పడ్డాయి. సహస్ర వృత్తుల సమస్త చిహ్నాల కథలు విరివిగా వస్తున్నాయి. తమ తల్లిదండ్రుల భాషను, తనవారి జీవద్భాషను స్వంతం చేసుకొని రాస్తున్నారు. తెలంగాణా కథంటే పీడితుల సంస్కృతి, అట్టడుగు కుల పని సంస్కృతిని ఉన్నతీకరించే కథే అన్నంత విరివిగా రాస్తున్నారు. ఇందుకు కారణం ముఖ్యంగా వీళ్లంతా విశ్రాంతేతర కులాల నుంచి సంస్కృతి నుంచి వచ్చిన వాళ్లే కావడం.

ఎవరి సాహిత్యం వాళ్లు సృష్టించుకుంటే, ఎవరి కథలు వాళ్లు రాసుకుంటే, సాహిత్యం అనుభవాల్లోంచి, జీవితాల్లోంచి వస్తే అదెంత అద్భుతంగా ఉంటుందో, అది పని మూలాలనెలా స్పృశిస్తుందో తెలుసుకోవాలంటే దెబ్బెల తర్వాత మొదలై ఇప్పటికీ వస్తున్న తెలంగాణా తెలంగాణ కథలను పరిశీలిస్తే అర్థమవుతుంది. పని తాత్త్వికత పని చేసే కులాల్లోంచి సాహిత్యం వస్తే అందులో ఎంత వైవిధ్యం ఉంటుందో



కూడా ఈ కథలను చదివితే అర్థమవుతుంది. వేమన మార్గాన్ని, జానపద సాహిత్య రీతులను, ఆశు సంప్రదాయ పద్ధతులను స్వంతం చేసుకొని వివిధ వృత్తుల గూర్చి కథలు రాయడం ఆ జీవితాల్లోంచి వచ్చినప్పుడే ఆ జీవితాలను అనుభవించి పలువరించినప్పుడే సాధ్యమవుతుంది. ఇందుకు సాక్ష్యంగా బి.యస్. రాములు, అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, బోయ జంగయ్య, సదానంద శారద, జయధీర్ తిరుమలరావు, దార్ల రామచంద్ర, అన్నవరం దేవేందర్, ఉప్పల నరసింహం, పెద్దింటి అశోక్‌కుమార్ లాంటివాళ్ల రచనలను పరిశీలిస్తే అర్థమవుతుంది. ఇందులో ఒకరిద్దరు తప్ప అందరూ స్వాతంత్ర్యానంతరం పుట్టినవాళ్లే. వీళ్లెవరికీ చదువుకునే అవకాశాలంతగా లేవు. అతి కష్టంగానే చదువుకున్నారు. స్వయం కృషితో ఎదిగారు. తమ చరిత్రలను తాము రాసుకునే క్రమంలో ముందుకు పోతున్నారు. అవే కథలవుతున్నాయి. అట్టడుగు జనాల వ్యథలవుతున్నాయి. స్వయంకృషితో ఎదిగిన వీళ్లంతా పని మూలాల్లోకి పోయి జానపదుల, జానపద కళాకారుల, వృత్తిపనివాళ్ల సంస్కృతిని ఉన్నతీకరిస్తున్నారు, నేటి సామాజికావసరం అదే. తరతరాలుగా, యుగయుగాలుగా నిరాదరణకు గురయిన సర్వసంపదలకు సృష్టకర్తలయిన వాళ్ల చరిత్రను, నాగరికతను, సంస్కృతిని, పనిముట్లను ఉన్నతీకరించాల్సిందే కదా! చాలా కాలంగా కొందరి సంస్కృతే ముఖ్యంగా విశ్రాంతివర్గాలవారి సంస్కృతే సాహిత్యానికెక్కింది. అందుకు ప్రధాన కారణం ఆ వర్గాల నుంచే కవులు, రచయితలు విరివిగా రావడం. వాళ్లకు మాత్రమే చదువుకునే అవకాశాలుండటం.

తెలంగాణా నుంచి కూడా మొదటితరంలో కథా రచయితలుగా ఎదిగిన వాళ్లలో చాలా మంది, దాదాపు అందరూ విశ్రాంతి కులాల నుంచి వచ్చినవాళ్లే కావడం చారిత్రక సత్యం. ఇది సహజం కూడా. అయితే వీళ్లు కొంతవరకైనా అట్టడుగు కులాలను తీసుకొని కథలు రాయడం విశేషం. ఆ మూలాల్లోకి పోయి రాస్తూ ఫ్యూడల్ సంస్కృతి, రాజుల పాలన ఉన్న కాలంలోనే కొంతయినా నిమ్నవర్గ సంస్కృతిని అక్షరీకరించి వాళ్ల పక్షం వహించినందుకా తరం రచయితలను తెలంగాణా సాహిత్యం రుణపడే ఉంది. ఆ కాలంలో కూడా గొల్ల రామవ్వ, నిరీక్షణ, చల్లపులుసు లాంటి కథలు రావడం తెలంగాణా మట్టి ప్రభావమే. మొదటి తరంలో వచ్చిన రచయితలంతా విశ్రాంతి కులాలవారే అయితే ఆ తర్వాతి తరాల్లో వచ్చిన వాళ్లు ముఖ్యంగా కథా రచయితలు చాలా మంది బ్రాహ్మణేతరులు, అట్టడుగు వర్గాలవారే కావడం యాదృచ్ఛికం కాదు. ఇందుక్కారణం రజాకారు పోరాటాలు ఇచ్చిన స్ఫూర్తి. తెలంగాణా గ్రామాల్లో తామనుభవించిన, తనవాళ్లనుభవించిన ఫ్యూడల్ అణచివేత, అవమానాలు. ఆ తర్వాతి

కాలంలో పెల్లుబికిన పోరాటాలు. దళిత, ఇతర పీడిత కులాలపై ఉన్న ఒత్తిడి.. అణగారిన కులాలవారిలో పెరిగిన ఆత్మవిశ్వాసం.. ఇవన్నీ...

చదువుకునే అవకాశాలే మృగ్యమైన స్థితిలోంచి వచ్చి చదువుకొని వివిధ ప్రభావాలతో రచయితలుగా ఎదిగి పీడిత చరిత్రను అక్షరీకరించడానికి కాలం, చరిత్ర వీళ్లకిచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటున్నారు. తెలంగాణా తాత్వికత పని తాత్వికత. భాష వర్గ మాండలికం. పని తాత్వికతలోంచి వచ్చిన మాండలిక పదాలే ఎక్కువ. ఇతర ప్రాంతాల్లోనూ తెలంగాణాలో శిష్టులనబడే వాళ్లు మాట్లాడే వ్యావహారికానికి పని కులాలవాళ్లు మాట్లాడే మాండలికానికి పెద్దగా తేడాలుండవు. ఉన్నవర్గాల వాళ్లు కూడా చాలావరకు మాండలికంలోనే మాట్లాడటం గమనించవచ్చు. అందుకే తెలంగాణలోని పని తాత్వికతను, వర్గ మాండలికాన్ని తనవి. చేసుకొని రచయితలు అపారమైన వస్తువైవిధ్యంతో కథలు రాస్తున్నారు. ఈ వర్గాల్లోంచి రచయితలు రావడం వల్ల ఇదివరకున్న వస్తుసేకరణ పరిధి మరింత విస్తరించి అన్ని కోణాలనూ స్పృశించేట్టు కథలు వస్తున్నాయి. తమ చరిత్రను తామే రాసుకుంటానికి కాలం ఇచ్చిన అవకాశం ఇది. తమ చుట్టూ వున్న సంఘర్షణను, తమ వాళ్ల జీవితాలను, తమ బాల్య మూలాలను, తమ జీవన నేపథ్యాన్ని అక్షరీకరించే క్రమంలో అద్భుత సాహిత్యం వస్తుంది.

మొత్తం తెలంగాణా కథా సాహిత్యాన్ని పరిశీలిస్తే - పని తాత్వికతలోంచి, పని చేసే వర్గాల్లోంచి వచ్చినవాళ్లు సృష్టించిన సాహిత్యంలో మూసధోరణికి భిన్నంగా ఎంత వైవిధ్యముందో, శ్రామిక పక్షపాతముందో ఉద్యమ, దళిత, బహుజన కథలను చదివితే అర్థమవుతుంది.

విశాలాంధ్ర సాహిత్యానుబంధం



# తెలుగుకథ చిరునామా తెలంగాణాయే....

భారతదేశానికే పోరాటాల వారసత్వాన్నందించిన నేల తెలంగాణా. రజాకారు వ్యతిరేకపోరాటాలు, భూపోరాటాలు తెలంగాణాలో తీసుకొచ్చిన మార్పులు గణనీయమైనవే. ఉద్యమాలు తెలంగాణా రచయితలతో అనివార్యంగా కలం పట్టించిన మాటా వాస్తవమే. స్వాతంత్ర్యానంతరం పుట్టి రచయితలుగా ప్రసిద్ధులైనవారిలో చాలా మంది బ్రాహ్మణేతరులే కావడానికి ప్రధాన కారణం ఉద్యమాలు పీడిత కులాల్లో వెలిగించిన చైతన్యమే.. తెలంగాణా సామాజిక, ఆర్థిక, సాంఘిక జీవితాల్లో వివిధ ఉద్యమాల పాత్ర గణనీయంగానే ఉంది. ఇక్కడి దళిత, బహుజనుల చైతన్య స్థాయి పెరగడానికి చాలా వరకు ఉద్యమాలే కారణం. గత పాతికేళ్లకు పైగా తెలుగు కథా సాహిత్యాన్ని వాసిలో, రాశిలో సస్యశ్యామలం చేస్తున్న ఘనత తెలంగాణ రచయితలదే. కాని తెలంగాణా కథంటే విప్లవోద్యమ కథ మాత్రమేనని, తెలంగాణా సినిమా అంటే తిరుగుబాటు సినిమా మాత్రమేనని, తెలంగాణా జీవితమంటే తిరుగుబాట్లేనని మిడిమిడి జ్ఞానంతో రాస్తున్న రాతలవల్ల, చేస్తున్న వ్యాఖ్యల వల్ల తెలంగాణ సాహిత్యం ముఖ్యంగా కథ, సాంస్కృతిక సంబంధాలు, రచయితలు తీవ్రంగా నష్టపోతున్నారన్న విషయం మరిచిపోకూడదు.

రాయలసీమలో ఉద్యమ కథ లేకున్నా నీటికరువు ప్రధాన వస్తువుగా అనేక కథలు, ఫ్యాక్షన్ గూర్చి కొన్ని కథలు వచ్చినా అవే మొత్తం రాయలసీమ కథా సాహిత్యంగా ఎవరూ చెప్పలేదు. ఉద్యమాల గూర్చో, నీటి కరువు గూర్చో రాసినవాళ్లే రచయితలని ఎవరూ రాయలేదు. రాయసీమ సంస్కృతి, జీవితం, నాగరికత, సామాజికాంశాలు, మానవసంబంధాల గూర్చి రాసినవాళ్లు రచయితలుగా పేరు తెచ్చుకున్నారు. కళింగ ప్రాంతంలో శ్రీకాకుళ పోరాటాలను చిత్రించినవి మాత్రమే కథలని, మిగతావి కథలే కావని అన్నవాళ్లూ లేరు. కోస్తా ప్రాంతంలో ఉద్యమ కథే లేకున్నా రచయితలుగా చాలా మందికే పేరొచ్చింది. ప్రపంచవ్యాప్తంగానూ మన దేశంలోనూ ఆయా ప్రాంత జీవితాలను, మానవ సంబంధాలను చిత్రించిన సాహిత్యం మంచి సాహిత్యంగా చలామణి అవుతుంది. రష్యా, చైనాల్లాంటి సోషలిస్టు దేశాల్లోనూ విప్లవేతర కథ విరివిగానే ఉంది. టాల్‌స్టాయ్, మాక్సిమ్ గోర్కీ రష్యా జీవితంపై మానవసంబంధాలపై అనేక కథలు రాశారు. వాటికి మంచి పేరే వచ్చింది. మరొక్క తెలంగాణా కథావిషయంలో విప్లవకథయితేనే కథన్న రాతలెందుకు? ముఖ్యంగా ఇక్కడి విషయాల గూర్చి రాసిన

ఇతర ప్రాంత విమర్శకులు ఇక్కడి విషయాలను తెలుసుకోకుండానే ఓ అనారోగ్యకర ఒరవడికి శ్రీకారం చుట్టి దాన్నే ప్రచారం చేస్తున్నారు. ఇక్కడి వాళ్లూ కొందరు దానికి తానా అంటే తందానా అంటున్నారు. దీనివల్ల తెలంగాణ కథకు తీరని నష్టం కలిగింది. తెలంగాణా జీవితం, సంస్కృతి అంటే ఇది మాత్రమేనని ప్రచారమూ జరిగింది. ప్రపంచవ్యాప్తంగానూ సాహిత్యం కళలు బాగా అభివృద్ధి చెందిన ప్రాంతాల్లోనూ, సోషలిస్టు దేశాల్లోనూ విప్లవకథ, విప్లవేతర కథ రెండూ ఉన్నాయి. విప్లవ కథలు రాసినవారు విప్లవేతర జీవితాన్ని గూర్చి అంతకంటే అద్భుతమైన కథలే రాశారు.

## తెలంగాణ కథలకు కాణాచి

తెలంగాణ నుంచి వస్తున్న కథాసాహిత్యం, ఎంత నిబద్ధతతో వస్తుందో తెలుగు కథకు ఎలా మార్గదర్శకత్వం వహిస్తుందో పరిశీలిద్దాం.

తెలుగుకథ ప్రాదుర్భావ వికాసాలు కోస్తా ప్రాంతంలో జరిగిన మాట వాస్తవమే అయినా ఆ సమయంలో తెలంగాణలో ఆధునిక కథ అంతగా లేదన్నది నిజమే అయినా తెలంగాణలో కథావిర్భావం జరిగింది మొదలు వెనకకు తిరిగి చూడకుండా ముందుకు పోతూనే ఉంది. అన్ని ఉద్యమాలను, సామాజిక మార్పులను, పతనమవుతున్న వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులను, విధ్వంసమవుతున్న విలువలను మానవ సంబంధాలను, గ్రామాల్లో వస్తున్న అన్ని రకాల మార్పులను తెలంగాణా రచయితలు కథలుగా మలుస్తున్నారు. ప్రతి పరిణామానికీ స్పందించి రచనలు చేస్తున్నారు. ఇతర ప్రాంతాల్లో నవల ఇతర సాహిత్య ప్రక్రియలు వ్యాపారమయమై సినిమాలలో పడి చెత్త శృంగార భూతప్రేతాల ఊబిలో పడి కొట్టుకుపోతున్నప్పుడు కూడా తెలంగాణా నుంచి మంచి కథలే వచ్చాయి. తెలంగాణా కథకులెప్పుడూ నేల విడిచి సాము చేయకుండా సాహిత్య ప్రయోజనాన్ని గుర్తెరిగే కథలు రాస్తున్నారు. ఆశు సాంప్రదాయాన్ని స్వంతం చేసుకొని, జానపద కథారీతులను తనవి చేసుకొని ఆధునిక కథను అందరి కథగా తీర్చి దిద్దుతున్నారు.

తెలంగాణా భాషా సొగసులు, బలం తెలియాలంటే పూర్తి తెలంగాణా మాండలికంలో వచ్చిన కథలు, మా ఊరి ముచ్చట్లు, ఎచ్చమ్మకథలు, కొలిమంటుకుంది నవల, దాశరథి రంగాచార్య చిల్లర దేవుళ్ళు, బండ కింది బతుకులు, అవ్వతోడు గిది తెలంగాణా, ముద్ర, ఇటీవల వచ్చిన కథా సంకలనాలు, బతుకుపోరు నవలల్లోని భాషను గమనిస్తే తెలుస్తుంది. పచ్చనాకు సాక్షిగా, పెన్నేటి కథలు లాంటి మాండలిక రచనల గూర్చి చెప్పే విమర్శకులు పై రచనలనెందుకు పట్టించుకోరు? మొదటి తరంలో



గోల్కొండలాంటి ఒకటి రెండు పత్రికలు తప్ప తెలంగాణలో పత్రికలు లేనందువల్ల, చదువుకునే అవకాశాలతో పాటు పత్రికలు చదివే అవకాశాలూ మృగ్యమైనందు వల్ల కథలు రాసేవాళ్లు తక్కువగానే ఉండేవారు. అయినా తమకున్న అతి తక్కువ అవకాశాలను ఉపయోగించుకొని తెలంగాణా పోరాటాలను, జీవనసంస్కృతిని కథలుగా, నవలలుగా రాసి తెలంగాణా జనజీవనాన్ని అక్షరబద్ధం చేసిన రచయితలెంతో మందున్నారు. సురవరం ప్రతాపరెడ్డి, కాళోజీ నారాయణరావు, సి. నారాయణరెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి కృష్ణమాచార్య, దాశరథి రంగాచార్య, సురమౌళి, నెల్లుట్ల కేశవస్వామి, సి.వి. కృష్ణారావు, కాంచనపల్లి వంటివారు మొదటితరంలో తెలంగాణ సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. స్తబ్దతకు గురైన అభ్యుదయ సాహిత్యోద్యమానికి షాక్‌ట్రీట్‌మెంట్ ఇచ్చిన దిగంబరకవుల్లో ప్రధానమైనవారు తెలంగాణా వారే. అటు తర్వాత తెలుగు సాహిత్యానికి విప్లవబాట చూపి విప్లవ సాహిత్యోద్యమం పుంజుకోవడానికి అవిరళ కృషి చేసినవాళ్లూ తెలంగాణా వాళ్లే. ఏ ప్రలోభాలకూ లొంగకుండా సాహితీ వ్యాసంగం కావించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు, చేస్తున్నారు.

తెలంగాణ కథకు ఆద్యులుగా మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి గార్లను పేర్కొనవచ్చు. మాడపాటి హనుమంతరావు కథలు, సురవరం రాసిన గ్యారా కద్దూ బరా కొత్వాల్, నిరీక్షణ, వకీలు వెంకయ్యలాంటి కథలు, మొగలాయి కథలు తెలంగాణా నుంచి వచ్చిన మొట్టమొదటి తరం కథలు. సాహిత్యాధారాల ద్వారా వెయ్యేళ్ల ఆంధ్రుల సాంఘిక జీవితాన్ని ఆంధ్రుల సాంఘిక చరిత్రగా రాసిన సురవరం ప్రతాపరెడ్డి తన కథల ద్వారా తానున్న కాలంనాటి తెలంగాణా జీవితాన్ని, సంస్కృతిని, భాషను, హిందూ ముస్లిమ్ సంస్కృతుల మిశ్రమ జీవితాలను అక్షరబద్ధం చేశారు. కాళోజీ నారాయణరావు గారు ప్రధానంగా కవులే అయినా కొన్ని కథలు రాశారు. వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచార్య ప్రధానంగా నవలా రచయితలైనా చెప్పుకోదగిన చక్కని కథలు రాశారు. పి. యశోదారెడ్డి మా ఊరి ముచ్చట్లు, ఎచ్చమ్మ కథలు లాంటివి తెలంగాణా జనజీవన దృశ్యాలే. సురమౌళి రాసిన అంగుడుపొద్దు, జి. రాములు పెరటిచెట్టు, గూడూరి సీతారాం మారాజు, మలయశ్రీ ఎన్నికలు, హత్య, తాడిగిరి పోతరాజు బ్లాక్ అండ్ వైట్, జైలు కథలు, నవీన్ క్లబ్బు, చెర, జాతశ్రీ కథలు ఏ కథలకూ తీసిపోని చక్కని కథలే. ఇరివెంటి కృష్ణమూర్తి; ముక్తేవి భారతి కథల్లో తెలంగాణా సామాజిక జీవిత చిత్రణతో పాటు కుటుంబ సంబంధాలు చిత్రించబడ్డాయి.

గిడుగువారు వ్యావహారిక భాషోద్యమానికి పునాది వేస్తే తెలంగాణా కథకులు మొదట్నుంచి కూడా ప్రజల భాషయైన మాండలికాన్ని పాత్రోచిత భాషగా వాడుకొన్నారు.

ప్రజల భాషలో ప్రాంతీయ ముద్రతో కతలు రాసి కథకు విశ్వజనీనతను చేకూర్చిందీ తెలంగాణా కథకులే. ప్రాంతీయ ముద్రతో విశ్వజనీనం చేయడం గొప్ప కథకుల లక్షణమైతే అలాంటి కథలు తెలంగాణా నుంచి విరివిగానే వచ్చాయి. అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, సదానంద శారద, వుప్పల నరసింహం, బోయ జంగయ్యలాంటివారు రాసిన కథలన్నీ ఈ కోవకు చెందినవే. జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ దిగంబర కవులుగా ప్రసిద్ధులైనా కొన్ని మంచి కథలు రాశారు. విసుగ్రాయి కథల సంపుటితో తెలంగాణా ముద్రతో కథలు రాసే రచయిత్రిగా ప్రసిద్ధి పొందిన ముదిగంటి సుజాతారెడ్డి, నాలుగు దృశ్యాలు సంపుటితో కథా ప్రపంచంలో స్థానం సంపాదించుకున్న ఆడెపు లక్ష్మీపతి, పగ కథా రచయిత కాసుల ప్రతాపరెడ్డి, గజ ఈతరాలు లాంటి మంచి కథలు రాసిన గొరుసు జగదీశ్వర్ రెడ్డి, కోర్టు కథలు లేని లోటు తీరుస్తున్న కమ్యూనిస్టు గాడిద కథ, నాలుగు కాళ్ల మంటపం సంపుటి రచయిత సాక్షి, ఎన్నో కోర్టు కథలు రాసిన జింబో, మహబూబ్‌నగర్ కరువు గూర్చి నీటి కథ రాసిన గంగుల నరసింహారెడ్డి, కథాసాహిత్యంలోకి దూసుకొస్తున్న డాక్టర్ పులిపాటి గురుస్వామి, అంబల్ల బండ రచయిత భూపాల్, పాలు ఎర్రబడ్డాయి కత రాసిన దేవరాజు మహరాజు, తెలంగాణా ముద్రతో ఎన్నో కథలు రాసిన రామా చంద్రమౌళి, చంద్ర, ఉప్పెన నవలా రచయిత సరిపల్లి కృష్ణారెడ్డి లాంటి వాళ్లంతా మంచి కథకులే. మైనారిటీ జీవితాలపై కథలు రాస్తున్న స్కైబాబ, ఆమె అడవిని జయించింది నవలతో ప్రసిద్ధి పొంది ఎన్నో మంచి కథలు రాసిన గీతాంజలి, శ్రీధర్ దేశ్‌పాండే లాంటి ఉత్తమ కథకులు తెలంగాణా కథను సుసంపన్నం చేస్తున్నారు.

తెలంగాణాలో విప్లవ పోరాటాలు వేళ్లూనుకుంటున్న సమయంలో కరీంనగర్ నుండి వెలువడిన 'బద్‌లా' కథా సంకలనం ఎందరికో స్ఫూర్తినిచ్చింది. పోరాటాల స్ఫూర్తితో అనివార్యంగా కలం పట్టిన రచయితలు తమ చరిత్రను తామే రాసుకుంటూ విప్లవ కథను ఉన్నతోన్నత శిఖరాలకు తీసుకెళ్లారు. తెలంగాణా పోరాటాల్లో అన్ని దశలనూ కథలుగా మలిచారు. 1970 ప్రాంతంలో మొదలుకొని దాదాపు రెండు దశాబ్దాలు తెలంగాణా పోరాట కథలు అన్ని పత్రికల్లో చోటు చేసుకున్నాయి. ఈ



ఒరవడి ఇతర ప్రాంతాల రచయితలకు మార్గదర్శకమైంది. అల్లం రాజయ్య భూమి, సృష్టికర్తలు, ఎదురుతిరిగితే, సత్య లాంటి కథలు, కాలువ మల్లయ్య ఈ భూమి నాది, వెలి, పాలేరు, భస్మాసుర హస్తం లాంటి కథలు, బి.యస్. రాములు మమకారం, అడవిలో వెన్నెల, పాలు కథలు, తుమ్మేటి రఘోత్తమ రెడ్డి ధిక్కారం, సవారి, పరారీ, ఓ పిల్లి కథ కతలు, వుప్పల నరసింహం ఇత్తనపు కోడె, తిరగబడ్డ భూమి కథలు, సాహు రాసిన రక్తపింజెర, మనం తుడుం కొట్టాలె లాంటి గిరిజన కథలు, యాదగిరి, కార్మిక, గోపిలాంటి వాళ్లు రాసిన కథలు తెలంగాణా పోరాటాలను అక్షరబద్ధం చేసిన విప్లవ కథలు.

స్వాతంత్ర్యానంతరం మన రాష్ట్రంలో కార్మికవర్గం సంఖ్యలో బాగానే పెరిగినా వాళ్ల గురించి వచ్చిన కథలు తక్కువే. బొగ్గ గని కార్మికుల గురించి కార్మిక, అల్లం రాజయ్య, రఘోత్తమరెడ్డి, యాదగిరి, చైతన్య, కాలువ మల్లయ్య, ఆడెపు లక్ష్మీపతి, జాతశ్రీ లాంటివాళ్లు రాసిన కథలే కార్మిక వర్గం గూర్చి చెప్పుకోదగిన కథలు. సమ్మె, బొగ్గు పొరల్లో, వక్రమార్గం, నీళ్ల తగవు, జీవన్మృతుడు, ఉరితాడు, ఉరి, మళ్లీ తల్లి ఒడిలోకి, అన్న, ప్రస్థానం లాంటి కథలు కార్మికుల గూర్చి వచ్చిన మంచి కథలు. అల్లం రాజయ్య రాసిన అతడు కథ సింగరేణి కార్మికుల్లో అతడు రగిలించిన విప్లవ చైతన్యాన్ని తెలియజెప్పే ఉత్తమోత్తమ కథ. ఆ తర్వాత పులుగు శ్రీనివాస్ లాంటి వాళ్లు కార్మికులపై రాసిన కథలకు ఇవి ప్రేరణ అయ్యాయి.

అడవితల్లి ముద్దుబిడ్డలైన గిరిజనుల గూర్చి వచ్చిన కథల సంఖ్య చాలా తక్కువే. చింతా దీక్షితులు రాసిన 'సుగాలీ కుటుంబం' లాంటి ఒకటి రెండు కథలు వచ్చినా చాలా కాలం వరకు గిరిజనులకు సాహిత్యంలో చోటు లభించనే లేదు. ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు ప్రారంభమైన తర్వాత సాహు రాసిన కథలే గిరిజనులపై వచ్చిన ఉత్తమోత్తమ కథలు. గిరిజన జీవితాలను కథలుగా మలిచి వాళ్లకు సాహిత్యంలో స్థానం కల్పించిన ఘనత తెలంగాణా రచయితలదే. సాహు రాసిన కథలతో పాటు బి.యస్. రాములు రాసిన అడవిలో వెన్నెల -1, అడవిలో వెన్నెల -2, గోపి భాగ్యలక్ష్మి రాసిన జంగుభాయి, వసంతరావు దేశ్‌పాండే కథలు, మైదాన ప్రాంత లంబాడీల గూర్చి కాలువ మల్లయ్య రాసిన గుప్పెడు మనసు, ఘర్మజలానికి.. కథలు గిరిజన సాహిత్యానికి ఒరవడి పెట్టాయి. సాహు, అల్లం రాజయ్య రాసిన కొమురం భీం నవల గిరిజనుల గూర్చి గొప్ప నవల.

నగరీకరణ, ప్రపంచీకరణ, పోస్ట్ మాడర్నిజం అంటూ నేలవిడిచి సాములు జరుగుతుంటే గ్రామాలపై ప్రేమను, సృష్టికర్తలపై సానుభూతిని పెంపొందించే కథలెన్నో

తెలంగాణా నుంచి వచ్చాయి. రైతు జీవితాలపై తెలంగాణా నుంచి గొప్ప కథలే వచ్చాయి. రఘోత్తమరెడ్డి పగలూ రేయీ శ్రమ పడుతున్నా, కాలువ మల్లయ్య నేలతల్లి, కరువు, సృష్టికర్తల, చిరునామా, అల్లం రాజయ్య సృష్టికర్తలు మరెన్నో కథలు, జూకంటి జగన్నాథం నారుమడి ఈ కథల్లో పేర్కొనదగ్గవి. సర్వసంపదలకు సృష్టికర్తలైన వాళ్లంతా గ్రామాల్లోనే ఉంటారని గ్రామీణ జీవిత ప్రాముఖ్యతను వివరిస్తూ ఎన్నటికైనా గ్రామాలకు పోవాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తూ కాలువ మల్లయ్య, బి.యస్. రాములు అనేక కథలు రాశారు. గ్రామాల్లోని పరిణామాలను, ప్రాముఖ్యతను వివరించే మంచి నవల బతుకు పుస్తకం, స్మృతి, సృష్టికర్త ఆవేదన, ప్రేమధార, బుద్ధగయ, భూమి స్వప్నం, బోధివృక్షం లాంటివి ఈ విషయాన్ని నొక్కి చెప్పే గొప్ప కథలు. గ్రామాల్లో వృత్తులు నశించి ప్రత్యామ్నాయాలు లేక పొట్ట చేతిలో పట్టుకొని వలసలు పోయిన క్రమంపై కూడా తెలంగాణా నుంచి మంచి కథలే వచ్చాయి. జూకంటి జగన్నాథం వలస, పెద్దింటి అశోక్‌కుమార్ వలసపక్షి, బి.యస్. రాములు కథలు, కాలువ మల్లయ్య నిరీక్షణ, వారసత్వం వలస బతుకు వెతలను తెలిపే కథలు. పాలేర్లపై జరుగుతున్న దౌర్జన్యాలను, పాలేర్ల దీనమైన బతుకులను గూర్చి ఇరవై ఏళ్ల క్రితమే జాడి కథ రాసి ప్రఖ్యాతి చెందాడు సదానంద శారద. అతడు రాసిన సుక్కురారం దొరవచ్చిండు, కె.వి. నరేందర్ రాసిన దొర మళ్లీ వచ్చిండు, కాలువ మల్లయ్య రాసిన తెలంగాణా దొర్సానులు గూర్చిన కథలు ఇదివరకు ఎవరూ స్పృశించని అంశాల మీద వచ్చిన కథలు.

పరాయీకరణ చెందుతున్న బతుకులపై, చదువులపై అద్భుతమైన కథలే వచ్చాయి. అల్లం రాజయ్య మధ్యవర్తులు, బి.యస్. రాములు వేపచెట్టు, ఆడెపు లక్ష్మీపతి విధ్వంసదృశ్యం, కాలువ మల్లయ్య మమతలే మరుగై, టాకింగ్ డాల్ కథలు ఈ విషయంపై రాసిన మంచి కథలు. తెలంగాణా పోరాటాల ఉధృతి తగ్గింతర్వాత గత పుష్కర కాలంగా పోరాటాలు తీసుకొచ్చిన మార్పులను తెలంగాణాలో సంఘర్షణను, పరిస్థితులను, పరాయీకరణను మొత్తంగా తెలంగాణా ముఖ చిత్రాన్ని దర్శింపజేసే కథలు వచ్చాయి. కాలువ మల్లయ్య ఆంబోతు, యుద్ధభూమి, భద్రత, ముగ్గురు మిత్రులు, మానవ స్వప్నం, త్రిశంకువర్గంలాంటి కథలు అల్లం రాజయ్య మనిషి లోపలి విధ్వంసం, ప్రత్యర్థులు, కమల కథలు, రఘోత్తమరెడ్డి జాడ, పనిపిల్ల, చావువిందు లాంటి కథలు, బి.యస్. రాములు దక్షయజ్ఞం, వారసత్వం, బందీలాంటి కథలు తెలంగాణాలోని పరిణామాలను చిత్రించిన గొప్పకథలు. ఐతా చంద్రయ్య జాతీయ కథలు చెప్పుకోదగ్గవి.

తెలంగాణా రచయితలు వస్తుశిల్పాలకు సమాన ప్రాధాన్యతనిస్తూ రాయడమే



కాకుండా ప్రయోగాలకూ వెనుకాడకుండా కథలు రాశారు. చైతన్యస్రవంతి, కేవలం సంభాషణల ద్వారా కథ నడపడం, ప్రాచీనాలంకార శాస్త్రాలను ఉపయోగించుకొని కథ రాయడం లాంటి అనేక పద్ధతులను ఉపయోగించుకున్నారు. తిర్యగ్రేఖ, త్రిభుజంలో నాలుగో కోణం, పొగగొట్టం, ఓ మహాత్మా ఓ మహర్షీ, ముసల్దాని ముల్లె, తూర్పు వెళ్లే రైలు, జీవచ్ఛవం లాంటి కథలు వీటికి కొన్ని ఉదాహరణలు మాత్రమే. వెనుకబడిన ప్రాంతంపై, భాషపై, సంస్కృతిపై జరుగుతున్న వివక్షను తెలియజేస్తూ పులుగు శ్రీనివాస్ సంకరవిత్తులు, కాలువ మల్లయ్య మట్టి కథలు రాశారు. కె.వి. నరేందర్ ఈ విషయంపైనే కొన్ని కథలు రాశారు. ప్రపంచీకరణం పేరు మీద ఛిద్రమవుతున్న ప్రజల బతుకులను, మానవ సంబంధాలు డబ్బు సంబంధాలుగా మారుతున్న దుర్మార్గాన్ని స్వర్ణపిశాచం, హత్య, మమతలు కథలు బయటపెట్టాయి. కె. రామ్మోహన్ రాజు తీర్మానం, గొల్ల కథ, చైతన్యప్రకాశ్ రేణ కథలు, డా. బి. దామోదర్ రావు సింగిడి కథలు, నవీన్ కాలేజీ జీవితాల గూర్చి రాసిన కథలు పేర్కొనదగ్గ మంచి రచనలే.

మన రాష్ట్రంలో స్త్రీవాద, దళితవాదోపవాదాలు రావడానికి ముందే తెలంగాణా నుంచి స్త్రీ, దళితవాద కథలొచ్చినా ఆ ఉద్యమాలను స్వంతం చేసుకొని చక్కని కథలు రాశారు. కమల, తల్లిసాలు పిల్లడు, గలుమ, తిర్యగ్రేఖ, నిరీక్షణ, జాడ, స్త్రీలాంటి చక్కని స్త్రీవాద కతలు తెలంగాణా నుంచి వచ్చాయి. దళిత వాదానికి సిద్ధాంత భూమికను చేకూర్చడమే కాక విరివిగా దళిత కథలు రాసి దళిత సాహిత్యోద్యమానికి పునాదులతో పాటు సుదృఢమైన భవనాన్నే నిర్మించారు. బోయ జంగయ్య రాసిన చీమలు, దొరసాని ఇతర కథలు, బి.యస్. రాములు బందీ, రియల్ ఎస్టేట్ కథలు, గుండెడప్పు కనకయ్య కథలు, కాలువ మల్లయ్య నా తెలంగాణ, కర్రోడు, ఎంగిలిచేత్తో, అగ్నిగుండం, నిర్ణయం లాంటి కథలు, జూకంటి జగన్నాథం కళేబరం, ఆడెపు లక్ష్మీపతి రాబందులు దళిత కథా సాహిత్యాన్ని ముందుకు తీసుకు వెళ్లే కథలే. దేశవ్యాప్తంగా బహుజనోద్ధరణ జరుగుతున్నా బహుజనులు తెలుగు సాహిత్యంలోకి వచ్చింది తక్కువే. అయితే కాలువ మల్లయ్య వివిధ వృత్తులపై రాసిన కథలు, బి.యస్. రాములు రాసిన కొన్ని కథలు తెలుగులో బహుజన సాహిత్యం లేని లోటును తీరుస్తున్నాయి. అవ్వతోడు గిది తెలంగాణ కతలు, అడవిగాచిన వెన్నెల, ఎదురుచూపు, సొసంత్రదినం, స్మృతి, ఐదవవాడు లాంటి కథలనెన్నింటినో పేర్కొనవచ్చు. చిన్న కథ ద్వారా కొన్నాళ్ల సామాజిక మార్పులను, మానవ సంబంధాల పెంపును, మనిషితనాన్ని పెంపొందించడాన్ని తెలంగాణా కథకులే తెలుగు సాహిత్యానికందించారు. భూమి కథలు, సృష్టికర్త ఆవేదన, వారసత్వం, తాతయ్య సలహా లాంటి అనేక కథలను ఇందుకు ఉదాహరణలుగా

చెప్పుకోవచ్చు. ఇలా అన్ని ధోరణులనూ పట్టుకొని తెలుగు సాహిత్యానికే మార్గదర్శకమనదగిన కథలను రాశారు తెలంగాణా రచయితలు.

తెలంగాణా నుంచి వచ్చిన ఏ కథల సంపుటిని తీసుకున్నా కథా సంకలనాన్ని పరిశీలించినా తెలంగాణా రచయితల సామాజిక దృక్పథం, నిబద్ధత స్పష్టంగా కనబడతాయి. సురవరం ప్రతాపరెడ్డి, కాళోజీ నారాయణరావుల కథల సంపుటులు మొదటితరంలోని తెలంగాణా జీవితాలకు ప్రతిబింబాలు. అల్లం రాజయ్య భూమి, సృష్టికర్తలు సంపుటులు తెలంగాణాలోని భూపోరాటాల దశను తెలిపే కథలు. బొగ్గు పొరల్లో, కోల్‌బెల్ట్ కథలు సింగరేణి కార్మిక జీవితాలకు దర్పణాలు. అడవిలో వెన్నెల కథాసంకలనం గిరిజన జీవన పోరాటాలను తెలిపేవి. శ్వేతరాత్రులు, రుతుపవనాలు కథా సంకలనాల్లో అన్ని ప్రాంతాలవారి కథలున్నా తెలంగాణా జీవన సంఘర్షణను చిత్రించేవే ఎక్కువ. బోయ జంగయ్య చీమలు, బోజ కథలు. సదానంద శారద కథా సంపుటులు తెలంగాణా జీవితం, దళిత దృక్పథాన్ని వాస్తవికంగా చిత్రించిన కథలు. నేలతల్లి విముక్తి కోసం కథల సంకలనం తెలంగాణాలో వేళ్లానుకొన్న భూపోరాటాల వివిధ దశలను చిత్రించిన కథల సంకలనం. కె. రామ్మోహన్‌రాజు తీర్మానం సంపుటి తెలంగాణా జీవితాల ప్రతిబింబమే. ఆధునిక కథాసాగరం రెండు సంకలనాలు కరీంనగర్ జిల్లా నుండి వెలువడిన కరీంనగర్ జిల్లా రచయితల కథలతో కూడుకున్న గ్రంథాలు. ఈ కథల్నిండా కరీంనగర్ మట్టి, భాషా సుగంధాలున్నాయి. ఆడెపు లక్ష్మీపతి నాలుగు దృశ్యాలు చైతన్యప్రవంతి కథనాన్ని ముందుకు తీసుకెళ్లిన సంపుటి. బి.యస్. రాములు స్మృతి స్వాతంత్ర్యానంతరం బహుజనులు గెలుచుకున్న జీవిత క్రమాలను తెలిపితే మమతలు మానవసంబంధాలు పతనమవుతున్న మానవ సంబంధాలను ఎదుగుదలను కాంక్షించేవి. విశాలాంధ్ర ప్రచురించిన కాలువ మల్లయ్య కథల సంపుటి మా కథలు 1982 నుండి 1999 వరకు తెలంగాణాలో వివిధ పోరాటాలు తీసుకొచ్చిన మార్పులను, తెలంగాణా జీవితాన్ని వాస్తవికంగా చిత్రించిన కథలు. కాలువ మల్లయ్య కథల సంపుటిలో పది విభాగాలకు సంబంధించి మూడేసి కథలున్నాయి. ఇన్ని రకాల కథలను ఒకే సంపుటిలో ప్రచురించి వైవిధ్యపూరితమైన కథలనన్నిటినీ ఒకే చోట అందించారు ప్రచురణ కథలు. గుండె డప్పు కనకయ్య ప్రచురించిన మేమిట్లుందం, ఎదురుచూపులు కథల సంకలనాలు దళిత కథాసాహిత్యాన్ని మరి కొంత ముందుకు తీసుకెళ్లే కథలు. అంబల్ల జనార్ధన్ 'బొంబాయి కథలు' వలస బతుకు వెతలను చిత్రించిన కథలు. కె.వి. నరేందర్ అమ్మ, బురదలో జాబిల్లి, యుద్ధం కథల సంపుటులు సింగిల్ కాన్సెప్ట్ కథలు. ముదిగంటి సుజాతారెడ్డి విసుర్రాయి కథల సంపుటి, వుప్పల నరసింహం



తిరుగబడ్డ భూమి, ప్రాంతీయ ముద్రతో తెలంగాణా జనజీవన దృశ్యాలను మన కళ్ల ముందుంచిన కథాసంపుటులు. నవీన్ ఏడవ అడుగు, కాలేజీ జీవితాలకు అక్షర రూపమిచ్చినవి. పి. చంద్ భూనిర్వాసితులు, పెద్దింటి అశోక్ కుమార్ వలసపక్షి కథల సంపుటులు పారిశ్రామికీకరణ పేరుతో భూములు కోల్పోయినవారి బతుకు వెతలను, పొట్టలు చేతుల్లో పట్టుకొని బతుకుతెరువును వెతుక్కుంటూ పోయిన జీవితాలను అక్షరీకరించిన సంపుటులు. వీళ్లే కాకుండా ఇంకా అనేక మంది కథా రచయితలు తమ చరిత్రను తామే రాసుకునే పనిలో నిమగ్నమై ఉన్నారు. సంకలనాలు, సంపుటులు వెలువడుతూనే ఉన్నాయి. అయితే తెలంగాణ కథ పేరు మీద ఒకటి రెండు కథా సంకలనాలు రావాల్సిన అవసరముంది. వస్తాయన్న నమ్మమూ ఉంది. ఇంత మంది కథకులు, ఇంత వైవిధ్యపూరితమైన కథలు వెలువడుతున్నా సంకలనాల్లో చేర్చకపోవడానికి కథలు దొరకడం లేదనడం విడ్డూరంగానే ఉంది. ఏ భాషా, ప్రాంత సాహిత్యానికి తీసిపోని గొప్ప కథలు తెలంగాణా నుంచి రావడమే కాకుండా తెలుగు కథకివి మార్గదర్శకంగా ఉంటున్నాయి. తెలుగు కథ ఆవిర్భావం, వికాసం, కేంద్రం మొదటితరంలో కళింగాంధ్రే అయినా గత మూడు దశాబ్దాలుగా మాత్రం తెలుగు కథా కేంద్రం తెలంగాణాయే. అయితే పుంఖానుపుంఖంగా వస్తున్న చెత్త, శృంగార, వ్యాపార సినిమా ఇంకేవేవో కథలు మాత్రం తెలంగాణా నుంచి రాలేదు. ప్రజా స్వభావమున్న మంచి కథలకు చిరునామా తెలంగాణాయే.

**వార్త ఆదివారం, *2001***

# తెలంగాణా కథల్లో దొర్సానులు

తెలంగాణాలో దొరలు దౌర్జన్యకారులుగా, పీడకులుగానే ఉండేవారు. భూస్వాములైన ఈ దొరలు నైజాం ప్రభుత్వకాలంలో ఆయనకు బంట్లే. ప్రజలపై మాత్రం ఎదురులేని అధికారాలను చలాయించేవారు. దొరలతో పాటు తిరుగులేని అధికారాలను చలాయించిన దొరలభార్యలు చాలా తక్కువ. ఒక విధంగా దొర్సానులు పీడితురాల్లే. ఫ్యూడల్ ప్రభువులైన తమ భర్తలు ఏం చేసినా ప్రశ్నించకూడదు. తన కళ్లముందే ఇతర స్త్రీలతో కులికినా నోరు తెరువకూడదు. చాలామంది దొర్సానులకు తమకున్న భూములు, ఆస్తుల సంగతి కూడా తెలియదు. వంటింటి కుందేళ్లలా, గడప దాటని స్త్రీల్లా పంజరం బతుకు బతికే వీళ్లు ఒక విధంగా బురఖా బతుకులు బతుకున్నట్టే. దొరసాని అన్న పదంలోనే దుర్మార్గముంది. దొరకు సానిలాంటిదన్న అర్థముంది. వీళ్లు దొరల శారీరకావసరాలను తీర్చేవాళ్లుగానూ, బట్టపొట్టకు బతికే పెద్ద పాలేర్లుగానూ చూడబడటం చాలా ఇండ్లలో జరిగేది. వీళ్లు బయటకెళ్లాలంటే వెనుక పరదా కట్టిన తడక కచ్చురంలో పోవాల్సిందే. వీళ్లనెవరూ గమనించకూడదు. ఫ్యూడల్ దొరలకు ఎదురెల్లి మాట్లాడటానికి కూడా వీలు లేని ఈ దొర్సానుల బతకుల్లో విషాదముంది. అందుకే ఉద్యమకారులు కూడా దొరలను వర్గశత్రువులుగా లెక్కించారు కాని దొర్సానుల జోలికి పోలేదు. కచ్చీరింట్లో కూచుని దొరవారు రాచకార్యాలు నిర్వహిస్తుంటే వీళ్లు దాసీల ద్వారానో, పాలేర్ల ద్వారానో, పని మనుషుల ద్వారానో వీళ్లకు అవసరం ఉన్నయన్నీ సమకూర్చి పెట్టారు. గుడ్లనీళ్లు కక్కుకుంటూ మౌనంగానే ఉండాలి. ఇలాంటి దొర్సానుల గూర్చి వచ్చిన కథలు చాలా తక్కువ. దొరల కుటుంబాలకు చెందినవాళ్లు కాబట్టి వీళ్లు కూడా పీడకులేనన్న భావంతో ఎవరూ పట్టించుకోలేదు. వుప్పల నరసింహం, సదానంద శారద, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, బోయ జంగయ్య కథల్లో ఈ దొర్సానుల ప్రసక్తి వచ్చినా దొరల భార్యలుగా, పీడకులుగా ఉన్నవారిగానే లెక్కించబడ్డారు. తెలంగాణాలో విప్లవోద్యమాలు వచ్చిన తర్వాత కూడా వీళ్ల పరిస్థితిలో మార్పు లేదు. అయితే కొన్ని చోట్ల వీళ్లు దొరలతో పాటే ఉద్యమకారుల ఆగ్రహానికి గురయ్యారు. దొర్సాన్ల బతుకుల్లోని రెండవ పార్శ్వం గూర్చి వచ్చిన కథలు అతి తక్కువే. ఇవీ తెలంగాణాలో విప్లవోద్యమాలు జరుగుతున్న కాలంలోనే వచ్చాయి. అల్లం రాజయ్య కమల, నీల అనే రెండు కథలు రాస్తే కాలువ మల్లయ్య చిందొర్సాని, పంజరం, దొర్సానమ్మ, పాపం దొర్సాని, దొరగారి భార్య కథలు రాశాడు. కమల, నీల విప్లవోద్యమ కథల్లో భాగంగా దొర్సానుల స్థితిగతుల గూర్చి వచ్చిన కథలు వాళ్లు మారాల్సిన అవసరాన్ని, విప్లవోద్యమాలకు సానుభూతి చూపాల్సిన అవసరాన్ని నొక్కి



చెప్పాయి కథలు. ఫ్యూడల్ భూస్వామ్యవ్యవస్థలో స్త్రీనెప్పుడూ మనిషిగా చూడలేదు. ఆమె మగవాడి అవసరాలను తీర్చే రక్తమాంసాల ముద్ద మాత్రమే. అందుకే స్త్రీలంతా పీడితులే అన్న వాక్యం సరైందేననిపిస్తుంది. ఏ స్త్రీవాద ఉద్యమాలూ, విప్లవోద్యమాలూ ఇలాంటి దొర్సానుల గూర్చి పట్టించుకోలేదు.

దొరల గారాల కూతురుగా పాలేర్ల వీపుల మీద కూర్చొని ఛుక్‌ఛుక్ రైలు ఆడుతూ, వాళ్లను హింసిస్తూ పెరిగిన చిందొర్సాని బతుకు కూడా పంజరపు బతుకే. ఆమె బడికి పోతే సవారు బండ్లోనే పోవాలి. బయట పిల్లలతో ఆడుకుంటానికి వీల్లేదు. ఆడపిల్లలతోనైనా సరే చిన్న కులాలవారితో స్నేహం చేయకూడదు. వాళ్లతో ఆడుకోవాలంటే వాళ్లనే ఇంటికి రప్పించేవాడు దొర. దొరగారి గడీ ఆవరణ దాటి బయటకు పోలేని పంజరపు బతికే ఆమెది. కొంత ఆలోచించే వయస్సు వయసొచ్చిన తర్వాత తానెంత బావిలో కప్పలా బతుకున్నదో అర్థం చేసుకుంటుంది. ఊరి పాఠశాలలో చదువయిపోయిన తర్వాత చదువాపి పెళ్లి చేస్తానన్న తండ్రితో ఘర్షణ పడుతుందామె. అప్పటికే గ్రామాల్లో తలెత్తుతున్న ఉద్యమాలు దొరతో ఔననిపిస్తాయి. కాలేజీ చదువులతో ఆమె ఆలోచనలు మరింత విశాలమవుతాయి. తమ బతుకుల్లోని విషాదాన్ని గమనించిన చిందొర్సాని ఆ బంధనాలను తెంపుకొని పెళ్లి విషయంలో స్వంత నిర్ణయం తీసుకోవడం అంశంగా గల కథ చిందొర్సాని.

పేరుకు దొర్సానులే. దొరగారి భార్యలే. వందలాది ఎకరాల ఆస్తులున్న భూస్వాముల అర్థాంగులే. కాని తమ పరిస్థితి, దొరల ముందు సానుల కంటే అధ్వాన్నమే. సానులకిచ్చిన విలువ కూడా తమకివ్వరు. దొర భార్యలుగా, దొర్సానులుగా పొందిన అవమానాలు, మిథ్యాగౌరవాలు, వేదనలు, దొరగారి ఇండ్లలో స్త్రీల బతుకులేంటో తెలిపే కథలు పాపం దొర్సాని. దొర్సానమ్మ, దొరగారి భార్య, తన భావతో పెండ్లి కాబోతుంటే పట్వారి దొర మనుషులు తీసుకెళ్తారా అమ్మాయిని. పట్వారీకి ఉంపుడుకత్తెగా ఉండాల్సి వస్తుందామెకు. అటు పట్వారీ భార్య సూటిపోటి మాటలు, ఇటు దొర నువ్వు యోజనగంధిననుకుంటున్నావా అంటూ వేధించే మాటలు పడుతూ ఆ ఇంట్లో కాలం గడుపుతుందామె. ఓ కూతురుకు జన్మనిచ్చి చనిపోతుంది. దొర కూతురే అయినా దొరల కులానికి చెందనది కాబట్టి ఆమెకు ఇంట్లో అన్నీ అవమానాలే. తుదకామె పతనమైన దొర కుటుంబాన్నాదుకుంటుంది. ఉంచుకున్న స్త్రీ కూతురుగా ఆమె అనుభవించిన మనోవేదనే యోజనగంధి కథలోని అంశం.

దొర్సాన్ల బతుకుల్లోని రెండవ పార్శ్వాన్ని గూర్చి వాస్తవికంగా చిత్రించిన కథలివి.

**సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక, 22 డిసెంబర్ 2003**

# ఈ తరం తెలంగాణ కథకులు

1990 తర్వాతి తరాన్ని ఈ తరంగా పరిగణించవచ్చు. 1990ల వరకు ప్రపంచవ్యాప్తంగా ఉన్న పరిస్థితులను ఆ తర్వాతి పరిస్థితలకు స్పష్టమైన తేడాలున్నాయి. అప్పటి వరకు కొంత వరకయినా పీడిత జాతులకు అనుకూల దిశగా పయనించిన ప్రపంచం తిరోగమన దిశగా పయనించడం ప్రారంభమైంది. కాలక్రమంలో పీడిత పక్షపాతం వహించడం అనేది పిచ్చివాళ్ల చర్యగా పరిగణింపబడటం మొదలైంది. ప్రపంచవ్యాప్తంగా అనేక రాజకీయ పరిణామాలు జరిగాయి. తత్ఫలితంగా ప్రపంచం డబ్బు దిక్కు పయనించడం ఎక్కువైంది. మానవాంశ గుర్చి మాట్లాడటం వెర్రివాళ్ల పనిగా లెక్కించబడుతుంది. దుడ్డున్నోడిదే బర్రె బలమున్నోడిదే రాజ్యం అన్న దిశగా సమాజ గమనం మొదలైంది.

అంతకు ముందున్న మానవాంశ ఆర్థిక విధానాలు లాభాపేక్ష ఆర్థిక విధానాలుగా పరిణామం చెందాయి. సంక్షేమ పథకాలు హాస్యాస్పదమయ్యాయి. అబ్రహం లింకన్, గాంధీల స్థానంలో బిల్‌గేట్స్, ప్రేమ్‌జీలు ఆదర్శ పురుషులు కావడం మొదలైంది. గత శతాబ్ది చివరి దశాబ్దం సామాజిక పరిణామాల విషయంలో మానవాంశ తుత్తునియలు కావడం విషయంలో ప్రధాన పాత్ర వహించింది. ప్రపంచవ్యాప్తంగా కార్మికవర్గం సంక్షోభంలో కూరుకుపోయింది. కార్మికవర్గ అనుకూల వైఖరి యాజమాన్య అనుకూల వైఖరిగా పరిణామం చెందింది. కార్మికవర్గ, ఇతర పోరాటాలపై ఉక్కు పాదం మోపబడింది. తద్వారా కార్మిక వర్గమూ నిర్వీర్యమైంది. 60-90లలో అనేక కర్మాగారాల నిర్మాణాలు జరిగితే 90ల తర్వాత వాటిని మూసివేయడం మొదలైంది. పారిశ్రామిక వర్గంతో పాటు శ్రామికవర్గమంతా తీవ్ర సంక్షోభంలో చిక్కుకుంది.

ఇవన్నీ ఆ తర్వాత ముంచుకొచ్చిన ప్రపంచీకరణకు ద్వారాలు తెరిచాయి. ఏకధృవ ప్రపంచం బలపడుతున్న సమయంలో ప్రపంచీకరణ పదం తెర మీదికొచ్చింది. ఈ ప్రపంచీకరణంటే బుద్ధుడి బహుజన హితాయో, కారల్‌మార్క్స్ ప్రపంచ కార్మికులంతా ఒక్కటి కావడమో కాదు, ప్రపంచమంతా ఓ కుగ్రామంగా మారాలన్న క్రమంలో అంతా ఒకే ఆధిపత్యం కిందికి రావడం. పాలకుల సంస్కృతే ప్రజల సంస్కృతిగా రుద్దడం, పాశ్చాత్య సంస్కృతిని బిగియారా కౌగలించుకోవడం. బలహీన దేశాల, జాతుల భాషలు, సంస్కృతులు, సాంప్రదాయాలు క్రమక్రమంగా జాతులే



మటుమాయం కావడం. ఆధిపత్య దేశాల లేదా వర్గాల నీడ కింద బతకాల్సిన దుస్థితిని ఆహ్వానించడం. అంతా కోల్పోయి పరాయీకరణకు గురి కావడం. మానవ సంబంధాలన్నీ డబ్బు సంబంధాలుగా మారడం, విలువలు ధ్వంసమై డబ్బు విలువలే రాజ్యమేలడం.. దీంతో అప్పటికే పతనం వైపు పయనిస్తున్న వృత్తులు వృత్తి పనులు పూర్తిగా ధ్వంసమయ్యాయి. చిన్న చిన్న వ్యవసాయాలన్నీ తీవ్ర సంక్షోభంలో కూరుకుపోయాయి. ప్రపంచీకరణను, పరాయీకరణను బిగియారా కౌగిలించుకునే పాలకులున్న చోట ఈ సంక్షోభం మరింత పెరిగింది. దీంతో రైతుల ఆత్మహత్యలు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు.. కార్పోరేట్ విద్యాసంస్థల్లో విద్యార్థుల ఆత్మహత్యలు... కార్మికుల ఆత్మహత్యలు మామూలయ్యాయి.

ప్రపంచీకరణ ప్రభావం పరాయీకరణ విశ్వరూపం దాల్చడంతో గ్రామాలు గ్రామాలుగా ఉండలేని పరిస్థితులొచ్చాయి. పోటీ చదువులు, పోటీ వ్యవసాయాలు, పోటీ వ్యాపారాల పేరు మీద అమానవీయ పోటీతత్వం పెంపొందించబడి అంతా వ్యాపారమయమైపోయింది. ఇవన్నిటికీ తెలంగాణ మినహాయింపు కాదు. తెలంగాణలోని బోల్లకోరితనం, ఇంటికి మనిషొస్తే భోజనం చేయందే పోనీయని దాతృత్వ గుణం ప్రపంచీకరణ ప్రభావంతో దెబ్బ తినడం మొదలైంది. తెలంగాణలో ఉన్న భూపోరాటాల ఉధృతి తగ్గినా గ్రామాలు అగ్నిగుండాలుగానే మారాయి. ప్లాస్టిక్ కవర్లలో రూపాయికి బుక్కెడు నీళ్లమ్మే సంస్కృతి గ్రామాల్లోకీ ప్రవేశించడం అమానవీయతకు పరాకాష్ఠ. చదువులతో జీవితాలను గెలుచుకునే క్రమానికి బదులు విదేశాలకు వెళ్లాలనే మోజు పెరిగింది. దాంతో విదేశీ వలసలు పెరిగాయి. విలువలన్నీ ధ్వంసమవుతూ డబ్బు విలువలుగా మారుతున్న క్రమం తెలంగాణ గ్రామాలనూ అతలాకుతలం చేసింది. ఇలా గత శతాబ్ది అంతానికి ఈ అమానవీయత పరాకాష్టకు చేరుకుంది. ఈ తరం సామాజిక పరిణామాల విషయంలో దుర్మార్గమైనదే... దీనికి తెలంగాణ మినహాయింపేం కాదు.

అయితే కథకు మాత్రం ఈ దశాబ్ది స్వర్ణయుగ దశాబ్దే అనుకోవచ్చు. అంతకు ముందున్న విప్లవ కథే కాక స్త్రీవాద, దళితవాద, బహుజనవాద, మైనారిటీవాదాలుగానూ వివిధ కథలు వచ్చాయి. కథలు ఉధృతంగా రావడానికి సాహితీ సంస్థలు వెలిశాయి. కథల పోటీలు పెరిగాయి. కథా సంకలనాలు తీయడమూ మొదలైంది. కథలకు అవార్డులివ్వడం పెరిగింది. మొత్తంగా ఈ కాలం సామాజిక పరిణామాలకు దుర్మార్గమైనదే అయినా కథకు మాత్రం స్వర్ణయుగంలాంటిదే. ప్రకృతి విధ్వంసమవుతూ,

గ్రామాలు తమ స్వరూపాలను కోల్పోతూ పీడిత జాతులు తమ అస్తిత్వాన్ని కోల్పోతూ ప్రాంతీయ భాషలు, జీవితం ప్రవాహంలో కొట్టుకుపోతూ, జానపద కళలు విధ్వంసమవుతూ మనం మనం కాకుండా పోతున్న క్రమాన్ని రచయితలు కథలుగా మలిచారు. ఈ కాలంలోనే దళితవాద కథలు, స్త్రీవాద కథలు, బహుజన జీవితాలపై కథలు, మైనారిటీ జీవితాలపై కథలు విరివిగా వచ్చాయి. వృత్తులు నశించి ప్రత్యామ్నాయం లేని బతుకు ఘోషలను అద్భుతంగా చిత్రించారు.

రూపాయి మోజులో, విదేశీ వ్యామోహంలో మనిషి మనిషి కాకుండా పోతున్న క్రమాన్ని కథలుగా మలిచారు. వివిధ వృత్తులపై అనేక కథలు రాశారు. ప్రాంతీయ వివక్షపైనా కథలు రాశారు. పీడిత జాతులు, కులాలు, వర్గాలు తమ మూలాలను అన్వేషించుకోవల్సిన అవసరాన్ని గురించి నొక్కి చెప్పారు. తమ బాల్యంలోకి వెళ్లి తమ తల్లిదండ్రుల పూర్వీకుల మూలాల్లోకి పరకాయ ప్రవేశం చేసి అలెక్స్ హేలీలా తరతరాల తమ చరిత్రను తవ్వుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతూ కథలు రాశారు. ఈ కాలంలోనే వచ్చిన మండల్ కమీషన్ నివేదిక, సామాజిక న్యాయ పార్టీల స్థాపన దళిత బహుజన రచయితల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంచాయి. తమ హక్కులు తాము పొందాలన్న ప్రేరణను కలిగించాయి. ధ్వంసమైపోతున్న తమ సంస్కృతీ మూలాలను అన్వేషించుకునేట్టు చేశాయి.

మొదట్నుంచీ తెలంగాణ రచయితలు అన్ని పరిణామాలకు, ఉద్యమాలకు స్పందించి కథలు రాసినట్టే ఈ దశాబ్ది పరిణామాలకూ స్పందించారు. ఇంత కంటె ఎక్కువ స్పందించారు. రెండవ, మూడవ తరంలో కలం పట్టిన రచయితలతో పాటు కొత్తతరం రచయితలు అనేకమంది ఈ సమయంలో కలం పట్టారు. ముఖ్యంగా ఈ తరంలో తమ చరిత్రను తాము రాసుకునే క్రమం పెరిగింది. ఇప్పుడు కావాల్సింది రాజులరాణుల చరిత్ర కాదు. ప్రజల చరిత్ర. శ్రామికవర్గాల సాంఘిక చరిత్ర అన్న సురవరం ప్రతాపరెడ్డి మాటలను నిజం చేస్తూ పీడిత కులాల్లోంచి వచ్చిన వాళ్లు దళిత బహుజన కథలను రాయడం ఉధృతం చేశారు. ఈ కాలాన్ని సాహిత్యంలో మూలాల అన్వేషణ యుగంగా పేర్కొనవచ్చు. తమ కళ్ల ముందే తాము చూస్తూ ఉండగానే తమదనుకున్నది తాము ప్రేమించిందంతా ధ్వంసమైపోతుంటే బాధ్యత గల ఏ రచయితా మౌనంగా ఉండలేదు. ఆ పనినే తెలంగాణ రచయితలు చేశారు. ఈ కాలంలో తెలంగాణ రచయిత ముట్టుకోని కథా వస్తువంటూ లేదు. సహస్రవృత్తుల సమస్త చిహ్నాలను కథా వస్తువులుగా తీసుకున్నారు. ఎరుకల, చాకలి, మంగలి, జానపద



బిచ్చగాళ్ల, మందెచ్చుల, మాదిగ, చిందు బాగోతులు, కాటిపాపలవాళ్లు లాంటి వాళ్లనెవరినీ వదిలిపెట్టకుండా సాహిత్యానికెక్కించారు. ఈ కాలంలోనే తెలంగాణలో ప్రాంతీయ రాజకీయోద్యమంతో పాటు ప్రాంతీయ సాహిత్యోద్యమమూ వచ్చింది. వీటి ప్రేరణతో తెలంగాణపై జరుగుతున్న వివక్ష భాషా సంస్కృతులు, ఆర్థిక రాజకీయ వివక్షలపై సోయి, నా తెలంగాణ, తెలంగాణ రాస్త్రాలాంటి పత్రికల్లో కథలు రాశారు.

రెండవతరం, మూడవతరంలో కథలు రాయడం ప్రారంభించిన వాళ్లలోంచి చాలా మంది రచనావ్యాసంగాన్ని ఆపేశారు. రాయగలిగి ఉండీ రాయలేకపోవడం నేరమని భావించి కొడవటిగంటి కుటుంబరావులా, శ్రీశ్రీలా చివరి వరకూ రాయాలన్న దృక్పథాన్ని పెట్టుకున్న తెలంగాణ రచయితలు అతి కొద్ది మందే ఉన్నారు. మొదటితరంలోనే రచనా వ్యాసంగాన్ని ప్రారంభించి మధ్యలో కొంత ఖాళీ ఉన్నట్టనిపించినా అన్ని తరాలతో కలిసి ఇప్పటికీ రచనావ్యాసంగం కొనసాగిస్తున్నవారు దాశరథి రంగాచార్యగారు. రెండవతరంలో రచనా వ్యాసంగాన్ని ప్రారంభించి నాలుగవ తరం వాళ్లతో కథా రచన సాగిస్తున్న రచయిత్రి ముదిగంటి సుజాతారెడ్డి, మూడవ తరంలో రచనావ్యాసంగం ప్రారంభించి ఏ రోజూ విశ్రాంతి తీసుకోకుండా తన తరం వాళ్లు చాలా మంది ఆగిపోయినా నాలుగవ తరంతో సమానంగా ఇంకాస్త ఎక్కువగానే రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న తెలంగాణ రచయితలు కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, కె.వి. నరేందర్, ఐతా చంద్రయ్య. అల్లం రాజయ్య, పి. చంద్, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, ఆడెపు లక్ష్మీపతి, సదానంద శారద, బోయ జంగయ్య లాంటి మూడవతరం రచయితలు అప్పుడప్పుడు కథలు రాస్తున్నారు. తమ ముందుతరం రచయితలతో పాటు ఈ తరంలో కలం పట్టి తెలంగాణ కథా వారసత్వాన్ని ముందుకు తీసికెళ్తున్న వాళ్లెంతో మంది ఉన్నారు. చైతన్యప్రకాశ్, పెద్దింటి అశోక్‌కుమార్, పులిపాటి గురుస్వామి, చొప్పదండి సుధాకర్, నల్లాల లక్ష్మీరాజం, దార్ల రామచంద్ర, వనమాల చంద్రశేఖర్, కాసుల ప్రతాపరెడ్డి, స్కైబాబ, షాజహానా, రహమతుల్లా, శ్రీధర్ దేశ్‌పాండే, గీతాంజలి, గొరుసు జగదీశ్వర్ రెడ్డిలతో పాటు ఇంకెంతో మంది ఈ తరంలో తెలంగాణ కథను సుసంపన్నం చేస్తున్నారు.

అల్లం రాజయ్య రాసిన అతడు, ప్రత్యర్థులు లాంటి కథలు, రఘోత్తమరెడ్డి రాసిన పనిపిల్ల, హంతకులు కథలు, కాలువ మల్లయ్య రాసిన దొర్సానుల కథలు, గ్రామీణ జీవన బహుజన కథలు, బి.యస్. రాములు రాసిన బలహీన వర్గాల వారు జీవితాలను గెలుచుకున్న వైనాన్ని తెలిపే కథలు, జూకంటి జగన్నాథం, పెద్దింటి

అశోక్‌కుమార్, ఇతరులు రాసిన వలస కథలు, చంద్ రాసిన భూనిర్వాసితులు, కె.వి. నరేందర్ రాసిన సింగిల్ కాన్సెప్ట్ కథలు, ఫ్యూడల్ వ్యవస్థపై సదానంద రాసిన కథలు, ఇంకా యువతరం రచయితలు వివిధ అంశాలపై రాసిన కథలు, కాసుల ప్రతాపరెడ్డి, పులుగు శ్రీనివాస్ తెలంగాణ వివక్షపై రాసిన కథలు పేర్కొనదగ్గవి. మూడు తరాలకు సంబంధించిన కథా రచయితలతో అద్భుతంగా వెలువడుతున్న ఈ తరం తెలంగాణ కథ ఏ భాషా సాహిత్యానికీ తీసిపోనిదిగా కావడం విశేషం. కోర్టు కథలు లేని లోటును న్యాయవాద వృత్తుల్లో ఉన్న జింబో, నందిగం కృష్ణారావు పూరిస్తున్నారు. డెబ్బై ఎనబై మంది రచయితలు వివిధ పత్రికల్లో తమ మూలాలను వెతుక్కుంటూ కథలు రాస్తూ తెలంగాణ కథకు జవసత్వాలందిస్తున్నారు. తెలంగాణ మాండలిక భాషను వాడటంలో ఏ మాత్రం జంకు లేకుండా రచయిత కథనానికి కూడా మాండలికాన్ని వాడుతున్నారు.

జాతీయవాద కథలు రాస్తున్న ఐతా చంద్రయ్య గ్రామీణ జీవనాడిని పట్టుకొని కథా రచన చేస్తున్నారు. దళిత, బహుజన, స్త్రీవాద, అస్తిత్వ వాద విభాగాలుగా ఆయా రంగాల్లో పరిపుష్టమైన తెలంగాణ కథ ఈ తరంలో మైనారిటీ వాద కథలకూ అండదండగా నిలిచింది. వివిధ ముస్లిం రచయితలతో పాటు ఇతరులు మైనారిటీ జీవితాలపై లోలోతుల్లోకి వెళ్లి కథలు రాయడం వల్ల ఈ రంగంలో సాహిత్యం పరిపుష్టమవుతుంది. గీతాంజలి, స్కైబాబ, షాజహానా లాంటి వాళ్లు ముస్లిం జీవితాలకు వ్యాఖ్యానలదగిన కథలు రాశారు. దీంతో ముస్లిం పదజాలంతో కూడుకున్న ముస్లిం యాసతో కొత్త మాండలిక పదజాలం తెలుగు భాషకు లభించి భాష మరింత సమృద్ధం కావడం చెప్పుకోదగ్గ పరిణామం.

ఇలా ఈ తరం తెలంగాణ కథ ఈ దశాబ్దానికి పెనుభూతం లాంటిదైన ప్రపంచీకరణ ప్రమాదాన్నెదుర్కోవాల్సిన అవసరాన్ని తెలియజెప్పడమే కాకుండా దేశీయతను రక్షించుకోవడమే అందుకు పరిష్కారమంటుంది. సీమకథలు, కళింగ కథల్లా తెలంగాణ కథా వార్షిక సంచికలు గత రెండేళ్లుగా ప్రారంభం కావడం, తొలితరం తెలంగాణ కథల సంకలనం, కరీంనగర్ జిల్లా కథల సంపుటులు రెండు, భారతీయ కథా సాహిత్యం తెలుగు కథల సంపుటులు రావడం, రచయితలు తమ కథా సంపుటులను వెవరించుకోవడం తెలంగాణ కథకెంతో మేలు చేస్తుంది.



# ఆధునిక కథా సరిత్సాగరం కరీంనగర్ జిల్లా కథలు

తెలంగాణ జిల్లాల్లో వ్యావసాయికంగా, పారిశ్రామికంగా కొంతయినా అభివృద్ధి చెందిన ప్రాంతం కరీంనగర్. కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల మధ్య జీవనది గోదావరి ప్రవహిస్తుంది. అయితే ఆ గోదావరిపై ఈ జిల్లాలో ఒక్క నీటి పారుదల ప్రాజెక్టున్నా ఉత్తర తెలంగాణ మరింత సస్యశ్యామలమయ్యేది. శాతవాహన రాజుల పాలన కింద ఉన్న ఈ ప్రాంతంలో చాలా వరకు కాకతీయులు కట్టిన చెరువులపైన్నే వ్యవసాయం ఆధారపడి ఉండేది. సింగరేణి బొగ్గుగనులు, పోచంపాడు ప్రాజెక్టు ఈ జిల్లా అభివృద్ధికి చాలా తోడ్పడ్డాయి. ప్రపంచ కథలకు పుట్టినిల్లు లాంటిదయిన కథాసరిత్సాగరం రచయిత గుణాఢ్యుడు కరీంనగర్ ప్రాంతం వాడే అనడానికి చారిత్రకాధారాలున్నాయి. ఆ పరంపరను కొనసాగిస్తూ మొదటి తరంలో కొంతకొంతగా గత పాతికేళ్లుగా కథలకు ఖాణాచిగా వెలుగొందుతుంది కరీంనగర్. ఒకప్పుడు ఆధునిక తెలుగు కథా కేంద్రం విశాఖపట్నంలో ఉంటే, కొంత కాలం చిత్తూరు అనంతపురంలకు మారితే చాలా కాలంగా కరీంనగర్‌కు మారిందనడంలో సందేహం లేదు. వ్యాపార మనస్తత్వానికి దూరంగా కరీంనగర్ రచయితలు తెలుగు కథను ముందుకు తీసుకెళ్తున్నారు. పోరాట కథ, కార్మిక కథ, బహుజన కథలకు పుట్టినిల్లయిన కరీంనగర్ కథ వైవిధ్యభరితంగా సమగ్ర వికాసం చెందుతూనే ఉంది.

జైశెట్టి రమణయ్య కరీంనగర్ జిల్లా చరిత్రను పుస్తకాలుగా తీసుకొస్తే, మలయశ్రీ కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్రపై పరిశోధన చేసి ప్రాంతీయ పరిశోధనలకు నాంది పలికారు. విశాల సాహితి స్థాపించి తెలుగు సాహిత్యానికి విశేష సేవలందిస్తున్న బి.యస్. రాములు ఆధునిక కథా సరిత్సాగరం – కరీంనగర్ జిల్లా కథలు పేరుతో రెండు సంపుటులు వెలువరించారు; వెలువరిస్తున్నారు. ఈ కథల్లో ఏ ఒక్కటి ఉబుసుపోకకు రాసిన కథ కాదు. కథల్నిండా కరీంనగర్ జిల్లా తెలంగాణ ప్రాంత జనజీవన సంస్కృతి, పోరాటాలు, సామాజిక మార్పులు చిత్రితమై ఉన్నాయి. ఈ కథలను చదువుతుంటే తెలుగులో ఎంత వైవిధ్యపూరితమైన కథలు వస్తున్నాయో, కథలకు కాణాచిగా కరీంనగర్ ఎలా విలసిల్లుతుందో అర్థమవుతుంది. ఇందులోని కథలన్నీ కరీంనగర్ ప్రాంతీయ జీవన ప్రతిబింబాలే కావచ్చు. కాని ప్రాంతీయం కాని విశ్వజనీన సాహిత్యమేదీ ఉండదు. ప్రాంతీయ ముద్రతో రాసి విశ్వజనీనతను కల్పించడంలోనే సాహిత్యం యొక్క విజయం ఆధారపడి ఉంది. ఇందులోని చాలా కథలు ప్రాంతీయ ముద్రతో విశ్వజనీనతను కలిగి వున్నాయి. ఇలా ప్రతి జిల్లా నుంచి కథాసంకలనాలు వస్తే సాహిత్యం మరింత పరిపుష్టమయ్యే అవకాశం ఉంది. ఈ

సంకలనాల్లో ప్రసిద్ధుల కథలతో పాటు కరీంనగర్ జిల్లా నుంచి కథలు రాస్తున్న చాలా మంది కథలున్నాయి. కరీంనగర్ కథ అంటే ఇవి మాత్రమే కాకున్నా ఇంత కంటే గొప్ప కథలెన్నో ఈ జిల్లా నుంచి వచ్చినా కరీంనగర్ జిల్లా కథకున్న జవసత్వాలేమిటో ఈ కథలు చదివితే అర్థమవుతుంది.

ఈ సంకలనాల్లో కరీంనగర్ నుండి ఆధునిక కథలకు ఆద్యుడైన జి. రాములు (ఆత్మఘోష), ఎచ్చమ్మ కథల రచయిత్రిగా ప్రసిద్ధురాలైన డా॥ పి. యశోదారెడ్డి (కొత్తబాట, కొండలమ్మ ఎతలు), తెలంగాణ నుంచి తొలి మాండలిక కథా రచయిత గూడూరి సీతారాం (మారాజు, నారయ్యబతుకు), తొలితరం రచయిత సురమౌళి(అంగుడుపొద్దు), మలితరం రచయిత మలయశ్రీ (ఎన్నికలు), సామాజిక తత్త్వవేత్త బి.యస్.రాములు (వారసత్వం, స్మృతి), విప్లవ కథా రచయిత అల్లం రాజయ్య (భూమి, అడవిమనిషి), బహుజన కథా శిల్పి కాలువ మల్లయ్య (ఎంగిలి చేత్తో, నిర్ణయం), గిరిజన బంధు సాహు (రక్త పింజెర), కార్మిక కథల రచయిత తుమ్మేటి రఘోత్తమరెడ్డి (ఇల్లు), సింగిల్ కాన్సెప్ట్ కథల రచయిత కె.వి. నరేందర్ (నడిపోడు, చిగురుటాకు), ప్రయోగశీలి ఆడెపు లక్ష్మీపతి (త్రిభుజంలో నాలుగో కోణం), తెలంగాణ నుంచి బలమైన మహిళా రచయిత్రి ముదిగంటి సుజాతారెడ్డి (జవాబు లేని ప్రశ్నలు, ముట్టడి), గ్రామీణ జీవన చిత్రకారులు పెద్దింటి అశోక్‌కుమార్, జూకంటి జగన్నాథం (కన్నతల్లి, ఘర్షణ, నారుమడి), భూనిర్వాసిత కథా రచయిత పి. చంద్ (గంజాయి), బహుభాషా కోవిదుడు నలిమెల భాస్కర్ (మంద), ఉత్తమ సాహిత్య పిపాసి వనమాల చంద్రశేఖర్ (ఆవలితీరం, శిథిలాలు), బి. దామోదరరావు (ఎట్టి), రేగులపాటి కిషన్‌రావు (ఈ తరం కథ), గూడూరి అమరావతి (గూడు నిట్టాడు), పంజాల జగన్నాథం (బాంధవ్యాలు), చైతన్యప్రకాశ్ (అమీనా), సాహిత్య బంధు కొక్కుల భాస్కర్ (తెగినపోగు), కొక్కుల పద్మావతి (పాల మీగడ), యువరచయిత బి. వినోద్‌కుమార్ (సంశయం), ఎనగంటి వేణుగోపాల్ (రుణం) కథలున్నాయి.

'ఇవి రూపంలో మాత్రమే కరీంనగర్ జిల్లా కథలు.. కరీంనగర్ జిల్లా ప్రజల గురించి ఆ జిల్లా రచయితలే చిత్రించిన కథలివి. సంస్కృతి, చరిత్ర భాషాపరంగా యివి తెలుగు జాతి కథలు.. సారాంశంలో యివి భారతీయ కథలు.. మానవీయ కథలు... ఈ కథల్లో దేశ ప్రజల సంస్కృతి, కులం, వర్గం, భాష, కుటుంబ వ్యవస్థ, స్త్రీ సమస్య, మానవ సంబంధాలు, ఆలోచనా విధానం, ఆధునికత ప్రజల జీవితాల్లో ప్రవేశించిన తీరు, వాటి అరవై ఏళ్ల పరిణామాలు చూడవచ్చు. ఒక నిర్దిష్ట ప్రాంత, భాషా సంస్కృతి సమాజ నేపథ్యంగా సమకాలీన భారతీయ ప్రజల భావాలు, సంఘర్షణ,



స్పందనలు, విభిన్న దృక్పథాలు, జీవితాలు ఈ కథల్లో కనబడతాయి. ఈ కథల్లోని బతుకు పోరాటం, మానవ స్వభావాలు విశ్వజనీనమైనవి" అంటారు బి.యస్. రాములు తొలి సంకలనానికి ముందుమాటలో.

తెలంగాణ తొలి కథకుడు జి. రాములు ఆత్మఘోషలో సంఘ సంస్కరణాభిలాష కనబడుతుంది. కులాలు, మతాలుగా ప్రజలు విడిపోవడాన్ని తెలంగాణ సాయుధ పోరాట కాలానికి ముందటి సమాజాన్ని చిత్రించే కథ ఆత్మఘోష. స్వాతంత్ర్యం తెలంగాణ గ్రామాల్లో తెచ్చిన చైతన్యాన్ని చిత్రించే కథ కొత్తబాట. కోడలమ్మ పడే కష్టాలను చిత్రించిన కథ కోడలమ్మ ఎతలు. స్వతంత్ర ఫలాలు, భాషా ప్రయుక్త రాష్ట్ర ఫలాలు సామాన్యులకందని విషయాన్ని చిత్రించిన కథే అంగుడుపొద్దు. నారయ్యబతుకు కల్లు గీసుకుంటూ బతికే గౌడ కులస్థుల బతుకు వెతలను చిత్రించిన కథ. పల్లె ప్రజలు పట్టణాల మీది భ్రమతో పట్న నాగరికతను అందుకోవాలనే తాపత్రయంతో నగరాలకు వెళ్లి అక్కడ ఎదుర్కొనే సమస్యలను వివరించే కథ మారాజు. స్మృతి, వారసత్వం కథలు తెలంగాణ గ్రామాల్లోని పద్మశాలి కుటుంబాల్లో యాభై ఏళ్లలో జరిగిన సామాజిక పరిణామాలను చిత్రించడం జరిగింది. రక్తపింజర ఆదిలాబాద్ అడవుల్లో కంట్రాక్టర్ల చేతుల్లో గిరిజనులు పడే బాధలను, దోపిడీని చిత్రించిన కథ. భూమి అల్లం రాజయ్య ప్రసిద్ధ కథ. రైతుకు భూమి పట్ల గల అనుబంధాన్ని, ఆ భూమిని దక్కించుకోవడానికి ఏం చేయడానికైనా సిద్ధపడే తత్వాన్ని భూమి కోసం జరిగే పోరాటాల్లో ఎదురయ్యే నిర్బంధాలను చిత్రించిన కథ భూమి. ఓ రైతు ప్రభుత్వం చేసే పనుల ద్వారా న్యాయాన్ని పొందడం సాధ్యం కాదని చిత్రించే కథ అడవి మనిషి.

మంద కథలో అమాయకులైన ప్రజలు తమ ఓటు హక్కును సరైన పద్ధతిలో ఉపయోగించుకోలేక పోవడం, పెత్తందార్ల ప్రయోజనాలకు లోబడే ఓటేయడం గల అంశాన్ని చిత్రించిన కథ. తెగినపోగు పద్మశాలీల జీవితాలను చిత్రించే కథ. ఊళ్లో చేనేత వృత్తి గిట్టుబాటు కాక షోలాపూర్, భీవండిలాంటి ప్రాంతాలకు వలసపోయి బతుకుతున్న సాలెల బతుకు వెతలను చిత్రించే కథ. వ్యవసాయ గిట్టుబాటు కాక సమస్యల వలయంలో కొట్టుమిట్టాడుతూ ఎవరో చెబితే గంజాయి పండించి కష్టాలను మరింత పెంచుకున్న రైతు కథే గంజాయి. ముదిగంటి సుజాతారెడ్డి 'ముట్టడి' కథలో లంబాడీలు బతుకు తెరువు కోసం సారా కాచుకుంటే అదో క్షమించరాని నేరమైనట్టు ఎక్సైజ్ పోలీసులు చేసే ముట్టడిని చిత్రించిన కథ. శిథిలాలు, నారుమడి కథల్లో పల్లెల నుంచి ఎదిగి పట్టణాల్లో స్థిరపడ్డ వాళ్ల గురించి పల్లెలు శిథిలాలుగా మారిన వైనం గురించి చిత్రించడం జరిగింది. ఎంగిలి చేత్తో దళిత దృష్టి కోణంలోంచి నేతకారి

దుబ్బమ్మ జీవితాన్ని చిత్రించిన కథ. నిర్ణయం దళితుల్లోంచి ఎదిగిన వాళ్లను అగ్రకులాల వాళ్లు తన్నుకుపోయే క్రమాన్ని చిత్రించే కథ. త్రిభుజపు నాలుగో కోణం పద్మశాలీలు కులవృత్తులను కోల్పోవడం, వ్యాపారాల్లో నష్టాలు, బతుకులు శిథిలం కావడం చిత్రించిన కథ. అరబ్ దేశాలకు వలసపోయిన వారి కుటుంబాల్లో జరిగే సంఘర్షణను చిత్రించిన కథ 'ఘర్షణ'.. అమీనా కథ ముస్లింల జీవితాలను కళ్ల ముందుంచుతుంది. ఇంట్లో నడిపోడి కష్టాలు ఎలా ఉంటాయో చిత్రించిన విలక్షణ కథ నడిపోడు.

ఆశు కథా సంప్రదాయ శిల్పం, చైతన్యస్రవంతి, సంభాషణల ద్వారా కథ నడపడం, సంఘటనా శిల్పం లాంటి అనేక శిల్పాలతో రాయబడిన ఈ కథలన్నిటిలోనూ సామాజిక స్పృహ స్పష్టంగా కనబడుతుంది. శిల్పరీత్యా ఒకటి రెండు కథలు బలహీనంగా ఉన్నా వస్తురీత్యా, సాహిత్య ప్రయోజనం రీత్యా ప్రతికథా ఆణిముత్యమే. స్వాతంత్ర్యానికి ముందున్న తెలంగాణలో ఉవ్వెత్తున లేచిన తిరుగుబాటు ధోరణులను, ఈ యాభై ఏళ్లలో తెలంగాణ సమాజంలో, తెలుగు సమాజంలో జరిగిన కుటుంబ సంబంధాల్లోని మార్పును, మారిన విలువలను, వలసలను, నశించిన వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులను, సామాజిక పరిణామాలనన్నింటినీ చిత్రించిన కథలివి. అవసరమైతే పూర్తి మాండలికంలో (నారిగాని బతుకు, ఎంగిలి చేత్తో), పాత్రోచిత మాండలికం వాడి తెలంగాణ మాండలిక భాషను సమున్నతంగా నిలబెట్టిన కథలు. జీవితంలోని అన్ని కోణాలను చిత్రించిన ఈ కథల్లో సమగ్ర సామాజిక చరిత్ర నిక్షిప్తమై ఉంది. జీవితంలోని దుఃఖాన్ని, అసంతృప్తిని, అమానవీయ సంబంధాలను చిత్రించడంతో పాటు సమకాలీన సామాజిక చరిత్రను, సంస్కృతిని, ఆర్థిక స్థితిగతులను కాళనాలికలా అక్షరబద్ధం చేసిన మంచి కథలివి. తెలుగు సమాజం గడిచి వస్తున్న దశలను, నడుస్తున్న క్రమాన్ని ఈ కథలు సామాజిక శాస్త్రాల కన్నా బలంగా, సాధికారంగా మన ముందుంచుతాయన్న పబ్లిషర్ల వాక్యాలు నగ్నసత్యాలే. ఈ ఒరవడి మిగతా వారందరికీ స్ఫూర్తిదాయకమవుతుందని ఆశిద్దాం.

ప్రజాతంత్ర, **27.6.2004**



## తెలంగాణ కథా రచయితల 'దస్త్రం'

ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర ప్రాంతాలతో పోల్చినప్పుడు తొలితరంలోనూ, ఆ తర్వాతి తరంలోనూ, ఏ తరంలోనైనా తెలంగాణ ప్రాంతం వారికి చదువుకునే అవకాశాలు తక్కువే. ఆధునికమని చెప్పబడే ఆంగ్లవిద్య, ఆంగ్లవిద్యతో పాటు వచ్చిన ఆధునిక సాహిత్య ప్రక్రియల వికాసం ఇతర ప్రాంతాల్లోలా జరిగే అవకాశాలూ తక్కువే. సాహిత్య సాంస్కృతిక కళారంగాల్లో పేరు ప్రఖ్యాతులు పొందాలంటే ఇతర ప్రాంత రచయితల కంటే ఎన్నో రెట్లెక్కువ కష్టపడాల్సి ఉంటుంది. ఆధునిక లిఖిత ప్రక్రియలైన కథానిక, నవలలకు పాఠకులైన మధ్యతరగతి ఆవిర్భావం తొలి, మలితరాల్లో తెలంగాణలో లేదన్న విషయమూ గమనించాలి. అయినా ఎన్నో కష్టనష్టాలకోర్చి తెలంగాణ నుంచి కథా రచయితలు వందలాదిగా ఎదిగారు. ఏ ప్రాంతానికీ తీసిపోకుండా అద్భుతమైన కథలు రాయడమే కాకుండా సాహిత్యంలో నిబద్ధతకు సుదృఢమైన పునాదులు వేశారు. ఒకటి రెండు కథలు రాసిన వాళ్లను వదిలిపెట్టినా ఈ తొంబై సంవత్సరాలలో రెండు వందలమందికి పైగా కథా రచయితలు కథా సృజనం చేస్తూ తెలంగాణ కథను సుసంపన్నం చేస్తున్నారు. తెలంగాణలో మొదటి కథ పుట్టి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన 1956 వరకు కలం పట్టి ప్రసిద్ధులైనవారిని తొలితరం రచయితలుగా గుర్తించవచ్చు. ఉమ్మడి రాష్ట్రం ఏర్పడిన 1956 నుంచి తెలంగాణలో రెండవసారి భూపోరాటాల ప్రారంభమైన 1970 వరకు కలం పట్టిన వారిని మలితరం రచయితలుగా పేర్కొనవచ్చు. తెలంగాణలో భూపోరాట ఉద్యమాల ఉధృతి నుంచి రష్యా పతనమై ప్రపంచమంతటా ఏకధృవ ప్రపంచం ఏర్పడబోతున్న 1990 వరకు కలం పట్టిన రచయితలను మూడవతరం రచయితలుగా పేర్కొనవచ్చు. ఇరవయవ శతాబ్దిలో ప్రజాస్వామ్యం దిక్కు పయనించిన ప్రపంచం 1990 తర్వాత గ్లోబల్ మాయలో కొట్టుకుపోతున్న కాలాన్ని, ఈ కాలంలో కలం పట్టిన రచయితలను ఈ తరం రచయితలుగా పేర్కొనవచ్చు.

ఈ నాలుగు కాలాల మధ్య స్పష్టమైన తేడా ఉంది. ఆ తేడాలను గుర్తించి రచయితలు సమకాలీన రాజకీయార్థిక సామాజిక విషయాలను తమ కథల్లో నిక్షిప్తం చేశారు. తొలితరంలో కలం పట్టిన రచయితలు హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్నవారు. ఉమ్మడి రాష్ట్రం ఏర్పడకముందే కలం పట్టినవారు. నైజాం పాలనను చవి చూసినవారు. రజాకార్ల పోరాటాలనూ గమనించినవారు. ఈ రచయితల్లో తెలంగాణ వికాసం కోసం

కృషి చేసినవాళ్లెంతో మంది ఉన్నారు. మలితరంలో కలం పట్టినవారు ఆంధ్రప్రదేశ్ అవతరణను చూసినవారు. ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణ స్థితిని గమనించినవారు. మొదటి తరంలో పత్రికలు తక్కువైనా ఉన్న పత్రికల్లో తమ ప్రజల భాషను నిర్మొహమాటంగా రాసుకునే అవకాశముండేది. మలితరం రచయితలొచ్చేసరికి వ్యావహారిక భాష, మాండలిక భాష ఉపయోగం పత్రికల ఆదరణ గూర్చి వాదోపవాదాలు మొదలయ్యాయి. కోస్తా ప్రాంత పత్రికల, భాష ఆధిపత్యం పెరిగింది. మూడవ తరం రచయితలు కలం పట్టేనాటికి తెలంగాణలో భూపోరాటాలు ప్రారంభమై ఉధృతమయ్యాయి. స్వాతంత్ర్యానంతరం పుట్టి పెరిగి విద్యాబుద్ధులు నేర్చుకున్న అట్టడుగు కులాల్లోంచి ఈ తరంలో రచయితలు బయలుదేరారు. తమ చరిత్రను తాము రాసుకునే క్రమం, తమ మూలాల్లోకి వెళ్లి చూసుకునే పద్ధతి, వివిధ సామాజిక ఉద్యమాలను అక్షరబద్ధం చేయడం ప్రారంభమైంది. నాలుగవ తరం లేదా ఈ తరం రచయితలు కలం పట్టేనాటికి అంతకు ముందు పీడిత అనుకూల దిశగా పయనించిన సమాజం ఆధిపత్య ధోరణులకు అనుకూల దిశగా పయనించడం మొదలైంది. ప్రపంచీకరణ ప్రభావం ఉధృతమైంది. అమానవీయత పరాకాష్ఠకు చేరుకునే దిశకు సమజ పయనం ఆరంభమైంది. అది క్రమక్రమంగా ఉధృతం కాసాగింది. ఈ భేదాలనన్నిటినీ తెలంగాణ రచయితలు అక్షరీకరించారు. ఆ కథకుల వివరాలిలా ఉన్నాయి.

**తొలితరం కథా రచయితలు**

**(1911 - 1956 వరకు కలం పట్టినవారు)**

మాడపాటి హనుమంతరావు, ఒద్దిరాజు రాఘవరావు, సిరుగూరు జయరావు, ఒద్దిరాజు సీతారామచంద్రరావు, ఆదిరాజు వీరభద్రరావు, నందగిరి వెంకటరావు, ఎల్లాప్రగడ సీతాకుమారి, సురవరం ప్రతాపరెడ్డి, వి. ఆర్. అవధాని, బోయనేపల్లి రంగారావు, గం. గోపాలరెడ్డి, నందగిరి ఇందిరాదేవి, కాళోజీ నారాయణరావు, పొట్లపల్లి రామారావు, బూర్గుల రంగనాథరావు, ధరణికోట శ్రీనివాసులు, జి. రాములు, కాంచనపల్లి చినవెంకటరామారావు, పి.వి. నరసింహారావు, ఎం. హీరాలాల్ రాయ్, వట్టికోట ఆళ్వారస్వామి, కె. లింగరాజు, ఊటుకూరు రంగారావు, గూడూరి సీతారాం, జి. సురమౌళి, భాస్కరభట్ల కృష్ణారావు, వెల్దుర్తి మాణిక్యరావు, డి. వెంకటరామారావు, పెండ్యాల చిన రాఘవరావు, పైమటల వెంకటసుబ్బారావు, ఇటికాల నీలకంఠారావు, మందా రామారెడ్డి, డి. రామలింగం, ఇల్లిందల సరస్వతీదేవి, నెల్లూరి కేశవస్వామి, అడ్లూరి అయోధ్యరామకవి, మేడిచర్ల ఆంజనేయమూర్తి, పి.యస్.ఆర్. ఆంజనేయ శాస్త్రి, మదిగొండ ఈశ్వరచరణ్, సి. కమల, ఎ.ఆర్. కృష్ణ, ఇరివెంటి కృష్ణమూర్తి,



గొట్టిముక్కల కృష్ణమూర్తి, శౌంఠి కృష్ణమూర్తి, అవుకుపల్లి కృష్ణారావు, సి.వి. కృష్ణారావు, నెల్లుట్ల కేశవస్వామి, నాగులపల్లి కొక్కండ రామారావు, బదనపల్లి గంగారాం, చౌడూరు గోపాలరావు, పబ్బరాజు గోపాలరావు, చంద్ర, జి. చంద్రమౌళి, బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి, ఎదో చెన్నకేశవులు, చెన్నమనేని రాజేశ్వరరావు, మానేపల్లి తాతాచార్య, శ్రేష్ఠి తిమ్మయ్య, ఊటుకూరు తిర్మల్‌రావు, అందుగుల తిర్మల్‌రావు, దాశరథి, దాశరథి రంగాచార్య, కొల్లూరి ధర్మారావు, కె.వి. నరసింగరావు, పి.వి. నరసింహాచార్య, వెంపటి నాగభూషణం, గూడా నరహరి రావు, అవుల పిచ్చయ్య, సి. నారాయణరెడ్డి, ముప్పన ప్రసాదరావు, బుచ్చివరయ్య గుప్త, భాగ్యరెడ్డివర్మ, వల్లపురెడ్డి బుచ్చారెడ్డి, కొలిపాక మధుసూధనరావు, అకుమళ్ల మలిఖార్జునశర్మ, ఆర్. మల్లయ్య, బూర్గుల రంగనాథ రావు, పి. యశోదారెడ్డి, బోయనపల్లి రంగారావు, చక్రవర్తి రంగస్వామి, వి. రంగారావు, చెరుకుపల్లి రఘోత్తమరావు, బిరుదురాజు రామరాజు, మాడపాటి రామచంద్రుడు, దేవులపల్లి రామానుజరావు, శేషభజైర్ రామానుజాచార్యులు, బి.యన్. రెడ్డి, అందుగుల లక్ష్మణ్‌రావు, సి.హెచ్. లక్ష్మి, వానమామలై వరదచార్యులు, గడి లోకనాథశర్మ, కంభంపాటి విశ్వనాథం, అక్కిరాజు వెంకట...రాజు, పి. వెంకటరామారావు, వెంకట నరసింహారావు, షబ్నవీస్, పి. వెంకటేశ్వరరావు, పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, సి. వెంకటేశ్వరరావు, గూడూరి శంకరం, శాంతిశ్రీ, పడాల రామారావు, బి.యన్. శాస్త్రి, పెద్యాల శేషగిరిరాజు, పబ్బరాజు గోపాలరావు, కోట సత్యనారాయణ, కపిల శ్రీరామమూర్తి, సత్యశ్రీ, సదాశివ, తన్నీరు సత్యనారాయణరావు, మేడిచర్ల సుబ్రహ్మణ్య శర్మ, గుండవరపు హనుమంతరావు, చెరుకుపల్లి హరికృష్ణారావు, శేభట్టర్ కె. రాములు, కాటూరు వెంకట నారాయణరావు, దిలావర్, గొట్టుముక్కల కృష్ణమూర్తి, కవిరాజమూర్తి, గవ్వా మురహరి రెడ్డి, సర్వదేవరభట్ల నరసింహమూర్తి.

చదువుకునే అవకాశాలు అంతగా లేకున్నా, అప్పుడున్నది ప్రధానంగా ఉర్దూ మీడియం చదువులే అయినా తెలుగు చదువుకొని మాతృభాషలో కథలు రాసిన కథకులు వీళ్లంతా. ఇందులో చాలా మందికి జీవితం సాహిత్యం వేరు కాదు. మొదటితరంలోనే వందకు పైగా కథా రచయితలు తెలంగాణ నుంచి కలం పట్టారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి అంటే తొలితరంలోనే ఈ రచయితలు వేయికి పైగా కథలు రాసినట్టు సంగిశెట్టి శ్రీనివాస్ తొలితరం తెలంగాణ కథలపై వెలువరించిన దస్త్రం కథల సూచి ద్వారా అర్థమవుతుంది. ఇవి లభ్యమవుతున్న కథలు మాత్రమే. లభ్యం కానివి అనేకం ఉన్నాయి.

## మలితరం కథా రచయితలు
## (1956 - 70ల మధ్య కలం పట్టినవారు)

తాడిగిరి పోతరాజు, అంపశయ్య నవీన్, మలయశ్రీ, ముదిగంటి సుజాతారెడ్డి, (కథలు 1990 తర్వాతే రాసింది), రామా చంద్రమౌళి, మాదిరెడ్డి సులోచన, బోయ జంగయ్య, పోల్కంపల్లి శాంతాదేవి, చెరబండరాజు, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, జాతశ్రీ, చంద్ర, ముదిగంటి పాపిరెడ్డి, యం.వి. తిరుపతయ్య, రేగులపాటి కిషన్‌రావు, ఎన్.కె. రామారావు, పేర్వారం రాములు, చావా శివకోటి, గూడ అంజయ్య, ఎనగంటి వేణుగోపాల్, పి.వి. రమణ, సాకేతపురి కస్తూరి, బుర్రా రాములు మొదలైనవారు.

వీళ్లు కలం పట్టేనాటికి హైదరాబాద్ రాష్ట్రంగా ఉన్న తెలంగాణ ఆంధ్రప్రదేశ్‌లో విలీనమైంది. బెంగాలీ, కోస్తాంధ్ర, ఆంగ్ల సాహిత్యాలతో పరిచయాలు పెరిగాయి. ఆంధ్రుల వలసలూ పెరిగాయి. పత్రికల సంఖ్యా పెరిగింది. పత్రికాభాష అనబడే కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాల భాష వ్యావహారికభాషగా లెక్కింపబడటం మొదలైంది. ఈ కాలంలోనే వ్యాపార నవలలు, డిటెక్టివ్ నవలల ఉధృతి పెరిగింది. ఇలాంటి సమయంలో తామేం రాయాలో ఎలాంటి భాషలో రాయాలో అనే సందిగ్ధత తెలంగాణ రచయితలను వేధించసాగింది. తమ రచనలు అచ్చు కావాలంటే పత్రికా భాషలో రాయడమే మంచిదన్న ధోరణికి రావడం కనిపిస్తుంది. అంతకుముందు రచయితలు రాసినట్టు మాండలికంలో రాస్తే అచ్చు వేస్తారో వేయరో అన్న అనుమానమూ వేధించసాగింది. మరో దిక్కు ఆరున్నర అడుగుల ఎత్తున్న హీరోల నవలలు, డిటెక్టివ్ సాహిత్యం విరివిగా రాసాగింది. కొందరు ఈ ధోరణిని అనుకరించబోయి త్వరలోనే సర్దుకున్నారు. ఇలాంటి సమయంలో రచయితలు ప్రాంతీయత, స్థానీయత, మాండలికాల జోలికి పోకుండా మధ్యే మార్గాన్ని ఎన్నుకొని కథలు రాశారు. ఈ సమయంలో తెలంగాణ కథారచన కొంత వెనుకబడిందనే చెప్పవచ్చు. ఈ రచయితలే తర్వాతి కాలంలో అద్భుతంగా కథలు రాసినా ఈ కాలం తెలంగాణ కథారచనకు చీకటి యుగంలాంటిదే. ఆ తర్వాత మూడవతరంలో తెలంగాణ కథ పూర్తి జవసత్వాలతో పుంజుకొని రాసాగింది.

## మూడవతరం తెలంగాణ కథా రచయితలు
## (1970 - 90ల మధ్య కలం పట్టినవారు)

అల్లం రాజయ్య, బి.యస్.రాములు, కాలువ మల్లయ్య, పి. చంద్, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, ఆడెపు లక్ష్మీపతి, జూకంటి జగన్నాథం, నలిమెల భాస్కర్, కొక్కుల



భాస్కర్, జింబో, బి. దామోదర్ రావు, సాహు, సరిపల్లి కృష్ణారెడ్డి, జయధీర్ తిరుమల రావు, నందిని సిధారెడ్డి, ఐతా చంద్రయ్య, వసంతరావు దేశ్‌పాండే, అల్లం వీరయ్య, వుప్పల నరసింహం, టి. సంపత్‌కుమార్, దేవరాజు మహారాజు, భూపాల్, వారాల ఆనంద్, కలకోటి కిషన్‌రావు, కె. సీతారాములు, పులుగు శ్రీనివాస్, అఫ్సర్, కాసుల ప్రతాపరెడ్డి, తెలిదేవర భానుమూర్తి, గోపి భాగ్యలక్ష్మి, గంగుల నరసింహారెడ్డి, అంబటి సురేంద్రరాజు, పి. లోకేశ్వర్, సూర్యవంశి, సిహెచ్. మధు, జీవన్, కె. రామ్మోహన్ రాజు, తిర్మల్, ధనరాజ జ్ఞానేశ్వర్, రావులపాటి సీతారామారావు, మురళీధర్ గౌడ్, అనిశెట్టి రజిత, ముక్తవరం పార్థసారథి, కార్మిక, అందుగుల మొండయ్య, పవన్‌కుమార్, ననుమాస స్వామి, నందిగం కృష్ణారావు, రాగో, సాధన, బుర్రా రాములు, పుప్పాల కృష్ణమూర్తి, వనజ, ఐరేని గౌడ్, కొక్కుల పద్మావతి, సదానంద శారద, చింతపట్ల సుదర్శన్, కె. శ్రీనివాస్, రామకృష్ణ, బి. విద్యాసాగర్, అమరజ్యోతి, పద్మజ, పి. చంద్ మొదలైనవారు.

ఇంకా చాలా మంది ఈ కాలంలో కలం పట్టారు. అప్పటికే తెలంగాణలో పోరాటాలు ఉధృతంగా ఉన్నాయి. ఈ రచయితల్లో చాలా మందిపై తెలంగాణ భూపోరాటాల ప్రభావం ఉంది. పోరాట ప్రతిస్పందనలుగా కొందరు సృజన, అరుణతార, నూతన, ప్రజాసాహితి లాంటి పత్రికలతో పాటు ఇతర పత్రికలలోనూ కథలు రాశారు. ప్రజల జనజీవన సంస్కృతిని ఉన్నతీకరిస్తూ రాశారు. వాసిలోనూ రాశిలోనూ గొప్ప కథలు ఈ కాలంలోనూ, ఈ రచయితలు తర్వాతి కాలంలోనూ రాశారు. తెలంగాణ మాండలికాన్ని ఏ సంకోచాలు లేకుండా తమ కథల్లో వాడి ఆ భాషకు సాహిత్య గౌరవం తీసుకువచ్చారు. మాండలికం వాడటంలో ఈ రచయితలు కొంత అవరోధాన్ని ఎదుర్కొన్నా తమది ఇదే మార్గమని రాసి చూపారు. తర్వాతి కాలంలో ఈ రచయితలు, తర్వాతి తరం రచయితలు మాండలికాన్ని ఏ సంకోచాలు లేకుండా వాడటానికి మార్గం సుగమం చేశారు. ఈ రచయితల రచనలతోనే తెలంగాణ నుంచి కథలు ఉధృతంగా వస్తున్నాయని, తెలంగాణ మాండలికంలో మంచి రచనలు వస్తున్నాయన్న ప్రచారం పెరిగింది. తెలంగాణలో జరిగిన వివిధ ఉద్యమాలు, భూపోరాటాలు, దళిత బహుజన ఉద్యమాలు, కార్మిక పోరాటాలు దేనినీ వదిలిపెట్టకుండా కథలు రాసి తెలంగాణ కథకు విస్తృత ప్రచారం లభించేటట్టు చేశారు. కథా సంకలనాల్లో కొంచెమైనా చోటు లభించడం ఈ రచయితలతోనే ఆరంభమైంది. విశాఖపట్నం, విజయవాడ, అనంతపురం వీధుల గుండా పయనిస్తున్న తెలుగు కథను తెలంగాణ దిక్కు మరలించిన ఘనత వీళ్లకే దక్కుతుంది.

### ఈ తరం తెలంగాణ రచయితలు
### (1990 తర్వాత కలం పట్టినవారు)

కె.వి. నరేందర్, పెద్దింటి అశోక్‌కుమార్, పంజాల జగన్నాథం, బి.వి.యన్. స్వామి, చైతన్యప్రకాశ్, అంబల్ల జనార్దన్, గుండెడప్పు కనకయ్య, అమరావతి, యెన్నం సత్యం, యెన్నెం ఉపేందర్, నల్లాల లక్ష్మీరాజం, దార్ల రామచంద్ర, అన్నవరం దేవేందర్, బెజ్జారపు వినోద్‌కుమార్, బెజ్జారపు రవీందర్, శ్రీధర్ దేశ్‌పాండే, గీతాంజలి, చొప్పదండి సుధాకర్, దొడ్డి రామ్మూర్తి, పులిపాటి గురుస్వామి, షాజహానా, జాజుల గౌరి, రహమతుల్లా, స్కైబాబ, వేముల ఎల్లయ్య, బోధనం నర్సిరెడ్డి, అలీ, గొరుసు జగదీశ్వర్ రెడ్డి (విశాఖ), కర్ర ఎల్లారెడ్డి, బి. పద్మజ, సూర్యవంశి, పి. చిన్నయ్య, భాగ్యరేఖ, బి. గణేశ్, కె. పద్మలత, కె. రాంలక్ష్మణ్, వనమాల చంద్రశేఖర్, హర్షవర్ధన్, రాంశంకర్, టి. రంగస్వామి, శ్రీదాస్యం లక్ష్మయ్య, గోపు లింగారెడ్డి, యాకూబ్, ఖాజా, వనజ, దోరవేటి, తుర్లపాటి లక్ష్మి, గర్శకుర్తి రాజేంద్ర, ఉలి, పి. శ్రీనివాస్ గౌడ్, గౌస్ మొహియుద్దీన్ - ఇంకా అనేక మంది ఉన్నారు.

రెండవతరం, మూడవతరంలో రాయడం ప్రారంభించి కొందరు రచయితలతో పాటు ఈ తరం రచయితలు ఇవరయ్యవ శతాబ్ది చివరి దశాబ్దంలో తెలంగాణలో వచ్చిన మార్పులను, సంఘర్షణను కథలుగా మలిచారు. ముఖ్యంగా ప్రపంచీకరణ మాయలో పరాయీకరణకు గురవుతున్న బతకు వెతలను అక్షరీకరించారు. మాండలికానికి పట్టం కట్టారు. ఏ భాషా సాహిత్యానికీ తీసిపోని కథలు తెలంగాణ ప్రాంతం నుంచి వచ్చాయి.

ఈ తొంబై యేళ్ల కాలంలో ఐదారువేల మంచి కథలు, వెయ్యివరకు సంకలనాల్లో చేరాల్సిన కతలు తెలంగాణ నుంచి వచ్చాయి. ఒకటి అరా కథలు రాసిన వారిని వదిలిపెట్టినా 250 మంది వరకు కథారచయితలుగా ఎదిగారు. వీళ్లెవరూ వ్యాపార మసాలాల జోలికి పోకుండా స్పష్టమైన దృక్పథంతో ప్రయోజనకర సాహిత్యాన్నే సృష్టించారు. తెలంగాణ కథను సమున్నతంగా నిలబెట్టారు. ఈ పరంపరను సీనియర్ రచయితలతో పాటు ఈ తరం రచయితలు కొనసాగిస్తూనే ఉన్నారు. వంద, రెండు వందలకు పైగా కథలు రాసిన రచయితలు ఐదారుగురుంటే తెలుగు సాహిత్యంలోనే అత్యధికంగా ఆరువందల కథలు రాసిన రచయిత తెలంగాణ నుంచే ఉన్నాడు. గాడ్ ఫాదర్లంటూ లేకున్నా, తెలంగాణ నుంచి పత్రికలే లేకున్నా ఇలాంటి విజయం సాధించడం తక్కువదేం కాదు.



## తెలంగాణ కథా సంకలనాలు - సంపుటాలు

తెలంగాణలో కవులే లేరన్న విషయాన్ని ఎవరో లేవనెత్తితే పరితాపం చెందాడు తెలంగాణ వైతాళిక రచయిత, పరిశోధకుడు సురవరం ప్రతాపరెడ్డి. 270 మంది కవుల రచనలతో గోలకొండ కవుల సంచిక తీసుకొచ్చాడు. తెలంగాణ సాహిత్యానికున్న జవసత్వాలేంటో నిరూపించాడు. అయితే సురవరం ప్రతాపరెడ్డి గారి కవితా సంకలనం లాగా మొదటితరంలోనే తెలంగాణ నుంచి సమగ్రమైన కథా సంకలనం వచ్చుంటే అప్పుడే తెలంగాణ కథకున్న జవసత్వాలేంటో తెలిసుండేవి. తెలంగాణ నుంచి కథా సంపుటులు ముందు నుంచే వచ్చినా సంకలనాలు రావడానికి మాత్రం చాలా కాలమే పట్టింది.

స్వాతంత్ర్యానికి పూర్వమే అనేక కథాసంపుటులు తొలి తరం తెలంగాణ రచయితలవి వచ్చినప్పటికీ తెలుగు కథ గూర్చి స్వాతంత్ర్యానంతరం రాసిన వారు మాత్రం తెలంగాణ కథ గురించి ఉటంకించక పోవడం విషాదాల్లోకెల్లా విషాదం. దీంతో తెలంగాణ కథకు తీరని నష్టమే జరిగింది. ఇటీవలి కాలంలో జరిగిన పరిశోధనల వల్ల తెలంగాణ కథ తెలుగులో కథ పుట్టిన కాలం నుంచీ ఏ కథకూ తీసిపోకుండా ఉందన్న విషయం అర్థమవుతుంది. తొలితరంలో బాగానే కథలు వచ్చినా, ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం తెలంగాణ కథ కొంత స్తబ్దంగా ఉన్నట్టనిపించినా మూడవతరం రచయితల కాలం నుంచి తెలుగు కథకు మార్గనిర్దేశనం చేస్తూ అద్భుతమైన కథలొస్తున్నాయి.

### తొలితరంలో వచ్చిన కథాసంపుటులు

తెలంగణ మంటల్లో - అయోధ్య రామకవి, 1948

మన ఊళ్లో కూడానా! - కాంచనపల్లి చినవెంకటరామారావు, 1973

పర్చా దుర్గా ప్రసాదరావు - గెలుపు మనదే (1947)

జైలు - పొట్లపల్లి రామారావు (1945)

చార్మినార్ కథలు - నెల్లూరి కేశవస్వామి (1981)

పసిడిబొమ్మ (సంకలనం) - నెల్లూరి కేశవస్వామి

సురవరం ప్రతాపరెడ్డి కథలు - వైజయంతి పబ్లికేషన్స్, 1987

కథాకళి - బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి, 1987
సశేషం - బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి, 1962
పద్మం కథలు - భాగి నారాయణమూర్తి, 1958
మా యింట్లో - ధరణికోట శ్రీనివాసులు, 1949
స్వర్ణకమలాలు - ఇల్లిందల సరస్వతీదేవి
తులసీదళాలు - ఇల్లిందల సరస్వతీదేవి, 1994
హీరాలాల్ మోరియా కథలు - 1958
పరిష్కారం - హీరాలాల్ మోరియా, 1960
చీకటి కోణాలు - బెల్లంకొండ లక్ష్మణసూరి, 1967
గాడితప్పిన జీవితాలు - పుల్లాబొట్ల వెంకటేశ్వర్లు, 1963
క్రాస్ చెక్కు - పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, 1988
కృష్ణాంజలి - శౌంఠి కృష్ణమూర్తి, 1955
మా ఊరి ముచ్చట్లు - పాకాల యశోదారెడ్డి, 1973
ఎచ్చమ్మ కథలు, ధర్మశాల - పాకాల యశోదారెడ్డి
వాహ్యాళి - బూర్గుల రంగనాథరావు, 1942
మల్లికాగుచ్ఛం - మాడపాటి హనుమంతరావు, 1915, 1984
జైలు లోపల - వట్టికోట ఆళ్వారుస్వామి, 1952
పరిష్కారం - జి. వెంకటరామారావు, 1967
కష్టారావు కథలు - భాస్కరభట్ల కృష్ణారావు, 1967
చంద్రలోకానికి ప్రయాణం - భాస్కరభట్ల కృష్ణారావు
వెన్నెలరాత్రి - భాస్కరభట్ల కృష్ణారావు, 1962
సాలెగూడు, క్షమామూర్తులు - సింగరాజు లింగమూర్తి, 1973
స్మృతి చిహ్నం - సింగరాజు లింగమూర్తి, 1962
గండిపడ్డ జీవితాలు - పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి, 1954
కథామాల - వేమరాజు నరసింహారావు, 1952, 1984



కాగితపు పడవలు - డి. రామలింగం, 1964
కాళోజీ కథలు - కాళోజీ నారాయణరావు, 2000
నిజమైన మనుషులు - చక్రవర్తుల రంగస్వామి, 1956
చిట్టి కథలు - ఆవంచ లక్ష్మణరావు
దాంపత్యం - పెండ్యాల శేషగిరి రావు, 1943
మిథ్యబతుకులు - ఇసుకపల్లి లక్ష్మీనరసింహారావు, 1955
గూడూరి సీతారాం కథలు - గూడూరి సీతారాం, 2004

**ఆ తర్వాతితరం వారి సంపుటులు కొన్ని**

దున్న, ఎచ్చరిక, రంగులు, చీమలు, తెలంగాణ వెతలు, బోజ కథలు, ఉప్పునీళ్లు, ఇప్పపూలు (బోయజంగయ్య)

పాలు, స్మృతి, తేనెటీగలు, మమతలు మానవసంబంధాలు, వేపచెట్టు, పాలు ఇతర కథలు (బి.యస్. రాములు)

భూమి, సృష్టికర్తలు (అల్లం రాజయ్య)

కట్నం కథలు, రాజుకోడి, ఘర్మజలానికి ఖరీదు కట్టే షరాబు..?, మా కథలు, అవ్వతోడు గిది తెలంగాణ, కాలువ మల్లయ్య కథలు, వయోజన కథలు (కాలువ మల్లయ్య)

చిలకపచ్చ చీర, సౌందర్యలహరి, స్వేచ్ఛాజీవులు, ఊహాల ఊయల, నిశ్చితార్థం, సిద్ధిపురి కథలు, కథా మంజూష, ఏడువారాల నగలు (ఐతా చంద్రయ్య)

అంబల్ల బండ (భూపాల్), మన్య కథలు (విద్యాసాగర్), హాస్టల్ కథలు (కె. సీతారాములు), రూల్ ఆఫ్ లా, జింబో కథలు (జింబో), నాలుగు కాళ్ల న్యాయం (నందిగం కృష్ణారావు), భూనిర్వాసితులు (పి. చంద్), శిలువకు తొడిగిన మొగ్గ (కాసుల ప్రతాపరెడ్డి), విసుర్రాయి, మింగుతున్న పట్నం (ముదిగంటి సుజాతారెడ్డి), మనోగీతం, అమ్మ, నాన్న, బురదలో జాబిల్లి, యుద్ధం, కాలుతున్న పూలతోట (కె.వి. నరేందర్), సంకరవిత్తులు, బోనస్, ఆరు కార్మికకథలు (పులుగు శ్రీనివాస్), సింగిడి (బి. దామోదర్ రావు), నాలుగు దృశ్యాలు (ఆడెపు లక్ష్మీపతి), రేణ (చైతన్యప్రకాశ్), వలస బతుకులు, ఊటబాయి (పెద్దింటి అశోక్‌కుమార్), లైఫ్ ఇన్ ఎ కాలేజీ, ఎనిమిదో అడుగు (నవీన్), జీవితచిత్రం (పుప్పాల కృష్ణమూర్తి), మట్టికథలు (మేరెడ్డి యాదగిరిరెడ్డి), తిరగబడ్డ

భూమి, ముద్ర (వుప్పల నరసింహం), గొలుసు, జాడి, పిచ్చుక, సందానంద కథలు (సదానంద శారద), పలుకుబడి కథనాలు (తెలిదేవర భానుమూర్తి), బొంబాయి కథలు, అంబల్ల జనార్దన్ కథలు (అంబల్ల జనార్దన్), లియోసా (టి. సంపత్‌కుమార్), సింగరేణి బతుకులు (వి.యస్. మౌట), వీడని బంధాలు (ముదిగంటి పాపిరెడ్డి), బండ కింది బతుకులు (కైతికాల పోశెట్టి), మేమిట్లుండం (గుండెడప్పు కనకయ్య), బొండిగె (దొడ్డి రామ్మూర్తి), చౌరస్తా (పి. యశోదారెడ్డి, ముదిగంటి సుజాతారెడ్డి, వుప్పల నరసింహం, కాసుల ప్రతాపరెడ్డి), గవ్వలమూట (బెజ్జారపు వినోద్‌కుమార్), తిరుగు ప్రయాణం (లక్ష్మీరాజం), కిర్రుచెప్పులు (దార్ల రామచంద్ర), నిఖిలేశ్వర్ కథలు (నిఖిలేశ్వర్), చెరబండరాజు కథలు (చెరబండరాజు), పయిలం (పి. చిన్నయ్య), మన్నుబువ్వ (జాజుల గౌరి), వైపని (జూకంటి జగన్నాథం), నెలపొడుపు (బి.వి.యన్. స్వామి), మట్టివాసనలు (పంజాల జగన్నాథం), గంటీలు (నసుమాస స్వామి), మురళీధర్ కథలు, దేవరాజు మహరాజు కథలు, నఖాబ్ (షాజహానా)

ఇంకా అనేక మంది కథలు రాస్తున్నారు. కథల సంపుటులు వెలువరిస్తున్నారు. ఇవి ఇందులో కొన్ని మాత్రమే.

**కథా సంకలనాలు**

1. కథావాటిక (1945): ఇందులో ఐదు కథలున్నాయి. వీటిని సంకలనం చేసినవారు అడ్లూరి అయోధ్యరామకవి.

2. సుమాంజలి (1955): ఈ కథాసంకలనాన్ని నవ్యసాహితి సమితివారు ప్రచురించారు (వేమరాజు నరసింహారావు). ఇందులో ఆరు కథలున్నాయి.

3. కమ్మతెమ్మెరలు, ఉషస్సు: ఆంధ్రకేసరి గ్రంథమాల, 1942 ప్రాంతంలో బూర్గుల రంగనాథరావు

4. అణాకథలు (1940): చంద్రసేన్ గుప్తా, వెల్దుర్తి మాణిక్యరావు

5. కమ్మతెమ్మెరలు (1940): ఆంధ్రకేసరి గ్రంథమాల, గుండవరపు హనుమంతరావు, బూర్గుల రంగనాథరావు.

6. కథానికా గుచ్ఛం (1953): ఆంధ్రప్రదేశ్ పౌరసంబంధ శాఖ.

7. సమర్పణ (1967): జ్యోతిర్మయి సాంస్కృతిక సంస్థ, సంకలనకర్త: ఎస్వీ రామారావు

8. ఉషస్సు (1945): నల్లగొండ జిల్లా సారస్వత పరిషత్తు, సంపాదకత్వం: బూర్గుల రంగనాథరావు.



9. జాజిపూలు (1965): నవ్యసాహితీ సమితి.

10. పరిసరాలు (1956): దేశోద్ధారక గ్రంథమాల, వట్టికోట ఆళ్వారుస్వామి

11. కదంబం (1953): నవ్యసాహితీ సమితి, హైదరాబాద్, తొలిపలుకు: సురవరం ప్రతాపరెడ్డి

12. సాధన (1953): సాధన సమితి, హైదరాబాద్

13. బద్‌లా (1973): కరీంనగర్ సాహితీ మిత్రులు

14. తెలంగాణ పోరాట కథలు (1982): జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య.

1948-52 సాయుధ పోరాటాన్ని ఇతివృత్తంగా తీసుకొని పోరాట ప్రతిస్పందనలుగా వచ్చిన కథల సంకలనం ఇది. 23 కథలతో పోరాట ప్రతిస్పందనలుగా వచ్చిన 53 కథల లిస్టుతో వెలువడిన ఈ సంకలనంలో తెలంగాణ పోరాటాన్ని దూరం నుంచి చూసి, చదివి, విని తెలంగాణేతరులు రాసిన కథలే ఎక్కువగా ఉన్నాయి. వీటిలో స్థలకాలాల చైతన్యం తక్కువ.

15. కోల్‌బెల్ట్ కథలు (1986): అబంపి పబ్లికేషన్స్, గోదావరిఖని, సంపాదకత్వం: బండారి కిష్టయ్య, పిట్టల రాజేందర్, చైతన్య

బొగ్గుగని కార్మికుల జీవితాలపై వెలువడిన మొట్టమొదటి కథా సంకలనం.

16. భూమిక (1988): అబంపి పబ్లికేషన్స్, గోదావరిఖని.

17. అడవిలో వెన్నెల (1985): కరీంనగర్ బుక్‌ట్రస్టు.

గిరిజన జీవితాలపై వచ్చిన మొట్టమొదటి కథా సంకలనం.

18. బొగ్గుపొరల్లో (1988): కరీంనగర్ బుక్‌ట్రస్టు.

19. నేలతల్లి విముక్తికోసం: విరసం.

తెలంగాణ భూపోరాట ఉద్యమాల ఉత్థానవికాసాలను అక్షరబద్ధం చేసిన పోరాట కథల సంకలనం.

20. శ్వేతరాత్రులు, రుతుపవనాలు (1990): ఇందులో తెలంగాణ రచయితల కథలతో పాటు ఇతర రచయితల కథలూ ఉన్నాయి.

21. ఆధునిక కథా సరిత్సాగరం (కరీంనగర్ జిల్లా కథలు)(1988): విశాల సాహిత్య అకాడమీ, జగిత్యాల (సంపాదకులు: బి.యస్. రాములు, వనమాల చంద్రశేఖర్)

22. ఆధునిక కథాసరిత్సాగరం (కరీంనగర్ జిల్లా కథలు) (2000): విశాల సాహిత్య

అకాడమీ (సంపాదకులు: బి.యస్. రాములు, వనమాల చంద్రశేఖర్)

జిల్లా కథా సంకలనాల్లో మొదటివి ఈ రెండు.

23. చౌరస్తా (2002): తెలంగాణ కథా వేదిక

24. తెలంగాణ తొలి తరం కథలు (2002): (సంకలనం: ముదిగంటి సుజాతారెడ్డి)

తొలితరం తెలంగాణ కథా స్వరూప స్వభావాలు, కథల బలమేంటో తెలిపిన గ్రంథం. తొలితరం తెలంగాణ కథను సమగ్ర విశ్లేషణతో మరుగున పడిన కథలతో వెలువడిన గొప్ప సంకలనం.

25. భారతీయ కథా సాహిత్యం- తెలుగు కథలు (2003): విశాల సాహిత్య అకాడమీ, హైదరాబాద్ (సంపాదకులు: బి.యస్. రాములు)

26. తెలంగాణ కథ 2003: తెలంగాణ సాహితి, హనుమకొండ (సంపాదకుడు: కర్ర ఎల్లారెడ్డి)

తెలంగాణ కథలపై వార్షిక సంచికల్లో మొదటిది. తెలంగాణ కథా వార్షికలకు నాంది.

తెలంగాణ జనజీవన సంఘర్షణను, సంస్కృతిని, దళిత బహుజన జీవితాలను చిత్రించే కథలున్నాయి ఇందులో. ప్రతి సంవత్సరం తెలంగాణ నుంచి ఎంత అద్భుతంగా కథలొస్తున్నాయో ఈ సంకలనం చదివితే అర్థమవుతుంది.

27. వతన్ (2004): సంపాదకుడు: స్కైబాబ

ముస్లిం జీవితాలపై వచ్చిన మొట్టమొదటి కథా సంకలనం. తెలంగాణ ముస్లిం జీవితాలపై ముప్పయికి పైగా కథలున్నాయి.

28. తెలంగాణ కథ 2004: తెలంగాణ సాహితి, హనుమకొండ (సంపాదకుడు: కర్ర ఎల్లారెడ్డి)

తెలంగాణ కథా వార్షిక ఇది.

28. తెలంగాణ కథ (2005): విశాలాంధ్ర ప్రచురణ (సంపాదకులు: కాలువ మల్లయ్య, సదానంద శారద)

తొలితరం కథకులు మాడపాటి హనుమంతరావు కథ నుంచి ఈనాటి తెలంగాణ రచయితల వరకు 90 మంది కథకుల 90 కథలతో వెలువడుతున్న బృహత్ కథా సంకలనం. సంస్కరణ, సాంఘిక ప్రయోజనం నేపథ్యంతో ప్రారంభమైన



తెలంగాణ కథ అన్ని ఉద్యమాలనూ, మార్పులనూ తనలో సంలీనం చేసుకొని ఎన్నెన్ని పోకడలు పోయిందో తెలిపే అద్భుత కథా సంకలనం. తెలుగు కథకు చిరునామా తెలంగాణాయే అని నిరూపించే సంకలనం.

ఇవి తెలంగాణ నుంచి వచ్చిన కథా సంకలనాలు, సంపుటులు. గత పదేళ్లుగా సంకలనాలు, సంపుటులు మరింత ఉధృతంగా వస్తున్నాయి. ప్రతి నెలా సంపుటులు వస్తూనే ఉన్నాయి.

పుస్తకాలుగా వచ్చిన తెలంగాణ కథలు ఇవి మాత్రమే కాదు. వచ్చిన వాటిలో ఇవి కొన్ని మాత్రమే. సంపుటులుగా, సంకలనాలుగా వస్తున్న, రావాల్సిన కథలింకా ఎన్నో ఉన్నాయి. ఈ పుస్తకాలను చదివితే నైజాం కాలం నుండి నేటివరకు తెలంగాణలో వచ్చిన వివిధ పరిణామాలు కళ్ల ముందు కదులుతాయి. నైజామాంధ్ర భాషా సొగసులతో పాటు జీవనవైవిధ్యం, ప్రజల ఆరాటాలు, పోరాటాలు, సంస్కృతీసాంప్రదాయాలు కళ్ల ముందు నిలుస్తాయి. తెలంగాణ గ్రామాల స్వరూప స్వభావాలు దర్శనమిస్తాయి. ఈ కథలను చదివితే తెలంగాణ గ్రామాలను తీసుకొని గ్రామీణ జీవితం, సంఘర్షణ నేపథ్యంగా కథలు రాసిన వారే రచయితలుగా నిలదొక్కుకున్నారన్న విషయం స్పష్టమవుతుంది.

ఆశు సాంప్రదాయాన్ని స్వంతం చేసుకొని, లిఖిత కథకు ఆశు కథా పరిమళమద్ది, ప్రజల భాషను హృదయానికి హత్తుకొని రాసిన కథలిందులో ఎన్నో ఉన్నాయి. ఈ కథలను ఏ ప్రమాణాలతో చూడాలో కథలు పాఠకులకు చేరాలంటే ఎలా రాయాలో ఈ కథలు చదివితే అర్థమవుతుంది. నోటి కథ చెప్పడం ఎప్పటి నుంచో ఉన్నా లిఖిత కతను నోటి కథలా చెప్పే పద్ధతిలో కథలు రాసి తెలుగు కథకు కొత్త బాట చూపారు. సురవరం ప్రతాపరెడ్డి మొగలాయ్ కథలు, అల్లం రాజయ్య పోరాట కథలు, కాలువ మల్లయ్య బహుజన కథలు, పోశెట్టి బండ కింది బతుకులు, అవ్వతోడు గిది తెలంగాణ కథలు లాంటివెన్నో ఇందుకు ఉదాహరణలు.

ఈ సంపుటులను, సంకలనాలను తిరిగేస్తే ఈ రచయితలకు గ్రామాలపై ఉన్న ప్రేమాభిమానాలు, నమ్మకం, వాళ్లు తమ మూలాల వైపు దృష్టి సారించడం కనబడుతుంది. గ్రామీణ జీవితంతో సంబంధమున్న వాళ్లే రచయితలుగా ఎదిగిన క్రమమూ తెలుస్తుంది. ఊళ్లపై ప్రేమ, ప్రకృతి విధ్వంసాన్ని చూసి ఆవేదన, బతుకమ్మ వాగులో ఈతకొట్టిన దృశ్యాలు, చెరువులో కోడిపుంజాటలు, మత్తడి కింద కూచొని వీపు మీద నీళ్లు పడుతుంటే కేరింతలు కొడుతున్న వైనం, గుట్టకు పోయి తంగేడు

పువ్వు తెంపుకొస్తున్న సంఘటనలు, బతుకమ్మాటలు, మనకు తెలియని మన చరిత్ర దృశ్యాలు, పోరాటాలు, పోలీసుల బూట్ల చప్పుడు, దొరల పరుగు, ఊరుమ్మడి బతుకుల వెతలెన్నో దర్శనమిస్తాయి.

సురవరం ప్రతాపరెడ్డిగారు సాహిత్యాధారాల ద్వారా వెయ్యేళ్ల ఆంధ్రుల సాంఘిక చరిత్రను రాశాడు. తెలంగాణ నుంచి వచ్చిన ఈ కథల సంపుటులు, సంకనాలు తెలంగాణ సాంఘిక చరిత్రను రాసేంత విషయాన్ని నిక్షిప్తం చేశాయి. అట్టడుగు వర్గాల జీవితం, పోరాటాలు, పనిసంస్కృతి, వర్గమాండలికాన్ని ఈ కథలు నిక్షిప్తం చేశాయి. ఈ కథా సంకలనాలు, సంపుటులు తెలుగు కథా సాహిత్యానికి అదనపు గౌరవాన్ని ఇవ్వడమే కాకుండా ప్రయోజనం లేని సాహిత్యం ఉండకూడదన్న విషయాన్ని ధృవీకరిస్తాయి.



# దళిత సంవేదనా కథల తెలంగాణ

తెలుగు కథాసాహిత్యంలో తెలంగాణ కథకు విశిష్ట స్థానముంది. తెలుగుకథ ఆవిర్భావ వికాసాలు కోస్తా ప్రాంతంలోనే ప్రారంభమైనా ఆ తర్వాత తెలుగుకథా వికాసానికి తెలంగాణా కథెంతో తోడ్పడింది. మధ్యతరగతి దృక్కోణం నుండి అట్టడుగు జీవిత దృక్కోణంలోకి కథను పయనింపజేసింది. విప్లవ, దళిత, బహుజన, మైనారిటీ వాద కథోద్యమాలు బలపడటానికి తెలంగాణ కథే మార్గదర్శకత్వం వహించింది.

తెలంగాణ కథంటే ఉద్యమ కథే అన్నంతగా ఉద్యమ కథలు ఉధృతంగా వచ్చాయి. ఉద్యమ కథతో గ్రామీణ జీవిత చిత్రణ, జనజీవన సంఘర్షణ, కార్మిక, కర్షక, విద్యార్థి, మేధావుల గూర్చి అనేక కథలు వచ్చాయి. ఏ విషయాన్ని వదిలిపెట్టకుండా తెలంగాణ కథ సర్వతోముఖ వికాసం చెందింది. భారతదేశానికే భూపోరాటాల వారసత్వాన్ని అందించడంలోనూ, గత మూడున్నర దశాబ్దాలుగా భూపోరాటాల ఉధృతి తెలంగాణలో విశేషంగా ఉండటం వల్లనూ తెలంగాణ కథ ఉద్యమ స్వభావాన్ని సంతరించుకున్న మాట నిజమే. అయితే భూపోరాట ఉద్యమాలతో పాటు తెలంగాణలో అంబేద్కర్ ఉద్యమాలూ సమాంతరంగా సాగుతూనే ఉన్నాయి. స్వాతంత్ర్యానంతరం లభించిన స్వల్ప అవకాశాలతో దళిత బహుజన కులాల నుంచి వచ్చిన వాళ్లు చదువుకొని, పట్టణాల నుంచి గ్రామాలకు వచ్చి వెంట అంబేద్కర్‌ను తీసుకొచ్చారు. ఈ ఉద్యమాలూ, భూపోరాట ఉద్యమాలూ తెలంగాణలో దాదాపు ఒకేసారి మొదలై పీడిత వర్గాలకు చైతన్యవంతులను చేయడం గమనించవచ్చు.

మన దేశాన్ని పీడిస్తున్న కులసమస్య తీవ్రత తెలియంది కాదు. సంపదలను సృష్టించేవారి చేతుల్లో ఆస్తులు, అధికారాలు లేకపోవడం ఒక పార్శ్వమైతే అందులోని కొందరు అంటరానివాళ్లుగా వివక్షకు గురి కావడం మరో పార్శ్వం. బహుశః ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా మనదేశంలో అంటరానితనమనే దురాచారముంది. దళితులనబడే వారికి గుడిలోకి కూడా ప్రవేశం లేకపోవడం దారుణం. ఇలాంటి పీడితుల పక్షపాతం నుంచి ఆలోచనాపరులైన రచయితలు మొదట్నుంచీ ఎంతో కొంత సాహిత్యం సృష్టిస్తూనే ఉన్నారు. కాని వాళ్ల పక్షం వహించి రావాల్సినంత సాహిత్యం రాలేదు. ఇప్పటికీ రావడం లేదు. అయినప్పటికీ ఇటీవలి కాలంలో దళిత కథ దళిత సంవేదనతో అద్భుతంగా వస్తుంది.

దళితేతరులైనవారు దళితకథలు రాయడం వల్ల అందులో దళితుల పట్ల సానుభూతి కనబడుతుంది. ఎవరి కథలు వాళ్లు మాత్రమే రాసుకోవాలనుకోవడం సరైంది కాకున్నా ఆయా వర్గాల్లోంచి వచ్చినవాళ్లు తమ కథలను తాము రాసుకుంటే ఆ కథల్లో ఆర్తి, ఆర్ద్రత, సంవేదన కనబడతాయి. ఇలా రాయబద్ధ కథలే ఇటీవలి కాలంలో తెలంగాణ నుంచి వచ్చిన దళిత కథలు. ఈ కథలు రాసినవాళ్లలో దళితులు, దళితులను ప్రేమించే, దళితాభివృద్ధిని హృదయపూర్వకంగా కోరుకునే పీడిత కులాల రచయితలున్నారు. తెలుగు కథల్లో తెలంగాణా కథకు విశిష్ట స్థానమున్నట్టే దళిత కథకూ ప్రత్యేక స్థానముంది. మొదట్నుంచీ తెలుగులో ఒకటి అరా దళిత కథలున్నా తెలంగాణ నుంచి దళిత సాహిత్యోద్యమం వచ్చిన తర్వాతే వీటి సంఖ్య పెరిగింది. ఊరూరికీ అంబేద్కర్ సంఘాల స్థాపనతో దళిత సాంస్కృతికోద్యమం బలపడటంతో పాటు సాహిత్యోద్యమమూ బలపడింది. దండోరాలాంటి ఉద్యమాలు, దళిత రచయితల మేధావుల ఐక్య వేదిక స్థాపనలు దళిత సాహిత్యం విరివిగా రావడానికి విటమిన్లలా పని చేశాయి.

విప్లవ సాహిత్యోద్యమం దళిత సాహిత్యాన్ని వేరుగా చూడలేదు. భూపోరాట ఉద్యమాల ఆర్థిక దృష్టి కోణంలోంచే చూసింది. ఇందులో భాగంగానే విప్లవ కథలను రాస్తూ దళిత సమస్యలను పీడిత, ఆర్థిక దృష్టి కోణంలోంచి అల్లం రాజయ్య, రఘోత్తమ రెడ్డి, బి.యస్. రాములు, కాలువ మల్లయ్య విప్లవ దశాబ్దిలో అనేక కథలు రాశారు. ఇందులో భాగంగానే గిరిజన బంధు సాహు గిరిజనుల భాషను నేర్చుకొని వాళ్లతో మమేకమై అనేక గిరిజన కథలు రాశాడు. అడవిలో వెన్నెల కథా సంకలనంలో ఉన్న ఈ కథలు గిరిజన బతుకులపై వచ్చిన అద్భుతమైన కథలు. సాహు రాసిన కన్నీటికథ, నీటి కథ, పెళ్లి కావాలి, కాయిదా, ఐదు రూపాయల కథ, భూమి కొరకు, రక్తపింజెర, జెండా కథ, ఆకలి, న్యాయం గిరిజనుల బతుకు వెతలను, అన్యాయంగా వాళ్లు పోరాటబాట తొక్కాల్సిన రావాల్సిన అవసరాన్ని తెలిపే కథలు. గిరిజనులను హృదయానికి హత్తుకొని, వాళ్లలో ఒకడై వాళ్ల బతుకులకు భాష్యాలనదగిన కథలు రాసిన సాహు గిరిజనుల బంధువే. బెంగాలీ గిరిజనులకు మహాశ్వేత దేవిలా ఎదుగుతున్న సాహు అకాలమరణం చెందడం అడవిపుత్రుల సాహిత్యానికి తీరనిలోటు లాంటిదే. బి.యస్. రాములు రాసిన అడవిలో వెన్నెల 1, అడవిలో వెన్నెల – 2 కథలు ఆదిలాబాద్, మన్య ప్రాంత గిరిజన సంస్కృతీసంప్రదాయాలను అక్షరీకరిస్తూ వాళ్ల అడవి బతుకుల్లో వెన్నెల కురవాలని చెప్పే మంచి కథలు. మారట్ తుడుం పాయానా, రగల్ రాజ్జెం,



మైనానిసట్ గిరిజనులు తిరుగుబాటు చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పే కె. రామ్మోహన్ రాజు కథలు. గోపి భాగ్యలక్ష్మి రాసిన జంగుభాయి గిరిజన స్త్రీ బతుకు వేదనను అక్షరీకరించిన కథ. ఇవన్నీ భూసమస్య ప్రధానంగా భూమి కోసం భుక్తి కోసం బంధనాల్లో ఉన్న పేద ప్రజల విముక్తి కోసం దళితులు, గిరిజనులు పోరాటం చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పే కథలే.

అయితే మార్క్సిజం కుల సమస్యకు అంతగా ప్రాధాన్యత ఇవ్వనట్టే దళితుల గూర్చి వచ్చిన విప్లవ కథా కులం గూర్చి, కులపీడన గూర్చి అంతగా పట్టించుకోలేదు. అంబేద్కర్ ప్రభావంతో మరాఠీలో వచ్చినంత లోతైన దళిత సాహిత్యం తెలుగులో రాలేదు. విప్లవ సాహిత్యం ఉధృతంగా వస్తున్నప్పుడు, దళిత సాహిత్యోద్యమం ఉద్యమ రూపం తీసుకున్నప్పుడు, ఆ తర్వాత కాలంలోనూ తెలంగాణ నుంచి దళిత కథలు వచ్చాయి. దళితులపై జరుగుతున్న పీడనను, వేదనను, కుల సమస్య తీవ్రతను, అంటరానితనంలోని దుర్మార్గాన్ని వెలికి తీస్తూ దళితులు, దళితేతరులు చక్కని కథలు రాశారు. దళిత సాహిత్యోద్యమం దండోరా ప్రభావం విశేషంగా ఉన్న తెలంగాణలో దళిత కులాల్నుంచి ఎక్కువగా లేదా రావాల్సినంత మంది దళిత రచయితలు రాకపోవడం ఓ వైరుధ్యమే. ఏదేమైనా దళిత జీవితంతో మమేకమైనవాళ్లు దళిత కులాల నుంచి వచ్చినవాళ్లే అన్నంతగా తాదాత్మ్యం చెంది దళితుల గూర్చి వందలాది కథలు రాసిన తెలంగాణా రచయితలున్నారు. తెలంగాణలో దళిత కథను, తద్వారా తెలుగు కథను జవసత్వాలందించి దళిత కథను సుసంపన్నం చేస్తున్న తెలంగాణ రచయితలు బోయ జంగయ్య, బి.యస్. రాములు, కాలువ మల్లయ్య, దార్ల రామచంద్ర, జాజుల గౌరి, నల్లాల లక్ష్మీరాజం మొదలైనవారు.

బోయ జంగయ్య ఇప్పపూలు, ఇతర కథల సంపుటాలు, జాజుల గౌరి మన్నుబువ్వ, పంజాల జగన్నాథం మట్టివాసనలు, నల్లాల లక్ష్మీరాజం తిరుగు ప్రయాణం, దార్ల రామచంద్ర కిర్రుచెప్పులు, పి. చిన్నయ్య పయిలం, బి.యస్. రాములు స్మృతి, కాలువ మల్లయ్య ఘర్మజలానికి ఖరీదు కట్టే షరాబు..? కాలువ మల్లయ్య కథలు, పెద్దింటి అశోక్‌కుమార్ ఊటబాయి, గుండె డప్పు కనకయ్య మేమిట్లుండం కథా సంపుటాల్లో దళిత జీవన ఔన్నత్యాన్ని, దళితుల సంవేదనను అక్షరీకరించిన అనేక కథలున్నాయి. తెలంగాణ నుంచి దళిత బహుజన పీడిత సాహిత్యం, గొప్ప సాహిత్యం వస్తుందన్న దానికి సమాధానం అక్కడ పీడన, సమస్యలు, వేదన ఎక్కువున్నాయన్నది మాత్రమే కాదు. అక్కడి రచయితలకున్న నిబద్ధత.. పీడిత వర్గాల్లోంచి వచ్చినవాళ్లు

రచయితలుగా ఎదగడం.... పీడిత వర్గ సంస్కృతిని ప్రేమించడం... తమ మూలాలను మరిచి పోకుండా ఉండటం... మరాఠీలో దళిత కథల సంకలనాల్లా తెలుగులో ఎనిమిది సంకలనాలు తీసిన ఘనత డా॥ కె. లక్ష్మీనారాయణకే దక్కుతుంది. ఒక విశ్వవిద్యాలయమో ఒక సంస్థో చేయాల్సినంత పనిని ఒంటి చేత్తో చేసి దళిత కథా సాహిత్యానికి ఎనలేని సేవ చేశాడితడు. ఇందులో ముప్పై, నలభై తెలంగాణ కథలున్నాయి.

డా॥ కె. లక్ష్మీనారాయణ, డా॥ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి సంపాదకత్వంలో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు సంకలనం చేసిన దళిత కథలు సంకలనంలో బోయ జంగయ్య బంచరాయి, కాలువ మల్లయ్య అగ్నిగుండం, బి.యస్. రాములు బందీ కథలున్నాయి. ఊళ్లలో ఉన్న బంచరాయి భూములపై భూమి లేని పేదలైన దళితులకు అధికారం ఉండాల్సిన అవసరాన్ని తెలిపే కథ బంచరాయి. భూపోరాటాల మీద జరుగుతున్న వివిధ ఉద్యమాల వల్ల తెలంగాణ గ్రామాలు అగ్నిగుండాలుగా మారిన క్రమాన్ని చిత్రించిన కథ అగ్నిగుండం. ఊళ్లు అగ్నిగుండాలుగా మారితే దళితులు అన్నలకు సహాయం చేస్తున్నారన్న నెపంతో పోలీసు హింసకు గురి కావడం ఈ కథలో చూడవచ్చు. చదువుతో గెలుచుకున్న జీవితంతో దళితమేధావి సమాజానికి బందీ అయ్యే క్రమాన్ని బందీ కథలో చూడవచ్చు. స్త్రీ వాదోద్యమాలు, సాహిత్యోద్యమాలు స్త్రీకెంతో ఆత్మవిశ్వాసాన్ని కల్పించినా, చైతన్యవంతలను చేసినా అవి దళిత, శ్రామిక స్త్రీలనంతగా పట్టించుకోలేదన్నది కాదనలేని సత్యం. ఆ లోతును దళిత స్త్రీలపై వచ్చిన దళితకథలు తీర్చాయి. బి.యస్. రాములు ఇల్లాలు, తెల్లబట్ట, గోపి ఆ చూపే, ఈ రచయిత ఎంగిలి చేత్తో, ఉద్ధరింపు కథలు దళిత స్త్రీ సమస్యలపై వచ్చిన మంచి కథలు. స్త్రీ కూతురుగా, భార్యగా, తల్లిగానే ఉంటుంది తప్ప స్వంత వ్యక్తిత్వం లేనిదిగా ఉండే సామాజిక నిర్మితిలోని దుర్మార్గాన్ని ఇల్లాలు కథ చిత్రించింది. కల్లాలూడ్చుకుంటూ బతికే నాతకాని స్త్రీ బతుకులోని దైన్యాన్ని ఎంగిలిచేత్తో కథ చెబితే, దళిత స్త్రీని ఉద్ధరిస్తున్నామని చెప్పే వాళ్ల బండారాన్ని బయటపెట్టే కథ ఉద్ధరింపు.

దళితులు అనేక సామాజిక కట్టుబాట్ల బంధనాల్లో ఇరుక్కొని అవమానాలకు, అణచివేతకు గురువుతున్నారు. దళితులు ఆ బంధనాల నుండి విముక్తి పొందాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పేవి దళిత విముక్తి కథలు. కాలువ మల్లయ్య రాసిన కిటుకు, జింబో రాసిన చెప్పులు, దార్ల రామచంద్ర రాసిన బతుకుబడి, బోయ జంగయ్య రాసిన ఇది కతా?, కాసుల ప్రతాపరెడ్డి రాసిన అవమానం, నీలి రాసిన కొత్త తరం,



దళితుల విముక్తిని గురించి వచ్చిన మంచికథలు. చదువులేని దళితులను హీనంగా చూస్తూ అవమానాలకు గురి చేస్తూ ఆనందించే దొరలే వాళ్ల కొడుకులు చదువుకొని ఉన్నత స్థితిలోకొస్తే కొంతయినా గౌరవించడంలో ఉన్న మతలబును తెలిపే కథలు కిటుకు, బతుకుబడి... చెప్పులు కుట్టే కుటుంబంలోంచి వచ్చిన వ్యక్తి చదువుతో జీవితాన్ని గెలుచుకుంటాడు. తన తల్లిదండ్రులను, తనను ఏ దొరలయితే అవమానాలకు గురి చేస్తారో ఆ కుటుంబంలోని వ్యక్తి చెప్పుల దుకాణంలో అందరి ముందు చెప్పులేస్తూ కనబడటం ఆ దళిత విద్యావంతుల్ని ఆలోచనలకు గురి చేస్తుంది. చెప్పులు కథలోని కథాంశమిది. వర్ణ వివక్షపై వచ్చిన వెట్టి, పాలేరు కథలు బి. దామోదరరావు, కాలువ మల్లయ్య రాసినవి. అంటరానితనంలో దుర్మార్గాన్ని ప్రశ్నించే ఈ కథలు మనిషిని మనిషిగా చూడాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పేవి. గొర్లు, నా తెలంగాణ కథలు రాజకీయ ఆర్థిక కథలు. చెప్పులు కుట్టుకుంటూ బతికే కుటుంబంలో పడరాని కష్టాలు, అవమానాలు పడ్డ వ్యక్తి అంబేద్కర్ సిద్ధాంతాలు, ఉద్యమాల వెలుగులో రాజకీయ చైతన్యం పొందుతాడు. తన కొడుకును చదివిస్తాడు. తనను అవమానించిన వాళ్ల నెదుర్కుంటాడు. నీ బాంచెన్ కాల్మొక్తా అన్న స్థితి నుంచి ఆత్మవిశ్వాసంతో ఆత్మగౌరవంతో బతికే స్థితికెదగడాన్ని చిత్రించిన కథ నా తెలంగాణ.

దళితులు ఉద్యమాల వెలుగులో, అంబేద్కర్ సిద్ధాంతాల కాంతిబాటలో చదువుతో వచ్చిన చైతన్యంతో తమ వ్యక్తిత్వాన్ని వికాసం చెందించుకోవడాన్ని చిత్రించిన కథలు వ్యక్తిత్వ వికాసకథలు. వీటన్నింటి ఫలితంగా పొందిన వికాసంతో దొరలకు సవాళ్లుగా నిలబడటం, అవసరమైతే తిరుగుబాటు చేయడాన్ని చిత్రించిన కథలు వట్టికోట ఆళ్వారుస్వామి పరిగె, బోయ జంగయ్య ఇంకానా ఇకపై సాగదు, ఆదెపు లక్ష్మీపతి రాబందులు, జూకంటి జగన్నాథం కళేబరం, బి.యస్. రాములు రియల్ ఎస్టేట్, కాలువ మల్లయ్య వైరుధ్యాలు, సదానంద శారద ఉప్పునీళ్లు. ఇంత వరకు సాగిందే ఎక్కువ ఇకపై మాపై మీ పప్పులుడకవు అని దళితులు దొరలను సవాళ్లు చేయడాన్ని ఇంకానా ఇకపై సాగదు చిత్రిస్తే, రాబందుల్లాంటి దొరల స్వభావాన్ని రాబందులు కథ చిత్రించింది. జంతు కళేబరాన్ని మేమే ఎందుకు తీయాలి, ఎవరిది వాళ్లే తీసుకోవాలని సవాలు విసిరిన కథ కళేబరం అయితే ఉద్యమాలున్న జగిత్యాల పల్లెల్లోనూ పీడిత, దళిత కుటుంబాల మధ్య ఉన్న వైరుధ్యాలను చిత్రించిన కథ వైరుధ్యాలు. చదువులను, జ్ఞానాన్ని రియల్ ఎస్టేట్లుగా మార్చుకొని దళితులు పైకి రావాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పే కథ రియల్ ఎస్టేట్.

దళితులు తమ హక్కులను తాము సాధించుకొని జీవితాలను గెలుచుకోవాల్సిన అవసరాన్ని తెలిపే కథలు హక్కుల సాధన కథలు. చదువుతో, చైతన్యంతో తమను తాము గెలుచుకోవచ్చని, హక్కులను సాధించుకోవచ్చని ఊరిబాయి (బి. దామోదర్ రావు), చదువు (దాశరథి రంగాచార్య), చదవు కన్ను (సదానంద శారద), పొడవని పొద్దు (దేవరాజు మహారాజు), సదువు (బి.యస్. రాములు), నిప్పు రవ్వలు (నవీన్), పాలు (బి.యస్. రాములు), పాము (బోయ జంగయ్య), కర్రోడు (కాలువ మల్లయ్య) కథలు చెబుతున్నాయి. దేశాభివృద్ధికి అవసరమైన వస్తు సంపదనంతా ఉత్పత్తి చేసేది దళితులే కాని ఆ వస్తువుల కర్తృత్వంలో మాత్రం దళితులకు పాలు (భాగం) లేని దుర్మార్గాన్ని ప్రశ్నించే కథ పాలు. ఎవరి పాలు వాళ్లకు రావాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పే కథ. అణిగిమణగి బానిసత్వంలో కుంగిపోతున్న దళితులు నివురు గప్పిన నిప్పులాంటివాళ్లని, ఆ నివురును తొలగించి నిప్పును బయటకు తీస్తే వాళ్ల ముందు నిలవడం కష్టమని తెలియచెప్పే కథ నిప్పురవ్వలు. కర్రోడుగా నిందింపబడుతూ ఎన్నో అవమానాలను పొందిన దళితుడు పట్టుదలతో చదువుకొని మేధావిగా ఎదిగి తమ మూలాలను మరిచిపోయి సౌందర్యారాధకుడై తన కొడుకులో తనను తాను చూసుకొని తన వాళ్ల కోసం అంకితమయ్యే క్రమాన్ని చిత్రించిన కథే కర్రోడు. సదువు, చదువు. చదువుకున్న దళితులకు విద్య అవసరాన్ని నొక్కి చెబుతూ విద్యతో జీవితాలను గెలుచుకునే క్రమాన్ని చిత్రించిన కథలు.

దళితులకు కావాల్సింది పైపై సంస్కరణలు కాదు. కేవలం రాయితీలు కాదు. కంటి తుడుపు రిజర్వేషన్లతో సరిపెట్టడం అంతకంటే కాదు. వాళ్లు విముక్తిని కోరుకుంటున్నారు. బానిస బంధనాల నుండి విముక్తిని కోరుకుంటున్నారు. దళితులకు వీటన్నింటి నుండీ విముక్తి కావాలని చెప్పే కథలు విముక్తి కథలు. ఈ విషయాన్ని బలంగా చెప్పిన కథలు ఇల్లిందల సరస్వతీదేవి మెహర్బానీ, కాలువ మల్లయ్య తెల్లవారితే, సొసంత్రం, బోయ జంగయ్య దొరసాని, బి.యస్. రాములు దక్షయజ్ఞం, ఐదోవాడు కథలు. కూలినాలి చేసుకుంటూ బతికే దళిత స్త్రీ దృష్టి కోణం నుంచి తెల్లవారితే జరిగే పరిణామాలను చిత్రించిన కథ తెల్లవారితే.. ఆకలితో కడుపు మాడుతున్నా, అలసిసొలసిపోయున్నా, అనారోగ్య పీడితులయినా తెల్లవారిందంటే పనులకు పరుగెత్తాల్సి రావలసిన క్రమాన్ని తెలుపుతూ, అందరికీ ముఖ్యంగా పీడితులైన దళితులకు ఆనందాన్నిచ్చే తెల్లవారడమే నిజమైన తెల్లవారడమని చెప్పే కథ తెల్లవారితే... దళితుల పట్ల దొరసాన్ల దుర్మార్గపు ప్రవర్తనను చిత్రించే కథ దొరసాని. ఉద్యమాలనే దక్షయజ్ఞంలో



ఎంత మంది దళితులు ఆహుతయి పోయారో చిత్రించిన కథే దక్షయజ్ఞం. ఉన్నత చదువులతో, ఇతరత్రా జీవితాలను గెలుచుకున్న దళిత యువకులను అభివృద్ధి చెందిన కులాలవాళ్లు తన్నుకుపోయే క్రమాన్ని, దళితులు జాగ్రత్తగా ఉండాల్సిన విషయాన్ని చిత్రించిన కథ నిర్ణయం.

సాహిత్యం సమాజాన్ని అనుకరిస్తుందనడానికి ఈ కథలన్నీ నిలువెత్తు సాక్ష్యాలు. తెలంగాణ గ్రామాల్లో దళితుల స్థితిగతులను తెలిపే కథలివి. వివిధ ఉద్యమాలు, అంబేద్కర్ ప్రభావం, చదువుతో కలిగిన చైతన్యం వాళ్ల బతుకుల్లో తీసుకొచ్చిన చైతన్యాన్ని చిత్రించిన కథలివి. ఈ కథల్ని చదువుతుంటే తెలంగాణ గ్రామాల స్వరూప స్వభావాలు, ఫ్యూడల్ అవశేషాలు, ఉద్యమ చైతన్యం కళ్ల ముందు నిలుస్తాయి. కళ్లు చెమర్చుతాయి. హృదయమున్న ప్రతి వ్యక్తీ స్పందించే కథలివి. శతాబ్దాల సామాజిక చరిత్రను నిక్షిప్తం చేసిన ఈ కథలు దళితుల కడగండ్లతో పాటు పోరాట చైతన్యాన్ని, దళిత సంస్కృతిని, జీవితాలను గెలుచుకోవడాన్ని చిత్రించిన కథలు. దళిత బతుకులు మారాలన్న ఆశను, మారితీరాలన్న కాంక్షను ఈ శతాబ్ది సాహిత్యం దళిత బహుజన మూలాలను వెతికేదేనన్న భరోసాను కలిగిస్తాయి. ఇందుకు సాక్ష్యంగా ఇప్పుడున్న ప్రభుత్వ విశ్వవిద్యాలయాల్లో చదువుతున్న విద్యార్థులను గమనిస్తే అర్థమవుతుంది. ప్రభుత్వ విశ్వవిద్యాలయాల్లో సాహిత్యం, సామాజిక శాస్త్రాలను చదివేవాళ్లు, ఆయా సబ్జెక్టులలో పరిశోధనలు చేసేవాళ్లలో మెజారిటీ వ్యక్తులు దళిత బహుజనులనుంచి వచ్చినవాళ్లే ఉన్నారు. గ్రామాల్లో ఉండి భాషను, సంస్కృతిని కాపాడుతున్నదీ వీళ్లే. విశ్రాంతి కులాల, వర్గాల వాళ్లు చాలామంది కంప్యూటర్ చదువుల పేరు మీద దేశాలను వదిలిపోతున్నారు. అభివృద్ధి, సుఖాల పేరు మీద సంస్కృతికి దూరంగా జరుగుతున్నారు. ఈ విషయాలనూ తెలంగాణా కథకులు తమ కథల ద్వారా అక్షరీకరిస్తున్నారు. అందువల్ల ఇరవై ఒకటవ శతాబ్ది సాహిత్యం కచ్చితంగా స్థానీయతను, దేశీయతను ప్రేమిస్తూ మానవాంశను పెంపొందించే దళిత బహుజనులదేనన్నది నిర్వివాదాంశం.

# బహుజన కథల తెలంగాణ

బహుజన హితాయ.. బహుజన సుఖాయ అన్నాడు ప్రపంచానికి అహింసా మంత్రాన్ని, అష్టాంగ మార్గాలను అందించిన గౌతమ బుద్ధుడు. ఈ దేశంలో ఆ బహుజనులు అత్యధిక సంఖ్యలో ఉన్న ఉత్పత్తి కులాలవారే. సర్వసంపదలకు సృష్టికర్తలు వీరే. కాని ఆ సంపదలపై కర్తృత్వం మాత్రం వీళ్లకుండదు. కులం మెట్ల సమాజంలో ఎవరైతే సర్వసంపదలను సృష్టిస్తున్నారో వాళ్లకు రాజ్యాధికారంలోనూ స్థానం లేదు. ఇదీ దేశంలోని ప్రధాన వైరుధ్యం. తరతరాలుగా నడుస్తున్న దుర్మార్గం.. ప్రాచీనకాలం నుంచి కూడా సాహిత్యంలోనూ వీళ్లకు స్థానం లేదు. వీళ్లలో కొందరికి గుళ్లోకి పోయే అవకాశం కూడా లేకుంటే అందరికీ చదువుకునే అవకాశాలూ మృగ్యమే. వీళ్ల భాషను గ్రామ్యమని నిషిద్ధమన్నవాళ్లూ ఉన్నారు. పనిమనుషులుగా, సేవకులుగా, నీచ పాత్రలకు వీళ్లను వాడి వీళ్ల భాషనూ నీచపాత్రలకనే పరిమితం చేశారు. సాహిత్యంలో వీళ్లకిచ్చిన స్థానం దాదాపు శూన్యం. ప్రజాస్వామిక పాలన ఏర్పడ్డ తర్వాత కూడా వీళ్లకు లభించిన స్థానం తక్కువే. ఆధునిక సాహిత్య ప్రక్రియలైన కథ, నవలల్లోనూ వీళ్ల సంస్కృతిని ఉన్నతీకరిస్తూ రాయబడింది చాలా తక్కువే. మొన్న మొన్నటివరకు పూర్తిగా, ఇప్పుడు కూడా మెజారిటీగా వస్తున్న సాహిత్యం బ్రాహ్మణీయ, విశ్రాంతి వర్గ సంస్కృతులను ఉన్నతీకరించేదే. మెజారిటీగా ఉన్న, అన్ని పనులు చేసే ఈ బహుజనుల గూర్చి ఇంతవరకు పూర్తిగానే, ఇప్పుడు కూడా కొంత కొంతే సాహిత్యం రావడం ఆలోచించాల్సిన విషయమే.

బహుజనుల అధికారం కోసం సామాజిక న్యాయ పార్టీలైన బహుజన సమాజ్‌వాది, సమాజ్‌వాది పార్టీల ప్రాబల్యం పెరిగిన తర్వాత, అంబేద్కర్ సిద్ధాంతాలకు విస్తృత ప్రచారం జరిగిన తర్వాత, మండల్ కమీషన్ నివేదిక వచ్చిన తర్వాత దేశవ్యాప్త బహుజనుల్లో చైతన్యం పెరిగింది. సాహితీరంగంలోనూ ఆ చైతన్యం ప్రవేశించింది. దానికి తోడు స్వాతంత్ర్యానంతర కాలంలో పుట్టి పెరిగి ఉన్న స్వల్ప అవకాశాలను ఉపయోగించుకొని విద్యాబుద్ధులు నేర్చుకున్న పీడిత కులాల్లోంచి వచ్చిన వాళ్లు చదువు, సామాజిక చైతన్యంతో జీవితాలను గెలుచుకున్నారు. ఈ వర్గాల్లోంచి రచయితలు రావడమూ మొదలైంది. దీంతో తమ చరిత్రను తాము రాసుకునే క్రమంలో, తమ మూలాల్లోకి వెళ్లి పరిశీలించుకునే సమయంలో బహుజన సాహిత్యం వచ్చింది. అయితే సహజంగానే ఇతర రంగాల్లో లాగే సాహిత్య రంగంలోనూ విశ్రాంతి వర్గాల ఆధిపత్య



ధోరణులు ఉండటం వల్ల ఈ సాహిత్యాన్ని గుర్తించడానికి నిరాకరించడం జరుగుతుంది. ప్రచార, ప్రసార సాధనాలన్నీ వాళ్ల చేతుల్లోనే ఉండటం వల్ల, పత్రికలూ వాళ్లవే కావడం వల్ల ఈ రచనల ప్రచురణ కూడా అంత సులభం కాదు . ఈ రచనలు విస్తృతంగా వస్తున్న సమయంలో తెలుగులో మంచి కథలు రావడం లేదంటూ పనికి రాని విషయాల దిక్కు దృష్టి మరల్చడానికి ప్రయత్నించిన విమర్శకాగ్రేసరులూ ఉన్నారు. ఏదేమైనా అన్ని అవరోధాలనూ అధిగమించి ఉత్పత్తి వర్గాల బహుజన సాహిత్యం వేళ్లానుకొని మహావృక్షంగా విస్తరించుకుంటూ పోతూనే ఉంది. ఆ సాహిత్యం రావాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతూనే ఉంది.

ఈ బహుజన సాహిత్యానికి మూలాలు జానపద సాహిత్యంలోనే ఉన్నాయి. ఏతం పోస్తూ, మోత కొడుతూ, కలుపు తీస్తూ, విసుర్రవుతు విసురుతూ, పనులు చేస్తూ శ్రమను మరిచిపోవడానికి శ్రమజీవులు సృష్టించుకునే ఆశు సాహిత్యంలోనే బహుజన సాహిత్యం వేళ్లున్నాయి. ఆశు సాంప్రదాయ మూలాల్లోంచి వచ్చి ఆశు సాంప్రదాయాన్ని స్వంతం చేసుకొని కథలు రాస్తున్న తెలంగాణ కథకులకు బహుజన కథ కొత్తదేమీ కాదు. సంఖ్యలో విస్తృతంగా రాకున్నా తొలితరం నుంచే వృత్తిపనులవారి జీవితాలపై కొన్నయినా కథలొచ్చాయి. మాజీ ప్రధాని స్వర్గీయ పాములపర్తి వెంకట నర్సింహారావు గొల్లరామవ్వ కథ రజాకారు పోరాట నేపథ్యంలోంచి వచ్చినా గొల్లల సంస్కృతిని ప్రతిబింబించిన మంచికథ. గొల్లల ఆచార వ్యవహారాలను, బోల్లకోరితనాన్ని, సాంప్రదాయాలను వాస్తవికంగా చిత్రించిన కథ. పీడితవర్గాల్లోంచి వచ్చి విద్యాబుద్ధులు నేర్చుకొని రచయితగా ఎదిగిన గూడూరి సీతారాం నారిగాడి బతుకు గౌండ్ల బతుకు వెతలను చిత్రీకరించిన కథ. ఇతని కథలన్నీ వృత్తిపనివారల బతుకులను చిత్రించినవే. పి. వెంకటరామారావు కొత్త నాగలి కమ్మరి దాటికాడి ఊరుమ్మడి బతుకు వెతల చిత్రణ. సురవరం ప్రతాపరెడ్డి కథల్లో హైదరాబాద్ ముస్లిం సంస్కృతి, జీవనం కనబడుతుంది. వట్టికోట ఆళ్వారుస్వామి, జి. సురమౌళి అంగుడు పొద్దు కథలు కూలినాలి చేసుకుంటూ బతికే శ్రమజీవుల అమాయకత్వాన్ని చిత్రించిన కథలు. మొదటితరంలో వృత్తిపనివారిపై కథలెక్కువగా రాసింది ఆ వర్గంలోంచి వచ్చిన గూడూరి సీతారాంగారే.

రావాల్సినంత రాకున్నా అందరూ రాయకున్నా తెలంగాణ నుంచి మూడవ తరం రచయితలు ముఖ్యంగా దళిత బహుజన కులాల నుంచి వచ్చినవాళ్లు వచ్చిం తర్వాత బహుజనుల గూర్చి మంచి కథలే వచ్చాయి. విప్లవ పోరాటాలు ఉధృతంగా ఉన్న కాలంలో విప్లవ సాహిత్యం బాగా వస్తున్న 1970-90 మధ్యకాలంలో అట్టడుగు

వర్గాల నుంచి ముఖ్యంగా పోరాట ప్రజల గురించి విరివిగా కథలొచ్చాయి. అయితే వీటిని పోరాట నేపథ్యంలోంచి విప్లవ కథలుగానే చూడాల్సి ఉంది. వీళ్లు దళిత బహుజనులను పోరాటాల్లో భాగంగానే చూశారు. అందులో భాగంగానే కథలొచ్చాయి. అందువల్ల ఇవి విప్లవ కథలుగా ప్రజలను పోరాటాల పట్ల సన్నద్ధులను చేసేవిగా ప్రసిద్ధి పొందాయి. వీటి ప్రధానోద్దేశ్యం పోరాట జీవితాన్ని, దోపిడీ పీడనలను ఆర్థిక దృక్కోణంలోంచి చూడటం కాబట్టి ఇందులో బహుజనుల జీవన చిత్రణ తక్కువ. సిద్ధాంతాల బరువూ ఎక్కువే. మహాశ్వేతాదేవిలా పోరాటాలను, జీవితాన్ని కలిపి రాయబడిన కథలు ఇందులో తక్కువే. విప్లవ కథలుగా వీటికి సాహిత్యంలో సమున్నత స్థానమే ఉన్నా ఇవి బహుజన కథలు కావు. బహుజనుల గూర్చి విప్లవ కోణంలోంచి చూడబడిన కథలు.. అల్లం రాజయ్య కథలు, తుమ్మేటి రఘోత్తమరెడ్డి కతలు, నేలతల్లి విముక్తి కోసం కథలు, శ్వేతరాత్రులు, రుతుపవనాల్లోని కతలు, బి.యస్. రాములు తేనెటీగలు కథల సంపుటిలోని కథలు, కాలువ మల్లయ్య భూమి నవ్వింది, వెలి, పాలేరు, ఈ భూమి నాది లాంటి పోరాట కథలు, పి. చంద్ కథలు ఇతర కథలన్నీ ఈ కోవలోకి వస్తాయి. విప్లవ సాహిత్యం స్త్రీల గూర్చి, దళితుల గూర్చి పట్టించుకోవలసినంత పట్టించుకోకపోవడం వల్లనే స్త్రీవాద, దళితవాద సాహిత్యోద్యమాలు వచ్చాయన్నట్టే, వివిధ సామాజిక రాజకీయ ఆర్థిక కారణాల వల్లనూ, విప్లవ సాహిత్య దశాబ్దిలో బహుజనులను గూర్చి పట్టించుకోవలిసినంతగా పట్టించుకోకపోవడం వల్లనూ బహుజన సాహిత్యోద్యమం వచ్చింది. ఈ సాహిత్యానికి తెలంగాణమే కేంద్రం కావడం గమనించదగ్గ విషయం.

అంబేద్కర్ లాంటి వైతాళికుడు దళితజాతిలో పుట్టి దళిత జనోద్ధరణకు కృషి చేయడం వల్ల దళితులకు, దళిత జీవిత చిత్రణకు సాహిత్యంలో కొంతయినా చోటు దొరికింది. దళిత సాహిత్యోద్యమం నుంచి ఉద్యమంగా రూపుదిద్దుకుంది. ఈ విషయాన్ని అయిష్టంగానైనా అంగీకరించే విశ్రాంతివర్గ విమర్శకులు బహుజన సాహిత్యోద్యమాన్ని మాత్రం ఉద్యమంగా అంగీకరించరు. దళితులంటే ఎస్సీ, ఎస్టీ, బీసీ, మైనారిటీలంతా వచ్చినట్టే బహుజనులన్నా వీళ్లంతా వస్తారు. దళితుల గూర్చి ప్రత్యేకంగా చెప్పుకోదగినన్ని ఉద్యమాలు, సాహిత్యం వచ్చాయి కాబట్టి బహుజనులంటే బీసీలకు మైనారిటీలకు పరిమితార్థంలో వాడటం జరుగుతుంది. దేశ జనాభాలో సగానికి పైగా ఉన్న బీసీలు, ఎనభై శాతానికి పైగా దేశ సంపదను సృష్టించే ఈ సృష్టికర్తలకు ఏ రంగంలోనూ తమ వాటా దక్కడం లేదు. సాహిత్యరంగంలోనూ అంతే.



అయినా బహుజన కథలకు నాంది తెలంగాణ నుంచే పడింది. శ్రామిక సంస్కృతిని, వర్గం, భాష ఉన్న తెలంగాణ నుంచి ఎంతో కొంత ఈ కథలు రావడం యాదృచ్ఛికం కాదు. అందుకు మూలాలీ నేలలోనే ఉన్నాయి. ఆసియా ఖండం నుంచే గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మద్ ప్రవక్త, మహాత్మాగాంధీ, డా. బి. ఆర్. అంబేద్కర్‌లాంటి మహనీయులు రావడానికి పునాదులున్నట్టే తెలంగాణ నుంచి దళిత, బహుజన సాహిత్యం విరివిగా రావడానికి పునాదులున్నాయి. విప్లవ సాహిత్యోద్యమ కాలంలోనూ, దళిత బహుజన సాహిత్యోద్యమం తెలుగునేలపై వేళ్లూనక ముందు నుంచే తెలంగాణ నుంచి సర్వసందలను సృష్టించే సృష్టికర్తల గూర్చి కథలొస్తున్నాయి. బోయ జంగయ్య రాసిన కొన్ని కథలు, నవీన్ కాలేజీ జీవితాల గూర్చి కాక రాసిన చెరలాంటి కథలు, కాలువ మల్లయ్య రాసిన ఘర్మజలానికి ఖరీదు కట్టే షరాబు కథల సంపుటి, వివిధ వృత్తులపై రాసిన అవ్వతోడు గిది తెలంగాణ కథనాలు, వుప్పల నరసింహం ముద్ర కథనాలు, సదానంద శారద జాడి కథలు సంపుటిలోని కథలు ఇందులో కొన్ని మాత్రమే. తాము రాస్తున్న కథలు బహుజన కథలన్న స్పృహ లేకుండానే తమకు తెలిసిన జీవితాలను కథలుగా మలిచిన క్రమంలో కాలువ మల్లయ్య కథలెన్నో బహుజన కథలయ్యాయి.

ఇరవయ్యవ శతాబ్ది చివరి దశాబ్ది నుంచి తెలంగాణ నుంచి బహుజన కథల ఉధృతి పెరిగి అది అన్ని ప్రాంతాలవారికి మార్గదర్శకమైంది. చదువులు పరాయీకరణ చెందడం, గ్లోబలైజేషన్ మాయలో అంతా కొట్టుకుపోవడం, మనం మనం కాకుండా అయిపోవడం, బి.సి. కులాల వారి అదాయ వనరులైన వృత్తిపనులు నశించడం, ప్రత్యామ్నాయాలు కరువై ప్రజలు తల్లడిల్లడం లాంటి అనేక కారణాలు, దళిత బహుజనోద్యమాలు ఈ సృష్టికర్తల గూర్చి విశేషంగా సాహిత్యం సృష్టించడానికి కారణాలయ్యాయి. అంతేకాకుండా బిసిల నుంచి, దళితుల నుంచి నవీన్, కాలువ మల్లయ్య, బోయ జంగయ్య, అల్లం రాజయ్య, బి.యస్. రాములు, కంచ ఐలయ్య, సదానంద శారద, జూకంటి జగన్నాథం, గోపి భాగ్యలక్ష్మి, పి. చంద్, ఉప్పల నరసింహం, అన్నవరం దేవేందర్, మురళీధర్ గౌడ్, ననుమాస స్వామి, పెద్దింటి అశోక్‌కుమార్, కె.వి. నరేందర్, నల్లాల లక్ష్మీరాజం, దార్ల రామచంద్ర, బి. పద్మజ, కొక్కుల పద్మావతి, జాజుల గౌరి, సాహు, ఆడెపు లక్ష్మీపతి, బి.వి.యన్. స్వామి లాంటి వాళ్లు రచయితలుగా ఎదిగి తమ సాహిత్యాన్ని తాము సృష్టించుకునే క్రమంలో బహుజన సాహిత్యం సుసంపన్నమవుతుంది. ప్రభంజన్ కుమార్ యాదవ్ గీతవృత్తి పనిని ఎవరైనా చేయొచ్చని రాసిన కథ ఆలోచన రేకెత్తించింది.

ఈ రచయితలు వివిధ వృత్తులకు సంబంధించిన జీవితాలను తీసుకొని ఆ సంస్కృతిని ఉన్నతీకరిస్తూ అనేక కథలు రాసి బహుజన సాహిత్యం సుసంపన్నం కావడానికి కృషి చేస్తున్నారు. ఈ విషయంపై వందలాది కథలు రాసి బహుజన కథకు సుదృఢమైన పునాదుల వేసి అది విస్తరించడఆనికి బాట చూపాడీ రచయిత. గొల్లల గూర్చి రాసిన అడవి గాచిన వెన్నెల, శనార్థి, సొసంత్రదినం, భూమి కోసం, సాలీల గురించి రాసిన నిరీక్షణ, ఎదురుచూపు, వారసత్వం కతలు, గువ్వల చెన్నా నవల, చాకలివాళ్ల గూర్చి రాసిన ధిక్కారం, మడేలయ్య మనసు, దొరసాని చీర, మంగలివాళ్ల గూర్చి రాసిన అద్దాలనాడు కథ, తెనుగు బెస్తవాళ్ల గూర్చి రాసిన ప్రయాణం, ముసలవ్వ మనసు, యోజనగంధి, దొర్సానిగారు, కాపుల గూర్చి రాసిన భస్మాసుర హస్తం, భూమి పుత్రుడు, కర్ణుడి చావు, గౌండ్ల గూర్చి రాసిన ఊరుమ్మడి బతుకు ఇంకా ఇతర వృత్తుల గూర్చి రాసిన అనేక కథలు పని సంస్కృతిని ఉన్నతీకరించేవే. శ్రమ సంస్కృతిలో ఉన్న ఔన్నత్యాన్ని, అది కావాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పేవే.

బోయ జంగయ్య కుండ బద్దలు కొడ్త కథలో కల్లుగీత కార్మికుల స్త్రీలపై జరిగే లైంగిక దోపిడీని గూర్చి వివరిస్తే, చేపల చెరువు బెస్త చాకలివాళ్ల మధ్య వైరుధ్యాలను చిత్రించింది. ఇతడే చాపలల్లుకునే వారి సమస్యను చీమలు కథలో చిత్రించారు. ముదిగంటి సుజాతారెడ్డి చాకలి వృత్తిలో ఉన్న సాధకబాధకాలను పలాయనం కథలో చిత్రించారు. పద్మశాలీల వలస బతుకులను వలస, యాతన కథల ద్వారా చిత్రించిన జూకంటి జగన్నాథం నేత కార్మికుల ఆత్మహత్యలను వైపని కథలో చిత్రించారు. నల్లాల లక్ష్మిరాజం తిరుగు ప్రయాణం కథల సంపుటిలో బిసి, ఎస్సీల కథలున్నాయి. దొమ్మరి గంగడు కథలో దొమ్మరి బతుకుల్లోని విషాదాన్ని చిత్రించాడు. దార్ల రామచంద్ర కిర్రు చెప్పులు కథల సంపుటిలో బీసీ, కులవృత్తుల గూర్చి కథలున్నాయి. బి.వి.ఎన్. స్వామి నెలపొడుపు కతలో చేపలమ్ముకునే వారి బతుకు వెతల చిత్రణమిది.

బి.సి.లు కులవృత్తులు వదిలేయాలని, చదువు ద్వారానూ, ఇతర పనుల్లోనూ ప్రవేశించడం ద్వారానూ జీవితాలు గెలుచుకోవాలని, గతం కంటే వర్తమానమే బిసిలకు గొప్పదని చెబుతూ బిసిల్లోని పద్మశాలీలు, ఇతర వృత్తుల గూర్చి అనేక కథలు రాశారు బి.యస్. రాములు. స్మృతి కథల సంపుటిలోని కథలన్నీ వర్తమానం గతం కన్నా మెరుగైందని చెప్పే కథలే.

వెనుకటి ప్రేమలు ఇప్పుడు లేవు. అంతా ఆజాదైపోయింది లాంటి మాటలు దోపిడీ కులాల దృక్పథమంటాడు రచయిత. విద్యతో బిసిలు ఆధునిక అభివృద్ధిలో వాటాను అందుకోవడం సాధ్యమని బి.యస్. రాములు రాసిన మార్పు, బందీ,



మలుపులు, తల్లిపాలు, వారసత్వం, మమతలు లాంటి కథలు చెబుతాయి. స్వయంగా కల్లుగీత కార్మికుడైన శ్రీనివాసగౌడ్ గీత కార్మికులపై బతుకుతాడు అనే నవలతో పాటు ఐదారు కథలు రాశాడు.

కొక్కుల భాస్కర్ పద్మశాలీల బతుకుల గూర్చి తెగినపోగు, బొంబాయి ప్రయాణం లాంటి కథలు రాశాడు. అంబల్ల జనార్దన్ బొంబాయిలో ఉంటూ ప్రవాసాంధ్ర పద్మశాలీల బతుకుల గూర్చి బొంబాయి కథలు రాశాడు. పొట్టలు చేతుల పట్టుకొని బొంబాయి, భీవండిలకు వలస పోయిన కార్మికుల బతుకు వెతలు ఈ కథల్నిండా దర్శనమిస్తాయి. ఇటీవలి కాలంలో పెద్దింటి అశోక్‌కుమార్ గ్రామీణ వృత్తుల పతనం గురించి, వివిధ వృత్తి పనివారల బతుకు వెతల గురించి తెగినబంధాలు, గాడిదలపై వడ్ల బస్తాలు చేరవేసే వృత్తివాళ్ల గూర్చి వలసలు, గౌడవృత్తి గూర్చి ఇనుపమూతి దేగలు, తెనుగు కులవృత్తి గూర్చి ఊటబాయి, చాకలి వాళ్ల గూర్చి చాకిరేవు, కుమ్మరి వృత్తి పతనం గూర్చి కాగుబొత్తలాంటి కథలు రాశాడు.

వీళ్లే కాకుండా ఇంకా అనేక మంది వృత్తిపనుల పతనం గూర్చి, వృత్తుల పతనంతో ప్రత్యామ్నాయం కరువై తల్లడిల్లుతున్న జనాల గూర్చి చక్కటి కథలు రాశారు. అడెపు లక్ష్మీపతి పద్మశాలీల బతుకులు ఛిద్రమవడాన్ని త్రిభుజపు నాలుగో కోణం కథలోనూ, ముసల్దాని ముల్లె కథలోనూ చిత్రించారు. ఐతా చంద్రయ్య చాకలి బతుకుల నేపథ్యంలోంచి వరాలమూట, సాలీల బతుకు వ్యథ గూర్చి చిలకపచ్చ చీర, గంగిరెద్దుల జీవితం గూర్చి వారసత్వం కథ రాశారు. పంజాల జగన్నాథం మహబూబ్‌నగర్ వెట్టి చాకిరీని పంజరం కథలో తురక కాశెల బతుకులను మట్టిమనిషిలో, పత్తి రైతుల గూర్చి మృత్యువు పువ్వులో చిత్రించారు. వుప్పల నరసింహం స్వగతాలు వివిధ వృత్తిపనివారి బతుకుల స్వగతాలను చిత్రించాడు. చైతన్యప్రకాశ్ బతుకురేవు ఇతర కథలు బహుజన జీవిత చిత్రణలే. బహుజన కులాల్లో ఒకరైన ముస్లింల గూర్చి స్కైబాబ లోహం, ఛోటా బహెన్, షాజహానా సండాస్, వాదా. రహమతుల్లా అమ్మీజాన్, కిరాయ్ మకాన్ లాంటి కథలు రాశారు. ఇటీవలి కాలంలో వచ్చిన ముస్లిం కథల సంకలనం వతన్, రహమతుల్లా కథల సంపుటి 'బా' ముస్లిం జీవన సంస్కృతికి వ్యాఖ్యానాలనదగ్గ పుస్తకాలే. ఇంకా కె.వి. నరేందర్, గీతాంజలి, బెజ్జారపు రవీందర్‌లాంటి వాళ్లెంతో మంది బహుజన కథను సుసంపన్నం చేస్తున్నారు.

ఇలా తెలంగాణ నుంచి బహుజన కథ బహుముఖాలుగా విస్తరిస్తూ తెలుగు సాహిత్యంలో ఇదో ప్రధాన పాయగా రావడానికి దోహదం చేస్తుంది. తెలంగాణ కథ కాని, తెలుగుకథ కాని ఉద్యమ కథ దగ్గరే ఆగిపోలేదని, ఉద్యమ కథ విషయంలో

తెలుగు కథకు మార్గనిర్దేశం చేస్తూనే ఆ తర్వాత వచ్చిన పరిణామాలకూ అద్దం పడుతూ బహుజన కథకూ దిశానిర్దేశనం చేసింది. ఉత్పత్తి శక్తుల సాహిత్యం ప్రధాన స్రవంతిగా వచ్చినప్పుడు పోస్ట్ మాడర్నిజం లాంటివాటిని ముందుకు తెచ్చి దీన్ని చూడటానికి కొందరు పీఠాధిపతులు నిరాకరించినా బహుజన సాహిత్యం తన పనిని తాను కానిస్తూనే ఉంది. ఈ కథలు శ్రమజీవుల బతుకుల్లో ఆశను, ఆత్మవిశ్వాసాన్ని పెంచుతాయి. పని సంస్కృతిని ప్రేమించేట్టు చేస్తాయి. బహుజనుల విజయం కులాల అంతరాలను వ్యతిరేకిస్తూనే, ఆదాయ మార్గాలైన వృత్తిపనులను కాపాడుకుంటూ చదువు ఇతరత్రా జీవితాలను గెలుచుకోవడంపై ఆధారపడి ఉందని ఈ కథలు చదివితే అర్థమవుతుంది.

బహుజనులను, పని సంస్కృతిని ప్రేమించే ఇతర రచయితలతో పాటు బహుజనుల్నుంచి ఎంతో మంది రచయితలు ఎదిగి బహుజన కథను సుసంపన్నం చేస్తున్నారు. కాబట్టే తెలుగులో ఇది ప్రధాన పాయగా స్థిరపడుతుంది. ఇరవై ఒకటవ శతాబ్ది కచ్చితంగా దళిత బహుజన కథదేనన్న విసయం తెలంగాణ బహుజన కథను పరిశీలిస్తే అర్థమవుతుంది.



# తెలంగాణ వివక్షపై కథలు

నిజానికి ప్రాంతీయం కాని విశ్వజనీన సాహిత్యముంటుందా? ప్రాంతీయ ముద్ర లేకుండా గొప్ప సాహిత్యమవుతుందా? ప్రపంచవ్యాప్తంగా వచ్చిన గొప్ప సాహిత్యాన్ని పరిశీలిస్తే ఆ సాహిత్యం తాము నివసిస్తున్న ప్రాంతానికి, కాలానికి, దేశానికి సంబంధించిన సాహిత్యమే కదా! రామాయణం, మహాభారతం, భగవద్గీత లాంటి సాహిత్యాన్ని భౌతిక వాసనలు ప్రధానంగా ఉన్న పాశ్చాత్య దేశాల్లో ఊహించగలమా? టాల్‌స్టాయ్ సాహిత్యం రష్యన్ భౌగోళిక పరిస్థితులకు చెందిందే కదా! గోర్కీ అమ్మ నవలను రష్యా విప్లవోద్యమ సమయంలో తప్ప ఊహించలేం కదా! షేక్స్‌పియర్ రచనలు బ్రిటన్ సామాజిక ఆర్థిక రాజకీయ చిత్రణలు కావా? ప్రేంచంద్ రచనల్లో ఉంది ఉత్తరప్రదేశ్ కాశీ ప్రాంత జీవితమే కదా! బంకిం వందేమాతరం నవలను స్వాతంత్ర్య పోరాటం జరుగుతున్న కాలంలో తప్ప ఊహించగలమా? గురజాడ కన్యాశుల్కంలో చిత్రించిన జీవితం కళింగ ప్రాంతంలోని బ్రాహ్మణ జీవితాల్లోని కంగాలీయే కదా! ఇలా ఏ గొప్ప రచనయినా స్థలకాలాల చైతన్యంతో ప్రాంతీయ ముద్రతోనే ఉంటుంది. అయితే రచన వచ్చిన ప్రాంతం ఏదయినా అందులో ఉండాల్సిన మానవాంశుంటే అది విశ్వజనీనమవుతుంది. తెలంగాణ కథ చాలా వరకు స్థలకాలాల చైతన్యంతో ప్రాంతీయ ముద్రతో, ప్రజల జీవద్భాషా సొగసులతో వస్తుంది. అయినా ఇక్కడి కథను ప్రాంతీయం అంటూ తక్కువ చేసి చూస్తున్న వాళ్లున్నారు. చాలా కాలం వరకు ఇక్కడి కథను గుర్తించడానికి నిరాకరించిన వాళ్లున్నారు.

తెలుగుకథను నిమ్న వర్గాల కథగా, అట్టడుగు జాతుల జీవన చిత్రణ కథగా తీర్చిదిద్దింది, తీర్చిదిద్దుతున్నది తెలంగాణా రచయితలే. మధ్యతరగతి దృష్టికోణంలోంచే కాక అట్టడుగు జనజీవన దృష్టి కోణంలోంచి కథను చూసిందీ తెలంగాణ రచయితలే. నిజానికి ఏ భాషా సాహిత్యంలోనైనా వృత్తులు, వివిధ పనులు చేసే వ్యక్తులపై కతలు రావడం సహజమే. మన దేశంలో అవి కులాలుగా ఉన్నాయి. నిజానికి ఉత్పత్తి కులాలవారికి సాహిత్యంలో లభించిన చోటు అతి తక్కువ. సాహిత్యాన్ని నిశితంగా పరిశీలిస్తే కుల సాహిత్యం కాని సాహిత్యముంటుందా అని అనిపించకపోదు. అయితే మొన్నమొన్నటి వరకూ, ఇప్పటికి కూడా చాలా సాహిత్యం బ్రాహ్మణీయ, విశ్రాంతి కులాల గూర్చి, వర్గాల గూర్చి వచ్చిందే. ఇదిలాగే ఉన్నంత వరకు ఎవరూ మాట్లాడలేదు. తెలంగాణ రచయితలు నిమ్నకులాల గూర్చి, ఉత్పత్తి కులాల గూర్చి కథలు రాయడం

ప్రారంభించిన తర్వాత దళిత బహుజనుల గూర్చి అద్భుతమైన సాహిత్యం సృష్టించడం ప్రారంభించిన తర్వాత దాన్ని కుల సాహిత్యమన్నారు. దళిత బహుజన సాహిత్యోద్యమాలను గుర్తించడానికే నిరాకరించారు. సంకలనాల్లో అలాంటి కథలకు చోటిచ్చింది దాదాపు శూన్యం.

వివిధ ప్రాంతాల మధ్య రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సామాజిక అంతరాలున్నప్పుడు ఆ అంతరాలను రూపుమాపడానికి అన్ని రంగాల్లోనూ తీవ్రమైన ప్రయత్నం చేయాలి. అలా జరగనప్పుడు ఒక ప్రాంతంపై మరో ప్రాంతం వివక్ష కొనసాగుతూనే ఉంటుంది. సాధారణంగా అభివృద్ధి చెందిన ప్రాంతంవాళ్లు వెనుకబడిన ప్రాంతంవారిని చిన్నచూపు చూడటం జరుగుతుంది. రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలన్నింటిలోనూ తెలంగాణా ప్రాంతంవాళ్లు వివక్షకు గురవుతున్నారన్నది నిర్వివాదాంశం. తెలంగాణ సాహిత్యం యొక్క ప్రత్యేకతేంటో ఏది తెలంగాణ కథో, తెలంగాణ కథను ఎలా చూడాలో అన్న విషయంలో ఇతర ప్రాంత రచయితలకు, విమర్శకులకు స్పష్టత లేకపోవడం ఈ వివక్షకు ప్రధాన కారణం. సహజంగానే వెనుకబడిన ప్రాంత రచయితలపై ఉన్న చులకనభావం మరో కారణం. కావాలని నిర్లక్ష్యం చేయడం ఇంకో కారణం. తెలంగాణ నుంచి వచ్చిన సాహిత్యం స్వరూపస్వభావాలు మధ్యతరగతి, బ్రాహ్మణీయ దృష్టికోణంలోంచి మాత్రమే సాహిత్యాన్ని చూసే వాళ్లకు అర్థం కాకపోవడం. అర్థమైనా తమ దృష్టికోణాన్ని వదిలి చూడటానికి నిరాకరించడం. ఇతర ప్రాంతాల విమర్శకులు, సమీక్షలు, సంకలనకర్తలు ప్రధానంగా విశ్రాంతివర్గాల నుంచి వచ్చిన వాళ్లయితే తెలంగాణ రచయితలు చాలా మంది నిమ్నవర్గాల నుంచి వచ్చినవాళ్లు కావడం. అంతేకాకుండా తెలంగాణ నుంచి ఇతర ప్రాంతాలకున్నట్టు తెలంగాణ, తెలంగాణ సాహిత్యానికి, రచయితలకు గాడ్‌ఫాదర్‌లాంటి వాళ్లు లేకపోవడం.

ఇలా అన్ని రంగాల్లో కొనసాగుతున్న వివక్షపై తెలంగాణ నుంచి రావాల్సినంత సాహిత్యం రాలేదన్నది వాస్తవం. రాయలసీమపై జరుగుతున్న నీటి వివక్ష, ఫ్యాక్షనిజం, కళింగాంధ్ర గిరిజనులపై మైదాన ప్రాంత ప్రజల దోపిడీ వివక్షలపై వచ్చినంత సాహిత్యం కూడా తెలంగాణపై జరుగుతున్న వివక్షపై రాలేదు. రజాకారు పోరాట కాలంలో అప్పటి భూపోరాటాలపై తెలంగాణ ప్రాంతం వాళ్లు నవలలు, పాటలు రాశారు. కథలంతగా రాయలేదు. 1968-69 ప్రాంతంలో తెలంగాణలో ఉవ్వెత్తున లేచిన తెలంగాణ పోరాటంపై కూడా చెప్పుకోదగ్గ కథలు వచ్చిన దాఖలాలు లేవు. వ్యాసాలు, పాటలు మాత్రం వచ్చాయి. ఉద్యమాలు జరుగుతున్న కాలంలో వెంటనే స్పందించి ఆవేశాత్మకమైన కవిత, పాట రాయొచ్చు. ఆలోచనాత్మకమైన వచనం (కథ, నవల) రావడానికి సమయం పడుతుంది. అయితే తెలంగాణ రచయితల్నుండి రజాకార్ల సమయంలో భూపోరాటాల గూర్చి, 1968-69 తెలంగాణ పోరాటం గూర్చి కాని ఆ తర్వాత కూడా కథలు రాకపోవడం విచారదగ్గ విషయమే. డెబ్బైల తర్వాతి భూపోరాటాల గూర్చి మాత్రం అవి జరుగుతున్న కాలంలోనే అద్భుతమైన కథా సాహిత్యం వచ్చింది.

మొదట్నుంచీ తెలంగాణాపై జరుగుతున్న వివక్షపై అనేక వ్యాసాలు, పుస్తకాలు, పాటలు వచ్చినా కథలు వచ్చింది తక్కువేనన్న విషయం కాదనలేని సత్యం. ఇటీవలి కాలంలో వచ్చిన పత్రికలు తెలంగాణ రాస్త్రా, నా తెలంగాణ, సోయి, నేటి నిజం ఆ కథలనెక్కువగా ప్రచురించాయి. అయితే వివక్ష గూర్చి అప్పుడప్పుడైనా వచ్చిన ఈ కథలు ఈ విభాగంలో ఎన్నదగిన కథలే. ఇలా వచ్చిన కథల్లో సురమౌళి రాసిన ముక్కోటి బలగమోయి అనే కథ మొట్టమొదటి కథగా చెప్పుకోవచ్చు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరణ జరిగిన తర్వాత జరిగిన పరిణామాలను చిత్రించిన కథ. హైదరాబాద్‌కు ఉద్యోగరీత్యా వచ్చిన తెలంగాణేతరులు అప్పట్నుంచే చూపిన ఆధిపత్య భావాలను చిత్రించిన కథ. మట్టివాసనలు మాయమవుతున్నాయని, ఊళ్లు తెలంగాణ గ్రామ స్వభావన్ని కోల్పోతున్నాయని, వృత్తులు పతనమవుతున్నాయని, భూములు అన్యాక్రాంతమవుతున్నాయని, జానపద కళలు అడుగంటి పోతున్నాయని, వృత్తి పనిముట్లు మూలకు పడుతున్నాయన్న విషయాలను అక్షరీకరిస్తూ జూకంటి జగన్నాథం, కాలువ మల్లయ్య, పెద్దింటి అశోక్ కుమార్‌లాంటివాళ్లు అనేక కథలు రాశారు. ఈ ప్రాంతానికే ఎంతో మంది వలస వస్తుంటే ఈ ప్రాంతం వాళ్లు మాత్రం పొట్టలు చేతపట్టుకొని ఇతర రాష్ట్రాలకు వలసలు పోతూ యమయాతనలు పడటాన్ని చిత్రిస్తూ వలస కథలూ వచ్చాయి. అవ్వతోడు గిది తెలంగాణ కథలు వివక్షపై వచ్చిన కథలు కాకున్నా తెలంగాణ గ్రామాల్లో వివిధ వృత్తిపనులు చేసుకునేవాళ్లు తమ బతుకు తెరువులను కోల్పోయి అల్లాడుతున్న విషయాలను చిత్రించిన మంచి కథలు. తెలంగాణలో చాలా కాలం వరకు మధ్యతరగతి లేని విషయానికి అనుగుణంగా అట్టడుగు వర్గాల గూర్చి కథలు రాస్తే చూడటానికి నిరాకరించిన వాళ్లు తెలంగాణ మొదటి తరం కథా వారసత్వాన్ని ఇక్కడి రచయితలెలా ముందుకు తీసుకుపోతున్నారో గమనిస్తే మంచిది. ఎంత నిబద్ధతతో కథలు రాసినా వివక్షకు గురవుతున్న తెలంగాణ సాహిత్య, సంస్కృతుల గూర్చి తక్కువైనా మంచి కథలే వచ్చాయి. పులుగు శ్రీనివాస్

రాసిన సంకరవిత్తులు, రాజయ్య రాకపాయె, కాసుల ప్రతాపరెడ్డి లవ్ 2020, దగ్ధం, హత్య, ఎచ్చులు, ప్రాంతీయం కథలు, స్కైబాబ లోహం, కాలువ మల్లయ్య ఘుక్కోటి రతనాల వీణ, మట్టి తడుస్తున్న వాసన, ఎక్కడుంది తెలంగాణ?, పోట్రవుతు, పెబ్బెలు, జిన్నెలు కథలు, బెజ్జారపు రవీందర్ నిత్య గాయాల నది, పోరుతల్లి, బి. గణేశ్ ఆజాద్ హైద్రాబాద్, కె. పద్మలత భాషా సౌందర్యం, జూకంటి రాజయ్య మజిలీ ఇందులో పేర్కొనదగ్గవి. 2003 తెలంగాణ కథ, 2004 తెలంగాణ కథ సంకలనాల్లో తెలంగాణ నుంచి వస్తున్న అద్భుత కథల్లో వివక్షను చూపే కథలూ ఉన్నాయి. గోరటి ఎంకన్న పాటలోలా ఊరు, వాడ, మన అతారెలన్నీ మాయమై పోయిన వైనాన్ని ఈ రచయితలు తమ కథల ద్వారా చెప్పారు. ప్రపంచీకరణం, పారిశ్రామికీకరణం, రూపాయితనం పేరు మీద బతుకులు అతలాకుతలం కావడం, రైతులు, పత్తి రైతులు, నేత కార్మికులు కూడా ఆత్మహత్యల పాలు కావడంలోని విషాదాన్ని తెలంగాణ రచయితలు తమ కథల్లో నిక్షిప్తం చేశారు.

స్కైబాబ లోహం అత్యద్భుతమైన కథ. ఇదో ప్రేమకథలా అనిపించినా ఓ ఆదర్శం కోసం, ఆశయం కోసం జీవితాన్ని అంకితం చేయడంలో ఎంత ఆనందముందో జీవన పరమార్థముందో తెలిపే కథ. ఈ కథలో వ్యక్తి తెలంగాణ కోసం పని చేస్తున్నానంటాడు. అందుకోసం అతడు తన భాషను కూడా మార్చుకుంటాడు. తెలంగాణ ప్రజల భాషలో అతడు మాట్లాడేతీరు మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది. వివక్షకు గురవుతున్న తెలంగాణ సంపదలో భాష కూడా ఒకటి. ప్రసారసాధనాలు తెలంగాణ భాషను విలన్లకు, జోకర్లకు వాడి కించపరచడం చూస్తూనే ఉన్నాం. భాషను కించపరుస్తూ సొమ్ము చేసుకునే వ్యాపార సినిమాలూ ఉన్నాయి. మా భాష దేనికంటే తక్కువది కాదని, తెలంగాణ మాండలిక భాషకున్న సౌందర్యం బలమేంటో చెప్పే కథ భాషా సౌందర్యం. 1969లో తెలంగాణ పోరాటం జరుగుతున్న కాలంలో తెలంగాణ ఎక్కడుంది? ఏమైపోతుంది? అని కాళోజీ నారాయణరావు కరపత్రాలు తీసి పంచి పెట్టారు. ప్రజాతంత్రలో అచ్చయిన ఎక్కడుంది తెలంగాణ అన్ని రంగాల్లోనూ తెలంగాణ పరాధీన కావడం, పరతంత్ర కావడంలో దుర్మార్గాన్ని ప్రశ్నిస్తుంది. తెలంగాణ తెలంగాణలా లేదు. తన అస్తిత్వాన్ని కోల్పోయిందని తెలిపే కథ ఎక్కడుంది తెలంగాణ? తెలంగాణ నుంచి ఎన్నికయిన ప్రజా ప్రతినిధులు వెన్నెముకలు లేనివారిగా ప్రవరిస్తున్నారని, ఏ పార్టీలోనయినా వాళ్లు జిన్నేలుగానే ఉంటున్నారు తప్ప పార్టీని శాసించే పెబ్బెల స్థాయికి ఎదగడం లేదని, అలా ఎదగాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పే



కథ పెబ్బెలు, జిన్నెలు.. ఎంత స్నేహితులైనా ఉద్యోగం విషయంలో లేదా సహాయం చేయడం విషయంలో తమ తమ ప్రాంతీయ దృక్కోణాన్ని వదులుకోరని, తెలంగాణ ప్రాంతం వాళ్లకున్న బోళ్లకోరితనం, ఎవరినైనా కడుపులో దాచుకునే గుణం ఇతర ప్రాంతాలవారికి అసలే లేవని చెప్పే కథ ప్రాంతీయం. దగ్ధం, హత్య, ఎచ్చులు కథల్లో అభివృద్ధి చెందిన, వెనకబడిన ప్రాంతాల ప్రజల మధ్య మమతానురాగాల్లో ఉన్న వ్యత్యాసాలను చిత్రించడం జరిగింది. లవ్ 2020లో అభివృద్ధి చెందిన, వెనకబడిన ప్రాంతాల మధ్య పెళ్లి సంబంధాలు కుదిరినప్పుడు తెలివికలవాళ్లు ఇతర్లను వాళ్లవాళ్లకు దూరం చేసి తమలో కలుపుకునే క్రమంలోని దుర్మార్గం చిత్రించబడింది.

రాజయ్య మజిలీ., పోట్రవుతు తెలంగాణలో పత్తిరైతుల ఆత్మహత్యల గూర్చి వచ్చిన కథలు. మన పంటలు, మన వంటలు, మనం పండించినవేవీ వద్దని పాలకులు శాసిస్తుంటే హృదయానికి తలిగిన పోట్రవుతు గాయాలకు దేశీయత, ప్రాంతీయత అనే నల్లాలమే సరైన మందులని నొక్కి చెప్పే కథలు. రాజయ్య రాకపాయె, ఆ జాద్ హైద్రాబాద్ కతలు తెలంగాణ నేలపై జరుగుతున్న వివక్షను తెలిపేవే.

ఒకప్పుడు చేదబావుల్లో, మోటబావుల్లో చెంబుతో ముంచుకునేంత పైనుండే భూగర్భ జలాలు పాతాళంలోకి పోవడం, నీటి కోసం, తన మట్టి తడవడం కోసం తెలంగాణ రైతు అంగలార్చడం హృదయ విదారకంగా చిత్రించిన కథ... మట్టి తడుస్తున్న వాసనను పీల్చుకోవడానికి మొహం వాచిన రైతు తన నేల తడవకుండా వాన నీటితో తడుస్తుందని ఆశావహ దృష్టిని వ్యక్తపరుస్తాడు. భగరీథ ప్రయత్నం చేసి తన నేల తడవడానికి, మట్టివాసనను ముక్కు పుటాల్నిండా నింపుకోవడానికి రైతు చేసిన తపస్సే మట్టి తడుస్తున్న వాసన. మట్టి తడిచే వరకు తాను చేల్లో నుండి కదలనని తెలంగాణకు నీరు రావాల్సిన అవసరాన్ని రైతు దృష్టికోణంలోంచి ప్రతీకాత్మకంగా చెప్పిన కథ. తెలంగాణ సంస్కృతిపై సాంప్రదాయంపై, మనుషులపై ఇతర ప్రాంతాలవారి ఆధిపత్యాన్ని అద్భుతంగా చిత్రించిన కథ సంకరవిత్తులు. తెలంగాణకు వలస వచ్చి భూములు ఆక్రమించి ఇక్కడివాళ్లకే అమ్మాయినిచ్చి సంబంధాలు కలుపుకొని తమ ఆధిపత్యాన్ని కొనసాగిస్తూ, వాళ్లు తమ పరిధిలోకి రావాలని వలసవాదులు పన్నే కుట్రను ఈ కథలో వాస్తవికంగా చిత్రించారు. తనను తాను పరాయీకరణం చెందించుకొని వాళ్ల ఆధిపత్యంలోకి పోయి బతుకలేని ఆత్మాభిమానం గల తెలంగాణ యువకుడు సంబంధాలను తెంపుకొని బయటకొస్తాడు. అసమ, ఆధిపత్య సంస్కృతుల మధ్య పెళ్లి సంబంధాలైనా మరేవైనా నిలువడం కష్టమని నొక్కి చెప్పిన కథ.

తెలంగాణపై అన్ని రంగాల్లో జరుగుతున్న వివక్షను మనం షాక్ తినేట్టు చిత్రించిన కథ నిత్యగాయాల నది. తెలంగాణ ప్రాంతాలు, చదువులు, సంస్కృతి, భాష, చరిత్ర అన్ని రంగాల్లోనూ వివక్షకు గురవుతూ తన అస్తిత్వాన్ని ఎలా కోల్పోతుందో తెలంగాణతల్లి స్వరూప స్వభావాలేమిటో ప్రతీకాత్మకంగా చెప్పిన కథ. అల్లూరి సీతారామ రాజును గురించి మాట్లాడితే దేశభక్తి అన్నవాళ్లు కొమురం భీంను గూర్చి మాట్లాడితే తీవ్రవాదం అనడంలోని దుర్మార్గాన్ని ప్రశ్నించే కథ. వివిధ కారణాల వల్ల బక్కచిక్కి తన అస్తిత్వాన్ని కోల్పోయిన తెలంగాణతల్లి రూపాన్ని ఆవిష్కరించిన కథ. ఒకప్పుడు కోటి రతనాల వీణ పరిస్థితేంటో ఎక్కడ విధ్వంసం మొదలైందో, తెలంగాణతనం ఎందుకు మాయమైందో తెలంగాణ ముక్కోటి రతనాల వీణగా ఉండాల్సిన అవసరమేంటో తెలిపే మంచి కథ ముక్కోటి రతనాల వీణ. తెలంగాణను బతుకమ్మ తల్లిలా ఆవిష్కరించిన కథ బతుకమ్మ తల్లి. సాహిత్య సాంస్కృతిక కళా రంగాల్లో, భాషారంగంలో, రాజకీయాల్లో మిగతా అన్ని రంగాల్లోనూ వివక్షకు గురై తన అస్తిత్వాన్నే కోల్పోతున్న తెలంగాణ గూర్చి కలగంటాడు. తెలంగాణ స్వరూపస్వభావాలను ఆవిష్కరించుకుంటాడు. తనకు కలలో కనిపించిన ఆ తల్లెవరో అర్థం కాదు. తెలంగాణ ఘనతనంతా చెబుతూ ఆమెవరో సందిగ్ధంలో పడతాడు. తానూహించిన అన్ని రూపాల సమాహారమే ఆమేనని, ఆమె బతుకమ్మ తల్లని తెలుసుకొని హృదయం నిండా సంతోషం నింపుకుంటాడు. తెలంగాణ తల్లి ఆవశ్యకతను ప్రతీకాత్మకంగా చెప్పిన కథ బతుకమ్మ తల్లి.

ఇలా తెలంగాణపై జరుగుతున్న వివక్షపై ఎక్కువ కథలు రాకున్నా మంచి కథలే వచ్చాయి. అన్ని రంగాల్లో జరుగుతున్న వివక్షను అక్షరీకరించాయి. ఆధిపత్య భావాలను నిరసించాయి. బలహీనులపై బలవంతుల దోపిడీని ఎండగట్టాయి. తెలంగాణ తన అస్తిత్వాన్ని కాపాడుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పాయి.



# తెలంగాణ కథ పునర్మూల్యాంకనం

ఏ ప్రాంత సాహిత్యాన్నయినా, సమాజాన్నయినా, చరిత్రనయినా మూల్యాంకనం చేసేటప్పుడు స్థల, కాల, సామాజిక, రాజకీయ, చారిత్రక పరిస్థితులను పరిగణనలోకి తీసుకోవాలి. పాశ్చాత్య మూలాలతో, ప్రమాణాలతో ప్రాచ్య చరిత్రను, వెస్టర్న్ ప్రమాణాలతో ఈస్టర్న్ విషయాలను మూల్యాంకనం చేస్తే అన్యాయమే జరుగుతుంది. అద్భుతమైన చరిత్ర సంస్కృతి ఉన్న ఆఫ్రికన్, ఆసియన్ దేశాలున్న సమయంలో పేరే తెలియని దేశం అన్ని దేశాల కంటే అభివృద్ధి చెందిందని ఎందుకు చెప్పబడుతుందో అర్థం చేసుకుంటే చాలా ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. అన్ని వనరులున్నా అపారమైన సంపదున్నా, ప్రకృతి వనరులున్న దేశాలు, ప్రాంతాలు ఆయుధాలు మాత్రమే ఉన్న దేశాల కంటే బలహీనదేశాలుగా లెక్కింపబడుతుండటంలోనే వివక్షుంది. ఏదేమైనా సాహిత్య సాంస్కృతిక రంగాలను మూల్యాంకనం చేయడంలో అక్కడి స్థానిక పరిస్థితులను దృష్టిలో పెట్టుకోకుంటే బలహీన ప్రాంతాలు నష్టపోయే అవకాశముంది. మనకు అన్ని విషయాల్లోనూ పాశ్చాత్య ప్రమాణాలతోనే మూల్యాంకనం చేయడం అలవాటు ఉండటం వల్ల జరిగే నష్టం అపారమే. అలాంటి నష్టమే తెలంగాణ కథకు, సాహిత్యానికి జరుగుతుంది.

తెలంగాణ నుంచి అద్భుతమైన కథా సాహిత్యం వస్తుంది. గత పాతికేళ్లకు పైగా తెలుగు సాహిత్యాన్ని శాసిస్తుంది. ఏ వ్యాపార మసాలాల జోలికి పోకుండా స్పష్టమైన నిబద్ధతతో ప్రజా హితాన్ని కోరుతూ కథ వస్తుంది. తెలుగు నవల, ఇతర ప్రాంతాల సాహిత్యం భూతప్రేత వ్యాపార మాయలో పడి, సినిమా, టీవీలను ఆశ్రయించిన సమయంలోనూ తెలంగాణ నుంచఇ మంచి కథే వస్తుంది. ఇది అందరూ ఒప్పుకుంటున్న విషయమే. ఇతర ప్రాంతాలవాళ్లూ అప్పుడప్పుడయినా అంటున్న విషయమే. అయినా తెలంగాణ కథకు సంకలనాల్లో పది శాతాన్ని మించి చోటు లభించడం లేదు. ప్రభుత్వ, ప్రైవేట్ ప్రతిష్మాత్మకమైన అవార్డుల విషయంలోనూ అదే పరిస్థితి కొనసాగుతుంది. వివిధ స్థానాల్లో చోటు విషయంలోనూ అంతే. ఇందుక్కారణాలు అందరికీ తెలిసినవే. ఆంగ్లేయ పాలన ప్రాంత దృష్టికోణంలోంచి నైజాం పాలాన ప్రాంతాన్ని చూడటం పాశ్చాత్య దృష్టి కోణంలోంచి ప్రాచ్య ప్రాంతాన్ని చూడటం లాంటిదే ఇది. రాజకీయ సామాజిక ఆర్థిక చారిత్రక రంగాల్లో ఈ ప్రాంతంపై చూపుతున్న ఏదో కొంత వివక్ష సాహిత్య రంగంలోనూ చూపడం అన్నది జగమెరిగిన సత్యమే.

తెలంగాణ కథ ఆంధ్ర ప్రాంత కథలా మధ్యతరగతి దృష్టి కోణంలోంచి, మధ్యతరగతి జీవితంలోంచి, మధ్య తరగతి పాఠకుల కోసం మొదలు కాలేదనే వాళ్లున్నారు. తెలంగాణలో ఆధునిక కథ మొదలయ్యే నాటికి ఆ ప్రాంతంలో మధ్యతరగతి ఆవిర్భావమే జరగకుంటే ఆ దృష్టి కోణంలోంచి కథెలా మొదలవుతుంది? మధ్యతరగతి పాఠకులే లేకుంటే వాళ్లనుద్దేశించి ఎందుకు రాస్తారు? స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్లు గడిచిన తర్వాత గాని తెలంగాణలో మధ్యతరగతి ఆవిర్భావం జరిగిందన్న విషయాన్ని గుర్తుంచుకుంటే మంచిది. మధ్యతరగతి దృష్టి కోణంలోంచి మధ్యతరగతి జీవుల కోసం ఆవిర్భవించడానికి బదులు మరింత ముందుకు వెళ్లి అట్టడుగు జనజీవనం వస్తువుగా తెలంగాణ కథ ఆవిర్భవించడం చెప్పుకోదగ్గ ముందడుగు. ఎవరి కోసమైతే రాస్తున్నారో ఆ జనానికి సరిపోయే, చేరే ఆశు కథనశిల్పాన్ని ఎన్నుకొని కథలు రాయడం తెలంగాణ రచయితల ప్రత్యేకత. మొదటితరంలోనూ, ఆ తర్వాత చాలా కాలం వరకు తెలంగాణలో చెప్పుకోదగ్గ కథలే లేవని సంకలనాల్లో చోటు కల్పించని విమర్శకులు తెలంగాణ కథలనే దృష్టి కోణంలోంచి చూడాలో అర్థం చేసుకోవాల్సి ఉంది. తెలంగాణ కథను ఈ దృష్టికోణంలోంచి మూల్యాంకనం చేసి స్థానాన్ని కల్పించాల్సే ఉంది.

ఈ దృష్టి కోణం విశాలత్వం లేకపోవడం వల్లనే తెలంగాణ నుంచి పూర్తి మాండలికంలో మొదటితరం నుంచి కథలు వస్తున్నా, ఆ తర్వాత విరివిగా మాండలికంలో కథలు వస్తున్నా మాండలికం ఇతర ప్రాంతాలకు అర్థం కాదన్న వాదం లేవదీశారు. మాగోఖలే కథలను, కరుణకుమార కథలను, రావిశాస్త్రి కథలను, విశాఖ మాండలికాన్ని అన్ని ప్రాంతాలవాళ్లూ ఏ అడ్డంకులూ చెప్పకుండా చదివి ప్రశంసించినప్పుడు తెలంగాణ మాండలికంలో గొప్ప సాహిత్యం వస్తే చూడటానికి నిరాకరించడం గమనించదగ్గ విషయం. జానపదుల్లోని ఆశు కథా సాంప్రదాయాన్ని స్వంతం చేసుకొని కథలు రాస్తే గొప్ప కథలవుతాయన్న వారే ఆ పద్ధతిలో తెలంగాణ నుంచి విరివిగా కథలు వస్తున్నప్పుడు కథల్లో శిల్పం తక్కువని పెదవి విరవడం సాహిత్య మూల్యాంకన పద్ధతిలో ఉన్న లోపమే. తెలంగాణను సహజమైన ఆశుకథా సాంప్రదయానికి భిన్నంగా మధ్యతరగతి సాహిత్య దృష్టి కోణంలోంచి కథలు రావడానికి, అప్పుడే గుర్తించడానికి ఆమోదం తెలుపడం మూల్యాంకనం లోపమే.

తెలంగాణ నుంచి కుటుంబరావు, బుచ్చిబాబు లాంటి రచయితలు లేరని విచారించవలసిన అవసరం లేదని, కించపడకూడదని తెలంగాణ విమర్శకులే అనడం సరైంది కాదేమో! తెలంగాణ నుంచి తెలంగాణ జనజీవనాన్ని, సంఘర్షణను,



పరిణామాలను చిత్రించే రచయితలుంటారు కాని బుచ్చిబాబు, కొకులెందుకుంటారు? అయితే బుచ్చిబాబు, కొకులాంటి వాళ్లు గొప్పరచయితలే. వాళ్లకు తెలిసిన జీవితాన్ని వాళ్ల పరిధిలో చిత్రించారు. మరా జీవితం ఏంటి? ఎవరిది? ఆ సంస్కృతి ఏంటి? ఏ సంస్కృతిని వాళ్లు ఉన్నతీకరించారు? దాని పరిధి ఎంత? అనే విషయాలను పరిశీలిస్తే వాటిని నిష్పక్షపాతంగా విశ్లేషిస్తే మనకెన్నో విషయాలు అర్థమవుతాయి. రచయితలుగా వాళ్ల గౌరవానికి, స్థానానికి, ఔన్నత్యానికి ఏ మాత్రం భంగం కలిగించకుండానే వాళ్లు చిత్రించిన జీవితం పరిమితమైందని, అందులో శ్రామికవర్గ, కుల తాత్వికత లేదని చెప్పడానికి సందేహం అవసరం లేదు. అయినంత మాత్రాన వాళ్లకు సాహిత్యంలో ఉన్న స్థానానికే మాత్రం భంగం కలుగదు.

అందుకు భిన్నంగా కొందరు తెలంగాణ రచయితలు తాను కథల్లో చిత్రించిన జీవితం, సంస్కృతిని పరిశీలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ కథల్లోని తాత్వికతను గమనించినా ఆశ్చర్యమే కలుగుతుంది. ఆ రచయితలు చిత్రించిన జీవితం ఈ దేశంలోని మెజారిటీ ప్రజలదైన శ్రామిక కులాలది. దీని పరిధి చాలా విశాలమైంది. డెబ్బై శాతానికి పైగా ఉన్న ప్రజల జీవితాలవి. వీళ్లు ఆ జీవన సంస్కృతిని పరిశీలిస్తూనే అంతకంటే ఎన్నో రెట్లెక్కువైన శ్రామికుల సంస్కృతికి, జీవితానికి పట్టం కట్టారు. పని సంస్కృతిని, తాత్వికతను ప్రేమించే సాహిత్యాన్ని సృష్టించారు. చాలా కాలం వరకు సాహిత్యంలో చోటు చేసుకోని వర్గాలకు చోటు కల్పించారు. ఇందుకున్న అనేక కారణాలలో ఒకటి ఆయా వర్గాల నుంచి రచయితలు రావడమే. దేశంలోని అనేక సమస్యలకు పరిష్కార మార్గమైన పని సంస్కృతి ఉన్నతీకరణ గొప్ప సాహిత్య సృజన కాదా? అన్ని వర్గాల గురించి అద్భుతంగా అక్షరీకరించిన ఈ రచనల పరిధి, ప్రయోజనం విశాలమైంది. అందువల్ల ఈ రచయితలను పోల్చడమంటూ జరిగితే ప్రేమ్‌చంద్, టాల్‌స్టాయ్, మాక్జిమ్ గోర్కీలాంటివాళ్లతో పోల్చవచ్చు. అంతకంటే కూడా విస్తృత జీవితాన్ని వీళ్లు చిత్రించారు. తూర్పు దేశాల సాహిత్యానికున్న జవసత్వాలనందించారు. ఈ విషయం గూర్చి, కథల గూర్చి విస్తృత పరిశోధనలు చేసి సాహిత్య మూల్యాంకనం చేయవలసి ఉంది.

తెలంగాణ రచయితలు సమకాలీన జీవితాన్ని తీసుకొని సాంద్రతరమైన రచనలు చేశారు. కథకు, సాహిత్యానికి ప్రాంతీయ ముద్ర గొప్ప సర్టిఫికెట్. ఏ గొప్ప సాహిత్యం కూడా ప్రాంతీయ ముద్ర లేకుండా విశ్వజనీనం కాలేదు. అట్టడుగు వర్గాల జీవితాలను ప్రేమ్‌చంద్‌లా, రష్యన్ జీవితాన్ని సామాజిక పరిణామాలను టాల్‌స్టాయ్‌లా, రష్యన్ విప్లవ పోరాటాలను మాక్జిం గోర్కీలా – ఇంకా అంతకంటే విస్తృతంగా తెలంగాణ

జీవన సంస్కృతిని చిత్రించి తెలంగాణ కథను విశ్వవ్యాపితం చేశారు. ప్రజల భాషయైన మాండలికానికి పట్టం గట్టి జీవద్భాష పరిమళాన్ని ప్రపంచానికి రుచి చూపించడమే కాకుండా దానికి సాహిత్య గౌరవం తీసుకొచ్చారు. పీడిత ప్రజల పక్షం వహించి వాళ్ల సామాజిక జీవితాన్ని, సాంఘిక స్థితిగతులను కథల్లో పొందుపరిచారు. మంచి రచయితలైన వారెప్పుడూ పాలకుల పక్షం వహించకుండా ప్రజాపక్షాన నిలుచుంటాడు. పార్టీ ఏది పాలనలో ఉన్నా తెలంగాణ రచయితలు ప్రజల పక్షం వహించి కథలు రాశారు. దళిత బహుజన పీడితుల తరపున వకాల్తా పుచ్చుకొని అద్భుతమైన కథలు రాశారు. ఇన్ని రకాలుగా సాంద్రతరమైన జీవన చిత్రణతో సాహిత్య సృజనం చేసిన సాహిత్యాన్ని అందుకు తగిన ప్రమాణాలతో పునర్మూల్యాంకనం చేయాలి. బుచ్చిబాబు, కొకులు లేరని కించపరచడం కాకుండా టాల్‌స్టాయ్‌లు, ప్రేమ్‌చంద్‌లున్నారని గర్వపడాలి.

తెలంగాణ భాషా సంస్కృతులకున్న పీడిత స్వభావాన్ని గుర్తెరిగి తెలంగాణ రచయితలు కథను, సాహిత్యాన్ని ఆ వర్గాలది చేశారు. ఆ పద్ధతిలో రాశారు. ఆ వర్గాల నుంచి చదువుతో, పోరాటాలతో జీవితాలను గెలుచుకున్న రచయితలు వచ్చిన తర్వాత ఈ రచనల ఉధృతి మరింత పెరిగింది. ఇవి ఇతర ప్రాంత విమర్శకులకు, పీఠాధిపతులకు, మేధావులకు మింగుడు పడని విషయాలు. పోతే ఇతర ప్రాంతాల నుంచి కాని, నామమాత్రంగా ఉన్న తెలంగాణ ప్రాంతం నుంచి కాని ఈ రంగంలో సర్టిఫికెట్లు ఇచ్చేవారు. మూల్యాంకనం చేసేవారు విశ్రాంతి కులాలు, వర్గాల నుంచి వచ్చినవారే. వాళ్లకీ రచనల బలాన్ని అంచనా వేసే శక్తి ఉందో లేదో తెలియదు. శక్తి ఉన్నా సహృదయత లేకుంటే కష్టమే. అందుకోసం తెలంగాణ కథను, రచయితలను సరైన పద్ధతిలో పీడిత వర్గ దృక్పథంతో మూల్యాంకనం చేయాల్సిన అవసరముంది. విశ్రాంతి వర్గ శ్రామిక వర్గ దృక్పథం పాలక ప్రాంత పక్ష దృక్పథం, అభివృద్ధి చెందిన వెనుకబడిన ప్రాంతాల దృక్పథం లాంటివెన్నో సరైన పద్ధతిలో మూల్యాంకనం చేయడానికి అడ్డుగా నిలుస్తాయి. ఈ వైరుధ్యాలను అధిగమించాల్సిందే.

సంకలనాల్లో ఎలాంటి కథలు వస్తున్నాయో, రావాల్సినవెందుకు రావడం లేదో నిశితంగా పరిశీలిస్తే జరుగుతున్నదేంటో తెలుస్తుంది. నీ స్నేహితులెవరో చెబితే నువ్వేంటో చెబుతానన్నట్టు సంకలనాలు తీసేవారి స్వరూప స్వభావాలకు అనుగుణంగానే అందులో చేరిన కథలుంటున్నాయి. ఇలాంటి కారణాలవల్లనే రావిశాస్త్రి లంపెన్ అట్టడుగు జీవితాల గూర్చి రాసిన కథల్లో, భాషలో అద్భుతమైన శిల్పం, సౌందర్యం



కనబడితే తెలంగాణ నుంచి దళిత బహుజనుల గూర్చి రాసిన కథల్లో అవేవీ కనబడవు. పైగా అవి విస్తృతంగా వచ్చినప్పుడు ఇప్పుడు తెలుగుకథ వెనుకబడింది అనే వాదాలూ వస్తాయి. సామాన్య పాఠకులతో పాటు మేధావుల వరకూ చదువుకునేదయిన కథ మేధో ఫోజు అవసరం లేకుండా కథల్లోని పాత్రల భాషలో రాసిన ఘనత తెలంగాణ రచయితలకే దక్కుతుంది. కాని వాటిని స్వీకరించడంలో మాత్రం అదే పద్ధతి కొనసాగుతుంధి.

తెలంగాణ మాండలికంలో కథలు రావడం కొంతకాలం క్రితంలా సమస్యగా లేకున్నా మాండలిక రచన ప్రచురణ అంత సులభమేమీ కాదు. అన్ని పత్రికల్లో రావడం ఇంకా సమస్యే. కథలొచ్చినా దిన,వార, మాస పత్రికల్లో నవలలు, సీరియల్స్ రావడం దాదాపు అసంభవం. తెలంగాణ సాహిత్య, కథా సాహిత్య మూల్యాంకన జరిగే సమయంలో భాష విషయాన్ని దృష్టిలో ఉంచుకోక తప్పదు. ఎప్పుడో నిర్వచించుకున్న లిఖిత కథా లక్షణాలకు ఒదగని గొప్ప కథలెన్నో వస్తుంటే ఆ నియమాలనే పాటించడమూ అశాస్త్రీయమే. అందుకే కథానికను పునర్నిర్వచించుకోవాలి.

ఇలా అనేక విషయాలను దృష్టిలో పెట్టుకొని, దృష్టి కోణాలను పునర్నిర్వచించుకొని తెలుగు సాహిత్యాన్ని, తెలంగాణ కథను పునర్మూల్యాంకనం చేయాల్సిన అవసరముంది. అప్పుడే మరింత గొప్ప సాహిత్యం వస్తుంది. అందుకు నూతన శతాబ్ది వైతాళికులైన రచయితలు నాయకత్వం వహిస్తారు.

## తెలుగు కథా సంకలనాల్లో తెలంగాణా కథలు

కథావికాసానికున్న ప్రతికూల పరిస్థితుల్లో, అసలు మాతృభాషను ప్రధాన భాషగా చదివే అవకాశాలు లేని పాలనలో తెలంగాణలో ఆధునిక కథ ఆవిర్భవించింది. అలాంటి రాజకీయ నేపథ్యమున్న సమయంలోనూ తెలుగు కథ ఆవిర్భావ సమయంలోనే రావడం విశేషం. తెలుగు కథ సద్యోయౌవన అయినట్టే తెలంగాణ కథా సద్యోయౌవనయే. మొదటితరంలోనూ ఆ తర్వాతి తరంలోనూ రాశిలోనూ వాసిలోనూ చెప్పుకోదగ్గ కథలే వచ్చాయి. మధ్యతరగతి దృష్టికోణంలోంచే కాకుండా మరింత ముందుకు పోయి అట్టడుగు జీవిత చిత్రణతో తెలంగాణ కత ప్రారంభమైంది. కాని ఇటీవలి కాలం వరకు కూడా తెలంగాణ నుంచి మొదటితరంలో కథలు వచ్చినట్టు ఎవరూ రికార్డు చేయలేదు. తెలుగు కథా సాహిత్య చరిత్రలో తెలంగాణ కథకిచ్చిన స్థానం అతి తక్కువ. కొందరు గత శతాబ్ది డెబ్భైల వరకు తెలంగాణ నుంచి చెప్పుకోదగ్గ కథలు రాలేదంటే మరికొందరు అరవైల వరకు రాలేదన్నారు. విమర్శకుల పక్షపాత వైఖరి, అజ్ఞానం, పాక్షిక దృష్టి తెలంగాణ నుంచి వచ్చిన మంచికథలను గుర్తించనీయలేదు. సురవరం ప్రతాపరెడ్డి లాంటి ఒకరిద్దరు పేర్లు తప్ప తెలంగాణ మొదటితరం రచయితల పేర్లను కూడా ప్రస్తావించలేదు. తెలుగు కథ గూర్చి వ్యాసం రాసిన సందర్భంలో ఎక్కడో చివరకు తెలంగాణ నుంచి కూడా కొన్ని కథలు వస్తున్నాయన్న ఒక్క వాక్యముంటుంది. అదీ కొందరి వ్యాసాల్లోనే. మొదటి కథ రాసిన గురజాడ రాసిన పత్రికలోనే సంవత్సరం లోపే తెలంగాణలో మొదటి కథ అచ్చయినా దాన్ని గుర్తించిన వాళ్లు లేరు.

మొదట్నుంచీ తెలంగాణ నుంచి అద్భుతమైన సాహిత్యమే వస్తున్నా తగినంత పరిశోధన, దాన్ని వెలికితీసే గాడ్ ఫాదర్‌లాంటి వాళ్లు లేకపోవడం వల్ల అన్ని ప్రక్రియల్లాగే కథ కూడా చాలా కాలం వరకు మరుగున పడిపోయింది. సురవరం ప్రతాపరెడ్డి గోలకొండ కవుల సంచిక తీసినట్టు అప్పుడే తెలంగాణ కథల సంకలనం వెలువరిస్తే తెలంగాణకెంతో మేలు జరిగుండేది. ప్రముఖ పాత్రికేయులు కె. శ్రీనివాస్, సంగిశెట్టి శ్రీనివాస్, రచయిత్రి ముదిగంటి సుజాతారెడ్డి, పరిశోధక రచయితలు బి.యస్. రాములు, కాలువ మల్లయ్య లాంటి వాళ్లు తెలంగాణ కథ గూర్చి ఇటీవలి కాలంలో చేసిన కృషి వల్ల, రాసిన వ్యాసాల వల్ల, ముద్రించిన పుస్తకాల వల్ల అనేక విషయాలు బయటికొచ్చాయి. మనకు తెలియని మన కథ విస్తృతి ఎంతో



అర్థమవుతుంది. తమ చరిత్ర తాము రాసుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతున్నాయి. తమకున్న అజ్ఞానంతోనో, కావాలనో పక్షపాత దృష్టితోనో తెలంగాణ కథను దాని ఔన్నత్యాన్ని చూడటానికి నిరాకరించిన వాళ్లు ఇక్కడి నుంచి వచ్చిన కథల సంపుటులు, సంకలనాలు, రచయితల కథలు పరిశీలిస్తే మంచిది. పి.వి. నరసింహా రావు, కాళోజీ నారాయణరావు, సి. నారాయణరెడ్డి, డి. రామలింగంలాంటి వాళ్లు కూడా కథలు రాశారన్న విషయం ఇటీవలి కాలం వరకు తెలియకపోవడం విచిత్రమైన సంగతే. సాహిత్యానికీ జీవితానికీ అభేదాన్ని పాటిస్తూ ప్రయోజనం లేని సాహిత్యం వృధా అన్న భావంతో ప్రయోజనకర సాహిత్యాన్ని సృష్టించిన తెలంగాణ కథకులకు కోస్తా సంకలనకర్తలు ఇచ్చిన స్థానం మొదట్లోనయితే దాదాపు శూన్యం. అటు తర్వాత ఇచ్చిన స్థానమూ అతి తక్కువే. ఇప్పుడున్న స్థానమూ అన్యాయమైందే.

కథాభారతి, తొలినాటి తెలుగు కథలు, నూటపదహార్లు, హైదరాబాద్ బుక్ ట్రస్టువాళ్లు వేసిన తెలుగుకథ లాంటి కథా సంకలనాల్లో తెలంగాణ కథలకు లభించిన స్థానం నాలుగైదు శాతం కూడా లేదు. తెలంగాణ నుంచి అద్భుతమైన కథలొస్తున్నాయి, తెలంగాణ నేల తెలుగుకథకు కేంద్రం అని ఉపన్యాసాలిచ్చేవాళ్లు కూడా సంకలనాల్లో తెలంగాణ కథకిచ్చిన స్థానం దాదాపు శూన్యం. వందేళ్ల తెలుగు కథ పేరున సంకలనం చేసిన పుస్తకంలో తెలంగాణ కథలు రెండంటే రెండుంటం విశేషం. కథాసాహితి, కథా వార్షికల పేరు మీద ఏటా తెలుగు కథా సంకలనాలు వెలువరిస్తున్నవారి సంకలనాల్లోనూ తెలంగాణ కథలు పది శాతానికి ఎక్కువ చోటు చేసుకోవడం లేదు. ఇలా మొదట్నుంచీ ఇప్పటి వరకు కూడా తెలుగు కథా సంకలనాల పేరు మీద తెలంగాణేతరులు చేస్తున్న కథాసంకలనాల్లో ఈ కథలకిచ్చే స్థానం అతి తక్కువ. జీవితం, సంస్కృతి, ప్రాంతీయతా ముద్ర, ప్రజల జీవద్భాషా పరిమళం, ప్రయోజనదృష్టితో వస్తున్న తెలంగాణ కథలకు స్థానం లభించకపోవడం సంకలనకర్తల పాక్షిక బుద్ధిని తెలియజేస్తుంది తప్ప తెలంగాణ కథకొచ్చే నష్టమేం లేదు. అలా పాక్షికంగానైనా సంకలనాల్లో చేరిన తెలంగాణ కథలను పరిశీలిస్తే ఆ కథల్లో ఎంత జీవితముందో, జీవన సంఘర్షణుందో, ఆ కథల ప్రయోజనమేమిటో అర్థమవుతుంది.

తెలంగాణ కథలు కూడా ఒకటి రెండున్నాయి అనే దృష్టితో కాకుండా ఇవాల్సినంత ప్రాతినిధ్యం ఇవ్వకున్నా తెలంగాణ కథలను మిగతా సంకలనకర్తల్లా కాకుండా కొంచెం ఎక్కువ ప్రాతినిధ్యంతో ప్రచురిస్తున్న సంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. వేదగిరి కమ్యూనికేషన్స్ ప్రచురించిన కొత్త కథ, సరికొత్త కథ, వినూత్న కథ

సంకలనాల్లోనూ, స్త్రీవాద కథాసంకలనాల్లోనూ, నచ్చిన కథ సంకలనాల్లోనూ తెలంగాణ కథల పరిస్థితి ఎవరికి పుట్టిన బిడ్డవే అంటే వెక్కివెక్కి పడి ఏడ్చినట్టే ఉంది. ఇలాంటి పరిస్థితుల్లో తెలుగు కథ 95, 96 పేర్లతో ప్రచురిస్తున్న కథా సంకలనాల్లో తెలంగాణ కథలు కొన్ని....

**తెలుగుకథ 95**

అతడు - అల్లం రాజయ్య
బందీ - బి.యస్. రాములు
దొరగారి గడి - కాలువ మల్లయ్య
జీవన్మృతుడు - ఆడెపు లక్ష్మీపతి

**తెలుగు కథ 96**

బొడ్రాయి - భూపాల్
అమ్మమ్మ - కాలువ మల్లయ్య
తిర్యగ్రేఖ - ఆడెపు లక్ష్మీపతి

**తెలుగు కథ 97**

అన్న - కాలువ మల్లయ్య
దుస్తులు - బి.యస్. రాములు
హంతకులు - తుమ్మేటి రఘోత్తమరెడ్డి

**తెలుగు కథ 98**

కందిరీగలు - బోయ జంగయ్య
చీకటిలోంచి చీకటిలోకి - గీతాంజలి
జలగలవార్డు - గొరుసు జగదీశ్వర్ రెడ్డి
నల్లచీమ - సదానంద శారద
పగ - కాసుల ప్రతాపరెడ్డి
ముగ్గురు మిత్రులు - కాలువ మల్లయ్య

**తెలుగు కథ 99**

అమ్మీజాన్ - రహమతుల్లా



ఒసియన్ - గీతాంజలి
గజ ఈతరాలు - గొరసు జగదీశ్వర్ రెడ్డి
మంత్రిని పిలవండి - సదానంద శారద
యాతన - జూకంటి జగన్నాథం
వారసత్వం - బి.యస్. రాములు
సిల్‌సిలా - షాజహానా

**తెలుగుకథ 2000**

ఇల్లు - జూకంటి జగన్నాథం
ఎండమావి - పెద్దింటి అశోక్‌కుమార్
కథ 2020 - గీతాంజలి
కలికి గాంధారి - ఐతా చంద్రయ్య
ప్రేరకాలు - అల్లం రాజయ్య
భూనిర్వాసితులు - పి. చంద్
విధ్వంస దృశ్యం - ఆడెపు లక్ష్మీపతి
వాల్తేరమ్మ - గొరసు జగదీశ్వర్ రెడ్డి

**తెలుగు కథ 2001**

అదే మీరయితే - గూడ అంజయ్య
గోగుపూవుల పాట - బెజ్జారపు రవీందర్
చుడీదార్ పిల్ల - పులుగు శ్రీనివాస్
నాన్న డైరీ - కె.వి. నరేందర్
చెక్ - కొండుభట్ల రామచంద్రమూర్తి
[illegible] - దొడ్డి రామ్మూర్తి
రాజుగాడు - పంజాల జగన్నాథం
సంటిది - గీతాంజలి
సుక్కి - భూపాల్

ఈ కథలన్నీ స్పష్టమైన ప్రాపంచిక దృక్పథంతో, ప్రయోజన దృష్టితో రాయబడ్డవే. ఇందులోని చాలా కథలకు రచయిత పేరు ప్రచురించకున్నా తెలంగాణ నుంచి వచ్చినవేనని తెలుసుకోగల ప్రాంతీయ ముద్రఉంది. ప్రాంతీయ ముద్రతో పాటు విశ్వజనీన మానవతాదృక్పథముంది. ఇందులో ఏ కథా ఉబుసుపోకకు రాసింది కాదు. అల్లం రాజయ్య అతడు, ప్రేరకాలు, భూపాల్ బొంద్రాయి, తమ్మేటి రఘోత్తమరెడ్డి హంతకులు, కాలువ మల్లయ్య దొరగారి గడీ, అన్న ముగ్గురు మిత్రులు తెలంగాణలో జరుగుతున్న భూపోరాటాల నేపథ్యంలోంచి వచ్చిన కథలు. పోరాటాలతో తెలంగాణ గ్రామాలు అగ్నిగుండాలుగా మారిన దృశ్యాలు, పోరాటవీరులైన అన్నలకు ప్రజల్లో ఉన్న స్థానం, పోరాటాలతో తెలంగాణ గ్రామాల్లో వచ్చిన మార్పులు చిత్రించబడ్డాయి. ఆడెపు లక్ష్మీపతి జీవన్మృతుడు, తిర్యగ్రేఖ, విధ్వంసదృశ్యం కథలు చైతన్యస్రవంతి కథనంలో మనిషి అంతరంగాన్ని ఆవిష్కరించిన ప్రయోగాలు. బి.యస్. రాములు వారసత్వం, దుస్తులు, కాలువ మల్లయ్య అమ్మమ్మ, ఐతా చంద్రయ్య కలికి గాంధారి పీడిత కులాల్లోంచి ఎదిగి జీవితాలను గెలుచుకున్న క్రమాల్ని పతనమవుతున్న విలువలు, విధ్వసమవుతున్న మానవసంబంధాలను చిత్రించిన చక్కని కథలు. పెద్దింటి అశోక్‌కుమార్ ఎండమావి, జూకంటి జగన్నాథం యాతన, ఇల్లు, పి. చంద్ భూనిర్వాసితులు గ్రామీణ జీవన విలువలకు భాష్యం చెప్పిన కథలు. గీతాంజలి, షాజహానా, పులుగు శ్రీనివాస్, రహమతుల్లా కథలు మైనారిటీ జనజీవన చిత్రాలు.

ప్రజాశక్తి ప్రచురణాలయం వాళ్లు ప్రచురించిన కథా ప్రస్థానం (2002 - 2004)లో పెద్దింటి అశోక్‌కుమార్ కాగుబొత్త, బి.వి.యన్. స్వామి బల్లిపాతర, కాలువ మల్లయ్య గ్లోబలి లాంటి కథలున్నాయి. ప్రపంచీకరణ పేరు మీద జరుగుతున్న పరాయీకరణ, మాయ, అమెరీకరణ తెలంగాణ జీవనంలో, వ్యవసాయంలో, పరిశ్రమలో, సంస్కృతిలో లేపిన సంక్షోభాన్ని చిత్రించిన కథలివి.

శైలి పబ్లికేషన్స్‌వారు 'నవకథ' పేరుతో ప్రచురించిన కథా సంకలనంలో తొమ్మిది కథలున్నాయి. ఇందులో తెలంగాణకు చెందిన పులుగు శ్రీనివాస్ 'వెలుగురేఖలు', ఎస్. రామకృష్ణ 'పెళ్లి?', కాసుల ప్రతాపరెడ్డి 'శిలువకు తొడిగిన మొగ్గ' ఉన్నాయి.

యువతరం రచయితల కథలతో పాటు కేంద్ర సాహిత్య అకాడమీ న్యూఢిల్లీ వారు ప్రచురించిన ఒక తరం తెలుగు కథ (1992)లో తెలంగాణ రచయితల ఐదు కథలున్నాయి.



వుప్పల నరసింహం - సంది
నందిని సిధారెడ్డి - ఖైదీ
సదానంద శారద - పాలకంకి
అల్లం రాజయ్య - భూమి
కాలువ మల్లయ్య - చావు

భూమి అల్లం రాజయ్య ప్రసిద్ధ కథ. భూమిని పొందడానికి రైతు జీవన్మరణ పోరాటాలు చేయాల్సిన అవసరాన్ని తెలిపే కథ భూమి. ఈ దేశంలో సగటు మనిషి జీవితం దినదినగండంగా, రోజుకో చావులా ఎలా ఉందో చెప్పే కథ చావు.

భారతదేశ స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా కేంద్ర సాహిత్య అకాడమీ అరవై కథలతో సంకలించిన కథల పుస్తకంలో తెలంగాణ కథలు తొమ్మిది ఉన్నాయి.

పాలు ఎర్రబడ్డాయి - దేవరాజు మహరాజు, విద్యాసాగర్
జాడీ - సదానంద శారద
అడవిలో వెన్నెల - బి.యస్. రాములు
మనిషిలోపలి విధ్వంసం - అల్లం రాజయ్య
చావు విందు - తుమ్మేటి రఘోత్తమరెడ్డి
అంబల్లబండ - భూపాల్
ఆంబోతు - కాలువ మల్లయ్య
మంచుముద్ద - ఐతా చంద్రయ్య

ఇందులోని కథలన్నీ భూపోరాట ఉద్యమాల నేపథ్యంలోంచి వచ్చినవే. పాలు ఎర్రబడ్డాయి, చావు విందు, అంబల్ల బండ, ఆంబోతు, మనిషిలోపలి విధ్వంసం, అడవిలో వెన్నెల తెలంగాణ గ్రామాల ఫ్యూడల్ స్వరూప స్వభావాలను, పోరాటాలతో భూస్వామ్య వ్యవస్థ పతనం దిక్కు పయనించిన వైనాన్ని, పోరాటాలు గిరిజనుల అడవి బతుకుల్లో కురిపించిన వెన్నెలను చిత్రించిన కథలు. తెలుగు కథకు భూపోరాటాల పార్శ్వం అతి ముఖ్యమైందని చెప్పడానికి ఈ కథలు నిదర్శనం. తెలంగాణ కథంటే పోరాట కథ మాత్రమే కాకున్నా విప్లవ కథగా తెలుగుకథకు మార్గనిర్దేశం జరిగింది తెలంగాణ నుంచే.

కథాసాగర్, మద్రాసువారు భారతదేశ స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా

తెలుగు కథకు ఎనబై ఐదేళ్లు నిండిన సమయంలో 1997లో 87 కథలతో కథాసాగర్ అనే కథాసంకలనం వెలువరించారు. ఇందులో తెలంగాణ కథలు ఏడున్నాయి.

అల్లం రాజయ్య - మనిషి లోపలి విధ్వంసం

బోయ జంగయ్య - దొంగలు

బి.యస్. రాములు - సదువు

కాలువ మల్లయ్య - అమ్మ మీది సొమ్ములు

తుమ్మేటి రఘోత్తమరెడ్డి - చావు విందు

టి. సంపత్‌కుమార్ - లియోసా

వుప్పల నరసింహం - ఎడ్డి పిల్ల, లచ్చిమి, రిబ్బను

తెలంగాణ జీవితం, గ్రామీణ విలువలు, మానవ సంబంధాల విధ్వంసం, చదువుతో జీవితాలను గెలుచుకునే క్రమాన్ని తెలిపే కథలివి.

విశాలాంధ్ర ప్రచురణాలయం వాళ్లు 2000లో ప్రచురించిన విశాలాంధ్ర తెలుగుకథ సంకలనంలో తెలంగాణ కథల చేర్పు విషయంలో కొంత న్యాయం చేశారు. ఇందులో ఇరవై కథలున్నాయి. ఇంతవరకు వచ్చిన కథాసంకలనాలన్నిటిలోనూ ఇందులో తెలంగాణ కథలు ఎక్కువగా ఉన్నాయి.

పొట్లపల్లి రామారావు - న్యాయం

సురవరం ప్రతాపరెడ్డి - వకీలు వెంకయ్య

కాంచనపల్లి చినవెంకటరామారావు - మన వూళ్లో కూడానా

వట్టికోట ఆళ్వారుస్వామి - మా కంటే మీరేం తక్కువ

మంద రామారెడ్డి - సర్కారు కిస్తు

సురమౌళి - ముక్కోటి బలగమోయి

నెల్లూరి కేశవస్వామి - కేవలం మనుషులు

సదానంద శారద - తొక్కుడబండ

వుప్పల నరసింహం - తిరగబడ్డ భూమి

అల్లం రాజయ్య - శత్రువు నేర్పిన పాఠం

ఆడెపు లక్ష్మీపతి - బంద్



తుమ్మేటి రఘోత్తమరెడ్డి - జాడ

పులుగు శ్రీనివాస్ - లా అండ్ ఆర్డర్

గొరుసు జగదీశ్వర్ రెడ్డి - వలస పక్షులు

బి.యస్. రాములు - దక్షయజ్ఞం

కాలువ మల్లయ్య - భద్రత

బోయ జంగయ్య - తుపాకులు

నవీన్ - హెచ్

పి. చంద్ - హత్య

ఈ కథలన్నీ ఉద్యమ నేపథ్యమున్న కథలే. పోరాటాలను సమర్థించే కథలే. తెలంగాణ నేల మీద వివిధ కాలాల్లో వివిధ ఉద్యమాలు నిర్వహించిన పాత్రకు అక్షర రూపం ఈ కథలు. సంకలనాల్లో తెలంగాణ కథలను చేర్చుకోవడంలో కొంతయినా న్యాయం చేసిన సంకలనం ఇది.

ఇలా తెలంగాణ నుంచి ఏ కోణాన్ని వదిలిపెట్టకుండా అద్భుతంగా కథలు వస్తున్నా సంకలనాల్లో చోటు చేసుకోవడంలో మాత్రం న్యాయం జరగడం లేదు. ఏ కాలంలో కథ రాసినా, ఏ విభాగంలో కథ రాసినా సామాజికతను దృష్టిలో పెట్టుకుని కథలు రాస్తున్న తెలంగాణ కథకుల కథలు సంకలనాల్లో చేర్చుకోవడంలో మాత్రం సంకలనకర్తలకు సామాజికత కొరవడుతుంది. ఈ లోటును సంకలనకర్తలు సవరించుకుంటే తెలుగు కథా సంకలనాలు మరింత ప్రయోజనకరంగా జవసత్వాలు కలవిగా తీర్చి దిద్దబడతాయనడంలో సందేహం లేదు.

# మైనారిటీ కథోద్యమం - తెలంగాణ

ఉద్యమాల పురుటిగడ్డ తెలంగాణ... ఆనాటి రజాకారు వ్యతిరేకోద్యమంతో పాటు నేటి దండోరా, డోల్‌దెబ్బ భూపోరాటాల ఉద్యమాల వరకు అనేక ఉద్యమాలిక్కడ పురుడు పోసుకున్నాయి. ఉధృత స్థాయికెళ్ళి సామాజిక మార్పుకు దోహదం చేసాయి... దేశానికే భూపోరాట వారసత్వాన్నందించడంతో పాటు అనేక సామాజిక సాంస్కృతిక ఉద్యమాలూ చోటు చేసుకున్నాయి... అలాగే సాహిత్యోద్యమాలు కూడా. తెలుగు కథకు విప్లవ దళిత బహుజన కథా వారసత్వ సంపదను ఇచ్చినట్టే తెలంగాణ మైనారిటీ సాహిత్యోద్యమానికి కూడా అండదండగా నిలుస్తుంది... ఇంత వరకు ఇది ఉద్యమరూపం తీసుకోకున్నా ఈ సాహిత్యోద్యమం బలంగా రాగలదనడానికి ఇటీవలికాలంలో వచ్చిన కథలు, సంకలనాలే నిదర్శనం. మైనారిటీ సాహిత్యోద్యమానికి - మైనారిటీలకు అండదండగా నిలబడటానికి తెలంగాణా సమాజంలోనే మూలాలున్నాయి.. ఇక్కడి సాహిత్య కారులు, కళాకారులు మొదట్నుంచి పీడితుల పక్షం వహించి సాహిత్య సృజనం చేస్తూనే ఉన్నారు. నిరంతరం పోరాడే వాళ్ళ పక్షం వహించి, దళితుల పక్షం వహించి జీవితానికి, సాహిత్యానికి దగ్గరి సంబంధం ఉండాలని భావించినట్టే తమదేశంలోనే తాము వివక్షకు గురవుతూ పీడితులయిన మైనారిటీల పక్షమూ వహిస్తున్నారు.

మొదటితరంలో కులంపట్టి సాహిత్య సామాజిక రంగాలలో విశేష కృషిచేసిన మాడపాటి, సురవరం, దేవులపల్లి, కాళోజీ, వట్టికోరు ఆళ్వారుస్వామి, దాశరథి లాంటివాళ్ళు కేవలం రాసి ఊర్కున్న వాళ్ళు కారు.. తెలంగాణ సర్వతోముఖ వికాసం కోసం తమ సాహిత్యాన్ని ఆయుధంగా ఉపయోగించిన వాళ్ళే... తెలంగాణకు మైనారిటీలకు విడదీయరాని సంబంధమే ఉంది.. తెలంగాణ అట్టడుగు జీవితానికీ ముఖ్యంగా దళిత బహుజన జీవితానికి ముస్లిం జీవితానికే దగ్గరి సంబంధం ఉంది... ఇద్దరిదీ శ్రామిక సంస్కృతే.. మహమ్మదీయ కళలు, సాహిత్యంతో భారతీయ సాహిత్యం తెలంగాణా సాహిత్య సంస్కృతులు విశేషంగా ప్రభావితమయ్యాయి. నాలుగు వందల ఏండ్లకు పైగా తెలంగాణ ప్రాంతం హైదరాబాద్ కేంద్రంగా ముస్లిం రాజుల పరిపాలనలో ఉంది. రజాకార్ల విజృంభణాకాలం వదిలిపెడితే చాలాకాలం ఆ సమయంలో ముస్లింలు, ఇతర మతస్థుల మధ్య సహజీవన సంబంధాలు కొనసాగాయి.. ఒకరి పండుగల్లో ఒకరు పాల్గొనడం, ఒకరి ఉత్సవాల్లో మరొకరు పాలుపంచుకోవడం కలిసిమెలసి ఉండటం లాంటివి ఉండేవి. నైజాం నవాబు తమ మతాన్ని ప్రచారం చేసుకున్నా ఇతర మతస్థుల విషయాల్లో జోక్యం చేసుకునేవాడుకాదు.. గుళ్ళు కట్టుకోవడానికి ఎలాంటి ప్రతిబంధకాలూ ఉండేవికావు.. రమ్‌జాన్, మొహర్రం వేడుకల్లో హిందువులు,



హిందువుల పండుగల్లో ముస్లింలు నిరభ్యంతరంగా పాల్గొనేవారు. పల్లెల్లో వీళ్ళమధ్య సహజీవనం మరింత కల్మష రహితంగా ఉండేది.. మత భేదాల గొడవ సామాన్యమానవులకంతగా తెలిసేదీకాదు.

వందలాది ఏండ్లు ముస్లిం రాజులు పాలించినా పేద ముస్లింలకు ఒరిగిందేంటి..? వాళ్ళలో చాలామంది దుర్భర పేదరికాన్నే అనుభవించారు. మత ప్రాతిపదికన తమవాళ్ళు రాజమేలితే పేదలకేదో ఒరుగుతుందనుకోవడం వట్టి భ్రమేనన్న విషయం తెలంగాణా ముస్లింలను చూస్తే అర్థమవుతుంది. మత ప్రాతిపదికన రాజ్యాధికారం కావాలనుకునేవారు అలాంటి రాజ్యాధికారం ఏ మతంలో ఉన్న వాళ్ళయినా ఉన్నవాళ్ళకే ఉపయోగపడుతుందన్న విషయాన్ని తెలుసుకోవాలి. అందుకోసం రజాకారు వ్యతిరేక పోరాటాల కాలంలోనూ, తెలంగాణాలో మొదటితరంలో జరిగిన భూపోరాటాల కాలంలోనూ గ్రామాల్లో దొరలు, భూస్వాములకు వ్యతిరేకంగా ముస్లింలూ పోరాడారు. మతాతతీతంగా తమ సంఘీభావాన్ని చూపారు... వాళ్ళంతా ఎప్పుడో భారతీయులయిపోయారు. అయినా అనేక కారణాలవల్ల ముస్లింలను కొందరు రెండవజాతి పౌరులుగానే చూడటం జరుగుతూనే ఉంది... వాళ్ళమీద వివక్షకొనసాగుతూనే ఉంది. వాళ్ళపై అనుమానం చూపులు చూడటం జరుగుతూనే ఉంది... ఇతర వృత్తిపనులకు సంబంధించిన సృష్టికర్తలపై రానట్టే వాళ్ళపై రావాల్సినంత సాహిత్యం రాలేదు...

ఇటీవలికాలంలో ఆ అవసరాన్ని గుర్తించారు తెలంగాణా రచయితలు. బాబ్రీమసీదు విధ్వంసం జరిగిన తరవాత ముస్లిం సమాజంలో భయం హెచ్చింది. వాళ్ళపై వివక్షమరింత పెరిగింది. గుజరాత్‌గాయం వాళ్ళగాయాలను మరింతకెలికింది. చాలామంది రచయితలను ఆలోచింపచేసింది... శ్రామిక సంస్కృతిని తమ సంస్కృతిని ఉన్నతీకరించుకునే సాంస్కృతిక నేపథ్యం ఏర్పరచుకోడానికి రచనల నెన్నుకున్నారు. తమ వాళ్ళలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించడానికి వాహికగా కథనెన్నుకున్నారు... సురవరం ప్రతాపరెడ్డి వెయ్యేండ్ల ఆంధ్రుల సాంఘిక చరిత్రను రాయడానికి సాహిత్యాధారాలనెన్నుకున్నారు. ఈ రచయితలు భవిష్యత్తరంలో తమ సాంఘిక చరిత్రను రాసుకోవడానికి కతనెన్నుకున్నారు... అలా వచ్చిన కథా సంకలనమే "వతన్.." ఇందులో ఉన్న యాభైరెండు కథల్లో ముప్పైరెండు కథలు తెలంగాణ ముస్లిం జనజీవన సంస్కృతిని చిత్రించేవే.. స్కైబాబా, షాజహానాల నిర్విరామ కృషి ఫలితంగా వెలువడిన ఈ కథాసంకలనం మైనారిటీ సాహిత్యోద్యమాన్ని ముందుకు తీసుకుపోయేదే.. ముస్లిం జనాభా సంస్కృతి భాషా ప్రభావం విరివిగా ఉన్న తెలంగాణ నుంచే ఈ సంకలనం రావడం చెప్పుకోదగ్గ విషయం..

తెలంగాణ నుంచి ముస్లిం జీవితాలపై కథలు రావడం ఇదే మొదలుకాదు. ముస్లిం భాషా సంస్కృతులూ తెలంగాణా వాళ్ళకు కొత్తకాదు.. తెలుగు భాషలో ముఖ్యంగా తెలంగాణా ప్రాంత వాడుక భాషలో ఉర్దూపదాలు విడదీయలేనంతగా కలగలిసిపోయాయి. తెలంగాణా వాళ్ళవాడుకభాషలో ఉర్దూమిశ్రమ యాస, ముస్లింల తెలుగులో అద్భుత యాస కనబడుతుంది.. తెలంగాణ సాహిత్య సాంస్కృతిక వికాసం కోసం విశేషంగా కృషిచేసిన తెలంగాణ వైతాళికుడు సురవం ప్రతాపరెడ్డి తెలంగాణప్రాంతాన్ని నిజాం రాష్ట్రమని, తెలంగాణ ప్రజలను నైజామాంధ్ర ప్రజలని చెప్పేవారు.

'బ్రిటిష్ ఆంధ్రులు బ్రౌణ్యాంధ్రం మాట్లాడితే మేం తౌరక్యాంధ్రం మాట్లాడుతాము.. వారిది ఇంగ్లీషు దడ దడ.. మాది ఉర్దూ గడబిడ.

అంటారాయన తెలంగాణ తెలుగు గురించి మొదటితరంలో ముస్లిం జీవితాల గూర్చి అద్భుతమైన కథలురాశాడు సురవరం.. తెలంగాణ తెలుగు గురించి అతడు చెప్పిన మాటలువారి కథల్లోని భాషకేకాదు. కథల్లో తీసుకున్న వస్తువుకూ వర్తిస్తాయి.

సురవరం వారి కథలను తెలుగు కథలని మాత్రమే అనడం కంటె తెలుగు ముస్లిమ్ సంస్కృతిని తెలిపే తెలుగు కథలనడం బాగుంటుంది. నిజాంపాలన జోరుగా సాగుతున్నకాలంలో ప్రజాపక్షంవహించి కథలు రాసాడు సురవరం. వీరి మొదటి కథ గ్యారా కద్దూ బారా కొత్వాల్' 1931లో ప్రచురింపబడింది. ఈ కథ పట్వారి, మాలిపటేల్, పోలీసు పటేలు లాంటి వారి అవినీతిని ఆకాంలో పాలకుల ధృతరాష్ట్రపాలనను తెలిపేకథ.. ఈతడు రాసిన మొగలాయే కథలు స్వాతంత్ర్యానికి ముందున్న తెలంగాణ పరిస్థితులను తెలిపే కథలు... పాలకుల్లోని అవినీతి బట్టబయలు చేసిన కథలు.. **మొగలాయీ కథలు** తెలుగులో హాస్యకథలు తక్కువనే లోటును కొంతవీరకైనా తీరుస్తాయి. అయితే ఇవి పైకి హాస్య కథల్లా కనబడినా, అది చౌకబారు హాస్యంకాదు. సామాజిక నిబద్ధమైనది... ఈ కథలు చదివితే నవ్వుతో పాటు జాలి కలుగుతుంది. పాపం అనిపిస్తుంది.. నవాబులై ఉండీ తెలివితక్కువగా ప్రవర్తించడం, పిచ్చిపిచ్చి శాసనాలు చేయడం, గోమాజీలాంటి వాళ్ళు వాళ్ళను ఉపయోగించుకోవడం ఈ కథల్లో చూడవచ్చు.. ఈ కథలు ముఖ్యంగా పాలకులపై ఎక్కుపెట్టబడినవి. నైజాం పాలనలో మదోన్మత్తులైన అధికారులు ప్రజలనెలా పీక్కుతినేవారో, రాజుల మూర్ఖత్వం, ఆ దర్బారులెంత గుడ్డిదర్బారులో తెలిపేకథలు.. నెల్లూరి కేశవస్వామి రాసిన చార్‌మినార్ కథలు హైదరాబాద్ ప్రాంత ముస్లింల జీవన మూలాలను తెలిపే కథలు.. ఆ తరవాత ముస్లిం జీవితాల గురించి అడపాదడపా కొన్ని కథలొచ్చినా చెప్పుకోదగ్గ సంఖ్యలో రాలేదు.



స్కైబాబా షాజహానా సంపాదకత్వంలో వెలువడిన వతన్ కథా సంకలనం ముస్లిం సమస్యలను బయటకు తెచ్చిన కథలు.. వాళ్ళ జీవితాలను, వాళ్ళపై జరుగుతున్న వివక్షను, వాళ్ళలోని దుర్భర పేదరికాన్ని వెనుకబాటుతనాన్ని అన్ని కోణాల్లోంచి ఆవిష్కరించిన కథలు.. ఇందులోని భాషను గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఓ ప్రత్యేకమైన యాస తెలుగు భాషకు లభిస్తుందీ కథల ద్వారా.. తెలుగు భాష ముస్లిం జనజీవన సంస్కృతికి చెందిన పదాలను తమలో కలుపుకొని మరింత పరిపుష్టమైంది. దీంతో తెలుగుకు కొత్త మాండలిక భాష సంపద లభిస్తుంది. **ఖాజీ** చెప్పినట్టు ఈ కథలు తెలుగు సాహిత్యానికి అదనపు గౌరవం అనడంలో సందేహం లేదు...ముస్లిం జీవితాల గూర్చి అద్భుతంగా కథలు రాస్తున్న గీతాంజలి కతను కూడా ఇందులో చేర్చితే బాగుండేది... స్కైబాబా, షాజహానా, అన్వర్, గౌస్ మొహియుద్దీన్, యాఖూబ్, రహమతుల్లా, ఆలీ, విసార్, ఎం.డి.యాఖూబ్‌పాషా, దిలావర్, జాకేరా, యాస్మన్‌బేగం, ఎమ్.ఎస్.బేగం, ఖాజా, హనీఫ్, వలీహుసేన్, ఇక్బాల్‌చంద్, సయ్యద్ ఖుర్షీద్, అఫ్సర్, అక్బర్‌లు రాసిన ముప్పైరెండు తెలంగాణ ముస్లిం జీవితాల కథలున్నాయిందులో.. ఇందులో చాలా కథలు ఆయా రచయితలు రాసిన మొదటి కథలే అయినప్పటికీ జీవితాల్లోంచి వస్తువును తీసుకోవడంవల్ల అన్నీ జీవన వాఖ్యాన కథలే అయ్యాయి.. ఇవన్నీ ముస్లింనెస్ ఉన్న కతలు.. స్కైబాబా సంపాదకీయంలో చెప్పినట్టు ఈ కథలు రజాక్ సేమ్యారుచి చూపిస్తాయి.. బెల్లం షర్బత్ తాపిస్తాయి... కబాబుతా తినిపిస్తాయి.. గుండెకు గుండెను కలిసే అలాయిబలా యినిస్తాయి. పర్దా లోపలి వెతల్ని చూపుతాయి.. దిల్‌భర్ ఎడిపిస్తాయి.. అలారా గుండం కూడా తొక్కిస్తాయి..

ప్రపంచవ్యాప్తంగా క్రిస్టయన్ సామ్రాజ్యవాదంతోనూ, ఈ దేశంలో హిందుత్వ సామ్రాజ్య వాదంతోనూ రాజీలేని పోరాటం చేస్తూ తమ జీవితాల్ని, సంస్కృతిని కాపాడుకోవడానికి అష్టకష్టాలు పడుతున్న ముస్లింల బతుకుల్లోని విషాదాన్ని ఏదాపరికాలు లేకుండా ధైర్యంగా చిత్రించిన కథలవి...

ఇండియా వర్సెస్ పాకిస్తాన్ మ్యాచ్ జరిగితే యుద్ధం జరిగినంత అనుమానంగా చూసే వైనాన్ని తెలిపేకథ ఖాజారాసిన India Vs Pakistan ముస్లింలు మన సహోదరులే అయినా కిరాయికు ఇల్లు ఇవ్వడానికి నిరాకరించే వాళ్ళు చాలామందే ఉన్నారు. రహమతుల్లా రాసిన కిరాయమకాన్ కథలో ఇల్లుకోసం పడేపాట్లు వాళ్ళపై ఎంత వివక్షుందో తెలుపుతుంది.

చివరకు వాళ్ళకు ఇల్లిచ్చేది దళితులేనన్న విషయం అర్థమవుతుంది. దళితులు ముస్లింల జీవితాల్లో ఉన్న సారూప్యాన్ని, సమీపత్వాన్ని తెలిపేకథ..మతాంతర వివాహాల పేరు మీద ప్రయోజకుడైన ముస్లిం యువకున్ని పెళ్ళిచేసుకున్న బ్రాహ్మణస్త్రీ అతన్ని

బ్రాహ్మణీకరం చెందిస్తుంది. ఆ యువకుడి తల్లి అది గమనించి పడ్డ వర్ణణాతీతమైన బాదను అమ్మీజాన్ కథలో చూడవచ్చు.. ముల్కీ దూదేకులం, గుంగీథడ్కన్, చోటీబహన్, గోర్దూ, నర్గీస్ లాంటి కథలన్నీ ముస్లింల పేదరికాన్ని వెనకబాటుతనాన్ని, అధిక సంతానాన్ని, వాళ్ళ సంస్కృతిక సాంప్రదాయాల్లోని ఔన్నత్యాన్ని తెలిపే కథలు..

ముస్లింలంటే అకారణద్వేషం పెంచుకొని, వాళ్ళను ఏ కాకులను చేసే దుర్మార్గాన్నినీ కథలు ఖండిస్తాయి.. మనదేశంలో ముస్లింలపై రోజు రోజుకూ పెరుగుతున్న వివక్షను ఖండించే ఈ కథలు ముస్లింలు, బి.సి.లు, ఎస్సీఎస్టీలు ఏకమై పోరాడాల్సిన అవసరాన్ని గుర్తుతెస్తాయి.. ప్రాంతీయ దృష్టికోణంతో చూసినప్పుడు వతన్‌లోని కథలన్నీ చదివితే మన రాష్ట్రంలోని మొత్తంముస్లింల అస్తిత్వానికీ, తెలంగాణలోని ముస్లింల అస్తిత్వానికి సాంస్కృతిక పరంగా తేడా, అసమానత ఉన్నాయన్న విషయం అర్థమవుతుంది.

ముస్లీమీయతను కాపాడుకుంటూనే తమతో కలసివచ్చే సమూహాలు శక్తులతో కలిసి ముస్లింలు ముందుకు పోవాల్సిన అవసరాన్ని ఈ కథలు మనకు తెలియచేస్తాయి. ఇస్లాం సంస్కరణలకు దూరమన్న ధోరణి ముస్లింల వెనుకబాటుతనానికి ఓకారణమన్న విషయం నగ్నసత్యం.. ఏ మతమైనా సామాన్య మానవుడికి ఒరగబెట్టిందేమీ లేదు. ముస్లిం జీవితాలను అన్ని కోణాల్లోంచి ఆవిష్కరించిన ఈ కథలు మతం గూర్చి ఒక్క మాటమాట్లాడ లేదు.. ఖురాన్‌కు పవిత్ర గ్రంథంగానే భావిస్తాయి.. ముస్లింనెస్‌ను కాపాడుకుంటూనే ఏ మతమైనా మనిషికిచ్చింది, ఇచ్చేది ఏమీలేదన్న విషయంపై అవగాహన కలిగేట్టుగా ఈ కథకుల్నుంచి కథలు రావాలి. ఏదేమైనా ఈ కథల సంకలనం తెలుగులో మైనారిటీ సాహిత్యోద్యమానికి గట్టి పునాది ఏర్పరిచిందనడంలో సందేహంలేదు. భవన నిర్మాణమే తర్వాయి.

విశాలాంధ్ర సాహిత్యానుబంధం



# ప్రపంచీకరణ ప్రతిస్పందన - తెలంగాణ కథలు

ప్రపంచమెంతో వైవిధ్యపూరితమైంది. అందమైంది. ఎన్నెన్నో నాగరికతలు.. జాతులు.. సంస్కృతులు.. చరిత్రలు.. కళలు... సాహిత్యం... పోరాటాలు... గెలుపుఓటములు.. జీవితాలను గెలుచుకోవడాలు.. ఇవన్నిటినీ కాదని ఒకే మూసలో పోసినట్టుండే సమాజాన్ని, సంస్కృతిని తయారు చేస్తాననడం, ప్రపంచమంతా ఒకే గ్రామమని నీతివాక్యాలు పలుకడంలో ఎంత దుర్మార్గముంది? ఇందులో బలవంతుడైనవాడి ఆధిపత్య భావం కనపడటం లేదా? నిజానికి ఇది సాధ్యమా? ప్రజాస్వామిక యుగంలోనూ రాచరికంలోలా ఆధిపత్యదేశాల భావాలను ప్రపంచంపై రుద్దడం సరైందేనా? ఇలాగే ఉండాలి, ఈ పాటే పాడాలి.... ఇలాగే నడవాలి. ఇదే తినాలి... ఈ పంటలే పండించాలి.. ఈ గానమే చేసి మీరంతా పునీతులై పోవాలి అని చెప్పడంలో ఎంత సబబుంది? ప్రపంచీకరణ పేరు మీద జరుగుతున్నదేమిటి? ప్రజాస్వామిక వ్యవస్థలో నేను చెప్పింది మాత్రమే చేయాలని శాసిండం సరైందానా?

ఇప్పుడు అదరగొడుతున్న ప్రపంచీకరణ ప్రాచీన భారతీయ తాత్త్వికతలోంచి వచ్చిన వసుధైక కుటుంబ భావనలాంటిది కూడా కాదు. ఇందులో ఉన్న ఆధిపత్య భావనలు వసుధైక భావాన్నే తుడిచి పెట్టుకుపోయేవి. అందులోని మతవాసనల కంటే కూడా ఘోరమైనవి. గౌతమ బుద్ధుడు బహుజన హితాయ బహుజన సుఖాయ అనలేదా, అదే ప్రపంచీకరణ అని వాదించే వాళ్లు ఉన్నారు. బుద్ధుడు చెప్పిన బహుజన హితాయలో సర్వమానవ సమానత్వముంది. మానవతా పరిమళం ఉంది. ఈ ప్రపంచీకరణకు బుద్ధుడి బహుజన హితాయతో పోలిక పెట్టడం బట్టతలకూ, మోకాలికీ లంకె పెట్టినట్టే అవుతుంది. గ్లోబలైజేషన్‌తో మానవీయతను, మంచిని వెతకడం గ్లోబల్ ప్రచారమే అవుతుంది. అలాగే ప్రపంచ కార్మికులారా ఏకం కండి అనే నినాదంలోనూ దాన్ని పోల్చేవారున్నారు. మార్క్స్ చెప్పిన ప్రపంచీకరణలో పీడితజన పక్షపాతముంది. ప్రపంచవ్యాప్తంగా ఉన్న జనాల మేలును కోరే మానవీయతుంది. ఈ నినాదం ప్రపంచమంతటా ఎంతో ప్రభావం చూపింది. మార్క్స్ భావనను వ్యతిరేకించిన, ఎద్దేవా చేసిన వర్గాలవారే ఈ రోజు ప్రపంచీకరణను నెత్తికెత్తుకుంటున్నారు. హృదయానికి హత్తుకుంటున్నారు. ఇది ఎవరికి ఉపయోగపడుతుందో, ఇందులో ఎంత అమానవీయతుందో అర్థం చేసుకుంటే మంచిది.

ప్రపంచవ్యాప్తంగా 20వ శతాబ్ది జాతులన్నీ విముక్తం అయిన కాలం. పీడిత వర్గాలకు ఎంతో కొంత అనుకూలంగా నడిచిన కాలం. కొన్ని దేశాల ఆధిపత్య భావజాలం

పెరిగిపోయినా సోషలిస్టు భావాలు ప్రపంచమంతటా వ్యాపించడం వల్ల కొంతయినా పీడిత, బలహీనజాతులకు అనుకూల వాతావరణం ఏర్పడింది. నడిచిపోతున్నవాడు, సైకిల్ మీద పోతున్నవాడు, స్కూటర్ నడిపేవాడు, కార్లో పోతున్నవాళ్ల మధ్య ఘర్షణ ఏర్పడినప్పుడు వరుసగా మొదటివాళ్ల పక్షం వహించాలన్న అభిప్రాయలుండేవి. అంటే బలహీనుడి పక్షం వహించాలని చట్టాలు ఉన్నవారి చుట్టాలనేఉన్నా కొన్నయినా బలహీనవర్గాల వారికి అనుకూలమైన తీర్పులు వచ్చాయి. మరి ఇప్పుడు జరుగుతున్నదేమిటి? పై భావానికి సరిగ్గా విరుద్ధంగా జరగడం లేదా? పీడితవర్గ అనుకూల వైఖరి నుండి దుడ్డున్నవాడిదే బర్రె, ఉన్నవాడిదే రాజ్యం అనే దిశకు సమాజం చేరుకుంటుంది. ఇదంతా ఎందుకు జరుగుతుంది? ఏ శక్తుల వల్ల? ఇందుకు కారణం ప్రపంచీకరణం పేరు మీద ఆధిపత్య జాతుల, ఆధిపత్య దేశాల భావజాలాన్ని నెత్తికెక్కించుకోవడం.. ఇవన్నీ చూస్తూ కూడా ప్రపంచీకరణ ముద్దు భలే తీపిగా ఉంటుందని అనుకుంటానంటే చెప్పవలసిందేముంది? ఈ తీపి చక్కెర వ్యాధి సోకిన వ్యక్తుల శరీరాల్లోని తీపిలాంటిదేనన్న విషయాన్ని గమనించాలి. తెలిసో తెలియకో కొందరు సామాన్యులు, మేధావులమని చెప్పుకునేవాళ్లు ప్రపంచీకరణ వల్ల లాభాలున్నాయని వాదిస్తున్నారు. దాన్ని అనుసరించకపోవడం అభివృద్ధి నిరోధకమూ అవుతుందనేవాళ్లూ వున్నారు. ఇది అమాయకత్వమైనా అయి వుండాలి. అతి తెలివైనా అయుండాలి.

ఇంతకీ గ్లోబలైజేషన్ అంటే ఏమిటి? ఇది ఒక విధంగా గ్లోబలి.. అంటే గ్లోబును బలితీసుకోవడం లాంటిదే. పీడిత కులాలు, జాతులు, వర్గాల ప్రయోజనాలపై చావుదెబ్బ తీయడమే. ఈ విషయాన్ని తెలంగాణ కథకులు సరిగ్గానే గుర్తించారు. ప్రపంచీకరణ హోరుగాలి ప్రారంభం కాకముందే జాగ్రత్త పడ్డారు. అనేక కారణాల వల్ల వృత్తిపనులు నశించి ఆదాయమార్గాలు ప్రశ్నార్థకం కావడం గురించి, మన సంస్కృతి, వృత్తులు, ప్రాంతీయత, ప్రజల భాషను రక్షించుకోవాల్సిన అవసరం గురించి హెచ్చరిస్తూ ప్రపంచీకరణ హోరుగాలి కంటే ముందుగానే కథలు రాశారు. అవ్వతోడు గిది తెలంగాణ లాంటి కతలు, వలసల గురించి కథలు, ఊళ్లొదిలి సింగరేణిగనులకు వెళ్ళిపోవడం లాంటి విషయాల గూర్చి రాసారు. గ్లోబలైజేషన్ కథలో ఓ పాత్ర ప్రపంచీకరణ అంటే గ్లోబును బలితీసుకోవడమే అంటాడు. కొందరు దీన్ని సమర్థిస్తున్నట్టు కనబడటానికి వెనుకున్న కారణాలనిలా వివరిస్తాడు. గొర్రెను బలి ఇచ్చే ముందు నోట్లో బెల్లంపానకం పోస్తారు. అది ఊపిరాడకనో, నోటి నిండుగా పోయడంవల్లనో తల విదిలిస్తుంది. ఒక్కసారి బెల్లం పానకంతో తల ఊపకుంటే రెండు మూడు సార్లు పోస్తారు. అది తల ఊపిందంటే జడత ఇచ్చిందన్నమాట.



జడత ఇవ్వడమంటే తనను బలిచేయమని అంగీకరించినట్టేనని భావిస్తారు. మరుక్షణం గొర్రెతల మొండెం వేరవుతాయి. అంటే ఆ గొర్రె అనుమతితోనే దాన్ని బలిచేసారన్న మాట. ఆ మూగజీవికి తనను బలిచేయడానికే ఆ తతంగమని తెలియనట్టే, ఆ బెల్లం పానకంలోని చేదు తెలియనట్టే గ్లోబలైజేషన్‌ను సమర్థించేవాళ్ళకూ తెలియదు. పై పై మెరుగులు చూసి సమర్థిస్తున్నట్టు కనబడేవాళ్ళముఖంలోని వెలుగు బెల్లంపానకం తాగిన గొర్రె ముఖంలోని వెలుగు లాంటిదే.

ఇంతకీ ఈ ప్రపంచీకరణ భూతం, ఈ మాయ ఎప్పుడు మొదలైంది. దీనికి మూలాలు ఎక్కడున్నాయి? దేశంలోంచి బౌద్ధం తుడిచిపెట్టుకు పోయినప్పుడే ఇలాంటి భావాలకు అంకురార్పణ ఏర్పడిందంటే అతిశయోక్తిగా అనిపించవచ్చు. మార్క్స్ చెప్పిన ప్రపంచ కార్మికులారా ఏకంకండి అనే భావనకు భంగం కలుగడం ప్రారంభమైనప్పుడే దీనికి అంకురార్పణ జరిగిందంటే సరిగ్గానే ఉంటుందేమో - సోవియట్ పతనం తరవాత పాశ్చాత్యదేశాలకు అడ్డుతొలగి ఏక దృవ ప్రపంచం ఏర్పడింది. విలువలు భగ్నమయ్యాయి. ప్రపంచమంతటా అమానవీయత అలుముకోవడం ప్రారంభమైంది. బలమున్నోడిదే రాజ్యం అన్న భావన పెరిగింది. దీన మానవ పక్షం వహించే బలమైన వ్యవస్థకు బీటలు వారింది. ఆ సమయంలో ప్రపంచీరణ భావజాలం బలం పుంజుకోసాగింది. గమ్మత్తుగా, వింతగా ప్రపంచకార్మిక భావనను ఎవరైతే వ్యతిరేకించారో వాళ్ళే ప్రపంచీకరణను సమర్థించసాగారు. హృదయానికి హత్తుకున్నారు. ఇరవైయవ శతాబ్దిలో ఎంతో కొంత పీడిత జన అనుకూలవైఖరి ఏర్పడటం వీళ్ళకు నచ్చలేదు. మనదేశంలో అందరికంటె ముందు ఉన్నత వర్గాలవారు, వర్ణాలవారు దీన్ని బిగియారా కౌగలించుకొని ఆహ్వానించారు. తెలంగాణలోనూ అదే జరుగుతుంది. తెలిసీ తెలియక దొరలు, అగ్రవర్ణ కుటుంబాలవాళ్ళు సంపన్నులు దీన్ని సమర్థిస్తున్నారు. ప్రపంచీకరణాన్ని సమర్థించడమంటే వైవిధ్యం వద్దు మూస విధానమే ముద్దు. ప్రజాస్వామ్యంవద్దు ఆధిపత్యమే ముద్దు అని వాటిని అక్కున చేర్చుకుంటున్నట్టే. మట్టి వాసనంచేంటో ఎరుగని వాళ్ళు దీన్ని సమర్థించడం గమనించదగ్గ విషయం. వీళ్ళకు ఆస్తులతో తప్ప ఊరుతో సంబంధం ఉండదు. ప్రేమా ఉండదు. మట్టిని ప్రేమించడం మట్టి మనుషులకే సాధ్యమవుతుంది. ఉన్నత వర్గాలవాళ్ళు దేశాన్ని ఊరును వదిలిపెట్టడానికి పెద్దగా వెనుకాడరు. కాని రైతులు మట్టి మనుషులు అలా కాదు. ఇలాంటి మట్టి మనుషుల గూర్చి తమ మట్టిపై గ్రామాలపై అచంచలమైన ప్రేమను చిత్రిస్తూ తెలంగాణ నుంచి కాలువ మల్లయ్య, అల్లం రాజయ్యలాంటి రచయితలు మా కథలు, కాలువ మల్లయ్య కథలు, భూమి సృష్టికర్తలులాంటి కథా సంపదలు

వెలువరించారు. ఇవి తెలంగాణ గ్రామాలను, ప్రాంతీయతను అక్కున చేర్చుకున్న కథలు. రెక్కల కష్టం చేసుకునేవాడికి ఏఊరైనా ఏపట్నమైనా ఒక్కటేనన్న భావం ఉన్నా ఊరుదేశాన్ని పట్టుకొనుండేది మట్టిమనుషులే. ఆదిమ భారతీయులైన దళిత బహుజనులే. వీళ్ళకు కన్న మట్టిపై ఉన్న ప్రేమను చిత్రించే కథలు ఈ గ్లోబల్‌గాలి లేక ముందు నుంచే తెలంగాణం నుంచి వచ్చాయి.

నూతన పారిశ్రామిక ఆర్థిక విధానాలను ఓ పార్టీ ప్రయోగాత్మకంగా ప్రవేశపెడితే మరో పార్టీ. సమధికోత్సాహంతో ముందుకు తీసుకెళ్తుంది. దానికి పొడగింపుగానే ప్రపంచీకరణం రూపుదిద్దుకుంది. గ్లోబల్ ప్రభావం తెలంగాణకు ఆత్మహత్యలను మోసుకొచ్చింది. పత్తి, చేనేత, విద్యార్థులు, మామూలు రైతులు కూడా పరిస్థితులను తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ ఆర్థిక విధానాల ప్రపంచీకరణ మాయ ప్రభావం కార్మికుల జన్మహక్కయిన సమ్మెను నిషేధించడం వరకూ చేరుకుంది. మనదేశంలోనే కాకుండా ప్రపంచవ్యాప్తంగా ఆధిపత్య దేశాల ప్రభావం పెరిగి సంప్రదాయ శక్తులు బలపడి సమాజం వెనుకకు నడుస్తున్నట్టుగా కనపడుతుంది. విశ్రాంతి వర్గాల సంస్కృతిని ఉన్నతీకరించే ప్రపంచీకరణ మానవాంశను తుత్తునియలు చేసే దిశగా కొనసాగుతుంది. అందుకే ఇదివరకెప్పుడూ లేని దుఃఖం, ఒత్తిడి సమాజంలో పెరిగింది.

ప్రపంచీకరణం మోసుకొచ్చిన విషయాలనన్నిటినీ పట్టించుకున్నారు తెలంగాణ కథకులు. తెలంగాణ నుంచి వచ్చిన కథలకు, ప్రపంచీకరణ గురించి వచ్చిన కథల విషయంలో కూడా ఇతర ప్రాంత కథకులకు స్పష్టమైన తేడా ఉంది. తెలంగాణ భౌగోళిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ నేపథ్యాల్లోంచి ప్రపంచీకరణ ప్రభావాల్ని చూపిందన్న విషయంలోనూ స్పష్టమైన తేడాలను గమనించవచ్చు. ప్రపంచీకరణ కొందరికి రంగురంగుల జీవితం, ఇరవై నాలుగు గంటల ఎలక్ట్రానిక్ మీడియా ఆనందహేళ, నీళ్లు కూడా అమ్ముకోవడానికి అవకాశమిచ్చిన వ్యాపార ప్రక్రియగా కొందరికి ఆమోదయోగ్యం కూడా కావచ్చు. ఇది మన ఇండ్లలోకి ప్రవేశించింది అంటూనే ఇందులోని అమానవీయతను వైట్ కాలర్డ్‌గా సమర్థించేవాళ్లూ ఉన్నారు. తెలంగాణ సామాజిక పరిస్థితుల్లో ఈ అమానవీయత తెలంగాణ ప్రాంత దోపిడీకి ద్వారాలను తెరిచింది. హైదరాబాద్ అన్ని బహుళజాతి సంస్థలకు దోపిడీ కేంద్రంగా మారడం, దేశదేశాలకు సంబంధించిన వాళ్లు ఈ కేంద్రాల్ని ఉపయోగించుకోవడం చేస్తున్నారు. ఎన్నో విలువైన భూములు, క్షేత్రాలు ఆ ప్రాంతంవాళ్ల చేతుల్నుండి దూరమవుతున్నాయి. తెలంగాణ భాష, ప్రాంతీయత, సంస్కృతి విధ్వంసం



పేరు మీద జరుగుతున్న అనేక రకాల దోపిడీ పీడనలను చిత్రిస్తూ, ప్రపంచీకరణ వల్ల ఛిద్రమైన బతుకులను అక్షరబద్ధం చేస్తూ బలమైన కథలే వచ్చాయి. ఇలాంటి కథల్లో ముక్కోటి రతనాల వీణ, సంకరవిత్తులు, పొగగొట్టంలాంటి కతలు పేర్కొనదగ్గవి.

గ్రామాల్లోకీ ప్రపంచీకరణ భావజాలం ప్రవేశించడం, బస్టాండుల వద్ద నీళ్ల పాకెట్లు అమ్మడం మొదలుకొని చల్ల అంబలిలాంటి చల్లని ప్రకృతిసిద్ధ పానీయాల స్థానంలో శీతల పానీయాలు రావడం, కొన్ని వృత్తులు ఘోరాతిఘోరంగా పతనం కావడం లాంటి విషయాలను తమ కథల్లో చిత్రించారు. ఇవి ప్రపంచీకరణ ప్రభావం వల్లనే జరుగుతున్నాయన్న అవగాహన ఉండి కావచ్చు, తాము చూస్తున్న అనుభవిస్తున్న జీవితాలకు అక్షరరూపం ఇవ్వడంలో భాగంగా కావచ్చు తెలంగాణ కథకులు ఈ విషయాలన్నింటిపై కథలు రాశారు. అందులో భాగంగానే పత్తిరైతుల చేనేత కార్మికుల ఆత్మహత్యలపై వచ్చిన కథలున్నాయి. తమ పొలంలో తామనుకున్న పంటలు పండించుకోవద్దు. తమ నీళ్లు తాము వాడుకోవద్దు. తమకిష్టమైన కూరగాయలు పండించుకోవద్దు. ఏ పనయినా వాళ్లెవరో శాసించినట్టే చేయాలి. ఈ దుర్మార్గాన్ని ఖండిస్తూ, అమానవీయత విశృంఖల విహారం చేస్తూ మన బతుకులను బండల పాలు చేస్తున్న వైనాన్ని తమ కథల్లో చిత్రించారు. జూకంటి జగన్నాథం నారుమడి, నేను రాసిన పోత్రవుతు, పెద్దింటి అశోక్‌కుమార్ వలసలు కథల్లో ఈ విషయాలను స్పష్టంగా గమనించవచ్చు. పోత్రవుతు కాళ్లకు తగిలితే రైతు విలవిలా కొట్టుకుంటాడు. కాలివేలికి తగిలిన గాయాన్ని, బాధను మరిచిపోవడానికి రైతు నల్లారంలాంటి సహజసిద్ధమైన పసరును వాడుతారు. కాని రైతు గుండెకయిన గాయాల్ని, వృత్తిపనుల మీద పడుతున్న దెబ్బల నుండి తప్పించుకోవడానికి రైతేం చేయాలి? తమ భూముల్లో, విదేశాల్లోలా నాణ్యమైన పంటలు పండించాలని ఆదేశించే ప్రభువులు విదేశాల్లోలా భూములు, నీటి వసతులు, సబ్సిడీలు కల్పించడం లేదు కదా అని ప్రశ్నిస్తాడు రైతు. మరి అక్కడిలాంటి పంటలెలా పండుతాయని, వాళ్లనే మనలాంటి పంటలు పండించమని అడుగుతాడు. రైతు మాటలు షాక్ తినేట్టు చేస్తాయి అధికారులను. మన నారుమళ్లు, నీటి పారుదల సౌకర్యాలలాంటివన్నీ నాశనం కావడం వెనుకున్న కుట్రలేమిటి? ఇదీ పోత్రవుతు కథలో అంశం.

ఊరుకు వలసలుగా వచ్చే దేశద్రిమ్మరజాతి రాజన్నలవాళ్లు.. ఇదివరకటిలా ఆదరించేవాళ్లు లేక. సంబంధాలు మృగ్యమై తమకు అక్కడ స్థానం దొరకడం కష్టమే అని తెలుసుకుని తిరిగిపోవడం అంశంగా గల కథ వలసపక్షి. కోస్తా ప్రాంతంలో లేదా అభివృద్ధి చెందిందని చెప్పబడే ప్రాంతంలో ప్రపంచీకరణను ఎప్పుడో

ఆహ్వానించారు. తెలంగాణలో పాలని అమ్ముకోవడం ఒకప్పుడు నేరాలన్నట్టే. కోస్తాలో వ్యాపారపంటలను పండించి వ్యవసాయాన్ని వ్యాపారంగా మార్చిన చాలాకాలం తర్వాత తెలంగాణలో వ్యాపారపంటల సాగు మొదలైంది. అంతవరకు తెలంగాణలో వ్యవసాయం చేయడమనేది లాభాల కొరకు కాక బతకడం కొరకు, సామాజిక బాధ్యత కొరకు అనే భావించేవారు. వ్యాపార పంటల ప్రభావమే కోస్తాలో పొగాకురైతుల ఆత్మహత్యలకు, చేపల రైతుల ఆత్మహత్యలకు దారితీస్తే తెలంగాణ పత్తిరైతుల, రైతుల ఆత్మహత్యలకు దారి తీసింది. వీటివల్ల తెలంగాణలో వ్యవసాయాలు నానా బీభత్సానికి గురయిన అంశాల గురించి కాలువ మల్లయ్య, పెద్దింటి అశోక్‌కుమార్‌లాంటివాళ్లు తెలంగాణ ప్రాంతీయ ముద్రగల కథలనెన్నింటినో రాశారు. ఊటబాయి కథల సంపుటి, భూమి స్వప్నం, భస్మాసుర హస్తం, మహదేవుడికల లాంటి కథలను చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

మనదేశంలో ఆనేక చోట్ల ఆధునీకరణ పేరు మీద ఓ దృక్పథం (Vision) అంటూ లేని అమానవీయత, అభివృద్ధి పేరు మీద జరుగుతున్న విధ్వంసం కావచ్చు. పారిశ్రామికీకరణ పేరు మీద జరిగే సహజవనరుల విధ్వంసం కావచ్చు. ఇటీవలి కాలంలో మన వంటింటి వరకూ ప్రవేశించి మన బతుకులను బండలపాలు చేస్తున్న విధ్వంసకర ప్రపంచీకరణ కావచ్చు. మన బతుకులు ఎంత విధ్వంసానికి గురవుతున్నాయో చెబుతున్నాయి. ఈ విధ్వంసాల స్వరూప స్వభావాలేమిటో ఆజంజాహి మిల్లు కార్మికులను అడిగితే తెలుస్తుంది. హైదరాబాద్ పరిశ్రమల్లో పని చేసి ఉద్యోగాలు కోల్పోయి రోడ్ల మీద తిరుగుతున్న కార్మికులను చూస్తే తెలుస్తుంది. రామగుండం పారిశ్రామిక ప్రాంతంలో ఉద్యోగాలు కోల్పోయి విలవిలలాడుతున్న వేలాది మంది కార్మికుల ముఖాల్లోని దైన్యాలను చూస్తే తెలుస్తుంది. నూతన పారిశ్రామిక ఆర్థిక విధానాలు, ప్రపంచ బ్యాంకు అప్పులు, పరిశ్రమల మూసివేత వేలాది మంది బతుకుల్లో కల్లోలం లేపడం వెనకుంది ఈ ప్రపంచీకరణే. పులుగు శ్రీనివాస్ రాసిన కథల్లో, ఈ రచయిత రాసిన ఉరితాడు కథలో, తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన ఉరి కథలో, ఆడెపు లక్ష్మీపతి రాసిన జీవన్మృతుడు కథలో ఈ విధ్వంసదృశ్యాల నగ్నస్వరూపాన్ని గమనించవచ్చు. గొరుసు జగదీశ్వరరెడ్డి రాసిన బతుకుగోస మన బతుకులేమిటో మనకు తెలిసేట్టే చేస్తూ మన కళ్లు తెరిపిస్తుంది. మా బతుకులు దుర్భరమవుతున్నాయి. ఈ విద్యుత్ చార్జీలను మేం భరించలేం.. కరెంటు చార్జీలు తగ్గించాలి అని ఆందోళనకు దిగినందుకు తుపాకీతో సమాధానం ఇచ్చిందీ ప్రపంచీకరణే. నడుస్తున్న కర్మాగారాలను మూసివేతకు గురిచేస్తే ఎంతో మంది కార్మికులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ?



చనిపోయారు. యవ్వనమంతా కర్మాగారాలకే అంకితం చేసి ఎటూకాని వయసులో నీకిక ఉద్యోగం లేదని తీసివేస్తే విలవిలా కొట్టుకున్నారు. ఇలా బతుకు దుర్భరమై చనిపోయిన కార్మికుని ఆత్మఘోషే బతుకుగోసలో కథాంశం. కరెంటు పోరాటంలో పాల్గొని మృతి చెందిన తన కొడుకు గురించి వలవలా వలపోస్తుంది తల్లి. ఎన్నో ఆశలతో, ఆశయాలతో కార్మికుడిగా చేరి బతుకును జీవన్మృతంగా మార్చుకొని, బతుకీడుస్తున్న కార్మికుడి అంతర్మథనమే జీవన్మృతుడు కథలోని అంశం. సింగరేణిగని కార్మికుల దుర్భరమైన బతుకులు, మేనేజ్‌మెంట్‌వారు చాప కింద నీరులా ప్రవేశపెడుతున్న ఆర్థిక విధానాలు, లాభాల వేట కార్మికుల గొంతుకు ఎలా ఉరి బిగుస్తోందో తెలిపే కథ ఉరి. ఫెర్టిలైజర్ కార్పొరేషన్ పేరుతో రామగుండంలో ఏర్పడిన ఎరువుల కర్మాగారం మూసివేతకు గురవుతుంటే తన రక్తమాంసాలు, యవ్వనమంతా ఫ్యాక్టరీకే ధారబోసిన కార్మికుడు ఉరిబోసుకొని చావడం వెనుకున్న విషాదాన్ని తెలిపే కథ ఉరితాడు. కార్మికవర్గంలో ఏర్పడిన సంక్షోభం వల్ల ఒకప్పుడు కూలికోసం కూటికోసం ఊళ్లొదిలి కర్మాగారాల్లో బతుకుదామని వచ్చిన కార్మికులు ఫ్యాక్టరీల మూసివేతతో మళ్లీ తల్లిఒడి లాంటి గ్రామాల్లోకి తరలివెళ్లాల్సి వచ్చిన అవసరాన్ని కంటతడి పెట్టించేలా చిత్రించిన కథ మళ్లీ తల్లి ఒడిలోకి..

గనుల తవ్వకం పేరు మీద, పారిశ్రామికీకరణ పేరు మీద బొగ్గు నిల్వలను, ఖనిజాలనూ, ఇతర ముడి పదార్థాలను తోడుకుంటూపోతారు. కొన్నేళ్లలో ఇంధన వనరులు పూర్తవుతాయి. మరి ఆ తర్వాత? ఈ భూములన్నీ చవిటిపర్రెలవుతాయి. ఏ పంట పండించటానికీ పనికి రావు. మరి భవిష్యత్తు తరాల వాళ్లెలా బతకాలి? ఓ దిశానిర్దేశం, ఓ పద్ధతంటూ లేని పారిశ్రామికీకరణ, వనరుల తోడివేత వల్ల ఎంతో మంది భవిష్యత్తరాలవారు శాశ్వత కష్టాల్లోకి కూరుకుపోతున్నారో తెలియడం లేదా? ప్రకృతికి విరుద్ధంగా పారిశ్రామికీకరణ పేరు మీద జరుగుతున్న విధ్వంస దృశ్యాలు రేపు మానవాళి మనుగడకు, బతుకు తెరువును ప్రశ్నార్థం చేయడం లేదా? ఇదెక్కడికి దారి తీస్తుంది? పారిశ్రామికీకరణ పేరు మీద ఈ వనరుల తోడివేత లేకముందు కూడా వేలు, లక్షలు, కోట్ల సంవత్సరాలుగా ఈ సృష్టి ఉంది. జీవకోటి ఉంది. కాని ఈ విధ్వంసం లేదు. ఈ రెండు వందలేండ్లలో జరిగిన విధ్వంసం అభివృద్ధి పేరు మీద జరుగుతున్న దానికన్నా ఎన్నో రెట్లెక్కువంటే ఆశ్చర్యమే కలుగుతుంది కాని అది వాస్తవం. ఉన్నదున్నట్టుగా ఏ చలనం లేకుండా ఉండాలని కోరుకోవడం లేదు గాని మనిషి మనిషిగా ఉండాలంటే జీవరాశులు ఈ నేలపై శాశ్వతంగా ఉండాలంటే ఈ విధ్వంసం ఆగాలి. మనం స్వప్నాలు కనాలి. ఈ స్వప్నాలు నిజం కావాలి. ఆ స్వప్నం

మానవ స్వప్నం కథలోని అంశం. భూమాత, సంపదల సృష్టికర్తయైన రైతు ఆగ్రహం చెందితే జరిగే పరిణామాలేమిటో ఈ కథలో వివరించడం జరిగింది. ఎంత కొమ్ములు తిరిగిన మనిషయినా, రాజులకు అధినేతయినా బతికేది అన్నం, గాలి, నీటితోనే.. అందుకే లక్షాధికారయినా లవణమన్నమే కాని వెండి బంగారంబు కుడువలేదు అన్నారు. మనిషి కనీసావసరాలను తీర్చేది, భూగోళంపై మనిషి, జీవరాశుల మనుగడకు శాశ్వతం చేయడానికి అవసరమయ్యే అభివృద్ధే నిజమైన అభివృద్ధి అని చెప్పే కథే మానవస్వప్నం.

విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ప్రచురించిన గ్లోబలైజేషన్ కథల సంకలనానికి విరూపం పేరుతో కేతు విశ్వనాథరెడ్డిగారు రాసిన కథ పేర్కొనదగింది. ఫ్యాక్టరీల వల్ల పల్లెజీవితంలో, బతుకుల్లో, ప్రకృతిలో జరిగే విధ్వంసాన్ని అద్భుతంగా పేర్కొన్నాడిందులో. ఈ పరిస్థితి తెలంగాణలోనూ, రాయలసీమలోనూ గమనించవచ్చు. నిజంగా ఇదెంత దుర్మార్గమో గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. తెలంగాణ, రాయలసీమల్లో ప్రకృతిసిద్ధ వనరులు, ఖనిజాలు, బొగ్గు నిల్వలు, అటవీసంపద విరివిగానే ఉన్నాయి. అయినా ఈ ప్రాంతాలు వెనుకబడి ఎందుకున్నట్టు? పరిశ్రమలుండేది, వాటి కాలుష్యాన్ని భరిస్తూ, ఆటుపోట్లకు గురయ్యేది ఒక చోటయితే ఆ ఫలాలను దక్కించుకునేది మాత్రం వేరే ప్రాంతం వాళ్లు.. వెనుకబడిన ప్రాంతాల్లో పరిశ్రమలంటే తెలివిగల ప్రాంతంవాళ్లు అభివృద్ధి చెందుతారు. బీహార్‌లో ఉన్న పరిశ్రమల్లో ఉన్నత స్థానాల్లో అధికారులుగా ఉన్నది చాలామంది బెంగాలీలే. ప్రతి చోటా ఈ వివక్ష కొనసాగుతూనే ఉంది. ప్రకృతి సహజమైన వనరులను, పంటభూములను, నీటిపారుదల సౌకర్యాలను అభివృద్ధి చెందిన ప్రాంతంవారు లేదా తెలివిగలవారు అలాగే ఉంచుకుంటారు. కాని పరిశ్రమల పేరు మీద వెనుకబడిన ప్రాంతాల్లోని వనరులన్నీ తోడుకొని వాటిని శాశ్వతంగా వెనుకబడిన ప్రాంతాల్లోని వనరులన్నీ తోడుకొని వాటిని శాశ్వతంగా వెనకబడిన ప్రాంతాలుగా మారుస్తారు. ఇదీ ప్రపంచీకరణ మాయలోని ఓ కుట్రలాంటిదే. మరో యాభయి ఏళ్ల తర్వాత రాయలసీమ, తెలంగాణ ప్రాంతాల పరిస్థితి ఏమిటి? ఈ ప్రాంతాలకు అభివృద్ధి చెందిందని చెప్పబడుతున్న కోస్తా ప్రాంతానికి మధ్యగల అంతరం మరింత ఘోరంగా పెరుగుతుంది. ఇందుకు కారణం ప్రకృతి విధ్వంసం. ప్రకృతి సహజమైన నీరు, నీటివసతి సౌకర్యాలను తాము ఉంచుకోవడం. పరిశ్రమల పేరు మీద బొగ్గు నిల్వలు, ఇతర ఖనిజాలను తోడివేసి వాటిని పనికిరాని భూములుగా మార్చడం.. ఇదీ ప్రపంచీకరణ విధ్వంసాల్లో భాగమే. ఈ అంశాలను స్పృశిస్తూ వచ్చిన కథలే నిరుడు కురిసిన హిమ సమూహములు (కాలువ మల్లయ్య), సంకర విత్తులు (పులుగు



శ్రీనివాస్), ఊరికిపోదాం భూదేవి (గీతాంజలి), కాగుబొత్త (పెద్దింటి అశోక్‌కుమార్).. ఇంకా అనేక కథలున్నాయి. ప్రకృతిసిద్ధమైన వాగులు, కాలువలు, చెర్లు, కుంటలు, చెట్లుచేమలు, పంటభూములు, చేండ్లుచెలుకలతో పచ్చదనంతో విలసిల్లేది రామగుండం ప్రాంతం. బొగ్గుగనులు పడిన తర్వాత కొందరికి తాత్కాలికంగా ఉపాధి లభించినా ప్రకృతి స్వభావాన్ని కోల్పోయి శాశ్వతంగా పంటలకు దూరం కావడంలోని విషాదాన్ని చిత్రించిన కథ నిరుడు కురిసిన హిమ సమూహములు. ఇప్పుడిక్కడ చెట్లు మాయమై ఎక్కడ చూసినా బొగ్గు కుప్పలు.. మట్టిగుట్టలు, బొగ్గుధూళి, పొగ, నాలె బొయ్యారాలు దర్శనమిస్తాయి. ఒకప్పుడు మంచి వర్షపాతానికి నెలవైన స్థలం ఇప్పుడు వర్షాభావంతో భూగర్భ జలాల లేమితో కొట్టుమిట్టాడుతుంది. గోదావరి తీర గ్రామాల్లోనూ ఒక్క చుక్క భూగర్భ జలం లేకపోవడం విషాదకరమైందే.

అభివృద్ధి చెందిన ప్రాంతంవాళ్లు అభివృద్ధి పేరు మీద వెనుకబడిన ప్రాంతం వాళ్ల సంస్కృతి సంప్రదాయాల మీద, ఆత్మగౌరవం మీద జరిపే దాడిని ఆర్ద్రంగా చిత్రించిన కథ సంకరవిత్తులు. పైకి రావడం పేరుతో, జీవితాలను సుఖవంతంగా మార్చుకునే క్రమంలో అందుకోసం బాగా సంపాదించాలన్న కాంక్షతో జీవితాలను నూటికి నూరు పాల్లు యంత్రాలుగా, డబ్బు సంపాదించే మరలుగా మలుచుకునే దుష్ట సంస్కృతిని కళ్లకు కట్టించే కత ఊరుకు పోదాం భూదేవీ..? ఇల్లు, స్కూటర్, టీవీ, ఫ్రిజ్, సెల్‌ఫోన్‌లను కొనుక్కొని సౌఖ్యాలను పెంచుకుందామన్న పేరుతో భార్యను సంపాదించమని ఒత్తిడికి గురి చేయడంలోని దుర్మార్గం ఈ కథలో చూడవచ్చు. విపరీతమైన ఒత్తిడిపాలైన ఆ స్త్రీ కలలోనైనా భర్తపై తిరుగుబాటు చేసి మనశ్శాంతి పొందుతుంది. పట్టణీకరణ, తాత్కాలిక సుఖాల పేరు మీద పల్లెలకు దూరమై సహజసిద్ధమైన పల్లె బతుకులోని మాధుర్యాన్ని వెతుక్కునే క్రమాన్ని మన హృదయాలు కదిలేట్టు చిత్రించిన రచయిత్రి అభినందనీయురాలు. ఊరంటే ఇల్లూ పొలమేనాయె. మనుషులు కారు. మన చుట్టాలందరూ ఆడనే ఉండవట్రి ఇరవై ఏళ్లాయె. మీ అయ్య మన పొలం కాడ గట్టు మీద సల్లగ నిద్రపోవట్టె.. మీ అవ్వ ఎట్లుందో ఏమో..! ఓసారి చూసొద్దాం పాయె. అన్న ఎల్లమ్మ మాటలు మనల్ని ఊరు దిక్కు కదిలేట్టు చేస్తాయి.

"మన్ను నుంచి.. మన్ను నుంచి ఎదిగిన మానవ మనుగడ నుంచి పచ్చికూరల నుండి వండుకతినే కాలం దాకా కరిగిన వందల సంవత్సరాల్లోంచి. తరతరానికీ పెరిగిన చేతివాటం నైపుణ్యం నుంచి.. కుమ్మరి లింగం వాముల నుంచి.." అంటుంది మట్టితో చేయబడిన కాగుబొత్త. మట్టి కొట్టెల్లో బియ్యం దాచుకునేవారు. మట్టిగోళాల్లో నీళ్లు తోడుకునేవారు. మట్టి కుండల్లో అన్నం వండుకునేవారు. మట్టి

వస్తువులన్నీ ఇప్పుడు మూలకు పడ్డాయి. ఈ కథ చదువుతుంటే హృదయం ద్రవిస్తుంది. దాదాపు దశాబ్దంనర క్రితం గ్రామాల్లోని వృత్తులు నశించి పోవడం గురించి ఒక్కో వృత్తికి ఒక్కో కథ రాయడం జరగింది. అవ్వతోడు గిది తెలంగాణ పేరుతో వచ్చిన ఈ కథలు గ్రామాల్లోని వృత్తులు సంక్షోభానికి గురి కావడం, ప్రత్యామ్నాం లేక తల్లడిల్లిపోవడం వెనుకున్న విషాదాన్ని చిత్రించాయి. వీటికి కొనసాగిందపే అశోక్‌కుమార్ వృత్తులపై రాస్తున్న కొన్ని కథలు. తన మీద ఎన్నో ఆశలు పెట్టుకున్న తండ్రి ఆశలను తీర్చలేక కొడుకు తన సమస్యలకు పరిష్కారం మట్టివాసనలోనే ఉందని చెప్పే కథ పంజాల జగన్నాథం రాసిన మట్టివాసనలు.. పిడికెడు మెతుకులనిచ్చే అవసరాన్ని తీర్చలేని వాళ్లు ఉత్పత్తితో సంబంధం లేని కంప్యూటర్లను తయారు చేసే దుర్మార్గాన్ని ప్రశ్నించే మంచి కథ ఇది. జాతశ్రీ రాసిన పప్పుసుద్ద కథలోని వ్యక్తి పైకి కనబడుతున్నట్టు ముద్దపప్పు లాంటి వాడు కాడు. చైతన్యవంతుడే.. ఆతడు ప్రపంచీకరణాన్ని ఎంత బాగా అర్థం చేసుకున్నాడో అందులో కొట్టుమిట్టాడే దౌర్భాగ్యాన్ని ఎలా వ్యతిరేకిస్తాడో ఈ వాక్యాలు చదివితే అర్థమవుతుంది – "ప్రపంచీకరణ పుణ్యమే ఇది. మమతానురాగాలూ, మనస్సంబంధాలూ, సాంప్రదాయాలూ.. అన్నీ.. మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా పరిణతి చెందిన పర్యవసానం.. ఇవాళ పుట్టుక మొదలు చావు వరకూ – మావనజీవితానికి సంబంధించిన ప్రతి అంశాన్నీ, ఆలోచననూ ఆర్థికమే నియంత్రిస్తుంది. ఈస్ట్‌మన్ కలర్ కలల బతుకు.. క్షణికానందాల కేరింతల జీవితం.. అందుకు అవసరమైంది డబ్బు.. అంతే.. వేరేమీ కనబడటం లేదు.. ఆడామగా భేదం లేదు.. నైతికం, అనైతికం అనే ప్రశ్న కూడా ఉత్పన్నం కావడం లేదు.."ప్రపంచీకరణ బండారాన్ని బట్టబయలు చేసే అద్భుత వాక్యాలివి.

తనకు అలవాటు లేని బతుకు మోజులో పడి వ్యాపారం చేద్దామన్న ఆతురతతో టేలా పెట్టుకొని బతుకు ప్రారంభిస్తాడో సగటు జీవి... మునిసిపల్ టాక్స్, రోడ్డు విశాలం చెయడం లాంటి గొడవల్లో పడి ఉన్న టేలాను కోల్పోయి ఇబ్బందుల్లో పడటం అంశంగా గల కథ బి.వి.యన్.స్వామి రాసిన బల్లిపాతర. తన ప్రమేయం లేకుండానే అతని బతుకు బల్లిపాతర బతుకై పోవడం ఇందులో అంశం. మల్టీ నేషనల్ కంపెనీలవాళ్లు, రాజకీయవాదులు, బలమున్న వాళ్లు దేశీయ కంపెనీలను గద్ద తన్నుకుపోయినట్టు తన్నుకు పోవడం అంశంగా గల కథ దార్ల రామచంద్ర రాసిన గద్దొచ్చె – కోడిపిల్ల.. జెనెటిక్స్ ఫుడ్ తయారీ పేరుతో తాము తాము కాకుండా విదేశీయుల చేతుల్లో కీలు బొమ్మలుగా మారే క్రమాన్ని తెలిపే కథ పెద్దింటి అశోక్‌కుమార్ కథ కీలుబొమ్మలులో చూడవచ్చు. విదేశీయతను ఎదిరిస్తే చేతులకు



బేడీలు పడక తప్పని పరిస్థితులున్నాయంటాడు రచయిత. "స్వాతంత్ర్యం వచ్చేనాటికి షిప్ టు మౌత్‌గా విదేశీ ధాన్యం కొరకు ఎదురు చూసేవాళ్లం. హరిత విప్లవం ద్వారా కోట్ల టన్నుల దిగుబడి సాధించాం. ప్రపంచ వాణిజ్య సంస్థల గుత్తాధిపత్యానికి ద్వారాలు తెరిచి అదీ పోగొట్టుకుంటున్నాం.. వాణిజ్య పంటలతో తిండిగింజలను, కార్పోరేట్ వ్యవసాయంతో స్వంత భూములపై హక్కులను పోగొట్టుకున్నాం. రేపు జెనెటిక్ ఫుడ్స్ తర్వాత శరీరంలోని భాగాలపై హక్కులను, బేబీ డిజైనింగ్ తర్వాత పుట్టబోయే బిడ్డపై మమకారాన్ని కోల్పోబోతున్నాం."

కీలు బొమ్మలు కథలోని ఈ వాక్యాలు ప్రపంచీకరణ విశ్వరూపాన్ని, ఫలితాలను కళ్లకు కట్టిస్తాయి.

కొందరికి ప్రపంచీకరణపై భ్రమలున్నాయి. ఇది పేదలకు, బిసిలకు మేలు చేస్తుందని వాదించే వాళ్లూ వున్నారు. నిజానికిది చేతివృత్తుల వారికి, పేదలకు, నిమ్న కులాలవారికెలా మేలు చేస్తుందో అర్థం కాని విషయం. ఈ వాదం ఎలుకలున్నాయని ఇల్లు తగులబెట్టుకోవడం లాంటిదే. బి.సి.ల, దళితుల బతుకు, బలం అంతా వాళ్లు చేసే పనుల్లో ఉంది. వాళ్ల ఆదాయ మార్గాల్లో ఉంది. కార్పోరేట్ వ్యవసాయాన్ని ముందుకు తెచ్చింది ప్రపంచీకరణే.. ఈ పేరు మీద దేశీయ చిన్న చిన్న వ్యవసాయాలన్నీ సమాధి కాక తప్పదు. నాగలి పాలె అంటే ఏమితో తెలియనివాడు వ్యవసాయ క్షేత్రాలకు యజమాని అవుతాడు. తరతరాలుగా భూమిని దున్నుకుంటూ బతికే రైతులు తమ భూముల్లోనే పాలేర్లుగా లేదా జీతగాళ్లుగా మారే దుర్మార్గం ఈ పద్ధతిలో దాగుంది. అలాగే పెండకడి అంటే ఏమిటో తెలియని వ్యక్తి పాల వ్యాపారాన్ని స్వాధీనం చేసుకుంటాడు. వృత్తులన్నీ వ్యాపార సరుకులుగా మారిపోతున్నాయి. నాడె, ల్యాకబద్ద అంటే తెలియని వ్యక్తి బట్టల మిల్లు, బట్టల దుకాణం యజమని కావడం వెనుకుంది ప్రపంచీకరణే. అంబూర్‌ను తాకనివాడు, తోలు వాసనైనా చూడనివాడు అద్దాల బీరువాల్లో అమర్చబడే చెప్పుల దుకాణాల, బూట్ల దుకాణాల యజమాని కావడంలో ఎంత కుట్ర ఉందో ఎందుకు అర్థం చేసుకోరు వీళ్లు? బి.సిల. చేతుల్నుంచి ఆదాయమార్గాలు దూరమవుతున్న కొద్దీ వాళ్లు బలహీనులవుతున్నారు. అసలీ కంప్యూటర్లను ముందుకు తెచ్చింది ఎవరు? ఇది వరకు చదువుకునే అవకాశాలు లేని వాళ్లకు చదువులు, అధికారాలు వచ్చే క్రమంలో అవి వాళ్లకు అందకుండా చేసే ప్రయత్నంలో భాగమే ఇది. పారిశ్రామికీకరణం జరిగినప్పుడు బి.సి.లు అప్పటి వరకు ఆధారపడి బతుకుతున్న వృత్తులపై జరిగిన విధ్వంసం కంటే ఎన్నో రెట్లు ఎక్కువగా విధ్వంసం ప్రపంచీకరణ వల్ల జరుగుతుంది. ఈ విషయాలను గమనించకుండా

కొంతమంది ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రపంచీకరణాన్ని సమర్థించడం విడ్డూరమే. ...ాలను, ప్రకృతిని వ్యతిరేకించడమంటే ప్రపంచీకరణను సమర్థించడమే అవుతుంది. తెలంగాణ నుంచి గ్లోబలైజేషన్‌ను సమర్థిస్తూ వాదాలు చేసినవాళ్లు, కథలు రాసినవాళ్లు దాదాపుగా లేరు. ఒకరిద్దరు వ్యాసాలు రాస్తే రాసి ఉండవచ్చు. బి.యస్. రాములు రాసిన వేపచెట్టు కథా సంపుటిలోని కథలన్నింటిలోనూ ప్రపంచీకరణపై వ్యతిరేకత వున్నా ఒకటి రెండు కథల్లో సమర్థించడం కనబడుతుంది.

“గ్లోబలైజేషన్ ఎజెండాకు భారతదేశం వరకు కేంద్ర బిందువు తెలంగాణయే అన్నది ఈ రోజు సాధారణ జ్ఞానం. ఈ సంగతి అర్థం కానట్టు ముఖం ఎవరైనా పెడుతుంటే వారు గ్లోబలైజేషన్‌కు వత్తాసు పలికేవారన్న మాట..” అని ముందు మాటలో రాసిన అంబటి సురేంద్రరాజు మాటలు తెలంగాణ పట్ల నగ్నసత్యం. ప్రపంచీకరణ బ్రాహ్మణీయ వర్గాలకు లేదా ఉన్నత వర్గాలకు, కులాలకు, పాలకవర్గాలకు సేవలు చేస్తుంది. పేదలను మరింత పేదలుగా మారుస్తుంది. దీనివల్ల అణగారిన కులాలకు ఉపాధి లభించకపోవడమే కాకుండా వృత్తులు, జీవన విధానాలు అంతరించిపోతున్నాయి. పోనీ ఉన్నత చదువులు చదివే అవకాశమైనా లభిస్తుందా అంటే అదీ ఎండమావేనని విద్య ప్రైవేటీకరణ రుజువు చేసింది. చేయూత, వేపచెట్టు, సంబంధం లాంటి కథల్లో మనుషుల మధ్య పూరించలేని అగాధాలు ఏర్పడటం, సంబంధాలు సున్నితత్వం కోల్పోయి యాంత్రిక సంబంధాలుగా మారడం లాంటి అనేక విషయాలను చర్చించడం జరిగింది. అయితే కామన్‌వెల్త్ కథలో మాత్రం ప్రపంచీకరణను సమర్థిస్తూ అది శ్రామికకులాలవారికి ఎంతో మేలు చేసిందన్నట్లు వ్యాఖ్యానించడం ఆశ్చర్యం కలిగించే విషయం. నీ ముక్కు ఎక్కడుందంటే తల చుట్టూ తిప్పి చూపిన విధంగా ఇందులో ఎల్లాకర్ అనే పాత్ర ద్వారా ఈ మాటలను చెప్పిస్తాడు రచయిత. మేధోవలసలను ప్రపంచీకరణను సమర్థించే ఎల్లాకర్ మాటలివి–

“అరే వెంకులూ! అందని ద్రాక్షపండ్లు పుల్లన అని థీరీ చేయకురా..! మేధోవలస సాగుతేంది? వాళ్లు సరుకులు ఎగుమతి చేస్తే మనం మనుషులను ఎగుమతి చేస్తున్నాం. సరుకుల కన్నా మనుషులే గొప్ప కదా..! సరుకుల గ్లోబలైజేషన్ అంటే ఏందిరా? సరుకుల గ్లోబలైజేషన్ శ్రమశక్తి గ్లోబలైజేషన్‌రా. శ్రమశక్తి గ్లోబలైజేషన్ అయినంక శ్రామికుల గ్లోబలైజేషన్ ఎంత సేపురా? సరుకులు గ్లోబలైజ్ చేసినంక మనుషులు గ్లోబలైజ్ కాకుండా ఉంటార్రా..? అది ఎట్లనో ఒకట్ల విశ్వమానవ కుటుంబానికి దారి తీయక తప్పది..”

ఈ కథలోని ఎల్లాకర్ పాత్రలాంటి వాళ్లే కొంత మంది ఉన్నారు. ఎల్లాకర్‌కు



లాగే వాళ్లకూ భ్రమలున్నాయి. తాము చదువుకున్నాం, తమ పిల్లలు చదువుకొని అమెరికాకు పోయారు కాబట్టి అదే పదివేలనుకుంటున్నారు. తమ వరకే గిరిగీసుకుంటున్నారు. తాము జీవితాలను గెలుచుకున్నట్టు భ్రమ పడుతున్నారు. కొంచెం తమ పరిధి దాటి నేను నుండి మేములోకి, తాను నుండి ఊళ్లలోకి పోయి పరిశీలిస్తే వీళ్లకెన్నో విషయాలు అర్థమవుతాయి. తమ కళ్లద్దాలను మార్చుకుంటే మరీ మంచిది. ఈ బాకాలు, ఈ లొల్లులు, ఈ నినాదాలు ఎంత మందికి ఉపయోగపడుతున్నాయో తెలుస్తుంది. ఎందరు వ్యవసాయదారులు కూలీలుగా మారారో, ఎందరు వృత్తులు కోల్పోయి రోడ్ల మీదున్నారో, గ్రామాల్లో ఎంతటి తీవ్ర సంక్షోభం ఉందో, ఇటు చదువుకూ కాకుండా అటు పనీ లేకుండా ఎంత మంది కొట్టుమిట్టాడుతున్నారో ఎల్లాకర్ లాంటి వాళ్లు గమనిస్తే మరీ మంచిది.

ప్రపంచీకరణ ముందుకు తెచ్చిన మరో అమానవీయ సంఘటన ఇరవై నాలుగు గంటల టీవీ మోత – ఇదో ఇడియట్ బాక్స్. అది మన మెదళ్లపై చెప్పలేనంత విష ప్రభావాన్ని చూపిస్తుంది. మనది కాని మానవాంశ ఏ మాత్రం లేని దుఃఖాన్ని, ఒత్తిడిని పెంచుతూ మనుషులను సాడిస్టులుగా మార్చే పనిని విజయవంతంగా చేస్తుంది టీవీ. ఇది వేలాది, లక్షలాది, కోట్లాది జనంపై దుష్ప్రభావాన్ని కలిగిస్తుంది. మనది కాని సంస్కృతి, జీవితాన్ని, కళలను మనపై రుద్ది అయోమయానికి గురి చేస్తుంది. ఇది పిల్లల మనస్తత్వంపై ఎంత ఘోరమైన ప్రభావాన్ని చూపుతుందో, మనుషులను అంతర్ముఖులుగా మారుస్తుందో, పిల్లలను అసాంఘిక జీవులుగా మార్చే బలమైన సాధనంగా ఎలా ఉపయోగపడుతుందో బి.యస్. రాములు రాసిన ప్యారసైట్స్ కథలో చూడవచ్చు. టీవీ ప్రభావంతో మనిషి వినిమయ సరుకుగా, మెకానికల్‌గా మారే క్రమాన్ని చిత్రించిన కథ కాలువ మల్లయ్య రాసిన ‘హిరణ్యాక్షుడు’. టీవీ సంస్కృతి గృహిణులపై చూపే దుర్మార్గ ప్రభావాన్ని బలంగా చిత్రించిన కథ ఇది. భూమిని చాప చుట్టినట్టు చుట్టిన హిరణ్యాక్షుడు (గ్లోబల్‌రావు) గృహిణిలోకే ప్రవేశించి ఆమెను కుటుంబానికి, వాస్తవిక జీవితానికి, భర్తకు దూరం చేసిన దుర్మార్గాన్ని చిత్రించిన కథ ఇది. భర్తతో ఎంతో అన్యోన్యంగా ప్రేమగా ఉండే వ్యక్తి టీవీ ప్రభావానికి లోనై అంతర్ముఖిగా మారడమే కాకుండా అనవసర దుఃఖానికి లోనై లోకంలో అందరి కంటే ఎక్కువ దుఃఖం తనకే ఉన్నట్టు భావిస్తుంది. ఎంతో చురుకుగా ఉండే ఆమె ఏ స్పందనా లేని జడురాలుగా మారుతుంది. తమ అన్యోన్య దాంపత్యంలో నిప్పులు పోసి తన సహచరిని తనకు కాకుండా చేస్తున్న ఇడియట్ బాక్స్‌ను ముక్కలు ముక్కలుగా పగులగొడతాడు భర్త. తన ఆవేదనను, ఆవేశాన్ని మిత్రులతో వెళ్లగక్కుకుని రోదిస్తాడు.

ప్రపంచీకరణ మోసుకొచ్చిన మరో దుర్మార్గం విదేశాలపై, విదేశీ వస్తువులపై మోజు పెంచడం. స్వాతంత్ర్య పోరాట కాలంలో మా దేశాన్ని వదలివెళ్లండి.. క్విట్ ఇండియా అంటూ అతి పెద్ద ఉద్యమం వచ్చింది. విదేశీ వస్తువులను బహిష్కరిస్తూ ఉద్యమాలు వచ్చాయి. కాని ఇప్పుడు స్వయానా పాలకులే వాళ్లకు ఎర్ర తివాచీలు పరిచి స్వాగతం పలుకుతున్నారు. పంట, వంట, ఆట, పాట ఏదీ మనది కాకుండా పోతుంది. అన్ని రంగాల్లోనూ విదేశీ మోజే. పరాయీకరణే ఆఖరుకు కూరల్లో వేసుకునే ఎల్లిగడ్డలు కూడా దొడ్డు దొడ్డువి మనవి కానివి తెమ్మంటుంది ఇంటావిడ. విదేశీ వస్తువులపై మోజు వంటింటిని కూడా వదిలిపెట్టకపోవడం క్విట్ ఇండియా కథలో చూడవచ్చు. స్వాతంత్ర్య ఉద్యమ కాలంలో వచ్చిన క్విట్ ఇండియా, విదేశీ వస్తు బహిష్కరణోద్యమాలను మించిన ఉద్యమం రావాల్సిన అవసరం ఉందని చెప్పే కథ క్విట్ ఇండియా.

ప్రపంచీకరణ మనిషికి సుఖాన్నిస్తుందా? దీని ప్రభావం సోకిన తర్వాత ఎవరైనా ప్రశాంతంగా జీవిస్తున్నారా? ప్రతి వస్తువూ, పనీ వ్యాపార సరుకుగా మారిపోవడం, ప్రతి దాంట్లో పోటీ పేరు మీద అంగడి సరుకు కావడం వల్ల ఎవరికి సుఖముంటుంది? ఆహారం, కూరగాయలు, చల్లాపెరుగు ఉచితంగా ఇచ్చే మానవీయ దృక్పథంలోంచి రెండు రూపాయలకు గుక్కెడు నీళ్లు అమ్ముకునే స్థితికి సమాజం చేరుకుంటుంటే ఆ సమాజంలో సుఖముంటుందా? ఈ రోజు చదువు, నీరు, ప్రతి వస్తువూ అమ్మకం సరుకయింది. రేపు గాలీ కాబోతుంది. ప్రపంచీకరణ పుణ్యమా అని మన బతుకుల్ని వ్యాపారంగా మార్చిన క్రమాన్ని తెలిపే కథ గ్లోబలి. లాభాల కోసం పెట్టుబడిదారుడు ఆత్మహత్యయినా చేసుకుంటాడు అనేదిప్పుడు చాలా తేలికయిన మాట. ఏ ఘోరానికయినా పాల్పడుతాడు. అన్నిటినీ వ్యాపార సరుకుగా మార్చిన ప్రపంచీకరణ నేపథ్యంలో బిల్‌గేట్స్, ప్రేమ్‌జీలు, గొప్ప గొప్ప కంప్యూటర్ ఇంజనీర్లు, వ్యాపారులు రావచ్చు కాని మహాత్ములు, మదర్ థెరిస్సాలు, గొప్ప తాత్త్వికులు, మానవతామూర్తులు వచ్చే అవకాశాలు దాదాపుగా మృగ్యం. ఈ అంశాలన్నిటినీ కథలుగా మలిచారు రచయితలు. గత కాలపు లగ్గం సంబురాలు, నిరుడు కురిసిన హిమ సమూహాలు ఏవని వాపోయే పరిస్థితులను మోసుకొచ్చిందీ గ్లోబలైజేషన్.. ప్రైవెటైజేషన్, దుర్మార్గపు పోటీ ఎంతో మంది బతుకులను బుగ్గిపాలు చేస్తున్నాయి.

నాకు తెలిసినంత వరకు, నా దృష్టిలోకి వచ్చినంత వరకు, నా జ్ఞాపకాల్లో ఉన్నంత వరకు నా బాల్యం, నాలాంటి వాళ్ల బాల్యం గొప్పగా ఏం లేదు.. కాని హాయిగా వుండేది. నా దగ్గర డబ్బులేం ఉండేవి కావు. చిన్న వ్యవసాయం.. పనికి



పోతూనే బడికి పోవాలి.. చదువుకుంటున్నానని పని చేయనంటే కుదరదు. తీరిక సమయాల్లో వ్యవసాయం పనులు చేస్తూ అవసరమైతే పనెక్కువుంటే ఓ రోజు బడి మానయినా పనికి పోతూ చదువుకునేవాన్ని. ప్రకృతి మధ్య పెరిగినట్టుగా పొలాలు, చేలు, గొర్రెల మధ్య ఎగురుతూ పని చేస్తూ చదువుకునేవాన్ని. ఒక్క రూపాయి దొరకడం కూడా కష్టంగానే ఉన్నా ఎంతో హాయిగా ఉండేది. అప్పుడు ఊరు ఊరుగా ఉండేది. వాతావరణం ప్రకృతిసిద్ధంగా ఉండేది. ఈ రూపాయితనం లేదు. ఈ ప్రపంచీకరణ మాయ లేదు. ఈ దుర్మార్గమైన పోటీ లేదు. ఈ రైతుల ఆత్మహత్యలూ లేవు. ఏదో కొద్ది మంది చదువులతో మనం పదే పదే అనుకొనే జీవితాలను గెలుచుకుంటే గెలుచుకోవచ్చు. కొందరు బలహీన వర్గాల్లోంచి వచ్చినవారూ అమెరికాకు పోతే పాయుండొచ్చు. మరి మిగతావాళ్ల సంగతి.. వృత్తిపనులు నశించి ప్రత్యామ్నాయాలు లేక ఎంత మంది కొట్టుమిట్టాడుతున్నారు? అంతకు ముందు ఎన్నెన్నో కారణాలుండవచ్చు. ఇప్పుడయితే ఇవన్నీ ప్రపంచీకరణ, దాని అన్నాతమ్ముళ్ల దుష్ఫలితాలే కదా! ఇప్పుడు ఊళ్లను చూస్తే కళ్ల వెంట నీళ్లు రావడం లేదా? నిరంతరం పని చేస్తూనే బతికేవాళ్ల బతుకులెందుకు దుర్భరమవుతున్నాయి? శ్రమజీవులు రాజ్యాధికారానికి వస్తే ఈ సమస్యలన్నిటికీ పరిష్కారం లభిస్తుందా?వాళ్లెందుకు రావడం లేదు మరి! ఇవన్నీ ప్రశ్నలు.. జవాబులు రచయితలుగా వాళ్ల పక్షాన నిల్చొని పని సంస్కృతిని ఉన్నతీకరించి రచనలు చేయడమే..

మరీ ప్రపంచీకరణ పరిణామాలకు పరిష్కారాలేమిటి? ప్రపంచీకరణను ఎదుర్కోవడమంటే ఏటికి ఎదురీదడం లాంటిదే అనే వాళ్లున్నారు. కావచ్చు. కాని తప్పదు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించడం ఏటికి ఎదురీదడమే అనుకుంటే మనకు స్వతంత్రం వచ్చుండేదా? ఇదీ అంతే.. ఇది కష్టమే కావచ్చు..కాని అసాధ్యం మాత్రం కాదు. ప్రపంచీకరణను ఎదిరించడంలో రచయితల బాధ్యత దళిత బహుజన పీడిత వర్గాల సంస్కృతిని ఉన్నతీకరించే ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించడమే. విశ్రాంతి వర్గ సంస్కృతికి అనుకూలమైన రామాయణ, మహాభారతాల్లా శ్రామిక సంస్కృతిని ఉన్నతీకరించే గొప్ప గొప్ప గ్రంథాలు విరివిగా రావాలి. ఇది ఏ ఒక్కరి వల్లనో అయ్యే పని కాదు. రచయితలంతా పూనుకోవాలి. ప్రజాపక్షం, దళిత బహుజన పీడిత ప్రజల పక్షం వహించే రచయితలంతా ఇందుకు హృదయపూర్వకంగా పూనుకోవాలి. ఆ పని తెలంగాణ నుంచి ఎప్పుడో ప్రారంభమైంది. అది మరింత విస్తృతం కావాలి.

ఇతర దేశాల్లో ముఖ్యంగా యూరోపు దేశాల్లో సాహిత్యం చేసినంత విస్తృతమైన

పనిని మనదేశంలోని సాహిత్యం చేయడం లేదనిపిస్తుంది. సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్ లాంటివాళ్ల కృషి యూరపు సాంస్కృతిక నిర్మాణంలో విశిష్టమైనదే. మొదట్నుంచీ పని సంస్కృతిని ఉన్నతీకరించే సాహిత్యం విరివిగా వచ్చి వుంటే, బౌద్ధ సాహిత్యం విశేష ప్రచారం పొంది వుంటే మన దేశంలో శ్రామిక, పీడిత జాతుల పరిస్థితులు ఇలా వుండేవి కావు. శ్రమజీవులకు రాజ్యాధికారమూ వచ్చి ఉండేది. మనదేశంలో, రాష్ట్రంలో ప్రపంచీకరణ ప్రభావం ఇంతగా పడి ఉండేది కాదు. మన సంస్కృతి, సాహిత్యం, కళలు, మన అస్తిత్వానికి ఇంత పెద్ద పెద్ద వేట్లు పడి వుండేవి కావు. మాదర్నిజాలు, పోస్ట్ మాదర్నిజాల చర్చలూ జరిగి వుండేవి కావు. అందుకే తెలంగాణ నుంచి కాని, తెలుగు సమాజం నుండికాని, బారతీయ సాహత్యంలో కాని దళిత, బహుజన దేశీ సాహత్యం విరివిగా రావాల్సిన అసరం ఉంది. పుంఖానుపుంఖాలుగా రావాల్సిన అగత్యముంది. ఆ పని తెలంగాణలో ఎప్పుడో మొదలైంది. అది విస్తరించుకుంటూ పోతుంది. అందుకు తార్కాణంగా డక్కలి సంస్కృతి, తెగిన బంధాలు, శనార్థి, తిరుగు ప్రయాణం, ఊరుమ్మడి బతుకులు, కిర్రు చెప్పులు, కర్రోడు లాంటి అనేక కథలు వచ్చాయి; వస్తున్నాయి. అంబేద్కర్ సిద్ధాంతాల వెలుగులో, పూలే లోహియా సిద్ధాంతాల స్ఫూర్తితో మరింత అవగాహనతో వివిధ వృత్తులపై దళిత బహుజన పీడిత జాతుల గురించి అసంఖ్యాక రచనలు రావాల్సిన అవసరం ఉందనే ఉంది. ఈ దిశగా పయనిస్తూ ఇది వరకే రాస్తున్న రచయితలతో పాటు యువతరం రచయితలు సమధికోత్సాహంతో కథలు రాస్తున్నారు. ప్రపంచీకరణ ప్రభావానికి లొంగకుండా మన మూలాల్ని మనం వెతుక్కుంటూ పీడిత సంస్కృతిని ఉన్నతీకరించుకుంటూ ప్రాంతీయ ముద్రతో, ప్రయోజన దృక్పథంతో, ప్రజల భాషలో విరివిగా వచ్చే ఈ సాహిత్యం తప్పకుండా ప్రపంచీకరణకు ప్రత్యామ్నాయాన్ని, పరిష్కారాలను చూపుతుంది.

**"ఆధునిక తెలుగు సాహిత్యం ప్రపంచీకరణ ప్రతిస్పందనలు"పై తెలుగు విశ్వవిద్యాలయం సెమినార్ (రాజమండ్రి)లో సమర్పించిన ప్రసంగ వ్యాసం (10,11-3-2004), వాఙ్మయి పత్రిక జులై - సెప్టెంబర్ 2004**



# తెలంగాణ జీవితం, నా రచనలు -జెండర్ స్పృహ

నా తెలంగాణ కోటి రతనాల వీణ మాత్రమే కాదు, ఇప్పుడది ముక్కోటి రతనాల వీణ. దేశదేశాల్లో ఉన్న వాళ్లందరినీ కలిపితే ఇంకో కోటి అవుతుందేమో! అంటే ఓ చిన్నదేశం కంటే ఎక్కువ జనాభా, వైశాల్యం ఉన్న ప్రత్యేక నేల. కానీ తెలంగాణకు ఎన్నెన్నో గాయాలు. తలాపుకే కృష్ణాగోదావరుల్లాంటి జీవనదులు పారుతున్నా ఎండి పోతున్న నేలలు.. ఫ్యూడల్ భావాల ఊబిలో దొరలు, భూస్వాముల నిరంకుశత్వంలో కొట్టుమిట్టాడతున్న నేల. అయినా తెలంగాణ తన ప్రత్యేకతను కాపాడుకుంది. ఇంటికొచ్చిన అతిథికి కలో, గంజో కుండల గలది లేదనకుండా పెట్టే ఔదార్యం. తోట్లోకొచ్చిన వాళ్లకు తాము పండించిన దాంట్లోవి ఉచితంగా ఇచ్చే దానగుణం. వాకిట్లో నిల్చొని అవ్వా బుక్కెడు బువ్వెయ్యవా అనరిస్తే కంకెడు గడుకబోటుతో బయటకొచ్చే ఔదార్యం. శనార్థంటూ ఆప్యాయంగా అలాయి బలాయి తీసుకునే ఆర్ద్రగుణం నా చిన్నతనంలో, బాల్యంలో తెలంగాణ అంతటా ఉండేది. ముఖ్యంగా గ్రామాల్లో... అదే... అదే... ఆ తెలంగాణా తనమే నన్ను రచయితను చేశాయి. అయితే చిన్నతనం నుండీ కులం పేరు మీదా, ఇతరత్రా అనేక గాయాలు నాకు తగులుతూనే ఉన్నాయి. నా తెలంగాణ నిత్యగాయాలతో అంగలారుస్తుందని తెలుసుకోవడానికి 1968 దాకా చూడాల్సి వచ్చింది. అంతకు ముందు నాకు, నా వాళ్లకు, నా తెలంగాణకు గాయాల తాకిడి విరివిగానే ఉన్నా అర్థం కాని వయసు.

చాలా మంది రచయితలు తమ రచనలకు వస్తువును బాల్యం నుంచే తీసుకుంటారనడానికి నా రచనలే ఉదాహరణలు. ఎవరిలోనైనా బాల్యంలో పడిన ముద్ర గాఢంగా, ప్రభావ స్ఫోరకంగా ఉంటుంది. నా తెలంగాణ గ్రామీణ జీవిత బాల్యం, జీవిత నేపథ్యం నా మీద విరివిగానే ముద్ర వేసింది. నేనెదిగి కథలు రాయాలనుకున్నప్పుడు తెలంగాణ గ్రామాల్లోకి చూడాల్సి వచ్చింది. బాల్య స్మృతుల్లో తిరగాడాల్సి వచ్చింది. అవన్నిటినీ సమకాలీన విషయాలతో ముడి పెట్టుకోవాల్సి వచ్చింది. ఇలా దేశంలోనే తనదైన ప్రత్యేకతను కలిగి వున్న తెలంగాణ, తెలంగాణ గ్రామం, తెలంగాణ మట్టి, మట్టిలో మట్టయి బతికే మట్టి మనుషులు లేకుండా నా రచనలు లేవు.

అవును.. నేను తెలంగాణవాన్నయినందుకు గర్విస్తున్నాను. తెలంగాణ భాషలో, యాసలో రాస్తున్నందుకు సగర్వంగా తలెత్తుకుంటున్నాను. అది నా తల్లి భాష.. నా తండ్రి భాష.. నా వాళ్లందరి భాష... నా వాళ్లందరి భాషను, జీవితాలను,

సంస్కృతిని అక్షరీకరించే అవకాశం వచ్చినందుకు, నా నేల రుణం తీర్చుకుంటున్నందుకు నేను సగర్వంగా, సమున్నతంగా తలెత్తుకుంటున్నాను. శిష్టుల్లో, నాగరికుల్లో, అభివృద్ధి చెందినవాళ్లో, ఎవరైతేనేం నిరాదరణకు గురి చేయబడ్డ నా తల్లిదండ్రుల భాష, నా తెలంగాణ గ్రామ పీడిత సంస్కృతిని అక్షరబద్ధం చేయడం నాకు దొరికిన మహద్భాగ్యంగా భావిస్తున్నాను. ఇది ఇలాగే కొనసాగుతుంది. నా మెదడు ఆలోచించడం మానుకునేంత వరకు, నా చేతులు రాయడానికి సహకరించడం మానుకునేంత వరకు నేను రాస్తూనే ఉంటాను. నా చివరి శ్వాస వరకూ రాయడం ధ్యేయంగా పెట్టుకున్నాను.

నేను తెలంగాణవాడిని అయి ఉండకపోతే, తెలంగాణ గ్రామంలో పుట్టి ఉండకపోతే, తెలంగాణ గాయాలను దళిత బహుజన జీవన వేదనను అనుభవంలోకి తెచ్చుకొని ఉండకపోతే రచయితనై వుండేవాడిని కానేమో! ఒక వేళ రచయితనైనా ఒకటో అరో అమావాస్యకో, పున్నానికో అన్నట్టు రాసి పేరు సంపాదనా మోజులో కొట్టుమిట్టాడుతుండేవాన్నేమో! నిరంతరం నాలో జ్వలిస్తున్న ఆవేదన, నా వాళ్ల స్థితిగతులను చూస్తుంటే కలుగుతున్న ఆక్రందనలు, నా నేల మీద నిరంతరం జీవన్మరణ పోరాటాల్లో, సమస్యల్లో మునిగి తేలుతున్న ప్రజానీకం, వివక్షకు గురవుతూ జరుగుతున్న అస్తిత్వ పోరాటాలు నన్ను నిలువనీయడం లేదు. నిరంతరం రాయడానికి పురికొల్పుతున్నాయి. నాకు నిద్ర పట్టనీయడం లేదు. తన రచనలు సమాజానికి ఏ మేరకు ఉపయోగపడ్డా చాలనుకున్న ఏ రచయితయినా నిరంతరం రాస్తూనే ఉంటాడు. ఆ పనే నేనూ చేస్తున్నాను. ఆ ఆర్తే నన్ను రచయితను చేసింది.

నా తెలంగాణ మట్టి, నా పీడితకుల నేపథ్యంతో పాటు నిరంతరం శ్రమజీవులుగా బతికే నా కుటుంబ నేపథ్యం, మా ఇంటి వాతావరణం, మా నాన్న, మా ఇంటి ముందు జరిగే సంఘటనలు, బాల్యంలో మా ఇంటి చుట్టూ, మా ఊళ్లో చూసిన విషయాలు, ఇంటి పరిస్థితులు ఇవన్నీ కలిసి నన్ను రచయితను చేశాయి. మాది గొర్ల కాపర్ల కుటుంబం. మాకు మొన్న మొన్నటి వరకూ గొర్లుండేవి. కొంత వ్యవసాయం ఉండేది. మా చిన్నాన్నలు, ఊళ్లోని బంధువులు, మా వాళ్లంతా గొర్ల కాపర్లుగానో, చిన్న చిన్న వ్యవసాయదార్లుగానో బతికేవారు. మా నాన్న పెద్దగొల్ల. మా ఇంటి ముందే మందెచ్చులవాళ్లు బొమ్మలు నిలబెట్టేవాళ్లు. ఒంటికొమ్ము బొల్లావు, కాటమరాజు కథల్లాంటివి చెప్పేవాళ్లు. పట్నాలేసేవాళ్లు. మా ఊళ్లో జరిగే చిందు బాగోతులాటలు, శారదకాళ్లు, మిత్తిరయోర్ల ఆటలు చూసుకుంటూ రాత్రుల్లో నేను మూడు బజార్ల కాన్నే నిద్రపోయేవాణ్ని. మా నాన్న ఎత్తుకొని ఇంటికి తీసుకొచ్చేవాడు. మా నాన్నకు కొంత అక్షరపు పొడుండేది. అప్పుడే మూడో నాల్గో చదువుకున్నవాడు.



ఆయన నోటి కథలు చెప్పేవాడు. రామాయణ మహాభారతాల నుంచి మొదలుకొని డిటెక్టివ్ నవలల వరకన్నీ చదివేవాడు. తన దగ్గరికొచ్చేవాళ్లకు కథలు చెప్పడానికి నాతో చదివించి అర్థ తాత్పర్యాలు తాను చెప్పేవాడు. ఇవన్నీ నాకెంతో ప్రేరణనిచ్చాయి. రచయితగా ఎదగడానికి దోహదపడ్డాయి. జానపద, ఆశు సంప్రదాయ రీతులను స్వంతం చేసుకోవడానికి ఉపయోగపడ్డాయి. పది పన్నెండేండ్ల వాడయిన రెడ్డి దొర కొడుకు గొర్ల కాపరియైన మా చిన్నాన్నను కట్టెతో విపరీతంగా కొట్టడం నన్ను కలచివేసింది. కులాలవారీగా రిజిస్టరులో పేర్లు రాయడం, తరగతిలో ఫస్టుగా వచ్చే నన్ను ఐదవ వ్యక్తిగా క్రమసంఖ్యలో ఉంచడం నా జీవితంలో మరువరానివి.

చిన్నతనంలో నేనో ద్విపద రాశాను. మా తెలుగు సారుకు చూపెట్టాను. ఆతడంటే నాకు చాలా అభిమానం. తెలుగు బాగా చెప్పేవాడు. నేను రాసిన ద్విపదను చూసి ఆతడన్న మాటలు నన్నెంతో వేదనకు గురి చేశాయి. "ఎవరు పడితే వాళ్లు కవిత్వం రాస్తార్రా.. కవిత్వం రాయాలంటే రుషి అంశ కావాలి. ఆ రుషి అంశ బ్రహ్మ మానస పుత్రులకే ఉంటుంది. నువ్వు గొల్లోడివి. కవిత్వం ఎలా రాస్తావు?" అన్నాడతను. నేనేడ్చాను. మొత్తుకున్నాను. ఎవరికి చెబితే మాత్రమేం లాభం? కావచ్చని ఊరుకున్నాను. కాని, నాలో పట్టుదల పెరిగింది. ఏవో పిచ్చిగీతలు లాంటివి రాయడం చింపేయడం... అయినా తప్పకుండా రాయాలని నిర్ణయించుకున్నాను. ఆ తర్వాత వచ్చిన తెలుగు సార్లు నన్ను ప్రోత్సహించారు. చదువైపోయే వరకు పాఠశాల, కాలేజీ మ్యాగజినల్లకు తప్ప రాసింది లేదు.

అయితే ఆ సారు మాటలు నన్ను వెంటాడుతూనే ఉన్నాయి. తప్పకుండా రాయాలన్న తపన నన్ను నిలువనీయడం లేదు. వాల్మీకి ఎవరు? గీతాచార్యుడైన కృష్ణుడెవరు? లెనిన్ ఎవరు? ఏసుక్రీస్తు ఎవరు? అనేక సార్లు వీళ్లందరినీ మననం చేసుకున్నాను. అవును మరి..! గొల్లోని ఎరుక, శ్రామిక కులాలవారి ఎరుక అసలైన ఎరుక.. పరిమితుల్లేని ఎరుక.. విశ్రాంతి వర్గాల వారి ఎరుక పరిమితమైంది. శ్రామిక కులాలవారి అనుభవాల్లో ఎంతో వైవిధ్యముంటుంది. శ్రామిక కులాల్లోంచి రచయితలు రావడం మొదలైన తర్వాతే అద్భుతమైన సాహిత్యం వస్తున్నది. వైవిధ్యపూరితమైన రచనలొస్తున్నాయి. పీడిత వర్గ సంస్కృతి అక్షరబద్ధమవుతుంది. రాయడం మొదలుపెట్టి ఆ తర్వాతి కాలంలో ఇవన్నీ బేరీజు వేసుకున్నాను. తెలంగాణ నుంచి వచ్చిన మా తరం, తర్వాతి తరం రచయితల్లో చాలా మంది పీడిత కులాల నుంచి వచ్చిన వాళ్లే కావడం నాకెంతో ఆనందాన్నిచ్చింది. రచయిత కావడానికి ఫలానా కులమే కావాలన్న భావన తప్పని అర్థం చేసుకున్నాను. నాకున్న కుటుంబ, పీడిత పని సంస్కృతి కుల నేపథ్యం వైవిధ్యపూరితమైన, పని సంస్కృతిని ప్రేమించే రచనలు చేయడానికి దోహదం చేశాయి. విస్తృతంగా రాయడానికి ఉపయోగపడుతున్నాయి.

నా తెలంగాణే నా కథలకు సాహిత్యానికి ముడిసరుకు. నా ఉద్దేశ్యంలో తెలంగాణా అంటే రాజకీయ తెలంగాణ మాత్రమే కాదు... ముఖ్యంగా సాంస్కృతిక తెలంగాణ.. తెలంగాణ ముద్ర.. తెలంగాణా ప్రాంతీయతా ముద్రతో సాహిత్యాన్ని విశ్వజనీనం చేయడం.. నిజానికి ప్రాంతీయం కాని విశ్వజనీన సాహిత్యం ఎక్కడైనా ఉంటుందా అని నేనే ఏడెనిమిదేళ్ల క్రితమే ఆంధ్రప్రభలో ఓ వ్యాసం రాశాను. గొప్ప, మంచి సాహిత్యానికి ప్రాంతీయ ముద్ర అనివార్యం. గోర్కీ, టాల్‌స్టాయ్ రాసినవి రష్యన్ ముద్రతో వచ్చినవి కావా? ప్రేమ్‌చంద్ సాహిత్యం హిందీ ప్రాంత ముఖ్యంగా కాశీ ప్రాంత జీవిత చిత్రణ కాదా? ఏ గొప్ప రచనయినా ఆయా ప్రాంతాల ముద్ర లేకుండా ఉండదు. ప్రాంతీయ ముద్ర లేకుండా విశ్వజనీన సాహిత్యం ఉంటుందనుకోవడం వ్యాపార దృక్పథమే అవుతుంది.

నా సాహిత్యానికి తెలంగాణ జీవితం, సంఘర్షణ, ఉద్యమాలు, గ్రామాలు, నశిస్తున్న వృత్తులు, వివక్ష లాంటివన్నీ ముడిసరుకులు. ఈ దృక్పథంతోనే 1986 -87 ప్రాంతంలో 'అవ్వ తోడు గిది తెలంగాణా' కథలు రాశాను. ఇవి తెలంగాణ భాషను, సంస్కృతిని, వృత్తుల పతనాన్ని అక్షరబద్ధం చేసిన రచనలు. ఇందులోని పాత్రలన్నీ సజీవాలే. సంఘటనలన్నీ యథార్థాలే. చాలా మంది తెలంగాణ ప్రజలు ఈ కథల్లో తమ జీవితాలను చూసుకున్నారు. ఈ కథలు నాకెంతో సంతృప్తినిచ్చాయి. అలాగే బతుకు పుస్తకం నవల. తెలంగాణ గ్రామీణ జీవితంలో గత యాభై ఏళ్లలో వచ్చిన మార్పులను మూడు కుటుంబాల ఆధారంగా చిత్రించిన నవల ఇది. దళిత, బి.సి, అగ్రకుల కుటుంబాలను ఆధారం చేసుకొని తెలంగాణ రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితుల్లో వచ్చిన మార్పులను, విలువల్లో వచ్చిన సంక్షోభాన్ని ఈ నవల అక్షరీకరించింది. తెలంగాణ ప్రాంతీయ రాజకీయ ఉద్యమం రాకముందే ప్రారంభమై సగం ప్రచురణ పొందిన కథలు తెలంగాణ మట్టి కథలు. ఈ 114 కథల్లో తెలంగాణలోని అణువణువూ స్పృశించబడింది. బి. జనార్దనరావు, కాళోజీ లాంటి సహృదయులు ఆర్ద్రతతో లేఖలు రాశారు. రాజకీయ ఉద్యమం వచ్చింతర్వాత సహజంగానే ఈ కథల విషయంలో మరింత స్పష్టత వచ్చింది. తెలంగాణలో వచ్చిన సాహిత్యమంతటికీ ఉద్యమాలు వస్తుసేకరణలో తెచ్చిన మార్పులు చెప్పుకోదగ్గవి. రజాకారు, భూపోరాట, దళిత, బహుజన, ప్రాంతీయ ఉద్యమాలను దేన్నీ వదిలిపెట్టకుండా సాహిత్యాన్ని సృష్టించాను. ముక్కోటి రతనాల వీణ, తెలంగాణ పోరడు, నాయనమ్మకో విన్నపం, తెలంగాణ మట్టికథల్లోని కొన్ని కథలు రాజకీయ ఉద్యమం తర్వాత వచ్చిన కథలే. ఇలా తెలంగాణ ప్రాంతీయ ముద్ర నా కథలకు



జీవధాతువు.

నా చుట్టూ వున్న సామాజిక పరిస్థితులు, తెలంగాణ వేదన, గ్రామీణ నేపథ్యం, పీడిత దృక్పథం, శ్రామికజన పక్షపాతం, ఏదో రాయాలన్న తపన, రచనల ద్వారా ఏదో చేయాలన్న కాంక్ష, అవి సమాజానికి ఏ మేరకు ఉపయోగపడ్డా చాలన్న ఆశ నన్ను కలం పట్టేందుకు పురికొల్పాయి. నేను రాసిన ప్రతి కథ వెనుకా నా తెలంగాణ నేల ఉంది. అలా ప్రారంభించి నేను రాసిన మొట్టమొదటి కథ 1983 జనవరి సృజనలో వచ్చిన 'వెలి'. అలవాటుగా నేను డైరీలో రాసుకున్న నోట్సులోంచి వస్తువును తీసుకుని ఈ కథ రాశాను. ఈ కథపై సమకాలీన పోరాటాల ప్రభావం ఉంది. ఈ కత జరిగిన నాటి పోరాటాలు వైయక్తిక పోరాటాలు. కత రాసేనాటికవి భూపోరాటాలుగా, సిద్ధాంత పోరాటాలుగా పరిణామం చెందాయి. ఈ కథలో బక్కమ్మ అనే విధవరాలు గర్భవతవుతుంది. అందుకు కారణమైన ఆమె బావ ఆమెను పెళ్లి చేసుకుంటానంటాడు. కాని పెద్ద మనుషులు వినరు. దండుగ కట్టాలని లేకుంటే కులంలోంచి వెలి వేస్తామంటారు. ఉద్యమాల ప్రభావంతో ప్రభావితుడైన బక్కమ్మ బావ మరదలు చేయి పట్టుకొని పెద్ద మనుషులను ఎదిరించి గబగబా నడిచి వెళ్తాడు. ఈ కథ రాసిన కాలం తెలంగాణలో భూపోరాటాలు ఉవ్వెత్తున లేస్తున్న సమయం. గత శతాబ్ది డెబ్బై ఎనబై దశాబ్దాల్లో కలాలు పట్టిన ప్రతి తెలంగాణ రచయితపైనా ఉద్యమాల ప్రభావం ఏదో మేరకు ఉంది. నేను రాసే కాలం నాటికే సమకాలీన ఉద్యమాల గురించి విప్లవ పత్రికల్లో కథలొస్తున్నాయి. అలా ఉద్యమాల ప్రబావంతో రాసిన కథలే పాలేరు, ఈ భూమి నాది, భూమి నవ్వింది, ప్రస్థానం, పతనం, భస్మాసుర హస్తం, వక్రమార్గం, భ్రమలు, భూమి కోసం మొదలైనవి.

మొదటి తరంవాళ్లే తెలంగాణ కథకు మంచి పునాది వేశారు. అప్పుడే మాండలికాన్ని స్వంతం చేసుకున్నారు. ఆ తర్వాతి కాలంలో కొంత ఖాళీ లాంటిది ఏర్పడినా మా తరంలో మాండలికానికి సుదృఢమైన పునాది పడింది. సృజన, అరుణతార, నూతన, ప్రజాసాహితి లాంటి పత్రికల్లో మాండలిక రచనలు విరివిగా రావడం నేను అన్ని పత్రికల్లో మాండలికంలో రాయడం మొదలు పెట్టాను. ఎవరు పడితే వాళ్లు కథలు రాయడమేనా అన్నవాళ్లు లేకపోలేదు. కాని మాండలికానికి సాహిత్య గౌరవం వచ్చింది మా తరంలోనే. ఇతర ప్రాంతాల పాఠకుల్నుంచి నాకు విరివిగా లేఖలు రావడం నాకెంతో ఆనందాన్నిచ్చింది. తెలంగాణలో ఉద్యమాలు లేకుంటే ఉద్యమకథలే లేవు. మొదట్లో నన్ను రచయితగా నిలబెట్టినవి ఉద్యమ కథలే. నేను రాస్తున్న పద్ధతికి, వస్తు విస్తృతికి, నా భావాలకు ఉద్యమ కథలను ప్రచురించే పత్రికలు మాత్రమే సరిపోవని అన్ని పత్రికలనూ ఎన్నుకొన్నాను. పత్రికేదైనా వస్తు దృక్పథంలో

మార్పు లేదు. సమాజానికి ఉపయోగపడే శ్రామికవర్గ సంస్కృతిని ఉన్నతీకరిస్తూ రాయడం వల్ల పీడితజాతులకు అనుకూల వాతావరణం ఏర్పరచడం ఈ పరంపరలో వచ్చినవే దళిత కథలు, బహుజన కథలు.

నేను ఊళ్లో కాని, మరెక్కడైనా కాని అత్యధికంగా ప్రేమించేది దళితుల్ని. ఎవరి పక్షం వహించాలంటే తడుముకోకుండా చెప్పేది దళితుల పక్షమని. ఈ దేశంలో ఘోరమైన వివక్షకు గురవుతున్నది ఆదివాసీలైన దళితులు. ఆఫ్రికాలోని నల్లవారయితేనేమి, అమెరికాలోని నీగ్రోలయితనేమి, భారతదేశంలోని దళితులైతేనేమి వీళ్లంతా ఘోరమైన అవమానాగ్నిలో మాడిమసిపోతున్న పీడిత జాతులవారు. ఇది మొత్తం జాతే సిగ్గుతో తలవంచుకోవాల్సిన సమస్య. అమెరికన్లు నీగ్రోల పట్ల ప్రవర్తించిన తీరుకు కొంతయినా పశ్చాత్తాపం ప్రకటించారని ఎక్కడో చదివిన గుర్తు. మరి భారతదేశంలోని దళితులకు హిందూమతం క్షమాపణ చెప్పుకుంటుదా? వాళ్ల రాజ్యం వాళ్లకిచ్చేస్తుందా? వీళ్లకు క్షమాపణ చెప్పడమంటే ఓట్ల రాజకీయాలు చెప్పే ఉత్తుత్తి క్షమాపణ కాదు. కనీసం యాభై ఏళ్లయినా దేశ రాజ్యాధికారాన్ని దళితులకు, దళిత పార్టీలకు ఐచ్ఛికంగా అప్పజెప్పడమే. దళితులపై నాకున్న అభిమానంతో, ప్రేమతో దళిత కులంలో పుట్టిన వాళ్ల కంటె ఎక్కువగా దళిత రచనలు చేశాను. చిన్నతనంలో నాకు గురువులాంటి వాడైన భూమయ్యసారు ఎవరింట్లోనూ మంచం మీద కూర్చోక పోవడం నన్ను బాధించేది. ఆయన తండ్రి సాంబయ్య భజనల దగ్గర దూరంగా కూచొని అద్భుతుంగా కీర్తనలు చదివేవాడు. దళితులు కచ్చీరు దగ్గర్నుంచి పోయినా, ఓ తీరు ఆర్థిక పరిస్థితి ఉన్న ఏ పెద్ద మనిషి ఇంటికి పోయినా రెండు చేతులూ పబ్బతి పట్టి పట్టుకొనే పోయేవారు. బజార్లో నడిస్తే ఒదిగొదుగుతూ నడిచేవారు. వాళ్లు చేసిన తప్పేమిటి? ఏం జరుగుతున్నదసలు? అని మనసంతా వికలమయ్యేది.

పెద్ద మాదిగ లింగయ్య, మా చేత మాదిగ చిలుక రాజయ్య, డప్పు కొట్టే పేరయ్య, పాలేరు కొండ మల్లయ్య, నీరటి ధర్మరాజు, అర్ధ రూపాయి ఇచ్చినందుకు జీవితాంతం నీ బాంచెనంటూ కృతజ్ఞత చూపిన కుందెల్లమ్మ లాంటి వాళ్ల మీద కథలు రాయాలనిపించేది. డప్పు కొట్టేవాళ్లు, చెప్పులు కుట్టేవాళ్లు, నీరటికాళ్లు, జంతు కళేబరాలను మోసేవాళ్లు , కొల్లు గుంటలు తవ్వేవాళ్లు, సమాజానికి అవసరమయ్యే పనులన్నీ చేసేవాళ్లయిన దళితులు అంటరానివాళ్లుగా, ఏమీ లేనివాళ్లుగా ఎందుకున్నారో అర్థమయ్యేది కాదు. వీళ్లందరి మీదా అంతులేని సానుభూతి వుండేది. అందుకే నాకు తెలిసిన దళితుల గురించి అనేక కథలు రాశాను. దళిత కథలు రాస్తున్నానని తెలియకుండానే నాకు తెలిసిన జీవితాల్లోంచి వస్తువును తీసుకొని రాశాను. దళిత లచ్చవ్వకు తెల్లవారితే ఎన్నెన్నో సమస్యలు. కిటుకు కథ చదువు యొక్క ప్రాముఖ్యాన్ని



తెలిపేది. నాకు తెలిసిన మిత్రుడు రాజయ్య చదువుకోవడం ద్వారా పొందిన గౌరవాన్ని అక్షరీకరించానీ కథలో. దళిత జీవిత సంవేదనను, వేదనను హృదయానికి హత్తుకొని రాసినవే నా దళిత కథలు. నా కథలు, రచనలు చదివి నన్ను దళితుడనుకున్న, అనుకుంటున్నవాళ్లే ఎక్కువ మందున్నారు. నా వాళ్లనుభవించిన జీవితానికి, సంస్కృతికీ దళిత జీవన సంస్కృతి అతి దగ్గరగా ఉండటం, నేను అందరి కంటే ఎక్కువగా దళితులను ప్రేమించడం వల్ల నా కథలకు దళిత కథా పరిమళమబ్బింది. మొదట్లో ఈ కథలు విప్లవ కథల్లో భాగంగానే వచ్చినా ఆ తర్వాత అవగాహన పెంచుకొని అంబేద్కరిజం వెలుగులో, దళిత ఉద్యమాల ప్రభావంతో అనేక దళిత కథలు రాశాను. అలా రాసినవే వైరుధ్యాలు, నా తెలంగాణ, కర్రోడు, అగ్నిగుండం లాంటి కథలు. దళితుల్లోంచి ఎవరో ఒకరు ఉన్నత స్థితిలోకెళితే గద్ద కోడిపిల్లను తన్నుకుపోయినట్టు తన్నుకుపోయేవాళ్లున్నారు. దళితుడైనవాడు అలాంటివాళ్ల పట్ల జాగ్రత్తగా ఉండాలని, దళిత తత్వాన్ని వదిలిపెట్టుకోకూడదని చెప్పే కథ నిర్ణయం.. దళితులు కొందరు పరాయీకరణ చెంది తన వాళ్లకు కాకుండా పోకూడదన్న ఆర్తితో ఈ కథ రాశాను. దళిత జీవన సంస్కృతిని ప్రేమించడంలో భాగంగా వచ్చినవే నీ బాంచెన్ కాల్మొక్తా, దొంగలు, చారిత్రక విభాత సంధ్యలు నవలలు, సాసంత్రం లాంటి కథలు. తెలంగాణ పోరాట, దళిత పీడిత జాతుల నేపథ్యం లేకుండా దళితుల గురించి ఇన్ని రచనలు చేసి వుండేవాన్ని కాదు.

అలాగే నేను రాసిన బహుజన కథలు. నిజానికి బహుజన కథలు రాస్తున్నానని, రాయాలని మొదట్లో నేను అనుకోలేదు. నా జీవితమే అది కాబట్టి నాకు తెలిసిన, నా అనుభవంలోకి వచ్చిన జీవితాలను చిత్రించే క్రమంలో అవి బహుజన కథలయ్యాయి. వ్యవసాయం చేసి ప్రజల ఆకలి అవసరాలను తీర్చేవాళ్లు, జనం అవసరాలను తీర్చే మాంసాన్ని అందించేవాళ్లు, పాలు పెరుగును ఉత్పత్తి చేసేవాళ్లు.. గొంగళ్లు నేసేవాళ్లు, అగ్గిపెట్టెలో పెట్టగలిగే నాణ్యమైన బట్టలు నేసేవాళ్లు, కుండలు చేసేవాళ్లు, బాడిసెపని చేసేవాళ్లు, నగలు చేసేవాళ్లు, సాతాన్లు, ఉరుకులయ్యోర్లు, గౌండ్లు, చేపలు పట్టేవాళ్లు, పండ్లమ్మే వాళ్లు, బట్టలు కుట్టేవాళ్ల, బట్టలుతికేవాళ్లు, క్షవరాలు చేసేవాళ్లు, సవారెడ్ల బండ్ల ముందు పరుగెత్తేవాళ్లు, సుంకర్లు, తెనుగువాళ్లు, బోడదాసర్లు.. ఇలా ఎంతమందని? వీళ్లంతా సర్వసంపదలకు సృష్టికర్తలైన వాళ్లు .. రెక్కలు ముక్కలు చేసుకున్నా డొక్కలైనా నిండనివాళ్లు, పని సంస్కృతిని ప్రేమించేవాళ్లు సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు గల వీళ్లంతా అన్నీ తామై చేస్తూ ఏమీలేనివాళ్లుగా ఎందుకుంటున్నారు? కర్రపెత్తనం చలాయించే వాళ్లెందుకు వీళ్ల మీద

అధికారాలు చెలాయిస్తున్నారు? ఇవీ నన్ను వేధిస్తున్న ప్రశ్నలు. నావాళ్లు నా చుట్టూ ఉన్న వాళ్లంతా నిరంతరం శ్రమించేవాళ్లే. దేశావసరాలన్నీ తీర్చే వీళ్లందరి సమస్యలు తీరితే వీళ్లు రాజ్యాధికారానికొస్తే దేశం ఈ పరిస్థితుల్లో ఉండాదా అని ప్రశ్నించుకుంటాను. వీళ్ల దగ్గర ఆస్తులు, అధికారాలు ఉండకపోవడమే కాక అవమానం ఎందుకు పొందుతున్నారు? చాకలి మంగలి వాళ్లపై జరిగే దౌర్జన్యాలు దళితుల మీది దౌర్జన్యాల కంటే తక్కువేమీ కాదు. బెస్త పెద్దరికం చెప్పుల మోత, గొల్ల తిక్క నెర్రె పొక్క, సాలె సంకుటం గోచిలిరుకుటం, మున్నూరు దానికి నన్నూరు మొగలు లాంటి కించపరిచే సామెతలూ వినేవాన్ని. అపర సృష్టికర్తలైన వీళ్ల గురించి రావాల్సినంత సాహిత్యం రావడం లేదన్నది గమనించాను. నేను మంచి సాహిత్యం, గొప్ప సాహిత్యం అని చదివినదాంట్లోనూ వీళ్ల గురించి వచ్చిన సాహిత్యం చాలా తక్కువ. చాలా సాహిత్యం అగ్రకుల సంస్కృతిని ఉన్నతీకరించేదే. రామాయణ మహాభారత సంస్కృతులను ఆదర్శీకరించేదే. అందుకే సృష్టికర్తల, శ్రామికజన సంస్కృతిని ఉన్నతీకరించాల్సిన అవసరం కనబడింది. అందుకోసమే నాకు తెలిసిన వ్యవసాయ, ఇతర వృత్తుల వారి గురించి కథలు రాశాను. పని సంస్కృతిని ఉన్నతీకరిస్తూ కథలు రాశాను. అలా రాసిన కథలే ఊరుమ్మడి బతుకులు, సొసంత్రదినం, అడవి గాచిన వెన్నెల, శనార్థి, వారసత్వం, భూమి పుత్రుడు (నవల), సాంబయ్య చదువు (నవల), మాట్లాడే బొమ్మలు (నవల), అడ్డాలనాడు, కరువు, రైతు హృదయం, సృష్టికర్త ఆవేదన లాంటి అనేక కథలు.

శ్రామిక స్త్రీలకు పండుగ కూడా ఒక వేదనే. బతుకమ్మలను దొరల ఇండ్ల ముందే ఆడాలి. అవమానాలూ తప్పవు. స్త్రీల వేదనే 'పండుగ వేదన' కత. కల్లు వంచే, ఇండ్లల్లకు కల్లు తీసుకుపోయే గౌడ స్త్రీలు పొందే అవమానాలు, హింస తక్కువేం కావు. ఊరుమ్మడి బతుకులు బతికే గౌండ్లవారి బతుకుల్లోని విషాదాన్ని తెలిపే కథే ఊరుమ్మడి బతుకులు. గొల్లలది శనార్థి సంస్కృతే. గొల్లల బతుకుల్లోని అన్ని ఘట్టాలను, దశలను చిత్రించే కథలూ రాశాను. కొత్తగా పెళ్లి చేసుకున్నా భార్యతో గడపలేని విషాదం గొర్ల కాపర్ల జీవితంలో ఉండడం నాకు తెలుసు. మా నాన్న నన్ను బడికి తోలడం వల్ల విద్యావంతున్నయ్యాను. లేకుంటే నా వాళ్లలా ఎండలో, వానలో, చలిలో భుజమ్మీద గొంగళితో, చేతిలో కట్టెతో చెట్టనక, పుట్టనక తిరగాల్సి వచ్చేదన్న భావన నన్ను నిలువనీయడం లేదు. అందుకే నేను సమస్త సంపదల సృష్టికర్తలైన బహుజనులకు అండగా నిలువడానికి రాశాను. కాన్షీరాంతో వచ్చిన బహుజన ఉద్యమం, మండల్‌తో వచ్చిన బి.సి. ఉద్యమం రాక ముందే నాకు తెలిసిన జీవితాలను అక్షరీకరించే క్రమంలో అనేక కథలొచ్చాయి. ఈ ఉద్యమాలు తెలుగు నేలపై వేళ్లూనిన



తర్వాత బహుజనుల గురించిఆ నేను రాసిన కథల్లో మరింత స్పష్టత పెరిగింది. తెలంగాణ కథ భూపోరాట ఉద్యమ కథ దగ్గరే ఆగిపోలేదన్న విషయానికి ఆ తర్వాత వైవిధ్యపూరితంగా ఇదిరకు స్పృశించని ఎన్నో అంశాలను స్పృశిస్తూ వస్తున్న కథలే నిదర్శనం. నా తెలంగాణ సామాజిక జీవితంతో, సహస్రవృత్తుల సమస్త జనాలతో సాహిత్యం, ఆ సంస్కృతితో మమేకమే నాతో అన్ని రచనలు చేయిస్తుంది. అందు కోసం నా మట్టికి నమస్కరిస్తున్నాను. నేనెందుకు రాస్తున్నానంటే నేను పుట్టిన నేల రుణం తీర్చుకోవడానికి. శ్రామిక సంస్కృతిని ఉన్నతీకరించడానికి.... సహస్ర వృత్తుల సమస్త జనాలకు బాసటగా నిలబడటానికి.. నా సాహిత్యం సమాజంలో ఏ మేరకు ప్రభావం చూపినా అదే నాకు పదివేలు.

ఇక జండర్ స్పృహ గురించి మాట్లాడాలంటే కొన్ని విషయాలు చర్చించుకోవాలి. బాధ్యత గల ఏ రచయితయినా (రచయిత) పితృస్వామ్యంలో స్త్రీ వ్యతిరేకంగా రాయడు. అయితే తాను జండర్ స్పృహతో రాస్తున్నానని తెలియకపోవచ్చు. రాయాలనీ అనుకోకపోవచ్చు. ఇంతకీ స్త్రీవాదోద్యమం, స్త్రీవాద సాహిత్యం వేటిని పట్టించుకున్నాయి? తెలంగాణలో వీటి ప్రభావం ఏ మేరకుంది? వీటిపై జరిగిన చర్చలు, విమర్శలు, ప్రతి విమర్శలు మనకు తెలియనివి కావు. ఏదేమైనా స్త్రీవాద ఉద్యమం, స్త్రీవాద సాహిత్యోద్యమం సమాజంపై చెప్పుకోదగ్గ ప్రభావాన్నే చూపాయి. స్త్రీల గురించి లోతైన సాహిత్యం రావడానికి తోడ్పడ్డాయి. ఈ ఉద్యమాలకు ముందే సాహిత్యంలో జండర్ స్పృహతో వీరేశలింగం, గురజాడ, చలం, రంగనాయకమ్మలాంటివాళ్లు విరివిగానే సాహిత్యం సృష్టించారు. సామాజిక బాధ్యతతో రచనలు చేస్తున్నవాళ్లంతా స్త్రీ పక్షపాతం వహించే రాశారు. తెలంగాణ సాహిత్యం విషయానికొస్తే స్త్రీవాద సాహిత్యం ఉద్యమ సాహిత్యంలో భాగంగానే వచ్చింది. దీనికి ప్రత్యేక ప్రతిపత్తి ఉందా అనే విషయంలో చర్చ జరగాల్సే ఉంది.

అయితే జండర్ స్పృహ, ఫెమినిస్టు ఉద్యమాలు, సాహిత్యోద్యమాలు ఉధృతమై ఇందులో స్త్రీలు విరివిగా రాయడం మొదలయిన తర్వాత దీనికి సమగ్రత చేకూరింది. ఎవరి సాహిత్యం వాళ్లు రాసుకుంటే గొప్ప సాహిత్యం వచ్చే అవకాశం ఉందనడానికి గత పదేళ్లలో వచ్చిన స్త్రీవాద సాహిత్యమే చక్కని ఉదాహరణ. తెలంగాణ సాహిత్యంలో దీని ప్రభావం ప్రత్యేకంగా ఉద్యమంగా పేర్కొనవలసిన స్థాయిలో లేకున్నా ఎవరికివాళ్లు రచయితలు, రచయిత్రులు తమ ప్రజాస్వామిక అవగాహనల్లో భాగంగానే సాహిత్యసృజన చేశారు. తెలంగాణలో దళిత బహుజన శ్రామిక స్త్రీల గురించి పట్టించుకున్నవి ప్రధానంగా వామపక్ష ఉద్యమాలే. నా అవగాహన ప్రకారమైతే స్త్రీవాదోద్యమాలు

ఎగువ మధ్యతరగతి, చదువుకొని ఉద్యోగాలు చేస్తున్న మధ్యతరగతి స్త్రీలకే పరిమితమయ్యాయి. స్త్రీల అస్తిత్వ సమస్య, పురుషుల ఆధిపత్యంలాంటివన్నీ వీళ్ల సమస్యలే. ఒకరు సంపాదిస్తే మిగతా వాళ్లు కూచొని తినడమో, ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నా స్త్రీ వివక్షకు గురికావడం లాంటివి జరుగుతున్న కుటుంబాల్లోని సమస్యలే ఇవి. నిర్మొహమాటంగా చెప్పాలంటే ఈ ఉద్యమాలు దళిత, పీడితకుల తెలంగాణ స్త్రీని పట్టించుకోలేదు. లేదా వీళ్ల సమస్యలు వాళ్ల దృష్టికి రాలేదు. దళిత, మధ్యతరగతి, అట్టడుగు స్త్రీల గురించి పట్టించుకోని ఏ ఉద్యమమైనా పాక్షికమే అవుతుంది. అలాగే అసలైన పీడితులైన దళిత, బహుజనులను పటించుకోని సాహిత్యం.. తెలుగు సాహిత్యంలో ఈ పద్ధతే కొనసాగుతుంది. తెలంగాణ సాహిత్యం కొంత మినహాయింపు.

శ్రామిక, దళిత, బహుజన కుటుంబాల్లో అస్తిత్వ సమస్యలు, ఇతర ఎగువ మధ్యతరగతి చదువుకున్నవాళ్ల సమస్యలు చాలా తక్కువ. భర్త తిడితే భార్య తిడుతుంది. కొడితే కొట్టడమూ జరగవచ్చు. ఇద్దరూ శ్రమ చేస్తూ సంపాదిస్తారు. భర్తపై భార్య ఆధారపడే పరిస్థితులు తక్కువ. ఈ కుటుంబాల్లో చాలా వరకు మాతృస్వామ్య లక్షణాలు కనబడుతాయి. మాతృదేవతారాధన, ఇంటికి తల్లే యజమానిగా ఉండటం ముఖ్యంగా దళిత కుటుంబాల్లో కనబడుతుంది. మా నాన్న డబ్బు తెచ్చి మా అవ్వకిచ్చేవాడు. ఆమె దగ్గర్నుంచి మేం తీసుకునేవాళ్లం. చాలా కుటుంబాల్లో ఇలాగే ఉండేది. మా వాడకున్న శ్రామిక కుటుంబాల్లో అందరూ భార్యాభర్తలు సమానంగా అరుచుకునేవారు. కొన్ని కుటుంబాల్లో భర్త తాగి వచ్చి కొట్టడం లాంటివి వుండేవి. అలాంటి కుటుంబాల్లో కుటుంబ భారాన్ని స్త్రీయే మోసేది. ఇంటికి స్త్రీయే యజమానిగా ఉన్న తర్వాత కావాల్సిందేమిటి? అట్లని స్త్రీవాదోద్యమం అవసరం లేదని కాదు. ఆ స్త్రీవాదం మరికొంత కిందికి దిగి దళిత, శ్రామిక, దిగువ మధ్యతరగతి స్త్రీల సమస్యలను తనవి చేసుకుంటే మరింత సమగ్రంగా ఉంటుంది.

నేను పుట్టి పెరిగిన వాతావరణంలో నాకు చిన్నతనంలో స్త్రీపురుష వివక్ష ఉన్నట్టు తెలిసేది కాదు. ఓ చిన్న ఉదాహరణ - స్త్రీవాద ఉద్యమాలు ప్రారంభమైన సమయంలో ఫెమినిస్టు స్త్రీ బహిరంగంగా సిగరెట్ తాగుతుందని, అదెంత అరాచక చర్య అని నాతో ఓ మిత్రుడన్నాడు. ఆ పని నాకేం వింతగా కనబడలేదు. ఆ కాలేజీలో లెక్చరర్లు బహిరంగంగా సిగరెట్ తాగితే లేని తప్పు ఆమె తాగితే ఎందుకుట అని నేను ప్రశ్నించాను. అతను నోరు మూసుకోలేదు కాని గొణుక్కుంటూ వెళ్లిపోయాడు. మా నాయనమ్మ, తాత ఇద్దరూ పక్కపక్కన కూచొని చుట్ట తాగేవారు. శ్రామిక బహుజన కుటుంబాల్లో ఇది మామూలే. కల్లు తాగినా అంతే. ఆడమగ కలిసి హాయిగా తాగేవారు. కాని మధ్యతరగతి, ఎగువ మధ్య తరగతిలో మధ్యతరగతి విలువలు జీర్ణించుకున్న



కుటుంబాల్లో మగవాడు మాత్రం బాగా తాగుతాడు. స్త్రీ తాగకూడదు. ఆ మాటే ఉచ్ఛరించకూడదు. ఇలాంటివాటిని పట్టించుకుంది ఫెమినిజం. నేను పుట్టి పెరిగిన కుటుంబ వాతావరణంలో పై సమస్యల్లా కాక స్త్రీలకు వేరే తీరు సమస్యలుండేవి. ఆడమగ ఇద్దరిలో ఒకర్నే చదివించే అవకాశాలుంటే మగపిల్లవాన్ని చదివించేవారు. ఆడపిల్లలకు బాల్య వివాహాలు జరిగేవి. మగవాళ్లు తాగుబోతులవడంలాంటివి ఉండేవి. మా నాన్నకంతగా చదువు లేకున్నా నన్ను ఆ తర్వాత మా చెల్లెను బడికి తోలించాడు. ఆమె అసలే పోనని మొండికేసింది. ఎంత ప్రయత్నించినా పోకుంటే బందుజేశాడు. ఆమెకు పదవ యేటనే పెళ్లి చేసి పంపించాడు. శ్రామిక కుటుంబాల్లో స్త్రీల అక్షరాస్యత చాలా తక్కువ. మూఢ నమ్మకాలు ఎక్కువే. ఇలాంటి ఇంకా అనేక విషయాలను పట్టించుకొని ఉద్యమిస్తే స్త్రీవాదం సర్వసమగ్రమవుతుంది.

జండర్ స్పృహ మిగతా విషయాల్లాగే నాకు తెలియకుండానే కలిగింది. తెలిసింతర్వాత మరింత బలపడింది. చదువుకునే రోజుల్లో వీరేశలింగం పంతులు గారితో చాలా ప్రభావితమయ్యాను. సంస్కర్తల గురించి చదివినప్పుడు ఎంతో ఆనందించాను. నా చుట్టూ ఉన్న స్త్రీలు తల్లి, నాయనమ్మ, మా చిన్నమ్మలు, అంతా తామై రాక్షసుల్లా పని చేసే చుట్టుపక్క స్త్రీలు, కుటుంబ గ్రామ వాతావరణం నన్ను దిగువ మధ్యతరగతి, అట్టడుగు స్త్రీల గురించి ఆలోచించేట్టు చేశాయి. వాళ్లను పట్టించుకొని రాయడానికి పురికొల్పాయి. నేను రాసిన మొదటి కథ 'వెలి' ఓ శ్రామిక స్త్రీ దృష్టి కోణంలోంచి రాయబడిందే. ఆ కథకు ఉద్యమ నేపథ్యమున్నా స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని ఎదుర్కోవడం అంశంగా ఉంది. శ్రామిక కుటుంబాల వాళ్లు మధ్యతరగతికి ఎదిగిన తర్వాత లేదా మధ్యతరగతి విలువలను జీర్ణించుకున్న తర్వాత విలువల్లో వచ్చే మార్పును చిత్రించిన కథ నాయనమ్మ కోరిక. అంతకు ముందు బహిరంగంగా చుట్ట తాగిన స్త్రీ కోడల్ల చేతుల్లోకి పోయింతర్వాత ఆ కుటుంబంలో మధ్యతరగతి విలువలు ప్రవేశించింతర్వాత తిప్పలు పడాల్సి వస్తుంది. చుట్ట తాగే తన కోర్కెను తీర్చమని మనుమన్ని వేడుకుంటుంది. రాక్షసిలా పని చేస్తూ కుటుంబం కోసం గయ్యాళిగా పేరు తెచ్చుకున్నా వెళ్లదీసుకోవడానికి శ్రమపడే స్త్రీ కథ రాక్షసి. ఇలాంటి రాక్షసులు శ్రామిక, వ్యవసాయ కుటుంబాల్లో చాలా మందున్నారు.

వలసలు, వృత్తుల నేపథ్యంలోంచి పద్మశాలి స్త్రీల గురించి నేను రాసిన కథలు నిరీక్షణ, పరాధీన. పట్టుచీర కట్టుకోవాలన్న తన కోర్కెను మూడు తరాలు గడిచినా తీర్చుకోలేని పరాధీన బతుకును బతికిన స్త్రీ కథే పరాధీన. భీవండికి పోయిన తన బావ రాక కోసం తరతరాలుగా యుగయుగాలుగా నిరీక్షణ చేస్తూనే ఉంటుంది రుక్కమ్మ.. మతకలహాల్లో చనిపోయిన తన బావ ఇక రాడని ఆమెకు తెలిపే సాహసం

ఎవరికీ లేదు. పెద్ద చదువుల కోసమో, సింగరేణి ఉద్యోగానికో, దూర ప్రదేశాల్లో ఉద్యోగం కోసమో పోయిన కొడుకుల రాక కోసం గలుమల దగ్గర కూచొని ఎదురుచూసే వాళ్లెంతో మంది తెలంగాణ గ్రామాల్లో ఉన్నారు. వాళ్లను చూస్తుంటే హృదయం ద్రవిస్తూంటుంది. ఎవరి కోసం ఎదిరి చూస్తున్నావంటే దేశం పోయిన కొడుకు కోసం అంటుందా తల్లి. దేశం పోవడమంటే ఊరొదిలి కొంత దూర ప్రదేశంలోకి బతుకపోవడం.. అలాంటి తల్లుల ఎదురుచూపు కథే గలుమ. ఎదురు చూస్తే మాత్రం వాడొస్తాడా? వచ్చినా ఆమెను దగ్గరకు తీసుకుంటాడా? ఈ గలుమల దగ్గర ఎదురు చూసే వాళ్లలో భర్త కోసం చూసేవాళ్లూ ఉన్నారు. పైటలను తగలెయ్యడంతో పాటు ఇలాంటి ఎదురుచూపుల కేంద్రాలైన 'గలుమ'లను తవ్వేయ్యాలని చెప్పే కథ 'గలుమ'. అలాగే వృద్ధులైన తల్లులు కొడుకులు, కోడళ్ల నిర్లక్ష్యానికి గురి కాబడటం అంశంగా గల కథ మౌనహింస. ఎన్నో కుటుంబాల్లో వృద్ధ స్త్రీలు కనబడని హింసను మౌనంగా అనుభవిస్తూనే ఉన్నారు.

దళిత స్త్రీ దృష్టి కోణంలో నుంచి కూడా నేను చాలా కథలే రాశాను. స్త్రీ మీద జరుగుతున్న దగాను చిత్రించిన కథ దగాదగా. చైతన్యవంతురాలైన దళిత స్త్రీ విధవరాలైన షావుకారమ్మకు అండదండగా నిలిచి పోరాడి గెలిచిన క్రమం ఈ కథలో చిత్రించబడింది. భర్త చనిపోతే భార్య అగ్గి పట్టకూడదని, ఆస్తికి ఆమె వారసురాలు కాదన్న వాళ్లను తమకున్న ఉద్యమ చైతన్యంతో ఓడిస్తుంది అరుణ. భార్యను చదివించి ఉద్ధరించానని భావించే భర్త ఆమెనేపాటి ఉద్ధరించాడో, ఆ ఉద్ధరింపులో ఉన్న స్వార్థమేమిటో తెలిపే కథ ఉద్ధరింపు. బామ్మర్ది అనే కథ ఓ దళిత స్త్రీ గ్రామంలో ఎదుర్కొన్న వేధింపుల్ని చిత్రించిన కథ. ఇతరులను బామ్మర్దీ అంటూ ధైర్యానికి మారు పేరుగా ఉండే దళిత స్త్రీ దొరలతో చెరచబడుతుంది. ఎంత ధైర్యసాహసాలతో సమాజాన్ని ఎదిరిస్తూ బతుకుదామనుకున్నా ఆమె బతుకు కుక్కలు చింపిన విస్తరే అవుతుంది. ఈ సమాజంలో దళిత స్త్రీపై జరిగే దౌర్జన్యాలను వాస్తవిక దృక్పథంతో చిత్రించిన కథ బామ్మర్ది.

తెలంగాణలో దొరలు దోపిడీదారులే. దౌర్జన్యకారులే. ఆ దౌర్జన్యం దొరల భార్యలైన దొర్సాన్ల మీద కూడా జరిగేది. ఫ్యూడల్ దొరలు చాలామంది తమ భార్యలను దొరసానులుగా మాత్రమే చూశారు. వాళ్లకెంతో మనోవేదన కలిగించారు. తాము పూలరంగడిలా తిరిగి వాళ్లను వేధించారు. గడీల్లో దొర్సాన్లు అనుభవించే మౌన హింసను, దొర్సాన్ల బతుకుల్లోని విషాదాన్ని తెలుపుతూ రాసిన కథలు చిందొర్సాని, పంజరం, పాపం దొర్సాని, దొరగారి భార్య, యోజనగంధి.. దొరగారి గడీల్లోని పంజరం బతుకుల నుంచి, ఆ సంకెళ్ల నుంచి బయటపడి స్వేచ్ఛాజీవితం గడపాలని తెలిపే



కథలు. శ్రామిక బతుకుల్లో ఉన్న స్వేచ్ఛయినా వాళ్లనుభవిస్తున్నారా అని ప్రశ్నించే కథలివి. దొర్సాని చీర కట్టుకున్న చాకలి స్త్రీని నువ్వు నాకేమవుతవే అని చెరుస్తాడు దొర. ఇది దొరసాని చీర కథలోని అంశం.

తెలంగాణ సామాజిక జీవిత చిత్రణ, స్త్రీ, దళిత, బహుజన కథలతో పాటు నేను పూర్తి మాండలికంలో అనేక కథలు రాశాను. తెలంగాణ మాండలిక భాషా సొగసులను, బలాన్ని వెలికితీసే ఈ రచనల్లో కొన్ని ఇవి - వెలి, పాలేరు, భూమి కోసం, బామ్మర్ది, కైకిలి, ముక్కోటి రతనాల వీణ, బువ్వకోసం, ఎట్టి బతుకు, దొర్సాని చీర, తెల్లవారితే, ధిక్కారం, దక్కలి సంస్కృతి, ఎంగిలిచేత్తో, ఊరుమ్మడి బతుకు, దొరగారి ఎద్దు, గడుకబువ్వ, బొక్కల పులుసు, చెప్పు దప్పు, పోత్రవుతు, సొసంత్రం, బర్ల హనుమయ్య అంతరంగం, లాంటి కథలు.. అవ్వతోడు గిది తెలంగాణ, తెలంగాణ మట్టి కథలు, దిల్లగి ముచ్చట్లు లాంటి శీర్షికా రచనలు...

నా మట్టుకు నేనయితే జండర్ స్పృహ కలుగక ముందు కొంతకొంతగా, కలిగిన తర్వాత మరింత అవగాహనతో ఇదివరకు స్పృశించని, స్పృశించినా చాలా తక్కువ స్పృశించిన, స్త్రీవాదులు వదిలిపెట్టిన గ్రామీణ స్త్రీని తీసుకొని రాశాను. ఆ ఖాళీ పూర్తి చేయడానికి రాశాను. మరి కొన్ని కథలు వామపక్ష ఉద్యమాల్లో భాగంగా రాశాను. ఎలా రాసినా, ఏం రాసినా, ఎప్పుడు రాసినా దృక్పథం ఒక్కటే. పీడిత స్త్రీ దృక్కోణంలోంచి రాయడమే. అయినా ఈ విషయంలో ఇంకా అనేక కథలు రావాల్సే ఉంది. ముఖ్యంగా వ్యవసాయ కార్మిక స్త్రీల గురించి - జండర్ స్పృహ, తెలంగాణ స్పృహ నాతో నిరంతరం రాయిస్తున్నాయి. ఈ సమాజానికి నా రాతల అవసరం తీరిందని నేను భావించేవరకు నేను రాస్తూనే ఉంటాను. ఏ రోజయితే నేను రాయడం ఆపివేస్తానో, ఓ సంవత్సరం పాటు ఏ పత్రికలోనూ నా ఒక్క రచన కూడా రాదో ఆ మరుసటి రోజే నేను దేహయాత్ర చాలిస్తాను.. సెలవు....

"జండర్ స్పృహ"పై యుజిసి సెమినార్ (కాకతీయ యూనివర్శిటీ)లో చదివిన ప్రసంగ వ్యాసం, జూన్ 2003

# నైజామాంధ్ర కథా ప్రస్థానం

కోస్తా వారిది భ్రౌణ్యాంధ్రం. తెలంగాణావారి భాష తౌరక్యాంధ్రం. వారిది ఇంగ్లీషు దడదడ... మాధి ఉర్దూ గడబిడ.. అనే వారు తెలంగాణలో మాట్లాడే భాష గూర్చి సురవరం ప్రతాపరెడ్డిగారు.. వందలాది ఏండ్లు తెలంగాణను నైజాం నవాబులు, కోస్తా ప్రాంతాన్ని ఇంగ్లీషువాళ్ళు పరిపాలించడంవల్ల తెలంగాణ భాషా సంస్కృతులపై ఉర్దూ ప్రభావం, కోస్తా భాషా సంస్కృతులపై ఆంగ్ల ప్రభావం ఉంది. ఆంగ్ల భాషా సంస్కృతుల ప్రభావంతో కోస్తాలో ఆధునికతతో పాటు ఆధునిక సాహిత్య ప్రక్రియయైన కథానిక కూడా కొంత ముందుగానే ప్రవేశించింది. లిఖిత కథకు పాఠకులు, వస్తువైన మధ్యతరగతి ఆవిర్భావం కూడా కోస్తా ప్రాంతంలో ముందుగానే జరగడంవల్ల ఇది మరింత సులభమైంది. అయితే ముస్లింరాజుల పాలనలో ఉండి మధ్యతరగతి అసలే లేని నైజామాంధ్ర (తెలంగాణ)లో కథానిక కోస్తా ప్రాంతంలో వచ్చిన రెండేళ్ళలోనే వచ్చింది. గురజాడ దిద్దుబాటు కత ప్రచురింపబడిన ఆంధ్రభారతిలోనే మాడపాటి హనుమంతరావు రాసిన హృదయశల్యం కథ 1912లో అచ్చయింది. తెలంగాణా నుంచి మాడపాటి హనుమంతరావు మొదటి కథకుడుగా హృదయశల్యం మొదటి కథగా తెలంగాణ కథా ప్రస్థానం మొదలయింది.

అయితే కోస్తా ప్రాంతానికున్నంత కథలను ప్రచురించే అవకాశాలు, లిఖిత కథలను చదివే మధ్యతరగతి తెలంగాణలో లేదు. తెలంగాణలో అప్పుడున్నది భూస్వాములు, దొరలు - వాళ్ల భూముల్లో పని చేసే అట్టడుగు వర్గాలవారు.. అందుకే కోస్తాలో కథ మధ్యతరగతి దృష్టికోణంలోంచి ప్రారంభమైతే తెలంగాణలో అట్టడుగు వర్గాల దృష్టి కోణంలోంచి మొదలవుతుంది. కథకు వస్తువును సమకాలీన సమాజంలోంచి తీసుకోవడం సరైంది కాబట్టి తెలంగాణ రచయితలకు కథావస్తువు అట్టడుగు జీవితాలే అయ్యాయి. నిజానికిది వస్తు సేకరణలో ఒకడుగు ముందున్నట్లే. వస్తువుతో పాటు భాషాశిల్పాల్లోనూ సాంప్రదాయ రీతికి కొంత భిన్నంగా మాండలికం వాడటం, ఆశు కథా సాంప్రదాయరీతులను ఉపయోగించడం మొదటితరం నుంచే చూడవచ్చు. తెలంగాణలోని మౌఖిక సంస్కృతి, శిల్ప క్లిష్టత లేని ఆశుకథన పద్ధతులు లిఖిత కథల్లోనూ ఉపయోగించారు. అందుకే మధ్యతరగతి వస్తుశిల్ప దృష్టి కోణాలతో కోస్తా ప్రాంతంలో కథావిర్భావ వికాసాలు జరిగిన చాలాకాలం వరకు కూడా తెలంగాణ నుంచి కథలు వచ్చినట్టుగా గుర్తించిన వాళ్లు తక్కువ. తెలుగు కథ దశను దిశను మార్చేంత గొప్పగా తెలంగాణ నుంచి కథలు వచ్చిన కాలంలోనూ తెలంగాణ



రచయితలు వస్తువుకిచ్చిన ప్రాధాన్యం శిల్పానికివ్వరన్న విమర్శలు వచ్చాయి. స్వాతంత్ర్యానంతరం పుట్టిపెరిగి చదువులతో జీవితాలను గెలుచుకొని రచయితలైనవారు లిఖిత కథకు ఆశు సంప్రదాయ రీతులలో రాస్తూనే మధ్యతరగతి వస్తు శిల్పాలను ఎన్నుకొని రాయడం ప్రారంభించిన తర్వాత తెలంగాణ నుంచి గొప్ప కథలు వస్తున్నాయన్నారు కాని మొదట్నుంచి సాహిత్య ప్రయోజనం ధ్యేయంగా మంచి గొప్ప కథలు వస్తున్నాయి. విశాలాంధ్ర వారు ప్రచురిస్తున్న 90 కథలు అందులో కొన్ని మాత్రమే. ఇవి తెలంగాణ జనజీవన సంఘర్షణను వివిధ కోణాల్లోంచి చిత్రించిన కథలే తప్ప మొత్తం తెలంగాణ కథంటే ఇవి మాత్రమే కాదు.

మొదటితరంలో తెలంగాణ నుంచి కథలు రాసినవాళ్లు కేవలం రాసి ఊర్కున్నవాళ్లు కారు. తెలంగాణ వికాసం కోసం శాయశక్తులా పని చేసినవాళ్లే. మాడపాటి హనుమంతరావు, కాళోజీ నారాయణరావు, దాశరథి రంగాచార్యలాంటి వాళ్లకు జీవితం సాహిత్యం వేరు కావు. కోస్తా ప్రాంతంలోనయినా తెలంగాణలోనైనా మొదటితరం రచయితలంతా తమ సాహిత్యాన్ని స్వాతంత్ర్య కాంక్షతోనో, సంస్కరణ నేపథ్యంతోనో, సామాజిక మార్పు కోసమో ఉపయోగించారు. అదే పరంపరను తెలంగాణ రచయితలు ఇప్పటికీ కొనసాగిస్తున్నారు. కొంచెం ఆలస్యంగానైనా నైజాంకాలం నాటి ప్రజా జీవన చిత్రణ, సంఘర్షణ, సంస్కరణ నేపథ్యంతో తెలంగాణ కథా ప్రస్థానం ప్రగతిశీల మార్గంలో మొదలయింది.

తెలుగు చదవడానికి, పత్రికలు చదవడానికి అవకాశాలు మృగ్యమైన కాలంలో తెలంగాణ కథ పుట్టింది. నైజాం కాలంనాటి ప్రజల జీవనచిత్రణ, సమకాలీన సామాజిక పరిస్థితులు, తెలంగాణ గ్రామీణ సంఘర్షణను తనది చేసుకుంది. ప్రజల జీవద్భాషయైన మాండలికాన్ని హృదయానికి హత్తుకుంది. ప్రజాపక్షం వహించింది. ఏ వ్యాపార మసాలాల జోలికీ పోలేదు. ఏ ప్రలోభాలకూ లొంగలేదు. డిటెక్టివ్, అవాస్తవిక ప్రేమకథలు, భూతప్రేత పిశాచగణాల్లో పడి తెలుగు సాహిత్యం కొట్టుమిట్టాడుతున్న సమయంలోనూ తెలంగాణ నుంచి మంచి కథలే వచ్చాయి. తెలంగాణ రచయితలెవరూ నేల విడిచి సాము చేయలేదు. తెలంగాణ కత అన్ని ఉద్యమాలనూ తనలో సంలీనం చేసుకుంది. రజాకారు పోరాటాలకు భాష్యం పలికింది. తెలంగాణ గ్రామాలను హృదయానికి హత్తుకుంది. మధ్యతరగతి బతుకు వెతలను తనది చేసుకుంది. గత శతాబ్ది డెబ్భై దశకంలో ప్రారంభమై ఉవ్వెత్తున ఎగిసిన భూపోరాటాలకు భాష్యం పలికింది. తెలగు కథకు విప్లవ కథ పంథాను చూపింది. కార్మిక కర్షక విద్యార్థి మేధావివర్గాలను తీసుకొని కథలు రాశారు. కార్మికవర్గాన్ని అక్కున చేర్చుకుంది. గిరిజన

పోరాటాలనూ అక్షరబద్ధం చేసింది. దళిత కథకు పట్టం కట్టింది. బహుజన జీవితాలకు భాష్యం పలికింది. మైనారిటీలను హృదయానికి అదుముకుంది. వివక్షను ఎత్తి చూపింది. ప్రపంచీకరణ భాగోతాన్ని బట్టబయలు చేసింది. వని నంన్కృతిని ఉన్నతీకరించుకోవడం, దేశీయతను రక్షించుకోవడమే పరిష్కార మార్గమని ధిక్కారస్వరాన్ని చాటింది. ఎన్నో ప్రయోగాలు చేసింది. మారుతున్న విలువలను, పతనమవుతున్న వృత్తులను, ప్రత్యామ్నాయం లేని బతుకులను, మృగ్యమవుతున్న మానవసంబంధాలను అక్షరీకరించింది. ఉత్తమ సమాజం కోసం తన వంతు కృషి చేసింది. ఈ తొంభై యేండ్ల కాలంలో తెలంగాణళ కథ అనేక పార్శ్వాలను స్పృశించింది. తెలంగాణ కథ అడుగు పెట్టని చోటు లేదు. ముట్టని వస్తువు లేదు.

తెలంగాణ కథ స్పృశించిన అనేక పార్శ్వాలను మనమీ సంకలనంలో చూడవచ్చు. నైజాం కాలంనాటి తెలంగాణ ప్రజల స్థితిగతులను ఎవరికి (మాడపాటి హనుమంతరావు), మనమే నయం (కాళోజీ నారాయణరావు), ఆత్మఘోష (జి. రాములు), యుగాంతం (నెల్లూరి కేశవస్వామి), గొల్ల రామవ్వ (పి.వి. నరసింహారావు), చెరువొడ్డున (కాంచనపల్లి చిన వెంకటరామారావు), పందెం (నందగిరి ఇందిరాదేవి), పరిగె (వట్టికోట ఆళ్వారుస్వామి) కథల్లో చూడవచ్చు. జమీందారీ వ్యవస్థలోని దుర్మార్గాన్ని 'ఎవరికి' కథలో కళ్లకు కట్టించాడు రచయిత. ఈ వ్యవస్థలో తినడానికి తిండి కూడా లేక హీనమైన స్థితిలో ఉన్న ఎంతో మంది మనుషుల కంటె మనమే నయం అనుకుంటాయి కాళోజీ కథలోని పశువులు. ఓ దళితుడు పరిగేరుకొని తీసికెళ్తున్న వరికర్రలను దొంగతనం నేరం మోపి లాక్కున్న దొరల,దౌర్జన్యాన్ని తెలిపే కథ పరిగె. వస్తు రీత్యాను, శిల్పం రీత్యాను, భాష రీత్యాను గొల్ల రామవ్వ అద్భుతమైన కథ. రజాకార్లను చంపి వచ్చిన కాంగ్రెస్ కార్యకర్తను గొల్లరామవ్వ తన ఇంట్లో దాచిన వైనాన్ని అద్భుతంగా చిత్రించిన కథ. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన సమయంలో తెలంగాణ ప్రజల మనోభావాలను చిత్రించిన కథ ముక్కోటి బలగమోయి (సురమౌళి). తెలంగాణ ప్రజల సహృదయత, సంస్కారం, అమాయకత్వం మనమీ కథలో చూడవచ్చు. గొప్ప నవలాకారుడయిన దాశరథి రంగాచార్య రాసిన కథ తామరపూలు.

పల్లె బతుకుల్లోని ప్రేమలు, ఆప్యాయతలు బతుకుదామని పట్టణం పోయిన తర్వాత భార్యాభర్తలు దూరం కావడం, భర్త తాగుబోతు కావడంలోని విషాదాన్ని పట్టణం కంటె పల్లె నయం అన్న విషయాన్ని తెలిపిన కథ గూడూరి సీతారాం రాసిన లచ్చి. మొదటితరంలో జరిగిన తెలంగాణ పోరాటాల గురించి నవలలు వచ్చినా తెలంగాణ రచయితల నుంచి చెప్పుకోదగ్గ కథలు రాకపోవడం గమనించదగ్గ విషయం.



పోరాటాల గూర్చి తెలుసుకొని, పత్రికల్లో చదివి తెలంగాణేతర రచయితలు కొన్ని కథలు రాశారు. వీటిలో స్థలకాలాల చైతన్యం కనబడదు. స్థలకాలాల చైతన్యంతో తెలుగు కథను విప్లవ కథగా తీర్చిదిద్దుతూ వచ్చిన కథలు భూపోరాటాల గూర్చి వచ్చినవే. ఫ్యూడల్ వ్యవస్థ అమలులో ఉన్న కాలంలో పుట్టి పెరిగి ఫ్యూడల్ వేదనను అనుభవించి అతి కష్టంగా చదువుకొని అందులోంచి రచయితలైన వాళ్లు రెండవసారి ఉవ్వెత్తున లేచిన పోరాటాలకు భాష్యాలనదగిన కథలు రాశారు. విప్లవ కథాసారథి అల్లం రాజయ్యతో పాటు బి.యస్. రాములు, రఘోత్తమరెడ్డి, కాలువ మల్లయ్య, వుప్పల నరసింహం, పి. చంద్ పోరాట కథను సుసంపన్నం చేశారు.

భూమి (అల్లం రాజయ్య), పాలు ఎర్రబడ్డాయి (దేవరాజు మహారాజు, విద్యాసాగర్), దొరగారి కుక్క (నందిగం కృష్ణారావు), ఇత్తనపు కోడె (వుప్పల నరసింహం), మనం తుడుం కొట్టాలె (సాహు), చెర (నవీన్), దొర మల్లా వచ్చిండు (కె.వి. నరేందర్), బొడ్రాయి (భూపాల్) తెలంగాణ గ్రామీణ సంఘర్షణను, ఫ్యూడల్ గ్రామాలను, భూస్వామ్య వ్యవస్థ పతన దిక్కు నడుస్తున్న వైనాన్ని తెలిపే కథలు. దున్నేవాడికే భూమి చెందాలన్న భావాన్ని ఓ బక్కచిక్కిన రైతు దృష్టికోణంలోంచి తెలిపిన కథ భూమి. భూపోరాటాలు రైతులలో ఎంత ఆత్మవిశ్వాసాన్ని పెంచాయో, తమ సమస్యల పరిష్కారానికి పోరాటం తప్ప మరో మార్గం లేదన్న సత్యాన్ని తెలుపుతుందీ కథ. మనం తుడుం కొట్టాలె గిరిజన పోరాట కథ. గిరిజన బంధు సాహు వాళ్లతో మమేకమై గిరిజన సంస్కృతిని, భాషను ఒంటబట్టించుకొని గిరిజనులపై అద్భుతమైన కథలు రాశాడు. పోరాటాల కాలంలో తెల్లని పాలూ ఎర్రబడతాయి. ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థలోని దొరల దుర్మార్గాన్ని ఇత్తనపు కోడె కథలో చెబితే, దొరలు పేదవారిని చెరపట్టి హీనాతిహీనమైన పనులకు ఉపయోగించుకోవడాన్ని చెర కథ చెబుతుంది. ఊళ్లొదిలి పోయిన దొరలు మళ్లీ ఊళ్లోకొస్తే జరిగే పరిణామాలను తెలిపే కథ దొర మల్లా వచ్చిండు. దిగంబర సాహిత్యోద్య కారుడైన నిఖిలేశ్వర్, జ్వాలాముఖి రాసిన కథలు గడ్డం మనిషి, అల్లా ఉద్దీన్ ఆశాదీపం, చిన్ననాటి స్నేహితులైన ఇద్దరి మధ్య విప్లవ పోరాటాల కాలంలో భావాలు, ఉద్వేగాలు పెంచిన దూరాన్ని తెలిపే కథ కాసుల ప్రతాపరెడ్డి 'ఆఫ్టర్ ట్వంటీ ఇయర్స్ అను మంచి మిత్రుల కథ'.

తెలంగాణ కథకు మరో ముఖ్యమైన పార్శ్వం దళిత కథలు. తెలుగు దళిత కథకు దశను, దిశనిచ్చింది తెలంగాణ కథలే. మార్క్సిజంతో పాటు అంబేద్కరిజంతో ప్రభావితులై తెలంగాణ రచయితలు దళిత కథలను విరివిగా రాశారు. బోయ జంగయ్య, బి.యస్. రాములు, కాలువ మల్లయ్య ఈ రంగంలో విశేషంగా కృషి చేశారు. విప్లవ

కథలలో భాగంగా అల్లం రాజయ్య దళిత కథలు రాశాడు. బొమ్మలు (బోయ జంగయ్య), కళేబరం (జూకంటి జగన్నాథం), గౌరడు (గూడ అంజయ్య), ఎట్టి (బి. దామోదరరావు), మా ఊరి ముచ్చట్లు (నల్లాల లక్ష్మీరాజం), చెప్పులు (జింబో), పరిగె కథలు దళితులపై జరుగుతున్న దౌర్జన్యాలను, దళితుల్లోని తిరుగుబాటు తత్వాన్ని, దళిత సంస్కృతిని అంబేద్కరిజం వెలుగులో వాళ్ల జీవితాలను గెలుచుకున్న క్రమాన్ని తెలిపే కథలు. తెలంగాణ కథకు మరో ముఖ్యమైన పార్శ్వం బహుజన కథ. సర్వసంపదలకు సృష్టికర్తలైన బహుజనులకు సాహిత్యంలో వస్తువుగా చోటు లభించింది చాలా తక్కువ. శ్రామిక వృత్తిపనుల కులాల్లోంచి రచయితలు వచ్చింతర్వాత వివిధ ఉద్యమాల వెలుగులో సామాజిక న్యాయం ధ్యేయంగా కతలు రావడం మొదలైంది. వివిధ వృత్తుల గూర్చి కథలంతగా రాని సమయం నుంచే బహుజనుల గూర్చి పుంఖానుపుంఖంగా కథలు రాసిన తెలంగాణ రచయితలున్నారు. కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, పెద్దింటి అశోక్‌కుమార్, సదానంద శారద బహుజన కథను సుసంపన్నం చేస్తున్నారు. లచ్చి, ఊరుమ్మడి బతుకు (కాలువ మల్లయ్య), వరుసలు (బి.యస్. రాములు), కలికి గాంధారి (ఐతాచంద్రయ్య), ముసల్దాని ముల్లె (ఆడెపు లక్ష్మీపతి), లగ్గం సంబురం (అంబల్ల జనార్దన్), బతుకు రేవు (చైతన్య ప్రకాశ్), తెగిన బంధాలు (పెద్దింటి అశోక్‌కుమార్), భూమి గాయం (బెజ్జారపు వినోద్‌కుమార్) కథలు వివిధ వృత్తి పనుల్లోని సంస్కృతికి అద్దం పడుతూ పని సంస్కృతిని ఉన్నతీకరించే కథలు. వృత్తులు నశించి ప్రత్యామ్నాయాలు లేక గిలగిలా కొట్టుకుంటున్న గ్రామీణ జీవితానికి చిత్రికలు. మారుతున్న విలువలు, మానవ సంబంధాలు డబ్బు సంబంధాలుగా మారడాన్ని పల్లెలు ఆప్యాయతలను, అనురాగాలను కోల్పోవడాన్ని హృద్యంగా చిత్రించిన కథలు. తెలంగాణా గ్రామీణ సంస్కృతిని, రైతుల బతుకులను చిత్రించే కతలు తిత్తి (దొడ్డి రామ్మూర్తి), బోరుపొక్కలు (బోధనం నర్సిరెడ్డి), అంతర్ముఖం (జాతశ్రీ), ఐ.టి. కప్ప (పులిపాటి గురుస్వామి) గ్లోబల్ మాయను చిత్రించిన కథలు.

పారిశ్రామిక కార్మికవర్గం తెలంగాణలో స్వాతంత్ర్యానంతరం క్రమక్రమంగా పెరగసాగింది. ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాల్లో గోదావరి నదీ తీరం వెంట బొగ్గగనులు పడ్డ తర్వాత బొగ్గు ఆధారిత పరిశ్రమలు పెరిగాయి. దాంతో కార్మికవర్గం మరింత పెరిగింది. అయితే కార్మికుల గూర్చి చెప్పుకోదగ్గ సంఖ్యలో కథలు రావడానికి చాలా కాలమే పట్టింది. భూపోరాటాలు ఉధృతమైన తర్వాత సింగరేణి కార్మికుల గూర్చి ఆ ప్రాంతంలో పని చేస్తున్న రచయితలు బాగా కథలు రాయడం ప్రారంభించిన తర్వాతే కార్మిక కథలెక్కువయ్యాయి. తెలంగాణలో కార్మికవర్గం గూర్చి



కార్మిక, అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, పి. చంద్, కాలువ మల్లయ్య, వేల్పుల నారాయణ, ఆడెపు లక్ష్మీపతి విరివిగా కథలు రాశారు. హైదరాబాద్ కార్మికులు, కార్మిక జీవితాల గూర్చి బోనస్ (పులుగు శ్రీనివాస్), గుడిసెలు గుడిసెలు (ముదిగంటి సుజాతారెడ్డి), సింగరేణి కార్మికుల గూర్చి ఇల్లు (తుమ్మేటి రఘోత్తమరెడ్డి), భూనిర్వాసితులు (పి. చంద్) కథల్లో కార్మికవర్గ సంక్షోభం అనివార్యంగా పోరాటబాట తొక్కాల్సి రావడం చూడవచ్చు. నిత్యగాయాల నది (బెజ్జారపు రవీందర్) వివక్షకు గురవుతున్న తెలంగాణ ముఖచిత్రాన్ని మన కళ్ల ముందుంచితే ముస్లిం జనజీవన సంస్కృతిని చిత్రించే కథలు గుంగీ ధడ్‌కన్ (గౌస్ మొహియుద్దీన్), ఔలాద్ (గీతాంజలి) మొహబ్బత్ 1424 (స్కైబాబ)... ఇంకా ఇందులో మరో సిద్ధార్థుడి కథ (పి. లోకేశ్వర్), తెలంగాణ పాపాల పుట్టలయిన గడీల గూర్చి గడీ (చావా శివకోటి), విద్యుల్లత (ఎన్.కె. రామారావు), పోల్కంపల్లి శాంతాదేవి కథలున్నాయి.

ప్రాంతీయ ముద్రతో, స్థలకాలాల చైతన్యం ఉన్న కథలతో, తెలంగాణతనంతో తెలంగాణ జీవద్భాషా పరిమళంతో వెలువడుతున్న ఈ సంకలనం తెలంగాణ ముఖచిత్రాన్ని మన కళ్ల ముందుచుంతుంది. తెలంగాణ జీవద్భాష మాధుర్యాన్ని, బలాన్ని రుచి చూపిస్తుంది. పోరాటాలు తెలంగాణ ప్రాంతంలో తెచ్చిన మార్పులను కళ్లకు కడుతుంది. తుపాకీ మోతలను వినిపిస్తుంది. దళితవాడల్లో విహరింపజేస్తుంది. కార్మికుల, వృత్తిపనివారల బతుకు వెతలను దర్శింపజేస్తుంది. తెలంగాణ మోటబావులను, చెరువులు కుంటలను, నీళ్లు లేని బోరుపొక్కలను, విరిగిన నాగళ్లను, మూలకు పడ్డ తొండాలను, చీకు పట్టిన పల్లకీలను, మగ్గాలను, కట్టె కిందేసిన గొల్లబోయలను, బొంబై దుబాయ్‌లకు బతకపోతున్న వలసజీవులను కళ్లెదుట నిలబెడుతుంది. తెలంగాణ సాంఘిక చరిత్ర రాయడానికి ఉపయోగపడే జీవితాన్ని, సంస్కృతిని అతారెలను సమకూరుస్తుంది. నైజాం పాలనా కాలం నుండి నల్లదొరల పాలనాకాలం వరకు తొంభై యేళ్ల కాలంలోని 'బతుకమ్మ' బతుకు కథలను కథలు కథలుగా చెబుతుంది.

**విశాలాంధ్ర ప్రచురణాలయం వాళ్లు ప్రచురిస్తున్న 'తెలంగాణ కథ'కు ముందుమాట**

# తెలంగాణ కథ (సాహిత్యం) విశిష్టత

దక్కను పీఠభూమిలోని నడిగడ్డ ప్రాంతం తెలంగాణ. అద్భుతమైన రాజకీయ, సామాజిక, సాంస్కృతిక నేపథ్యమున్న నేల. ఐదు వందల ఏండ్లకు పైగా ఉన్న రాజకీయ చరిత్రతో పాటు అత్యద్భుతమైన నైసర్గిక స్వరూపమున్న భూమి. ఒక అంగుళం కూడా సముద్రతీరం లేకున్నా వేలాది ఎకరాల అటవీ సంపద, అపారమైన ఖనిజ వనరులున్న ప్రదేశం. కరీంనగర్ ప్రాంతం కేంద్రంగా శాతవాహనరాజులు, నల్లగొండ రాజధానిగా విష్ణుకుండినులు, వరంగల్ ముఖ్య పట్టణంగా కాకతీయ సామ్రాజ్యం విస్తరిల్లిన దేశం. అనేక చెరువులు, కుంటలు, వాగులు, వంకలు కృష్ణా గోదావరి నదుల్లాంటి జీవనదులతో పాటు సమశీతోష్ణంతో, సగటు వర్షపాతంతో, ప్రకృతిసిద్ధమైన వనరులతో వర్ధిల్లిన ప్రాంతం. హైదరాబాద్ కేంద్రంగా ఆసఫ్‌జాహీ వంశీయులైన నైజాం నవాబులు నాలుగు వందలేండ్లు తెలంగాణ నేలను అవిచ్ఛిన్నంగా పరిపాలించారు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాధినేతలు దేశాన్ని, తెలుగు మాట్లాడే ప్రాంతంలోని ఇతర స్థలాలను ఏలినా తెలంగాణ మాత్రం వాళ్ల చేతుల్లోకి పోలేదు. రాజకీయ పునరేకీకరణలు, భాషా ప్రయుక్త రాష్ట్రాల పేరు మీద తెలంగాణకు సంబంధించిన తెలుగు మాట్లాడే ప్రాంతాలు కొన్ని మహారాష్ట్రకు, మరికొన్ని కర్ణాటకకు పోయినా మిగతా పది జిల్లాలు ఆంధ్రలో కలిసిపోయినా తన ప్రత్యేకతను కాపాడుకుంటానికి నిత్య గాయాలతో పరితపిస్తున్న భూమి తెలంగాణ.

వందలేండ్లుగా ఉర్దూ మాతృభాషగా గల ముస్లిం రాజుల పాలనలో, అంతకు ముందు వివిధ రాజుల పాలన కిందున్నా తెలంగాణా భాషాసంస్కృతులు తమ విశిష్టతను కాపాడుకున్నాయి. లిఖిత సాహిత్య చరిత్ర వెయ్యేళ్లదే అయినా అంతకు ముందు నుంచే మౌఖిక రూపాలైన జానపద కథ, పాట, అద్భుత గాథలు, జానపద గేయం జనం నోళ్లలో నానుతూ మౌఖికంగా జీవిస్తూనే ఉన్నాయి. తెలంగాణ నుంచి వినబడే జానపద సాహిత్యమూ ఓ విశిష్టతను సంతరించుకుంది. రామాయణ, మహాభారతాదులను తమవి చేసుకున్న జానపదలు పురాణపురుషులనూ, చారిత్రక పురుషులనూ జానపద నాయకులుగా మార్చి వేసుకున్నారు. వాళ్లే రాముళ్లు, కృష్ణయ్యలు, భీమయ్యలుగా మారిపోయారు.

చెరువులు, కుంటలు విరివిగా తవ్వించి ప్రకృతి సహజమైన వ్యవసాయానికి నాంది పలకడమే కాకుండా వ్యవసాయ సంస్కృతిని విస్తృతంగా అభివృద్ధి చేసిన



ఘనత తెలంగాణ ప్రాంతాన్నేలిన రాజులకు దక్కుతుంది. అందుకు సాక్ష్యంగా తెలంగాణ ప్రాంతంలో ప్రాచీన కాలం నుంచే పెద్ద పెద్ద చెరువులు, కుంటలుండటం, చెరువులు కుంటల పేరు మీదనే కొన్ని ఊర్లు పొందడం గమనించవచ్చు. ఇక్కడ తాత్వికత శ్రమజీవుల పని తాత్వికత. ఇక్కడి ప్రజల నిత్య వ్యవహారంలోని భాష పని తాత్వికత నుంచి వచ్చిందని, అది పనిముట్ల భాషని ఏ కొంచెం పరిశీలించినా అర్థమవుతుంది. గ్రామాల్లోని ఉన్నత వర్గాల భాషకూ, శ్రామికులు మాట్లాడే భాషకూ మధ్యగల అంతరం ఈ కారణం వల్లనే తక్కువగా కనబడుతుంది. ఇక్కడ నేలలోనే ఆత్మాభిమానముంది. రక్తంలోనే పౌరుషముంది. నిజాయితీ వుంది. కష్టసహిష్ణుత ఉంది. తాము చేశామో చేయలేదో తెలియని బాకీ కిందికి ఏళ్ల తరబడి వెట్టి చేసిన కష్టజీవులు తెలంగాణ ప్రజలు. పని తాత్వికత నుంచి వచ్చిందే తెలంగాణ సాహిత్యం. ఏ విషయాన్నీ వదిలిపెట్టకుండా తెలంగాణ జనజీవన సంస్కృతికి అద్దం పడుతూ, ఇక్కడి సంఘర్షణకు అక్షరరూపమిస్తూ ప్రాచీన కాలం నుంచే ఉత్తమ సాహిత్యం సృష్టిస్తున్న ఘనత తెలంగాణది.

అపారమైన జానపద సాహిత్య సంపదతో పాటు తెలంగాణ నుంచి లిఖిత సాహిత్యమూ విరివిగానే వచ్చింది. తెలుగును చదువుకునే అవకాశాలు లేని సమయంలోనూ ఈ ప్రాంతం నుండి అద్భుతమైన సాహిత్యం రావడం చెప్పుకోదగ్గ విషయం. అయితే ఇక్కడి నుండి వచ్చిన లిఖిత సాహిత్యంలోనూ ఆశు సాహిత్య లక్షణాలను గమనించవచ్చు. అవి కీర్తనలయినా, శతకాలైనా, పద్య గద్య కావ్యాలేమైనా అందులో సమాజ దిక్కరణ కనబడుతుంది. పలికెడిది రామాయణమంట పలికించెడు వాడు రామభద్రుడట అని పురాణ రచనలు చేసిన భాగవతకర్త పోతనామాత్యుడు. రాజుల కాలంలోనే ఇమ్మనుజేశ్వరాధములకు తన గ్రంథాన్ని అంకితం చేయనని సగర్వంగా చెప్పాడు. మరో దిక్కు తన సమకాలికుడైన కవి శ్రీనాథుడు రాజభోగాదులతో ఆనంద డోలికల్లో తేలియాడుతూ రాజాశ్రయం పొంది ప్రౌఢ గంభీర కవిత్వం రాస్తుంటే పోతన హాలికుడిగానే ఉంటూ తన కవిత్వ రచన కొనసాగించాడు. హాలికుడైననేమి నిజదార సుతోదర పోషణార్థమై అని రాజాశ్రయాన్ని నిరాకరించడం అప్పటికెంతో సాహసోపేతమైన చర్యే. అభ్యుదయ పంథాయే. సామాన్య పాఠకులకు అర్థం కాని సంస్కృత సమాస భూయిష్ఠ భాషలో సాగిన రచనలు వస్తున్న కాలంలో పోతన రచనలు సులభశైలిలో జనరంజకంగా ఉండటం విశేషం. ప్రాచీన సాహిత్యంలోని పద్యాలు ఎవరికీ నోటికి ఉండని విధంగా ఉంటే పోతన పద్యాలు నిత్య పారాయణాలు కావడం విశేషమే. ఇవి తెలుగు వాళ్లందరి నాలుకలపై తిరగాడటం తెలంగాణ మట్టి

ప్రభావం వల్లనే. అలాగే పాల్కురికి సోమన రచనలు. అతని సమకాలీన కవులు సంస్కృత ఛందస్సులో పండితులకు మాత్రమే ఉపయోగపడే రచనలు చేస్తుంటే సోమన దేశీ ఛందస్సును స్వీకరించి రచనలు చేశాడు. ద్విపదల్లో తెలుగు జీవితాన్ని విస్తృతంగా చిత్రించి ప్రజా సాహిత్య వారసత్వాన్ని కొనసాగించాడు. వీళ్లవి ఛందోబద్ధ, దేశీ ఛందస్సులో రాసిన రచనలే అయినా ఇందులో అన్వయ కాఠిన్యం, పాండిత్య ప్రకర్ష కనబడవు. సాహిత్యం సామాన్యులకు చేరే అంశాలతో పాటు తెలంగాణ మట్టి పరిమళం, ప్రజల భాషా సొగసులు, సులభశైలి ఈ రచనల నిండా దర్శనమిస్తాయి.

పోతన భాగవతాన్ని ముక్తిదాయక కావ్యంగా మలిస్తే అభినవ పోతన వానమామలై వరదాచార్యులు సోదరుడైన వానమామలై జగన్నాథాచార్యులు రైతు రామాయణం రాసి ప్రసిద్ధులయ్యారు. దువ్వూరి రామిరెడ్డి రైతు గూర్చి 'కృషీవలుడు' అనే పేరుతో చిన్న గేయకావ్యం రాస్తే రైతుపై రామాయణమంత మహా కావ్యాన్ని రాసిన ఘతన జగన్నాథాచార్యులకే దక్కుతుంది. ఇది ఆధునిక రైతు జీవన చిత్రణతో కూడుకున్న మంచి కావ్యం. రాచరిక వ్యవస్థ అమల్లో ఉన్న కాలంలోనూ, ఆ తర్వాత భూస్వామ్య వ్యవస్థ అమలులో ఉన్న కాలంలోనూ తెలంగాణ నుంచి పద్య, శతక, భక్తి, గేయ కావ్యాలేవి వచ్చినా వాట్లో ఎంతో కొంత సమాజ హితం కనబడుతుంది. పీడిత జన పక్షపాతం దర్శనమిస్తుంది. ధర్మపురి నుండి వచ్చిన నృసింహ శతకంలోనూ, రామసింహకవి రాసిన భజనకీర్తనల్లోనూ సామాజికతను గమనించవచ్చు. వేమన సమాజ హిత సాహిత్య పరంపరే ఈ ప్రాంత శతక, కీర్తనలు రాసిన కవుల రచనల్లోనూ కనబడటం విశేషం. ఇదీ తెలంగాణ మట్టి ప్రభావమే. తెలంగాణా మట్టిలోనే తిరుగుబాటు తత్వం కనబడుతుంది. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాధినేతలకు లొంగకుండా వాళ్లతో కప్పం కట్టించుకున్నారు నిజాం నవాబులు. నైజాం నవాబు ప్రజాహితాన్ని దృష్టిలో పెట్టుకొని విద్యాలయాలు, కట్టడాలు, చెరువులు, కుంటలు, నీటి ప్రాజెక్టులు, పరిశ్రమలు ఏర్పరచినప్పుడు ఆ పాలనకు లొంగి ఉన్నారు ప్రజలు. ప్రజలపై ఉర్దూ భాష రుద్దబడినా, ఉర్దూ మీడియంలో చదవాల్సిన నిబంధనలున్నా తెలంగాణ ప్రజలు తమ భాషా సాహిత్యాలను రక్షించుకొని అభివృద్ధి చేసుకోగలిగారు. తాము ఉర్దూ మీడియంలో చదువుకున్నా మాతృభాషలో అద్భుతమైన సాహిత్యం సృష్టించి తెలంగాణ సాహిత్య వారసత్వాన్ని ముందుకు తీసికెళ్లారు. తెలంగాణ నుంచి కవులే లేరన్న ఓ సాహిత్యకారుడి మాటలు అసత్యాలని నిరూపిస్తూ సురవరం ప్రతాపరెడ్డి గారు మూడు వందలకు పైన కవుల రచనలతో సంకలనం తీసుకొచ్చారు. రజాకార్లు



బయలుదేరి నిజాం పాలన ప్రజాకంటకంగా మారిన తర్వాత అణగిమణిగి ఉన్న జనాలే ఉప్పెనలై ఉవ్వెత్తున లేచారు. భారతదేశానికే మొట్టమొదటిసారిగా భూపోరాటాల వారసత్వాన్ని అందించిన నేల తెలంగాణా. ఈ సమయంలోనే నా తెలంగాణ కోటి రతనాల వీణ అని గొంతెత్తి చాటాడు దాశరథి కృష్ణమాచార్యుల వారు. నిజామాబాద్ జైలు గోడలన్నిటినీ కవిత్వంతో పవిత్రం చేశాడు. అతడు సినిమా రంగంలోకి వెళ్లినా తన ప్రజా స్వభావాన్ని వదిలిపెట్టకుండా రచనలు కొనసాగించాడు. అతని సోదరుడు దాశరథి రంగాచార్య అన్న వారసత్వాన్ని వచనంలో ముందుకు తీసుకువెళ్లి చిల్లరదేవుళ్లను సృష్టించాడు. మోదుగుపూలను పూయించాడు. జనపదాలను దర్శింపజేశాడు. జీవనయానం కొనసాగించాడు.

ఉర్దూ మీడియం పాఠశాలలో చదువుకున్న వాడే అయినా కాళోజీ తన మాతృభాషలో కవిత్వం రాశాడు. అన్యభాషలు నేర్చి ఆంధ్రమ్ము రాదంచు సకిలించు ఆంధ్రుడా చావవెందుకురా అని తన భాషాభిమానాన్ని చాటుకున్నాడు. పుటుక చావు తనవే అయినా తన బతకంతా దేశానికి అర్పించి తన జీవితాన్ని సార్థకం చేసుకున్నాడు. కవిగా ఉన్నతోన్నత శిఖరాలకెదిగినా ప్రజా స్వభావాన్ని, ప్రజాకవి దృక్పథాన్ని వదులుకోకుండా తెలంగాణ సాహిత్య, సామాజిక, ప్రజా సాహిత్య వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్లి ఎంతో మందికి మార్గదర్శకుడైన ధన్యజీవి కాళోజీ. మట్టిమనుషులు, అబ్రాహ్మణ రైతు కుటుంబంలో పుట్టి చదువులలోని మర్మాలన్నీ చదివి తనకున్న జానపద, గ్రామీణ బతుకు, సాహిత్య నేపథ్యాలతో కవిగా ఉన్నతోన్నత స్థితులకెదిగి భారతదేశపు అత్యున్నత సాహితీ పురస్కారం జ్ఞానపీఠ్ అవార్డునందుకున్న జ్ఞాని సినారె. తెలుగునేలకు, తెలంగాణకు జ్ఞానపీఠాన్ని అందించిన ఘనత సినారెకు దక్కుతుంది. అతడు పాట రాసినా, గేయం రాసినా, వచన కవిత రాసినా, సినిమా గేయం రాసినా కవిత్వ విలువలకు భంగం కలుగకుండా తెలంగాణ పలుకుబడులను కవిత్వం నిండా నింపిన కవివర్యుడు. అతడు మాట్లాడే ప్రతి వాక్యమూ కవితామయమే. అతడు జ్ఞానపీఠ్ అవార్డు స్థాయికి ఎదగడం వెనుక రైతు జీవన నేపథ్యం, పల్లె మూలాలు, తెలంగాణ పలుకుబడులపై, భాషపై సాధికారత ఉన్నాయి. నిరంతర కృషీ ఉంది. తెలంగాణ సాహిత్యకారుల ఎదుగుదల వెనుక అంతులేని శ్రమ ఉంది. ఇతర ప్రాంత కవులకు రచయితలకు ఉన్న అవకాశాలు లేకున్నా, ఎత్తుకునే గాడ్‌ఫాదర్లు లేకున్నా నిర్విరామ కృషే వాళ్ల ఎదుగుదలకు దోహదం చేసింది. అమావాస్యకో, పున్నానికో అన్నట్టు ఎప్పుడో ఓ రచన కాకుండా మూడు తరాలతో కలిసి నడుస్తూ సాహితీ వ్యవసాయం

చేస్తున్న సినారె, తొంబై ఏళ్ల జీవితాన్ని సామాజిక సాహిత్య రంగాలకే అంకితం చేసిన కాళోజీ, నిజాం పిశాచమా ముసలిపీనుగా అని ధైర్యంగా నిజాం నవాబునెదిరించి నా తెలంగాణ కోటి రతనాల వీణ అని చివరి వరకూ కవిత్వంలోనే బతికిన దాశరథి లాంటి వాళ్లు తెలంగాణ సాహిత్య వికాసానికెంతో కృషి చేశారు. ప్రాచీన ప్రజా సాహిత్య వారసత్వాన్ని ముందుకు తీసుకువెళ్లారు.

ఆ పరంపరే తెలంగాణకు సంబంధించిన వచన సాహిత్యంలోనూ కొనసాగుతుంది. అన్ని ప్రాంతాల్లో లాగే అన్ని సాహిత్యాల్లోలాగే తెలంగాణలోనూ లిఖిత వచనం కంటే కవిత్వమే ముందు పుట్టింది. అయితే ఏ ఇంటి లోగిలికి వెళ్లినా తెలంగాణాలో అద్భుతంగా ఆశుకథ చెప్పడం వినబడుతుంది. నులక మంచాల్లో కూచొని చుట్టలు తాగుతూ కథలు చెప్పుకోవడం, మొగురాలకొరిగి కథలు చెప్పుకోవడం, రచ్చబండల దగ్గర పంచాయతీలు జరుగుతుంటే మధ్యమధ్యన పిట్టకథలు చెప్పడం లాంటివన్నీ మనకు ప్రాచీన కాలం నుంచే ఉన్నాయి. తెలంగాణ ప్రజలకు చదువొచ్చినా, రాకున్నా కథ చెప్పడం కొత్త కాదు. కథ మానవజీవితానికి అత్యంత చేరువైంది. అయితే ఇలా చెప్పే కథలన్నీ ఆశు సంప్రదాయానికి చెందినవే. ఆశువుగా చెప్పే కథలే. అనగనగా ఒక రాజు అనే పద్ధతిలో చెప్పబడుతూ మౌఖికంగా జీవించే కథలే ఇవి. మనం ఇప్పుడు కథ, కథానిక అని దేన్నయితే చెప్పుకుంటున్నామో ఆ కథ లిఖిత సాంప్రదాయానికి చెందినది. భారతదేశ భాషల్లోకి ఆంగ్లేయ భాషా సాహిత్య ప్రభావంతో ప్రవేశించింది. పాశ్చాత్య భాషల్లో ఈ కథ పద్దెనిమిది, పంథొమ్మిదవ శతాబ్దుల్లోనే వచ్చినా భారతీయ భాషల్లోకి పందొమ్మిదవ శతాబ్దిలో తెలుగులోకి ఇరవయవ శతాబ్ది ప్రారంభంలో వచ్చింది. ఆంగ్లేయుల పాలన కిందున్న కోస్తాంధ్రలో ఈ కథ 1910లో వస్తే ఉర్దూ హిందీ సాహిత్య ప్రభావం ఎక్కువగా ఉండి నైజాం పాలన ఉన్న తెలంగాణలో మాత్రం ఈ కథ 1912లో వచ్చింది. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో వచ్చిన కథ ఆంగ్లేయుల పరిపాలన లేని తెలంగాణలో కూడా కోస్తాలో కథ వచ్చిన సమీప సమయంలోనే రావడం గమనించదగ్గ విసయం. గురజాడ రాసిన మొదటి కథ దిద్దుబాటు ప్రచురింపబడిన ఆంధ్రభారతిలోనే మాడపాటి హనుమంతరావు రాసిన తొలికథ హృదయశల్యం ప్రచురింపబడటం విశేషమే. తెలంగాణ నుంచి వచ్చిన మొదటి తరం కథకులు చాలా మంది ఉర్దూ చదివినవాళ్లే. అయినా గ్రాంథిక తెలుగులో కొందరు, వ్యావహారికంలో కొందరు, మాండలికంలో ఇంకొందరు కథలు రాసిన తెలంగాణ కథకులపై కోస్తాంధ్ర కథకుల లేదా ఆంగ్ల సాహిత్య ప్రభావం అంతగా



లేదు. తెలంగాణకు మొదట్నుంచీ సంబంధాలున్నవి హిందీ ప్రాంతంతోనే. హిందీ, ఉర్దూ సాహిత్యాలతోనే. తెలంగాణా నుంచి వలసలు పోయిందీ మహారాష్ట్ర లాంటి ప్రదేశాలకే. మొదటితరంలోనే ప్రేమ్‌చంద్‌ను ఇక్కడి కథా రచయితలు తమవాన్ని చేసుకున్నారు. మాడపాటి హనుమంతరావు స్వయంగా కథలు రాస్తూ తాను అభిమానించే ప్రేమ్‌చంద్ సాహిత్యాన్ని అనువాదం చేశాడు. కొంత శరత్ సాహిత్య ప్రభావమున్నా మొదటితరం తెలంగాణ కథకులపై ప్రేంచంద్ అభ్యుదయ సాహిత్య పంథా ప్రభావం విరివిగా ఉంది.

కోస్తా నుంచి వచ్చిన కథ మొదటితరంలోనూ, ఆ తర్వాతి తరంలోనూ, మొన్నమొన్నటి వరకూ, చాలా వరకు ఇప్పుడు కూడా మధ్యతరగతికే పరిమితమైతే తెలంగాణ కథ మాత్రం మొదటి తరం నుంచే అట్టడుగు జీవితాలను వస్తువుగా తీసుకుంది. ఆ జీవితాల పరిమళంతో వికసించింది. మొదటితరంలో తెలంగాణ నుంచి మధ్యతరగతి లేకపోవడం తెలంగాణా కథావికాసానికి అవరోధం కాలేదు. అంతకంటే లోతులకు వెళ్లి పీడిత జన సంస్కృతిని అక్షరబద్ధం చేయడానికి దోహదం చేసింది. ఆ పరంపరే తర్వాతి తరాలవారికి మార్గదర్శకమైంది. తొలితరంలో తెలంగాణ కథను సుసంపన్నం చేసిన కథకులు మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, ఒద్దిరాజు రంగారావు, ఒద్దిరాజు సీతారామచంద్రరావు, సింగూరు జయరావు, ఆదిరాజు వీరభద్రరావు, నందగిరి వెంకటరావు, ఇందిరాదేవి, ఎల్లాప్రగడ సీతాకుమారి, అర్. అవధాని, బోయనేపల్లి రంగారావు, గం. గోపాలరెడ్డి, కాళోజీ నారాయణరావు, పొట్లపల్లి రామారావు, బూర్గుల రంగనాథరావు, జి. రాములు, కాంచనపల్లి చినవెంకట రామారావు, ధరణికోట శ్రీనివాసులు, పి.వి. నరసింహారావు, వట్టికోట ఆళ్వారుస్వామి, కె. లింగరాజు, హిరాలాల్ మోరియా, ఊటుకూరి రంగారావు, గూడూరి సీతారాం, సురమౌళి, భాస్కరభట్ల కృష్ణారావు, వెల్దుర్తి మాణిక్యరావు, పి. వెంకటరామారావు, పెంద్యాల చిన్న రాఘవరావు, పైడిమర్రి వెంకటసుబ్బారావు, ఇటికాల నీలకంఠరావు, మంద రామారెడ్డి, డి. రామలింగం, ఇల్లిందల సరస్వతీదేవి, నెల్లూరి కేశవస్వామి లాంటి అనేకమంది ఉన్నారు. 1956 వరకు తెలంగాణ నుంచి వేయి వరకు కథలొచ్చినట్లు పరిశోధకుల అంచనా. తెలుగు కథ సద్యోయౌవనంతోనే పుట్టిందన్న వాదముంది. పుట్టుకతోనే వస్తు శిల్పాల్లో రాటుదేలి శైశవం దాటకుండానే యవ్వనంలోకి అడుగుపెట్టింది. ఇదే పరిస్థితి తెలంగాణ కథకూ వర్తిస్తుంది. మొదటితరంలో వచ్చిన మాడపాటి కథలు, సురవరం ప్రతాపరెడ్డి కథలు, పి.వి. నరసింహారావు కథలు, జి.

రాములు, సురమౌళి, వట్టికోట కథలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. వస్తుశిల్పాల్లోనే కాకుండా భాష విషయంలోనూ వీళ్లు మరికొంత ముందుకు పోయి మాండలికాన్ని భాషగా ఎన్నుకున్నారు. కొందరయితే కథనానికి కూడా మాండలికాన్నే ఎన్నుకోవడం విశేషం. సురమౌళి, గూడూరి సీతారాం కథలు, పి.వి. నరసింహారావు గొల్లరామవ్వ కథలు ఇందుకు ఉదాహరణలు.

హృదయశల్యం కథ చారిత్రక కథలా అనిపించినా సాంఘిక, సంస్కరణ అంశాలే ప్రధానంగా తీసుకోబడ్డాయి. ఈ కథకూ గురజాడ దిద్దుబాటు కథకూ మధ్య స్పష్టమైన పోలికలున్నాయి. దిద్దుబాటు కథలో వేశ్యాలోలుడైన భర్తను సరిదిద్దుకుంటుంది భార్య. హృదయశల్యం కథలో భార్యను అనుమానించే భర్త, అనుమానాన్ని నివృత్తి చేయడానికి రుద్రమదేవి తన మారువేషాన్ని విప్పాల్సి వస్తుంది. ఈ కథలోని భాష కొంత గ్రాంథికంగా ఉన్నా కథానిర్మాణం, ఎత్తుగడ, ముగింపులాంటి అన్ని విషయాల్లోనూ, వస్తు సేకరణలోనూ ఆధునిక కథాలక్షణాలను కలిగి ఉంది. తెలుగులో మొదటి కథ, తెలంగాణ నుంచి వచ్చిన మొదటి కథ సంస్కరణ నేపథ్యంలోంచి రావడం చెప్పుకోదగ్గ విషయం. తెలంగాణా నుంచి వచ్చిన మొట్టమొదటి కథా సంపుటం మాడపాటివారి మల్లికాగుచ్ఛమే. ఇందులోని కొన్ని కథల్లో గ్రాంథిక భాషా వాసనలున్నా వాక్య నిర్మాణంలో ప్రాంతీయ భాషా సౌరభం కనబడుతుంది. విషయపరంగా అన్నీ సాంఘిక విషయాలను గూర్చి చెబుతూ ప్రగతిశీలంగానే నడిచాయి. తెలంగాణా ప్రాంతీయ జీవితాన్ని అక్షరబద్ధం చేశాయి. కాళోజీ కథలన్నిట్లోనూ మానవతాపరిమళం ఉంటుంది. కుల మతాల కుంపట్లలో సతమతమవుతూ అసూయాద్వేషాలతో కొట్టుమిట్టాడుతున్న మనుషుల కంటే పశువుల నయం అని వ్యంగ్యాత్మకంగా చెబుతాడో కథలో. కొంతమంది మనుషుల పరిస్థితి పశువుల కంటే హీనంగా ఉందని వాపోతాడు. ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనతో ప్రజల సాంఘిక చరిత్రలను రాసే కొత్త రకం చరిత్రల రచనకు శ్రీకారం చుట్టిన సురవరం ప్రతాపరెడ్డి భారతదేశం గర్వించదగ్గ పరిశోధకుడు. అతను గొప్ప కథకుడు కూడా. మొదటితరంలో తెలంగాణా నుంచి కథలు రాసినవారిలో అగ్రగణ్యుడైన సురవరం నైజామాంధ్ర జీవితానికి దర్పణాలదగిన కథలు రాశారు. సురవరం కథల్లో అతని కాలంనాటి తెలంగాణా ప్రజల జీవితం, వెనుకబాటు తనం, ముస్లిమ్ జీవితాలు దర్శనమిస్తాయి. తెలుగు, ఉర్దూ భాషా మిశ్రమమూ కనబడుతుంది. కోస్తా వాళ్లది బ్రౌణ్యాంధ్రమని, తెలంగాణ వాళ్లది తౌరక్యాంధ్రమని పేర్కొన్న సురవరం వారు తౌరక్యాంధ్ర మిశ్రమ కథలు రాసి ఆ



కథలకు ప్రత్యేకతను చేకూర్చారు. కొన్ని చారిత్రకాంశాలను ఆధారం చేసుకొని రాసిన వీరి మొగలాయి కథలు రచయితగా ఇతనికి పేరు తెచ్చి పెట్టాయి. ఎవరూ రాయలేని విషయాలపై కథలు రాయడం వీరి ప్రత్యేకత.

అపర చాణక్యుడైన పి.వి. నరసింహారావు గారు రాజకీయ, సాహిత్య రంగాల్లో సవ్యసాచి. గొల్లరామవ్వ, మంగమ్మ అదృష్టంలాంటి కథలను మారు పేర్లతో రాశాడు. పి.వి. గారిని ఉత్తమోత్తమ కథకుల సరసన నిలబెట్టడానికి గొల్ల రామవ్వ కథొక్కటి చాలు. జనసామాన్యం ముఖ్యంగా గొర్ల కాపర్లు ఇండ్లలో ఉపయోగించే భాషను, పాత్రోచిత మాండలికాన్ని ఆ కథలో ఉపయోగించి కథకెంతో వన్నె తెచ్చాడు పి.వి. కథా సంవిధానంలోనూ, ఎత్తుగడ, ముగింపుల్లోనూ అద్భుతమైన కథాకథన సామర్థ్యాన్ని చూపారు. గొల్ల రామవ్వ కథా పరంపరను పి.వి. గారు కొనసాగించి ఉంటే తెలంగాణ కథాసాహిత్యం తొలి తరంలోనే అందుకోలేని ఎత్తులకెదిగి ఉండేది. వట్టికోట ఆళ్వారుస్వామి జైలు లోపల కథలు సమకాలీన తెలంగాణ జీవితానికి అద్దం పట్టిన మంచి కథలే. నెల్లూరి కేశవస్వామి కథా సంపుటి చార్మినార్‌లోని కథలు కూడా స్వాతంత్ర్యానికి ముందు నైజాం పాలనాకాలంలో తెలంగాణలో ఉన్న సామాజిక పరిస్థితులకు అద్దంపట్టిన కళాఖండాలు. ఆత్మఘోష కథకుడు జి. రాములు, సి. నారాయణరెడ్డి లాంటి గొప్ప కవులకు విద్యా గురువు. ముక్కోటి బలగమోయి, తిరుగుడు పొద్దు లాంటి కథలు రాసిన సురమౌళి, నారిగాని బతుకు కథతో ప్రసిద్ధుడైన గూడూరి సీతారాం మాండలిక భాషకు పట్టం కట్టి కథా రచన కొనసాగించి తొలితరంలో, తెలంగాణ కథను సుసంపన్నం చేశారు. గూడూరి సీతారాం కథలు స్వాతంత్ర్యకాలం నాటి తెలంగాణ భాషా సొగసులకు దర్పణాలు. ఆ కాలంలోనే పూర్తి మాండలికంలో కథలు రాసిన కథకుడు సీతారాం. కాంచనపల్లి కథల్లో తెలంగాణ ప్రజల బానిస మనస్తత్వం, దొరలు భూస్వాముల మీదికి తిరుగుబాటు చేయడం చిత్రించబడ్డాయి. అమాయక ప్రజలను దొరలు జమీందార్లు తమ స్వార్థానికి ఎలా ఉపయోగించుకుంటారో ఈ కథల్లో చూడవచ్చు.

సరళమైన శైలిలో మంచి కథాశిల్పంతో సాగే పొట్లపల్లి రామారావు కథలు, ఒద్దిరాజు సోదరులు రాసిన కథలు సంపన్నుల విదేశీ వ్యామోహాన్ని, దోపిడీ స్వభావాన్ని ఎత్తిచూపిన కథలు. ఇలా తెలంగాణ నుంచి తొలితరంలో ఎంత మంది కథకులు తమకున్న పరిమితుల్లో అపారమైన ఎరుకతో తమ ప్రాంత జీవితం, భాష మీది మమకారంతో కథలు రాశారు. కాకతీయ, గృహలక్ష్మి, సుజాత, గోలకొండ, ఆంధ్రభారతిలలో ఈ

కథలు ప్రచురితమయ్యాయి. ఈ కథలను చదువుతుంటే మనకు తెలియని మన చరిత్ర మరింత స్పష్టంగా మన కళ్ల ముందు దృగ్గోచరమవుతుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణకు ముందున్న తెలంగాణా స్థితిగతులు, చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలు, జీవితం సాక్షాత్కరిస్తాయి. ఆ కాలంలో తెలుగు భాషకు పెద్దగా ప్రోత్సాహం లేకున్నా కోస్తాంధ్ర ప్రాంతంతో ధీటుగా తెలంగాణా నుంచి కథలు రావడం ఇక్కడి ప్రత్యేకత. పత్రికల సంఖ్య కూడా తక్కువే. పత్రికలెక్కువగా ఉన్న కోస్తాంధ్ర ప్రాంతంలోలా విరివిగా కథలు రాకున్నా వాసిలో ఎన్నదగిన కథలొచ్చాయి. కథంటే క్లుప్తత, ఏకాంశ వ్యగ్రత, స్వయం సమగ్రత అనే విషయాలను గుర్తు చేస్తూ కథలు రావడం విశేషం.

మొదటితరంలో కథలు రాసినవాళ్లలో చాలామంది రచయితలు జీవితాన్ని, సాహిత్యాన్ని వేరుగా చూసినవాళ్లు కాదు. కాళోజీ, మాడపాటి, సురవరం, వట్టికోట, దాశరథి, దేవులపల్లి రామానుజరావు లాంటి వాళ్లంతా రాసి ఊర్కున్న వాళ్లు కాదు. తెలంగాణ ప్రాంత వికాసం కోసం, స్వాతంత్ర్యం కోసం పోరాటాలు చేసినవాళ్లే. వీళ్లలో చాలా మంది చెప్పిందే చేశారు. అదే రాశారు. తెలంగాణా నుంచి వచ్చిన మొదటితరం కథకుల్లో దాదాపు అందరూ అగ్రకులాలకు చెందినవారే. రాజాకారు పోరాటాల కాలంలో పోరాటాలకు నాయకత్వం వహించింది, గ్రామాల్లో దోపిడీదారులుగా ఉన్నదీ అగ్రకులాల వారే. కథా రచన చేసిన ఈ అగ్రకుల రచయితలు మాత్రం అట్టడుగు ప్రజల పక్షం వహించారు. సామాజిక బాధ్యతతో సాహితీ సృజనం చేశారు.

తెలంగాణ మాండలిక భాష అట్టడుగు కులాల వర్గాల భాష అనడానికి తొలితరం కథలను చదవాలి. ఇతర ప్రాంతాల్లో ఉన్నట్టు తెలంగాణ ప్రాంతంలో అగ్రకులాల వారి మాండలిక భాషకూ, పనికులాలవారి బాషకూ మధ్య విపరీతమైన తేడాలేం లేవు. మొదటి నుండే తెలంగాణకథకు, భాషకు వర్గస్పృహ ఉండటం గమనించవచ్చు. గొల్లరామవ్వ కథలోని భాష మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది. వాస్తవికతా పరిమళం ఉండే మాండలిక భాషను వాడి ఆ పరంపరను తర్వాతితరం వాళ్లు కొనసాగించడానికి దోహదం చేశారు. 1956 వరకు తెలంగాణ నుంచి వచ్చిన కథలను పరిశీలిస్తే ఆ కథకుల నిజాయితీ, తమ ప్రాంతం భాషపై ఉన్న అభిమానం, అట్టడుగు జనపక్షపాతం, సమకాలీనత సాక్షాత్కరిస్తాయి. తెలుగువాళ్ల సాంఘిక చరిత్ర తెలుసుకోవడానికి సురవరం ప్రతాపరెడ్డి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' గ్రంథం ఉపయోగిపడినట్టే ఆంధ్రప్రదేశ్ అవతరణకు ముందున్న తెలంగాణా పరిస్థితులను తెలునుకోవడానికి తొలితరం కథలెంతో ఉపయోగపడతాయి. ఈ కథలు దేనికదే



ప్రత్యేకవమైనవై, విశిష్టమైనవై ప్రయోజనం దృష్టి కోణం నుంచి రాయబడ్డవే. తర్వాతి తరాలవారికి స్ఫూర్తినందిస్తూ మార్గనిర్దేశనం చేస్తూ రాయబడిన ఈ కథలు తెలంగాణా కథా సాహిత్య చరిత్రను మరికొంత ముందుకు తీసుకువెళ్లేవే. మనల్ని ఆలోచనాపరుల్ని చేసేవే. ఆనందింపజేసేవి. తెలంగాణా కథా సాహిత్య స్థానాన్ని నిర్ణయించడానికి ఉపయోగపడేవి. కొంతమంది విమర్శకులు నిర్ణయించిన మధ్యతరగతి దృష్టికోణంలోంచి వచ్చిన కథలు మొదటితరంలోనూ, తర్వాతి తరాల్లోనూ తక్కువే. ఆ కారణంగా తెలంగాణా నుంచి మంచి కథలు రాలేదనడం తప్పుడు ధోరణి. తొలితరం నుంచే అట్టడుగు వర్గాల జీవిత చిత్రణకు ప్రాధాన్యతనిస్తూ తెలుగు కథను మరింత ముందుకు తీసికెళ్లారు తెలంగాణ రచయితలు. తెలంగాణ కథలను మూసబోసిన ఆ శిల్ప ప్రమాణాలతో, మధ్యతరగతి దృష్టికోణంలోంచి చూస్తే న్యాయం జరగదు. తెలంగాణా కథలన్నిటినీ ఆశుకథా శిల్ప దృష్టికోణంలోంచి, ప్రయోజనదృష్టి కోణంలోంచి చూడాలి.

తెలంగాణా నుంచి వచ్చిన మంచి కథలను, ప్రజాస్వభావం ఉన్న కథలను చదువుతుంటే జానపదుల కథలు వింటున్నట్టనిపించాలి. చిందు బాగోతుల, మిత్తిరయ్యవార్ల, శారదకాళ్ల, మందెచ్చులోల్ల కథలు వింటున్నట్టు, చూస్తున్నట్టు అనుభూతి చెందుతాం. గ్రామాల్లో తిరిగిన అనుభవం పొందుతాం. తొలితరం తెలంగాణా కథల్లో చెప్పుకోదగ్గ మరికొన్ని కతలు తెలంగాణ పోరాట కథలు. రజాకారు వ్యతిరేక పోరాటాలు, కమ్యూనిస్టు పోరాటాలు జరుగుతున్న కాలంలోనూ ఆ సమీప కాలంలోనూ వివిధ పత్రికల్లో వచ్చిన ఈ కథల్లోంచి చాలా వాటిని తెలంగాణాకు చెందని వాళ్లే రాశారు. పొట్లపల్లి రామారావు (న్యాయం), కాంచనపల్లి చినవెంకటరామారావు (మన వూళ్లో కూడానా); చిన్నప్పుడే (వట్టికోట ఆళ్వారుస్వామి) లాంటి కొందరు మాత్రమే తెలంగాణ రచయితలే కథలు రాసినా మిగతావి ఇతర ప్రాంతాల వాళ్లు రాసినవే. తెలంగాణ గూర్చి వినో, పత్రికల్లో వార్తలు చదివో, తెలుసుకునో రాయబడిన ఈ కథల్లో స్థలకాలాల చైతన్యం తక్కువ. తమకు తెలియని, చూడని, అనుభవాల్లోకి రాని విషయాల గూర్చి రాయడం వల్ల ఈ లోపం ఈ కథల్లో గమనిస్తాం. శారద, తుమ్మల వెంకట్రామయ్య, రాంషా, ఉప్పల లక్ష్మణరావు లాంటివాళ్లు రాసిన ఈ కథలు నిజాయితీతో రాయబడినవే.

ముదిగంటి సుజాతారెడ్డి గారి సంపాదకత్వంలో వెలువడిన తొలితరం తెలంగాణా కథలు సంకలనానికి ముందుమాట పేరుతో ఈ నేల పరిమళానికి తొలి ఆనవాళ్లు అనే శీర్షికతో ప్రఖ్యాత పాత్రికేయుడు, విమర్శకుడు గుడిపాటి యోగ్యతా పత్రం ఇచ్చాడు. ఇందులో తెలంగాణ నేలపై చలం, శ్రీపాద, బుచ్చిబాబు, కొకులాంటి

వారు ఉండరన్నది మరో రకం వాస్తవికత అని, ఇందుకోసం సాహిత్యకారులు న్యూనతా భావంతో కుమిలిపోనక్కరలేదన్నారు. ఎవరు కుమిలిపోయారో, ఎందుకు కుమిలి పోయారో అర్థం కాని విషయం. కొకు, చలం, బుచ్చిబాబు, శ్రీపాదలు తమ రచనల్లో చెప్పిందేమిటి? వాళ్లు చిత్రించిన జీవితమెంత? సముద్రాన్ని మించిన విస్తృతంగా, వైవిధ్యపూరితంగా ఉన్న తెలుగు జీవితంలో వాళ్లు చిత్రించిన జీవితం పాలెంత? పోతే వాళ్లు చిత్రించిన జీవిత కోణాలేంటి? గొప్ప రచయితలుగా వాళ్లకున్న స్థానాన్ని పదిలం చేస్తూనే వాళ్లు తమ సాహిత్యంలో చిత్రించిన జీవితం చాలా పరిమితం అని చెప్పడానికి సందేహించాల్సిన అవసరం లేదు. వాళ్ల అనుభవ పరిధిలోకి, జీవన పరిధిలోకి వచ్చిన బ్రాహ్మణకుల జీవితాలను మాత్రమే చిత్రించారు. వస్తు సేకరణ, కథాశిల్పం మధ్యతరగతి దృష్టికోణాన్ని దాటి ముందుకు పోలేదు. ఆ కథలు చేరిందీ పరిమిత సంఖ్యలో ఉన్న పాఠకులకే. అందుకు భిన్నంగా ఉంటాయి తెలంగాణ కథలు. తొలితరం తెలంగాణ కథలను చూసినా, స్వాతంత్ర్యానంతరం పుట్టి పెరిగి కలం పట్టి రచయితలుగా పేరు తెచ్చుకున్నవాళ్ల కథలను పరిశీలించినా మనకెన్నో విషయాలు అర్థమవుతాయి. కొన్ని కులాల జీవితాలనో, పరిమిత వర్గాలకో పరిమితం కాకుండా తెలుగు జీవితాన్ని విస్తృతంగా సమస్త కోణాల్లోంచి చిత్రించిన కథకులు తెలంగాణలో ఉన్నారు. తెలుగుకథకు అట్టడుగు జీవన పరిమళంతో పాటు దళిత బహుజన, వ్యవసాయ నాగరికతలకు సంబంధించిన జనజీవనాన్ని చిత్రించిన తెలంగాణ కథకులున్నారు. తెలుగు కథకు ప్రాంతీయతా పరిమళమద్ది దాన్ని విశ్వజనీనమూ చేశారు. ప్రేమ్‌చంద్, టాల్‌స్టాయ్, మాక్సింగోర్కీల్లా ఇంకా అంతకంటే విస్తృతంగా తెలంగాణ జీవన సంఘర్షణను చిత్రించిన కథలుండగా తెలంగాణలో కొకులు లేరనడం ఏం సబబు? మరీ పరిమితమైన జీవితాలను తీసుకొని సాహిత్య సృజనం చేసిన కొకు, చలంల కంటే విస్తృతంగా వైవిధ్యపూరితమైన రచనలు చేసిన తెలంగాణ రచయితలకు ఆత్మన్యూనతా భావం ఉండాల్సిన పనేం లేదు. ఇదంతా తాము వాళ్ల బాధ్యతగానే భావించారు. విస్తృతమైన జీవన వైవిధ్యంతో, సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలను ఉన్నతీకరిస్తూ కథలు రాయడంలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిని మించిన కథలు రాసిన తెలంగాణ కథకులకు ఎవరితోనూ పోలిక లేదు. వై అయామ్ నాట్ ఎ హిందూ అనే గ్రంథాన్ని ఇంగ్లీషులో రాసి తనకున్న శ్రామిక కుల నేపథ్యంలోంచే తాత్వికతను గురించి కంచె ఐలయ్య కొత్త నిర్వచనాలిచ్చి అంతర్జాతీయ ఖ్యాతి పొందారు. శ్రామికుల, పని తాత్వికత నేపథ్యంలో తెలంగాణ నుంచి చాలా కథలు వచ్చాయి. రచనలూ వచ్చాయి. వాటిని ఇంగ్లీషులోకి అనువాదం చేస్తే అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు



వచ్చే అవకాశముందని గుర్తిస్తే మంచిది.

మొదటితరంలోనే తెలంగాణ కథకులు మాండలికాన్ని తీసుకొని కథలు రాయడానికి ప్రధాన కారణం హైదరాబాద్ రాష్ట్రం వేరుగా ఉండటమే. తమ మాండలికం మాత్రమే వాళ్లకు తెలియడం. వ్యావహారిక భాష, పత్రికల భాషా పదాలు అప్పటివరకు తెలంగాణలో వేళ్లూనకపోవడం. భాషా సాహిత్య విషయాల్లో తెలంగాణా తెలంగాణాగా మిగిలి ఉండటం. ఉర్దూ రాజభాషగా ఉండటం వల్ల ఉర్దూ భాషా పదాలు కొన్ని తెలుగులో కలిసిపోయి తెలుగు వాడుక భాషా పదాలుగా మారి తెలంగాణ వాడుక భాషను మరింత సుసంపన్నం చేశాయి. తమకు తెలిసిన భాషలో కథలు రాసి తెలంగాణ సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు రచయితలు.

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాతి కాలం నుండి తెలంగాణలో భూపోరాట ఉద్యమాలు వేళ్లూనుకొని బలపడిన డెబ్బైల వరకు వచ్చిన తెలంగాణ కథలను మలితరం తెలంగాణ కథలుగా పేర్కొనవచ్చు. ఈ కాలంలో కోస్తాలో మధ్యతరగతి దృష్టి కోణంలోంచి మధ్యతరగతి జీవుల గూర్చి విరివిగా కథలొచ్చాయి. పత్రికల సంఖ్యా పెరిగింది. రాసేవాళ్లు పెరిగారు. తెలంగాణ వారికి వ్యావహారిక భాషతో పరిచయం ఏర్పడింది. డిటెక్టివ్ నవలా సాహిత్యం లాంటి వ్యాపార సాహిత్యం ఇతర ప్రాంతాల నుంచి రావడం మొదలైంది. కాల్పనిక భ్రమలూ పెరిగాయి. పత్రికలు చాలా వరకు, కోస్తా ప్రాంతం నుండి రావడమో, కోస్తా వాళ్ల ఆధిపత్యం కింద ఉండటమో మొదలైంది. మొత్తంగా కథ వ్యాపార సరుకు కాకున్నా వ్యాపార సాహిత్యం జోరు హెచ్చింది. ఈ సమయంలో తెలంగాణా నుంచి రచయితలుగా కలం పట్టిన వాళ్లు సందిగ్ధంలో పడ్డారు. పత్రికా భాషలో రాయాలన్న తపన. అలా అయితేనే ప్రచురిస్తారన్న ఆశ. కోస్తాంధ్ర రచయితలతో పాటు కవులుగా, రచయితలుగా పేరు తెచ్చుకుంటానికి, రచయితలుగా నిలబడటానికి చాలా సంఘర్షణనే అనుభవించారు. ఇదే సమయంలో ఆరడుగుల కంటే ఎత్తున్న కథానాయకులు, పడవల్లాంటి పెద్దపెద్ద కార్లలో పయనించే కథానాయకులు, క్లబ్బులు, విజేతలు, ఊహాజగత్తులో విహరింపజేసే నవలా సాహిత్యం, అపరాధక పరిశోధక సాహిత్యం విరివిగా రావడం ప్రారంభమైంది. ఈ సమయంలో ఏం చేయాలో తోచలేదు తెలంగాణ రచయితలకు. ఇవ్వన్నిటినీ తట్టుకొని నిలబడటానికి, రచయితలుగా పేరు తెచ్చుకోవడానికి పత్రికా భాషలో రాయడమే రాజమార్గమని భావించారు. తెలంగాణ కథకులు వేసిన మార్గాన్ని అనుసరిస్తూ, ప్రజల భాషను ముందుకు తీసుకువెళ్తూ రాస్తే ప్రచురణకు నోచుకుంటాయో లేదోనన్న భయం.

తోటివారిలా పేరే తెచ్చుకోవాలన్న కాంక్ష. పత్రికల్లో పుంఖానుపుంఖాలుగా వస్తున్న సాహిత్య ప్రవాహం. ఇవన్నీ కలిసి వాళ్లను కింకర్తవ్యుల్ని చేశాయి.

వ్యాపార సాహిత్యం ప్రభావంతో పడి కొట్టుకుపోకుండా తెలంగాణాకు సహజమైన నిబద్ధత వెనుకకు లాగడం మొదలుపెట్టింది. తమదైన బలమైన ముద్ర వేసి తెలుగు సాహిత్యాన్ని తమతో నడిపించగలిగే శక్తి సామర్థ్యాలు, వనరులు అంతకంటే లేవు. ఈ కాలంలో స్వాతంత్ర్యానికి ముందు తెలంగాణలో లేని మధ్యతరగతి కొంత కొంతగా ఆవిర్భవించడం మొదలైంది. తాము రాసేది ఒక్క తెలంగాణా వాళ్లకే కాదని తాము మాండలికంలో రాస్తే ఇతర ప్రాంతాలవారికి అర్థమవుతుందో కాదోనన్న భయం మరో దిక్కు వెంటాడుతుంది. ఇన్ని రకాల సంఘర్షణల మధ్య ఆ రచయితలు ఓ మధ్యేమార్గాన్ని ఎన్నుకున్నారు. కోస్తా పత్రికల, విమర్శకుల మెప్పు పొందడానికి తెలంగాణా సాహిత్య ప్రయోజన పంథాను పూర్తిగా విడవకుండానే రచనలు సాగించారు. ఇలాంటివారిలో నవీన్, తాడిగిరి పోతరాజు, మలయశ్రీ, రామచంద్రమౌళి, పాలకోడేటి సత్యనారాయణరావు లాంటి వాళ్లను పేర్కొనవచ్చు. తెలంగాణ నుంచి రచయితలుగా ప్రసిద్ధులైన వాళ్లు ప్రాంతీయతను హృదయానికి హత్తుకొని ప్రజల భాషను తనదిగా చేసుకొనే రాశారు. రెండవతరంలో మాత్రం అనేక కారణాల వల్ల ఈ రెండింటికీ కొంత దూరం జరిగారు. అందుకోసం మధ్యతరగతి చదువుకున్న జీవితాలకు, కాలేజీ జీవితాలకు, పట్టణమధ్యతరగతికి పరిమితమై కొన్ని ప్రయోగాలు చేయబోయారు. ఈ కారణాల వల్లనేమో తెలంగాణా నుంచి ఎక్కువగా కథలు రావడం లేదన్న విమర్శ వచ్చింది. ఆ కాలంలోనే ఒకరిద్దరు రచయితలు తెలంగాణా జనజీవితాన్ని అక్షరబద్ధం చేస్తూ విరివిగా రచనలు చేసుంటే ఈ ఖాళీ ఏర్పడి ఉండేది కాదు. మొదటితరం రచయితల పరంపరను కొనసాగించి ఉంటే తెలంగాణ కథకెంతో మేలు జరిగి తెలంగాణా సాహిత్యం మరింత పరిపుష్టమై ఉండేది. తర్వాతి తరం వాళ్లపై అంత భారం పడి ఉండేది కాదు. అయినా తెలంగాణ కథకులు వ్యాపార నవలల జోలికి పోలేదు. ఆ కాలంలో, ఆ తర్వాత ఒకరిద్దరు ఆ ప్రయత్నం చేసి త్వరలోనే వెనుకకు తిరిగారు.

అంతగా వ్యాపార సాహిత్యం వస్తున్న కాలంలోనూ తెలంగాణ కథ ఆరున్నర అడుగుల హీరోల, డిటెక్టివ్ పరిశోధకుల వెంట పడకుండా తప్పించుకొని బతికి బట్ట కట్టడం గొప్ప విషయమే. ఈ కాలంలోనే సృజనలాంటి పత్రికలు ప్రారంభమై ప్రజా పోరాటాలను ప్రతిబింబించే సాహిత్యాన్ని ప్రోత్సహించడం చెప్పుకోదగ్గ విషయం. తాడిగిర పోతరాజు జైలు కథలు, అంపశయ్య నవల, ఎసెలెవన్ బాబు రాసిన ఒకటి



రెండు కథలు, పాలకోడేటి కాలేజ్ జీవితాల కథలు ఈ కాలంలో వచ్చాయి. తెలంగాణా కథ పూర్తి వ్యాపారమయం కావడం నుంచి తప్పించుకున్నా మాండలికాన్ని విస్మరించి ప్రాంతీయ ముద్రకు దూరంగా ఉన్న కథలే ఎక్కువ రావడం వల్ల కొంతవరకు తెలంగాణా కథా స్వభావాన్ని కోల్పోయాయి. ప్రేమకథలు, ప్రయోగాల పేరు మీద వచ్చే కథలు, అర్బనైజ్డ్ కథలు, అందరికీ అర్థం కావాలనే పేరు మీద రాయబడే పొడిపొడి భాష కథలు ఏ ప్రాంతం వాళ్లు రాసినా, ఎప్పుడు రాసినా వాటితో సమకాలీన జనజీవితం ప్రతిబింబం కాదు కాబట్టి వాటితో ప్రయోజనం పరిమితమే. ప్రాంతీయతా ముద్ర లేని విశ్వజనీన సాహిత్యం ఉండదన్నది నగ్నసత్యమే. ప్రేమ్‌చంద్, టాల్‌స్టాయ్ లాంటి ప్రపంచ ప్రఖ్యాత రచయితల రచనలకు ప్రాణభూతమైనవి ప్రాంతీయతా ముద్ర, ప్రజల భాషలేనన్న విషయం మరిచిపోకూడదు. తెలంగాణతనం తెలంగాణ జీవిత చిత్రణతో మలితరంలో తక్కువ కథలు రావడం కొంత లోటే. ఉవ్వెత్తున లేచిన ప్రత్యేక తెలంగాణా ఉద్యమం గురించి కూడా ఆ కాలంలో ఒక్క కథ కూడా రాలేదు. రాజాకారు పోరాటాల గూర్చి తెలంగాణా వాళ్లు రాసిన కథలు అతి తక్కువైనట్టే అనేక కారణాల వల్ల 1969 తెలంగాణ ఉద్యమం గూర్చి కథలు రాలేదు. రాసి ఉన్నా ప్రచురింపబడక పోవచ్చు. మేమూ పెద్ద మనుషుల్లో కలుద్దామన్న రచయితల కాంక్ష కావచ్చు.

తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఆగిపోయిన తర్వాత కొద్ది కాలంలోనే తెలంగాణలో భూపోరాట ఉద్యమాలు ఉవ్వెత్తున లేచాయి. తెలంగాణలో ఉద్యమాలు వేళ్లూనుకుంటున్న కాలంలో కరీంనగర్ నుంచి ఉద్యమ సాహితి వాళ్లు ప్రచురించిన బద్‌లా కథా సంకలనం వచ్చింది. ఇందులో చాలా కథల్లో తెలంగాణ మాండలిక భాషా గుభాళింపులు, ప్రాంతీయ జీవితం, పోరాటం చిత్రింపబడ్డాయి. తెలంగాణ గ్రామాల్లో అప్పుడప్పుడే వేళ్లూనుకుంటున్న ఉద్యమ స్వరూపస్వభావాలు ఈ కథల్లో దర్శనమిస్తాయి. వినోద్, శరత్‌కుమార్, తాడిగిరి పోతరాజు, తిరుపతి, ఉమ్మెత్తల వెంకటరెడ్డి, యం.వి. తిరుపతి రాసిన కథలిందులో ఉన్నాయి. విప్లవోద్యమాల పట్ల సానుకూల వైఖరిని పెంచే ఈ కథలు తర్వాత కలం పట్టిన వాళ్లెందరికో ప్రేరణనిచ్చాయి. విరసం ఆవిర్భావం తరువాత మొదటితరంలో వచ్చిన ఈ కథలు తెలంగాణ గ్రామాల్లోని ఫ్యూడల్ వ్యవస్థ స్వరూపాన్ని, దొరల దౌర్జన్యాలను, ప్రజలు తిరుగుబాటు చేయాల్సిన ఆవశ్యకతను, అవ్వబాంచెన్, అయ్య బాంచెన్ సంస్కృతిని మన కళ్ల ముందుంచుతాయి. హోరు, ఇప్పుడు వీస్తున్న గాలి లాంటి కథాసంకలనాలు శ్రీకాకుళ పోరాటంలోని పేలుతున్న నేల స్వభావాన్ని అక్షరీకరిస్తే బద్‌లా కథలు పేలబోతున్న తెలంగాణను గూర్చి చెప్పాయి. ఇందులోని న్యాయం కథ రాసిన రచయిత ఎమర్జెన్సీ కాలంలో అనేక ఇబ్బందులు ఎదుర్కొన్నాడు.

తెలంగాణా నుంచి కథా రచయితలుగా ఎదిగినవాళ్ల సంఖ్య చాలా తక్కువే. మొదటితరంలో ఎచ్చమ్మకథలు, మా ఊరి ముచ్చట్లులాంటి కథలు అచ్చమైన మాండలికంలో రాసి ఎచ్చమ్మ కథల యశోదారెడ్డిగా ప్రసిద్ధులయ్యారు పి. యశోదా రెడ్డి. రెండవతరంలో ఎదగాల్సుండిన ముదిగంటి సుజాతారెడ్డి కొంత ఆలస్యంగా కథలు రాయడం ప్రారంభించి విసుర్రాయి, మింగుతున్న పట్నం కథా సంపుటులు వెలువరించి ప్రసిద్ధులయ్యారు. వీళ్లిద్దరి కథల్లో తెలంగాణ భాషా సంస్కృతులు వాస్తవికంగా చిత్రించబడ్డాయి. తెలంగాణ నుంచి ఇంకా చాలా మంది రచయితలుగా ఎదిగి తెలంగాణ దళిత, బహుజన స్త్రీ సమస్యలపై విస్తృతంగా కథలు రాయాల్సే ఉంది.

ఎమర్జెన్సీ తర్వాత తెలంగాణా కథకు స్వర్ణయుగం ప్రారంభమైందని చెప్పవచ్చు. అదింకా కొనసాగుతూనే ఉంది. గత పాతికేళ్లకు పై కాలంనుంచి తెలంగాణ నుంచి వాసిలోనూ, రాశిలోనూ చెప్పుకోదగిన కథలొస్తున్నాయి. స్వాతంత్ర్య సమీప కాలంలో, వచ్చిం తర్వాత పుట్టి పెరిగిన వాళ్లు డెబ్భైలు దాటిన తర్వాతి కాలం నాటికి యువకులయ్యారు. అంతకుముందు బొత్తిగా చదువుకునే అవకాశాలు లేని పీడిత కులాల నుంచి చదువుకున్న వాళ్లెదిగారు. ఉన్న అవకాశాలను ఉపయోగించుకుని జీవితాలను గెలుచుకునే క్రమంలో విద్యాబుద్ధులను నేర్చుకున్నారు. వాళ్లలోంచి రచియతలు, సామాజిక తాత్వికులు, జర్నలిస్టులు ఎదిగారు. సమాజం తమకిచ్చిన అవకాశాలను, తాము రాయాల్సి ఉన్న విషయాలను గుర్తించారు. శ్రామిక కులాల్లోంచి వచ్చిన వీళ్ల ఎరుక గొప్పది. ఇది శ్రామిక వర్గం ఎరుక. బహుజన కులాల ఎరుక. వ్యవసాయ, ఇతర వృత్తి పనివారల ఎరుక. ఈ ఎరుకతో ఇంతవరకు రాని అనేక అంశాల గూర్చి, బతుకు వెతల గూర్చి వృత్తి పనుల గూర్చి పుంఖానుపుంఖాలుగా కథలు వచ్చాయి. మొదటితరం తెలంగాణా రచయితలు చూపిన మార్గాన్ని, వేసిన బాటను మరింత విశాలం చేస్తూ శ్రమజీవులను కథా నాయకులను చేస్తూ అనేక కథలు రాశారు. ఈ రచయితల్లో చాలామంది కలం పట్టే నాటికి తెలంగాణలో భూపోరాట ఉద్యమాలు ఊపందుకున్నాయి. అప్పటికే బద్‌లా సంకలనం లాంటి పుస్తకాలు వచ్చున్నాయి.

ఈ నేపథ్యంతో పోరాట కథలు విరివిగా రావడం ప్రారంభమైంది తెలంగాణా నుంచి. తెలుగుకథకు పోరాట బాటను, పోరాట కథా వారసత్వాన్ని అందించిన ఘనత తెలంగాణా కథకే దక్కుతుంది. భూమికోసం, భుక్తి కోసం నేలతల్లి విముక్తి కోసం ఎంతో మంది యువకులు అసువులు కోల్పోతుంటే ఈ పోరాటాల్లోని ఆటుపోట్లను, నిమ్నోన్నతాలను, పోరాట క్రమాన్ని, పోరాటాలు తెలంగాణ ప్రజాసమూహాల్లో



తీసుకొస్తున్న మార్పులను రచయితలు కథలుగా మలిచారు. తెలంగాణా భూపోరాటాలు కొంతమందితో అనివార్యంగానే కలం పట్టించాయి. చుట్టూ జరుగుతున్న అనేక సంఘటనలను చూస్తూ అగ్నిగుండంలా మండుతున్న తెలంగాణా చిత్రపటాన్ని గమనిస్తూ చాలా మంది తమ కలాలను ఝళిపించారు. వీళ్లలో కొందరు కవులుగా, కొందరు రచయితలుగా ప్రసిద్ధులయ్యారు. పోరాట సాహిత్యాన్ని విరివిగా రాసిన రచయిత అల్లం రాజయ్య ఎదురుతిరిగితే కథతో, కొలిమంటుకున్నది నవలతో ప్రారంభమైన ఈ పోరాట కథల పరంపర పది పదిహేనేళ్లు ఉధృతంగా కొనసాగింది. తెలుగు సాహిత్యంలో 70, 80 దశాబ్దాలను పోరాట కథల లేదా విప్లవ కథల దశాబ్దాలుగా పేర్కొనవచ్చు. ఈ కాలంలో తెలంగాణ నుంచి విస్తృతంగా పోరాట కథల వారసత్వాన్ని అందించిన ఘనత తెలంగాణాకథకున్నట్టే తెలుగు కథకు విప్లవ కథ వారసత్వాన్ని అందించిన ఘతన తెలంగాణకే దక్కుతుంది. అల్లం రాజయ్యతో పాటు తెలంగాణ నుంచి పోరాట కథను సుసంపన్నం చేసినవాళ్లు సాహు, బి.యస్. రాములు, రఘోత్తమరెడ్డి, కాలువ మల్లయ్య, కె. రామ్మోహన్ రాజు, ఉప్పల నరసింహం, సరిపల్లి కృష్ణారెడ్డి, తోట మహదేవ్, సిహెచ్. మధు, సృజన్, చెరబండరాజు, నందిని సిధారెడ్డి, పి. చంద్‌లాంటి వాళ్లెంతో మంది ఉన్నారు. భూమి, సృష్టికర్తలు, వెలి, పాలేరు, భూమి నవ్వింది, ఈ భూమి నాది, ఈ భూమి ఎవరిచ్చింద్రు, ధిక్కారం, పరారీ, పగులూ రేయీ శ్రమపడుతున్నా, ఇత్తనపు కోడె, తిరుగబడ్డ భూమి, అరుణకిరణం, పరిగె, పతనం, బిర్లామందిర్, కథ, జంగుబాయి, మనం తడుం కొట్టాలె, ఇల్లు, పాలు, అతడు, ఆంబోతు, యుద్ధభూమి, భద్రత, జాడలాంటి అనేక కథలు తెలుగులో విప్లవ కథా క్షేత్రాన్ని సుసంపన్నం చేశాయి. రష్యాలో సోషలిస్టు వ్యవస్థ పతన కాలం వరకు తెలుగులో పోరాట కథలు విస్తృతంగా వచ్చాయి. ఇతర పత్రికలతో పాటు సృజన, అరుణతార, ప్రజాసాహితి, నూతన, వడిసెల, జీవనాడి లాంటి నిబద్ధతతో నడిచే పత్రికలు ఈ కథలను ప్రచురించాయి. ఈ కథల్లో సాంస్కృతిక, భూపోరాట, దళిత, గిరిజన, కార్మిక పోరాట, విద్యార్థిమేధావుల పోరాటాల కథలనేకం ఉన్నాయి. వీటిని చదువుతుంటే తెలంగాణా గ్రామాల్లోని ఫ్యూడల్ స్థితిగతులు, పోరాటాల ఆవశ్యకత, తద్వారా వచ్చిన మార్పులు దృగ్గోచరమవుతాయి. తెలంగాణా మాండలికానికి విస్తృత ప్రచారం ఈ కాలంలోనే వచ్చింది.

తెలుగుకథకు, తెలుగు సాహిత్యానికి తెలంగాణా ఇచ్చిన మరో గొప్ప కాంట్రిబ్యూషన్ కార్మిక కథలు. పోరాట సాహిత్యం విరివిగా వస్తున్న కాలంలోనూ, ఆ తర్వాతి కాలంలోనూ కార్మికుల గూర్చి అనేక కథలు వచ్చి తెలుగులో, కార్మికుల

కథలు లేని లోటు పూరించాయి. తెలంగాణలో అంతకు ముందు లేని కార్మికవర్గం ఆవిర్భవించడం, కార్మికుల్లోంచే రచయితలు రావడం వల్ల సింగరేణి బొగ్గుగని కార్మికుల గూర్చి ఎరువు కర్మాగార కార్మికుల గూర్చి, హైదరాబాద్ పరిశ్రమల్లోని కార్మికుల గూర్చి మంచి కథలే వచ్చాయి. తుమ్మేటి రఘోత్తమరెడ్డి, కాలువ మల్లయ్య, అల్లం రాజయ్య, పి. చంద్, వేల్పుల నారాయణ, ఆడెపు లక్ష్మీపతి, పులుగు శ్రీనివాస్-లాంటి వాళ్లు కార్మికుల గూర్చి కథలు రాశారు. వీళ్లందరూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కార్మికవర్గంతో సంబంధాలున్నవాళ్లే. బొగ్గు పొరల్లో, ప్రస్థానం కుంపటి, సమ్మె, ఉరి, ఉరితాడు, జీవన్మృతుడు, పొగగొట్టంలాంటి అనేక కథలు ఇందులో ఉన్నాయి.

పోరాట కథలతో పాటు తెలంగాణా గ్రామీణ జీవితాల గూర్చి దళిత బహుజన కులాల్లోంచి ఎదిగి జీవితాలను గెలుచుకున్నవాళ్ల గూర్చి కాలువ మల్లయ్య, బి.యస్. రాములులాంటి వాళ్లు అనేక కథలు రాశారు. ధ్వంసమవుతున్న విలువలు, మృగ్యమవుతున్న మానవ సంబంధాలను అక్షరీకరిస్తూ వచ్చిన కథలూ ఉన్నాయి. వారసత్వం, వరుసలు, బోధివృక్షం, అమ్మ మీది సొమ్ములు, స్మృతి, రూపాయి రూపాయి, నిరుడు కురిసిన హిమసమూహంలాంటి కథలిందుకు మంచి ఉదాహరణలు. అంతకు ముందు సాహిత్యానికి అంతగా ఎక్కని గిరిజనుల గూర్చి బి.యస్. రాములు, సాహు చక్కని కథలు రాశారు. అడవిలో వెన్నెల - 1, అడవిలో వెన్నెల - 2, రక్తపింజెర, నీళ్లు కావాలి, గోపి భాగ్యలక్ష్మి రాసిన జంగుబాయి లాంటి కథలిందులో ఉన్నాయి. రైతులు, విద్యార్థులు, మేధావులు, సగటు మనుషుల గూర్చి త్రిశంకు వర్గం, పగలూ రేయీ శ్రమపడుతున్నా, మమతలే మరుగై లాంటి కథలు వచ్చాయి. ఇది వరకెవ్వరూ స్పృశించని తెలంగాణ దొర్సానుల గూర్చి అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, నీల, కమల, చిందొర్సాని, పంజరం, దొర్సానమ్మ, జాడ లాంటి కథలు రాశారు. ఇలా అన్ని రంగాల్లోనూ ఈ విషయంపై రాయలేదన్నది లేకుండా విశిష్టమైన కథలు రాసి తెలంగాణా కథను సుసంపన్నం చేశారు. ప్రేమకథల ఊపులో, ఊబిలో తెలంగాణ కథకులు కొట్టుకుపోనట్టే భూతప్రేత పిశాచగణ వ్యాపార నవలా సాహిత్యం పత్రికల్నిండా చోటు చేసుకుంటున్న సమయంలోనూ తెలంగాణ రచయితలు వ్యాపార ఊబిలోకి దిగలేదు. తెలంగాణ కథకు భూతప్రేత వ్యాపార వాసనలంటనీయలేదు. చెత్తకథ, శృంగార కథ, సరసమైన కథ, పూర్తి వ్యాపార నవలల కాలంలో తెలుగు కథను, సాహిత్యాన్ని బతికించింది తెలంగాణ రచయితలే. ఏ ప్రలోభాలకూ లొంగకుండా కమిట్‌మెంట్‌తో సాహిత్య సృజనం చేయడం ఈ రచయితల ప్రత్యేకత.



పోరాటాలు, సాహిత్యోద్యమాలు స్త్రీల సమస్యలను దళిత సమస్యను పట్టించుకోవాల్సినంతగా పట్టించుకోకపోవడం వల్ల స్త్రీవాద, దళితవాద ఉద్యమాలు, సాహిత్యోద్యమాలు వచ్చాయి. ఇవి రావడం వల్ల ఆయా రంగాల్లో మరింత లోతైన రచనలు రావడం సాధ్యమైంది. అంబేడ్కర్ సిద్ధాంతాల ప్రభావంతో, దరకమే ఐక్య వేదిక ఆవిర్భావంతో తెలంగాణలో దళిత సాహిత్యోద్యమం ఊపందుకుంది. అంతకు ముందు స్త్రీవాద సాహిత్యం వచ్చినా స్పృశించని దళిత సాహిత్యం విరివిగా రావడానికి మార్గం సుగమం చేసిన ఘనత తెలంగాణా రచయితలకే దక్కుతుంది. బోయ జంగయ్య, కాలువ మల్లయ్య, బి.యస్. రాములు దళిత సాహిత్యానికి చేసిన కాంట్రిబ్యూషన్ విశేషమైంది. బోయ జంగయ్య రాసిన ఎచ్చరిక, దున్నలు, బోజ కథల సంపుటిలోని కథలు, బి.యస్. రాములు రాసిన బందీ, దక్షయజ్ఞం, తెల్లబట్ట లాంటి కథలు, కాలువ మల్లయ్య రాసిన దగాదగా, అగ్నిగుండం, కల్రోడు, నా తెలంగాణా, నిర్ణయం, సొసంత్రం, సంస్కృతిలాంటి అనేక కథలు దళిత సాహిత్యాన్ని మరింత ముందుకు తీసుకుపోయే మంచి కథలు దళిత స్త్రీ దృష్టికోణంలోంచి ఎంగిలిచేత్తో, దగా, బామ్మర్ది లాంటి కథలను రాసి తెలుగు కథకు నూతన దృక్పథాన్నందించారు. తెలుగు సాహిత్యంలో విశిష్టమైనవని చెప్పబడే దళిత కథలు ఈ మధ్యకాలంలో తెలంగాణా నుంచే వచ్చాయి.

చాలా కాలంగా అన్ని రంగాల్లోనూ నిరాదరణకు గురవుతున్నవాళ్లు బి.సి.లు. అన్ని ఉత్పత్తులను చేసే సృష్టికర్తలు వీళ్లు. సర్వ సంపదలకు సృష్టికర్తలైన ఈ పనిమంతులకు సంబంధించిన సాహిత్యం తెలుగులో వచ్చింది తక్కువ. మెజారిటీగా ఉన్న ఈ వృత్తి పనివాళ్లకు సాహిత్యంలో చోటు లేకపోవడం, ఉన్నా అతి స్వల్పంగా ఉండటం పెద్ద లోపమే. లిఖిత సాహిత్యంలో చాలా భాగం అగ్రకులాల దృష్టికోణంలోంచి వచ్చిందే. పనిమంతులు తమ సాహిత్యాన్ని జానపద సాహిత్య రూపంలో సృష్టించుకున్నారు. లిఖిత సాహిత్యంలో అంతగా స్థానం లేని పనిమంతుల సాహిత్యం లోటును తీర్చడానికి తెలంగాణా రచయితలు నడుం కట్టారు. బహుజన సాహిత్య చలనం లేక ముందు నుంచే తమకు తెలిసిన జీవితాన్ని కథలుగా రాయడం ద్వారా సృష్టికర్తల సాహిత్య సృజనం మొదలైంది. స్వాతంత్ర్యానంతరం పుట్టి పెరిగిన వాళ్లలో రచయితలైన చాలామంది శ్రామిక కులాల నుంచి వచ్చినవాళ్లు కావడం వల్ల బహుజన కథలు విరివిగా రావడానికి అవకాశం లభించింది. సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలపై కథలు రాస్తూ బహుజన సాహిత్య మూవ్‌మెంట్‌ను ఉధృతం చేయడం తెలంగాణాలో మొదలైంది. సాలెల మగ్గం, జాలరి పగ్గం, కుమ్మరి సారె, నాగలి పగ్గం, గొల్లల కట్టె లాంటి అనేక విషయాల గూర్చి కథలొచ్చాయి. ఈ కథలు బహుజన సాహిత్యోద్యమానికి

మార్గదర్శకాలయ్యాయి. వివిధ బహుజన కులాల గూర్చి వందలాది కథలు రాసి బహుజన సాహిత్యానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సారథ్యం వహించిన రచయితలు తెలంగాణ మట్టి నుంచే వచ్చారు. తెలుగు సాహిత్యంలో వస్తు సేకరణలో పని తాత్వికతకు ప్రాధాన్యతనిచ్చి సహప్రవృత్తుల సమస్త జనాల గురించి కథలు రాయడానికి మార్గం సుగమం చేసిన వాళ్లు కాలువ మల్లయ్య, బి.యస్. రాములు, కంచ ఐలయ్యలాంటి బహుజన రచయితలే. వీళ్లు రాసిన శనార్థి, సొసంత్రదినం, స్మృతి, ప్రేమధార, అడవి గాచిన వెన్నెల, ఊరుమ్మడి బతుకులు, మదేలయ్య మనసు, నిరీక్షణ, వరుసలు, యోజనగంధి, వారసత్వంలాంటి అనేక కథలున్నాయి.

తెలంగాణ నేలపై ప్రపంచీకరణ భూతం వల్ల జరిగిన దుష్పరిణామాలను విధ్వంస దృశ్యం, గ్లోబలైజేషన్, వేపచెట్టు, హిరణ్యాక్షుడు, క్విట్ ఇండియాలాంటి కథలుగా మలిచారు. నూతన పారిశ్రామిక ఆర్థిక విధానాల వల్ల ధ్వంసమైన బతుకులనూ కథలుగా మలిచారు. తెలంగాణ గ్రామాల ముఖచిత్రాన్ని తెలంగాణ గ్రామాల్లో సాంఘిక, రాజకీయ, సామాజిక పరిణామాలను చిత్రించిన భవిష్యత్తు తరాల వారికి తెలంగాణ, తెలుగు సాంఘిక చరిత్రను రాయడానికి తగినంత ముడిసరుకునందించారు. ఐతా చంద్రయ్య జాతీయ వాదకథలను రాసి తెలుగు సాహిత్యంలో ఆ కథలు లేని లోటు తీర్చాడు. విద్యాసాగర్, దేవరాజు మహరాజు, కాసుల ప్రతాపరెడ్డి లాంటివాళ్ళు పట్టణ సంఘర్షణను చిత్రించారు. సాక్షి, జింబో కోర్టు కథల రచయితలుగా ప్రసిద్ధికెక్కారు. సింగిల్ కాన్సెప్ట్ కథలతో కె.వి. నరేందర్, వలస కథలతో జూకంటి జగన్నాథం ప్రసిద్ధులయ్యారు. తనకు ముందున్న రచయితల గ్రామీణ జీవిత చిత్రణ వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్తూ చక్కని కథలు రాస్తున్నాడు పెద్దింటి అశోక్‌కుమార్. దిగంబర సాహిత్యోద్యమ సారథలైన నిఖిలేశ్వర్, జ్వాలాముఖి కవిత్వమే కాకుండా హైదరాబాద్ జీవితాలగూర్చి చక్కని కథలే రాశారు. ఇటీవలి కాలంలో తెలుగు సాహిత్యంలో తలెత్తిన మైనారిటీవాద సాహిత్యాన్ని మరింత ముందుకు తీసుకెళ్తూ చక్కని కథలు రాస్తున్నారు స్కైబాబ, షాజహానా. స్త్రీవాద రచయిత్రిగానే కాకుండా తెలంగాణా మాండలికంలో కథలు రాస్తూ ముందుకు తీసుకెళ్తుంది గీతాంజలి. హృదయం నిండా తెలంగాణను నింపుకొని కథలు రాస్తున్నాడు శ్రీధర్ దేశ్‌పాండే. అడవి, ఊరులాంటి నవలలే కాకుండా ప్రకృతిపై చక్కని కథలు రాశాడు వసంతరావు దేశ్‌పాండే. సింగిడి కథలు రాసి డా॥ బి. దామోదర్ రావు, నిత్య గాయాలనది కథతో బెజ్జారపు రవీందర్, వ్యాపార మిళితమైపోయిన బతుకులను చిత్రిస్తూ బెజ్జారపు వినోద్‌కుమార్, తెలంగాణా బతుకు వెతలను చిత్రస్తూ బి.వి.యన్.స్వామి, బోధనం నర్సిరెడ్డి, పంజాల జగన్నాథం, డా॥



పులిపాటి గురుస్వామి తమ సాహితీ ప్రస్థానాన్ని కొనసాగిస్తున్నారు. అపారమైన ఆర్తితో దళిత కథలను సృష్టిస్తూ దార్ల రామచంద్ర, నల్లాల లక్ష్మీరాజం, అన్నవరం దేవేందర్ తమ సాహితీ ప్రస్తానాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. వీళ్లే కాకుండా చెరబండరాజు, జాడి కథతో ప్రసిద్ధుడైన సందానంద శారద, చంద్ర, గంగుల నరసింహారెడ్డి, గొరుసు జగదీశ్వర్ రెడ్డి, నలిమెల భాస్కర్, కలకోటి కిషన్‌రావు, కొక్కుల భాస్కర్, కొక్కుల పద్మావతి, అమరావతి, యెన్నెం ఉపేందర్, రేగులపాటి కిషన్‌రావు, ఎనుగంటి వేణుగోపాల్, వనమాల చంద్రశేఖర్, అంబల్ల జనార్దన్, గోగు శ్యామల, చొప్పదండి సుధాకర్, అఫ్సర్, గూడ అంజయ్య, భూపాల్, లోకేశ్వర్ లాంటి వాళ్లు అనేక మంది తెలంగాణ కథను ముందుకు తీసుకెళ్తున్నారు. తెలంగాణ కథ విశిష్టతను కాపాడుతున్నారు. ఇటీవలి కాలంలో అనేక కథా సంకలనాలు, తెలంగాణ జనజీవన దృశ్యాలనదగిన కథా సంపుటాలు వస్తున్నాయి. అబంపి పబ్లికేషన్స్ వారు ప్రచురించిన కోల్‌బెల్ట్ కథలు, భూమిక, కరీంనగర్ బుక్ ట్రస్టువారు ప్రచురించిన భూమి, సృష్టికర్తలు, అడవిలో వెన్నెల కథలు, విశాల సాహితీ అకాడమీ వారు ప్రచురించిన ఆధునిక కథా సరిత్సాగరం రెండు సంపుటులు, భారతీయ సాహిత్యం తెలుగు కథ, విశాలాంధ్ర తెలుగు కథలోని 20కి పైగా ఉన్న కథలు తెలంగాణా కథకు వన్నె తెచ్చేవే. సదానంద శారద, బోయ జంగయ్య, ఉప్పల నరసింహం కథా సంపుటులు, బి.యస్. రాములు స్మృతి, మమతలు మానవసంబంధాలు, వేపచెట్టు, భూపాల్ అంబల్ల బండ, ఆడెపు లక్ష్మీపతి నాలుగు దృశ్యాలు, శ్వేతరాత్రులు, ఋతుపవనాలు, కాలువ మల్లయ్య ఘర్మజలానికి, మా కథలు, కాలువ మల్లయ్య కథలు, అవ్వతోడు గిది తెలంగాణా కథల సంపుటులు, పి.చంద్ భూనిర్వాసితులు, పెద్దింటి అశోక్‌కుమార్ ఊటబాయి, కె.వి. రామ్మోహన్ రాజు అనామకుడి డైరీ, నల్లాల లక్ష్మీరాజం తిరుగు ప్రయాణం, దార్ల రామచంద్ర కిర్రుచెప్పులు, యెన్నెం ఉపేందర్ ఎండమావి, కాసుల ప్రతాపరెడ్డి కథలు, కాళోజీ కథలు, గూడూరి సీతారాం కథలు, తొలితరం తెలంగాణా కథలు, ఐతా చంద్రయ్య కథల సంపుటులు. బెజ్జారపు వినోద్‌కుమార్ గవ్వల మూటలాంటి అనేక కథల సంపుటులు తెలంగాణ కథ విశిష్టతను కాపాడేవే.

ఇలా తెలంగాణ కథ తన విశిష్టతను కాపాడుకుంటూ నేటి అవసరమైన ప్రాంతీయతను, జాతీయతను, పని తాత్వికతను నిలుపుకుంటూ కథ అంటే ఇలా ఉండాలని నిరూపిస్తూ ముందుకు, మును ముందుకు పోతూనే ఉంది. ఏ భాషా సాహిత్యానికీ తీసిపోని కథలు తెలంగాణ నుంచి వస్తూనే ఉన్నాయి. అదీ మట్టి ప్రభావమే.

# నడిగడ్డ తెలంగాణ - తాత్విక పరిమళం

మనదేశంలో చారిత్రక భౌగోళిక ప్రాధాన్యం ఉన్న దక్కను పీఠభూమిలో ఉన్న నేల తెలంగాణ.. నడిగడ్డ ప్రాంతంగా పిలువబడే తెలంగాణ తుఫానులకు, భారీ వర్షాలకు, భూకంపాలలాంటి ప్రకృతి వైపరీత్యాలకు సుదూరంగా ఉన్న సురక్షిత ప్రాంతం... ఒకంగుళం కూడా సముద్రతీరం లేకున్నా అపారమైన వనరులున్న భూమి... చక్కని నైసర్గిక స్వరూపంతో ఉత్తర తెలంగాణ జిల్లాల్లో అద్వితీయమైన అటవీసంపద, వందలాది ఏళ్ళు తవ్వినా తరగనంత నల్లబంగారం గనులున్న ప్రాంతం.. కృష్ణా, గోదావరి లాంటి జీవనదులతోపాటు అనేక వాగులు, సెలయేర్లు, సరస్సులతో పచ్చని పైరులతో సిరిసంపదలతో సుసంపన్నమైన ప్రాంతం.. కొండలు, కోనలు, ప్రకృతి సిద్ధమైన వ్యవసాయం, సమతుల్య వాతావరణం లాంటివి ఉన్న చక్కని ప్రదేశం.. శాతవాహనులు, కాకతీయులు, గోలకొండ నవాబుల్లాంటి - గొప్ప రాజులతోపాటు గద్వాల, వనపర్తి లాంటి గొప్ప సంస్థానాలున్న చారిత్రకనేల... నైజాం పాలనా కాలంలో తెలంగాణలో ఇప్పటి తెలంగాణ జిల్లాతోపాటు ఔరంగాబాద్, బీదర్, గుల్బర్గ, నాందేడ్, ఉస్మాన్‌బాద్, పర్బనీ, రాయచూరులు కూడా ఉండేవి. ఉర్దూ, మరాఠీ, పార్శీ, కన్నడ, ఇంగ్లీషు, ఇతర ప్రాంత భాషాపదాలతో పాటు అనేక పదాలను తనలో సొంతం చేసుకొని తెలంగాణ భాష సుంసన్నమైంది... ప్రత్యేకమైన తాత్విక నేపథ్యంలో తెలంగాణలో సాహిత్యం కళలు, సామాజిక రంగం సుసంపన్నమయ్యాయి.. దేశానికే మార్గదర్శకత్వం వహించే తెలంగాణ తాత్వికత శ్రామికవర్గాల తాత్వికత.... ఈ తాత్వికతకు తద్వారా కళా, సాహిత్య, సాంస్కృతిక రంగాలకు సామాజిక పునాది ఉంది.

తెలంగాణ రక్తంలోనే తిరుగుబాటు తత్వముంది.... రాచరికం అమలులో ఉన్నకాలంలోనే కాకతీయుల నెదిరించి నిలచిన సమ్మక్క సారక్కల గిరిజన తిరుగుబాటు తత్వం, నైజాం పాలన నెదిరించిన కొమురం భీం వారసత్వం తెలంగాణ ప్రజలకుంది... వరంగల్ జిల్లాలోని ఓ కుగ్రామంలో పుట్టిన బమ్మెర పోతన భాగవతాన్ని ఇమ్మనుజేశ్వరాధములకు అంకిత మివ్వనని ఘంటాపథంగా చెప్పాడు... మరో దిక్కు తన సమకాలికుడైన శ్రీనాథుడు రాజాశ్రయాలతో భోగాలనుభవిస్తున్నా హాలికుడుగా ఉంటూ పొట్ట పోసుకున్నకవి పోతన... ఆ కాలానికి రాజాశ్రయాన్ని ధిక్కరించడం గొప్పసాహసమే. తేనెలొలుకు తెలుగుభాషలో పోతన రాసిన భాగవతం ఇతరులు రాసిన పురాణ గ్రంథాల కన్న ఎక్కువగా, సులభంగా పాఠకులకు చేరుకుంది.



చాలాకాలంగా తెలంగాణ నిజాం నిరంకుశ పాలన కింద మగ్గిపోయినా నైజాం పాలనాకాలంలోనే ఉద్యమాలు ఉవ్వెత్తున లేచాయి. భారతదేశానికే భూపోరాటాల వారసత్వాన్నందించాయి. ఆ పోరాటాల విరమణ జరిగినా ఆ తర్వాత రెండు దశాబ్దాలైనా కాకముందే మళ్ళీ భూపోరాటాలారంభమై కొనసాగుతూనే ఉన్నాయి.

మొన్నమొన్నటి వరకు తెలంగాణలో ఫ్యూడల్ వ్యవస్థ వేళ్ళూనుకొస్తున్నా చక్కని గ్రామీణ వ్యవస్థ ఉండేది. ఒకరి అవసరాల్లో ఒకరు ఆదుకునే మనస్తత్వం, అన్నాతమ్మి, తాతామనవడా, బావాబావమరిదీ, అక్కాచెల్లీ లాంటి వరుసలతో పిలుచుకోవడముండేది. కులాలు, ఆర్థిక అసమానతలున్నా వరుసలు పెట్టుకొని ఆత్మీయంగా పిలుచుకునే తత్వం తెలంగాణ గ్రామాల్లో ఉండేది. వీటి అవశేషాలిప్పటికీ గ్రామాల్లో ఉన్నాయి. ఫ్యూడల్ భావజాలాల్లోనూ ఎంతో కొంత మానవాంశ తొంగిచూసేది. దొర, పటేలు, పాలేర్ల సంబంధాల్లో కొన్ని విచిత్రంగా ఉండేవి. ముఖ్యంగా మధ్యతరగతి రైతు కాపు, ఇతర బి.సి.కులాల వాళ్ళు పాలేర్లనుంచుకుంటే ఆ పాలేరూ కూలీగా కాకుండా ఇంట్లో మనిషిగా పనిచేసేవాడు. ఆ యజమానీ, పాలేరూ సమానంగానే పనిచేసేవారు. వాళ్ళ మధ్య సంబంధాల్లో మానవాంశ ఉండేది. ఆ ఇంటి అభివృద్ధిలో అతని పాత్ర ఉండేది. అయితే అతడు తాను ఎవరికోసమో పనిచేస్తున్నట్టు అసలే భావించేవాడుకాదు. బాకీబతుకులు, సంఘర్షణ, సృష్టికర్త ఆవేదన లాంటి కథల్లో ఈ సంబంధాలను వెలికితీయడం జరిగింది. వరుసలు పెట్టుకొని పిలుచుకోవడంలో ఉన్న ఆప్యాయతలు పెద్దపెద్ద గౌరవవాచకాలతో పిలువడంలో ఉండవు... ఇలాంటి అంశాలను, ప్రత్యేకతలను తెలంగాణ రచయితలు కథలుగా మలుస్తున్నారు. అయితే గ్రామాల్లోనూ వేళ్ళూనుకుంటున్నా పెట్టుబడీదారీ సంబంధాలు ఫ్యూడల్ వ్యవస్థలో ఉన్న కాస్తమానవాంశనూ మటుమాయం చేస్తున్నాయి.

స్వాతంత్ర్యానికి పూర్వం తెలంగాణ జిల్లాలు మరాటా ప్రాంతంతో కలిసుండేవి. సరిహద్దు జిల్లాలుగా మరాఠాతో ప్రాంతం ఉండటంవల్ల కూడా తెలంగాణకు మహారష్ట్రంలో సన్నిహిత సంబంధాలున్నాయి. తెలంగాణ నుంచి ఎక్కువగా మహారాష్ట్రకే బతుకపోవడం ఉంది. రజాకారు పోరాటకాలంలో కమ్యూనిస్టు విప్లవకారులు తలదాచుకోవడానికి కోస్తా జిల్లాలకు కాకుండా మహారాష్ట్రకు పోయేవారు. తెలంగాణ సంస్కృతీ సాహిత్యాలతో మరాఠా సంస్కృతీ సాహిత్యాలతో దగ్గరి పోలికలున్నాయి. అంబేద్కర్‌ను తనవాన్ని చేసుకొని మరాటీ సాహిత్య వేత్తలు దేశానికీ ఆదర్శపాత్రమైన దళిత సాహిత్యాన్ని సృష్టించారు. మరాటీ భాషలో వచ్చినంత దళిత సాహిత్యం ఏ

ఇతర భాషల్లోనూ రాలేదు. తెలంగాణ సాహిత్యకారులు మార్క్సుతోపాటు అంబేద్కర్‌నూ తనవాన్ని చేసుకున్నారు. విప్లవ సాహిత్యంతోపాటు దళిత బహుజన సాహిత్యాన్ని విరివిగా సృష్టించారు. ఇతర ప్రాంతాల కంటె ఇక్కన్నుంచే విప్లవ దళిత బహుజన సాహిత్యం విరివిగా వచ్చింది. అందుక్కారణం స్వాతంత్ర్యానికి ముందూ, ఇటీవలి కాలంలో వివిధ ఉద్యమాలు అట్టడుగు వర్గాల్లో వెలిగించిన చైతన్యంతోపాటు పీడిత కులాల్నుంచి వచ్చినవాళ్ళు రచయితలుగా ఎదగడం. తెలంగాణలో దళిత చైతన్యం ఎక్కువే. రాయసీమలాంటి ప్రాంతాల్లో దళితులను, పనివారిని కొడకా లాంటి పదాలతో పిలువడం తెలంగాణలో ఇప్పుడు కనబడదు.

తెలంగాణ సాహిత్యం మొదట్నుంచీ తన ప్రత్యేకతను కాపాడుకుంటూ వస్తున్నది. ఏ సమయంలోనూ ఇక్కడి సాహిత్యం వ్యాపారమయం కాలేదు. నేలవిడిచి సామూ చేయలేదు. ప్రజా స్వభావాన్ని కోల్పోలేదు. గ్రామాల మాండలికం, అనాగరికుల భాష అని పండితులచే నిరసింపబడిన ప్రజల భాషను తెలంగాణ రచయితలు కావ్యభాషగా స్వీకరించడానికి వెనుకాడలేదు. ఎన్ని విమర్శలు వచ్చినా ఇదేం భాషని నిరసింపబడినా తెలంగాణ మాండలికంలో రచనలు చేసి తెలంగాణ భాషకున్న సౌందర్యాన్ని, జవసత్వాలను ప్రపంచానికి చాటి చెప్పారు. సురవరం ప్రతాపరెడ్డి మొదలుకొని నేటి కథా రచయితల వరకూ ప్రజల భాషకే పట్టం కట్టారు. కథలు, నవలల్లో పాత్రోచిత భాషను, కొన్నిట్లో పూర్తి మాండలికాన్ని వాడి గ్రామీణ జనంపై, భాషపై తమకున్న ప్రేమాభిమానాలు చాటుకున్నారు. తెలంగాణ ప్రజల భాషకు సాహితీ గౌరవం తీసుకురావడంలో ఈ ప్రాంత రచయితలందరికీ స్థానం ఉంది. దాశరథి రంగాచార్య, కాలువమల్లయ్య, అల్లంరాజయ్య మరింత విరివిగా ప్రజలభాషను వాడుకొని ఆ భాషా బలాన్ని చాటి చెప్పారు. తెలంగాణ మాండలికం వర్గ మాండలికమన్న విషయం స్పష్టమైందే. గ్రామాల్లోకి వెళితే ఒక్కో ఆర్థికస్థితి, కులం, సాంఘిక స్థితులను బట్టి మాట్లాడేభాషలోని తేడాలు స్పష్టమవుతాయి. ఈ భేదాలనన్నిటినీ శ్రామికకులాల నుంచి రచయితలుగా ఎదిగినవాళ్ళు, తెలంగాణ రచయితలు చాలామంది వాడుకున్నారు. భాషకూ, సాహిత్యానికి శ్రామిక కులాల పరిమళ మద్ది కవులు సాహిత్యం సృష్టించారు. అల్లం రాజయ్య విప్లవకథను ఉన్నత శిఖరాలకు తీసుకెళ్ళాడు. బి.యస్.రాములు దళితకథకు తాత్విక పరిమళ మద్దారు. కాలువమల్లయ్య దళిత, బహుజన కథలు, నవలలు విరివిగా రాసి తెలుగు కథల్లో వాటి లోటును తీర్చాడు. సురవరం ప్రతాపరెడ్డి సాహిత్యాధారాల ద్వారా వెయ్యేళ్ళ ఆంధ్రుల సాంఘిక జీవితాన్ని



ఆంధ్రుల సాంఘిక చరిత్రగా రాసారు. ప్రతాపరెడ్డి, దాశరథి సోదరులు, వట్టికోట, కాళోజీలు తమ రచనల్లో తెలంగాణ ప్రజల జీవితాలను పొందుపరిచారు. దాశరథి జీవనయానం తెలంగాణ ప్రజల జీవనయానమే. సినారె సినిమాపాటల్లో సాహిత్య విలువలు, గ్రామీణ పలుకుబళ్ళు, జీవితం కనబడతాయి. గోపి ఎన్ని ఉన్నత శిఖరాల కెదిగినా 'బొంత' బతుకు నేపథ్యాన్ని మరిచిపోలేదు. వివిధ ఉద్యమాలను, మార్క్స్, అంబేద్కర్ తాత్వికతలను, బహుజన తాత్వికతను స్వంతం చేసుకొని తెలంగాణ రచయితలు తెలంగాణ జనజీవనాన్ని అక్షరీకరిస్తున్నారు. దొరసానులంటే పీడకలుగా చాలా చోట్ల చిత్రించబడుతారు. దొరలకు భార్యలైన దొరసానులు చాలా వరకు పీడితులే. ఈ వైరుధ్యం తెలంగాణ గ్రామాల్లో ఉండేది. దొరలు సామాన్య ప్రజలపై జరిపే దౌర్జన్యాలను దొరసానులూ అనుభవించాల్సి వచ్చేది. ఏ వ్యక్తిత్వమూ లేకుండా దొరలకు సానులుగా ఉండే పరిస్థితులు దొరసానులకుండేవి. మనరాష్ట్రంలోని ఇతర ప్రాంతాల రచయితలే దళితస్త్రీలు, బహుజన మాలస్త్రీలు, పీడితులుగా ఉన్న దొరసానుల గూర్చి కథలు రాసారు. పాల్కురికి సోమన మొదలుకొని నేటి రచయితల వరకు తెలంగాణ రచనలకు ప్రత్యేకతుంది. గొప్ప గొప్ప రాజులు, సంస్థానాలు, ఫ్యూడల్ ప్రభువుల ఏలుబడిలో ఉన్నా తెలంగాణ ప్రజలు అపారమైన తమ జానపద సాహిత్యాన్ని కాపాడుకున్నారు. జానపద పలుకుబళ్ళను, జీవితాలను తీసుకొని ఆశుసాహిత్య సాంప్రదాయాన్ని గ్రహించి అద్భుతమైన సాహిత్యం సృష్టించారిక్కడి రచయితలు, కవులు. ఇక్కడ నుంచి వచ్చిన మంచి రచనకు తెలంగాణ మట్టి వాసనుంటుంది. ఆశు [illegible] నడక ఉంటుంది... ప్రజలభాషా పరిమళం ఉంటుంది. జానపద [illegible] మొట్టమొదటగా పరిశోధన చేసి డాక్టరేట్ డిగ్రీ తీసుకున్న బి. రామరాజుగారిది [illegible] జిల్లా.

తెలంగాణ సాహిత్యం, కళలు, సంస్కృతి, భాష దేన్ని పరిశీలించినా [illegible] వాసనుంటుంది. ప్రత్యేకతుంటుంది. తెలంగాణ తాత్వికత మట్టిమనుషుల తా[illegible] అన్ని రంగాల్లోనూ నిబద్ధతతో తాత్విక పరిమళంతో పరిఢవిల్లుతున్న తెలంగాణ [illegible] వివక్షకు గురికావడం విచారింపదగ్గ విషయం. అద్భుతమైన కళలు, సాహిత్యం, సాంస్కృతిక నేపథ్యం, భాషా పరిమళాలతో రాష్ట్రానికే కాక కొన్ని ఇతర [illegible] నాయకత్వం మార్గదర్శకత్వం వహించాల్సిన మట్టి పరిమళం ఉన్న తెలంగాణ [illegible] అనేక కారణాలవల్ల నిరాదరణకు గురికావడం శోచనీయం. హిందీలో [illegible] తెలంగాణ ప్రజల భాషలో ఎంతో భాషాసంపద, సాహిత్యం ఉన్నా ఇక్కడి [illegible]

సాహితీకారులు తగిన గుర్తింపు పొందక పోవడం వెనుకా వివక్షే ఉంది. ఎన్ని వసతులున్నా వెనుకబడిన ప్రాంతమెందుకైందో అర్థంకాని విషయం. ఆయా రంగాల్లో తెలంగాణ తాత్వికతా పరిమళాన్ని వెలికితీస్తూ జర్మనీలో మాక్స్‌ముల్లర్ రచనల్లాంటి రచనలు రావాల్సిన అవసరం ఉంది. అయితే మాక్స్‌ముల్లర్ రచనలు చదివి జర్మనీ జాత్యహంకారం తలెత్తిందన్న వాదం ఉంది. అలాంటి ప్రమాదం రాకుండా తెలంగాణ తాత్వికతను వెలికితీస్తూ వాస్తవికతా దృక్పథంతో మంచి రచనలు రావాలి. వస్తాయన్న నమ్మకమూ ఉంది.

**తెలంగాణతోవలు**